

ఓమ్

వాసిష్ఠ రామాయణము

అను

# శ్రీయోగవాసిష్ఠము

(తాత్పర్యప్రకాశికయను ఆంధ్రానువాద సహితము)

## మహర్షి వాల్మీకి ప్రణీతము

పూర్వార్థము - తృతీయ సంపుటము


అనువాదకులు :

శ్రీ పూర్ణానంద స్వాములవారు



సంపాదకులు - ప్రకాశకులు :

శ్రీ వ్యాసాశ్రమము

వ్యాసాశ్రమము పోస్టు, (మార్గము) ఏర్పేడు, చిత్తూరు జిల్లా. (ఆ.ప్ర.)

పిన్ : 517 621 ఫోన్ నెం. 08574 - 68528

2009




ప్రథమ ముద్రణ 1948 సం॥ము 1000 ప్రతులు
ద్వితీయ ముద్రణ 1969 సం॥ము 1000 ప్రతులు
తృతీయ ముద్రణ 1997 సం॥ము 2000 ప్రతులు
చతుర్థ ముద్రణ 2009 సం॥ము 1000 ప్రతులు
------
మొత్తము 5000 ప్రతులు
------

వెల : రూ.



ప్రకాశకులు :
శ్రీవ్యాసాశ్రమమువారు

ప్రతులకు :
మేనేజరు, శ్రీ వ్యాసాశ్రమము,
(వయా) ఏర్పేడు - 517 621, చిత్తూరు (జిల్లా)
ఆం.ప్ర. ఫోన్ నెం. 08578 - 287528

ముద్రణ :
శ్రీ పారాశర్య ప్రెస్ - శ్రీవ్యాసాశ్రమము
(వయా) ఏర్పేడు - 517 621, చిత్తూరు (జిల్లా)
ఆం.ప్ర. ఫోన్ నెం. 08578 - 287528

# నివేదన

శ్రీవ్యాసాశ్రమం వారు ప్రకటించిన ఆధ్యాత్మిక గ్రంథాలు ఆంధ్రదేశంలో విస్తృతప్రచారం పొందాయి. వాటిలో తలమానికంగా ఎన్నదగినది యోగవాసిష్ఠం. దీన్ని 'వాసిష్ఠ రామాయణం', 'వసిష్ఠగీత' అని కూడా వ్యవహరిస్తారు.

వాల్మీకి కృతిగా ప్రసిద్ధమైన ఈ గ్రంథంలో ముప్పది రెండువేల శ్లోకా లున్నాయి. వైరాగ్య - ముముక్షు - ఉత్పత్తి - స్థితి - ఉపశమ - నిర్వాణ ప్రకరణా లన్న పేరుతో ఆరు విభాగా లున్నాయి. అద్వైతవేదాంతం ఈ పుస్తకంలో అత్యద్భుతంగా ప్రతిపాదింపబడింది. వసిష్ఠ మహర్షి శ్రీరామ చంద్రుణ్ణి ఉద్దేశించి చేసిన తత్త్వోపదేశమే ఇందలి విషయం.

"మహాగ్రంథాలలో ఒకటైన యోగ వాసిష్ఠం నాదృష్టిలో ప్రపంచంలో వ్రాయబడిన గ్రంథాలన్నింటిలోనూ అత్యాశ్చర్యకరమైనది"(One of the greatest books, the most wonderful according to me ever written under the sun, is Yogavasistha.) అని శ్రీ స్వామి రామతీర్థులవారు ఈ గ్రంథాన్ని ప్రశంసించి వున్నారు.

దీన్ని మహర్షి సద్గురు శ్రీమలయాళస్వాములవారు సమగ్రంగా ఆంధ్రతాత్పర్యంతో సహా నలుబదేండ్ల క్రితం ముద్రింపజేశారు. అంతకు ముందెవరూ దీన్ని తెలుగులో సంపూర్ణంగా ముద్రించలేదు. శ్రీ సద్గురు స్వాములవారి ప్రోత్సాహంతో శ్రీపూర్ణానందేత్యపర నామధేయ శ్రీనిర్వికల్పానంద స్వాములవారు ఈ గ్రంథానికి చెందిన పూర్వార్థాన్ని అనువదించారు. తరువాతి భాగాన్ని శ్రీ సద్గురు దేవుల ముఖ్య శిష్యులు శ్రీ విద్యా ప్రకాశానంద స్వాములవారు తెనిగించారు. 1936 లో ప్రారంభమైన దీని ముద్రణ 1954 లో పూర్తి అయింది. నాల్గువేల పుటలకు పైబడిన ఈ పుస్తకం మొదట నాలుగు సంపుటాలుగా రాయల్ సైజులో ప్రచురింపబడింది.

జిజ్ఞాసువులైన పాఠకుల ప్రీతికి పాత్రమై మూడుసార్లు ముద్రితమయింది.

ఇటీవల చాలాకాలం నుండి దుర్లభంగా వుండిపోయిన ఈ గ్రంథరత్నం కావాలంటూ ఆశ్రమానికి పలువురు లేఖలు వ్రాసేవారు. భగవదనుగ్రహం వల్ల, గురుకరుణవల్ల ఈ మహాగ్రంథాన్ని ఇప్పుడు మళ్ళీ ప్రచురించే సదవకాశం లభించింది. పాఠకుల సౌకర్యాన్ని దృష్టిలో ఉంచుకొని దీని నిప్పుడు డెమ్మీ 1/8 సైజులో ఎనిమిది సంపుటాలుగా ప్రచురిస్తున్నాము.

ఈ గ్రంథగౌరవాన్ని గుర్తించి తిరుమల తిరుపతి దేవస్థానం వారు దీని పునర్ముద్రణకు ఉదారంగా ఆర్థిక సహాయం అందించారు. ఇందుకు దేవస్థానం పాలకమండలికి ఎంతో కృతజ్ఞులము. ఈ విషయంలో సహకరించిన ఆశ్రమపూర్వ విద్యార్థి, తిరుమల తిరుపతి దేవస్థానం ధర్మప్రచార పరిషత్ కార్యదర్శి శ్రీ సముద్రాల లక్ష్మణయ్యగారిని అభినందిస్తున్నాము.

ఈ ఉద్గ్రంథం ఇంకా విస్తృత వ్యాప్తి చెంది పాఠకులకు ఆత్మానందాన్ని ప్రసాదించుగాక!

శ్రీ వ్యాసాశ్రమం ప్రకాశకులు
22-8-1997.



ఓమ్.

# శ్రీ యోగవాసిష్ఠము.

## పూర్వార్ధము — ద్వితీయసంపుటము.

## విషయానుక్రమణిక.

## 5. ఉపశమప్రకరణము.



ఓమ్.

# వాసిష్ఠ మహారామాయణమ్.

## స్థితి ప్రకరణము.

### ప్రథమః సర్గః.

శ్రీ వసిష్ఠ ఉవాచః—

అథోత్పత్తిప్రకరణా దనంతరమిదం శృణు
స్థితిప్రకరణం రామ జ్ఞాతం నిర్వాణకారి యత్. 1

శ్రీ వసిష్ఠుడు:— ఓ రామా! ఉత్పత్తిప్రకరణమైన వెనుక యిక నీవు స్థితిప్రకరణమును గూర్చి వినుము. ఇద్దాని నెఱింగిన తప్పక మోక్షము చేకూరును.

ఏవం తావదిదం విద్ధి దృశ్యం జగదితి స్థితమ్
అహం చేత్యాద్యనాకారం భ్రాంతి మాత్రమసన్మయమ్. 2

ఇంతదనుక యుత్పత్తిప్రకరణమున చెప్పబడిన యుక్తిన్యాయములచే, 'అహం' ప్రత్యయ విషయాదులతోఁగూడిన యీ దృశ్య జగత్తంతయును, ఆకారరహితమును, శూన్యమును, భ్రాంతి మాత్రమును, అసన్మయమును నై యున్నదని నీ వెఱుంగుము.

అకర్తృకమరంగం చ గగనే చిత్రముత్థితమ్
అద్రష్టృకం చానుభవ మనిద్రం స్వప్నదర్శనమ్. 3

ఓ రామా! విలక్షణమగు యీ జగచ్చిత్రము కర్తృరహితమై, అనగా హేతు, కరణ యుపకరణ సంపన్నుడగు చిత్రకారుడుగాని, రంగుగాని లేకయే, ద్రష్టృరహితమును, నిద్రావర్జితమును అనుభవరూపమును నగు స్వప్నమువలె యాకసమున నుదయించుచున్నది.

భవిష్యత్పురనిర్మాణం చిత్తసంస్థమివోదితమ్
మర్కటానలతాపాంతమసదేవార్థసాధకమ్. 4

ఇయ్యది భవిష్యన్నగరనిర్మాణరూపమున చిత్తమందావిర్భావము పొందినట్లున్నదై, వానరములచే కల్పితమగు గురిగింజలయొక్కయు గైరికధాతువులయొక్కయు సంచయమను అగ్ని † వలె నసత్తైనను, అర్థసాధక మగుచున్నది.

† గురిగింజలు, గైరికధాతువులు మున్నగు యెఱ్ఱని పదార్థములను అగ్నియని దలంచి వానరములు వానిచే శీతనివారణ మొనర్పఁ గనఁజూచుట ఐతిహ్యప్రమాణముచే ప్రసిద్ధమై యున్నది.

బ్రహ్మణ్యనన్యదన్యాభమంబ్వావర్తవదాస్థితమ్
సద్రూపమపి నిఃశూన్యం తేజఃసారమివాంబరే. 5

బ్రహ్మముకంటె యభిన్నమైనను భిన్నముగ గన్పించుచున్నదియు, కనుకనే జలమందావర్తమువలె నున్నదియునగు యీ జగచ్చిత్రము సద్రూపమగు పరమాత్మయే యగుచు, ఆకాశమందు సూర్యప్రకాశమువలె సర్వథా శూన్యరూపమై యున్నది.

రత్నాభాపుంజమివ ఖే దృశ్యమానమభిత్తిమత్
గంధర్వాణాం పురమివ దృశ్యం నిత్యమభిత్తిమత్. 6

మఱియు రత్నముల కిరణసమూహమువలెను, నిరాధారమగు గంధర్వ నగరమువలెను యీ దృశ్యమాకాశమున యెల్లప్పుడును దృశ్యమాన మగుచున్నది.

మృగతృష్ణాంబ్వివాసత్యం సత్యవత్ప్రత్యయప్రదమ్
సంకల్పపురవత్స్ఫార మనుభూతమసన్మయమ్. 7

ఇయ్యది మృగతృష్ణాజలమువలె అసత్యమైనను సత్యముగ దోచుచు విశ్వసనీయమైయున్నది. సంకల్పనగరమువలె నతివిశాలమైనను అసద్రూపమే యగుచున్నది.

కథార్థప్రతిభానాత్మ న క్వచిత్స్థితమస్థితమ్
నిఃసారమప్యతీవాంతఃసారం స్వప్నాచలోపమమ్. 8

మఱియు నీ జగత్తు కవులయొక్క కల్పిత కథయందలి నగర పర్వతాదుల రచనవలెనుండి, కల్పనామాత్ర స్వరూపముగలదై ఏ కాలమందును లేనిదగుటచే నసద్రూపమగుచు, సారరహితమైనను, స్వప్నస్థ పర్వతమువలె నతి దృఢముగనున్నది.

భూతాకాశమివాకార భాసురం శూన్యమాత్రకమ్
శరదభ్రమివాగ్రస్థమలమత్యయమత్యతమ్. 9

శూన్యమాత్రమైనను, క్రిందిముఖముగల యింద్రనీలమణివంటి యాకృతిగల భూతాకాశరూపమున వెలుగునదియు, శరత్కాల మేఘమువలె పైనున్న సూర్యరశ్మిని నివారించుటయందు నసమర్థమును, జ్ఞానాభావముచే నిరంతర మత్యయముగ నుండునదియు నగుచున్నది.

వర్ణో వ్యోమమలస్యేవ దృశ్యమానమవస్తుకమ్.
స్వప్నాంగనారతాకార మర్థనిష్ఠమనర్థకమ్. 10

మఱియు నీ జగత్తు ఆకాశమందలి నీలత్వమువలె లేనిదైనను పరిదృశ్యమగునదియు, స్వప్నమువలె నిరర్థకమైనను రతిరూపక్రియాకారకమును నై యున్నది.

చిత్రోద్యానమివోత్ఫుల్లమరసం సరసాకృతి
ప్రకాశమపి నిస్తేజశ్చిత్రార్కానలవత్స్థితమ్. 11

చిత్రమందలి వనవాటికవలె రసహీనమైనను, రసవంతముగను, వికసితముగను నున్నదై, ప్రకాశరూపమైనను చిత్రమందలి [illegible] మైయున్నది.



అనుభూతం మనోరాజ్యమివాసత్యమవాస్తవమ్
చిత్రపద్మాకర ఇవ సారసౌగంధ్యవర్జితమ్. 12

అనుభూతమగు మనోరాజ్యమువలె అసత్యమును, అవస్తువునునై, చిత్రమందలి కమలమువలె పరాగసౌగంధ్యవర్జితమై యున్నది.

శూన్యే ప్రకచితం నానావర్ణమాకారితాత్మకమ్
అపిండగ్రహమాశూన్య మింద్రచాపమివోత్థితమ్. 13

కల్పనామయమైయుండి శూన్యమందు వికసితమై పలువిధవర్ణములతో నొప్పుచు, మూర్తిమంతమగు యాకృతిలేనిదై, ఇంద్రధనుస్సువలె మిథ్యారూపమున యీ జగచ్చిత్రము వ్యక్తమగుచున్నది.

పరామర్శేన శుష్యద్భిర్వ్యాతపేలవపల్లవైః
కృతం జడమసారాత్మ కదలీస్తంభభాసురమ్. 14

పరమాత్మ విచారముచే నీ జగచ్చిత్రము కంపితమును, శుష్కించుచున్న భూతములను కోమల పల్లవములచే జడీభూతమునునగు కదళీతరువువోలె భాసించును.

స్ఫురితేక్షణదృష్టాంధకారచక్రకవర్తనమ్
అత్యంతమభవద్రూపమపి ప్రత్యక్షవత్స్థితమ్. 15

ఈ జగత్తు 'స్ఫురితేక్షణ' (నేత్రజ్యోతి నవరోధించునది) యను నేత్రరోగము గలవానివలె అంధకారమున పరిభ్రమించునదియు, అత్యంతాసంభవమైనను ప్రత్యక్షముగ తోచుచున్నదియునై యున్నది.

వార్బుద్బుదమివాభోగి శూన్యమంతఃస్ఫురద్వపుః
రసాత్మకం చాప్యరస మవిచ్ఛిన్నక్షయోదయమ్. 16

ఈ జగచ్చిత్రము జలమందలి బుద్బుదమువలె కల్పితాకారము గలదియు, అంతఃశూన్యము [illegible]నను ప్రకాశవంతమగు శరీరముగల్గి యున్నదియు, తత్త్వవిచారములేమి మనోహరముగ గన్పట్టుచు పరిణామమున కటుప్రదమైనదియు, నిరంతరము జననమరణ సంయుక్తమును నై యున్నది.

నీహార ఇవ విస్తారి గృహీతం సన్నకించన
జడశూన్యాస్పదం శూన్యం కేషాంచిత్పరమాణువత్. 17

నీహారమువలె విస్తరించునదైనను యీ జగచ్చిత్రము గ్రహించిన నేమియు లేకయేయున్నది. సాంఖ్యులమతమున నిది కేవలము జడాత్మకమును, వేదాంతులమతమున అవిద్యారూపమును, మాధ్యమికుల మతమున శూన్యమాత్రమును క్షణికమును నగుటచే కాలకృత పరమాణువులచే రచితమును, యోగాచార్యుల మతమున దేశకాలిక పరమాణువులచే నిర్మితమును, కణాదగౌతముల మతమున [illegible] (అనేకాంతము) గల్గి యున్నదియు పరమాణువులచే రచితమునునై యున్నది.

కించిద్వ్యాతమయోఽస్మీతి స్థితం శూన్యమభూతకమ్
గృహ్యమాణోఽప్యసద్రూపో నిశాచర ఇవాస్థితమ్. 18

ఇట్లు బాహ్యజగత్తునుగూర్చి వచించిన న్యాయము ఆధ్యాత్మిక ప్రపంచమునగూడ వర్తించును. ఎట్లన, 'నేను పంచభూతమయుఁడ'నను అనుభవము జీవునకు ప్రత్యక్షముగ నున్నను, యథార్థముగ జీవుడు భౌతికధర్మరహితుడును, నిరాకారుఁడు మాత్రమేయగును. కాని రూపము నిశాచరునివలె యావిర్భవించుచు, గ్రహించిన అసత్తేయగుచున్నది.

శ్రీ రామ ఉవాచ :—

మహాకల్పక్షయే దృశ్య మాస్తే బీజ ఇవాంకురః
పరే భూయ ఉదేత్యేత త్తత్త ఏవేతి కిం వద. 19

శ్రీ రాముడు:— ఓ మునీంద్రా! బీజమందంకురమువలె మహాప్రలయమున నీ దృశ్య జగత్తంతయు పరమాత్మయందున్నదై మరల సృష్టికాలమున యద్దానినుండి యుత్పన్నమగుచుండునను విషయమును 'సదేవసోమ్యేదమగ్ర ఆసీత్' — అనగా నీ జగత్తు ప్రథమమున సత్స్వరూపమగు పరమాత్మయందే యుండెను — ఇత్యాది శ్రుతివాక్యములును, వాని వ్యాఖ్యలనొనర్చిన వ్యాస కపిలాదులును తెలిపియున్నారు. ఇయ్యదెట్లు సంగతమగునో దయచేసి తెలియజేయుఁడు.

ఏవం బోధాః కిమజ్ఞాః స్యురుత జ్ఞా ఇతి చ స్ఫుటమ్
యథావద్భగవన్బ్రూహి సర్వసంశయశాంతయే. 20

మఱియు మహాప్రలయమున యీ జగత్తు స్వసత్తతో గూడినదై తన కారణమున లయించి యుండునను జ్ఞానముగలవారు జ్ఞానులా? అజ్ఞానులా? దయచేసి యివ్విషయమును సర్వసంశయ నివారణార్థము యథారీతి విస్పష్టముగ దెలియజేయుఁడు.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

ఇదం బీజేఽంకుర ఇవ దృశ్యమాస్తే మహాక్షయే
బ్రూతే య ఏవమజ్ఞత్వ మేతత్తస్యాస్తి శైశవమ్. 21

శ్రీ వసిష్ఠుడు:— ఓ రామా! మహాప్రళయమందీ జగత్తు, స్వసత్తతోగూడి పరమాత్మ యందు బీజమందంకురము వందమున నుండునని వచించుట అజ్ఞత్వమే యగును.

శృణ్వేతత్క్రమసంబంధం కథమేతదవాస్తవమ్
విపరీతో బోధ ఏష వక్తుః శ్రోతుశ్చ మోహకృత్. 22

ఓ రామా! ఈ చెప్పబోవు యుక్తిని వినుము — ఉత్పత్తికి పూర్వము కారణమున కార్య ముండునని వచించువారిని, అట్టి కార్యము కారణమందు సత్తా సామాన్యరూపముననుండునా, బీజాది సత్తారూపమున నుండునా, లేక అంకురాది సత్తారూపమున నుండునా యని ప్రశ్నింపవలెను. ప్రథమ పక్షమున, సామాన్యసత్త సర్వవస్తువులందును గలదుగాన, ఉత్పన్నమగు అంకురాదులతో సంబంధ మున్నివస్తువులకును గలుగవలసి యుండును. కాన క్షేత్రమున నాటబడిన బీజమందు గానబడు యంకురత్వము, నాటబడని బీజమునందును లేక శిలాఖండమునసుగూడ గాన్పింపవలసి యున్నదిగదా? ఇక రెండవ పక్షమున, బీజమునకు అంకురముతోగల సంబంధమునందును ఘటపటాది వస్తువులతోగల సంబంధమునందును విలక్షణత్వమేమియును లేదు. అట్లైన బీజమందంకురమెట్లు గలదో, అట్లే జగత్తం



దయుఁగూడ నుండవలసివచ్చును. కాన అంకురితమగు బీజమందలి యంకురత్వము సత్యమును, ఘటపటాదు లసత్యములును యెట్లగును? ఇక తృతీయపక్షమునను, అంకుర మందలి సత్తకు అంకురముతోమాత్రము యే సంబంధముగలదో, అట్టి సంబంధమే ఘటపటాదులతోటియు గలదు. ఈ రెంటికిని విలక్షణత్వ మేమియును లేదు. కాన సర్వత్ర యంకురప్రసక్తిగలుగును. ఇష్టాపత్తియనిన బీజాదులందు అంకురాదులు వాస్తవములును, అన్యత్ర వాస్తవముగాకయు యెట్లుండును? అందుచే, సామాన్యసత్తచే అసామాన్యమగు అంకురాదులు కలుగుట, అంకురాదులు బీజ సత్తారూపమున నుండుట, లేక అంకురాది సత్తారూపమున నుండుట — యను నీ మూడు పక్షములును అసంగతములే యగును. కాన, కార్యము స్వసత్తారూపమున కారణమందుండునను యీ బోధ సత్యమైనది గాదు, విపరీతమైనదే యగును. ఇయ్యది వక్తకును, శ్రోతకునుగూడ మోహము గల్గించునదై యున్నది.

బీజే కిలాంకుర ఇవ జగదాస్త ఇతీహయా
బుద్ధిః సా సత్ప్రిలాపార్థం మూఢా శృణు కథం కిల. 23

బీజమందంకురమువలె ఈ జగత్తు ప్రలయమున సత్స్వరూపమగు పరమాత్మయందుండు ననుట దార్ష్టాంతిక వైషమ్యకారణమున సరికానేరదు. ఇట్టి దృష్టాంతము నాశ్రయించిన బుద్ధి యెట్లు నిశ్చయముగ భ్రాంతిరూపమైనదో వినుము.

బీజం భవేత్స్వయం దృశ్యం చిత్తాదీంద్రియగోచరమ్
యవధానాదిధాన్యాని యుక్తః పత్రాంకురోద్భవః. 24

పొట్టుతోగూడిన యవాదిధాన్యములయొక్క బీజములు యింద్రియగోచరములయియున్నవి గాన వానియందంకురపత్రాదుల యుత్పత్తి సంభవము గావచ్చును.

మనః షష్ఠేంద్రియాతీతం యత్స్యాదతితరామణు
బీజం తద్భవితుం శక్తం స్వయంభూర్జగతాం కథమ్. 25

కాని మనస్సునకును, ఇంద్రియములకునుగూడ నతీతమును, అతిసూక్ష్మమును, స్వయంభువును నగు పరమాత్మ బ్రహ్మాండములన్నింటియొక్క బీజమెట్లగును?

ఆకాశాదపి సూక్ష్మస్య పరస్య పరమాత్మనః
సర్వాఖ్యానుపలంభస్య కీదృశీ బీజతా కథమ్. 26

ఆకాశముకంటె సూక్ష్మమును, వాక్కులన్నింటికతీతమును, నామరహితమును నగు పరమాత్మకు బీజత్వమెట్లు సంభవించును?

తత్సూక్ష్మమసదాభాస మసదేవ హ్యతాదృశమ్
కీదృశీ బీజతా తత్ర బీజాభావే కుతోఽంకురః. 27

సదా యేకరసమై, సత్స్వరూపమై యుండువాడును, అతి సూక్ష్మమగుటచే అజ్ఞానుల దృష్టియందసత్తుల్యుడునునగు పరమాత్మకు బీజత్వమెట్లుండగలదు? బీజత్వమే లేనిచో నిక అంకుర మెచట?

గగనాంగాదపి స్వచ్ఛే శూన్యే తత్ర పరేపదే
కథం సంతి జగన్మేరు సముద్రగగనాదయః. 28

ఆకాశమువలె నిర్మలమును, అజ్ఞానులదృష్టియందు శూన్యమువంటిదియు నగు ఆ పరమపదమున జగత్తుగాని, తదంతర్గతమగు సుమేరు, సముద్ర, ఆకాశాదులుగాని యెట్లుండగలవు ?

న కించిద్యత్కథం కించిత్తత్రాస్తే వస్తువస్తుని
అస్తి చేత్తత్కథం తత్ర విద్యమానం న దృశ్యతే. 29

దృశ్యమానమగు అవయవమేదియు లేని యీ పరమవస్తువునందు బ్రహ్మాండమను వస్తువెట్లుండగలదు ? ఉండుచో, అట్లున్నవిధమున యేల గన్పించుటలేదు ?

న కించిదాత్మనా కించి త్కథమేతి కుతోఽథవా
శూన్యరూపాద్ఘటాకాశా జ్జాతోఽద్రిః క్వ కుతః కదా. 30

రూపమేలేని వస్తువునం దేపదార్థమైనను యెట్లెటనుండి వచ్చును ? శూన్యమగు ఘటాకాశమునుండి పర్వతమెచట యెట్లు యెపుడుత్పన్నమైనది ?

ప్రతిపక్షే కథం కించి దాస్తే ఛాయాతపే యథా
కథమాస్తే తమో భానౌ కథమాస్తే హిమోఽనలే. 31

జడసత్త చిత్సత్తకంటె విరుద్ధగుణము గలదగుటచే, అయ్యది లేశమైనను ఆత్మచైతన్యమున నుండజాలదు. ఆతపమున ఛాయ యెట్లుండును ? సూర్యునియం దంధకారము..., అగ్నియందు మంచుగాని యెట్లుండగలదు ?

మేరురాస్తే కథమణౌ కుతః కించిదనాకృతౌ
తదత్రద్రూపయోరైక్యం క్వ ఛాయాతపయోరివ. 32

ఆకారరహితమగు పరమాత్మయందు మేరుపర్వత మెట్లుండగలదు ? బ్రహ్మమున జగత్తు భేదరూపమునగాక యేకత్వరూపమున నున్నదని వచించిన, నదియును గాదు. ఛాయాతపములవలె, చిత్స్వరూపమగు ఆత్మయొక్కయు జడరూపమగు జగత్తుయొక్కయు ఏకత్వమెట్లు ఘటిల్లు ?

సాకారవటధానాదావంకురాః సంతి యుక్తిమత్
నాకారే తన్మహాకారం జగదస్తీత్యయుక్తికమ్. 33

ఆకారముగల వటబీజాదులందంకురములు గలవనుట యుక్తియుక్తమేగాని, నిరాకారమగు పరమాత్మయందు, ...శాలాకారముగల యీ జగత్తు గలదనుట యసంగతమగును.

దేశాంతరే యచ్చ నరాంతరే చ బుద్ధ్యాదిసర్వేంద్రియశక్తిదృశ్యమ్
నాస్త్యేవ తత్తద్ద్వివిధబుద్ధిబోధే న కించిదిత్యేవ తదుచ్యతే చ. 34

ప్రళయమున స్వసత్తారూపమున జగత్తుండునను సాంఖ్యులచే కల్పితమగు సిద్ధాంతము లౌకిక ప్రమాణమునుబట్టి నిశ్చితమైనదా లేక 'సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్' ఇత్యాది శ్రుతివాక్యములంబట్టి నిశ్చితమైనదా యనిన, రెండు విధములనుగాదు. ఏలయనిన బుద్ధ్యాది సమస్తేంద్రియముల శక్తిచే దృశ్యమగు, అనగా అనుభవయోగ్యమగు ఘటపటాది పదార్థములు అన్యదేశకాలములందుండునవి యగుచో, నయ్యవి ప్రత్యక్ష, అనుమానాది బుద్ధివృత్తులచే బోధితములు కానేరవు. అనగా దృశ్యాదర్శనముచే నా పదార్థములసత్తుల్యములే యగును. ఇట్లని లౌకిక ప్రమాణకుశలురగు జనులు వచించుచుందురు.



కార్యస్య తత్కారణతాం ప్రయాతం వక్తీతి యస్తస్య విమూఢబోధః
కైర్నామ తత్కార్యముదేతి తస్మాత్తైస్త్వైః కారణాద్యైః సహకారిరూపైః. 35

ఇక, రెండవపక్షమున, 'సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్' ఇత్యాది శ్రుతులచే కార్యకారణములను రెండు సత్తలెన్నటికిని సిద్ధింపజాలవు. 'ఏకమేవాద్వితీయం బ్రహ్మ' (కేవలమద్వితీయమగు బ్రహ్మమొక్కటి మాత్రముగలదు) ఇత్యాది శ్రుతులును, పైనదెల్పిన 'సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్' మున్నగు శ్రుతులును యొకే అర్థమును బోధించుచున్నవి. కార్యము సత్యమనియు అట్టి కార్యసత్యమే కారణత్వము పొందెనని పై శ్రుతి వచించుచున్నదా, కారణమే సత్యమనియు, ఆ కారణసత్యమే కార్యమున యారోపింపబడినదని గాని లేక సత్స్వరూపమగు పరమాత్మయే సత్యమనియు, అద్దాని సత్తయే కార్యకారణములం దారోపింపబడినదని గాని వచించుచున్నదా యనువిషయము ప్రస్తుతము విచారణీయమై యున్నది. ఈ మూంటిలో సాంఖ్యులబోధము మొదటిదాని ననుసరించియే యున్నది. వారి యీ బోధ భ్రాంతియుక్తమే అయియున్నది. ఏలయన, 'వాచారంభణం వికారో నామధేయమ్' మృత్తికాదులచే గల్గిన కార్యరూపములగు ఘటపటాదులు కేవలము వాక్కునకు విషయములు మాత్రమే యగును ఇత్యాది శ్రుతులచే కార్యముయొక్క మిథ్యాత్వము సూచింపబడినది. దీనిచే కారణమున్ను మిథ్యయగును. కారణముయొక్క మిథ్యాత్వముచే వారి సిద్ధాంతమునకే ముప్పు గల్గుచున్నది. కారణము మిథ్యయనిన నిక యే సహకారి కారణములచే కార్యముత్పన్నమగును ? కాన కారణమే యసత్యమైనచో నిక కార్యమెన్నటికి నుత్పన్నము కాజాలదు. కాన, రెండవపక్షము (సత్యమగు కారణము కార్యరూపత్వమును పొందుటయు)న్ను సత్యము కాదు. ఏలయన కార్యమున నిరూపించునది కారణముగాన, కార్యమసత్యమైనచో కారణమున్ను ... బడకుండును. కాన తృతీయపక్షము (సద్వస్తువునందు కార్యకారణత్వము లారోపింపబడుట) శ్రుతి సమ్మతమగును.

దుర్బుద్ధిభిః కారణకార్యభావం సంకల్పితం దూరతరే వ్యుదస్య
తదేవ తత్సత్యమనాదిమధ్యం జగత్తదేతత్స్థితమిత్యవేహి. 36

ఇత్యార్షే వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
జన్యజనినిరాకరణం నామ ప్రథమః
సర్గః ॥ 1 ॥

కాన ఓ రామా! దుర్బుద్ధులచే కల్పింపబడిన కార్యకారణ, ఉపాదాన ఉపాదేయ భావముల మిథ్యాత్వమెఱింగి వానిని దూరముగ తొలగించివైచి, శేషించునట్టి ఆదిమధ్యాంత రహితమును సత్స్వరూపమునునగు పరబ్రహ్మమే జగద్రూపమున నున్నదని తెలిసికొనుము.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు స్థితిప్రకరణమున
జన్యజనినిరాకరణమను ప్రథమ
సర్గము ॥ 1 ॥

---

## ద్వితీయః సర్గః.

శ్రీవసిష్ఠ ఉవాచ :—

అథైతదభ్యుపగమే వచ్మి వేద్యవిదాంవర
సమస్తకలనాతీతో మహాచిద్వ్యోమ్ని నిర్మలే. 1

జగదాద్యంకురస్తత్ర యద్యస్తి తదసౌ తదా
కైరివోదేతికథయ కారణైస్సహకారిభిః. 2

శ్రీవసిష్ఠుడు :—వేద్యవస్తువు నెఱుంగువారిలో శ్రేష్ఠుడగు నో రామా! ఇక ప్రలయమున ఈశ్వరునికంటె నన్యముగ జగత్సత్తగలదనుట దోషయుక్తమని నిరూపించుచున్నాను వినుము. జగత్తులేనిచో సృష్టియు నుండనేరదు. ఏలన ఉత్పత్తిక్రియ కర్తచేతనే సాధ్యమైనదగును. సద్రూపమగు బ్రహ్మమే కర్తయైనచో, అతడే ఉత్పన్నమగువాడును నగును. అట్టి యుత్పద్యమానమగు బ్రహ్మమున కన్యముగ మఱియొక కర్తలేదు. కాని కూటస్థ బ్రహ్మమునకుత్పత్తి యనునది సంభవింప నేరదు గాన, ఉత్పత్త్యాదులు సిద్ధించునిమిత్తము మహాప్రళయమున జగత్తునకు సత్త యంగీకరింపవలసి యున్నది. అట్లైన, కల్పనారహితమగు నిర్మల చిదాకాశమున కర్తనుగూర్చిన కల్పనయొనర్చుచో, ఏ సహకారికారణముల (కరణ, ఉపకరణ, అధికరణాదుల) చే నీ కర్తృత్వము సిద్ధించును? సహకారికారణములులేకయే కేవలము కర్తామాత్రమున యుత్పత్తి క్రియ సంభవింపనేరదు.

సహకారికారణానామ భావేత్వంకురోద్గతిః
వన్ధ్యాకన్యేవదృష్టేహ నకదాచన కేనచిత్. 3

సహకారికారణములు లేకయే గల్గు అంకురోత్పత్తి, వంధ్యకు జనించిన కన్యవంటిదే యగును. అట్టిదాని నెన్నడును యెవడును గాంచియుండలేదు.

సహకారికారణానామ భావేయద్యవోదితమ్
మూలకారణమేవాంగ తత్స్వభావస్థితింగతమ్. 4

కాన సహకారికారణములు లేకయే యుత్పన్నమగునది రజ్జువునందలి సర్పమువలె నుండును. అనగా మూలకారణమే జగద్రూపమున నున్నదగును.

సర్గాదౌసర్గరూపేణ బ్రహ్మైవాత్మనితిష్ఠతి
యథాస్థితమనాకారం క్వజన్యజనకక్రమః. 5

సృష్ట్యాదియందు (జగత్తుల) సృష్టిరూపమున బ్రహ్మమే తనయందు తాను స్థితిఁబొంది యున్నది. ఆ పరబ్రహ్మము ఆకారరహితమై తన స్వరూపమున యెప్పటి యట్లే నెలకొనియున్నది, అట్టిచోనందు జన్యజనక భావమెచట?

అథపృథ్వ్యాదయోన్యేవా కేచిదత్రోపకుర్వతే
సహకారికారణత్వం తత్పూర్వంచాత్రదూషణమ్. 6

ప్రలయమందు జగత్సత్త నంగీకరించుటచే, జగదంతర్గతమగు పృథ్వ్యాదుల యుత్పత్తిచే



సహకారికారణములు సిద్ధించుననిన, సహకారికారణములులేక యుత్పత్తియే సిద్ధింపనేరదు గాన యిందన్యోన్యాశ్రయదోషము గలదు.

తస్మాత్ప్రదేజగచ్ఛాంత మాస్తేతత్సహకారిభిః
చిత్తాత్ప్రసరతీత్యుక్తిర్బాలస్యనవిపశ్చితః. 7

ప్రళయమందు ప్రకృతిసహితమగు పరమాత్మయందు సహకారికారణసహితమగు జగత్తు తిరోహితమై (దాగుకొని) యుండునని వచించుట బాలునియొక్క వచనమేయగును గాని బుద్ధిమంతు లట్లెన్నటికిని వచింపరు.

తస్మాద్రామజగన్నాసీన్నచాస్తినభవిష్యతి
చేతనాకాశమేవాశు కచతీత్థమివాత్మని. 8

కాన నీజగత్తు సత్యరూపముగల్గి యుండియుండలేదు, యుండుటలేదు, యుండబోదు. శుద్ధమగు చిదాకాశమే శీఘ్రముగ తనయందీ జగద్రూపమున వికసించుచున్నది.

అత్యంతాభావపవాస్య జగతోవిద్యతేయదా
తదాబ్రహ్మేదమఖిల మితితద్రామనాన్యథా. 9

ఓ రామా! ఎపుడీ జగత్తుయొక్క అత్యంతాభావము సిద్ధించుచున్నదో, అపుడిదంతయును బ్రహ్మమే యగునుగాని అన్యముగాదు.

పూర్వంప్రధ్వంసనాన్యోన్యా భావైర్యదుపశామ్యతి
నశామ్యత్యేవతచ్చిత్తే శామ్యత్యేవతుదృశ్యతే. 10

పూర్వజగత్సంబంధములగు ఘటపటాదులు ముద్గరాదుల ప్రహారాదులచే అన్యోన్యాభావమునుపొంది శాంతించుచున్నవి. అనగా, ఆపదార్థములు యిపుడు పూర్వరూపమున లేకయు నేత్రాదులకు గోచరింపకయు నుండునేగాని, చిత్తమునుండి నివృత్తిని బొందకయున్నవి.

అత్యంతాభావపవాస్య భావైర్యదుపశామ్యతి
నశామ్యత్యేవతచ్చిత్తే క్వశామ్యత్యేవదృశ్యతా. 11

కాన, కామకర్మ వాసనాది బీజములతోసహా దృశ్యము శమించుటయే, యథార్థ దృశ్యశమనమగును. చిత్తశమనముగాక యుండి, పదార్థములు శమించుట శమించుటకానేరదు. ఏలయనిన, జ్ఞానములేనిచో చిత్తము శమింపదు. చిత్తము శమింపకున్న దృశ్యత్వమెట్లు శమించును?

అత్యంతాభావపవాత్తో జగద్దృశ్యస్యసర్వథా
వర్జయిత్వేతరాయుక్తిర్నాస్త్యేవానర్థసంక్షయే. 12

అందుచే, మూలాజ్ఞాన సహితముగ మనస్సును సంపూర్ణముగ నశింపజేయుట తప్ప, దృశ్యానర్థసంక్షయరూపమగు మోక్షమునకు వేఱొక యుపాయములేదు.

చిదాకాశస్యబోధోయం జగద్భాతీతియత్స్థితమ్
అయంసోహమిదంనాహం లోకేచిత్రకథాయథా. 13

ఆత్మసాక్షాత్కారముచే చిదాకాశమాత్రప్రబోధము అనగా నీ జగత్తంతయు చిన్మాత్రమగు బ్రహ్మమేయనియు, లేశమైనను యిందు చిన్మయరూపముగానిది లేదనునట్టి జ్ఞానమెప్పుడు పరిపక్వమగునో అపుడు, వీడు దేవత్తుడను పేరుగలవాడు, ఈ మాతాపితరులకు నేను జన్మించితిని, ఇది మఱియొకని దేహము ఇవి వానిగృహాదులను నిట్టి యజ్ఞుల వ్యవహారరూపమగు జగత్స్థితి యంతయు చిత్రకథా † రూపమును బొందును.

ఇదమద్ర్యాదిపృథ్వ్యాది తత్తేదంవత్సరాదిచ
అయంకల్పఃక్షణశ్చాయ మిదమేమరణజన్మనీ. 14

అయంకల్పాంతసంరంభో మహాకల్పాంతఏషసః
అయంససర్గప్రారంభో భావ్యభావక్రమస్త్వసౌ. 15

లక్షాణ్యేమానికల్పానా మిమాబ్రహ్మాండకోటయః
ఏతేచేమేపరిగతా ఇమేభూయఉపాగతాః. 16

ఇమానిధిష్ణ్యజాలాని దేశకాలకలాఇమాః
మహాచిత్పరమాకాశ మనావృతమనంతకమ్. 17

యథాపూర్వంస్థితంశాంత మిత్యేవంకచతిస్వయమ్
పరమాణుసహస్రాంశు భాసపతామహాచితేః. 18

ఈ పర్వతములు, పృథ్వ్యాదులు, వర్షాదులు, కల్పక్షణములు, జన్మమరణములు, కల్పమహాకల్పాంతములు, దృశ్యమానమగు ఈ సృష్టి, శ్రుతిప్రసిద్ధమగు సృష్ట్యారంభము, ఆకాశాదుల సృష్టిక్రమము, కల్పలక్షణములు, కోట్లకొలది బ్రహ్మాండములు, భూతభవిష్యద్వర్తమాన కాలములందలి స్థాపియంతయు, దేవమనుష్యాదులు వసించు నీ చతుర్దశ భువనములు, సప్తద్వీపప్రదేశము, కృతయుగాది కాలకల్పన — ఇవన్నియు చిత్రకథా న్యాయమున వర్ణింపబడినవి. యథార్థముగ నియ్యవి ఆవరణరహితములే యగును. అనంతమగు చిదాకాశమున యే చిత్స్వరూపముగలదో, అయ్యది పూర్వమెటుల యుండెనో, అటులనే యిపుడును స్ఫురించుచునున్నది. మఱియు గవాక్షాంతర్గత ఛిద్రమందలి పరమాణువులందుగల పరిచ్ఛిన్నమగు సూర్యకాంతివలె నీ పదార్థములన్నియును మహా చైతన్యముయొక్క ఆభాసములే (చిదాభాసములే) యగును.

స్వయమంతశ్చమత్కారో యఃసముద్గీర్యతేచితా
తత్సర్గభానంభాతీద మరూపంనతుభిత్తిమత్. 19

మనస్సుచే క్షుభితమగు చైతన్యము తనయందలి జగద్రూపమగు చిత్-చమత్కారమంతయును వమన మొనర్చుచున్నది. అదియే యీసృష్టి. కాన యథార్థముగ నీసృష్టి రూపరహితమే యగును గాని భిత్తియందలి చిత్రమువలె సాకారము కాదు.

---

† భిత్తియందు చిత్రింపబడిన చిత్రముయొక్క రూపము నశించిన, అయ్యది భిత్తి... భిత్తిరూపముననే శేషించునట్లు, యీ జగత్తున్ను అధిష్ఠానమగు పరబ్రహ్మమునకు వేఱుగాక యున్నదని భావము.



నోద్యంతినచనశ్యంతి నాయాంతినచయాంతిచ
మహాశిలాసులేఖానాం సన్నివేశాఇవాచలాః. 20

నేత్రదోషముచే పెద్దస్ఫటికశిలయందనేకరేఖలు చలింపకయున్నట్లు గన్పించులాగున, ఆత్మస్వరూపమున నీ బ్రహ్మాండము లుత్పన్నగాకయు, నశింపకయు, అవాగమనములు లేకయునున్నవి.

ఇమేసర్గాఃప్రస్ఫురంతి స్వాత్మనాత్మనినిర్మలే
నభసీవనభోభాగా నిరాకారానిరాకృతౌ. 21

నిరాకారమగు ఆకాశమున నిరాకారమగు ఆకాశభాగమువలె నిర్మలమగు ఆత్మయందీ సృష్టులన్నియు ఆత్మరూపముననే స్ఫురించుచున్నవి.

ద్రవత్వానీవతోయస్య స్పందాఇవసదాగతౌ
ఆవర్తాఇవచాంభోధే ర్గుణినోవాయథాగుణాః. 22

జలమందు ద్రవత్వమును, వాయువునందు చలనమును, సముద్రమందావర్తమును, గుణవంతునియందు గుణమును యెట్లుగలవో, అట్లనే పరమాత్మయందును యీ జగత్తు గలదు.

విజ్ఞానఘనమేవైక మిదమేవమవస్థితమ్
సోదయాస్తమయారంభ మనంతంశాంతమాతతమ్. 23

విజ్ఞానఘనమును, యేకరసమును, శాంతమును, అనంతమునునగు బ్రహ్మమే ఉత్పత్తినాశాది క్రియలతోగూడిన యీ జగద్రూపమున వ్యాప్తమైయున్నది.

సహకార్యాదిహేతూనా మభావేశూన్యతోజగత్
స్వయంభూర్జాయతేచేతి కిలోన్మత్తకథాత్కృతమ్. 24

సహకారికారణముల యభావముచే శూన్యమువలె ప్రకృతినుండి ఆత్మరూపమగు యీ జగంబుదయించుచున్నదను సాంఖ్యాదుల కథనము ఉన్మత్తుని చేష్టవంటిదే యగును.

ప్రశాంతసర్వార్థకలాకలంకో నిరస్తనిఃశేషవికల్పతల్పః
చిరాయవిద్రావితదీర్ఘనిద్రో భవాభయోభూషితభూఃప్రబుద్ధః. 25

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
స్థితిబీజోపన్యాసోనామ ద్వితీయః
సర్గః ॥ 2 ॥

ఓ రామా! కల్పనారూపమగు కళంకములేవియులేక, స్వప్నరూపములగు దృశ్యవస్తువులగూర్చిన వికల్పములన్నింటిని తొలగించి, అవిద్యయను దీర్ఘగాఢనిద్రను సంపూర్ణముగ పారద్రోలి, నిర్భయుడవై, ఆత్మజ్ఞానముచే జాగృతిని వడసి, బ్రహ్మవిత్సభారూపమగు యీ భూమండలమును భూషితమొనర్పుము.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు స్థితిప్రకరణమున
స్థితిబీజోపన్యాసమను ద్వితీయ
సర్గము ॥ 2 ॥

---

## తృతీయః సర్గః.

---

శ్రీరామ ఉవాచ :—

మహాకల్పాంతసర్గాదౌ ప్రథమోఽసౌ ప్రజాపతిః
స్మృత్యాత్మా జాయతేఽమన్యే స్మృత్యాత్మైవ తతో జగత్. 1

శ్రీరాముడు :—ఓ మునీంద్రా ! మహాకల్పాంతమందును, సృష్ట్యాదియందును ప్రథమ ప్రజాపతి స్మృతి (సంస్కార) రూపుడై జన్మించుననియు, వానియొక్క స్మృతి లేక మనస్సే యీ జగద్రూపమున నుత్పన్నమగుచున్నదనియు నేనెంచెద.

శ్రీవసిష్ఠ ఉవాచ :—

మహాప్రలయసర్గాదావేవమేతద్రఘూద్వహ
స్మృత్యాత్మైవ భవత్యాదౌ ప్రథమోఽసౌ ప్రజాపతిః. 2

శ్రీవసిష్ఠుడు :— రఘుకులశ్రేష్ఠుడగు నో రామా ! నీవు వచించినలాగున మహాప్రలయాంతమునను, సృష్ట్యాదియందును ప్రథమప్రజాపతి స్మృతిరూపముననే నుత్పన్నమగును.

తత్సంకల్పాత్మకజగత్స్మృత్యాత్మైవమిదం తతః
భాతి సంకల్పనగరం స్థితం పూర్వం ప్రజాపతేః. 3

అట్టి పూర్వప్రజాపతియొక్క స్మృతిరూపమునను, లేక సంకల్పరూపమునను, గంధర్వనగరమువలె నీ జగత్తు భాసమానమగుచున్నది.

స్మృతిర్న సంభవత్యేవ సర్గాదౌ పరమాత్మనః
జన్మాభావాత్కథం కుత్ర సభసీవ మహాద్రుమః. 4

ఇవ్విధమున స్మృతియందే సంకల్పరూపమున నీ జగత్సత్తస్థితిగల్గియున్నది. మృత్తికాదులకలె యచేతనమగు ప్రధానమునకు స్మృతి యుండనేరదు. మఱియు నాకసమున మహావృక్షము వలె జన్మాదివికారరహితుడగు పరమాత్మయందు స్మృతి యెచట ?

శ్రీరామ ఉవాచ :—

నసంభవతి కిం బ్రహ్మన్సర్గాదౌ ప్రాక్తనీ స్మృతిః
మహాప్రలయసంమోహైర్నశ్యతి ప్రాక్స్మృతిః కథమ్. 5

శ్రీరాముడు :—ప్రతిదినము జీవుడనుభవించు సుషుప్తివంటిదే కదా ప్రలయము; అట్టి సుషుప్తినుండి మేల్కాంచిన పిదప జీవునకు పూర్వపుస్మృతి యుండునట్లే సృష్ట్యాదియందును ప్రజాపతియందు స్మృతియేల సంభవింపదు ? మఱియు మహాప్రలయముయొక్క ప్రబలమోహముచే పూర్వకల్పసంస్కారజనితమగు స్మృతి యెట్లు నశించును ?



శ్రీవసిష్ఠ ఉవాచ :—

యే మహాప్రలయే ప్రాజ్ఞాః సర్వే బ్రహ్మాదయః పురా
కిల నిర్వాణమాయాతాస్తేఽవశ్యం బ్రహ్మతాం గతాః. 6

శ్రీవసిష్ఠుడు :—ఓ రామా ! పూర్వము జనించిన బ్రహ్మలందఱును జ్ఞానులేగాన మహాప్రలయమున వారందఱును ముక్తులైరి. కాన వారవశ్యము పరబ్రహ్మస్వరూపమునే పొందిరి.

ప్రాక్తనః కః స్మృతేః కర్తా తస్మాత్కథయ సువ్రత
స్మృతిర్నిర్మూలతాం యాతా స్మర్తుర్ముక్తతయాయతః. 7

సువ్రతుడవగు నో రామా ! ఇవ్విధమున పూర్వకాలోత్పన్నస్మృతికి కర్త యెవడో చెప్పుము ? కర్త ముక్తుడైన నిక స్మృతియు నిర్మూలమగును.

అతః స్మర్తురభావేన స్మృతిరభ్యుదేతి కిం కథమ్
అవశ్యం హి మహాకల్పే సర్వే మోక్షైకభాగినః. 8

కర్తయే లేనపుడు యిక స్మృతియెట్లు సంభవించును ? ఏరీతి యుత్పన్నమగును ? మహాకల్పమున సర్వులును మోక్షభాగులగుదురు గదా !

నానుభూతేఽనుభూతే చ స్వతశ్చిద్వ్యోమ్ని యా స్మృతిః
సా జగద్భ్రాంతిరిత్ప్రౌఢా దృశ్యా సా స్త్యేవ చిత్ప్రభా. 9

అనుభూతముగాని, అననుభూతముగాని నగు చిదాకాశమందలి యే స్మృతి జగదుత్పత్తికి హేతువని నీవు తలంచితివో, అయ్యది చిత్కళయనియు, సత్స్వరూపప్రతిపాదకములగు శ్రుతుల యాశయమైయున్నది.

భాతి సంవిత్ప్రభైవేయమనాద్యంతావభాసినీ
యత్తదేతజ్జగదితి స్వయంభూరితి చ స్థితమ్. 10

ఈచిత్కళ అనాదియు, అనంతమును, చిదాకాశస్వరూపమునయి భాసించుచున్నది. స్వయంభువగు పరమాత్మయే జగద్రూపముననున్నాడని యెఱుంగుము.

అనాదికాలసంసిద్ధం యద్భానం బ్రహ్మణో నిజమ్
స ఆతివాహికో దేహో విరాజో జగదాకృతిః. 11

అనాదికాలసిద్ధమగు బ్రహ్మముయొక్క నిజరూపప్రకాశమే యీ బ్రహ్మాండదేహమునకు నుపాదానకారణమును, జగదాకారమగు సూక్ష్మశరీరమునునగును. కాననదియు పరమాత్మయేయని గ్రహింపుము.

పరమాణావిదం భాతి త్రిజగత్పవనాభ్రఖమ్
దేశకాలక్రియాద్రవ్యదినరాత్రిక్రమాన్వితమ్. 12

దేశకాలక్రియాద్రవ్యయుక్తమును దినరాత్రిక్రమాన్వితమును, మేఘ, ఆకాశాది సంయుక్తమునగు యీ త్రిలోకమంతయు నొక్క పరమాణువునందే భాసించుచున్నది.

పరమాణుః ప్రవితత స్తస్యాస్తే తాదృగేవచ
భాతిభాసురితాకారి తాదృగ్గిరికులంపునః. 13

ఆ పరమాణువందే, తత్తుల్యమైన మఱియొక విశాలమగు పరమాణువుగలదు. దానియందును అవ్విగమున నే మేఘ వనాఆకాశాదిసహితమగు యీ త్రిలోకము ప్రతిభానమగుచున్నది.

తత్రాపితాదృగాకార మేవప్రత్యనుసంతతమ్
దృశ్యమాభాతిభారూప మేతదంగనవాస్తవమ్. 14

మరల యద్దానియందును, తత్సమానమగు మఱొక పరమాణువుగలదు. అందునుగూడ పూర్వము వచించిన రీతి యీ ముల్లోకము భాసించుచున్నది. ఇట్లవ్యవస్థారూపమున నొకదాని యందు మఱొకటి గ్రుచ్చబడి దృశ్యమానమగుచున్నది. కాని, ప్రియుడవగు నో రామా! ఇదంతయును సత్యముకాదు.

ఇత్యస్యంతోనసద్దృష్టే రసద్దృష్టేశ్చవాక్వచిత్
అస్యాస్త్వభ్యుదితంబుద్ధం నాబుద్ధంప్రతివానఘ. 15

పాపరహితుడవగు నో రామా! ఇట్లు పరమాభ్యుదయము నొందిన జ్ఞానుల దృష్టియందు సత్స్వరూపమున కంతములేదు; అజ్ఞుల దృష్టియందలి మిథ్యారూపమునకున్నూ అంతములేదు.

బుద్ధంప్రతీదంబ్రహ్మైవ కేవలంశాంతమవ్యయమ్
అబుద్ధంప్రతిబుద్ధ్యైత ద్భాసురంభువనాన్వితమ్. 16

జ్ఞానులదృష్టియందీ ప్రపంచమంతయు నాశరహితమును, శాంతమునునగు కేవలపరబ్రహ్మమును అజ్ఞానుల దృష్టియందు చతుర్దశ భువనరూపమున నున్నదియు నగును.

యథేదంభాసురంభాతి జగదండకజృంభితమ్
యథాకోటిసహస్రాణి భాంత్యన్యాన్యప్యణావణౌ. 17

ఈ బ్రహ్మాండమెట్లు వృద్ధినొంది భాసించుచున్నదో, అట్లనే యిం[illegible] కోట్లకొలది బ్రహ్మాండము లొక్కొక్క పరమాణువందు భాసించుచున్నవి.

యథాస్తంభేపుత్రికాంత స్తస్యాఃస్వాంగేషుపుత్రికా.
తస్యాశ్చపుత్రికాస్త్వంగే తథాత్రైలోక్యపుత్రికా. 18

స్తంభమందు విగ్రహమును, ఆ విగ్రహముయొక్క అంగములందు మఱియొక విగ్రహమును నిర్మింపబడి యుండులాగున జగత్తునందలి ప్రతి పరమాణువందును ముల్లోకమను విగ్రహముగలదు.

నాభిన్నానాపిసంఖ్యేయా యథాద్రావపరమాణుకాః
తథాబ్రహ్మబృహన్మేరౌ త్రైలోక్యపరమాణవః. 19



పర్వతమందెట్లు తదభిన్నముగ యసంఖ్యాకములగు పరమాణువులు గలవో, అట్లనే బ్రహ్మమనునట్టి గొప్ప సుమేరుపర్వతమునను త్రిలోకరూపపరమాణువు లనేకములు గలవు.

సూర్యాద్యంశుషుసంఖ్యాతుం శక్యంతేలఘవోణవః
ఉత్పద్యంతేచిదాదిత్యే త్రైలోక్యపరమాణవః. 20

సూర్యాదుల కిరణములందు గాన్పించు సూక్ష్మపరమాణువులు లెక్కింపబడునో, చిదా[illegible] ఉత్పన్నమగు త్రిలోకరూపపరమాణువులును లెక్కింపబడగలవు. (అనగా రెండును [illegible])

యథాణవోవహంత్యర్క దీప్తిష్వప్సురజఃసుచ
తథావహంచిద్వ్యోమ్ని త్రైలోక్యపరమాణవః. 21

సూర్య కిరణములందును, జలమందును, ధూళియందును అనేక పరమాణువులు పరిభ్రమించుచుండునట్లు, చిదాకాశమునను త్రైలోక్యములను పరమాణువు లనేకములు భ్రమణము సల్పుచున్నవి.

శూన్యానుభవమాత్రాత్మ భూతాకాశమిదంయథా
సర్గానుభవమాత్రాత్మ చిదాకాశమిదంతథా. 22

శూన్యమును, నిరాకారమును నగు భౌతికాకాశము నీలముగ గన్పట్టినను అట్టి నీలత్వము యథార్థముగ శూన్యరూపమేయగు చందమున, సృష్టిరూపమున యనుభూతమగు నిదంతయు చిదాకాశమే యగును.

సర్గస్తుసర్గశబ్దార్థతయా బుద్ధోనయత్యధః
సబ్రహ్మశబ్దార్థతయా బుద్ధఃశ్రేయోభవత్యలమ్. 23

సృష్టిరూపమున నెఱుంగుచో నయ్యది నరకాది యధోలోకముల బొందించుచున్నది. కాని బ్రహ్మరూపముగ నెఱింగిన నదియే మోక్షశ్రేయ మొనగూర్చునదగుచున్నది.

విజ్ఞానాత్మాశాసితావిశ్వబీజం
బ్రహ్మైవాలంస్వంచిదాకాశమాత్రమ్
యస్మాజ్జాతంయత్తదేవేతివిద్యా
ద్వేద్యంస్వాంతర్బోధసంబోధమాత్రమ్. 24

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
జగదానంత్యవర్ణనంనామ తృతీయః
సర్గః ॥ 3 ॥

ఓ రామా! ప్రత్యగాత్మస్వరూపుడగు జీవుడును ప్రపంచ కారణభూతుడును, నియామకుడునునగు ఈశ్వరుడును పరమార్థదృష్టిచే శోధింప, పరిపూర్ణమును, యేకరసమును నగు చిన్మాత్ర పరబ్రహ్మమే యగును. ఏలన, బాహ్యాభ్యంతరములు రెండును యుపాధిభేదమున బ్రహ్మమునుండియే యుత్పన్నమైనవని శ్రుతి జెప్పుచున్నది. కాన ఏది యెద్దానియం దుత్పన్నమగునో, అయ్యది

శుద్ధరూపమయ్యే యుండును. కాన జ్ఞానోదయముచే వేద్యవస్తుసముదాయమంతయు శుద్ధమును, చిన్మాత్రమును బోధ (జ్ఞాన) స్వరూపమును నగు పరబ్రహ్మమే యగును.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు స్థితిప్రకరణమున
జగదానంత్యవర్ణనమను తృతీయ
సర్గము ॥ ౩ ॥

---

## చతుర్థః సర్గః.

---

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

ఇంద్రియగ్రామసంగ్రామ సేతునాభవసాగరః
తీర్యతేనేతరేణేహ కేనచిన్నామకర్మణా. 1

శ్రీవసిష్ఠుడు :—ఓ రామా! ఇంద్రియ సమూహమును జయించుట యను వారధిచే నీ భవసాగరము దాటబడునుగాని మఱియితరమగు యే కర్మచేతను గాదు.

శాస్త్రసత్సంగమాభ్యాసా త్సవివేకోజితేంద్రియః
అత్యంతాభావమేతస్య దృశ్యస్యాప్యవగచ్ఛతి. 2

శాస్త్ర, సజ్జనసాంగత్యములచే జీవుడు వివేకవంతుడును, జితేంద్రియుడును నగును. మఱియు జితేంద్రియుడగువాడే దృశ్యముయొక్క అత్యంతాభావము నెఱుంగగలడు.

ఏతత్తేకథితంసర్వం స్వరూపంరూపిణాంవర
సంసారసాగరశ్రేణ్యో యథాయాంతిప్రయాంతిచ. 3

సౌందర్యవంతులలో శ్రేష్ఠుడవగు నో రామా! (ఇంద్రియజయము సంసారమును ఛేదించివైచును, ఇంద్రియవశత్వము సంసారమున బడద్రోయు) నని — ఇట్లు సంసార స్వరూపమంతయు నీ కెఱింగించితిని. దీనిచే సంసార సాగర సమూహములు నశించు విధమును ప్రాప్తించు విధమును సువ్యక్త మగుచున్నది.

బహునాత్రకిముక్తేన మనఃకర్మద్రుమాంకురః
తస్మింశ్ఛిన్నేజగచ్ఛాఖీ ఛిన్నఃకర్మతనుర్భవేత్. 4

ఇంక నధికముగ జెప్పనేల, ఈ మనస్సే కర్మయను వృక్షముయొక్క అంకురమని గ్రహింపుము. దీనిని ఛేదించివైచిన నిక విహితనిషిద్ధకర్మరూపమగు యీ జగద్వృక్షము స్వయముగనే ఛిన్నమగును.

మనఃసర్వమిదంరామ తస్మిన్నంతశ్చికిత్సితే
చికిత్సితోవైసకలో జగజ్జాలామయోభవేత్. 5



ఓ రామా! అంతయును యీ మనస్సేయగును. ఇద్దాని చికిత్స (దమనము)చే జగత్స[illegible] (దృశ్య) రూపమను రోగము శమింపగలదు.

తదేతజ్జాయతేలోకే మనోమననమాకులమ్
మనసోవ్యతిరేకేణ దేహాఃక్వకిలదృశ్యతే. 6

మనస్సే దేహాకారమున స్ఫురించుచు స్వప్నమువలె క్రియాసమర్థ మగుచున్నది. మనస్సున [illegible]ముగ [illegible]మెచట కార్య సమర్థమగుచు లక్షితమగుచున్నది?

దృశ్యాత్యంతాసంభవేన ఋతేనాన్యేన హేతునా
మనఃపిశాచఃప్రశమం యాతికల్పశతైరపి. 7

జ్ఞానముచే దృశ్యమును పూర్ణముగ రహితమొనర్చుటచే తప్ప అన్యమగు యే విధముచే నైనను యీ దృశ్యపిశాచము శమింపదు.

ఏతచ్చసంభవత్యేవ మనోవ్యాధిచికిత్సతే
దృశ్యాత్యంతాసంభవాత్మ పరమౌషధముత్తమమ్. 8

దృశ్యముయొక్క పూర్ణరాహిత్యమే యీ మనోరోగ చికిత్సార్థము పరమోత్తమమగు నౌషధమగును గాని, అన్యముగాదు.

మనోమోహముపాదత్తే మ్రియతేజాయతేమనః
తత్స్వచింతాప్రసాదేన బద్ధ్యతేముచ్యతేపునః. 9

ఈ మనస్సే దేహాదులం దాత్మభావముగల్గజేసి మోహముత్పన్నము గావించుచున్నది. అదియే మరణించుచున్నది. అదియే జన్మించుచున్నది. ఈ మనఃప్రభావముచేతనే జీవుడు బంధమున దగుల్కొనుచున్నాడు. కాని యెపుడియ్యది ఆత్మజ్ఞానోన్ముఖ మగుచున్నదో అపుడు విముక్తిని నొందుచున్నది.

స్ఫురతీదంజగత్సర్వం చిత్తేమననమూర్ఛితే
శూన్యమేవాంబరేస్ఫారే గంధర్వాణాంపురంయథా. 10

శూన్యమును, విశాలమునునగు యాకసమున గంధర్వనగరమువలె, సంకల్పాదులచే బలపడిన చిత్తమందీ జగత్తంతయు స్ఫురించుచున్నది.

మనసీదంజగత్కృత్స్నం స్ఫారంస్ఫురతిచాస్తిచ
పుష్పగుచ్ఛఇవామోద స్తత్స్థంతస్మాదివేతరత్. 11

పుష్పగుచ్ఛమందున్న సుగంధమద్దానికి భిన్నముగ గోచరమగునట్లు, మనస్స్థితమగు యీ జగంబంతయును, తద్భిన్నముగ గోచరించుచు స్థితిఁబొందుచు నున్నది.

యథాతిలకణేతైలం గుణోగుణినివాయథా
యథాధర్మిణివాధర్మ స్తథేదంచిత్తకేజగత్. 12

తిలమందు తైలమును, గుణియందు గుణమును, ధర్మియందు ధర్మమును యెట్లున్నవో, ఆవిధముననే యీ దుష్టచిత్తమున జగంబును గలదు.

రశ్మిజాలంయథాసూర్యే యథాలోకస్తుతేజసి
యథౌష్ణ్యంచిత్రభానౌచ మనసీదంతథాజగత్. 13

సూర్యునియందు కిరణములును, తేజమందు ప్రకాశమును, అగ్నియం దుష్ణత్వమును యున్న చందముననే మనస్సునందును యీ జగత్తుగలదు.

శైత్యంయథైవతుహిమే యథానభసిశూన్యతా
యథాచంచలతావాయౌ మనసీదంతథాజగత్. 14

మఱియు మంచునందు చల్లదనమును, ఆకాశమున శూన్యత్వమును, వాయువందు చంచలత్వమును యున్నవిధముననే మనస్సునందీ జగత్తునుగలదు.

మనోజగజ్జగదఖిలంతథామనః
పరస్పరంత్వవిరహితేసదైవహి
తయోర్ద్వయోమనసి నిరంతరంక్షితే
క్షితంజగన్నతుజగతిక్షితేమనః. 15

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
స్థిత్యంకురకలనంనామ చతుర్థః
సర్గః ॥ 4 ॥

మనస్సే యీ సమస్తజగత్తు; సమస్తజగత్తును మనస్సే. ఈ రెంటిలో మనస్సు సంపూర్ణముగ నశించిన యీ జగద్రూపమగు దృశ్యజాతమంతయును స్వయముగనే శాంతించును, కాని జగత్తు నశించిన మనస్సు నశింపకయుండును.

ఇద శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు స్థితిప్రకరణమున
స్థిత్యంకురకలనమను చతుర్థ
సర్గము ॥ 4 ॥

---

## పంచమః సర్గః.

---

శ్రీ రామ ఉవాచ :—

భగవన్సర్వధర్మజ్ఞ పూర్వాపరవిదాంవర
అయంమనసిసంసారః స్ఫారఃకథమివస్థితః. 1

శ్రీరాముడు :—ఓ మునీంద్రా ! సర్వధర్మజ్ఞా ! పూర్వాపరముల నెఱింగిన నో మహాత్మా ! విశాలమగు నీ ప్రపంచమంతయు మనంబున యెట్లుగలదు ?

యథాయంమనసిస్ఫారః సంసారఃస్ఫురతిస్ఫురన్
దృష్టాంతదృష్ట్యాస్ఫుటయా తథాకథయమేనఘ. 2



పాపరహితుడవగు నో మునిశ్రేష్ఠా ! ఈ విశాలాకారముగల ప్రపంచమంతయు మనస్సునందు స్ఫురించుచు బాహ్యదేశమున యెట్లు ప్రత్యక్షముగ గన్పట్టుచున్నదో, యారీతిని ఉత్తమ దృష్టాంతములద్వారా విస్పష్టముగ తెలియజేయుడు ?

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

యథైందవానాంవిప్రాణాం జగంత్యవపుషామపి
స్థితానిజాతదార్ఢ్యాని మనసీదంతథాస్థితమ్. 3

శ్రీవసిష్ఠుడు :— ఓ రామా ! స్థూలశరీరరహితులైనప్పటికిన్ని సమాధిస్థులైయున్న ఐందవులమనమున పెక్కు జగంబులెట్లు దృఢత్వము నొందియుండెనో, అట్లనే మనస్సునందీ జగత్తున్ను స్థితిగల్గియున్నది.

లవణస్యయథారాజ్ఞ శ్చేంద్రజాలాకులాకృతేః
చండాలత్వమనుప్రాప్తం తథేదంమనసిస్థితమ్. 4

మఱియు ఇంద్రజాలముచే వ్యాకులమొనర్పబడిన చిత్తముగల లవణునకు చాండాలత్వమెట్లు సంభవించెనో, అట్లనే మనంబునను యీ జగత్తు ప్రతిష్ఠితమై యున్నది.

భార్గవస్యచిరంకాలం స్వర్గభోగబుభుక్షయా
యథాభోగాధినాథత్వం సంసారిత్వంబభూవచ. 5
భోగేశ్వరత్వంచతథా తథేదంమనసిస్థితమ్

భృగుమహర్షి యొక్క పుత్రుడగు శుక్రాచార్యునకు చిరకాలము స్వర్గసుఖ మనుభవింపవలెనను యిచ్ఛయు, అప్సరసను పొందవలెనను తలంపును గలుగుటయు, అపుడు సంసారియై స్వర్గమునకుజని, జన్మాంతరమునుపొంది, స్వర్గమున అప్సరసతో భోగమనుభవించుటయు సంభవించిన రీతి మనంబునను యీ జగత్తు సంభవించుచున్నది.

శ్రీరామ ఉవాచ :—

భగవన్భృగుపుత్రస్య స్వర్గభోగబుభుక్షయా. 6
కథంభోగాధినాథత్వం సంసారిత్వంబభూవచ.

శ్రీరాముడు :— ఓ మహాత్మా ! భృగుని పుత్రుడగు శుక్రాచార్యునకు స్వర్గభోగాభిలాషచే అప్సరసనుపొంద తలంపు యెట్లుగల్గెనో, మఱియు నాతనికి సాంసారిత్వమెట్లు సంభవించెనో వచింపుడు ?

శ్రీవసిష్ఠ ఉవాచ :—

శృణురామపురావృత్తం సంవాదంభృగుకాలయోః. 7

శ్రీవసిష్ఠుడు :—ఓ రామా ! భృగుయముల సంవాదమను నీ పురాతన వృత్తాంతమును నీవు వినుము.

సానౌమందరశైలస్య తమాలవిటపాకులే
పురామందరశైలస్య సానౌకుసుమసంకులే. 8

అతప్యతతపో ఘోరం కస్మింశ్చిద్భగవాన్ భృగుః
తముపాస్తేస్మ తేజస్వీ బాలఃపుత్రో మహామతిః. 9
శుక్రఃసకలచంద్రాభః ప్రకాశ ఇవభాసురః
భృగుర్వనవరేతస్మి న్సమాధావేవసంస్థితః. 10
సర్వకాలంసముత్కీర్ణో వనోపలతలాదివ
శుక్రఃకుసుమశయ్యాసు కలధౌతాజిరేషుచ. 11
మందారోద్దామదోలాసు బాలోరమణలీలయా

తమాల వృక్షములచే పూర్ణమైయొప్పుచు పలువిధ పుష్పసమూహములచే నాచ్ఛాదితంబైన మందరపర్వతముయొక్క యొకానొక శిఖరముపై, పూర్వకాలమున భృగుమహర్షి ఘోర తపం బొనర్చెను. ఆతని పుత్రుడును, బాలకుండును, తేజస్సంపన్నుడును, ధీశాలియు, పూర్ణచంద్రునివలె శోభించుచున్నవాడును, ప్రకాశమువలె దేదీప్యమానమై వెలుగొందుచున్నవాడును నగు శుక్రాచార్యుడు వాని నుపాసించుచుండెను. శిలవోలె యచలముగనున్నవాడై, ఆ శ్రేష్ఠమగు వనమున భృగువు సమాధియందుండెను. శుక్రాచార్యుడు దర్భశయ్యలపైనను, సువర్ణరజత వేదికలపైనను మందర పర్వతస్థవృక్షములపై నిర్మింపబడిన ఊయెలలందును, విలాసపూర్వకముగ క్రీడించుచుండెను.,

విద్యావిద్యాదృశోర్మధ్యే శుక్రో ప్రాప్తమహాపదః. 12

అపుడు శుక్రాచార్యుడు విద్యావిద్యల రెంటియొక్క మధ్యస్థితి బొందినవాడై (అనగా పూర్ణమగు ఆత్మజ్ఞానమును పొందకయు, కేవలమవిద్యయందు తగుల్కొనకయు) యుండెను.

త్రిశంకురివరోదోంత రవర్తతదాకులః

అపుడు, భూమ్యాకాశముల మధ్య విశ్వామిత్రునిచే రచింపబడిన స్వర్గమందలి త్రిశంకుని వలె, శుక్రాచార్యుడు విద్యావిద్యల రెంటిమధ్యమునను స్థితిఁబొందియుండెను.

నిర్వికల్పసమాధిస్తే సకదాచిత్పితర్యథ. 13
అవ్యగ్రోభవదేకాంతే జితారిరివభూమిపః
దదర్శాప్సరసంతత్ర గచ్ఛంతీంనభసఃపథా. 14
క్షీరోదమధ్యలులితాం లక్ష్మీమివజనార్దనః

అత్తఱి యొకనాడు తండ్రియగు భృగువు నిర్వికల్ప సమాధియందు స్థితుడైయుండ, శుక్రాచార్యుఁడేకాంతప్రదేశమున, శత్రువుల జయించిన రాజువలె స్వస్థచిత్తుడై యుండెను. అపుడాకాశ మార్గమున జనుచున్న యొక అప్సరస, క్షీరసముద్రమును మథించుటచే వినిర్గతమైన చంచలమగు లక్ష్మిని విష్ణువు పరికించువిధమున నా శుక్రుని గాంచెను.

మందారమాలవలితాం మందానిలచలాలకామ్.. 15
హారఝాంకారిగమనాం సుగంధితనభోనిలామ్
లావణ్యపాదపలతాం మదఘూర్ణితలోచనామ్. 16



అమృతీకృతతద్దేశాం దేహేందూదయదీప్తిభిః
కాంతామాలోక్యతస్యాభూ దుల్లసత్తరలంమనః 17
దృష్టనిర్మలపూర్ణేందు వపురంబునిధేరివ
సాప్యాలోక్యశుక్రముఖం తథాపరవశాహ్యభూత్. 18

మందారవృక్షమాలలచే నాచ్ఛాదింపబడిన శరీరముగలదియు, మందవాయువుచే చలింపబడుచున్న కేశపాశములు గలదియు, హారముల శబ్దమొనర్చుచు నడచునదియు, తనదేహముచే నాకసమందలి వాయువును సుగంధితమొనర్చుచున్నదియు, సౌందర్యమను వృక్షమునకు లతవంటిదియు మదభరలోచనయు, తన దేహమను చంద్రునినుండి వినిర్గతములైన కిరణములచే నాప్రదేశమును అమృతమయమొనర్చుచున్నదియు నగు నారమణీయమగు అప్సరసను గాంచ, శుక్రాచార్యుని మనంబు పూర్ణచంద్రుని వీక్షించిన సముద్రునివలె క్షుభితమయ్యె. అంత నా అప్సరసయున్నూ శుక్రాచార్యుని ముఖమండలం బవలోకించి, వానివలెనే మోహపరవశమాయెను.

మనసిజేషు పరాహతమాశయం
సపరిబోధ్య మనస్తదనూశనా
విగలితేతరవృత్తితయాత్మనా
సచవధూమయఏవబభూవహ. 19

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
భార్గవోపాఖ్యానే భార్గవస్థలనంనామ
పంచమః సర్గః ॥ 5 ॥

ఆ యప్సరసను జూచిన తదుపరి మన్మథ శరంబులచే మిగుల జర్జరితమైన తన చిత్తమును శుక్రాచార్యుడు (ఆపెవెంట పరుగిడుటమున్నగు బాహ్యశరీరాది వ్యాపారములనుండి) వివేకాదులచే యథాశక్తి నిగ్రహించి, యితర వృత్తులేవియు లేనివాడై మనంబున కేవలమా యప్సరామయుఁడై యుండెను.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు స్థితిప్రకరణమున
భార్గవస్థలనమను పంచమ
సర్గము ॥ 5 ॥

---

## షష్ఠః సర్గః.

---

శ్రీవసిష్ఠ ఉవాచ :—

అథతాంమనసాధ్యాయం స్తత్రైవామీలితేక్షణః
ఆరబ్ధవాన్మనోరాజ్య మిదమేకఃకిలోశనా. 1

శ్రీవసిష్ఠుడు :— ఓ రామా! అటు పిమ్మట శుక్రాచార్యుఁడు నేత్రముల మూసికొని ఆయప్సరసనే మనంబున ధ్యానించుచు, అన్యవృత్తి త్యాగపూర్వకమగు యీ వక్ష్యమాణ మనో రాజ్యంబును కల్పనయొనర్ప నారంభించెను.

ఏషాహిలలనావ్యోమ్ని సహస్రనయనాలయే
సంప్రాప్తోయమహంస్వర్గ మాలోలసురసుందరమ్. 2

స్వర్గమందలి యీ లలన ఆకాశమార్గముగుండా యింద్రుని స్థానమున కరుగుచున్నది. ఈమె వెనువెంటనే జనుచు నేను దేవతల యధివాసమైనట్టి మనోహరమగు స్వర్గలోకమును చేరితిని.

ఇమేతేమృదుమందార కుసుమోత్తంససుందరాః
ద్రవత్కనకనిష్పంద విలాసివపుషఃసురాః. 3

పురాణాదులందు ప్రసిద్ధికెక్కినవారును, పుష్పమండిత శిరోభూషణములచే నలంకృతులై సుందరముగనున్నవారును, తప్తకాంచనమువాడ్కి శోభాయమానముగనున్న దేహముగలవారును నగు వీరే దేవతలు.

ఇమాస్తాలోచనోల్లాస దృష్టనీలాబ్జదృష్టయః
ముగ్ధహాసవిలాసిన్యః కాంతాహారిణదృష్టయః. 4

నయనోల్లాసముచే ప్రత్యక్షముగ నీలకమలములవంటి దృష్టిని ధరించియున్నవారును, మనోహరమగు హాస్యముచే విలాసముగొల్పువారును మృగనయనలునునగు వీరే దేవతాస్త్రీలు.

ఇమేతేకౌసుమోద్యోతా అన్యోన్యప్రతిబింబితాః
విశ్వరూపోపమాకారా మరుతోమత్తకాశినః. 5

పారిజాతాది పుష్పమాలలచే ప్రకాశించుచున్నవారును, పరస్పరము ప్రతిబింబితమగుటచే విశ్వరూపుడగు విష్ణువువంటి యాకృతిగలవారునునై సంతుష్టులపగిది శోభించుచున్న వీరే దేవతలు.

ఐరావణకటామోద విరక్తమధుపశ్రుతాః
ఇమాస్తాఃకాకలీగీతా గీర్వాణగణగీతయః. 6

ఐరావతముయొక్క గండస్థలమందున్న సుగంధమునెడ విరక్తిగల్గియున్న భ్రమరములచే శ్రుతములును, కర్ణసర్వములును నగు దేవగీతము లివియే.

ఇయంసాకనకాంభోజ చలద్వైరించసారసా
మందాకినీతటోద్యాన విశ్రాంతసురనాయకా. 7

చంచల కమలములందు సంచరించు బ్రహ్మదేవునియొక్క హంసచేతను, సారసపక్షుల చేతను సుశోభితమును, ఇంద్రుడు విశ్రమించునట్టి వనవాటికలతో నొప్పుచునున్న తీరములు గలదియు నగు ఆకాశగంగ (మందాకిని) యిదియే.

ఏతేతేయమచంద్రేంద్ర సూర్యానలజలానిలాః
లోకపాలాస్తనుద్యోత కీర్ణదీప్తానలార్చిషః. 8



తమ దేహకాంతిచే ప్రదీప్తమగు అగ్నిజ్వాలల విస్తరించు యమ, చంద్ర, ఇంద్ర, సూర్య, అగ్ని, జల, వాయ్వాది లోకపాలకులు వీరే.

అయంసరణవృంత్తాంత హేతికండూయితాననః
ఐరావణోరణేదంత ప్రోతదైత్యేంద్రమండలః. 9

రణరంగములందలి ఆయుధములకు రాచుకొని తనముఖమందలి దురదను దీర్చుకొనునదియు తనదంతములచే దైత్యప్రముఖులను మర్దించునదియు నగు ఐరావత మిదియే.

ఇమేతేభూతలస్థానా ద్వ్యోమ్నితారకతాంగతాః
వైమానికాశ్చరచ్చారు చామీకరమయాతపాః. 10

తప్తకాంచనసన్నిభులును, భూమండలముపై నున్నవార్ల కాకసమున నక్షత్రముల మాడ్కి గన్పట్టువారును నగు వైమానికదేవతలు వీరే.

మేరూపలతలాస్ఫాల సీకరాకీర్ణదేవతాః
ఏతాస్తాఃకీర్ణమందారా గంగాసలిలవీచయః. 11

మేరుపర్వతశిలలపైనుండి పడుచు జలకణములచే దేవతలను కల్పవృక్షములను తడుపు నట్టిదియునగు ఆకాశగంగాజలతరంగము లివియే.

ఏతాఃప్రసృతమందార మంజరీపుంజపింజరాః
దోలాలోలాప్సరఃశ్రేణ్యాః శక్రోపవనవీథయః. 12

మందారవృక్షలతలు వ్యాపించినట్టివియు, ఊయెల లందూగుచున్న చంచల అప్సరా గణములకు స్థానభూతములునునగు ఇంద్రుని యుపవనము లివియే.

ఇమేతేకుందమందార మకరందసుగంధయః
చంద్రాంశునికరాకారాః పారిజాతసమీరణాః. 13

కుందమందారపుష్పపరాగసుగంధసహితములును, చంద్రకిరణములవలె శీతలములునునగు పారిజాత వృక్షవాయువు లివియే.

పుష్పకేసరనీహార పటవాసరణోత్సుకైః
లతాంగనాగణైర్వ్యాప్త మిదంతన్నందనంవనమ్. 14

పుష్పకేసరములతోను, తుషారకణములతోను వస్త్రములను సుగంధితమొనర్చు పరాగములు గలదియు, పరస్పరసంసక్తములగు లతాంగనాగణంబులచే వ్యాప్తమైయున్న నందన వనం బియ్యదియే.

కాంతగీతరవానంద ప్రనర్తితసురాంగనా
ఇమౌతౌవల్లకీస్నిగ్ధ స్వరౌనారదతుంబురూ. 15

మధురగీతశబ్దములచే నానందితులఁ జేయువారును దేవాంగనలను నృత్యమొనర్పఁ జేయు వారును, వీణవంటి మధురస్వరము గలవారునునగు నారద తుంబురులు వీరే.

ఇమేతేపుణ్యకర్తారో భూరిభూషణభూషితాః
వ్యోమన్యుడ్డీయమానేషు విమానేషుచసంస్థితాః. 16

ఆకాశమం దెగురుచున్న విమానములందున్న వారును, పలువిధ భూషణములచే నలంకృతులునగు వీరే అధిక పుణ్యమొనర్చిన వారగు దేవతలు.

మదమన్మథమత్తాంగ్య ఇమాస్తాఃసురయోషితః
దేవేశ్వరంనిషేవంతే వనంవనలతాఇవ. 17

వనమందలి లతలు వనమునకు శోభను గొల్పునట్లు, మదోన్మత్తలగు (కామాసక్తలైన) దేవాంగనలు యింద్రునకు శోభ నొనగూర్చుచున్నారు.

ఇంద్రాశ్మజాలకుసుమాశ్చింతామణిగులుచ్ఛకాః
కల్పవృక్షాఇమేపక్వ ఫలస్తబకసుందరాః. 18

నీలమణులవంటి పుష్పములును, చింతామణివంటి గుచ్ఛములుగల్గి, పక్వఫలములతో విరాజిల్లు కల్పవృక్షము లివియే.

ఇహాతావదిమంశక్ర మహామాసనసంస్థితమ్
ద్వితీయమివత్రైలోక్య స్రష్టారమభివాదయే. 19

ఈ స్వర్గమున ప్రవేశించిన నేను, ఆసనముపైగూర్చుండి రెండవ బ్రహ్మవలె శోభించుచున్న యింద్రునికి నమస్కరించుచున్నాను.

ఇతిసంచింత్యశుక్రేణ మనసైవశచీపతిః
తేనాభివాదితస్తత్ర ద్వితీయఇవఖేభృగుః. 20

ఇవ్విధమున చింతనజేయుచు శుక్రుడు మనంబుననే యింద్రునకు, ఆకాశమందున్న మఱియొక భృగువునకువలె ప్రణమిల్లెను.

అథసాదరముత్థాయ శుక్రఃశక్రేణపూజితః
గృహీతహస్తఆనీయ సమీపముపవేశితః. 21

పిమ్మట యింద్రుడాదరపూర్వకముగ లేచి శుక్రాచార్యుని పూజించి, చేయిబట్టుకొని, తన యాసనముచెంత గూర్చుండబెట్టెను.

ధన్యస్త్వదాగమనేనాథ స్వర్గోఽయంశుక్రశోభతే.
ఉష్యతాంచిరమిహేహ శక్రఇత్థమువాచతమ్. 22

ఓ శుక్రాచార్య! ఈ మీ యాగమనకారణమున స్వర్గము ధన్యతనొందినదై శోభించుచున్నది. మీరిచటనే చిరకాలముండుడని యింద్రుడు శుక్రునితో బల్కెను.

అథతత్రోపవిశ్యాసౌ భార్గవఃశోభితాననః
శ్రియంజహారశశినః సకలస్యామలస్యచ. 23

ఓ రామా! అంత ప్రకాశించుచున్న ముఖముగల నా శుక్రాచార్యుడు యింద్రుని సమీపమున గూర్చుండి నిష్కళంకమగు పూర్ణచంద్రుని శోభను నిర్జించెను.



సకలసురగణాభివందితోఽసౌ
భృగుతనయఃశతమన్యుపార్శ్వసంస్థః
చిరతరమతులామవాపతుష్టిం
నరపతిసత్తమలాలనంబభూవ. 24

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
భార్గవోపాఖ్యానే భార్గవమనోరాజ్యంనామ
షష్ఠః సర్గః ॥ 6 ॥

అటు పిదప, దేవతలందఱిచేతను నభినందితుఁడై యింద్రునిచెంతనున్న భృగుపుత్రుడగు శుక్రాచార్యుడు చిరకాలమా స్వర్గముననే యున్నవాడై మిగుల ప్రసన్నత్వముఁ జెందుచుండెను. మఱియు యింద్రుని పుత్రునివలెనే యట నాతడును లాలింపబడుచుండెను.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు స్థితిప్రకరణమున
భార్గవోపాఖ్యానమందు భార్గవమనోరాజ్యమను
షష్ఠ సర్గము ॥ 6 ॥

---

## సప్తమః సర్గః.

---

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

ఇతిశుక్రఃపరంప్రాప్య వైబుధం స్వేన తేజసా
విసస్మారనిజంభావం ప్రాక్తనవ్యసనంవినా. 1

శ్రీవసిష్ఠుడు :— ఓ రామా! ఇట్లు శుక్రాచార్యుడు తన పుణ్యప్రభావముచే స్వర్గమును పొంది, మరణదుఃఖములేనివాడై తన పూర్వభావమును మఱచెను.

ముహూర్తమివవిశ్రమ్య తస్యపార్శ్వేశచీపతేః
స్వర్గంవిహర్తుముత్తస్థౌ స్వర్గాభిపరిమోదితః. 2

అపుడు రెండు ఘడియలకాలము యింద్రుని సమీపమున విశ్రమించి, అచటి సుఖాతిశయముచే హర్షితుడై, స్వర్గమున విహరింపదలచి యటనుండి లేచెను.

స్వఃశ్రియంససమాలోక్య లోలలోచనవాంఛితామ్
స్త్రైణంద్రష్టుంజగామాసౌ నలినీమివసారసః. 3

చపలస్త్రీగణముచే వాంఛితమగు నా స్వర్గశోభను (లేక తన సౌందర్యమును) గాంచి, కమలములను జూచుటకై సారసపక్షి జనుచందమున శుక్రుడు స్వర్గమందలి అప్సరోగణమును వీక్షించుటకు బోయెను.

తత్రతాంమృగశావాక్షీం కాంతామధ్యగతామసౌ
దదర్శవిపినాంతస్థాం భృగుశ్చూతలతామివ. 4

అరణ్యమధ్యమున ఆమ్రలతవలె నట శుక్రాచార్యుడు దేవతాస్త్రీలమధ్య తాను పూర్వము జూచిన మృగలోచన యగు అప్సరసను గాంచెను.

సాపితంభార్గవంరామ దృష్ట్వాపరవశాభవత్
తామాలోక్యలసల్లోల విలాసవలితాకృతిమ్. 5
ఆసీద్విలీయమానాంగో జ్యోత్స్నామిందుమణిర్యథా

ఓ రామా ! ఆ యప్సరసయు శుక్రునిజూచి పరవశురాలాయెను; మఱియు, శోభాయమానముగ నున్నదియు, చంచలవిలాసముచే పూర్ణమగు దేహముగలదియునగు నా యప్సరసఁగాంచి చంద్రికనుగాంచిన చంద్రకాంతమణివలె ద్రవీభూతుఁడా (స్వేదయుక్తుడు) యెను.

విలీయమానసర్వాంగ స్తామప్యైక్షతకామినీమ్. 6
చంద్రకాంతఇవజ్యోత్స్నాం శీతలాంఖేవిలాసినీమ్

ఆకాశమున విలాసముతో జరించు శీతలచంద్రుని చంద్రికను చంద్రికాంతమణి వీక్షించు చందమున, సర్వాంగములును స్వేదయుక్తములైయున్న యా కామినిని శుక్రుఁడవలోకించెను.

తేనావలోకితాసాపి తత్పరాయణతాంగతా. 7
నిశాంతేచక్రవాకేన కాంతేవపరికూజితా

అట్లు శుక్రునిచే జూడబడిన నాయంగనయు, రాత్రియందలి వియోగముచే రోదన మొనర్చుచున్న చక్రవాకిపక్షి రాత్ర్యాంతమున చక్రవాకమును గాంచ వానియందు మిగుల ప్రీతిఁగొను నట్లు, శుక్రునియందే నిమగ్నమైన చిత్తము గలదాయెను.

రసాద్వికసితానూన మన్యోన్యమనురక్తయోః. 8
ప్రాతరర్కనలిన్యోర్యా శోభాసైవతయోరభూత్

అపుడు ప్రేమాధిక్యంబున నా యప్సరస ప్రాతఃకాలమందలి సూర్య, కమలములవలె మిగుల శోభను పొందెను.

సంకల్పితార్థదాయిత్వా ద్దేశస్యాభూచ్చతేనసా. 9
సర్వాంగంవివశీకృత్య కామాయైవసమర్పితా

మఱియు నా నందనవనప్రదేశము సంకల్పితపదార్థముల నొసగూర్చునదగుటచే, అపుడామె సర్వాంగముల వివశమొనర్చి మన్మథుని యధీనమాయెను.

పేతుఃస్మరశరాస్తస్యా మృదుష్వంగేషుభూరిశః. 10
పలాశేష్వివపద్మిన్యా ధారాఇవపయోముచః

కమలసరోవరమందలి పత్రములపై వర్ష ధారపట్లు ఆపె కోమలగాత్రముపై మన్మథుని శరంబు లనేకములు పడెను.



సాబభూవస్మరోద్భూతా లోలాలివలయాకులా. 11
మందవాతాభిసున్నాయా మంజర్యాఃసహధర్మిణీ

అందుచే నా యప్సరస మన్మథునిచే కంపితమై, చంచలభ్రమరములచే పరివేష్టింపబడుటచే మిగుల వ్యాకులమై మందవాయువులచే పీడితమగుచునున్న లతవోలె నుండెను.

నీలనీరజనేత్రాంతాం హంససారసగామినీమ్. 12
మదనఃక్షోభయామాస గజఃకమలినీమివ

నీలకమలములవంటి కనుబొమ్మలు గలదియు హంస సారసముల గమనముగల్గి యొప్పుచున్నదియునగు నా యంగనను కమలసరోవరమును గజమువలె, మన్మథుడు క్షుభిత మొనర్చెను.

అథతాంతాదృశీందృష్ట్వా శుక్రఃసంకల్పితార్థభాక్. 13
తమఃసంకల్పయామాస సంహారఇవభూతభుక్

త్రివిష్టపస్య దేశోఽసౌ బభూవతిమిరాకులః. 14
భూలోకస్యాంఘతమసా లోకాలోకతటోయథా

సంకల్పితార్థభాజుఁడగు శుక్రాచార్యుఁ డట్లప్సరసఁగాంచి, మహాదేవుఁడు సంహారమును గూర్చి సంకల్పించులాగున, అంధకారమును సంకల్పింప నంత భూలోకమందలి గాఢాంధకారముచే లోకాలోకపర్వతతటమువలె, నా స్వర్గమందలి యొకభాగమగు నందనవనప్రదేశమంతయును అంధకారావృత మయ్యెను.

లజ్జాంధకారతీక్ష్ణాంశౌ తస్మింస్తిమిరమండలే. 15
ప్రతిష్ఠామాగతేతస్య మిథునస్యేవమండలే
తేషుసర్వేషుభూతేషు గతేష్వభిమతందిశమ్. 16
తస్మాత్ప్రదేశాద్భూలోకే దినాంతేవిహగేష్వివ
సాదీర్ఘచంచలాపాంగీ ప్రవృద్ధమదనవ్యథా. 17
ఆజగామభృగోఃపుత్రం మయూరీవారిదంయథా

అంత లజ్జయను యంధకారమును నశింపజేయు నా తమోపటలము వారిరువుర మిథునమువలె స్థిరత్వముఁజెంద, సర్వులును అచ్చోటువీడి తమ తమ యభిమతస్థానములఁజన నపుడు, భూలోకమున దినాంతమందు పక్షులుత్కంఠితములగునట్లు ప్రబల కామవ్యథచే పీడితమైనట్టి దీర్ఘ చంచల కటాక్షధారిణియగు నా యప్సరస, మయూరము మేఘముచెంతకుఁజను విధమున భృగుని పుత్రుడగు శుక్రాచార్యుని సమీపమునకు వచ్చిచేరెను.

ధవలాగారమధ్యస్థే పర్యంకేపరికల్పితే. 18
వివేశభార్గవస్తత్ర క్షీరోదఇవమాధవః

ధవళకాంతులుగల మందిరమధ్యమున కల్పింపబడిన శయ్యయందు, క్షీరసాగరమందు విష్ణువువలె నా శుక్రాచార్యుడు ప్రవేశించెను.

సాకరావవలంబ్యాస్య వివేశావనతాననా. 19
రరాజచసురేభస్య హృదిలగ్నేవపద్మినీ
ఉవాచచేదంమధురం రసస్నేహోక్తయాగిరా. 20
వచోమధురమానంద విలాసవలితాక్షరమ్

ఆ యప్సరసయు, శుక్రాచార్యుని రెండుచేతులు బట్టుకొని నతముఖియై గూర్చుండి ఐరావతముయొక్క హృదయమున సంలగ్నమైన కమలమువలె శోభించుచు, స్నేహయుక్తములును, ప్రేమరసపూరితములునునగు మధురవాక్కులతోను, ఆనందదాయకములగు వచనములతోను నిట్లు బల్కెను :—

పశ్యామలేందువదన మండలీకృతకార్ముకః. 21
అబలామనుబధ్నాతి మామేషకిలనాంగకః
పాహిమామబలాంనాథ దీనాంత్వాచ్ఛరణామిహ. 22

నిర్మలచంద్రునివంటి ముఖముగల యో నాథా! అవధరింపుము; ధనుస్సును గైకొని యున్న యీ మన్మథుఁడు అబలయగు నన్ను పీడించుచున్నాడు. కాన, నాథా! మిమ్ముల శరణు జొచ్చిన యీ యబలను రక్షింపుము.

కృపణాశ్వాసనంసాధో విద్ధిసచ్చరితవ్రతమ్
స్నేహదృష్టిమజానద్భి ర్మూఢై రేవమహామతే. 23
ప్రణయాఽవగణ్యంతే నరసజ్ఞైః కదాచన
అశంకితోపసంపన్నః ప్రణయోన్యోన్యరక్తయోః. 24
అధఃకరోతినిష్యందం చంద్రమాహ్లాదనంప్రియ

ఓ సాధూ! నావంటి దీనులను రక్షించుటయే సత్పురుషుల నిశ్చయమైయున్నది. మఱియు నో మహామతీ! ప్రేమ దృష్టినెఱుంగని మూఢులుమాత్రమిట్టి యతిశయప్రేమను సన్మానింప కుందురు. కాని రసికులగు విజ్ఞులుకాదు. మఱియు పరస్పర మనురక్తచిత్తులగు స్త్రీ పురుషుల నిశ్చయాత్మకమగు ప్రేమ దేవతల నుజ్జీవింపజేయు నదియు, అమృతమును స్రవింపజేయునదియు, ఆహ్లాదకారిణియునగు చంద్రునికూడ నిర్జించుచున్నది.

నతథాసుఖయత్యేషా చేతస్త్రిభువనేశితా. 25
యథాపరస్పరానందః స్నేహఃప్రథమరక్తయోః

ప్రథమానురక్తులగు స్త్రీపురుషుల ఆనందప్రదమగు ప్రేమచేనే సుఖములభింపునో అయ్యది త్రైలోక్యాధిపత్యముచే గూడ లభింపనేరదు.

త్వద్పాదస్పర్శనేనేయం సమాశ్వస్తాస్మిమానద. 26
చంద్రపాదపరామృష్టా యథానిశికుముద్వతీ

మానప్రదుఁడవగు నో ప్రభూ! చంద్రకిరణస్పర్శచే రాత్రియందు కలువ శాంతిని బొందునట్లు మీపాదస్పర్శచే నేనును శాంతినొందుచున్నాను.



సంస్పర్శామృతపానేన తవజీవామిసుందర. 27
చంద్రాంశురసపానేన చకోరీచపలాయథా

సౌందర్యశీలుఁడగు నో సాధూ! చంచలచకోరము చంద్రకిరణరసపానముచే నుజ్జీవింపఁ జేయునట్లు మీ స్పర్శామృతపానముచే నేను జీవింపగల్గుచున్నాను.

మామిమాంచరణాలీనాం భ్రమరీకరపల్లవైః. 28
ఆలింగ్యామృతసంపూర్ణే స్వపద్మహృదయేకురు

ఓ దేవా! మీ చరణద్వయమందు లీనమైయున్న యీ భ్రమరిని నిజ కరపల్లవములచే నాలింగన మొనర్చుకొని స్నేహ, దయాపూర్ణమగు హృదయపద్మమున జేర్చుకొనుము.

ఇత్యుక్త్వాపుష్పమృద్వంగీ సాతస్యపతితోరసి
వ్యాఘూర్ణితాలినయనా సుతరోరివమంజరీ. 29

ఇట్లు వచించి, పుష్పమువంటి కోమలమైన యంగములుగల నా యప్సరస భ్రమరములను నేత్రములచే కంపితమగు కల్పవృక్షలతవోలె, శుక్రాచార్యుని వక్షముపై బడెను.

తౌదంపతీతత్ర విలాసకాంతీ
వివేశతుస్తాసు వనస్థలీషు
కింజల్కగౌరానిలఘూర్ణితాసు
రక్తాద్విరేఫావివ పద్మినీషు 30

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
భార్గవోపాఖ్యానే నవసంగమోనామ సప్తమః
సర్గః ॥ 7 ॥

అటుపిమ్మట వారిరువురును పుష్ప పరాగములచే పీతవర్ణయుక్తమైనట్టి వాయువుచే చలింపఁ జేయుచున్న వృక్షములుగల ఆ వనప్రదేశములందు ప్రవేశించి సరోవరములందలి భ్రమరీభ్రమరముల వలె, సుఖభోగ మనుభవించిరి.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు స్థితిప్రకరణమున
భార్గవోపాఖ్యానమందు నవసంగమమను సప్తమ
సర్గము ॥ 7 ॥

---

## అష్టమః సర్గః

---

శ్రీవసిష్ఠ ఉవాచ :—

ఇతిచిత్తవిలాసేన చిరముత్ప్రేక్షితైఃప్రియైః
ప్రణయైర్భార్గవస్యాసీ త్తుష్టయేసుసమాగమః. 1

శ్రీ వసిష్ఠుడు :— ఓ రామా ! ఇట్లు చిత్తవిలాసంబుచేతను చిరకాలకల్పితప్రేమ భావాకారంబులను సిద్ధించిన యా సమాగమము శుక్రాచార్యునికి ప్రసన్నత్వమునే గలుగజేసెను.

మందారమాలాకలయా విబుధాసవమత్తయా
తదా తేనతయాసార్ధం ద్వితీయేనామలేందునా. 2

విహృతంమత్తహంసాసు హేమపంకజినీషుచ
తటీష్వమరవాహిన్యాః సహచారణకింనరైః 3

మందారమాలలను దేహమందంతటను ధరించి అమృతపానముచే (లేక, దేవభోగ్యమగు మధువిశేషమును సేవించుటచే) మత్తులై అపుడా యప్సరసతోగూడ, ద్వితీయచంద్రసదృశుండగు శుక్రాచార్యుడు విహరించెను. మఱియు హంసలును, సారసపక్షులును గలదియు, వికసించుచున్న సువర్ణ కమలములతో కూడినదియు నగు మందాకినీ తటప్రదేశములందు చరణ, కిన్నరులతోగూడ నా యప్సరాసహితుడై విహరించెను.

పీతమిందుదలస్యంద్రైర్ద్వైఃసహరసాయనమ్
పారిజాత లతాజాల నిలయేషువిలాసినా. 4

మఱియు చంద్రవినిర్గతమగు అమృతమును, పారిజాత లతాసమూహములతో గూడిన వన కుంజములందు దేవతలతోగూడ నా విలాసస్వభావుఁడగు శుక్రుడు పాన మొనర్చెను.

చారుచైత్రరథోద్యాన లతాలోలాసుదోలయా
చిరంవిలసితంవ్యగ్రైః సహావిద్యాధరీగణైః. 5

మనోహరములగు నందనవనవాటికలందలి లతాసమూహములతో నొప్పు చంచలమగు ఊయలలందూగుచుండు విద్యాధరీగణములతోగూడి చాలకాలము క్రీడించెను.

నందనోపవనాభోగో మందరేణేవవారిధిః
భృశమాలోడ్యతాంనీతః ప్రథమైఃసహశాంభవైః. 6

శివుని యనుచరులగు ప్రమథగణంబులతో గలసి, మందర పర్వతము సముద్రమును గలయ బెట్టిన విధమున ఆ నందనవనమంతయును గలయబెట్టెను (పరిభ్రమించెను).

బాలహేమలతాజాల జటాలాసునదీషుచ
భ్రాంతమున్మత్తనాగేన మైరవీష్వబ్జినీష్వివ. 7

సువర్ణమువంటి లతాసమూహములను జడలుగల్గి శోభించుచున్న మేరుపర్వతనదులందు, కమలములను మత్తగజంబుమాడ్కి సంచరించెను.

కైలాసవనకుంజేషు తయాసహవిలాసినా
హారేందుధవలారాత్ర్యః క్షపితాగణగీతిభిః. 8

కైలాసవన కుంజములందు, విలాసియగు నాశుక్రుడు అప్సరసతోగూడ విద్యాధరుల గీతములను వినుచు శివుని చూడామణియొక్క కాంతులచే ధవళ మొనర్పబడిన కృష్ణపక్ష రాత్రులను గడపెను.





గంధమాదనశైలస్య విశ్రమ్యోపరిసానుషు
సా తేనకనకాంభోజై రాపాదమభిమండితా. 9.

గందమాదన పర్వతశిఖరములపై విశ్రమించి శుక్రాచార్యుడు సువర్ణకమలములచే నా యప్సరసను, ఆపాదమస్తక మలంకరించు చుండెను.

లోకాలోకతటాంతేషు విచిత్రాశ్చర్యహారిషు
క్రోడితంకృతహాసేన రామ తేనతయాసహ. 10

ఓ రామా ! ఆశ్చర్యయుతములగు పలువిధ విచిత్రవిషయములచే చిత్తమును హరింపజేయు లోకాలోక పర్వతప్రాంతములందాయప్సరసతోఁగలసి శుక్రాచార్యుడు క్రీడించెను.

మందరాంతరకచ్ఛేషు సార్ధంహరిణశావకైః
అవసత్సనమాఃషష్టిం కల్పితామరమందిరే. 11

మందర పర్వతమందలి సజల ప్రదేశములందు హరిణకిశోరములతో గూడి మనోహరముగ నున్న దేవమందిరమున శుక్రాచార్యు డఱువది వత్సరములు గడపెను.

క్షీరార్ణవతటీష్వస్య వనితాసహచారిణః
క్షీణంకృతయుగాదర్ధం శ్వేతద్వీపజనైఃసహ. 12

క్షీరసాగరతటములందా యప్సరసతో గలసి సంచరించుచు, శ్వేతద్వీపనివాసులతోడ కృతయుగమందలి సగము భాగము గడపెను.

గంధర్వనగరోద్యాన లీలావిరచనైరసౌ
స్రష్టానంతజగత్సృష్టేః కాలస్యానుకృతింగతః. 13

అంత నా శుక్రుడు గంధర్వనగర, యుద్యానవనముల నిర్మించుచు క్రమముగ సంకల్ప మాత్రమున సర్వజగత్తును సృజించుచు కాల సాదృశ్యము నొందెను.

అథావసదసౌశుక్రః పురందరపురేపునః
సుఖంచతుర్యుగాన్యష్టౌ హరిణేక్షణయాసహ. 14

పిదప మృగనేత్రయగు నా యప్సరసతోగూడ యెనిమిది చతుర్యుగముల వఱకును మరల నా యింద్రపురము (స్వర్గము) ననే శుక్రాచార్యుఁడు వసించెను.

పుణ్యక్షయానుసంధానాత్తతశ్చావనిమండలే
తద్రైవసహమానిన్యా పపాతోపహతాకృతిః. 15

అపుడు పుణ్యక్షయానుసంధానముచేతను, అంతఃపతన భయముచేతను దివ్యశరీరము నశింప, శుక్రాచార్యుఁడా మానినియగు అప్సరసతోగూడ భూమండలముపై బడెను.

పరాలూనసమస్తాంగో హృతస్యందననందనః
చింతాపరవశోధ్వస్తః సమితీవహతోభటః. 16

ఛిన్నాంగుడును దేవతలచే హరింపబడిన నందనవనములును, విమాన, వస్త్ర, ఆభూషణాది సాధనములును, గలవాడును నైనందుచే శుక్రాచార్యుడపుడు చింతాపరవశుడై యుద్ధమందు వధింపబడిన శూరునివలె క్రిందపడెను.

పతితస్యావనౌ తస్య చింతయాసహదీర్ఘయా
శరీరంశతధాజాతం శిలాపాతీవనిర్ఘరః. 17

పాషాణశిలపై బడిన సెలయేరువలె, ప్రబల చింతాయుక్తుడై భూమిపై బడినట్టి ఆ శుక్రుని దేహము నూఱు వ్రక్కలయ్యెను.

సంశీర్ణయోర్దేహకయో శ్చిత్తే కేవ్యసనావితే
విచేరతు స్తయోర్వ్యోమ్ని నిర్నీడౌ విహగౌయథా. 18

ఛిన్నదేహులగు వారిరువుర దుఃఖమయమగుచిత్తము (సూక్ష్మశరీరము) లును, గూటిని విడచిన పక్షిద్వయమువలె సంచరించుచుండెను.

తత్రావివిశతుశ్చాంద్రం తేచిత్తేరశ్మిజాలకమ్
ప్రాలేయతాముపేత్యాశు శాలితామథజగ్మతుః. 19

అటుతరువాత వారి లింగశరీరములు రెండును ఆకాశమున చంద్రకిరణములందు ప్రవేశించెను. అటనుండి హిమజలరూపమును బొంది ధాన్యవృక్షమును ప్రవేశించినవాయెను.

శాలీంస్తాన్ భుక్తవాన్ పక్వాన్ దశార్ణేషుద్విజోత్తమః
సశుక్రఃశుక్రతామేత్య తద్భార్యాతనయోఽభవత్. 20

ఆదనంతరము దశార్ణమనుదేశమందలి యొకబ్రాహ్మణోత్తముడా పక్వమగుధాన్యమును భుజించెను. అంత, శుక్రాచార్యుడు వీర్యరూపమునుబొంది వానికి పుత్రుడై జనించెను.

తతోమునీనాంసంసర్గా త్తపస్సుగ్రేవ్యవస్థితః
అనసన్మేరుగహనే మన్వంతరమనిందితః. 21

అపుడు మునుల సంసర్గమును బడయుచు మేరుపర్వత గహనప్రదేశమగు ఇలావృత్తాదివర్షమందు యుగ్రతపమొనర్చుచు శుక్రాచార్యుడొక మన్వంతరకాలము నివసించెను.

తత్రతస్యసముత్పన్నో మృగ్యాఃపుత్రోనరాకృతిః
తత్స్నేహేనపరంమోహం పునరప్యాయయాక్షణాత్. 22

పిదప శాపముచే నట మృగరూపమునొందిన అప్సరసవలన మనుజాకారముగల పుత్రుడు వానికి గలిగెను. వానియందలి స్నేహభావముచే మరల క్షణములో విమోహితుడయ్యెను.

పుత్రస్యాస్యధనంమేస్తు గుణాశ్చాయుశ్చశాశ్వతమ్
ఇత్యనారతచింతాభి ర్జహౌసత్యామవస్థితమ్. 23

'ఈ నాపుత్రునకు ధనము, గుణము, దీర్ఘాయువు గలుగుగాక' యనునిట్టి యనవరతచింతచే నపుడు శుక్రాచార్యుడు వేదవిహితములగు సత్యతపదానాదులనుగూడ త్యజించెను.



ధర్మచింతాపరిభ్రంశా త్పుత్రార్థంభోగచింతయా
క్షీణాయుషంతమహర న్మృత్యుఃసర్పఇవానిలమ్. 24

ధర్మమార్గమునుండి పతితుడై పుత్రుని భోగముకొఱకై చింతించుచుండుటచే క్షీణాయుష్కుండు కాగా, అపుడు సర్పము వాయువును మ్రింగునట్లు మృత్యువు వానిని మ్రింగివైచెను.

భోగైకచింతయాసార్ధం సముత్క్రాంతచేతనః
ప్రాప్యమద్రేపుత్రత్వ మాసీన్మద్రమహీపతిః. 25

వాని లింగశరీరమపుడు భోగచింతనతో కూడియుండి వినిర్గతమైనందును మద్రదేశాధీశునకు పుత్రుడై జనించి మద్రదేశాధిపతి యాయెను.

మద్రదేశేచిరంకృత్వా రాజ్యముత్పన్నశాత్రవమ్
జరామభ్యాజగామాత్ర హిమాశనిరివాంబుజమ్. 26

శత్రునాశమొనర్చుచు చిరకాలము మద్రదేశమును పాలించుచుండ నంత కమలముపై హిమమును వజ్రపాతముబడునట్లు వృద్ధావస్థ వానినాక్రమించెను.

మద్రరాజతనుంచారుం తపోవాసనయాసహ
తత్యాజతేనజాతోసౌ తపస్వీతాపసాత్మజః. 27

అపుడు వానప్రస్థాశ్రమయోగ్యమగు తపస్సంస్కారము గలవాడై యాతడు తన రాజత్వమును త్యజించి తాపసి యాయెను.

సమంగాయామహానద్యా స్తటమాసాద్యతాపసః
తపస్తేపేమహాబుద్ధిః సరామవిగతజ్వరః. 28

ఓ రామా! రాగాదిరహితుడై మహాబుద్ధిమంతుడును తపస్వియునగు నా శుక్రాచార్యుడపుడు సమంగయను నదీతటమునుజేరి యట తపంబొనర్చెను.

వివిధజన్మదశాంవివిధాశయః
సమనుభూయశరీరపరంపరాః
సుఖమతిష్ఠదసౌభృగునందనో
వరనదీసుతటేద్రుఢవృక్షవత్. 29

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
భార్గవోపాఖ్యానే శుక్రవివిధజన్మానుభవో
నామాష్టమః సర్గః ॥ 8 ॥

ఓ రామా! భృగునందనుడగు శుక్రాచార్యుడు పలువిధవాసనలతోగూడి వానిచే ననేకజన్మపరంపరలను బొందుచు పిదప సమంగయను యుత్తమ నదీతటమున వృక్షమువోలె స్థిరముగ యాసీనుడై తపంబొనర్చుచు సుఖముగ నుండెను.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు స్థితిప్రకరణమున
భార్గవోపాఖ్యానమందు శుక్రవివిధజన్మానుభవమను
అష్టమ సర్గము ॥ 8 ॥

---

## నవమః సర్గః.

---

శ్రీవసిష్ఠ ఉవాచ :—

ఇతిచింతయత స్తస్య శుక్రస్యపితురగ్రతః
జగామాతితరాంకాలో బహుసంవత్సరాత్మకః. 1

శ్రీ వసిష్ఠుడు :—ఓ రామా ! తండ్రియగు భృగువుయెదుటనున్న శుక్రాచార్యుడిట్లు చింతనచేయుచుండ యనేక వత్సరములు గడచెను.

అథకాలేనమహతా పవనాతపజర్జరః
కాయ స్తస్యపపాతోర్వ్యాం ఛిన్నమూలఇవద్రుమః. 2

ఇట్లు చాలకాలమైన పిదప వాయ్వాతపంబులచే శిథిలమైన శుక్రునిదేహము మూలచ్ఛిన్న వృక్షమువోలె భూమిపైపడెను.

మనస్తుచంచలాభోగం తాసుతాసుదశాసుచ
బభ్రామాతివిచిత్రాసు వనరాజిష్వివైణకః. 3

వాని చంచలమానసము వనములందలి హరిణమువలె, అనేక విచిత్రదశలందు పరిభ్రమించుచుండెను.

భ్రాంతముద్భ్రాంతమభితే శ్చక్రార్పితమివాకులమ్
మన స్తస్యవిశశ్రామ సమంగాసరిత స్తటే. 4

ఆ శుక్రుని మనంబు భోగకల్పనచే వ్యాకులమై చక్రమందు తగుల్కొనిన పదార్థమువలె తిరుగుచు, జననమరణంబుల నొందుచు ఊర్ధ్వాధోలోకముల దిరుగాడుచు, తుదకు సమంగానదీతీరమున విశ్రాంతినొందెను.

అనంతవృత్తాంతఘనాం పేలవాంసుదృఢామపి
తాంసంసృతిదశాంశుక్రో విదేహోఽనుభవన్స్థితః. 5

వివిధవృత్తాంతసంకలితమును, మనఃకల్పనామాత్రమున తుచ్ఛమును, పూర్వదేహ విస్మరణముచే నతి దృఢమునునగు సంసారదశను శుక్రాచార్యు డనుభవించుచుండెను.

మందరాచలసానుస్థా సాతనుస్తస్యధీమతః
తాపప్రసరసంశుష్కా చర్మశేషాబభూవహ. 6



మందరపర్వత శిఖరముపైనున్న ధీమంతుడగు శుక్రుని యా శరీరము సూర్యతాపముచే శుష్కించి చర్మమాత్రావశిష్టమయి యుండెను.

శరీరరంధ్రప్రసహ ద్వాతసీత్కారరూపయా
చేష్టాదుఃఖక్షయానందా త్కాకల్యేపప్రగాయతి. 7

వాని దేహరంధ్రములగుండ వాయువు జనుచు సీత్కార శబ్దమొనర్చుచుండ, అభిమాన, దుఃఖక్షయముచేగల్గిన యానందవశమున దేహమునకిట్టి స్థితియే సంభవించునని పాడుచున్నదా యనునట్లుండెను.

మనోనరాకమన కే లుఠింత్రతంభవభూమిషు
హసతీవేతిశుభ్రాభ సితయాదంతమాలయా. 8

వాని ధవళమేఘమువంటి స్వచ్ఛమైన దంతములంజూడ, యీ దీనమనంబు సంసార మరుభూములందు వ్యర్థముగ సంచరించుచున్నదని తలంచి నవ్వుచున్నదా యనునట్లుండెను.

దర్శయంతీజగచ్ఛూన్యం వపురక్ష్ణోరకృత్రిమమ్
ముఖారణ్యాజగత్కూప రూపయాగ ర్తశోభయా. 9

ఆతని ముఖమండలములందలి పురాతన వనకూపములనుబోలిన నాసికారంధ్రములును, నేత్రాదిముఖచ్ఛిద్రములున్ను స్వభావముగనే శూన్యరూపమగు యీజగత్తుయొక్క అసద్రూపత్వమును వివేకులకు ప్రత్యక్షముగ జూపుచున్నవా యనునట్లుండెను.

తాపోపతప్తాసంసిక్తా వర్షాజలభరేణసా
ప్రాగనుస్మరణోల్లాస మివబాష్పంవిముంచతి. 10

ప్రథమమున సూర్యతాపముచే సంతప్తమై పిదప వర్షాజలముచే తడుపబడినట్టి యా శుక్రుని దేహము బంధురూపములగు తన పూర్వశరీరములను తలంచుచు ఆనందోల్లాసముచేగాని, దుఃఖాతిశయముచేగాని బాష్పముల రాల్చుచున్నదా యనిపించుచుండెను.

చంద్రానిలవిలాసేస లులితా వనభూమిషు
ధారానికరపాతేన విన్నాజలదాగమే. 11

వానిదేహము వనభూములందు చంద్రకిరణయుక్తమగు శీతలవాయువుచే కదల్పబడుచు, వర్షధారలచే తడుపబడుచు నుండెను.

ప్రావృణ్నిర్ఝరరూపేణ ప్లుతాగిరినదీతటే
పాంశునాపవనోత్థేన దుష్కృతేనేవరూషితా. 12

వర్షాకాలమున గైర్వాది ధాతువులచే రంజితమైన పర్వత నదీతటమున వాయువుచే నెగురగొట్టబడిన ధూళితో గూడినదై పాపసందూషితచిత్తునివలె పొరలుచుండెను.

శుష్కకాష్ఠనదాలోలా వాతేషుకృతఖాకృతిః
తారమారుతసీత్కారే వనేతపఇవాస్థితా. 13

అయ్యది వాయుతాడితమైనపుడు శబ్దమొనర్చుచు శిథిలకాష్ఠమువలె గన్పట్టును. మఱియు నా దేహము నిరంతరము వాయువుయొక్క సీత్కారశబ్దముతో కూడియుండి వనమున తపంబొనరించుచున్నదా యనునట్లుండెను.

వక్రాశుష్కాంత్రతంత్రీచ భూతభాంకారకారిణీ
అరణ్యలక్ష్మీర్వ్యాబల్యేవ శూన్యాచర్మమయోదరీ. 14

వక్రములును, శుష్కించినవియునగు ప్రేవులనునట్టి వీణనుజేబట్టి ప్రాణులకు భయమును గొల్పునట్టి శబ్దమొనర్చుచు, శూన్యమును, చర్మమాత్రావశిష్టమునునగు దేహముగల్గి యలక్ష్మివన లక్ష్మి యాదరార్థము చేష్టసల్పుదా యనునట్లుండెను.

రాగద్వేషవిహీనత్వా త్తస్యపుణ్యాశ్రమస్యతు
మహాతపస్త్వాచ్ఛభృగో ర్నభుక్తామృగపక్షిభిః. 15

భృగుమహర్షి యొక్క ఆ పుణ్యాశ్రమము రాగద్వేష విరహితమైయుండుటచేతను, అతని తపఃప్రభావ మట వ్యాప్తమైయుండుటచేతను, శుక్రుని యాదేహము మృగములచే గాని పక్షులచేగాని భక్షింపబడక యుండెను.

యమనియమకృశీకృతాంగయష్టి
శ్చరతితపఃస్మభృగూద్వహస్యచేతః
తనురథపవనాపనీతరక్తా
చిరమలుఠన్మహతీషుసాశిలాసు. 16

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే ఉత్పత్తిప్రకరణే
భార్గవోపాఖ్యానే భార్గవకలేవరవర్ణనం నామ
నవమః సర్గః ॥ 9 ॥

ఓ రామా ! తన కల్పితశరీరమును యమనియమాదులచే శోషింపజేయుచు భృగుని పుత్రుడగు శుక్రాచార్యుని మనంబు సమంగా నదీతటమున తపంబొనర్చుచున్నది. వాయ్వాదులచే శుష్కింపబడినట్టి వాని పూర్వదేహము దీర్ఘపాషాణశిలలపై చిరకాలము పొర్లుచునుండెను.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు స్థితిప్రకరణమున
భార్గవోపాఖ్యానమందు భార్గవకలేవరవర్ణనమను
నవమ సర్గము ॥ 9 ॥

---

## దశమః సర్గః.

---

శ్రీవసిష్ఠ ఉవాచ :—

అథవర్షసహస్రేణ దివ్యేనపరమేశ్వరః
భృగుఃపరమసంబోధా ద్విరరామసమాధితః. 1



శ్రీవసిష్ఠుడు :— ఓ రామా ! అటు పిదప వెయ్యి దేవవత్సరములు గతించిన మీదట మహాత్ముడగు నా భృగువు పరమాత్మావబోధకమగు నిర్వికల్పసమాధినుండి లేచెను.

నాపశ్యదగ్రేతనయం వినయావనతాననమ్
సామంతంగుణసేనాయాః పుణ్యాంమూర్తిమివస్థితమ్. 2

అపుడు వినయముచే నమ్రముడైయుండువాడును, గుణసమూహములను సేనకు ఆధారభూతుడును (సర్వగుణసంపన్నుడును) నగు శుక్రాచార్యుని తనయెదుట గాంచకుండెను.

అపశ్యత్కేవలంకాయ కంకాలంపురతోమహత్
దేహాయుక్తమివాభాగ్యం దారిద్ర్యమివమూర్తిమత్. 3

అతడు తనయెదుట కేవలమాతని మృతశరీరమును మాత్రము దేహమును ధరించిన యభాగ్యమునువలెను, మూర్తివంతమగు దారిద్ర్యమును వలెను గాంచెను.

తాపశుష్కవపుఃకృత్తి రంధ్రస్ఫురితతిత్తిరి
సంశుష్కాంత్రోదరగుహా ఛాయావిశ్రాంతదర్దురమ్. 4

సూర్యతాపముచే శుష్కించిన అతని దేహముయొక్క రంధ్రములందు తిత్తిరిపక్షులు గూళ్లుకట్టుకొని యుండెను. మఱియు, శుష్కించిన ప్రేవులుగల నాతని యుదరచ్ఛాయయందు మండూకములు విశ్రమించుచుండెను.

నేత్రగర్తకసంసక్త ప్రసూతనవకీటకమ్
పర్శుకాపంజరప్రోత కోశకారకృమివ్రజమ్. 5

నేత్రమను గోతియందు కృమికీటాదులు వసించుచుండెను. వాటినుండి యింకను అనేక కృమిజాలము లుత్పన్నమయి యభివృద్ధిజెందుచుండెను. పార్శ్వమందలి యెముకలలో పట్టుపురుగులు తమ జాలముల విస్తరించియుండెను.

ప్రాక్తనీముపభోగేహా మిష్టానిష్టఫలప్రదామ్
ధారాదాతాంత్రయాతద్వ ద్భృశంశుష్కాస్థిమాలయా. 6

జలధారలచే ధూళియుక్తమొనర్పబడిన ప్రేవులతోను శుష్కించిన యెముకలమాలలతోను గూడిన, ఆతని శరీరము ఇష్టానిష్ట ఫలములనొసంగు తన పూర్వకాలపు వాసనల సాదృశ్యమును నొందుచుండెను. అనగా అనేకగ్రంథులతోగూడిన వానియెముకలమాల వాసనామాలవలె గన్పట్టుచుండెను.

శిరోఘటేనశుభ్రేణ మసృణేనేందువర్చసా
విడంబయచ్చకర్పూరా ప్లుతలింగశిరఃశ్రియమ్. 7

చర్మము తొలగుటచే చంద్రునివలె ప్రకాశమానముగను, నునుపుగను, తెల్లగనునున్న శిరస్సను ఘటముతోకూడి యాతనిశరీరము కర్పూరముచే నభిషేకమొనర్పబడిన శివలింగమువలె శోభించుచుండెను.

ఋజ్వ్యాసంశుష్కశిరయా స్వాస్థిమాత్రావశేషయా
గ్రీవయాత్మానుసృతయా దీర్ఘీకుర్వదివాకృతిమ్. 8

ఋజువుగనున్నదియు, శుష్కించిన శిరస్సుగలదియు, కేవలమస్థిమాత్రమైయున్నదియు, నగు వానిశరీరము వాసనలందు తగుల్కొనుచున్న యాత్మ ననుసరించు కంఠముచే, తన యాకారమును యింకను దీర్ఘముగ నొనర్చుచున్నట్లుండెను.

మృణాలికాపాండురయా ధారావభృతమాంసయా
నాసాగ్రాస్థికయావక్త్రే కృతసీమాకృతిందధత్ 9

కమలనాళమువలె తెల్లనిదియు, జలధారచే శిథిలమైన మాంసముగలదియు నగు నాసిక యందలి యెముక, ముఖమండల మధ్యభాగమును నిశ్చయించుటకై నాటబడిన మేకువలె గన్పట్టుచుండెను.

దీర్ఘకంధరయానూన మున్నతీకృతవక్త్రయా
ప్రేక్షమాణమివప్రాణా నుత్క్రాంతానంబరోదరే. 10

ఊర్ధ్వముఖముగల్గి యొప్పుచున్న దీర్ఘకంఠముగల యాతనిదేహము తనప్రాణములాకసమున నెచటికి బోయెనో జూచుచున్నట్లుండెను.

జంఘోరుజానుదోర్దండై ర్ద్విగుణాందీర్ఘతాంగతైః
ప్రతిష్ఠానమివాశాంతం దీర్ఘాంధ్వశ్రమభీతితః. 11

రెండింతలు పొడవైన యాతనిజంఘములు, తొడలు, జానువులు, భుజములను ఈ యెనిమిది అవయవములతో కూడిన మాతని శరీరము దీర్ఘమగు పరలోకమార్గమునుగూర్చిన భయముచే అష్టదిగంతములకు పరుగిడదలంచుచున్నదా యనిపించుచుండెను.

ఉదరేణాతిరిక్తేన చర్మశేషేణశోషిణా
ప్రదర్శయదివాజ్ఞస్య హృదయస్యాతిశూన్యతామ్. 12

అన్నిటికంటెను విలక్షణమై యొప్పుచు చర్మమాత్రము శేషించిన శుష్కోదరముచే నయ్యది అజ్ఞానియొక్క హృదయశూన్యత్వమును ప్రదర్శింపుచుండెను.

ప్రేక్ష్యైతచ్ఛుష్కకంకాల మాలానందుఃఖదంతినః
పూర్వాపరపరామర్శ మకుర్వన్భృగురుత్థితః. 13

ఓ రామా! దుఃఖమను యేనుగకు కట్టుకంబమగు నా మృతశరీరమునుగాంచి పూర్వాపరములను విచారింపక నా భృగువు లేచినిలంబడెను.

ఆలోకసమకాలేహి ప్రతిభానంతతోభృగోః
చిరముత్క్రాంతజీవఃకిం మత్పుత్రోఽయమితిక్షణాత్. 14

పుత్రునిదేహము వీక్షించినతోడనే భృగుని చిత్తమున 'ఏమి, నా పుత్రుడు మృతించి చాల కాలమాయెనా' యను సందేహము పొడమెను.



అచింతయతపవాస్య భవిష్యంతనయంతతః
కాలంప్రతిబభూవాశు కోపఃపరమదారుణః. 15

మృతించిన తనయునిజూడగనే, భవిష్యత్తునుగూర్చి చింతింపని యాతని చిత్తమున శీఘ్రముగ యమునియెడ మిక్కిలి క్రోధము జనించెను.

అకాలఏవమత్పుత్రో నీతఃకిమితికోపితః
కాలాయశాపముత్స్రష్టుం భగవానుపచక్రమే. 16

ఆ సమయముననే 'నా పుత్రునియేల గైకొనిపోయెన'ని క్రుద్ధుడై, మహనీయుడగు నా భృగువు యముని శపించుట కుద్యుక్తుడాయెను.

అథాకలితరూపోఽసౌ కాలఃకవలితప్రజః
ఆధిభౌతికమాస్థాయ వపుర్మునిముపాయయౌ. 17

అప్పుడు ప్రజలందఱను గ్రసించివేయు కాలుడు రూపరహితుడైనను భౌతికరూపమును [illegible]ంచి భృగుమునిచెంతకు వచ్చెను.

ఖడ్గపాశధరఃశ్రీమాన్ కుండలీకవచాన్వితః
షడ్భుజఃషణ్ముఖోబాహ్యై వృతఃకింకరసేనయా. 18

ఆ కాలుడు ఖడ్గము, యురిత్రాడు ధరించి శోభాయుక్తుడై, కుండలకవచముతో నొప్పుచు, పండ్రెండు నెలలను యాఱు భుజములుగల్గి, షడ్రుతువులను ముఖముచే శోభించుచు, దినములను గొప్పసేనచే సేవింపబడుచునుండెను.

యచ్ఛరీరసముత్థేన జ్వాలాజాలేనవల్గతా
ఫుల్లకింశుకవృక్షస్య బభారాద్రేఃశ్రియంసభః. 19

అప్పుడు వానిదేహమునుండి వినిర్గతమైన జ్వాలాసమూహముచే నాకసము వికసితకింశుకవృక్షసహితంబగు పర్వతముయొక్క శోభను పొందెను.

యత్కరస్థత్రిశూలాగ్ర నిఃసృతైరగ్నిమండలైః.
విరేజురుద్ధైరాశాః కానకై రివకుండలైః. 20

వాని హస్తమందలి త్రిశూలముయొక్క అగ్రభాగమునుండి బయల్వెడలిన అగ్నిసమూహములచే దిక్కులన్నియు సువర్ణమయకుండలములవలె శోభించెను.

యత్పరశ్వసనాపాస్త శిఖరామేదినీభృతః
దోలామివసమారూఢాశ్చేలుః పేతుశ్చఘూర్ణితాః. 21

వాని ప్రబలమగుశ్వాసవాయువుచే విధ్వంసమైన శిఖరములుగల పర్వములెన్నియో యూయెలలవలె దోలాయమాన మగుచుండెను. మఱియు ఎన్నియో క్రిందబడుచునుండెను.

యత్ఖడ్గమండలోద్యోతైః శ్యామంబింబంవినస్వతః
కల్పదగ్ధజగద్ధామ పర్యాకులమివాబభౌ. 22

గాని ఖడ్గప్రకాశముచే సూర్యబింబము శ్యామవంతమై ప్రలయకాలమున దగ్ధమొనర్పబడు జగత్తునుండి వెలువడునట్టి ధూమపటలములచే వ్యాకులమగు చందమున గన్పట్టుచుండెను.

సఉపేత్యమహాబాహో కుపితంతంమహామునిమ్
కల్పక్షుబ్ధాబ్ధిగంభీరం సాంత్వపూర్వమువాచహ. 23

దీర్ఘబాహుండవగు నోరామా! ఇట్లా కాలుఁడు క్రుద్ధుడైన నా మహాముని సమీపంబు నకు వచ్చి ప్రలయకాల సంక్షుబ్ధసాగరమువలె గంభీర నిస్వనమున శాంతిపూర్వకముగ నిట్లు బల్కెను.

విజ్ఞాతలోకస్థితయో మునేదృష్టపరావరాః
హేతునాపినముహ్యంతి కింనుహేతుంవినోత్తమాః. 24

లోకముయొక్క యథార్థస్థితి నెఱింగినవారును, పరావరముల (ఇహపరముల) రెంటిని గర్శించినవారును, మహాత్ములునగు మునులు యితరులపరాధ మొనర్చినను గూడ విమోహితులు గాకయుందురు. అట్టిచో నిక అపరాధము లేకయే మోహితులగుదురా?

త్వమనంతతపావిప్రో వయంనియతిపాలకాః
తేనసంపూజ్యసేపూజ్యః సాధోనేతరయేచ్ఛయా. 25

మహత్తరమగు తపంబొనర్చు బ్రాహ్మణుఁడవు నీవు! వగుచువు మేమో — నియతిని పాలించువారము; ఈ కారణముచే నీవు మాకు పూజ్యుడవుగాని యితర శాపాదుల భయముచేగాదు.

మాతపఃక్షపయాబుద్ధే కల్పకాలమహానలైః
యోనదగ్ధోస్మిమేతస్య కింత్వంశాపేనధక్ష్యసి. 26

ఓ యల్పబుద్ధీ! నీ తపస్సును వ్యర్థముగ నష్టమొనర్పకుము. ప్రలయకాల భీషణయగ్ని జ్వాలలచేగూడ నేను దహింపబడకున్నపుడు యిక దేనిచే నీవు నన్ను నశింపచేయ గలవు?

సంసారావలయోగ్రస్తా నిగీర్ణారుద్రకోటయః
భుక్తానివిష్ణువృందాని క్వనశక్తావయంమునే. 27

నేనేనేక జగంబుల భక్షించితిని, కోట్లకొలది రుద్రులను మింగవైచితిని; అనేక విష్ణువుల గ్రసించితిని; కాన నో మునీంద్రా! మా కశక్యమగున దేదికలదు?

భోక్తారోహివయంబ్రహ్మన్ భోజనంయుష్మదాదయః
స్వయంనియతిరేషాహి నావయోరేతదీహితమ్. 28

ఓ మహాత్మా! మేము భోక్తలము. యుష్మదాదులు మాకు భోజనము. ఇయ్యది స్వభావసిద్ధమగు నియతియే యగునుగాని ఇచ్ఛాద్వేషాది అన్యనిమిత్తములచే ప్రేరితులమై మేమొనర్చు క్రియగాదు.

స్వయమూర్ధ్వంప్రయాత్యగ్నిః స్వయంయాంతిపయాంస్యధః
భోక్తారంభోజనంయాతి సృష్టించాప్యంతకఃస్వయమ్. 29



అగ్ని సహజముగనే యూర్ధ్వముఖముగ జ్వలించును. జలము స్వభావముగనే క్రిందికి ప్రవహించును. అట్లనే భోక్తచెంతకు భోజనము ప్రాప్తించును. నాశకులుడగు కాలుఁడును సృష్టిచెంతకు స్వయముగ ప్రాప్తించును.

ఇదమిత్థంమునేరూపం మమేహపరమాత్మనః
స్వాత్మనిస్వయమేవాత్మా స్వతఏవవిజృంభతే. 30

ఓ మునీంద్రా! ఇట్లు పరమాత్మస్వరూపమగు యీ సాకార నిరాకార జగంబు నాకు భోజ్యపదార్థముగ కల్పింపబడినది. ఏలయన, ఆ పరమాత్మ తనయందు తానే జగద్రూపముగ విజృంభించుచున్నాడు.

నేహకర్తానభోక్తాస్తి దృష్ట్యానష్టకలంకయా
బహవశ్చేహకర్తారో దృష్ట్యాఽనష్టకలంకయా. 31

మాయాకళంకరహితమగు దృష్టియందు కర్తయును లేడు భోక్తయును లేడు. కాని యట్టి మాయాదోషము నశింపనివారి దృష్టియందే అనేక కర్తలును, అనేక భోక్తలును గలరు.

కర్తృతాకర్తృతేబ్రహ్మన్ కేవలంపరికల్పితే
అసమ్యగ్దర్శనేనైవ నసమ్యగ్దర్శనస్యతే. 32

ఓ మహాత్మా! కర్తృత్వము, అకర్తృత్వము — ఈ రెండును కల్పితములే యగును. అసమ్యగ్ — దృష్టి లేనివానిచే నివి కల్పింపబడినవిగాని, సమ్యగ్ — దృష్టిగల జ్ఞానిచేగాదు.

పుష్పాణి తరుఖండేషు భూతానిభువనేషుచ
స్వయమాయాంతియాంతీహ కల్పతేహేతునామభిః. 33

వృక్షమునందలి పుష్పములెట్లుత్పన్నమగుచు నశించుచునుండునో, అట్లనే లోకమునందలి ప్రాణికోట్లన్నియు యుత్పత్తి వినాశముల నొందుచున్నవి. జీవుల కర్మయే స్వయముగ తన వైచిత్ర్యమనుసరించి కార్యమొనర్చుటయందు సమర్థమగును.

అబ్బింబితస్యచంద్రస్య చలనేకర్తృకర్తృతే
నసత్యేనాస్యతేయద్వ త్తద్వత్కాలస్యసృష్టిషు. 34

జలమందు ప్రతిబింబించిన చంద్రునియొక్క చలనము సత్యముగాకయు, అసత్యముగాకయు నుండునట్లు భగవంతుడగు కాలుని సృష్టియందు కర్తృత్వాకర్తృత్వములు రెండును పరమార్థస్థితి యందు సత్యములుగాకయు, వ్యవహార దృష్టియం దసత్యములు గాకయు నుండును.

మనోమిథ్యాభ్రమాభోగే కర్తృతాకర్తృతామయీమ్
కరోతికలనాంరజ్జ్వాం భ్రాంతేక్షణఇవాహితామ్. 35

ఓ మునీంద్రా! ఈ మనస్సు మిథ్యాభ్రమయందు తగుల్కొని భ్రాంతిచే, మనుజుడు రజ్జువునందు సర్పమును గల్పించునట్లు, కర్తృత్వాకర్తృత్వమయమగు యనర్థకల్పన గావించుచున్నది.

తేనమాగామునేకోప మాపదామీదృశక్రమః
యస్యథాతత్తథావాశు సత్యమాలోకయాకులః. 36

కాన నో మునీంద్రా ! వ్యాకుల చిత్తుడవై, అపరాధము లేకయే మమ్ముల కోపగింపకుము. అట్లుచేయుట యాపదలకు హేతువగును. కాన విషయమును సత్యదృష్టితో శీఘ్రముగ నవలోకింపుము.

నవయంప్రతిభార్థేహో నాభిమానవసీకృతాః
స్వతోహితాతవశగాః కేవలంనియతౌస్థితాః. 37

పూజ్యుడవగునో మునిసత్తమా ! మేమొనర్చు కార్యములు పూజాప్రతిష్ఠలకొఱకుగాదు, మఱియు మేమభిమానమునకు వశులమునుకాదు. కేవలము నియతినిపాలించుచు స్వవశముననే యున్నారము. నా యీ యాగమనము కోపభయమునకాదు తాపసులగు మహాత్ములను సన్మానించుటకొఱకే అయియున్నవి.

ప్రకృతవ్యవహారేహో నియతీర్నియ తేర్వశాత్
ప్రాజ్ఞాఃసమభివర్తంతే నాభిమానమహాతమః. 38

జగన్నియామకుడగు ఈశ్వరుని యిచ్ఛారూపమగు పరమోత్తమ నియతి ననుసరించియే బుద్ధిమంతులు వ్యవహరింతురుగాని, అభిమానగ్రస్తులైన తమోగుణాశ్రితులగు జనులద్దాని ననుసరింపకుందురు.

కర్తవ్యమేవనియతం కేవలంకార్యకోవిదైః
సుషుప్తివృత్తిమాశ్రిత్య కదాచిత్త్వంననాశయ. 39

వ్యవహారచతురులు నియతి ననుసరించి కర్తవ్యమగుదానిని తప్పక యొనర్తురు. కాన, తమతమ నియతిని పాలించుట యనునట్టి ప్రసిద్ధధర్మమును తమోగుణవృత్తి నవలంబించి మీరేల నాశ మొనర్చుచున్నారు ?

క్వసాజ్ఞానమయీదృష్టిః క్వమహత్వంక్వధీరతా
మార్గేసర్వప్రసిద్ధేఽపి కిమంధఇవముహ్యసి. 40

ఇపుడాజ్ఞానదృష్టి యెచట ! ఆ మహత్వమెచట ! ఆ ధైర్యమెటకేగినది ! మహాత్ములచే సేవింపబడు యీ సుప్రసిద్ధమార్గమునగూడ మీరజ్ఞులవలె యేల మోహితులగుచున్నారు.

స్వకర్మఫలపాకోత్థా మవిచార్యదశాంమునే
కింమూర్ఖఇవసర్వజ్ఞ ముధామాంశాప్తుమిచ్ఛసి. 41

సర్వజ్ఞుఁడవగు నో మునీంద్రా! కర్మఫలపరిపాకముచే సువ్యక్తమగు స్థితిని విచారింపక, మూఢునివలె నన్నేల వ్యర్థముగ శపింప దలంచుచున్నారు ?

దేహినామిహ సర్వేషాం శరీరంద్వివిధంమునే
కింనజానాసితందేహ మేకమన్యన్మనోభిధమ్. 42

ఓ మునీశ్వరా ! సమస్తప్రాణులయొక్క దేహమును, స్థూలదేహ, మనోరూపంబుల ద్వివిధముగనున్నదను విషయమును మీరెఱుంగరా యేమి ?

తత్రదేహోజడోత్యర్థ మావినాశపరాయణః
మనస్తుచ్ఛంచనియతం కదర్థీక్రియతేతవ. 43



ఆ రెంటిలో స్థూలదేహము జడమైనది; మఱియు స్వల్పకారణముననే నశించు స్వభావము గలది. ఇక ప్రాతిభాసికరూపమగు మనస్సు మోక్షపర్యంతము నశింపకయుండును. అట్లైన, క్రోధాదులచే మీరేల యద్దానిని పీడించుచున్నారు ?

చతురేణయథాసాధో రథఃసారథినోహ్యతే
కుర్వతాకించనస్నేహా ద్దేహోఽయంమనసాతథా. 44

ఓ సాధుపుంగవా ! చతురశీలుడగు సారథి రథమును తనయిచ్ఛచొప్పున గొనిపోవునట్లు అభిమానయుక్తమై వాగగోచరమగు సంతర్వ్యాపారముచే యీ మనంబును శరీరమును తన యిచ్ఛచొప్పున ప్రవర్తింపజేయుచున్నది.

అసత్సంకల్పః క్రియతే సచ్ఛరీరంవినాశ్యతే
క్షణేనమనసాపంక పురుషఃశిశునాయథా. 45

మృత్తికచే యొనర్పబడిన యాటబొమ్మను తాను తలంచిన వెంటనే శిథిలమొనర్చి, బాలుడు మఱొకదానిని నిర్మించుకొనునట్లు యీ మనస్సున్ను భవిష్యచ్ఛరీరమును సంకల్పించుచు, పూర్వ శరీరమును నశింపజేయుచునున్నది.

చిత్తమేవేహపురుష స్తత్కృతంకృతముచ్యతే
తద్బద్ధంకలనాహేతోః కలనాస్తంవిముచ్యతే. 46

చిత్తమే పురుషుడు. చిత్తకృతమగు కార్యమే కార్యమనఁబడును. అసద్వస్తువ్రను గూర్చిన సంకల్పముచే నయ్యది బంధింపబడుచున్నది. అట్లు సంకల్పింపకుండుటచే ముక్తిని బడయుచున్నది.

అయం దేహఇవాత్రస్థ మితమంగమిదంశిరః
ఇదంస్ఫారవికారంత న్మనసవాభిధీయతే. 47

‘ఇది దేహము, ఈ అవయవము లిటనున్నవి, ఇది శిరస్సు’—ఇత్యాది వికారశతమగు కల్పనలను మనస్సే చేయుచున్నది.

మనోహిజీవాజ్జీవాఖ్యం నిశ్చయైకతయానుధీః
అహంకారోభిమంతృత్వా న్నానాతాస్వయమేవహి. 48

మనస్సే ఒక జీవశరీరమునుండి మఱియొక జీవశరీరమును పొందుచున్నది. మనస్సుచే నే వస్తువు కల్పింపబడుచున్నదో తదనుకూలముగనే బుద్ధి యుదయించుచున్నది. మఱియు ‘నేను చేయుచున్నా’నను యహంకారమున్ను గలుగుచున్నది. ఇట్లు మనస్సే వివిధరూపములను ధరించుచున్నది.

దేహవాసనయాచేత స్త్వన్యానిస్వానిచేచ్ఛయా
పార్థివానిశరీరాణి హ్యాసంతిపరిపశ్యతి. 49

దేహవాసనచే నీ చిత్తము తనయిచ్ఛానుసార మవిద్యమానమగు అన్యపార్థివదేహములను గాంచుచున్నది.

ఆలోకయతి చేత్సత్యం తదాసత్యమయీంమనః
శరీరభావనాంత్యక్త్వా పరామాయాతినిర్వృతిమ్. 50

ఈ మనస్సే సత్యవస్తుసాక్షాత్కారముచే యసత్యమగు దేహభావనను త్యజించి పరమ శాంతిని పొందును. అనగా, మనస్సుయొక్క దేహాదులంగూర్చిన కల్పన ఆత్మ సాక్షాత్కార పర్యంతమేగాని, అటుపిదప కాదని యెఱుంగుము.

తన్మన స్తవపుత్రస్య సమాధౌత్వయిసంస్థితే
స్వమనోరథమార్గేణ దూరాద్దూరతరంగతమ్. 51

నీవు సమాధియందుండ నీ పుత్రుని మనంబు స్వమనోరథమార్గంబున నతిదూరమేగెను.

ఇమమాశనసంత్యక్త్వా దేహంమందరకందరే
ప్రయాతోనై బుధంసద్మ నీడోడ్డీనఃఖగోయథా. 52

శుక్రాచార్యుని స్థూలశరీరమును మందరపర్వతగుహయందు వదలి అతని మనోదేహము, గూటినివీడి పక్షిజనునట్లు దేవతల నివాసమగు స్వర్గమునకుఁజనెను.

తత్రమందరకుంజేషు పారిజాతలతేషుచ
నందనోద్యానఖండేషు లోకపాలపురేషుచ. 53
మునేచతుర్యుగాన్యష్టౌ విశ్వాచీందేవసుందరీమ్
అసేవతమహాతేజాః షట్పదఃపద్మినీమివ. 54

ఓ మునీంద్రా! అచట మందరపర్వత నికుంజములందును, పారిజాత లతలందును, నందనోద్యానములందును, లోకపాలుర నగరములందును, మహాతేజస్వియగు శుక్రాచార్యుడు విశ్వాచి యను అప్సరసతోగూడ కమలసరోవరంబున భ్రమరమువలె యెనిమిది చతుర్యుగముల పర్యంతము విహరించెను.

తీవ్రసంవేగసంపన్న స్వసంకల్పోపకల్పితే
అథపుణ్యక్షయేజాతే నీహారఇవశార్వరే. 55

దినముగతింప యంధకార ముద్భవమగునట్లు, వాసనలచే నుదితమైన తీవ్ర[illegible]ముచే వానికపుడు పుణ్యక్షయము సంభవించెను.

ప్రమ్లానకుసుమోత్తంసః ఖిన్నాంగావయవోల్లసః
సహపాతతయాసార్ధం కాలపక్వంఫలంయథా. 56

అంతవాడిన పుష్పముతోగూడిన యాభూషణములు గలవాడును, ఖిన్నమైన హస్త పాదాద్యవయవములు గలవాడునునై ఆయప్సరసతోగూడ శుక్రాచార్యుడు, పక్వఫలము వృక్షము నుండి పడునట్లు భూమిపైబడెను.

నైబుధంతత్పరిత్యజ్య సభస్యేవశరీరకమ్
[illegible]కాశమథాసాద్య వసుధాయాంవ్యజాయత. 57



ఆ దేవశరీరమును స్వర్గాకాశమునే త్యజించి యాతడు భూతాకాశమును పొంది భూమిపై జన్మించెను.

ఆసీద్విప్రోదశార్ణేషు కోసలేషుమహీపతిః
ధీవరోఽథమహాటవ్యాం హంసస్త్రిపథగాతటే. 58

ప్రథమమున, దశార్ణదేశమందు బ్రాహ్మణుడుగ జన్మించెను. పిదప కోసలదేశాధీశుడుగను, తదనంతరము మహారణ్యమున ధీవరుడుగను, గంగానదీతటమున హంసగను జన్మించెను.

సూర్యవంశే నృపఃపౌండ్రః సౌరశాల్వేషుదేశికః
కల్పంవిద్యాధరఃశ్రీమాన్ ధీమానథమునేఃసుతః. 59

ఓ మునీశ్వరా! పిమ్మట సూర్యవంశమందు జన్మించి పుండ్రదేశమునకు రాజాయెను. ఆ పిదప శాల్వదేశమున మంత్రోపాసకుడగు యుపదేష్టగ జన్మించెను. ఏతన్మంత్రప్రభావంబున ధీమంతుఁడగు నీపుత్రుడు కల్పపర్యంతము విద్యాధరుడై విలసిల్లెను.

మద్రేష్వథమహీపాల స్తతస్తాపసబాలకః
వాసుదేవఇతిఖ్యాతః సమంగాయాస్తటేస్థితః. 60

తదనంతరము వాతడు మద్రదేశమునకు రాజై జనించెను. పిదప నొక తాపసుని కుమారుడై యగు దేవుడను పేరుచే ప్రసిద్ధికెక్కిన సమంగానదీతీరమున వసించెను.

అన్యాస్వపివిచిత్రాసు వాసనావశతఃస్వయమ్
విషమాస్వేవపుత్రస్తే చచారాంతరయోనిషు. 61

ఇవిగాక యింకను అనేక భయదాయకంబులగు జన్మలందు నీపుత్రుడు వాసనావశమున సంక్రమించి యుండెను.

అభూద్వింధ్యవనేభూయః కిరాతఃకైకటేషుచ
సౌవీరేష్వథసామంత స్త్రిగర్తేషుచగర్ధభః. 62

ఆతడు వింధ్యాచల, కైకట దేశములందు కిరాతుడాయెను. సౌవీరదేశాధిపతియు నాయెను. ఆ రాజజన్మమందు పాపకార్యముల, జేయుటచే త్రిగర్తదేశమందు గర్ధభమై జనించెను.

వంశగుల్మఃకిరాతేషు హరిణశ్చీనజంగలే
సరీసృపస్తాలవృక్షే తమాలేవనకుక్కుటః. 63

కిరాతదేశమున వేణులతయై జన్మించెను. చీనదేశారణ్యమున మృగరూపమును బొందెను. మఱియు తాళవృక్షములందు సర్పమగను, తమాలవనములందు కుక్కుటముగను జనించెను.

అయంసపుత్రోభవతో భూత్వామంత్రవిదాంవరః
ప్రజజాపపురావిద్యాం విద్యాధరపురప్రదామ్. 64

ఈ నీపుత్రుడే పూర్వము మంత్రవేత్తలలో శ్రేష్ఠుడై విద్యాధరనగరమును ప్రాప్తింపఁజేయు విద్యను మననము గావించెను.

తేనాసావభవద్బ్రహ్మన్ వ్యోమ్నివిద్యాధరోమహాన్
హారకుండల కేయూర లీలానిచయలాలకః. 65

ఓ మహాత్మా! ఆవిద్యాప్రభావంబున, హారకుండలాది యాభూషణములతోను, లీలాసమూహములతోను గూడి విద్యాధరీగణమునకు విలాసమును గొల్పునట్టి యుత్తమ విద్యాధరుఁడాయెను.

నాయికానలినీభానుః పుష్పచాపఇవాపరః
విద్యాధరీణాందయితో గంధర్వపురభూషణః. 66

ఓ మునీంద్రా! ఈ నీపుత్రుడు రెండవ మన్మథునివలె మిగుల సౌందర్యవంతుడును, స్త్రీరూపకమల గణమునకు సూర్యుఁడును, విద్యాధరీసమూహమున కతిప్రియుడును, విద్యాధరపురమునకు భూషణమునునై విలసిల్లెను.

సకల్పావధిమాసాద్య ద్వాదశాదిత్యధామని
జగామభస్మశేషత్వం శలభఃపావకేయథా. 67

అట్లా విద్యాధర నగరంబున వసించుచుండ నాతనికొక కల్పముగడచెను. అపుడు కల్పాంతమందు ద్వాదశాదిత్యులు లోకమును తపింపజేయ, అగ్నియందు శలభమువలె నాతఁడా ప్రళయాగ్నియందు భస్మీభూతుఁడయ్యెను.

జగన్నిర్మాణరహితే స్ఫారేనభసిసాతతః
వాసనాతస్యబభ్రామ నిర్నీడావిహగేయథా. 68

అత్తఱి జగద్రచనాశూన్యమగు విశాలాకాశమున గూటిని విడచిన పక్షివలె శుక్రుని వాసన పరిభ్రమించుచుండెను.

అథకాలేనసంజాతే విచిత్రారంభకారిణి
సంసారరచనారంభే బ్రాహ్మేరాత్రివిపర్యయే. 69
సాముంనేవాసనాతస్య వాతవ్యాచలితాసతీ
కృతేబ్రాహ్మణతామేపేత్య జాతోద్యవసుధాతలే. 70

ఓ మునీంద్రా! అంత చాలకాలము గడచిన మీదట, బ్రాహ్మీరాత్రి పరిసమాప్తికాగా, విచిత్ర కార్యారంభముతోగూడిన జగన్నిర్మాణసమయమున, నీతనయుని యాసూక్ష్మవాసన వాయుప్రేరితమైనదాని చందమున చలాయమానంబై యిపుడు కృతయుగమున బ్రాహ్మణ రూపము ధరించి భూమిపై జనించెను.

వాసుదేవాభిధానోఽసౌ మునేర్విప్రకుమారకః
జాతోమతిమతాంమధ్యే సమధీతాఖిలశ్రుతిః. 71

ఓ మునిశ్రేష్ఠా! ఆ నీతనయుఁడు బుద్ధిమంతులలో నుత్తముడై వేదములన్నింటి నధ్యయనము చేయుచు నొక బ్రాహ్మణపుత్రుడై జన్మించి వాసుదేవుడను నామంబున బ్రసిద్ధికెక్కెను.



కల్పంవిద్యాధరోభూత్వా నద్యాస్త్వథమహామునే
తపశ్చరతితేపుత్రః సమంగాయాస్తటేస్థితః. 72

ఓ మునీంద్రా ! పిమ్మట కల్పపర్యంతము విద్యాధరుఁడై, యిపుడు సమంగానదీతటమున నీ పుత్రుడు తపంబొనర్చుచున్నాడు.

వివిధవిషయవాసనానువృత్త్యా
ఖదిరకరంజకరాలకోటరాసు
జగతిజఠరయోనిషుప్రయాతో
గహనతరాసుచకాననస్థలీషు. 73

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
భార్గవోపాఖ్యానే కాలవచనంనామ దశమః
సర్గః ॥ 10 ॥

ఓ మునీశ్వరా ! పలువిధ విషయవాసనలచే ప్రేరితుడై, ఖదిర కరంజ వృక్షకంటకములచే భయంకరమైన భిన్నభిన్న పర్వతస్థలములందు నీ తనయుడు జన్మించెను. మఱియు నతిభీషణంబగు యరణ్యములందు వృక్షలతాదులరూపంబునను గూడ యాతఁడు జనించియుండెను.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు స్థితిప్రకరణమున
భార్గవోపాఖ్యానమందు కాలవచనమను దశమ
సర్గము ॥ 10 ॥

---

## ఏకాదశః సర్గః.

---

కాల ఉవాచ :—

అదోద్దామతరంగాఘ భాంకారరణితానిలే
తీరపవతరంగిణ్యా స్తప స్తపతి తేసుతః. 1

కాలుడు :—ఓ మునీంద్రా ! మిగుల శోభించుచున్న తరంగములయొక్క గంభీరధ్వనితో కూడిన వాయువుగలదై నొప్పుచున్న యా సమంగానదీతీరమున నీ పుత్రుఁడిపుడు తపంబొనరించుచున్నాడు.

జటావానక్షవలయీ జితసర్వేంద్రియభ్రమః
తత్రత్రవర్షశతాన్యష్టౌ సంస్థిత స్తపసిస్థిరే. 2

జటాధారియై రుద్రాక్షమాలనుధరించి, సర్వేంద్రియభ్రమను జయించి, స్థిరముగనున్నవాడై యట తపంబొనర్చుచుండ యెనిమిదివందల వత్సరములు గడచెను.

యదీచ్ఛసిమునే ద్రష్టుం తంస్వప్నాభంమనోభ్రమమ్
తత్సమున్మీల్యవిజ్ఞాన నేత్రమాశువిలోకయ. 3

ఓ మునిశ్రేష్ఠా! నీ పుత్రుని యా మనోవిలాసంబంతయును పరికింప సంకించుచో యోగరూపంబగు నీ విజ్ఞాననేత్రమును తెఱచి వీక్షింపుము.

శ్రీవసిష్ఠ ఉవాచ :—

ఇత్యుక్తేజగదీశేన కాలేనసమదృష్టినా
మునిఃసంచింతయామాస జ్ఞానాత్తనయేహితమ్. 4

శ్రీవసిష్ఠుడు :—ఓ రామా! లోకేశుండును, సమదృష్టిగలవాడును నగు కాలుండిట్లు బలుక నంత భృగుమునీంద్రుడు తనజ్ఞాననేత్రముచే పుత్రుని చరితంబుగూర్చి చింతనచేసెను.

దదర్శచముహూర్తేన ప్రతిభానవశాదసౌ
పుత్రోదంతమశేషేణ బుద్ధిదర్పణబింబితమ్. 5

ధ్యానప్రభావముచేతను యోగమహిమచేతను విశుద్ధమైన బుద్ధియను దర్పణమందు ప్రతిబింబించిన తన పుత్రుని చారిత్ర్యమును ముహూర్తమాత్రమున ప్రత్యక్షముగ నాతడు గాంచెను.

పునర్మందరసానుస్థాం స్వస్థాంకాలాగ్రసంస్థితామ్
సమంగాయాస్తటాదేత్య వివేశస్వతనుంభృగుః. 6

పుత్రుని వృత్తాంతమంతయు నరసి, పిమ్మట యా సమంగానదీతటమును వీడి మందర పర్వతముపై కాలుని సమ్ముఖముననున్న స్వశరీరంబునఁ బ్రవేశించెను.

విస్మయస్మేరయాదృష్ట్యా కాలమాలోక్యకాంతయా
వీతరాగమువాచేదం వీతరాగోమునిర్వచః. 7

అంత వ్యపగతపుత్రస్నేహుండగు నా భృగువు విస్మయముఁజెంది చిఱునగవుచే రమణీయంబగు సత్తమదృష్టితో వీతరాగుఁడగు కాలునిజూచి యిట్లనియె.

భగవన్భూతభవ్యేశ బాలావయమనుజ్జ్వలాః
త్వాదృశామేవధీర్దేవ త్రికాలామలదర్శనీ. 8

భూతభవిష్యద్వర్తమానములకును ప్రభువగు నో మహాత్మా! మేము మలినచిత్తులము. బాలురము (అజ్ఞానులము). మీవంటి మహాత్ములయొక్క దృష్టి త్రికాలములందలి వృత్తాంతమంతయును స్పష్టముగా గాంచును.

నానాకారవికారాఢ్య సత్యేవాసత్యరూపిణీ
విభ్రమంజనయత్యేషా ధీరస్యాపిజగత్స్థితిః. 9

పలువిధ వికారంబులతో గూడినదియు, మిథ్యారూపంబయ్యు సత్యముగ గన్పట్టునదియు నగు యీ జగత్స్థితి ధీరులకుగూడ భ్రమను గల్గజేయుచున్నది.



త్వమేవదేవజానాసి త్వదభ్యంతరవర్తియత్
రూపమస్యామనోవృత్తే రింద్రజాలవిధాయకమ్. 10

కాలరూపుడగు నో దేవా! మీ యంతరంగమున నెయ్యదిగలదో యద్దానిని మీరే యెఱుంగుదురు. ఈ మనస్సుయొక్క వృత్తిరూపం బింద్రజాలమువలె మాయావిమోహంబును గలుగజేయునదగును.

మత్పుత్రస్యాస్యభగవన్ మృత్యుఃకిలనవిద్యతే
తేనేమంమృతమాలోక్య జాతఃసంభ్రమవానహమ్. 11

ఓ దేవా! కల్పాంతమువఱకు జీవించు యీ నాపుత్రుని మరణమునుగాంచ నాకు భ్రమ గల్గెను.

అక్షీణాజీవితంపుత్రం కాలోమేనీతవానితి
నియతేర్వశతోదేవ తుచ్ఛాపీచ్ఛామమోదితా. 12

ఓ దేవా! జీవితము పరిసమాప్తిగాకున్నను నాపుత్రుని కాలుడుగైకొనిపోయెనను యల్పబుద్ధి నియతివశంబున నాకు గల్గెను.

ననువిజ్ఞాతసంసార గతయోవయమాపదామ్
సంపదాంచైవగచ్ఛామో హర్షామర్షవశంవిభో. 13

ఓ ప్రభూ! ప్రపంచముయొక్క స్థితిగతులనెఱింగిన వారమైనను, సంపదవిపదల కారణంబున హర్షశోకములకు వశీభూతులమగుచున్నాము.

అయుక్తకారిణిక్రోధః ప్రసాదోయుక్తకారిణి
కర్తవ్యఇతిరూఢేయం సంసారేభగవన్స్థితిః. 14

ఓ దేవా! అయుక్తమాచరించు వానియెడల క్రోధమును, యుక్తమాచరించువానియెడల ప్రసన్నత్వము గల్గియుండుట యను యీ నియతి ప్రపంచమున స్థిరముగ నెలకొనియున్నది.

ఇదంకార్యమిదంనేతి యావత్కార్యంజగద్భ్రమః
తస్యైతత్సంపరిత్యాగో హేయఏవజగద్గురో. 15

'ఇది కర్తవ్యము, ఇదికాదు' నునట్టి ఇష్టానిష్టసాధనములందలి సత్యత్వభ్రమ యెంతవఱకుండునో, అంతవఱకును యీ నియతి(అయుక్తమాచరించువానియెడల క్రోధము, యుక్తమాచరించువానియెడల ప్రసన్నత్వము గల్గియుండుట) దృఢముగనే యుండును. ఓ జగద్గురూ! హేయమగు నా భ్రమను త్యజించుటయే యుచితము.

కేవలంతావకీంచింతా మనాలోక్యయదావయమ్.
భగవన్భవతేక్రుద్ధా యాతాఃస్మస్తేనబాధ్యతామ్. 16

కేవలము నియతిపాలనారూపంబగు మీ యభిప్రాయమును విచారింపక నేను మీయెడ క్రుద్ధుడనైతిని. కాన నేను మీదండనకు పాత్రుడనగుదును.

త్వయేదానీమహం దేవ స్మారిత స్తనయేహితమ్
సమంగాయా స్తటే తేన దృష్టోఽయంతనయోమయా. 17

ఓ ప్రభూ! నాకుమారుని చరితంబును యిపుడు మీరు స్మరింపఁజేసిరి గాన యాతనిని సమంగానదీతీరమున నేను గాంచినాను.

మనోజగతిభూతానాం ద్వేశరీరేఽత్రసర్వగమ్
మనఏవశరీరంహి యేనేదం భావ్యతేజగత్. 18

ఈ లోకంబున సమస్తప్రాణులకును మనస్సే రెండుశరీరముల నుత్పన్నము చేయుచున్నది. అంతటను సంచరించు ఆ మనస్సే ముఖ్యమగుశరీరము. దానినుండియే యీ జగత్తంతయు నుత్పన్నమగుచున్నది.

కాల ఉవాచ :—

సమ్యగుక్తంత్వయాబ్రహ్మన్ శరీరంమనఏవచ
కరోతిదేహంసంకల్పా త్కుంభకారోఘటంయథా. 19

కాలుడు :—ఓ మహాత్మా! మీరు వచించినది సత్యము. ఈ మనస్సే జీవునకు ముఖ్యదేహమగును. కుమ్మరివారు కుండనుచేయునట్లు ఈ మనస్సు తనసంకల్పముచే భౌతికదేహమును నిర్మించుచున్నది.

కరోత్యకృతమాకారం కృతంనాశయతిక్షణాత్
సంకల్పేన మనోమోహా ద్బాలోవేతాలకంయథా. 20

అజ్ఞానవశమున బాలుడు బేతాలుని కల్పించుచు మరల దానిని నిర్మూలించుచు నుండునట్లు, ఆకారములేని దానినైనను ఈ మనస్సు తన సంకల్పముచే నిర్మించుచు మరల యద్దానిని నశింపజేయుచు నుండును.

తథాచసంభ్రమస్వప్న మిథ్యాజ్ఞానాదిభాసురాః
గంధర్వనగరాకారా దృష్టామనసిశక్తయః. 21

ఇవ్విధముగనే, సంభ్రమ, స్వప్న, మిథ్యాజ్ఞానములవలె గన్పట్టునదియు, గంధర్వనగరాకారమువంటిదియునగు మిథ్యారచనాశక్తి మనస్సునందు ప్రసిద్ధరూపమున గాంచబడుచున్నది.

స్థూలదృష్టిదశాం త్వేతా మవలంబ్యమహామునే
పుంషోమనఃశరీరంచ కాయాద్వావితికథ్యతే. 22

ఓ మునీంద్రా! ఒకటి మనస్సు, రెండవది ప్రత్యక్షముగ గన్పించు భౌతికదేహము — ఇవ్విధమున మనుజునకు రెండు శరీరములుగలవని స్థూలదృష్టి ననుసరించియే చెప్పబడుచుండును.

మనోమననిర్మాణ మాత్రమేతజ్జగత్త్రయమ్
నసన్నాసదివస్ఫార ముదితంనేతరన్మునే. 23

సూక్ష్మదృష్టితోజూచిన స్ఫురణరూపంబగు మనస్సు మాత్రమేగలదని స్పష్టమగును. ఈ ముల్లోకంబులును దీని రచనామాత్రంబేయగు. ఓ మునీంద్రా! సదసద్విలక్షణమును, విశాలమునునైన యీ మనస్సే యావిర్భావము నొందుచున్నదిగాని యన్యముగాదు.



చిత్తదేహాంగలతయా భేదవాసనయేద్ధయా
ద్విచంద్రత్వమివాజ్ఞానా న్నానాతేయంసముత్థితా. 24

అజ్ఞానముచేగల్గు ద్విచంద్రభ్రాంతివలె చిత్తమను దేహముయొక్క అవయవంబయి, లతవలె వృద్ధినొందిన భేదవాసనచేతనే యీ పలువిధ జగద్భేదము లావిర్భవించినవి.

భేదవాసనయాపశ్యత్ పదార్థనిచయంమనః
భిన్నంపశ్యతిసర్వత్ర ఘటావటపటాదికమ్. 25

ఈ మనస్సు భేదవాసనచే పదార్థసమూహములఁ గాంచుచు ఘటావర్త పటాదివస్తువులను సర్వత్ర భిన్నముగనే జూచుచున్నది.

కృశోతి దుఃఖీమూఢోహ మేతాశ్చాన్యాశ్చభావనాః
భావయత్ స్వవికల్పోత్థాం యాతిసంసారితాంమనః. 26

నేను దుర్బలుడను, దుఃఖిని, అజ్ఞానినని యెంచుచు, తన వికల్పముచే నుదయించిన భావనలనొనర్చుచు యీ మనస్సు జీవత్వము నొందుచున్నది.

మననంకృత్రిమంరూపం మమైతన్నయతోస్మ్యహమ్
ఇతితత్త్యాగతఃశాంతం చేతోబ్రహ్మసనాతనమ్. 27

మనస్సుయొక్క స్ఫురణరూపము సత్యమైనదిగాదు. 'అయ్యది నా రూపముగానేరదు. నేనా మనస్సుయొక్క స్ఫురణగాన'ను నిట్టి మనోత్యాగముచే మనస్సు సనాతనమును, శాంతమును నగు బ్రహ్మమే యగుచున్నది.

యథాప్రవితతాంభోధౌ ద్రుతాం నైకతరంగిణి
శామ్యత్స్పందతయానేక కల్లోలావలిశాలిని. 28
వార్యాత్మనిసమేస్వచ్ఛే శుద్ధేస్వాదునిశీతలే
అవినాశినివిస్తీర్ణే మహామహిమనిస్ఫుటే. 29
హ్రస్వస్తరంగఃస్వంరూపం భావయన్స్వస్వభావతః
హ్రస్వోస్మీతివికల్పేన కరోతిస్వేనభావనామ్. 30

అనేక తరంగములతోఁగూడి శోభాయమానముగ నున్నదియు, అల్పస్పందము గలదియు,' సమమును, శుద్ధరూపమును, స్వచ్ఛ, స్వాదుజలమయమును, కల్పాంతమువఱకు స్థిరముగనుండునదియు స్వమహిమాతిశయమున ప్రతిష్ఠితిమైయున్నదియునగు ప్రసిద్ధమైన మహాసముద్రమున, హ్రస్వతరంగము తన స్వభావమునను సరించి నిజరూపమును భావించుచు స్వవికల్పముచే 'నేను హ్రస్వమున'ని భావన జేయుచున్నది.

దీర్ఘస్తరంగఃస్వంరూపం భావయన్స్వస్వభావతః
దీర్ఘోస్మీతివికల్పేన కరోతిస్వేనభావనామ్. 31

మఱియు దీర్ఘతరంగము తన స్వభావము ననుసరించి నిజరూపమును భావించుచు స్వవికల్పంబుచే, నేను దీర్ఘమున'ని భావనజేయుచున్నది.

ప్రాస్యశ్చైవపరిభ్రష్ట రూపోఽస్మీతితలాతలమ్
భావయన్ భూతలంయాతి తాదృగ్భావనయాస్వయా. 32

'నేను హ్రస్వరూపుడను, పరిభ్రష్టుడన'ని తలంచుచు, పతనభయమువలన పతనమునే భావించుచు, అట్టిభావనచే తీరప్రదేశమునుగూర్చి బోవుచున్నది.

ఉత్పన్నశ్చపలాదూర్ధ్వ ముత్థితోఽస్మీతిభావిత;
సరశ్మిరత్నజాలస్తు శోభతేదీప్తయాశ్రియా. 33

స్వల్పకాలమైన పిదప మరల నావిర్భవించి 'నేను భోగానుకూలమగు జన్మమును పొందితి న'ని యభిమానించుచు, తైవవశమున పర్వతమువలె విశాలమును, సూర్య కిరణసహితమగు రత్న సమూహమువలె దేదీప్యమానమునునై శోభించును.

తుషారకరబింబస్థః శీతలోఽస్మీతిబింబతి
సతటాచలదావాగ్ని ప్రతిబింబోజ్వలద్వపుః. 34

బిభేతిబతదగ్ధోఽస్మి త్యాత్తహాసశ్చకంపతే
ప్రతిబింబితవేలాద్రి తటపక్షవనద్రుమః. 35

మహాదారంభసంరంభ సంయుక్తోఽస్మీతిరాజతే
వికల్లోలానిలాత్యంత ధ్వస్తలోలశరీరకః. 36

మఱియు చంద్రబింబమున యుపాధిరూపముననుండి 'నేను శీతలముగ నున్నాన'ని యభిమానించును. తీరస్థిత దావాగ్నిప్రతిబింబసహితుఁడై ప్రకాశవంతమగు దేహముగల్గి 'నేను దహింపబడితిన'ని యెంచుచు భయపడును; మరల మౌనమును ధరించి చలించుచుండును. అటుపిమ్మట తీర ద్వయమందలి ప్రతిబింబిత పర్వతములే శాఖలుగ గల్గిన వృక్షరూపమై ఫలాదియాడంబరముతోఁగూడి, రాజ్యప్రాప్తి జెందినవానిగ తలంచుచు కృతార్థుడనైతినని సంతసించును. మరల వాయువు వీచుటచే అతిచంచలమగు వానిదేహము విధ్వంసమగును.

ఖండశఃపరియాతోఽస్మీ త్యాత్తక్రందఇవారవీ
నచోర్మయస్తేజలధే ర్వ్యతిరిక్తాఃపయోధరాత్. 37

అపుడు 'నేను ఖండ ఖండములుగా నొనర్పబడితినని యఱచుచు రోదనమారంభించును. యథార్థముగ యీ తరంగములు జలసమూహరూపమగు సముద్రమునకు వేఱుగావు.

నచైకంరూపమే తేషాం కించిత్సన్నాప్యసన్మయమ్
నచైతేహ్రస్వదీర్ఘత్వాద్యా గుణాస్తేషునతేషు తే. 38

వీనికి ముఖ్యమగు సన్మయాసన్మయరూపమేదియును లేదు. మఱియు నాతరంగములందు హ్రస్వత్వదీర్ఘత్వాది గుణములుగాని, ఆ గుణములందు తరంగములుగాని లేవు.

నోర్మయఃసంస్థితాహ్యబ్ధౌ నతత్త్రనసంస్థితాః
కేవలంస్వస్వభావస్థ సంకల్పవికలాంకృతాః. 39



కాని, సముద్రమున తరంగము లేదనుటయు సత్యముగాదు. ఏలన, అధిష్ఠానరూపమున అయ్యది యుండియే యున్నది. వివర్తరూపముగ ప్రతియోగీ యే సముద్రమున తరంగాదుల యేభావము చెప్పబడునో అయ్యది) యభావముచే అభావ మప్రసిద్ధమగును. కేవలము వాని వాని స్వభావస్థిత సంకల్పములచే పరిచ్ఛిన్నమగు యీ భేదములు, వికల్పములు సంభవించుచున్నవి.

నష్టానష్టాఃపునర్జాతా జాతాజాతాఃపునఃపునః
పరస్పరపరామర్శా న్నాన్యతాముపయాంత్యలమ్. 40

ఒకపుడు నశించుచు, ఒకపుడు నశింపకయును, ఉత్పన్నమగుచు మరల నశించుచు, ఉద్వేగమున మరల మరల నశించుచు ఉత్పన్నమగుచునుండు యీ తరంగములు పరస్పరమేళనంబుచే, సముద్రముకంటె వేఱుగా నేరవు.

ఏకరూపాంబుసామాన్య మయాఏవనిరామయాః
తథైవాస్మిన్ప్రవితతే సితేశుద్ధేనిరామయే. 41

బ్రహ్మమాత్రైకవపుషి బ్రహ్మణిస్ఫారరూపిణి
సర్వశక్తావనాద్యంతే పృథగ్వదృపథకకృతాః. 42

సంస్థితాఃశక్తయశ్చిత్రా విచిత్రాచారచంచలాః
నానాశక్తిర్హినానాత్వ మేతిస్వేవపుషిస్థితమ్. 43

తరంగములన్నియు యెల్లపుడును యేకరూపమగు జలమయమైయున్న చందమున చిత్రవిచిత్రక్రియలతోఁగూడి చంచలంబై యున్న యీ జగత్-శక్తు (జగంబు) లన్నియు వ్యాపకమును, నిత్యమును, శుద్ధమును, నిరామయమును, చిన్మాత్రస్వరూపమును, అనాదియు, అనంతమును సర్వశక్తిమంతమును నగు బ్రహ్మముకంటె భిన్నముగా గన్పించుచున్నను యభిన్నమే యగును. ఏలయన సర్వశక్తిమంతుఁడగు ఆ పరమాత్మ తనస్వరూపమునుండి చ్యుతినిబొందక, వివిధరూపంబుల నొందుచున్నాడు.

బృంహితాత్మం బ్రహ్మణిబ్రహ్మ పయసీవోర్మిమండలమ్
స్త్రీపుమాన్ వ్యంగరూపేణ బ్రహ్మైవపరివర్తతే. 44

జలమందు తరంగసమూహములవలె బ్రహ్మమందు బ్రహ్మమే వృద్ధిని పొందుచున్నది. మఱియు స్త్రీ, పురుష, నపుంసకరూపంబుల నాబ్రహ్మమే వివర్తభావంబు (రజ్జువునందు సర్పరూపము) ను బొందుచున్నది.

కల్పనాన్యాజగన్నామ్నా నాసీదస్తిభవిష్యతి
బ్రహ్మణోజగతోభేదో మనాగపినవిద్యతే. 45

జగత్తనునట్టి కల్పన యేదియు యెపుడును యుండియుండలేదు; యిపుడునులేదు; ఇకను యుండబోదు; ఏలయన, జగద్బ్రహ్మలందు కొంచమైనను భేదములేదు.

సంపూర్ణంఖల్విదంబ్రహ్మ జగద్బ్రహ్మైవకేవలమ్
ఇతిభావయయత్నేన హ్యన్యత్సర్వంపరిత్యజ. 46

ఓ రామా! ఈ బ్రహ్మము నిశ్చయముగ పూర్ణమైనది; ఈ జగత్తంతయు కేవలము బ్రహ్మముమాత్రమే యను భావనను నీవు ప్రయత్నపూర్వకముగ జేయుచు యితర ఆడంబరమంతయు త్యజించివేయుము.

నానారూపిణ్యేకరూపా నైరూప్యశతకారిణీ
నియతిర్నియతాకారా పదార్థమధితిష్ఠతి. 47

అనేక రూపములుగనున్నను యేకరూపమును, అసంఖ్యాకములుగను విరుద్ధరూపము గలదిగను యున్నప్పటికి సర్వత్ర యొకే ఆకారముగల్గి యున్నదియునగు నియతిరూపంబైన ఆత్మసత్తసమస్త పదార్థములయొక్క అధిష్ఠానమై వెలయుచున్నది.

జడాజడముపాదత్తే చిత్తమాయాంతిచిన్మయే
వాసనారూపిణీశక్తిః స్వస్వరూపాస్థితాత్మనః. 48

చిదాభాసరూపత్వమొందిన పిదప చిత్తము ఆయా యుపాధులందు వ్యాప్తమైయున్న అహంకారమును ఆత్మరూపముగను, వానికంటె భిన్నమగు సన్మాత్రమును అనాత్మరూపముగను యెంచుచు, అనాధ్యాత్మికమగు జడముయొక్కయు, ఆధ్యాత్మికమగు చైతన్యము యొక్కయు, విభేదమును గ్రహించుచున్నది. చిత్తముయొక్క యీ భేదవాసనారూపమగు శక్తి ఆత్మయొక్క నిజరూపంబున నున్నదేయగును. అనగా చిత్తకృతమగు జడచైతన్య వికల్పముచే ఆత్మయొక్క యేకరూపత్వమునకు హానియేమియును లేదని భావము.

బ్రహ్మైవానఘ తేనేదం స్ఫారాకారంవిజృంభతే
నానారూపైఃప్రతిస్పందైః పరిపూర్ణ ఇవార్ణవః. 49

ఇక్కారణమున పాపరహితుడవగు నోరామచంద్రా! పలువిధ తరంగముల గతివిభేదంబులచే పరిపూర్ణమగు సముద్రము శోభించునట్లు పరబ్రహ్మమే విశాలమగు జగదాకారముగ వికాసము నొందుచున్నది.

నానాతాంస్వయమాదత్తే నానాకారవిహారతః
ఆత్మైవాత్మన్యాత్మనైవ సముద్రాంభ ఇవాంభసి. 50

సముద్రజలమెట్లు తనజలముచే తనయందే తరంగాది భేదమును పొందునట్లు, ఆత్మయే ఆత్మచే ఆత్మయందు నానా ప్రకారములగు విభేదములను స్వయముగ గ్రహించుచున్నది.

వ్యతిరిక్తానపయసో విచిత్రావీచయోయథా
వ్యతిరిక్తానవిశ్వేశాత్సమగ్రాఃకల్పనాస్తథా. 51

చిత్ర విచిత్రములగు తరంగములు జలముకంటె వేఱుగానట్లు, లోకేశుండగు పరమాత్మకంటె యీ సంపూర్ణ జగత్కల్పనయు వేఱుగాదు.

శాఖాపుష్పలతాపత్ర ఫలకోరకయుక్తయః
యథైకస్మింస్తథాబీజే సర్వదాసర్వశక్తితా. 52

ఒకే బీజమందు శాఖాపుష్పలతాపత్రఫలాదులుండునట్లు పరమాత్మయందెల్లపుడును సర్వశక్తులును గలవు.



విచిత్రవర్ణతాయద్వ ద్దృశ్యతేకఠినాతపే
విచిత్రశక్తితాతద్వ ద్దేవేశేసదసన్మయీ. 53

తీవ్రాతపమున విచిత్రవర్ణములగు పడునట్లు, దేవేశుండగు పరమాత్మయందు సదసన్మయమగు విచిత్రశక్తి దృగ్గోచరమగుచున్నది.

విచిత్రరూపోదేతీయ మవిచిత్రాత్స్థితిఃశివాత్
ఏకవర్ణాత్పయోవాహా చ్ఛక్రచాపలతాయథా. 54

ఏకవర్ణమగు మేఘమునుండి పలువిధ వర్ణయుక్తమగు యింద్ర ధనుస్సను లత యుద్భవించునట్లు, అవిచిత్రమును, యేకరసమును, మంగళస్వరూపమునునగు పరమాత్మనుండి విచిత్రమగు యీ జగత్స్థితి యుదయించుచున్నది.

అజడాజ్జడతోదేతి జాడ్యభావనహేతుకా
ఊర్ణనాభాద్యథాతంతు ర్యథాపుంసఃసుషుప్తతా. 55

సాలీడునుండి దారమువలెను, మనుజుని స్వప్నమునుండి రథాదులును కలుగునట్లు, చేతనమగు పరమాత్మనుండి జడభావనమొనర్చు జడత్వ ముత్పన్నమాయెను.

అచితశ్చేతసఃశక్తిం స్వబంధాయేచ్ఛయాశివః
తనోతితాంతవంకోశం కోశకారకృమిర్యథా. 56

పట్టుపురుగు స్వీయబంధనము కొఱకే తనకోశజాలమును విస్తరించునట్లు, ఆత్మయు స్వీయబంధముకొఱకే చిత్తశక్తిని అనగా వాసనావైచిత్ర్యమును విస్తరించుచున్నది.

స్వేచ్ఛయాత్మాత్మనోబ్రహ్మన్ భావయిత్వైషవిస్మృతిమ్
కరోతికఠినసంబంధం కోశకారకృమిర్యథా. 57

ఓ మహాత్మా! ఈ యాత్మ తనయిచ్ఛచే తానే తన స్వరూప విస్మృతిని భావించి, పట్టుపురుగువలె తన కొఱకై కఠినబంధమును నిర్మించుకొనుచున్నది.

స్వేచ్ఛయాత్మాత్మనోబ్రహ్మన్ భావయిత్వాస్వకంవపుః
సంసారాన్మోక్షమాప్నోతి స్వాలానాదివవారణః. 58

ఓ మహాశయా! మఱియు నీ యాత్మ తనయిచ్ఛచేతనే ఆత్మ సాక్షాత్కారమొంది, గజము స్వీయబంధనమునుండి విముక్తిని బొందునట్లు సంసారబంధమునుండి తొలగి మోక్షమును పొందుచున్నది.

యథైవభావయత్యాత్మా సతతంభవతిస్వయమ్
తథైవాపూర్యతేశక్త్యా శీఘ్రమేవమహామతే. 59

ఈ యాత్మ యెటుల భావించునో నిరంతర మటులనే యగుచున్నది. మహద్వస్తువైనను, చిత్తశక్తిచే నియ్యది శీఘ్రముగ తద్రూపమేయగును.

భావితాశక్తిరాత్మాన మాత్మతాంనయతీక్షణాత్
అనంతమఖిలంప్రావృ ణ్మిహికామహతీయథా. 60

యాశక్తిరుదితాశీఘ్రం యాతితన్మయతామజః
యఏవర్తుఃస్థితింయాత స్తన్మయోభవతిద్రుమః. 61

గొప్ప వర్షాకాలపు తుషారపాత మనంతాకాశమును గప్పియద్దానిని తనరూపముగనే యొనర్చునట్లు, చిరకాలభావనచే దృఢీభూతమైన వాసన క్షణములో నాత్మను తన రూపముగ నొనర్చివేయును. మఱియు, వృక్షమా ఆయా ఋతువుయొక్క రూపమునే బొందునట్లు, ఏయే వాసన లుత్పన్నమగునో ఆయారూపముగ ఆత్మ శీఘ్రముగ నగుచుండును.

నమోక్షోమోక్షఈశస్య నబంధోబంధఆత్మనః
బంధమోక్షదృశౌలోకే నజానేప్రోత్థితేకుతః. 62

బంధ మోక్షములు ఆత్మకొఱకుగావు. ప్రపంచమున బంధమోక్షములదృష్టి యెట నుండి ప్రాదుర్భవించినదో! (అనగా నయ్యది యథార్థముగ లేదని భావము).

నాస్తి బంధోనమోక్షోఽస్తి తన్మయ స్త్వివలక్ష్యతే
గ్రస్తంనిత్యమనిత్యేన మాయామయమహోజగత్. 63

యథార్థముగ బంధముగాని మోక్షముగాని లేదు. కాని బంధమోక్షరూపమై వికారయుక్తముగ నీ యాత్మ భాసించుచున్నది. నిత్యమును, పూర్ణమును నగు ఆత్మస్వరూపమును, అనిత్యమగు భోక్తృభోగ్యాది వాసనాధ్యాసము గ్రసించివైచినది (తిరోహితమొనర్చినది). ఆహా ! ఈ జగం బెట్టి మాయామయంబైనది !

యదైవచిత్తంకలితం కిలానేనాకలాత్మనా
కోశకారవదాత్మీయ మనేనావలిత స్తదా. 64

నిర్మలమగు నీ యాత్మ చిత్తముయొక్క సంకల్పమెపుడు చేయునో, అపుడే స్వనిర్మిత జాలముచే బంధింపబడు కోశకారక్రిమి (పట్టుపురుగు) వలె చిత్తముద్వారా అయ్యది బంధమున తగుల్కొనుచున్నది.

అన్యోన్యరూపా స్త్వత్యంతం వికల్పితశరీరకాః
మనఃశక్తయఏతస్మా దిమానిర్యాంతికోటయః. 65

పరస్పర మిళితములును, అత్యంత వికల్పయుక్తములునునగు కోట్లకొలది మనశ్శక్తులీ పరమాత్మనుండి యావిర్భవించుచున్నవి.

తజ్జాస్తత్స్థాఃపృథగ్రూపాః సముద్రాదివవీచయః
తజ్జాస్తత్స్థాఃపృథక్స్థాశ్చ చంద్రాదివమరీచయః. 66

వానినుండియే యుద్భవించుచు, వానివలననే స్థితిని బడయుచునున్నను, తరంగములు సముద్రమునకును, చంద్రకిరణములు చంద్రునకును వేఱుగానున్నట్లు, ఆ మనశ్శక్తులును, పరమాత్మకంటె భిన్నముగా స్థితిఁబొందుచున్నవి.

అస్మిన్స్పందమయేస్ఫారే పరమాత్మమహాంబుధౌ
చిజ్జలేవితతాభోగే చిన్మాత్రరసమాలిని. 67



కాశ్చిత్స్థిరాబ్రహ్మవిష్ణూ కాశ్చిద్రుద్రత్వమాగతాః
కాశ్చిత్పురుషతాంప్రాప్తాః కాశ్చిద్దేవత్వమాగతాః. 68

చిత్తమను జలముగల్గినదియు, విశాలాకారమును, చిన్మాత్రతరంగమాలాసహితమును, స్పందమయమునునగు ఆత్మయను యీ మహాసముద్రమున, బ్రహ్మ, విష్ణు రూపములగు కొన్నితరంగములుగలవు. మఱికొన్ని, రుద్రరూపమును బొందినవి. కొన్ని మనుజరూపమును, మఱికొన్ని, దేవరూపమును ప్రాప్తినొందినవి.

[లహర్యఃప్రస్ఫురంత్యేతాః స్వభావోద్భావితాత్మకాః
కాశ్చిద్యమమహేంద్రార్క వహ్నివైశ్రవణాదికాః. 1

ఈ తరంగములన్నియు స్వస్వభావముచే కల్పింపబడి స్ఫురించుచున్నవి. వీనిలోకొన్ని యము, మహేంద్ర, సూర్యాగ్ని, కుబేరాదుల రూపములు స్ఫురించుచున్నవి.

ఘ్నంతికుర్వంతితిష్ఠంతి లహర్యశ్చపలైషణాః
కాశ్చిత్కింనరగంధర్వ విద్యాధరసురాదికాః. 2

కొన్ని పరస్పరము వధించుకొనుచున్నవి. కొన్ని యుపకారంబొనర్చుకొనుచున్నవి. కొన్ని హాస్యమొనర్చుచున్నవి. మఱికొన్ని, చపలమగు యిచ్ఛతోకూడియున్నవి. కొన్నితరంగములు కిన్నర, గంధర్వ విద్యాధర దేవరూపముల స్ఫురించుచున్నవి.

ఉత్పతన్తిపతన్త్యుగ్రా లహర్యఃపరివల్గితాః
కాశ్చిత్కించిత్స్థిరాకారా యథాకమలజాదికాః. 3
కాశ్చిదుత్పన్నవిధ్వస్తా యథాసురనరాదికాః]

కొన్ని యుగ్రతరంగములు గర్జించుచు పైకి బోవుచున్నవి. కొన్ని క్రిందికివచ్చుచున్నవి. వానియందు బ్రహ్మాదులగు కొందఱు కొంతకాలమువఱకు స్థిరమగు యాకారమును బొందియుందురు. దేవమనుష్యాదులను తరంగములు అస్థిరములై యుత్పన్నమైన వెంటనే శీఘ్రముగ నశించుచున్నవి.

కృమికీటపతంగాహి గోమశాజగరాదికాః
కాశ్చిత్తస్మిన్మహాంబోధౌ స్ఫురంత్యేతేంబుబిందువత్. 69

ఆ మహాసముద్రమున కృమిగోకీట పతంగసర్ప మశకా, జగరాదులు జలబిందురూపమున స్ఫురించుచున్నవి.

కాశ్చిచ్చలానరమృగ గృధ్రజంబులకాదికాః
స్ఫురంతిగిరికుంజేషు వేలావనలతేష్వివ. 70

నదీతటస్థ వనములందు చంచలలతాదులవలె కొన్ని అస్థిరరూపములగు మనుష్య మృగ గృధ్రశృగాలాదులుగ పర్వతకుంజములందు స్ఫురించుచున్నవి.

సుదీర్ఘజీవితాఃకాశ్చి త్కాశ్చిదత్యల్పజీవితాః
అతుచ్ఛకలనాఃకాశ్చి త్కాశ్చిత్తుచ్ఛశరీరకాః. 71

ఒకని జీవిత మతిదీర్ఘముగను మఱియొకనిది అత్యల్పముగనునున్నది. ఒకని దేహము విశాలమైనదిగను, సుందరముగను మఱొకనిది యతి తుచ్ఛముగను నున్నది.

సంసారస్వప్నసంరంభే కాశ్చిత్స్థైర్యేణభావితాః
సువికల్పహతాఃకాశ్చి చ్ఛంకం తేసుస్థిరంజగత్. 72

సంసారస్వప్నకార్యమున కొందఱు చిరకాలమువరకు స్థిరముగనుండునట్లు కల్పింపబడిరి. మఱికొందఱు దృఢవికల్పములచే మోహితులై యీజగత్తు స్థిరమైనదని భావించుచున్నారు.

అల్పాల్పభావనాఃకాశ్చి ద్దైన్యదోషవశీకృతాః
కృశోఽతిదుఃఖీమూఢోఽహమితిదుఃఖై ర్వశీకృతాః. 73

అతితుచ్ఛభావముగల కొందఱు 'నేను కృశుడను, నేనతిదుఃఖిని, నేనతిమూఢుడన'ని తలంచుచు దీనత్వమను దోషమునకు వశీభూతులై దుఃఖములకు లోనగుచున్నారు.

కాశ్చిత్స్థావరతాంయాతాః కాశ్చిద్దేవత్వమాగతాః
కాశ్చిత్పురుషతాంప్రాప్తాః కాశ్చిదర్ణవతాంగతాః. 74

ఆత్మయను సముద్రమందు తరంగరూపముగనున్న మఱికొందఱు స్థావరత్వమును, కొందఱు దేవభావమును పొందిరి. కొందఱు మానుషదేహమును ప్రాప్తినొందిరి. ఇంక కొందఱు సుషుప్తి, ప్రళయములందువలె అవ్యక్తమగు వాసనారూపమైన మోహార్ణవమును పొందిరి.

కాశ్చిత్స్థితాజగతికల్పశతాన్యనల్పాః
కాశ్చిద్వ్రజంతి పరమంపదమిందుశుద్ధాః
బ్రహ్మార్ణవాత్సముదితాలహరీవిలోలా
శ్చిత్సంవిదోహి మననాపరనామవత్యః. 75

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
భార్గవోపాఖ్యానే సంసారప్రవృత్తిదర్శనంనామైకాదశః
సర్గః ॥ 11 ॥

ఓ మహాత్మా ! ఇవన్నియు బ్రహ్మమను సముద్రమునుండి యావిర్భవించిన తరంగములు. వానికే స్ఫురణరూపంబగు మనస్సను నామమునుగలదు. ఇయ్యవి చంచల యుపాధితోగూడిన చైతన్యముయొక్క భేదములైయున్నది. వీనిలో కొన్ని యీ జగంబున యనేకకల్పముల వఱకు స్థిరత్వమును పొందుచున్నవి. మఱికొన్ని చంద్రునిపగిది జ్ఞానామృతముచే శుద్ధము పరమపదమగు మోక్షమును ప్రాప్తినొందుచున్నవి.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు స్థితిప్రకరణమున
భార్గవోపాఖ్యానమందు సంసారప్రవృత్తి దర్శనమను
ఏకాదశ సర్గము ॥ 11 ॥

## ద్వాదశః సర్గః.

కాల ఉవాచ :—

సురాసురనరాకారా ఇమాయాఃసంవిదోమునే
బ్రహ్మార్ణవాదభిన్నాస్తాః సత్యమేతన్మృషేతరత్. 1

కాలుడు :—ఓ మునీంద్రా ! సురాసుర మనుజరూపమున యుపాధిచే భిన్నముగానున్న యీ సంవిత్స్వరూపములన్నియు బ్రహ్మమను సముద్రమున కభిన్నములగును. ఈ బ్రహ్మమే సత్యము. బ్రహ్మేతరమగున దంతయు మిథ్యయే.

మిథ్యాభావనయాబ్రహ్మన్ స్వవికల్పకలంకితాః
నబ్రహ్మవయమిత్యంత ర్నిశ్చయేనహ్యధోగతాః. 2

ఓ మహాత్మా ! అనాత్మయం దాత్మభ్రాంతియను మిథ్యారూపమగు స్వవికల్పముచే దూషితులై 'నేను బ్రహ్మముగాదను నిశ్చయముగలవారై యద్దానిచే జీవులు అధోగతిని పొందుచున్నారు.

బ్రహ్మణోస్యతిరిక్తత్వం బ్రహ్మార్ణవగతాఅపి
భావయంత్యోవిముహ్యంతి భీమాసుభవభూమిషు. 3

బ్రహ్మమను సముద్రమం దభిన్నరూపత్వమును పొందియున్నను, బ్రహ్మముకంటె భిన్నమగు పరిచ్ఛిన్నరూపమే తామనిభావించువారు, అక్కారణమున భయంకరమగు సాంసారమునబడి విమోహితులగుచున్నారు.

యాపతాఃసంవిదోబ్రాహ్మ్యో మననైకకలంకితాః
ఏత త్తత్కర్మణాంబీజ మప్యకర్మైవవిద్ధితాః. 4

ఓ దేవా ! దేహమం దాత్మాభిమానమను కళంకమే జీవుల పుణ్యపాప ప్రవృత్తులకు బీజమైయున్నది. అట్లున్నను, పరమార్థమున జీవులు నిష్క్రియమగు బ్రహ్మమేయని యెఱుంగుము.

సంకల్పరూపయైవాంత ర్మనేకలనయైతయా
కర్మజాలకరంజానాం బీజముష్ట్యాకరాలయా. 5

ఇమాజగతివిస్తీర్ణాః శరీరోపలపంక్తయః
తిష్ఠంతిపరివల్గంతి రుదంతిచహసంతిచ. 6

ఓ మునీంద్రా ! కర్మసమూహమను కంటకములకు బీజభూతమును, భయంకరమగు ముష్టి (పిడికిలి) రూపమును నైన సంకల్పరూపమగు చిత్తకల్పనచే శరీరములను పాషాణసమూహములు యీ జగంబున విస్తారముగ విసరబడుచునుండి, విజృంభించుచున్నవి, దుఃఖించుచున్నవి, సంతోషించుచున్నవి.

ఆబ్రహ్మస్తంబపర్యంతం స్పందనైఃపవనోయథా
ఉల్లసంతినిలీయంతే మ్లాయంతివిహసంతిచ. 7

బ్రహ్మాది స్తంబపర్వతమును వాయువు గతిభేదంబులచే వ్యాపించియున్న చందమున, సంకల్పముచే కల్పితములగు యీ జీవచైతన్యములును విజృంభించుచు, లుప్తమగుచు నున్నవి.

తాపితాః కాశ్చిదత్యచ్ఛా యథాహరిహరాదయః
కాశ్చిదల్పవిమోహస్థా యథోరగనరామరాః. 8

వీరిలో బ్రహ్మ విష్ణుహరాదులును కొందఱు జ్ఞానముయొక్క పరాకాష్ఠను పొందుటచే మిగుల స్వచ్ఛులును, నాగదేవతాదులను మఱికొందఱు జ్ఞానాధికారులు మాత్రమగుటచే యల్ప విమోహంబున నున్నవారును నగుదురు.

కాశ్చిదత్యంతమోహస్థా యథాతరుతృణాదయః
కాశ్చిదజ్ఞానసమ్మూఢాః కృమికీటత్వమాగతాః. 9

వృక్షతృణాదులవలె కొందఱు గాఢాజ్ఞానమున మునింగియున్నారు. కృమి, కీటత్వదశను బొంది కొందఱజ్ఞానముచే విమూఢులైయున్నారు.

కాశ్చిత్తృణవదుహ్యంతే దూరే బ్రహ్మమహోదధేః
అప్రాప్తభూమికాపతా యథోరగనగాదయః. 10

కొందఱు శాస్త్రవిరుద్ధమగు కార్యములనాచరించుటచే బ్రహ్మమను సముద్రమునుండి అనగా కైవల్యపదమునుండి తృణమువలె దూరముగ త్రోసివేయబడుచున్నారు. సర్పపర్వతాదులగు వీరు మోక్షపదమును పొందకయుందురు.

సత్వమాత్రంసమాలోక్య కాశ్చిద్దేవముపాగతాః
జాతాజాతానిఖన్యంతే కృతాంతజరశాఖునా. 11

మఱికొందఱు సంసారశ్రమరహితమును, విశ్రాంతికి హేతుభూతమునగు యుచితభూమికలను బొంది దేవత్వదశను ప్రాప్తినొంది శాస్త్రశ్రవణముచేసి తదనుసారము వర్తించుచున్నను, దుష్టప్రారబ్ధమను వృద్ధమూషకంబుచే బాధింపబడుచున్నారు.

కాశ్చిదంతరమాసాద్య బ్రహ్మతత్త్వమహాంబుధేః
గతాస్తత్తాంసమంకాయై ర్హరిబ్రహ్మహరాదికాః. 12

బ్రహ్మహరాదులగు కొందఱు కించిద్భేదకమగు విశుద్ధజ్ఞానమునుబడసి తమ శరీరములతో సహా బ్రహ్మమను మహాసముద్రముతోటి సమరూపమునుబొందిరి. అనగా జీవన్ముక్తులైరి.

అల్పమోహాత్మికాః కాశ్చిత్తమేవబ్రహ్మవారిధిమ్
అదృష్టపారభూమ్యాఘ మవలంబ్యవ్యవస్థితాః. 13

అల్పమోహముగల మఱికొందఱు అనంతమును, పరిపూర్ణమునునగు బ్రహ్మమను మహా సముద్రమును సమాధిద్వారా నాశ్రయించియున్నారు.

కాశ్చిద్భోక్తవ్యజన్మౌఘ శుక్తజన్మౌఘకోటయః
వంధ్యాఃప్రకాశతామస్యః సంస్థితాభూతజాతయః. 14



ప్రాణులలో కొన్నిజాతులు కోట్లకొలది జన్మలననుభవించినను, మోక్షమనుఫలమును పొందకయున్నందున వంధ్యులే యగుదురు. మోక్షాధికారియగు మానుషజన్మమును ప్రకాశము పొందినను వారు తమస్సునందే యుందురు.

కాశ్చిదూర్ధ్వాదధోయాతి యథాహస్తాన్మహాత్ఫలమ్
ఊర్ధ్వాదూర్ధ్వతరంకాశ్చి దధస్తాత్కాశ్చిదప్యధః. 15

చేతినుండిజారి ఫలము క్రిందపడునట్లు, కొందఱుత్తమజన్మనుండి నీచజన్మను పొందుచున్నారు. మఱికొందఱు యింకను ఉత్తమమగు జన్మలను పొందుచున్నారు. పశుత్వమునుండి కీటత్వమునకువలె కొందఱు నీచస్థితినుండి యింకను నీచమగుస్థితిని బొందుచున్నారు.

బహుసుఖదుఃఖకరాకరాక్షయేయం
పరమపదాస్మరణాత్సమాగతేహ
పరమపదావగమాత్ప్రయాతినాశం
విహగపతిస్మరణాద్విషవ్యథేవ. 16

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
భార్గవోపాఖ్యానే సంసారోత్పత్తివిస్తారవర్ణనంనామ
ద్వాదశః సర్గః ॥ 12 ॥

ఓ మహాత్మా ! అనేక సుఖదుఃఖముల గల్గజేయునదియు, జన్మలకు నిలయమునునగు యీ జీవత్వము పరమపదమగు తన ఆత్మస్వరూపమును మఱచుటచేతనే గలిగినది. మఱియు, గరుత్మంతుని స్మరించినంతనే విషబాధ శమించునట్లు, ఆ పరమపదమగు ఆత్మస్వరూపముయొక్క బోధచే జీవత్వము నశించును.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు స్థితిప్రకరణమున
భార్గవోపాఖ్యానమందు సంసారోత్పత్తివిస్తారవర్ణనమను
ద్వాదశ సర్గము ॥ 12 ॥

---

## త్రయోదశః సర్గః.

---

కాల ఉవాచ :—

ఏతాసాంభూతజాతీనా మూర్మీణామివసాగరాత్
వివిధానాంవిచిత్రాణాం లతానామివమాధవే. 1
భవ్యాజితమనోమోహా దృష్టలోకపరావరాః
జీవన్ముక్తాభ్రమంతీహ యక్షగంధర్వకింనరాః. 2

కాలుడు :—ఓ మునీంద్రా! సముద్రమునుండి గలిగిన తరంగములవలెను, వసంతఋతువునం దుత్పన్నమైన లతలవలెను పరమాత్మనుండి యావిర్భవించిన అనేక చిత్రవిచిత్రములగు జీవజాతులలో, మనస్సుయొక్క మోహమును జయించినవారును, ఇహపరలోకముల తత్త్వమెఱింగినవారును మాత్రమే కృతార్థులగుదురు. యక్ష, గంధర్వ, కిన్నర, మనుష్యరూపులగు నట్టివారే జీవన్ముక్తులై యీ ప్రపంచమున విహరించుచున్నారు.

అన్యేతుకాష్ఠకుడ్యాభా మూఢాఃస్థావరజంగమాః
అపక్షీణమోహాస్తే కిం తేషాం ప్రవిచార్యతే. 3

ఇక అన్యప్రాణులు కాష్ఠ, కుడ్యములవలె మూఢులై స్థావరజంగమత్వముల బొందుచున్నారు. మోహమునశించిన తత్త్వజ్ఞానుల కిక శాస్త్రవిచారమెందులకు? సాధనచతుష్టయ సంపన్నులును, అజ్ఞానులునగు వారలకు మాత్రమే శాస్త్రములు ప్రయోజనవంతములగును.

లోకే ప్రబుధ్యమానానాం భూతానామాత్మసిద్ధయే
విహరంతీహ శాస్త్రాణి కల్పితాన్యుదితాత్మభిః. 4

లోకమున ఆత్మజ్ఞానముయెడ జాగరూకులైయున్న వారికొఱకే జ్ఞానులగు మహాత్ములచే వచింపబడిన శాస్త్రములు విశేషముగ బల్కుచున్నవి. అనగా, శాస్త్రముల రచించి జ్ఞానముద్వారా అజ్ఞానుల నుద్ధరించుటయే, మోహమునశించిన మహాత్ముల దేహధారణయొక్క ప్రయోజనమని భావము.

సంప్రబుద్ధాశయా యేతు దుష్కృతానాం పరిక్షయే
తేషాం శాస్త్రవిచారేషు నిర్మలాధీః ప్రవర్తతే. 5

పాపములు నశించుటచే యంతఃకరణము శుద్ధమైనట్టి సజ్జనులయొక్క నిర్మలబుద్ధియే శాస్త్రవిచారమందు ప్రవృత్తమగుచున్నది.

విలీయతే మనో మోహః సచ్ఛాస్త్రప్రవిచారణాత్
నభోవిహరణాద్భానోః శార్వరం తిమిరం యథా. 6

ఓ మహాత్మా! ఆకసమున సూర్యభగవానుడు సంచరించుటచే రాత్రియందలి యంధకారము నశించులాగున, సచ్ఛాస్త్రవిచారముచే మనస్సునందలి మోహము నశించును.

అక్షీయమాణం హి మనో మోహాయైవ న సిద్ధయే
నీహార ఇవ సంఛాద్య వేతాల ఇవ వల్గతి. 7

మనస్సునందలి మోహము నశించని వాడజ్ఞానమునే పొందును గాని మోక్షసిద్ధిని పొందడు. ఆకసమును మంచుగప్పు విధమున మోహమంతఃకరణమును గప్పినదై విజృంభించుచున్నది.

సర్వేషామేవ దేహానాం సుఖదుఃఖార్థభాజనమ్
శరీరం మనఏవేహ నతు మాంసమయం మునే. 8



ఓ మునీశ్వరా! దేహముతోటి ఆత్మాధ్యాసమొనర్చునట్టి సర్వజీవులయొక్క మనస్సను శరీరమే సుఖదుఃఖముల ననుభవించునది యగును గాని యీ మాంసమయ దేహముగాదు.

యోఽయం మాంసాస్థిసంఘాతో దృశ్యతే పాంచభౌతికః
మనోవికల్పనం విద్ధి న దేహః పరమార్థతః. 9

మఱియు మాంసము, ఎముకలు మున్నగువానిచే నిర్మింపబడిన యీ దృశ్యమానమగు పాంచభౌతిక [illegible] ము మనస్సుయొక్క వికల్పమనియే నీవెఱుంగుము. ఏలయన యీ పాంచభౌతిక [illegible] లేనిదేయగును.

మనఃశరీరేణ తవ పుత్రోఽయం కృతవాన్మునే
తదేవ ప్రాప్తవానాశు వయం నాత్రాపరాధినః. 10

ఓ మునీంద్రా! మనస్సను శరీరముచే నీ పుత్రుండేది యొనర్చెనో, దానినే యాతడు [illegible]గ బొందెను. ఇందు మా యపరాధమేమియును లేదు.

స్వయా వాసనయా లోకో యద్యత్కర్మ కరోతి యః
స తథైవ తదాప్నోతి నేతరస్యేహ కర్తృతా. 11

తన వాసనలననుసరించి జీవు డేయే కర్మలనొనర్చునో వాని కనురూపమగు ఫలమునే యాతడు పొందును. ఇందితరుల కర్తృత్వమేమియును లేదు.

స్వానుసంహితమంతర్యన్మనోవాసనయా స్వయా
కో నామ భువనేశోఽస్తి తత్కర్తుం యస్య శక్తతా. 12

వాసనాయుక్తమగు మనస్సు అనుసంధాన మాత్రమున క్షణములో నొనర్చుదానిని జగదీశుండయ్యు చిరకాలమునకైనను యెవరొనర్పగలరు? (యొనర్ప జాలరనుట.)

యే సర్గా నరకాభోగా యా జన్మమరణైషణాః
స్వమనోమననేనేదం స నిష్పందోఽపి దుఃఖదః. 13

సృష్టి, నరకము, జననమరణాదులంగూర్చిన యిచ్ఛ — ఇదంతయు మనస్సుయొక్క స్ఫురణముచేతనే గల్గుచున్నది. అట్టి మనస్సుయొక్క యొకింత చలనముగూడ దుఃఖప్రదమేయగును.

బహునాత్ర కిముక్తేన శబ్దసంగ్రహకారిణా
ఉత్తిష్ఠ భగవన్యామో యత్ర తే తనయః స్థితః. 14

ఓ మహాత్మా! ఇక విశేష శబ్దజాలము రచించి వచింప నేమి ప్రయోజనము? లెమ్ము, నీ పుత్రుడున్నచోటికి బోవుదము.

సర్వం చిత్తశరీరేణ భుక్త్వా శుక్రః క్షణాదివ
అథేందురశ్మిసంఘట్టాత్సమంగాతాపసః స్థితః. 15

మనస్సను శరీరముచే శుక్రాచార్యుడు క్షణములో స్వర్గాదిభోగములన్నింటిని ననుభవించి, యటనుండిపడి చంద్రకిరణ సంబంధముచే నోషధులద్వారా గర్భమున బ్రవేశించి తాపసియైజన్మించి సమంగానదీతటమున నుండియున్నాడు.

తత్రత్ప్రాణపవనశ్చిత్తా న్ముక్తఇంద్వంశువత్ఫలమ్
అవశ్యాయతయాభూత్వా వీర్యం తేనాంతరాస్థితః. 16

శుక్రాచార్యుని ప్రాణవాయువు చేతనశక్తినుండి వినిర్ముక్తమై అందుచే సమ్మూర్ఛితమైనదై చంద్రుని సంపర్కముచే మంచుద్వారా ధాన్యాదులందు ప్రవేశించి, భుజింపబడినదై పురుషుని వీర్యరూపమును బొంది జన్మనుధరించెను.

ఇత్యుక్త్వాభగవాన్కాలో హసన్నివజగద్గతిమ్
హస్తాద్ధస్తేనజగ్రాహ భృగుమిందుమివాంశుమాన్. 17

భగవంతుడగు కాలుడిట్లు వచించి జగద్గతినిజూచి నవ్వుచున్నవానివలె నుండి చంద్రుని సూర్యుడు గ్రహించువిధమున భృగుమునీంద్రుని కరమును తన కరముతో బట్టుకొనెను.

అహోనుచిత్రానియతే ర్వ్యవస్థేతివదఞ్ఛనైః
భగవాన్భృగురుత్తస్థా వుదయాద్రేర్యథారవిః. 18

'ఆహా! దైవ (కర్మ) వ్యవస్థ యెట్టి విచిత్రమైనద'ని మెల్లగబల్కుచు భగవంతుడగు భృగువు యుదయాద్రినుండి సూర్యునివలె తన యాసనమునుండి లేచెను.

తేజోనిధీహసమమంగసముత్థితౌతౌ
భాతస్తదాంబరతలేనతమాలజాలే
తుల్యోదయావివనభస్యమలేవిహర్తు
మభ్యుత్థితౌసజలదాసకలేందుసూర్యౌ. 19

ప్రియుండవగు నో రామా! తేజోనిధులగు భృగుకాలులిరువురును తమాలవృక్షసహితమగు మందరపర్వతముపైనుండి లేచిరి. అపుడు వారిరువురును, మేఘసహితమగు యాకసమున విహరింప నుద్యుక్తులై, కూడి యుదయించిన పూర్ణచంద్ర సూర్యులవలె శోభించుచుండిరి.

శ్రీవాల్మీకిరువాచ :—

ఇత్యుక్తవత్యథమునౌదివసోజగామ
సాయంతనాయవిధయేఽస్తమినోజగామ
స్నాతుంసభాకృత నమస్కరణాజగామ
శ్యామాక్షయేరవికరైశ్చసహాజగామ. 20

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
భార్గవోపాఖ్యానే భృగుసమాశ్వాసనంనామ
త్రయోదశః సర్గః ॥ 13 ॥

అష్టమోదివసః

శ్రీవాల్మీకి :—వసిష్ఠమునీంద్రు లిట్లుబల్క నంత సాయంసమయము కాగా సూర్యభగవానుఁ డస్తాద్రింగ్రుఁకెను. అపుడు సభాసదులందఱును స్నానసంధ్యాది కృత్యముల నిర్వర్తించుటకై



[illegible]చిరి. ఆ రాత్రి గడచినమీదట మరల సూర్యోదయ సమయమునకు వారందఱును పరస్పరము [illegible]స్కరించుకొనుచు నా సభాస్థాన మలంకరించిరి.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు స్థితిప్రకరణమున
భార్గవోపాఖ్యానమందు భృగుసమాశ్వాసనమను
త్రయోదశ సర్గము ॥ 13 ॥

ఎనిమిదవరోజు.

---

## చతుర్దశః సర్గః

---

శ్రీవసిష్ఠ ఉవాచ :—

అథకాలభృగూదేవౌ మందరాచలకందరాత్
గంతుంప్రవృత్తావవనౌ సమంగాసరితస్తటమ్. 1

శ్రీవసిష్ఠుడు :—ఓ రామా! పిమ్మట కాల భృగుదేవులిరువురును భూమిపైకి దిగివచ్చి [illegible]ంగా నదీతటమునకు బోనుద్యుక్తులైరి.

తౌశైలాదవరోహంతౌ దృష్టవంతౌమహాద్యుతీ
నవహైమలతాజాల కుంజసుప్త నభశ్చరాన్. 2

గొప్ప తేజస్సంపన్నులగు వారిరువురును పర్వతమునవరోహించు సమయమున యచట [illegible]తన సువర్ణముచే రచింపబడిన లతాసమూహములుగల నికుంజములందు నిద్రించుచున్న దేవతలను, [illegible]లను జూచిరి.

వల్లీవలయదోలాభిః క్రీడతోగగనాంగణే
హరిణీముగ్ధముగ్ధాక్షీ ప్రేక్షితస్మారితోత్పలాన్. 3

ఆ దేవతలు లతలచేనిర్మితములగు యూయెలలందు ఆకాశప్రాంగణమున క్రీడలు సల్పుచుండిరి. హరిణంబులమాడ్కి ముగ్ధకటాక్షములుగల్గి వీక్షించుచున్న అప్సరాగణము కమలదళంబుల స్మరింప జేయుచుండిరి.

సిద్ధానధ్యాసితోత్తుంగ శిలాశకలవిష్టరాన్
ధృతాకారానివోత్సాహాన్ హేలాదృష్టజగత్త్రయాన్. 4

ఎత్తైన శిలాఖండములను యాసనముపై గూర్చుండి ముల్లోకముల నవజ్ఞతో జూచుచు, [illegible]ర్తివంతమగు యుత్సాహమువలె గన్పట్టుచున్న సిద్ధులనుకూడ గాంచిరి.

కృతాజస్రపతత్పుష్ప ధారాసారనిమజ్జనాన్
తాలోత్తాలకృతోద్ధస్త హస్తాన్హస్తిఘటాపతీన్. 5

మఱియు నిరంతరము పుష్పధార బడుచుండునట్టి జలప్రవాహమందు స్నానమొనర్చినట్టివియు, తాళవృక్షమువంటి పొడవైన తొండములుగలవియునగు యేనుగుల గుంపులను వారు జూచిరి.

మదావలేపనిద్రాలూ న్మదాన్మూర్తానివస్థితాన్
పుష్పకేసరరక్తాంగ పవనారుణవాలధీన్. 6

ఆ గజశ్రేష్ఠములు మదముతోఁగూడి నిద్రాయుక్తములై యున్నవియు పుష్పకేసరములచే రంజితములగు రక్తపుచ్ఛములుగలవియు, మూర్తివంతమగు మదమువలె తోఁచునవియునై యుండెను.

చంచలాంశ్చమరాంశ్చారూన్ భూభృన్మండలచామరాన్
కృతాజస్రపతత్పుష్ప ధారాసారనిమజ్జనాన్. 7

చంచలములును, సుందరములును మందరపర్వతమునకు చామరములవలెనున్నవియు నగు చమరమృగములను, మఱియు నిరంతరము పుష్పధారపడుచుండు జలప్రవాహములందు స్నానమొనర్చిన కిన్నరులనుగూడ వారు జూచిరి.

కిన్నరాన్ భూమఖర్జూరాన్ శాఖాసరలతాంగతాన్
పరస్పరఫలాఘాత క్ష్వేడవర్జితకీచకాన్. 8
ధాతుపాటలదుర్వక్త్రా న్మర్కటాన్నటనోత్కటాన్
లతావితానసంఛన్న సానూపవనమందిరాన్. 9

మఱియు వారట కిన్నరులను శాఖాపర్యంతము వంపులేకయున్న ఖర్జూరవృక్షములను జూచిరి. ఖర్జూరఫలముల పరస్పర తాడనమను క్రీడలచే క్రిందనున్న వెదురువృక్షములను గూడ ఫలయుక్తమొనర్చునట్టివియు, గైరిక ధాతువువలె యెఱ్ఱనివియు, కురూపములగు ముఖములుగలవియు, గంతులువేయుటయందు నేర్పరులును నగు వానరంబుల నట జూచిరి. లతాసమూహములచే నాచ్ఛాదితములగు పర్వతశిఖరములను, ఉపవనములను, మందిరములనుగూడ నవలోకించిరి.

సిద్ధానసురనారీభి ర్మందారకుసుమాహతాన్
ధాతుపాటలనిర్ద్వార పయోదపటసంవృతాన్. 10

అప్సరసలచేత మందారపుష్పములచేఁ గొట్టబడుటచే గైరికధాతువువలె రక్తవర్ణము గల్గియున్నవారును, ఛిద్రరహితమేఘమను వస్త్రముచే నావృతులునునగు సిద్ధులను దేవతలను గాంచిరి.

తటానజనసంసర్గాన్ బౌద్ధాన్ప్రవ్రజితానివ
సరితఃకుందమందార పినద్ధలహరీఘటాః
సాగరోత్కతయేవాత్త మధుమాసప్రసాధనాః. 11

బౌద్ధసన్యాసుల నివాసమువలె మనుష్యసంచారవర్జితమగు తటములను జూచిరి. కుందమందారాది పుష్పములచే గ్రుచ్చబడిన తరంగ సమూహములుగలవియు, సముద్రమను ప్రియుని జేరుటకై యుత్కంఠతచే చైత్రమాసోత్పన్న పుష్పఫలాదిరూపమగు యాభరణముల ధరించియున్న నదులఁజూచిరి.



పుష్పభారపినద్ధాంగాన్ వృక్షాన్ పవనకంపితాన్
క్షీబానివమధుప్రాప్తౌ ఘూర్ణాన్మధుకరేక్షణాన్. 12

పుష్పభార గుంఫితములును, వాయువుచే నాకంపితములును, భ్రమరములను నేత్రములు గలవియు, వసంతఋతు వేతెంచుటచే మదోన్మత్తునివలె గన్పట్టుచున్నవియు నగు వృక్షములఁ జూచిరి.

శైలరాజశ్రియంస్ఫీతాం పశ్యంతౌతావితస్తతః
ప్రాప్తవంతౌవసుమతీం పురపత్తనమండితామ్. 13

ఆ పర్వతరాజంబుల నిర్మలశోభను యిటునటు గాంచుచు, వారిరువురును గ్రామనగరాదులచే శోభించుచున్న పృథ్వీతలముఁజేరిరి.

క్షణాదవాపతుస్తత్ర పుష్పలోలతరంగిణీమ్
సమంగాంసరితంసాధూ సర్వపుష్పమయీమివ. 14

అమ్మహాత్ములిర్వురును పుష్పయుక్తమగు చంచల తరంగములుగలదియు, పుష్పమయమై యున్నదియు నగు సమంగానదిని క్షణములో సమీపించిరి.

దదర్శాథతటేతస్మిన్ కస్మింశ్చిత్తనయంభృగుః
దేహాంతరపరావృత్తం భావమన్యముపాగతమ్. 15

పిమ్మట యొకానొక వృక్షముక్రింద భృగువు తన పుత్రుని గాంచెను. మఱొకశరీరము ధరించుటచే నాతడు శుక్రాచార్యునికంటె విలక్షణభావమును పొందియుండెను.

శాంతేంద్రియంసమాధిస్థ మచంచలమనోమృగమ్
సుచిరాదివవిశ్రాంతం సుచిరశ్రమశాంతయే. 16

వాని యింద్రియములన్నియు ప్రశాంతములై యుండెను. సమాధియందుండుటచే మనస్సను మృగము చంచలత్వమును వీడియుండెను. మఱియు నాతడనాదికాలమునుండి పొందిన పరిశ్రమయొక్క శాంతికొఱకై చిరకాలము విశ్రాంతి గొనుచున్నట్లుండెను.

చింతయంతమివానంతా శ్చిరభుక్తాచిరోజ్ఝితాః
సంసారసాగరగతీ హర్షశోకనిరంతరాః. 17

మఱియు నాతడు చిరకాలమనుభవించి, శీఘ్రముగ త్యజించివైచినదియు, నిరంతరము హర్షశోకములతోఁ గూడియుండునదియునగు సంసారసాగరముయొక్క గతినిగూర్చి విచారించుచున్నట్లుండెను.

నూనంనిశ్చలతాంయాత మతిభ్రమితచక్రవత్
అనంతజగదావర్త వివర్తాతిశయాదివ. 18

అనంతమగు జగత్తుయొక్క యావర్తాధిక్యముచే వైరాగ్యకారణంబున, అతివేగముగ పరిభ్రమించు చక్రముమాడ్కి నిశ్చలత్వమును పొందియుండెను.

ఏకాంతసంస్థితంకాంతం కాంత్యైకాకినమాశ్రితమ్
ఉపశాంతేహసంభగ్న చిత్తసంభ్రమసంగమమ్. 19

ఏకాంతమందున్నవాఁడై, అతి సుందరమగు యేకాంతశోభారూపమగు ప్రియురాలిచే సేవింపబడుచు, చిత్తము నశించుటచే భ్రమరహితుఁడై ప్రశాంతముగ నుండెను.

నిర్వికల్పసమాధిస్థం విరతంద్వంద్వవృత్తితః
హసంతమఖిలాంలోక గతింశీతలయాధియా. 20

చిత్తవృత్తుల నిరసించి నిర్వికల్ప సమాధియందున్నవాఁడై, ప్రశాంతమగు నిర్మలబుద్ధిచే జగద్గతినంతను వీక్షించి నవ్వుచున్నట్లుండెను.

విగతాఖిలవృత్తాంతం విగతాశేషభోక్తృతమ్
నిరస్తకల్పనాజాల మాలంబితమహాపదమ్. 21

సర్వలోకవృత్తాంతము నెఱింగినవాఁడగుచు, భోక్తృత్వమంతయును విడనాడి సమస్త కల్పనాసమూహమును విధ్వస్తమొనర్చి యుత్తమమగు బ్రహ్మపదము నాశ్రయించి యుండెను.

అనంతవిశ్రాంతితతే పదేవిశ్రాంతమాత్మని
ప్రతిబింబమగృహ్ణాంతం సితంమణిమివాస్థితమ్. 22

పూర్ణవిశ్రాంతిని బడయుచు, వ్యాపకమగు నాత్మయందు విశ్రమించుచున్నవాఁడై, ప్రతిబింబ గ్రహణమొనర్చుచు స్థిరముగనుండు నిర్మలస్ఫటికమణివలె శోభించుచుండెను.

హేయోపాదేయసంకల్ప వికల్పాభ్యాంసముజ్ఝితమ్
సంప్రబుద్ధమతింధీరం దదర్శతనయంభృగుః. 23

ఓ రామా ! హేయోపాదేయములగూర్చిన సంకల్ప వికల్పములేనివాఁడును, జ్ఞానయుక్తుఁడును, ధీరుఁడును, జన్మాంతరము నొందినవాఁడునగు తన పుత్రుని భృగువు జూచెను.

తమాలోక్యభృగోఃపుత్రం కాలోభృగుమువాచహ
వాక్యమబ్ధిధ్వనినిభం తవపుత్ర స్త్వసావితి. 24

భృగుతనయుఁగాంచి సముద్రమువలె గంభీర నినాదమొనర్చుచు కాలుఁడు భృగువుతో నిట్లనియె — 'ఈతఁడే నీ కుమారుఁడు.'

విబుద్ధ్యతామితిగిరా సమాధేర్విరరామసః
భార్గవోంభోదఘోషేణ శనైరివశిఖండభృత్. 25

'లెమ్మ' అను శబ్దమువినినంతనే, నిద్రించుచున్న మయూరము మేఘముయొక్క గంభీర నాదమును వినిలేచునట్లు, శుక్రాచార్యుఁడు సమాధినుండి మేల్కాంచెను.

ఉన్మీల్యనేత్రేసోఽపశ్య దంతేకాలభృగూప్రభూ
సమోదయావివాయాతౌ దేవౌశశిదివాకరౌ. 26

అట్లు సమాధినుంచి మేల్కాంచినవాఁడై నేత్రములతెఱచి, కలసి యుదయించిన చంద్రసూర్యులవలెనున్న కాల భృగుదేవులను తనచెంత జూచెను.



కదంబలతికాపీఠా దథోత్థాయసనామతౌ
సమఖాసమాగతౌకాంతౌ విప్రౌహారిహరావివ. 27

పిమ్మట శుక్రుఁడు కదంబలతానిర్మితమగు యాసనమునుండి లేచి, సమానరూపముగల్గి సుందర బ్రాహ్మణవేషము ధరించివచ్చిన శివకేశవులకువలె వారిరువురకును ప్రణమిల్లెను.

మిథఃకృతసమాచారాః శిలాయాంసముపావిశన్
మేరుపృష్ఠేజగత్పూజ్యా బ్రహ్మవిష్ణుహరాఇవ. 28

పరస్పరము సత్కరించుకొని, మేరుపర్వతముపై జగత్పూజ్యులగు బ్రహ్మవిష్ణు మహేశ్వరులవలె వారు ముగ్గురును యొకశిలపై నుపవిష్టులైరి.

అథశాంతజపోరామ ససమంగాతటోద్విజః
తావువాచవచఃశాంత మమృతస్యందసుందరమ్. 29

అటుపిదప సమంగానదీతీరమునవసించు బ్రాహ్మణుఁడగు నా శుక్రుఁడు తన సమాధిని చాలించి వారిరువురఁగూర్చి అమృతప్రవాహమువంటి మధురవచనములఁ బల్కెను.

భవతోర్దర్శనేనాహ మద్యనిర్వృతిమాగతః
సమమాగతయోర్లోకే శీతలోష్ణరుచోరివ. 30

ఓ మహాత్ములారా ! ప్రపంచమున కలసియేతెంచిన చంద్రసూర్యుల దర్శనముచే శాంతి లభించునట్లు, మీరిరువుర దర్శనముచే నేను పరమశాంతిని ప్రాప్తినొందితిని.

యోనశాస్త్రేణతపసా నజ్ఞానేనాపివిద్యయా
వినష్టోమేమనోమోహః క్షీణోఽసౌదర్శనేనవామ్. 31

ఏ మోహము శాస్త్రముచేగాని, తపముచేగాని, విద్యచేగాని నశింపకున్నదో, అయ్యది మీ యిర్వుర దర్శనమాత్రముచే నశించినది.

నతథాసుఖయంత్యంత ర్నిర్మలామృతవృష్టయః
యథాప్రహర్షయంత్యేతా మహతామేవదృష్టయః. 32

నిర్మలమగు అమృతవృష్టిగూడ మీవంటి మహాత్ములదృష్టివలె సుఖమును గలుగఁజేయజాలదు.

చరణాభ్యామిమందేశం భవంతౌభూరితేజసౌ
కౌపవిత్రితవంతౌనః శశాంకార్కావివాంబరమ్. 33

సూర్యచంద్రులు తమ కిరణములచే నాకాశమును పవిత్రమొనర్చునట్లు, తమ చరణకమలములచే మమ్ముల పావనమొనర్చిన అతితేజస్సంపన్నులగు మీరెవరు ?

ఇత్యుక్తవంతంప్రోవాచ భృగుర్జన్మాంతరాత్మజమ్
స్మరాత్మానంప్రబుద్ధోఽసి నాజ్ఞోఽసీతిరఘూద్వహ. 34

రఘుకులశ్రేష్ఠుఁడగు నో రామచంద్రా ! శుక్రుఁడిట్లుబల్క 'నిన్ను నీవు స్మరణకుదెచ్చుకొనుము; ఇపుడునీవు జ్ఞానివేగాని అజ్ఞానివిగాద'ని జన్మాంతరమునొందిన తనపుత్రునితో భృగువనెను.

ప్రబోధితోఽసౌభృగుణా జన్మాంతరదశాంనిజామ్
ముహూర్తమాత్రంసస్మార ధ్యానోన్మీలితలోచనః. 35

భృగువుచే నిట్లు బోధితుండై శుక్రాచార్యుడు ధ్యానమందు దివ్యదృష్టిచే రెండు ఘడియల పర్యంతము తన వివిధజన్మలయొక్క దశను స్మరించెను.

అథాసౌవిస్మయాత్స్మేర ముఖోముదితమానసః
వితర్కమంథరాంవాచ మువాచవదతాంవరః. 36

ఇట్లు తన పూర్వజన్మలనన్నింటిని స్మరించి పిదప యాశ్చర్యముచే నొకింత హాస్యయుక్తమగు ముఖముగలవాడై ప్రసన్నచిత్తుడై, వక్తలలో శ్రేష్ఠుడగు శుక్రాచార్యుడు తనలో వితర్కించుకొని మెల్లగ యిట్లుపలికెను.

జగత్యవిదితారంభా నియతిఃపరమాత్మనః
యద్వశాదిదమాభోగి జగచ్చక్రంప్రవర్తతే. 37

తెలియబడని యారంభముగలదియు, కర్మఫలవ్యవస్థకు కారణభూతమును నగు పరమాత్మయొక్క మాయాశక్తి (నియతి) అన్నిటికంటెను ప్రబలమైనది. అద్దానికివశమై యీ విశాలమగు జగచ్చక్రము పరిభ్రమించుచున్నది.

మమానంతాన్యతీతాని జన్మాన్యవిదితాన్యపి
దశాఫలాన్యనంతాని కల్పాంతకలితాదివ. 38

ప్రళయకాలమున వృష్టి, వాయ్వగ్నుల కారణంబున దుఃఖమోహాదులవిదితములై యుండు చందమున, మరణ మోహమూర్ఛాది దుర్దశా ఫలయుక్తమైయున్నందున అజ్ఞాతములగు జన్మలెన్నియో మాకు గతించినవి.

సృష్టాఃకఠినసంరంభా విభవోప్యర్జనభ్రమాః
విహృతంవీతశోకాసు చిరంమేరుస్థలీషుచ. 39

మిగుల క్రోధయుక్తులగు రాజులను, వారి ద్రవ్యోపార్జన భ్రమలనుగూడ జూచితిని. అనగా, నృపశరీరములఁగూడ ధరించితిని. దేవరూపమును ధరించి సుమేరుపర్వతమందలి యుత్తమ ప్రదేశములందు సంచరించితిని.

పీతమామోదిమందార కేసరారుణితంపయః
మందాకిన్యాఃసకహ్లారం తటీష్వమరభూభృతః. 40

మఱియు దేవతల పర్వతముపై సుగంధయుక్తమగు మందారపుష్పకేసరములచే రక్తవర్ణమైయొప్పుచు కమలయుక్తమై చెన్నొందుచున్న గంగాజలమును పానముజేసితిని.

భ్రాంతమందరకుంజేషు ఫుల్లహేమలతాలిషు
మేరోఃకల్పతరుచ్ఛాయా పుష్పసుందరసానుషు. 41



కల్పవృక్షచ్ఛాయాసంయుక్తములును, పుష్పములచే నతిసుందరములును నగు పర్వతశిఖరములపైనను, సువర్ణలతలుగల్గి మనోహరములైయున్న మందరాచలకుంజములందును విహరించితిని.

నతదస్తినయద్భుక్తం నతదస్తినయత్కృతమ్
నతదస్తినయద్దృష్ట మిష్టానిష్టాసువృత్తిషు. 42

నెయ్యేల, నేనుచూడని వస్తువేలేదు; చేయని క్రియయేలేదు. మఱియు ఇష్టానిష్టదశలందు నేను గాంచనిదేదియు లేదు.

జ్ఞాతంజ్ఞాతవ్యమధునా దృష్టంద్రష్టవ్యమక్షతమ్
విశ్రాంతోఽథచిరంశ్రాంతో గతోమేసకలోభ్రమః. 43

కాని యిపుడు పరమాత్మ స్వరూపజ్ఞానముచే, యెఱుంగదగిన దానినంతయు నెఱింతిని. చూడదగినదంతయును చూచితిని. చిరకాలము సంసారిక వాసనావశమున భ్రమజెందిన నాకిపుడు విశ్రాంతి లభించినది. నా భ్రమయంతయు యిపుడు పూర్ణముగ నశించినది.

ఉత్తిష్ఠతాతగచ్ఛామః పశ్యామోమందరస్థితామ్
తాంతనుంతావదాశుష్కాం శుష్కాంవనలతామివ. 44

కాన తండ్రీ! లెమ్ము, మందరపర్వతముపై, వనమందలి లతవలె శుష్కించియున్న నా శరీరమును గాంచెదము.

నసమీహితమస్తీహ నాసమీహితమస్తిమే
నియతేరచనాంద్రష్టుం కేవలంవిహరామ్యహమ్. 45

ఈ ప్రపంచమున నాకభిలషితముగాని, అనభిలషితముగాని నగు పదార్థమెయ్యదియు లేదు. కేవలము పరమాత్మయొక్క శక్తిరచనను గాంచు నిమిత్తము విహరించుచున్నాను.

యదతిసుభగమార్యసేవితంతత్
స్థితరమనుయామి యదేకభావబుద్ధ్యా
తదలమభిమతామతిర్మమాస్తు
ప్రకృతమిమం వ్యవహారమాచరామి. 46

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
భార్గవోపాఖ్యానే భార్గవజన్మాంతరస్మరణ వర్ణనం నామ
చతుర్దశః సర్గః ॥ 14 ॥

పరమాత్మనుగూర్చిన దృఢనిశ్చయముగల్గిన యితర జీవన్ముక్తులగు నార్యపుంగవులచే సేవితమును, అతి శుభదాయకమును, స్థిరమునునగు ఆత్మపదమునే నేననుసరించెదను. కాన మీకును నాకునుగూడ యభిమతమైనవిధముగ పూర్వదేహమందే నా జీవనవృత్తి సంభవించుగాక! దానిచే నాకేమియును హానిలేదు. కేవలము ప్రారబ్ధకర్మననుసరించి శేషించిన వ్యవహారమును మాత్రము జేయుటకే నేనిట్లొనర్చుచున్నాను. పూర్వమువలె యిపుడప్సరాదులందు నాకాసక్తికలుగదు. ఏలయన, దృఢమగు తత్వజ్ఞానముచే వాసనలన్నియును నశించినవి గదా!

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు స్థితిప్రకరణమున
భార్గవోపాఖ్యానమందు భార్గవజన్మాంతర స్మరణ
వర్ణనమను చతుర్దశ సర్గము ‖ 14 ‖

---

## పంచదశః సర్గః.

శ్రీవసిష్ఠ ఉవాచ :—

విచారయంతస్తత్త్వజ్ఞా ఇతి తేజాగతీర్గతీః
సమంగాయాస్తటాత్తస్మాత్ప్రచేలుశ్చంచలాసవః. 1

శ్రీవసిష్ఠుడు :—ఓ రామా! ప్రాణవాయు సంచారముచే చలనమాత్రమగు క్రియగల్గి యున్న యా తత్త్వజ్ఞానులు ముప్పురు (భృగు కాల శుక్రులు) ను జగత్తుయొక్క విచిత్రగతినిగూర్చి విచారించుచు సమంగానదీతీరమును వీడి జనిరి.

క్రమాదాకాశమాక్రమ్య నిర్గత్యాంబుదకోటరైః
సంప్రాపుఃసిద్ధమార్గేణ క్షణాన్మందరకందరమ్. 2

క్రమముగ నాకాశమును దాటి మేఘమండలమునుజొచ్చి సిద్ధమార్గముగుండా క్షణములో మందరపర్వతము నందలి గుహనుజేరిరి.

అధిత్యకాయాంతస్యాద్రేరార్ద్రపర్ణావకుంఠితామ్
దదర్శ భార్గవఃశుష్కాం పూర్వజన్మోద్భవాం తనుమ్. 3
ఉవాచేదంచ హే తాత తన్వీతనురియం హి సా
యాత్వయాసుఖసంభోగైః పురా సమభిలాలితా. 4

ఆ పర్వత యుపరిభాగమున తడసిన యాకులచే గప్పబడి శుష్కించియున్న తన పూర్వ దేహమునుజూచి శుక్రుండిట్లనెను — ప్రియమగునో తండ్రీ! అనేక సుఖభోగములచే పూర్వము నేను ప్రేమించియుండిన దీ కృశగాత్రమే.

ఇయం సా మత్తనుర్యస్యాః కర్పూరాగురుచందనైః
అంగమంగీకృతస్నేహా ధాత్రీ చిరమలేపయత్. 5

స్నేహయుక్తమగు దాదిచే కర్పూరాగరుచందనాదులచే చిరకాలము లేపన మొనర్పబడిన యా నాదేహమిదియే.

ఇయం సా మత్తనుర్యస్యా మందారకుసుమోత్కరైః
రచితాశీతలాశ్శయ్యా మేరూపవనభూమిషు. 6

మేరుపర్వతముపైగల యుపవనములందలి పుష్పసమూహములచే శీతలశయ్య రచింపబడు చుండిన దీదేహమునకే.



ఇయం సా మత్తనుర్మత్తదేవస్త్రీగణలాలితా
సరీసృపముఖక్షుణ్ణా పశ్య శేతే ధరాతలే. 7

మత్తదేవాంగనలచే ప్రేమింపబడుచుండిన యా నాదేహమిదియే. నేడియ్యది వృశ్చిక సర్పాదులచే ఛిద్రిత మొనర్పబడుచు భూమిపై నిదురించుచున్నది.

చందనోద్యానఖండేషు మమ తన్వాయయానయా
చిరం విలసితం సేయం శుష్కకంకాలతాం గతా. 8

చిరకాలము చందనవాటికాఖండములందు క్రీడించుటచే శోభాయమానముగనున్న యా నా దేహమిపుడు శుష్కించి మృతప్రాయమైయున్నది.

సురాంగనాంగసంసర్గాదుత్తుంగానంగభంగయా
చేతోవృత్త్యా రహితయా తన్వాద్య మమ శుష్యతే. 9

దేవాంగనల సంసర్గముచే యున్నత కామతరంగయుక్తమై, చిత్తవృత్తి రహితమైయున్న యా నాశరీరమిపుడు శుష్కించుచున్నది.

తేషు తేషు విలాసేషు తాసు తాసు దశాసు చ
తథా తద్భావనాబంధః కథం స్వస్థోసి దేహక. 10

ఓ దేహమా! ఆ యా విచిత్రవిలాసములందును, ఆ యా విచిత్ర బాల్యయౌవనాది దశలందును పూర్వమనుభవించిన సౌందర్యాలంకార గీతహాస్యరతివిలాసాదుల భావనయందు నిబద్ధమై యిప్పుడేల స్వస్థముగ నిదురించుచున్నావు?.

హతనో శవనామాసి తాపసంశోషమాగతా
కంకాలతాం ప్రయాతాసి మాం భీషయసి దుర్భగే. 11

భాగ్యహీనమగు నో దేహమా! నీవిపుడు ‘శవ’ నామమును ధరించితివి. సూర్యతాపముచే శుష్కించితివి. మఱియు మృతావస్థనుబొంది నన్ను భయపెట్టుచున్నావు.

దేహేనానాహం విలాసేషు యేనైవ ముదితోఽభవమ్
కంకాలతాముపగతాత్తస్మాదేవ బిభేమ్యహమ్. 12

ఏద్దానినిగూర్చిన విలాసములందు నేను ప్రసన్నుడ నగుచుంటినో, అట్టిదేహము నేడు మృత ప్రాయమైయుండ యద్దానిగాంచి నేను భీతిల్లుచుంటిని.

తారాజాలసమాకారో యత్రహారోఽభవత్పురా
మమోరసి నిలీయంతే తత్ర పశ్య పిపీలికాః. 13

తారాగణసమూహములవంటి యాకృతిగల హారములు వ్రేలాడుచుండిన యా నావక్షస్థలముపై నేడు చీమలు ప్రాకుచున్నవి, చూడుము!

ద్రవత్కాంచనకాంతేన లోభం నీతా వరాంగనాః
యేన మద్వపుషా తేన పశ్య కంకాలతోహ్యతే. 14

తండ్రీ! దేవాంగనలను సైతము కామభోగేచ్ఛచే లుబ్ధమొనర్చిన తప్తకాంచన సన్నిభమగు యీ నాదేహమిపుడు శవరూపమును ధరించియున్నది గాంచుము!

పశ్యమేవితతాస్యేన తాపసంశుష్కకృత్తినా
మత్కంకాలకువక్త్రేణ విత్రాస్యంతేవనేమృగాః. 15

విస్తృతముఖరూపమగు బిలమును సూర్యతాపముచే శుష్కించిన చర్మమునుగల్గి మృతప్రాయమై కురూపవంతమైయున్న యీ దేహమునుజూచి వనమందలి మృగములుకూడ భీతిజెందుచున్నవి, చూడుము!

పశ్యామిసంశుష్కతయా శవోదరదరీమమ
ప్రకాశార్కాంశుజాలేన వివేకేనేవశోభతే. 16

నా యీ మృతశరీరముయొక్క యుదరమునుగాంచ, శుష్కించియున్నదై వివేకముచే జీవితదేహము ప్రకాశించునట్లు, ప్రకాశవంతమగు సూర్యకిరణ సమూహముచే శోభించుచున్నది.

మత్తనుఃపరిశుష్కేయం స్థితోత్తానాచలోపలే
వైరాగ్యంనయతీవాత్మ తుచ్ఛత్వేనాంతరంసతామ్. 17

తండ్రీ! పర్వతశిలపైపడియున్న యీ నాశుష్కదేహము తన తుచ్ఛత్వ కురూపత్వముల ప్రదర్శనముచే వైరాగ్యము నుపదేశించుచున్నట్లున్నది.

శబ్దరూపరసస్పర్శ గంధలోభాద్విముక్తయా
నిర్వికల్పసమాధ్యేవ తదేతచ్ఛుష్యతేగిరౌ. 18

శబ్దస్పర్శరూపరసగంధాదుల లోభములేనిదై, నా యీదేహము నిర్వికల్పసమాధి నవలంబించి తీవ్రతపంబొనర్చు చున్నట్లున్నది.

ముక్తాచిత్తపిశాచేన నూనంసుఖమివాస్థితా
తనుర్దైవతభంగేభ్యో నబిభేతిమనాగపి. 19

చిత్తమను పిశాచమునుండి విముక్తినిబొంది యీ నాశరీరము నిశ్చయముగ సుఖవంతమైయున్నది. మఱియు దైవవశమున సంప్రాప్తించు విపత్తులచే దీనికిపుడొకింతైనను భయములేదు.

సంశాంతేచిత్తవేతాలే యామానందకలాంతనుః
యాతితామపిరాజ్యేన జగతేనసగచ్ఛతి. 20

చిత్తమను బేతాలము శమించుటచే యే ఆనందకళ నియ్యది యనుభవించుచున్నదో, అయ్యది విశ్వవ్యాపక సామ్రాజ్యముచేగూడ కలుగనేరదు.

పశ్యవిశ్రాంతసందేహం విగతాశేషకౌతుకమ్
నిరస్తకలనాజాలం సుఖంశేతేకథంవనే. 21

దీని సంశయములన్నియు నశించినవి. ఏ కౌతుకమునులేక కల్పనాజాలరహితమై యీ దేహమెట్లు వనమందు సుఖముగ నిద్రించుచున్నదో చూడుము!



చిత్తమర్కటసంరంభ సంక్షుబ్ధకాయపాదపః
తథావేగేనచలతి యథామూలాన్నికృంతతి. 22

కామాదుల చాపల్యముచే సంక్షుభితమై చిత్తమను వానరముచే శరీరమను వృక్షము వేగముగ చలించుచున్నది. ఏలయన అట్టిచిత్తము వివేకరహితమగు స్థావరాదియోనులందు జీవుని పడద్రోయుచున్నది.

చిత్తానర్థవిముక్తోఽద్రౌ గజాభ్రహరివిగ్రహమ్
నాద్యపశ్యతిమేదేహః పరానందఇవస్థితః. 23

చిత్తకృతమగు యనర్థములేవియు లేని యీ నాశరీరమిపుడీ పర్వతముపై గజసింహాదుల యుద్ధమును వీక్షించుటలేదు. బ్రహ్మానందమున మునిఁగియున్నట్లున్నది.

సర్వాశాజ్వరసంమోహా మిహికాశరదాగమమ్
అచిత్తత్వంవినానాన్య చ్ఛ్రేయఃపశ్యామిజంతుషు. 24

సమస్తయాశలను జ్వరములకు హేతుభూతమగు అజ్ఞానమను మేఘమునకు శరదృతువుకంటె అమనస్క (మనోనాశ) మెయ్యదిగలదో, అది యొకటిదప్ప జీవులకు శ్రేయమొనగూర్చునది మఱియు నాకు గన్పించుటలేదు.

తపనసుఖసంభోగ సీమాంతంసముపాగతాః
మహాధియాశాంతధియో యేయాతావిమనస్కతామ్. 25

మనోరాహిత్యస్థితినిబొందిన శాంతబుద్ధులును, బుద్ధిమంతులును నగు మహాత్ములు సుఖముయొక్క పరాకాష్ఠను ప్రాప్తినొందిరి.

సర్వదుఃఖదశాముక్తాం సంస్థితాంవిగతజ్వరామ్
దిష్ట్యాపశ్యామ్యమనసాం వనేతనుమిమామహమ్. 26

సౌభాగ్యముచే యేవిధమైన దుఃఖములేక, సంతాపరహితమై, మనోవర్జితమైయున్న యీ నాశరీరమును గాంచుచున్నాను.

శ్రీరామ ఉవాచ :—

భగవన్సర్వధర్మజ్ఞ భార్గవేణతదాకిల
సుబహూన్యుపభుక్తాని శరీరాణిపునఃపునః. 27

భృగుణోత్పాదితేకాయే తత్తస్మింస్తస్యకింపునః
మహానతిశయోజాతః పరిదేవనమేవవా. 28

శ్రీరాముడు :—ఓ మునీంద్రా! సర్వధర్మజ్ఞా! శుక్రాచార్యుఁడనేక శరీరములను మరలమరల నుపభోగించినను భృగూత్పన్నదేహమందే వానికత్యంతస్నేహమేల యుదయించెను? మఱియు నద్దానికొఱకే యాతడు విలపించుటేల?

శ్రీవసిష్ఠ ఉవాచ :—

శుక్రస్యకలనారామ యాసౌజీవదశాంగతా
కర్మాత్మికాసముత్పన్నా భృగోర్భార్గవరూపిణీ. 29

శ్రీ వసిష్ఠుడు :— ఓ రామా ! పూర్వము దేహవియోగసమయమున శుక్రుని కల్పన యెయ్యది జీవదశనుబొందెనో, అది భృగునియొక్క గృహాదుల యధికారప్రాప్తికి యోగ్యమగు దేహాకారమై పూర్వకల్పమున నుండెను.

సాహీదంప్రథమత్వేన సముపేత్యపరాత్పదాత్
భూతాకాశపదంప్రాప్య వాతవ్యాపలితాసతీ. 30
ప్రాణాపానప్రవాహేణ ప్రవిశ్యహృదయంభృగోః
క్రమేణవీర్యతామేత్య సంపన్నాశనసీతనుః. 31

ఈ దేహాకారకల్పనయే ప్రళయమందు శేషించిన మాయావేష్టితమగు పరమాత్మనుండి యీ కల్పమునందలి ప్రథమ శరీరభావముచే భూతాకాశముతోటి సమత్వమునొందుచు, ప్రాణక్రియావిశేషముచే అన్నమునుగ్రసించునట్టి అపానవాయు ప్రవాహముద్వారా భృగుని హృదయమున ప్రవేశించి క్రమముగ వీర్యదశనుపొంది, తల్లిగర్భమున శుక్రాచార్యుని దేహరూపమాయెను.

విహితబ్రాహ్మసంస్కారా తత్రసాపితురగ్రగా
కాలేనమహతాప్రాప్తా శుష్కకఙ్కాలరూపతామ్. 32

పితృసమ్ముఖమున యాశరీరమునకు బ్రాహ్మణోచిత సంస్కారములు జరుపబడెను. చాలకాలముగడచిన వెనుక నేడది శుష్కించి శవరూపమును బొందినది.

ఇదంప్రథమమాయాతా యదాసాబ్రహ్మణస్తనుః
అతస్తాంప్రతిశుక్రేణ తదాతత్పరిదేవితమ్. 33

మాయావేష్టితుడగు పరమాత్మనుండి ప్రథమకల్పముననే యీ శరీరము భృగుమహర్షి వలన గల్గెను. కనుకనే శుక్రున కద్దానియం దధికస్నేహము గల్గుటయు, దానికొఱకాతడు విలపించుటయు సంభవించినది.

వీతరాగోఽప్యనిచ్ఛోఽపి సమఙ్గావిప్రరూపవాన్
సశుశోచతనుంశుక్రః స్వభావోహ్యేష దేహజః. 34

సమంగానదీతీరనివాసియును విప్రుడునునగు యా శుక్రుడు వీతరాగుడును, యిచ్ఛారహితుడును అయి యున్నను తన శరీరమునుగూర్చి విలపించెను. ఏలయన, అట్లుగావించుట దేహస్వభావమైయున్నది.

జ్ఞస్యాజ్ఞస్యచదేహస్య యావద్దేహమయంక్రమః
లోకవద్వ్యవహారోఽయం సక్త్యాసక్త్యాథవాసదా. 35

జ్ఞానిచేనైనను, అజ్ఞానిచేనైనను దేహక్రమమున్నంతవఱకు సదా లోకవ్యవహార మివ్విధముననే జరుగుచుండును. [illegible] కేవలము సక్త్యాసక్తుల విశేషము మాత్రమే గలదు.



యేపరజ్ఞాతగతయో యేచాజ్ఞాఃపశుధర్మిణః
లోకసంవ్యవహారేషు తేస్థితాలోకజాలవత్. 36

జగద్గతినెఱింగిన జ్ఞానులును, పశుధర్మముగల్గివర్తించు అజ్ఞానులును అన్యలోకసమూహములవలె లోకవ్యవహారములందు సమానముగనే యుందురు.

వ్యవహారేయథైవాజ్ఞస్తథైవాఖిలపండితః
వాసనామాత్రభేదోఽత్ర కారణంబంధమోక్షదమ్. 37

వ్యవహారమున అజ్ఞానివలెనే జ్ఞానియు ప్రవృత్తి గల్గియుండును. కేవలము వాసనామాత్రభేదమేగలదు. మఱియునదియే బంధమోక్షములకు కారణమగును.

యావచ్ఛరీరంతావద్ధి దుఃఖేదుఃఖంసుఖేసుఖమ్
అసంసక్తధియోధీరా దర్శయన్త్యప్రబుద్ధవత్. 38

ఆసక్తిరహితమగు బుద్ధిగల ధీరులగు మహాత్ములు దేహమున్నంతవఱకును, అజ్ఞులవలెనే దుఃఖములందు దుఃఖమును, సుఖములందు సుఖమును పొందునట్లు గన్పింతురు.

సుఖేషుసుఖితానిత్యం దుఃఖితాదుఃఖవృత్తిషు
మహాత్మానోహిదృశ్యంతే దృశ్యవాఽప్రబుద్ధవత్. 39

సుఖవృత్తులందు మిగుల సుఖమును దుఃఖవృత్తులందు మిగుల దుఃఖమునుబొందుచు, ప్రపంచమున జ్ఞానులగు మహాత్ములుగూడ అజ్ఞానులవలెనే వర్తించునట్లు గన్పట్టుదురు.

సూర్యస్యప్రతిబింబాని క్షుభ్యన్తి నపునఃస్థిరమ్
చలాచలతయాతజ్జ్ఞో లోకవృత్తిషుతిష్ఠతి. 40

జలమందు సూర్యప్రతిబింబమే వాయ్వాదులచే క్షుభితమగుగాని ఆకాశమందలి బింబమెట్లుగానో, అట్లనే లోకవ్యవహారములందు జ్ఞాని బాహ్యవృత్తులచే చలింపబడుచున్నను నిత్యము సాక్షిస్వరూపమున కూటస్థుడై యచలముగనుండును.

అవస్థితఇవస్వస్థః ప్రతిబింబేషుభాస్కరః
సంత్యక్తలోకకర్మాపి బుద్ధవాఽప్రబుద్ధధీః. 41

ప్రతిబింబములందలి సూర్యుడు యథార్థముగ స్వస్థుడైనను, అస్వస్థుడుగను చంచలముగను గన్పట్టువిధమున, లోకవ్యవహారముల త్యజించినవాడైనను జ్ఞాని బాహ్యమున కజ్ఞానివలెనే ప్రపంచవ్యవహారములందు మగ్నుడైనట్లు గన్పించును.

ముక్తబుద్ధీన్ద్రియోముక్తో బద్ధకర్మేంద్రియోఽపిహి
బద్ధబుద్ధీంద్రియోబద్ధో ముక్తకర్మేంద్రియోఽపిహి- 42

కాన జ్ఞానేంద్రియములచే నాసక్తిలేక లోకమున కార్యమొనర్చువానికి కర్మేంద్రియములు బద్ధములైనను ముక్తుడేయగును. మఱియు జ్ఞానేంద్రియములాసక్తములైయుండువానియొక్క కర్మేంద్రియములు ముక్తములైనను యాతడు బద్ధుడేయగును.

సుఖదుఃఖదృశోలోకే బంధమోక్షదృశస్తథా
హేతుర్బుద్ధీంద్రియాణ్యేవ తేజాంసీవప్రకాశనే. 43

ప్రకాశము కలుగుటయందగ్ని కారణమైనట్లు, ప్రపంచమున సుఖదుఃఖ బంధమోక్షము లకు జ్ఞానేంద్రియములే హేతువులగును.

బహిర్లోచికోతాచార స్త్వ న్తరాచారవర్జితః
సమోహ్యాతీవతిష్ఠత్వం సంశాంతసకలైషణః. 44

ఇక్కారణమున బాహ్యమున లోకోచితాచారవ్యవహారముల సల్పుచు, అంతరంగమున వ్యవహారరహితుడవై అనగా కూటస్థుడగు ఆత్మయందు దృఢభావముగల్గి, వైషమ్యములేక కోర్కె లన్నింటిని త్యజించి యుండుము.

సర్వైషణావిముక్తేన స్వాత్మనాత్మనితిష్ఠతా
కురుకర్మాణికార్యాణి నూనం దేహస్యసంస్థితిః. 45

సమస్తకోర్కెలను విడనాడి, ఆత్మచే నాత్మయందు స్థితిగల్గియుండి, కర్తవ్యమగు కర్మలను ఫలాసక్తిలేక యొనర్పుము. ఏలయనగా కర్తవ్యకర్మల నాచరించుట నిశ్చయముగ దేహస్వభావమై యున్నది.

ఆధివ్యాధిమహావర్త గర్తసంసారవర్త్మని
మమతోగ్రాన్ధకూపేఽస్మి న్మాపతాతాపదాయిని. 46

ఆధివ్యాధి (శారీరక మానసికదుఃఖములు) జనన మరణరూపమగు విశాల గర్తములుగల సంసార మార్గమున మమత్వమను భయంకర యంధకూపమున నీవు పడకుము.

నత్వంభావేషునోభావా స్త్వయితామరసేక్షణ
శుద్ధబుద్ధస్వభావస్త్వ మాత్మాన్తఃసుస్థిరోభవ. 47

కమలనేత్రుడవగు నో రామచంద్రా ! యథార్థముగ నీవు దేహాదుల ధర్మములందుగాని, దేహాదుల ధర్మములు నీయందుగాని లేవు. నిత్యశుద్ధ బుద్ధస్వభావముగల ఆత్మయే నీవు. కాన యంతర్వృత్తిచే నద్దానియందే స్థిరుడవుకమ్ము.

త్వంబ్రహ్మహ్యమలంశుద్ధం త్వంసర్వాత్మాచసర్వకృత్
సర్వంశాంతమజంవిశ్వం భావయన్నైవసుఖీభవ. 48

నీవు నిర్మలమును, శుద్ధమును, సర్వాత్మయు, సర్వకర్తయు నగు బ్రహ్మమే. కాన 'సర్వప్రశాంతుడును, అజుడును, విశ్వస్వరూపుడును నగు పరమాత్మను నేనే' యని భావనయొనర్చుచు సుస్థిరుడవై యుండుము.

వ్యపగతమమతా మహాంధకారః
పదమమలం విగతైషణంసమేత్య
ప్రభవసియది చేతసోమహాత్మం
స్త[illegible] మహతేసతేనమస్తే. 49



ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే భార్గవో
పాఖ్యానే భార్గవపరిదేవనప్రసఙ్గేనోపదేశకరణంనామ
పంచదశః సర్గః ॥ 15 ॥

మహాత్ముడవగు నో రామచంద్రా ! సర్వాభిలాషానివర్తకమును, అవిద్యాది దోషరహితమును నిర్మలమును నగు ఆత్మపదమును పొంది, మమత్వమను ఘోరాంధకారవర్జితుడవై చిత్తనాశన [illegible]యందు సమర్థుడవగుచో, అపుడనంత బుద్ధియుక్తమును పరమార్థస్వరూపమును నగు [illegible]వుగాన, అట్టి నీకు నమస్కారము. అనగా పరబ్రహ్మస్వరూపుడవగు అట్టి నీవు వందనీయుడవగుదువు.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు స్థితిప్రకరణమున భార్గవో
పాఖ్యానమందు భార్గవపరిదేవనప్రసంగేనోపదేశకరణమను
పంచదశ సర్గము ॥ 15 ॥

---

## షోడశః సర్గః.

---

శ్రీవసిష్ఠ ఉవాచః—

అథాక్షిప్యవచస్తస్య తనయస్యతథాభృగోః
ఉవాచభగవాన్కాలో వచోగంభీరనిఃస్వనః. 1

శ్రీవసిష్ఠుడు :—ఓ రామా ! శుక్రాచార్యుడు తనశరీరమునుగూర్చి సంబోధించి విలపించుచున్న సమయమున, వాని వాక్యములందలి అయోగ్యత్వముఁజూచి, వానినాపి మేఘగర్జనమువలె గంభీరముగ నిట్లు బల్కెను.

కాల ఉవాచ :—

సమంగాతాపసీమేతాం తనుంసంత్యజ్యభార్గవ
ప్రవిశేమాంతనుంసాధో నగరీమివపార్థివః. 2

సాధువగు నో శుక్రాచార్యా ! రాజొకనగరమునుండి మఱియొక నగరమును ప్రవేశించునట్లు, యిపుడు నీవు సమంగానదీ తీరమందలి తాపసశరీరమును త్యజించి యీ భృగూత్పన్న తనువునందు ప్రవేశింపుము.

కాలేపూర్వజయాతన్వా తపఃకృత్వాతయాపునః
గురుత్వమసురేంద్రాణాం కర్తవ్యంభవతానఘ. 3

పాపరహితుడవగు నో శుక్రా ! ప్రారబ్ధోద్బోధకాలమందీ శరీరముతోకూడియే తపం బాచరించిన పిమ్మట దైత్యుల గురుత్వమవశ్యము నీచే యొనర్పదగియున్నది.

మహాకల్పాన్తఆయాతే భవతాభార్గవీతనుః
అపునర్గ్రహణాయైషా త్యాజ్యాప్రమ్లానపుష్పవత్. 4

మఱియు మహాకల్పాంత మేతెంచునపుడు, మరల శరీరము గ్రహింపకుండునట్లే శుక్రాచార్యదేహమును వాడువడిన పుష్పమాలవలె త్యజించివేయుము.

జీవన్ముక్తపదం ప్రాప్తస్తన్వా ప్రాక్తనరూపయా
మహాసురేంద్రగురుతాం కుర్వం స్తిష్ఠమహామతే. 5

ఓ మహామతీ! జీవన్ముక్తపదంబును పొంది, పూర్వకల్పోపార్జిత ప్రారబ్ధకర్మరూపమగు యీ దేహముచే నసురేంద్రుల (బలి, హిరణ్యకశిపుడు మున్నగువారి) గురుత్వము వహించి యుండుము.

కల్యాణమస్తువాంయామో వయంత్వభిమతాందిశమ్
నకించిదపియచ్చిత్తం యస్యనాభిమతంభవేత్. 6

మీ యిరువురకును శుభమగుగాక! నేనిపుడు నా యభిమతస్థానము (పరమ ప్రేమాస్పదమగు ఆత్మస్థానము) నకు బోవుచున్నాను. ఇది యభిమతమైనది, ఇది కాదనువికల్పము గలుగగా, అనభిమతమగు దానిని త్యజించి, అభిమతమునే గ్రహించు చిత్తమునకు విచారదృష్టియందు రూపమే లేకయుండును.

ఇత్యుక్త్వాముంచతోర్బాష్పం తయోఃసోఽన్తరధీయత
తప్తాంగోర్యరివరోదస్యోః సమమంశుభిరంశుమాన్. 7

కాలుడిట్లు వచించి, స్నేహాధిక్యముచే వారిరువురును అశ్రువుల ద్యజించుచుండగనే భూమ్యాకాశములు సంతప్తములై (రక్తవర్ణముగలిగి) యుండగనే సూర్యుడు తన కిరణజాలములతో గూడ నస్తమించునట్లు, వారలవిడచి యంతర్ధానమాయెను.

గతేతస్మిన్భగవతి కృతాంతే భవితవ్యతామ్
విచార్యభార్గవోఽభేద్యాం నియతేర్నియతాంగతిమ్. 8

కాలకారణసంశుష్కాం భావిపుష్పశుభోదయామ్
వివేశతాంతనుంబాలాం సులతామివమాధవః. 9

భగవంతుడగు కాలుడు వెడలిన పిమ్మట అవశ్యమాచరింపదగిన భావికర్మయొక్క గతిని, ఈశ్వరేచ్ఛయొక్క యనివార్యత్వమునుగూర్చి విచారించి శుక్రుడు, అధిక హేమంతకాలాది నిమిత్తముచే శుష్కించినదియు, భావికాలమున శుభప్రదమగు పుష్పము నొసంగునదియునగు తన పూర్వశరీరమందు, బాలలతయందు వసంతఋతువువలె ప్రవేశించెను.

సాబ్రాహ్మణీతనుర్భ్రామా వివర్ణవదనాంగికా
పపాతకంపితాతూర్ణం ఛిన్నమూలాలతాయథా. 10

వాసుదేవుడను పేరంబరగు సమంగాతీరవాసియగు నాతాపసియొక్క నాదేహమంత వివర్ణమై చలించుచు ఛిన్నమూలమగు లతవోలె శీఘ్రముగ భూమిపై వ్రాలెను.

తస్యాంప్రవిష్టజీవాయాం పుత్రతన్వాంమహామునిః
చకారాప్యాయనం మన్త్రైః సకమండలువారిభిః. 11



తనపుత్రుని దేహమున జీవుడు ప్రవేశించిన మీదట మహామునియగు భృగువు తన కమండలువందలి జలమును మంత్రసహితముగ నా శరీరముపై ప్రోక్షించెను.

సర్వానాడ్యస్తతస్తన్వాస్తస్యాః పూర్ణావిరేజిరే
సరితఃప్రావృషీవాంబుపూరపూరితకోటరాః. 12

మంత్రసహితంబగు జలముచే నభిషిక్తమైన పిదప, వర్షాకాలమందలి జలప్రవాహముచే [illegible]కోలె, ఆదేహమందలి నాడులన్నియును క్షుభితములయ్యెను.

నలినీప్రావృషీవాసా మధావివనవాలతా
యదాపూర్ణాతదాతస్యాః ప్రాన్తాఃపల్లవితాబభుః. 13

అంత వర్షాకాలమందలి కములమువలెను, వసంతఋతువందలి నూతనలతవలెను నా దేహము పూర్ణవికాసమును బొందజొచ్చెను. అపుడువాని నఖములు, కేశాదులు పల్లవములవలె శోభించుచుండెను.

అథశుక్రఃసముత్తస్థౌ వహత్ప్రాణసమీరణః
రసమారుతసంయోగాదాపూర్ణఇవవారిదః. 14

పిదప, ప్రాణవాయువాతని శరీరమున ప్రవహింపగా, జలవాయు సంయోగముచే సముద్రము పొంగి లేచునట్లు, శుక్రాచార్యుడపుడు లేచి నిలంబడెను.

పురోఽభివాదయామాస పితరంపావనాకృతిమ్
ప్రథమోల్లాసితోమేఘః స్తనితేనేవపర్వతమ్. 15

ప్రథమోల్లాససహితమగు మేఘము తన గర్జనచే పర్వతమునభినందించు విధమున, నామగోత్రకీర్తన పూర్వకముగ నంత శుక్రాచార్యుడు పరమపవిత్రుడగు తన జనకున కభివాదము సల్పెను.

పితాథప్రాక్తనీం తన్వా ఆలిలింగాకృతింతతః
స్నేహార్ద్రావృత్తిర్జలద శ్చిరాదద్రితటీమివ. 16

అపుడు తండ్రియగు భృగువు పూర్వమువలె సౌందర్యాలంకారయావనాదులచే శోభించుచున్న తన పుత్రుని దేహమును స్నేహార్ద్రచిత్తుడై, చిరకాలమునకు పర్వత తటమును మేఘమాలింగన మొనర్చుకొనునట్లు, యాలింగన మొనర్చుకొనెను.

భృగుర్దదర్శసస్నేహం ప్రాక్తనీం తానవీంతనుమ్
మత్తోజాతేయమిత్యాస్థాం హసన్నపిమహామతిః. 17

మహామతియగు భృగువు శుక్రుని పూర్వదేహమును ప్రీతిపూర్వకముగగాంచి నవ్వుచు 'ఇది నాచే యుత్పన్నమైనద'ను భావన గల్గియుండెను. (తత్వదృష్టిచే నీభావన యుచితముగాకుండుటయే యాతని చిరునగవునకు కారణమని యెఱుంగునది.)

మత్పుత్రోఽయమితిస్నేహో భృగుమప్యహారత్తదా
పరమాత్మీయతాతేహే యావదాకృతిభావనీ. 18

'ఈతడు నాపుత్రుడ'ను స్నేహమపుడు భృగుని చిత్తమునుగూడ హరించెను. ఏలయ
శరీర ముండునంతవఱకు ప్రారబ్ధవేగముచే నందు మిక్కిలి మమత్వముదయించును. ఇయ్యది దే
ధర్మమై యున్నది.

బభూవతుఃపితాపుత్రౌ తావథాన్యోన్యశోభితౌ
నిశావసానముదితౌ వర్కపద్మాకరావివ. 19

రాత్ర్యంతమున వికాసముఁజెందు సూర్యపద్మవనములవలె నా పితాపిత్రులిరువుర
పరస్పరము శోభించుచుండిరి.

చిరసంగమసంబద్ధౌ వివచక్రాహ్వదంపతీ
ఘనాగమనసస్నేహౌ మయూరజలదావివ. 20

చిరవియోగముచే (స్త్రీ పురుష) చక్రవాకములు. స్నేహబద్ధమగునట్లును, మేఘాగ
సముచే మేఘ మయూరములు స్నేహయుక్తమగునట్లును, ఆ పితాపుత్రులిర్వురును స్నేహయుతులై

చిరకాలదృఢోత్కంఠౌ తుల్యయోగ్యతయాతయా
స్థిత్వాతత్రముహూర్తం తౌ వథోఽత్థాయమహామతీ. 21

చిరకాలవియోగముచే సమాగమమును బొంద దృఢేచ్ఛగల మహాబుద్ధిశాలురగు వారి
వురును, జగత్ప్రసిద్ధమును పూర్వవర్ణితమునునగు ఆనందప్రవాహమున ముహూర్తపర్యంతము జ
భూతులైయుండి యనంతమటనుండి లేచిరి.

సమంగాద్విజదేహంతం భస్మసాత్తత్రచక్రతుః
కోహినామజగజ్జాత మాచారంనానుతిష్ఠతి. 22

అపుడు వారు సమంగానదీతటమందలి వాసుదేవనామమును ధరించియున్న ఆ బ్రాహ్మణ
శరీరమును భస్మమొనర్చిరి. తమ కులక్రమము ననుసరించిన సదాచారము నేజ్ఞుఁడుపేక్షించును ?

ఏవంతౌకాననే తస్మిన్పావనే భృగుభార్గవౌ
సంస్థితౌతాపసాదీప్తౌ దివీవశశిభాస్కరౌ. 23

ఇట్లు మందరపర్వతవనమున భృగుభార్గవులు తపంబొనర్చుచు, ఆకసమందలి చంద్ర
సూర్యులవలె ప్రకాశించుచుండిరి.

చేరతుర్జ్ఞాతవిజ్ఞేయౌ జీవన్ముక్తౌజగద్గురూ
దేశకాలదశౌఘేషు సుసమౌసుస్థిరౌతతః. 24

ఎఱుంగదగిన బ్రహ్మవస్తువు నెఱింగినవారును, జీవన్ముక్తులును, జగద్గురువులును నగు
ఆమ్మహాత్ములిర్వురును దేశకాలముల శుభాశుభాది దశలందు హర్షవిషాదములఁ బొందక విహరించు
చుండిరి. ఏలయన వారాత్మస్వరూపమందు లెస్సగ స్థితినిబడసినవారే యగుదురు.

అథాసురగురుత్వంస, శుక్రఃకాలేనలబ్ధవాన్
భృగురప్యాత్మనోయోగ్యే పదేతిష్ఠదనామయే. 25



అటు పిమ్మట కొంతకాలమునకు శుక్రాచార్యునకు అసురుల గురుత్వమును గ్రహాధికార
మును సంప్రాప్తించెను. భృగువున్ను తనకు యోగ్యమైనట్టి నిరామయమగు ప్రజాపతిపదమున స్థితుడై
యుండెను.

శుక్రోఽసౌప్రథమమితిక్రమేణజాత
స్తస్మాత్సత్పరమపదాదుదారకీర్తిః
స్వేనాశుస్మృతిపదవిభ్రమేణపశ్చా
దన్యేషుప్రవిలులితోదవాన్తరేషు. 26

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
భార్గవోపాఖ్యానే శుక్రస్యపురర్జీవనంనామ షోడశః
సర్గః ॥ 16 ॥

శుక్రాచార్యుడు ప్రథమమున (పూర్వము) పరమపదమగు పరమాత్మయందు స్థితిగల్గి
భృగువు ద్వారా యుదారకీర్తిని బడసియుండెను. తదనంతరము తన స్మృతియందారూఢమైయున్న
అప్సరసకొఱకై మనోరాజ్యవిభ్రమముచే పలుదశలందు పరిభ్రమించియుండెను.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు స్థితిప్రకరణమున
భార్గవోపాఖ్యానమందు శుక్రుని పునర్జీవనమను
షోడశ సర్గము ॥ 8 ॥

---

## సప్తదశః సర్గః.

---

శ్రీరామ ఉవాచ :—

భగవన్భృగుపుత్రస్య ప్రతిభాసానుభూతితః
యథైషాసఫలాజాతా తథాన్యస్యనకింభవేత్. 1

శ్రీరాముడు :—ఓ మునీంద్రా ! భృగుని పుత్రుడగు శుక్రునకు తన మనోరథప్రతిభచే
స్వర్గాది సుఖము లభించెనుగదా ! అట్లైన నట్టిప్రతిభ యితరులకేల సఫలముగాకయున్నది ?

శ్రీవసిష్ఠ ఉవాచ :—

ఇయంప్రథమముత్పన్నా సాతనుర్బ్రహ్మణఃపదాత్
శుద్ధాజాతిర్భార్గవస్య నాన్యజన్మకలంకితా. 2

శ్రీవసిష్ఠుడు :—ఓ రామా ! శుక్రాచార్యుని దేహము పూర్వకల్పమందలి దోషరహిత
మగు యంతిమ జన్మమున స్వల్పోపాసనావాసనాదులతోగూడి క్షయించినదగుటచే, యీ కల్పమున
బ్రహ్మపదమునుండి ప్రథమమున విశుద్ధ బ్రాహ్మణవంశమున కళంకరహితమై యుత్పన్నమాయెను.

సర్వైషణానాంసంశాంతౌ శుద్ధచిత్తస్యయాస్థితిః
తత్సత్యముచ్యతేసైషా విమలాచిదుదాహృతా. 3

ఈషణ (కోర్కె) లన్నియు నశించుటచేగల్గు చిత్తముయొక్క స్థితియే సత్యాత్మభావ (సత్యసంకల్ప) మనియు, అదియే నిర్మల చిత్స్వరూపమనియు యెఱుంగుము.

మనోనిర్మలసత్వాత్మ యద్భావయతియాదృశమ్
తత్తథాఽనుభవత్యేవ యథావర్తోఽభవేత్పయః. 4

ఆవర్తము జలరూపమగునట్లు నిర్మలమును, సత్యాత్మస్వరూపము నగు చిత్తమెట్లు భావించునో, అట్లే శీఘ్రముగ నగును.

యథాభృగుసుతస్యైవ విభ్రమః ప్రోత్థితః స్వయమ్
ప్రత్యేకమప్యేవమేవ దృష్టాంతోఽత్రభృగోఃసుతః. 5

భార్గవునిచిత్తమున విభ్రమమెట్లు స్వయముగ నుత్పన్నమయ్యెనో, అట్లనే ప్రతిజీవుని చిత్తముననుం యుత్పన్నమగును. భృగునిపుత్రుడే యిందులకు దృష్టాంతము.

బీజస్థాంకురపత్రాది స్వంచమత్కురుతేయథా
సర్వేషాంభూతసంఘానాం భ్రమిఖండాస్తథైవహి. 6

బీజమందలి అంకురపత్రాదులవలె సమస్తప్రాణులయొక్క భ్రాంతికృతమగు ద్వైత విభాగముకూడ స్వస్వరూప విస్తారమను చమత్కారమొనర్చుచున్నది.

యదిదందృశ్యతే విశ్వమేవమేవాఖిలంజగత్
ప్రత్యేకముదితంమిథ్యా మిథ్యైవాస్తముపైతిచ. 7

ఈ దృశ్యమానమగు ప్రపంచమంతయును ప్రతిజీవుని చిత్తమునను మిథ్యారూపముననే యుదయించుచు, మిథ్యారూపముననే నశించుచున్నది.

నాస్తమేతిన చోదేతి జగత్కించనకస్యచిత్
భ్రాంతిమాత్రమిదం మాయాముగ్ధేవపరిజృంభతే. 8

కాని యథార్థముగ యీ జగత్తుత్పన్నమగుటలేదు, నశించుటలేదు. భ్రాంతిమాత్రమగు యీ జగద్రూపమున మాయయే యున్మత్తస్త్రీవలె తన రూపమును దర్శింపజేయుచున్నది.

యథాసంప్రతిభాసస్థః స్వయంసంసారఖండకః
తథాతేషాంసహస్రాణి మిథ్యాదృష్టానిసన్తిహి. 9

మన యనుభవమున యీ జగత్తెట్లు ప్రత్యక్షముగ నున్నదో, అట్లనే తక్కినజీవులకును వేలకొలది మిథ్యారూపములగు జగత్తులు ప్రత్యక్షముగ గాన్పించుచున్నవి.

స్వప్నసంకల్పనగర వ్యవహారాఃపరస్పరం
పృథగ్యథానదృశ్యన్తే తథైతేసంసృతిభ్రమాః. 10

ఒకరి స్వప్న సంకల్పనగర వ్యవహారములు మఱియొకనికి గాన్పించనట్లు, ఒకడు గాంచు జగద్భ్రమ మఱియొకనికి గాన్పించదు.

ఏవంనగరవృన్దాని నభస్సంకల్పరూపిణి
సన్తితానినదృశ్యన్తే మిథ్యాజ్ఞానదృశంవినా. 11



సంకల్పాకాశమున జగద్రూపములగు అనేక నగరసమూహము లివ్విధముననే నుండును. కాని వాని మిథ్యాత్వభావము జ్ఞానదృష్టిలేనిచో గలుగనేరదు.

పిశాచయక్షరక్షాంసి సన్త్యేవంరూపకాణిహా
సంకల్పమాత్రదేహాని సుఖదుఃఖమయానిచ. 12

సంకల్పమాత్రశరీరులును, సుఖదుఃఖమయులును నగు పిశాచ యక్ష రాక్షసాదులుకూడ నివ్విధముగనే నుందురు.

ఏవమేవవయంచేమే సంపన్నారఘునందన
స్వసంకల్పాత్మకాకారా మిథ్యాసత్యత్వభావినః. 13

ఓ రాఘువా! శుక్రునివలె సంకల్పమాత్రశరీరులుగను, మిథ్యను సత్యముగాదలంచువారుగను మనమందర ముత్పన్నమైతిమి.

ఏవంరూపైవహిపరే విద్యన్తేసర్గసంతతిః
నవాస్తవీవస్తుతాతు సంస్థితైవమవస్తుని. 14

వ్యష్టికిపరమైనట్టి హిరణ్యగర్భరూపుడగు పరమాత్మయందును జగత్-సృష్టి పరంపర యివ్విధముగనే మిథ్యారూపముననుండును. ఏలయన, అవస్తువందు వాస్తవముగ వస్తుత్వముండనేరదు.

ప్రత్యేకముదితం విశ్వమేవమేవముధైనహి
వనగుల్మకరూపేణ వసన్తైకరసోయథా. 15

వన లతాదిరూపమున యేకరసమగు వసంతము స్థితిగల్గియుండునట్లు, ప్రతిచిత్తమందును మిథ్యారూపమగు యీ జగత్తుగలదు.

ప్రథమోఽయం స్వసంకల్పః ప్రథమాభ్యాగతోయథా
తథాతిపరమార్థేన దృష్టేనేత్థంవిభావ్యతే. 16

ప్రథమ (ఈశ్వర) సంకల్పము యీ జగద్రూపవ్యవస్థితి నెట్లు పొందెనో యాక్రమము తత్వజ్ఞానముచే నిశ్చయముగ యెఱుంగబడుచున్నది.

ప్రత్యేకముదితంచిత్తం స్వస్వభావోదరస్థితమ్
ఇదమిత్థం సమారంభం జగత్పశ్యన్వినశ్యతి. 17

అనాదియగు అజ్ఞానమందు స్థితిఁబొందియున్న చిత్తమే పలువిధకార్యయుక్తమగు యీ జగత్తని యెఱుంగుటచే చిత్తము తనంతటతాను నశించును.

ప్రతిభాసవశాదస్తి నాస్తివస్త్వవలోకనాత్
దీర్ఘస్వప్నజగజ్జాల మాలానంచిత్తదంతినః. 18

జగత్సత్త ప్రతిభాసకాలమందే యుండును. సత్యవస్తు (బ్రహ్మ) సాక్షాత్కారమైన పిదప నది యుండదు. దీర్ఘస్వప్నమువంటి యీ జగత్తు చిత్తమను గజమునకు కట్టుకంబమగును.

చిత్తనాశేవజగత్సత్తా జగన్నాశేవచిత్తకమ్
ఏకాభావాద్ద్వయోర్నాశః నచసత్యవిచారణాత్. 19

చిత్తసత్తయే జగత్తు, జగత్సత్తయే చిత్తమనగును. ఈ చిత్త జగత్తులరెంటిలో నొకటి నశించిన రెండును నశించును. అట్టి నాశము సత్యవస్తువిచారముచే చేకూరును.

శుద్ధస్య ప్రతిభాసో హి సత్యో భవతి చేతసః
ప్రమార్జనాదివ మణేర్మలినస్యేహ యుక్తితః. 20

మలినమగు మణిని శుద్ధమొనర్చుటచే ప్రకాశవంతమై విషహరణాది క్రియల నొనర్ప జాలియుండునట్లు శుద్ధచిత్తముయొక్క ప్రతిభాసము సత్యస్వరూపమే యగును.

చిరమేకదృఢాభ్యాసాచ్ఛుద్ధిర్భవతి చేతసః
అనాక్రాన్తస్య సంకల్పైః ప్రతిభోదేతి చేతసః. 21

చిరకాలమేకాగ్రతను దృఢముగ నభ్యసించుటచే చిత్తము శుద్ధమగును. మఱియు వివిధ సంకల్పములచే కలుషితమొనర్ప బడకయున్నపుడద్దానియందు ప్రతిభాస ముదయమగును.

సువర్ణం న స్థితిం యాతి మలవత్యంశుకే యథా
ఏకా దృష్టిః స్థితిం యాతి నమ్లానే చిత్తకే యథా. 22

మలిన వస్త్రమందుత్తమ రంజకద్రవ్యము నిలువనట్లు, మలినచిత్తమందద్వైతతత్త్వప్రతిపాదకమగు ఆత్మజ్ఞానము నిలువనేరదు.

శ్రీరామ ఉవాచ:—

ప్రతిభాసాత్మని జగత్యేతే కాలక్రియాక్రమాః
సోదయాస్తమయా జాతాః కథం శుక్రస్య చేతసః. 23

శ్రీరాముడు :—ఓ మునీంద్రా ! శుక్రుని చిత్తమందలి కల్పనాత్మకమైన జగత్తునందు ఉదయాస్తమయమగు యీ కాలక్రియాక్రమ మెట్లుదయించినది? ఏలయన ప్రతిభాసకాలమున ఉదయాస్తమయములు గ్రహింపబడకుండును. అప్రతిభాసకాలమున వాని యనుభవమే సిద్ధింపకుండును గాన వానినిగూర్చిన వాసనయు గలుగనేరదు. వాసనయే సిద్ధింపనందున అద్దాని క్రమమును సిద్ధింపనేరదుగదా !

శ్రీవసిష్ఠ ఉవాచ :—

యాదృగ్జగదిదం దృష్టం శుక్రేణ పితృశాస్త్రతః
తాదృక్కస్యస్థితం చిత్తే మయూరాణ్డే మయూరవత్. 24

శ్రీవసిష్ఠుడు :—శుక్రాచార్యుడు, పిత్రోత్పన్న నేత్రాది యింద్రియములచేతను, పితృవాక్య శ్రుతి స్మృత్యాదులచేతను, ఉత్పత్తి నాశాదులతో కూడిన జగత్తునెవ్విధముగ నిశ్చయించెనో, అట్లనే లౌకిక పారలౌకిక జగత్తున్ను సంస్కారరూపమున వాని చిత్తమందు మయూరాండము మయూరమునందువలె స్థితినిబొందెను.

స్వభావకోశస్థమిదం తదేతేన క్రమోదితమ్
బీజేనాఙ్కురపత్రాది లతాపుష్పఫలం యథా. 25



బీజమువలన అంకురపత్రలతాపుష్పఫలాదులుద్భవమగునట్లు, చైతన్యాధిష్ఠితమగు జీవుని అవిద్యయందున్న యీ జగత్తుయొక్క కాలక్రియాది క్రమము శుక్రాచార్యునియందు పితృశాస్త్ర కారణంబులచే నుదయించెను.

జీవో యద్వాసనాబద్ధస్తదేవాన్తః ప్రపశ్యతి
సరూపం చాత్ర దృష్టాన్తో దీర్ఘస్వప్నస్త్విదం జగత్. 26

జీవుడెట్టి వాసనచే బద్ధుడగునో, అట్టి వాసనానుసారమే తనయందు సర్వమునుగాంచును. స్వప్నమందలి స్వకల్పిత శరీరమే యిందులకు దృష్టాంతము. ఇక నీజగత్తున్ను దీర్ఘస్వప్నమే యగును.

ప్రత్యేకముదితో రామ నానాసంసృతిఖండకః
రాత్రౌ సైన్యనరస్వప్నజాలవత్స్వాత్మనిస్ఫుటః. 27

ఓ రామా ! సైనికులు దినమందు సైన్యవాసనాయుక్తులగుటచే రాత్రియందు స్వప్నమున ప్రతిసైనికుడును తనచే కల్పితమగు వేలు వేలు సేనలగాంచుచున్నను యేకమనియే తలంచునట్లు, ఈ జగత్-శకలము (అవిద్యాకృతమగు ద్వైతవిభాగము) న్ను ప్రతి జీవునకును వేర్వేఱుగనే గన్పట్టుచున్నను, అద్దానినేకముగనే తలంచుచున్నారు.

శ్రీరామ ఉవాచ :—

ఏష సంసృతిఖండోత్థో మిథః సమిలతి స్వయమ్
నోవా మిలతి తన్మే త్వం యథావద్వక్తుమర్హసి. 28

శ్రీరాముడు :—ఓ మహాత్మా ! ఇట్లావిర్భవించిన యీ జగత్-శకలము జీవులకు పరస్పరము కలసియున్నదే యగునా లేక భిన్నముగనే యుండునా యనువిషయమును యథాక్రమమున వచింపుడు. ఏలయన, అట్లు కలియనిచో యొకరి ప్రపంచము మఱియొకడు చూడజాలమిచే, శిష్యుల నుద్ధరించు నిమిత్తమగు గురువుల ప్రవృత్తియును శాస్త్రరచనయు శిష్యునకు సిద్ధింపకుండును. కావున శిష్యునకు మోక్షాభావము గలుగును. అట్లనే గురువునకున్ను గురూపదేశము లభింపమి వానికిన్ని మోక్షాభావమే సంభవించుచున్నది.

శ్రీవసిష్ఠ ఉవాచ :—

మలినం హి మనోఽవీర్యం న మిథః శ్లేషమర్హతి
అయోఽయసి చ సంతప్తే శుద్ధే తప్తం తులీయతే. 29

శ్రీవసిష్ఠుడు :—ఓ రామా ! మలినమనస్సు శుద్ధమనస్సుతోటి కలియ నశక్యమైనది కాన నందు కలియనేరదు. శుద్ధసంతప్తలోహమున శుద్ధసంతప్తలోహమే కలియునుగాని అన్యము గాదు.

చిత్తతత్త్వాని శుద్ధాని సంమిలన్తి పరస్పరమ్
ఏకరూపాణి తోయాని యాన్త్యైకం నావిలానిహి. 30

శుద్ధచిత్తతత్త్వములు పరస్పరము కలియును. ఏకరూపంబగు జలములే కలసి యేకమగును గానీ మలిన శుద్ధజలంబు లేకముగానేరవు.

శుద్ధిర్హి చిత్తస్య వివాసనత్వ
మభూతసంవేదనమేకరూపమ్
తస్యాశుశుద్ధ్యా భవతిప్రబుద్ధత
స్తన్మాత్రయుక్త్యాపరసంగమేతి. 31

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
భార్గవోపాఖ్యానే మానోరాజ్యసంమేలనంనామ
సప్తదశః సర్గః ॥ 17 ॥

సంపూర్ణ వాసనాక్షయమున్ను భూత ప్రపంచవర్జితమగు యేకరూపత్వ జ్ఞానమున్ను చిత్తముయొక్క చిన్మాత్ర పరిశేషత్వమను శుద్ధి లభించుటచే జీవుడు పరమకైవల్యపదమగు మోక్షమును శీఘ్రముగ బొందును.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు స్థితిప్రకరణమున
భార్గవోపాఖ్యానమున మనోరాజ్యసంమేలనమను
సప్తదశ సర్గము ॥ 17 ॥

---

## అష్టాదశః సర్గః.

---

శ్రీవసిష్ఠ ఉవాచ :—

సర్వసంసృతిఖండేషు భూతబీజకలాత్మనః
తన్మాత్రప్రతిభాసస్య ప్రతిభాసేనభిన్నతా. 1

శ్రీవసిష్ఠుడు:—ఓ రామా! జీవులందరును తమతమ కల్పిత ప్రపంచములందు స్థూలసూక్ష్మ కారణశరీరముల సంబంధముగలిగి, వానితో తాదాత్మ్యమును బొందుచు ఆయా జగత్తులను భిన్నముగా గాంచుచున్నారు. అట్టి భిన్నత్వము తన్మాత్ర ప్రతిభాసముచే సంభవించుచున్నది. అనగా స్వప్రకాశ స్వరూపమును, చిదేకరసమునునగు ఆత్మయే ప్రతిభాసావశమున ఆయావిధముగ భిన్నముగ కల్పింపబడుచున్నది గాని యథార్థముగ గాదు.

ప్రవృత్తిర్వానివృత్తిర్వా తన్మాత్రావృత్తిపూర్వకమ్
సర్వస్యజీవజాతస్య సుషుప్తత్వాదనన్తరమ్. 2

సమస్త ప్రాణులయొక్కయు సుషుప్త్యానంతరమందలి ద్వైతవ్యవహార ప్రవృత్తియు, స్వప్న జాగ్రద్దశలందు వననద్యాదులందలి ప్రవృత్తియు, నివృత్తియు, ఏకరసమగు చైతన్యముయొక్క సర్వవ్యాప్తిచేతనే సిద్ధించుచున్నవి.

ప్రవృత్తిభాజోయేజీవా స్తేతన్మాత్రప్రదర్శినః
తన్మాత్రైకతయాసర్గా న్మిథఃపశ్య న్తికల్పితాన్. 3



ఓ రామా! ప్రవృత్తియందు వ్యవహరించు జీవులందఱును, చైతన్యజ్యోతివలననే ఘటపటాది పదార్థముల యనుభవము నొందగల్గుచున్నారు. మఱియు సాక్షిచైతన్యముయొక్క యుపాధిమేళనముచేతను లేక బ్రహ్మైకత్వదార్ఢ్యముచేతను యొకరు మఱియొకనిచే కల్పింపబడిన సృష్టులం జూచుచున్నారు.

తన్మాత్రైక్యప్రణాలేన చిత్రాఃసర్గజలాశయాః
పరస్పరంసంమిలన్తి ఘనతాంయాన్తిచాభితః. 4

ఇట్లు చిన్మాత్రైకత్వప్రణాళికచే చిత్రవిచిత్రములగు సృష్టిరూపజలాశయములు పరస్పరము మిళితమగుచు, అంతటను ఘనత్వమును బొందుచున్నవి.

కేచిత్పృథక్స్థితిగతాః పృథగేవలయంగతాః
కేచిన్మిథఃసంమిలితా జగద్గుఞ్జాస్థితాక్షతా. 5

జగద్రూపమగు గుంజాఫలములు కొన్ని పరస్పరము మిళితముగాకయే వేఱు వేఱుగనుండి అట్లనే లయమొందుచున్నవి. మఱికొన్ని పరస్పరమేళనముచే నాశరహితముగనున్నవి.

జగద్గుఞ్జాసహస్రాణి యత్రాసంఖ్యాన్యణావణౌ
అపరస్పరలగ్నాని కాననంబ్రహ్మనామతత్. 6

దేనియందలి ప్రతి అణువందును జగద్రూపములగు వేలకొలది గుంజాఫలములు పరస్పరము కలియకయేయున్నవో, అయ్యది మాయాశబలిత బ్రహ్మమను వనమని యెఱుంగుము.

మిథఃసంమిలనేనైతా ఘనతాంసముపాగతాః
యద్యద్యత్రయథారూఢం తత్తత్పశ్యతినేతరత్. 7

జగద్రూపమగు గుంజాఫలములు పరస్పరము కలయుటచే, అన్నియును సాధారణ వ్యవహారయోగ్యత్వమును బడసినవి. ఈ లోకములందేయే జీవునకు భోగానుకూలమగు యేకర్మ యెచట ఆరూఢమైయుండునో, అద్దాని ననుసరించి యాతడంతయే జూచునుగాని యధికముగ జూడనేరడు.

వర్తమానంమనోరాజ్యం నైష్ఫల్యం సముపాగతా
సాకృత్రిర్మనసోజ్ఞేయా తస్యాజీవపరమ్పరా. 8

ఒకని చిత్తము మఱియొకని చిత్తమందలి మనోరాజ్యమును దర్శింపజాలకుండుటయు, భోగానుభవము నొందజాలకుండుటయు, మనోజీవభేదములకు కారణమైయున్నది.

పరస్పరంసంమిలతాం సర్గాణాంరూఢభావినామ్
దేహసత్తాభృశంరూఢా దేహాభావస్తువిస్మృతిః. 9

ఇట్లు భిన్నమనోరాజ్యరూపములగు సృష్టులం గూర్చిన కర్మవాసనాదులు సమమగుటచే నేకకాలమున ఫలోన్ముఖమై మేళనమును జెంద, వ్యష్టి, సమష్టి స్థూలదేహసత్తయు అప్రు డెఱుంగబడుచున్నది. అట్టి సత్తయొక్క విస్మృతిచే దేహాభావమున్ను స్వాభావికముగ సిద్ధించును.

దేహాత్వపరిరూఢత్వా చ్చిద్హేమ్నా విస్మృతాత్మనా
మిథ్యానుభూతాఽవిద్యాతు శుద్ధాకటకతామితా. 10

దేహమందాత్మభావమును దృఢమొనర్చుకొని, స్వాభావికమగు తన యాత్మస్థితిని మఱచి చిద్రూపమను సువర్ణము, తన సువర్ణత్వ (శుద్ధాత్మత్వ) మును విస్మరించి కటకత్వరూపమును జెందెనో యన మిథ్యాజగద్రూపమగు అవిద్య ననుభవించుచున్నది.

యథాశుద్ధాః ప్రాణమరు త్పర ప్రాణాదివేదనాత్
వేత్తి వేద్యంమనోరాజ్యం తథాసర్గాన్తరాశ్రయమ్. 11

హఠయోగాభ్యాసముచే శుద్ధప్రాణవాయువు మఱొకని శరీరమందు ప్రవేశించి, వాని దేహప్రాణముల తన వశముజేసికొని శబ్దాది వేద్యపదార్థముల నెఱుంగునట్లు శుద్ధమనంబును మఱియొక సృష్టి కాశ్రయభూతమగు మనోరాజ్యము నెఱుంగును.

సర్వేషాంజీవరాశీనా మాత్మావస్థాత్రయంశ్రితః
జాగ్రత్స్వప్నసుషుప్త్యాఖ్య మత్ర దేహోఽసకారణమ్. 12

జీవులందఱియొక్క జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలకును ఆశ్రయమాత్మయే అయియున్నది కాని దేహముగాదు. ఏలన, జాగ్రత్కల్పన దేహములేనిచో సిద్ధింపనందున అపుడన్యోన్యాశ్రయ దోషము సంభవించును.

ఏవమాత్మనిజీవత్వే సత్యవస్థాత్రయాత్మని
నచాంభసీవవీచిత్వ మస్మిన్కచతి దేహతా. 13

ఇవ్విధమున జీవాత్మయే అవస్థాత్రయరూపమగుటచే తరంగము జలముకంటె వేఱుగానట్లు, దేహమును యద్దానికి భిన్నముగా నేరదు.

చిత్కలాపదమాసాద్య సుషుప్త్యపదస్థితమ్
బద్ధో నివర్తతే జీవో మూఢః సర్గే ప్రవర్తతే. 14

తత్వజ్ఞాని సుషుప్త్యంతమందలి వాసనారహితమగు తురీయపదమందుస్థితుడై చైతన్యైకరసమగు ఆత్మభావమును జ్ఞానముచే ప్రాప్తినొంది జీవభావమునుండి నివృత్తిఁబొందును. అజ్ఞాని స్వకల్పనచే దేహాద్యాకారమయమగు కల్పనారూపప్రపంచమునందు ప్రవృత్తుడగును.

ద్వయోరేకస్వరూపైవ స్వసౌహార్దనిదర్శనాత్
అజ్ఞః సుషుప్తోఽసంబద్ధో జీవః కశ్చిత్ససర్గభాక్. 15

నిరతిశయానంద రూపమగు మోక్షతుల్యమగుటచే సుషుప్తి జ్ఞానికిని అజ్ఞానికిని సమానమే గాని, జ్ఞానవర్జితసుషుప్తిసహితుడగు జీవుడు సంసారమునే బొందును. ఇదియే యిందలి విశేషము.

సర్గగత్వాచ్చితః కశ్చిత్పరసర్గేణనీయతే
సర్గేసర్గే పృథగ్రూపం సన్తి సర్గాన్తరాణ్యపి. 16

చిద్వస్తువు సర్వవ్యాపియగుటచే యొకానొకజీవుడు మఱియొకని సృష్టియందును ప్రవేశింప గల్గుచున్నాడు. ఒక్కొక్క సృష్టియందు విభిన్నరూపమున ననేక సృష్టులు గలవు.



తేష్వప్యన్తస్థసర్గౌఘాః కదలీదలపీఠవత్
సర్వ స్సర్గాన్తరాదూరం షట్త్రపీవరవృత్తిమత్. 17

స్వభావశీతలంబ్రహ్మ కదలీదలమండపః
కదల్యామన్యతానాస్తి యథాపత్రశతేష్వపి. 18

బ్రహ్మతత్త్వేఽన్యతానాస్తి తథాసర్గశతేష్వపి
బీజమేవ రసాత్ఫుల్లం భూత్వాబీజంపునర్భవేత్. 19

తథాబ్రహ్మమనోభూత్వా బోధాద్బ్రహ్మపరంభవేత్.
రసకారణకంబీజం ఫలభావేనజృంభతే. 20

ఆసృష్టులందునను కదళీస్తంభదళములవలె యింకననేకసృష్టులుగలవు. ఈ సృష్టులన్నింటియొక్క భాహ్యాభ్యంతరములందు వ్యాపించి, బాహ్యప్రదేశమున వ్యాపించిన పత్రములవోలె నతి విశాల రూపమగు బ్రహ్మము స్వభావముగనే శీతలమగు కదళీదళమండపము వంటిదగును. పత్రములనేకము లావిర్భవించినను కదళీరూపమున భేదమేమియులేనట్లు యీ వివిధ సృష్టులందుగూడ బ్రహ్మ తత్వమునందు భేదమేమియును లేదు. మఱియు బీజము జలసంబంధముచే వికసితవృక్షమై మరల ఫలాదులద్వారా తన పూర్వకాల బీజభావమును పొందునట్లు బ్రహమున్ను, కామకర్మాదులను జలముయొక్క సంబంధముచే మనోరూపమంది జననమరణాదుల కల్పనయొనర్చుచు, అధికారి దేహములభింప, శ్రవణ మననాదులచే జ్ఞానప్రాప్తిని బడసి తద్ద్వారా పూర్వసిద్ధమగు తన బ్రహ్మ స్వభావమును మరల పొందును.

బ్రహ్మకారణకోజీవో జగద్రూపేణజృంభతే
రసస్యకారణంకింస్యాదితి వక్తుంనయుజ్యతే. 21

బ్రహ్మణంకారణంకింస్యాదితి వక్తుంనయుజ్యతే
స్వభావోనిర్విశేషత్వా త్పరోవక్తుంనయుజ్యతే. 22

అట్లు బ్రహ్మకారణంబున జీవుడే జగద్రూపముగ విజృంభించుచున్నాడు. మూలమునకు కారణమేమన నయ్యది చెప్పశక్యముగాదు. ఏలయన 'మూలేమూలా భావాదమూలంమూలమ్' అను నట్లు మూలమునకు మూలములేనందున మూలము కారణవర్జితమైనది. అనగా మూలము (బ్రహ్మము) నకు మూలములేదని భావము. మఱియు పత్రశాఖావృక్షపుష్పఫలాదులు రసయుక్తములై యుండుటగాంచి వృక్షాదుల స్వభావము రసమని వచించునట్లు జగత్కారణమగు బ్రహ్మమున్ను జగద్బ్రహ్మకు స్వభావవిశేషమే యగుననియు, అందుచే బ్రహ్మముయొక్క కారణత్వమును సిద్ధింపజేయుట స్వభావకారణత్వమును సిద్ధింపజేయుటయే యగునన అట్లుకాదు. ఏలన బ్రహ్మము నిర్విశేషమును, నిరాకారమును, అద్వైతరూపమును నగుటచే కారణమునకు కార్యముతోటి, ఉత్పత్తియను అసాధారణస్వరూపత్వమున సంబంధములేదు.

నాకారణేకారణాది పరేవస్త్వాదికారణే
విచారణీయఃసారోహి కిమసారవిచారణైః. 23

నిర్వికారమును, అద్వితీయమును, అసంగమమును నగుటచే యథార్థముగ బ్రహ్మమకారణమైనది. మఱియు ప్రపంచమంతయు నారోపించుటచే బ్రహ్మమున కారణ నిమిత్తాదులు సంభవింపనేరవు. ఏలయన, అట్లు సంభవించుట బ్రహ్మస్వభావ విరుద్ధమగును. కాన అకారణమును, వివర్తరూపమునునగు యీ జగత్తు మిథ్యయే అయియున్నది. అట్లైన నిక సారహితమును, జడమును దుఃఖమయమునునగు జగత్తునుగూర్చిగాని, దాని కారణములగూర్చిగాని విచారించుటచే నేమి ప్రయోజనము ? సారభూతమగు బ్రహ్మమునుగూర్చియే విచారింపదగియున్నది.

బీజంజహద్బీజవపుః ఫలీభూతంవిలోక్యతే
బ్రహ్మజహన్నిజవపుః ఫలంబీజేచసంస్థితమ్. 24

బీజము తన బీజాకారమును త్యజించుచునే లోకమున అంకురాదులరూపమున ఫలీభూతమై గన్పించున్నది. బ్రహ్మము తన స్వరూపమును త్యజింపకయే జగద్రూపఫలముగ గన్పట్టుట యనునది బీజాంకురముల యేకరూపత్వముచే నగును.

బీజస్యాకృతిమత్సర్వం తేనానాకృతిమత్పదమ్
నయుజ్యతేసమీకర్తుం తస్మాన్నాస్త్యుపమాశివే. 25

బీజమంతయును ఆకారవంతమైనదే. కాన ఆకారరహితమగు బ్రహ్మముతోటి బీజమునకు సమత్వము గలుగజాలదు. ఇక్కారణమున బ్రహ్మముతో బోల్పదగిన దద్దియును లేదు.

స్వమేవజాయతేస్వాభం నచతజ్జాయతేఽన్యదృక్
అతోఽనజాతంనాజాతం విద్ధిబ్రహ్మనభోజగత్. 26

ఇయ్యది తనకు సమానము తానేయగును. అన్యవస్తువులవలె యిదెన్నటికిని గాదు. కాన చిదాకాశమున యీ జగత్తును యుత్పన్నము కానిదిగను, అనుత్పన్నము కానిదిగను నెఱుంగుము.

దృశ్యంపశ్యన్స్వమాత్మానం నద్రష్టాసంప్రపశ్యతి
ప్రపంచాక్రాంతసంవిత్తేః కస్యోదేతినిజాస్థితిః. 27

దృశ్యమునుగాంచు ద్రష్ట తన స్వరూపమును గాంచకుండును. ఏలయన ప్రాపంచిక విషయవాసనలచే జ్ఞాన మాక్రాంతముకాగా స్వస్వరూపమం దపుడెవనికి స్థితి కలుగు ! !

మృగతృష్ణాజలభ్రాన్తౌ సత్యాంనైవవిదగ్ధతా
విదగ్ధతాయాంసత్యాంతు నైవాసౌమృగతృష్ణికా. 28

మృగతృష్ణయందు జలభ్రాంతి కలుగునపుడు విద్వత్తయెటకేగినది ? విద్వత్త కలుగునపుడు భ్రమయెచట ?

ఆకాశవిశదోద్రష్టా సర్వాంగోపినపశ్యతి
నేత్రంనిజమివాత్మానం దృశీభూతమహోభ్రమః. 29

ఆకాశమువలె విశాలమగు స్వరూపముగల్గి సర్వత్రవ్యాపించి, సర్వమును ప్రకాశింపచేయునదైనను ద్రష్ట నేత్రమువలె యథార్థముగ తన్నుతాను గాంచుటలేదు. అహా ! మాయా భ్రమయెంత ప్రబలమైనది !



అకాశవిశదోద్రష్టా సర్వాంగోఽపినపశ్యతి
తేషాంనిజమివాత్మానం దృశీభూతమివాభ్రమః. 30

మఱియు భ్రమరహితుడగు ముక్తపురుషుడు దృశ్యరూపమగు ద్వైతము గాంచనట్లు, ఆకాశమువలె సర్వవ్యాపకమగు ద్రష్ట తన పరమార్థస్వరూపమువంటిదేయగు యితరుల పరమార్థస్వరూపమున్ను గాంచుటలేదు.

ఆకాశవిశదంబ్రహ్మ యత్నేనాపినలభ్యతే
దృశ్యేదృశ్యతయాదృష్టే త్వస్యలాభఃసుదూరతః. 31

ఆకాశమువలె సర్వత్ర వ్యాపించియున్నను, బ్రహ్మము యత్నముచేనైనను గన్పించుటలేదు. ఏలయన, దృశ్యమును దృశ్యరూపముగ జూచునంతవఱకు బ్రహ్మస్వరూపప్రాప్తి యతిదూరమున నున్నదనియే యెంచవలెను.

తాదృగ్భావస్వరూపేణ వినాయత్రనదృశ్యతే
తత్రాపిదూరోదస్త్యైవ ద్రష్టుఃసూక్ష్మస్యదృశ్యతా. 32

ఘటాది విషయప్రదేశమందు వ్యాపించు వృత్త్యవచ్ఛిన్నమగు ద్రష్ట విషయరూపమును బొందనిచో ఘటాదులు ప్రకాశింపకున్నను, అచటగూడ ద్రష్టృసాక్షాత్కార మతిదూరముననే యుండును. ఏలయన వృత్తిని విషయరూపమునుండి వేఱుజేసి బుద్ధిసూక్ష్మత్వముచే కేవలము పరమాత్మస్వరూపమును నిశ్చయించుట దుర్లభమైనదే.

దృశ్యంచదృశ్యతేతేన ద్రష్టారామనదృశ్యతే
ద్రష్టైవసంభవత్యేకో నతుదృశ్యమిహాస్తిహి. 33

ఓ రామా ! దృశ్యము గన్పించుచున్నదిగాని ద్రష్ట గన్పించుటలేదు. కాని యథార్థముగ ద్రష్టయే గలదు. దృశ్యము లేనేలేదు.

ద్రష్టాసర్వాత్మకోదృశ్యే స్థితశ్చేత్తైకవద్రష్టృతా
సర్వశక్తిమతారాజ్ఞా యద్యత్సంపద్యతేయథా. 34
తత్తథానుభవత్యాశు సఏవోదేతితత్తథా
యథామధురసోల్లాసః ఖండోభవతిభాసురః. 35
రసతామజహచ్చైవ ఫలపుష్పలతోన్నతః
చిదుల్లాసస్తథాజీవో భూయోభవతిదేహకః. 36

సర్వాత్మకమగుటచే ద్రష్టయే దృశ్యరూపముగ నున్నపుడు, స్వస్వరూప భూతమగు దృశ్యమందు క్రియావిరోధముచే ద్రష్టృత్వమెట్లు సంభవించును ? లేక సర్వశక్తిమంతుడగు నృపునివలె ఇయ్యది దృశ్యసంపాదనమొనర్చి యద్దానికి ద్రష్టయగునన్నచో, అన్యపదార్థాపేక్షలేక అయ్యదేరూపముఁజెందునో, అదేరూపమున యనుభవించుచు, అట్టిరూపముననే యుదయించుచు నుండును. మధురసోల్లాసము శర్కరాఖండరూపమై చెన్నొందునట్లును తన రసరూపత్వమును త్యజింపయే ఫలపుష్ప లతాదులరూపమున నుత్పన్నమగునట్లును, చిదుల్లాసమగు జీవుడును దేహాదిరూపముఁ జెందును.

చిన్మాత్రతాం తామజహాదేవ దర్శనదృఙ్మయమ్
అన్తఃస్వానుభవశ్చైవ జగత్స్వప్నం ప్రపశ్యతి.　　37

మఱియు నీ ద్రష్ట తన చిత్స్వరూపమును త్యజింపకయే ద్రష్టృదర్శనరూపములగుచు తనయందు జగత్తను స్వప్నమును గాంచుచున్నది.

అహన్త్వాదిరసే భూమే ఖండకత్వమివాత్మని
నానాఖండసహస్రాఢ్యై రద్వితీయైర్నిజాత్మనః.　　38
యథోదేతి రసోభూమశ్చిత్తథోదేత్యసంభ్రమమ్
చిద్రసోల్లాసవృక్షాణాం కచతామాత్మనాత్మని.　　39
దృశ్యశాఖాశతాఢ్యానామిహ నాన్తోఽవగమ్యతే
ఖండః ప్రత్యేతమేవాయం యథా రసచమత్కృతిమ్.　　40
స్వాదయత్యేవమేషా చిత్పృథక్పశ్యతి సంస్థితమ్

పృథివియందుత్పన్నమైన లవణాదుల రసమందు లవణాదిఖండములవలె ఆత్మయందహంకారాదులు గలవు. తన కభిన్నమగు యనేకఖండములందును పృథివి వ్యాపించియున్నట్లే చిద్వస్తువున్ను అనేకరూపముల నుదయించుచున్నది. చిద్రసోల్లాసముచే నుత్పన్నమై, అనేక దృశ్యశాఖలచే పూర్ణమైయున్న బ్రహ్మాండవృక్షముల కంతములేదు. మఱియు నీ దృశ్యమానమగు బ్రహ్మాండ వనఖండము తన రసచమత్కారము నెట్లనుభవించునో, చైతన్యమట్లనే యాచమత్కారమును గాంచును.

యాయోదేతి యథా యస్యా జీవశక్తేః స్వసంసృతిః.　　41
తాం తాం తథైతి సా స్వాత్మ చిద్రూపభువనస్థితమ్
జీవసంసృతయః కాశ్చిత్త్వమిలన్తి పరస్పరమ్.　　42

ఏ యేజీవశక్తికెట్లెట్లు దృశ్యప్రపంచ ముదయించునో, అట్లట్లు తనయాత్మ చిద్రూప బ్రహ్మాండమునందున్నట్లయ్యదనుభవించును. మఱియు సమానాకారములగు వాసన లుదయించుటచే కొన్ని జగత్ఖండములు పరస్పరము కలియుచుండును.

స్వయంవిహృత్య సంసారే శామ్యన్తి చిరకాలతః
సూక్ష్మయా పరయా దృష్ట్యా త్వం పశ్య జ్ఞానచేతసా.　　43

అయ్యవి చిరకాలము విహారము సల్పి తుదకు నశించును. ఓ రామా! నీవు పరమసూక్ష్మదృష్టితోను జ్ఞానరూపమగు చిత్తముతోను సహస్రాకములగు అన్యుల ప్రపంచములఁ జూడుము.

జగజ్జాలసహస్రాణి పరమాణ్వంతరేష్వపి
చిత్తే నభసి పాషాణే జ్వాలాయామనిలే జలే.　　44

చిత్తమందును, ఆకాశమందును, శిలయందును, అగ్నిజ్వాలయందును, వాయువందును, అరణ్యమందును, ప్రతి పరమాణువునందును వేలకొలది జగత్సమూహములు గలవు.

సన్తి సంసారలక్షాణి తిలే తైలమివాఖిలే
స్థితిర్యదా చేతస్తదా జీవోఽభవేచ్చితిః.　　45



నువ్వులందంతటను నూనెయున్నట్లు చిత్తమందు లక్షలకొలది జగత్తులుగలవు. చిత్తము నకు సిద్ధియెపుడు గల్గునో అపుడదియే చైతన్యమగును.

శుద్ధా చ సా సర్వగతా తేన తన్మేలనం మిథః
సర్వేషాం పద్మజాదీనాం స్వసత్తాభ్రమరూపకః.　　46

శుద్ధమును, సర్వవ్యాపియునగు చైతన్యముయొక్క పరస్పరమేళనము సిద్ధించును. ఈ జగత్తు [illegible]లచే కల్పితమును భ్రమరూపమునై యున్నది.

జగద్దీర్ఘమహాస్వప్నః సోఽయమన్తఃసముత్థితః
స్వప్నాత్స్వప్నాంతరం యాన్తి కాశ్చిద్భూతపరంపరాః.　　47

[illegible]న యీ ప్రపంచము దీర్ఘస్వప్నమువంటిదగును. కొందఱు జీవులొకస్వప్నమునుండి మఱియొక స్వప్నమును బొందుచునున్నారు.

తేనోపలంభః కుడ్యాదావసౌ దృఢతరః స్థితః
యద్యత్రచిద్భావయతి తత్తత్రానుభవత్యలమ్.　　48

ఇట్టి స్వప్నపరంపరాభ్రమణముచే భిత్త్యాదులందుగూడ వారలకు స్థితిగల్గుచున్నది. మఱియు వాసనాదార్ఢ్యముచే నియ్యదియు దృఢరూపమును బొందును. వాసనానుసారము చైతన్యమెట్లు భావించునో, అట్లనే అయ్యదనుభవించును.

తయా స్వప్నేఽపి యద్దృష్టం తత్కాలే సత్యమేవ తత్
చిదణోరన్తరే సన్తి సమస్తానుభవాణవః
యథా బీజాన్తరే పత్ర లతాపుష్పఫలాణవః.　　49

ఆ చైతన్యము స్వప్నమున యనుభవించునదంతయును అక్కాలమున సత్యముగనే యుండును. బీజమందు పత్రలతాపుష్పఫలాదులవలె వాసనామయమగు చిదణువందు సూక్ష్మరూపములగు జగత్తులన్నియును గలవు.

పరమాణుజగత్యన్తరస్మిన్యే చిత్పరమాణవః
లీనమాకాశమాకాశే ద్వైతైక్యభ్రమముత్సృజ.　　50

చిత్పరమాణువు (జీవు) లు జగత్పరమాణువులందు ప్రవేశించియున్నవి. మఱియు జగత్తు చిత్పరమాణువందు ప్రవేశించియున్నది. ఈ జగచ్చిద్వస్తువుల పరస్పరప్రవేశ మాశ్చర్యమని నేను తలంచుచున్నాను. ఒక విధమున నిది యాశ్చర్యమును గాదు. ఏలయన చిదాకాశమే చిదాకాశమున లీనమగుచున్నది. ఈ చిదాకాశమునే భ్రమరూపమగు జగత్తుగ సర్వులును గాంచుచున్నారు. కాన నో రామా! నీవు ద్వైతైకత్వభ్రమను త్యజించివేయుము.

దేశకాలక్రియాద్రవ్యైః స్వైరేవాణుభిరేవ చిత్
అణూననుభవత్యన్తరితరాణి న సంభవాత్.　　51

చిదంశములగు దేశకాల క్రియారూపములైన యణువులచే స్వాత్మభూతమగు యణువులనే అన్యముగ జూచుచున్నారు. కాని యథార్థముగ అన్యమెద్దియును సంభవము గానేరదు.

స్వయంసర్గస్యకచితః స్వప్నే చిదణుఖండకః
బ్రహ్మాదేః కీటనిష్ఠస్య దేహదృష్ట్యానుభావితః. 52

బ్రహ్మాది కీటపర్యంతముగల ప్రాణులందఱియొక్క చిదణుస్వరూపము (జీవరూపము) చే వానివాని యంతఃకరణోపాధివశమున ప్రళయకాలమున యస్ఫుటమై యున్నట్టి యీ జగత్తు సృష్టికాలమున స్వప్నమునందువలె దేహదృష్టిచే ననుభవింపబడుచున్నది.

కచితంకించిదేవేహ వస్తుతస్తు నకించన
స్వయంసత్యంస్వాదయన్తే ద్వైతంచిత్పరమాణవః. 53

ఈ జగత్తు అనిర్వచనీయ రూపమున స్ఫురించుచున్నది. యథార్థరూపమున కొంచెమైనను స్ఫురించుటలేదు. భ్రాంతిఁగొన్న మనుజుడు తన భుజములపై తానెక్కఁదలంచునట్లే చిత్—పరమాణువు అనగా జీవుడు స్వయముగ సత్యస్వరూపమగు ఆత్మను ద్వైతరూపముగ దలంచుచు భ్రాంతిచే నాద్వైతరూపమునే యనుభవించుచున్నాడు.

స్వయంప్రకచతిస్ఫార దేహశ్చిదణుఖండకః
నేత్రాదికుసుమద్వారైః సంవిదామోదముద్గిరన్. 54

చైతన్యరూపమగు యణువు అంతఃకరణోపాధిచే నేత్రాది పుష్పములద్వారా జ్ఞానమను సుగంధమును వెదలగ్రక్కుచు స్వయముగ విశాలమగు దేహరూపమున స్ఫురించుచున్నది.

సంపశ్యతితరాం కశ్చిద్బహీరూపేణ చిద్ఘటః
సర్వగత్వాదనాశిత్వా ద్దృశ్యబీజస్య వైచితేః. 55

దృశ్యమునకు బీజభూతమగు చైతన్యము సర్వవ్యాపియు, నాశరహితమునగుటచే వ్యష్టిరూపుడగు యొకానొకజీవుడు ఘటసదృశమగు స్థూలదేహపరిచ్ఛేదవశమున దేశకాలములచే బాహ్యరూపమున ఘటమును గాంచును.

అన్తరేవాఖిలం కశ్చిత్పశ్యత్యవిమలంజగత్
తత్రాతికాలకలనాదున్మజ్జతి నిమజ్జతి. 56

మఱియు సమష్టి బ్రహ్మాండాత్మకుఁడగు యొకానొక జీవుడు దోషభూయిష్టమగు యీ జగత్తును తనయందే గాంచును. దీర్ఘకాలమద్దానితో యభేదముఁజెందుటచే నందే మునుంగుచు, (లయించుచు) తేలుచు (ఉత్పన్నమగుచు) నుండును.

స్వప్నాత్స్వప్నాన్తరంతత్ర తథాపశ్యన్పునఃపునః
మిథ్యావటేషు లుఠతి శిలేవశిఖరచ్యుతా. 57

అతడా స్వప్నరూపమగు జగత్తునందు స్వప్నాంతరము గాంచుచు మిథ్యాభూతములైన గర్తములందు, పర్వతముపైనుండి పడిన శిలవలె దొర్లుచు నుండును.

కేచిత్సంమిళితాః కేచిదాత్మన్యేవాభ్రమేస్థితాః
మగ్నాఃస్వసంవిత్ప్రసరే స్ఫురన్తో దేహఖండకాః. 58



స్వకీయజ్ఞానవిస్తారమున స్ఫురించుచు కొన్ని దేహములు పరస్పరము కలియుచుండును; కొన్ని భ్రమరహితములై ఆత్మయందు స్థితిగల్గియుండును. మఱికొన్ని అందు నిమగ్నములై యుండును.

స్వయమన్తః ప్రపశ్యన్తి యేజగజ్జీవవిభ్రమమ్
తైస్తైః కైశ్చిత్తతం దృశ్యమసత్స్వప్నవదాశ్రితమ్. 59

జగజ్జీవవిభ్రమములను తమయందే గాంచునట్టి కొందఱు జీవులీవ్యాప్తమగు దృశ్యమును అసత్తుగను, స్వప్నతుల్యముగను నిశ్చయింతురు.

సర్వాత్మత్వాత్స్వభావస్య తద్దృశ్యంసత్యమాత్మని
సర్వగంవిద్యతేయత్ర తత్రసర్వముదేతిహి. 60

చిద్వస్తువు స్వభావముగ సర్వరూపమగుటచే అయ్యది దృశ్యమందధిష్ఠానమగు ఆత్మరూపమున సత్యమే అయియున్నది. మఱియు యెచట సర్వవ్యాపియగు ఆత్మకలదో, అచట సమస్తమున్ను విస్తరరూపమున నుదయించును.

జీవాన్తః ప్రతిభాసస్య సర్వస్యపునరన్తరే
జీవఖండఉదేత్యుచ్చైస్తస్యాన్తరితరోపిచ. 61

జీవరూప ప్రతిభాసమందంతటను మరల జీవరూప ముదయించుచున్నది. ఆ జీవునియందు మరల యింకొక జీవరూప ముదయించుచున్నది.

జీవాన్తర్జాయతే జీవస్తస్యాన్తరపి జీవకః
సర్వత్రరంభాదలవజ్జీవో జీవాన్తరేవహి. 62

జీవునియందు జీవుడును, వానియందు మఱొక జీవుడును ప్రాదుర్భవించుచున్నారు. వెయ్యేల, కదళీదళములవలె ఒక జీవునియందు మఱొక జీవరూపముగలదు. అనగా ప్రపంచసహితుడగు జీవునియందలి జీవసత్తకు కారణమచటి అవిద్యాసహితమగు చైతన్యమే యగును.

దృశ్యబుద్ధిపరావృత్తౌ సమమేతదనన్తరమ్
హేమ్నీవకటకాదిత్వం పరిజ్ఞాతంవినశ్యతి. 63

బుద్ధి దృశ్యపదార్థములనుండి తొలగి ప్రత్యగాత్మాభిముఖముకాగా సువర్ణమందలి కటకత్వమువలె, యొకేకాలమున యీ బాహ్యాభ్యంతర ప్రపంచమంతయును నశించును.

విచారోయస్యనోదేతి కోఽహంకిమిదమిత్యలమ్
తస్యాన్తర్నవిముక్తోసౌ దీర్ఘోజీవజ్వరభ్రమః. 64

'నేనేవరను, ఈ ప్రపంచమేమి' యను విచారమెవనికి కలుగకున్నదో, అట్టివానికి జ్వరరూపమగు యీ దీర్ఘకాల జీవవిభ్రమము తొలగనేరదు.

విచారఃసఫలస్తస్య విజ్ఞేయోయస్యసన్మతేః
దినానుదినమాయాతి తానవం భోగగృధ్నుతా. 65

ఏ సద్బుద్ధియగు మనుజునకు భోగలాలస దినదినము క్షీణించుచుండునో, అట్టివానిచే చేయబడు (తత్వ) విచారమే సఫలమగునని యెఱుంగవలెను.

యథా దేహోపయుక్తంహి కరోత్యారోగ్యమౌషధమ్
తథేంద్రియజయేఽభ్యస్తే వివేకః ఫలితోభ్యవేత్. 66

శరీరమందు సేవించుటచే యౌషధ మారోగ్యమొనగూర్చు చందమున యింద్రియజయ మభ్యసించుటచేతనే వివేకము ఫలవంతమగును.

వివేకోఽస్తి వచస్యేవ చిత్రేఽగ్నిరివభాస్వరః
యస్య తేనాపరిత్యక్తా దుఃఖాయైవావివేకితా. 67

చిత్రమందలి ప్రకాశమానమగు అగ్నివలె యెవని వివేకము కేవలము వచనమాత్రమేయగుచు, మనంబున లేకయుండునో, ఆతడు దుఃఖప్రదమగు అవివేకమును త్యజింపనివాడే యగును.

యథాస్పర్శేనపవనః సత్తామాయాతినోగిరా
తథేచ్ఛాతానవేనైవ వివేకోఽస్యవిబుధ్యతే. 68

వాయుసత్త వచనములచేగాక స్పర్శచేతనే యెఱుంగబడునట్లు, కోర్కెలు సన్నగిల్లుటయను యుపాయముచేతనే మనుజుని వివేక మెఱుంగబడుచున్నది.

చిత్రామృతం నామృతమేవవిద్ధి
చిత్రానలం నానలమేవవిద్ధి
చిత్రాంగనా నూనమనంగనేతి
వాచావివేక స్త్వవివేకఏవ. 69

ఓ రామా ! చిత్రమందలి అమృత మమృతముకాదు. చిత్రమందలి అగ్ని అగ్నికాదు. చిత్రమందలిస్త్రీ స్త్రీకాదు. అట్లనే వాచావివేకమున్ను వివేకముకాదు. అయ్యది అవివేకమే యగును.

పూర్వంవివేకేన తనుత్వమేతి
రాగోఽథవైరంచ సమూలమేవ
పశ్చాత్పరిక్షీయత ఏవయత్నః
సపావనోయత్ర వివేకితాస్తి. 70

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
జీవనఖండకావతారోనామాష్టాదశః
సర్గః ॥ 18 ॥

ఓ రామా! మొట్టమొదట వివేకముచే రాగము సన్నగిల్లును. పిదప వైరమున్ను సమూలముగ నశించును. మఱియు జ్ఞానోదయముచే యిష్టవస్తువును ప్రాప్తించుట, అనిష్టవస్తువును తొలగించుట యను యత్నముగూడ క్రమముగ నశించును. కాన వివేకముగల మానవుడు ధన్యుడు, ఆతడే పరమపావనుడు.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు స్థితిప్రకరణమున
జీవనఖండకావతారమను అష్టాదశ
సర్గము ॥ 18 ॥

---

## ఏకోనవింశః సర్గః.

---

శ్రీవసిష్ఠ ఉవాచ :—

జీవబీజంపరంబ్రహ్మ సర్వత్రఖమివస్థితమ్
తేనజీవోదరజగత్యపి జీవోఽస్త్యనేకధా. 1

శ్రీవసిష్ఠుడు :—ఓ రామా ! జీవునకు బీజభూతమగు బ్రహ్మ మాకాశమువలె సర్వత్ర వ్యాప్తమైయున్నది గాన. జీవునియందే జగత్తుగలదో, అద్దానియందును అనేకవిధములగు జగత్తులు గలవు.

చిద్ఘనైకఘనాత్మత్వా జ్జీవాస్తత్రజీవజాతయః
కదలీదలవత్సన్తి కీటాఇవధరోదరే. 2

చిద్ఘన స్వరూపమగుటచే కదళీదళములవలెను. భూమియందు కీటసమూహములవలెను యొక జీవునందనేక జీవులుగలరు.

యోయోనామయథాగ్రీష్మే కల్పస్వేదాద్భవేత్క్రిమిః
యద్యద్దృశ్యంశుద్ధచిత్తం తజ్జీవోభవతిస్వతః. 3

గ్రీష్మర్తువునందు మల, స్వేదకారణమున శరీరముననే ఆయా కృమి జాల ముత్పన్నమగునట్లు బాహ్యమందైనను యాభ్యంతరముననైనను శుద్ధచైతన్యమే యే దృశ్యరూపమును ధరించునో, దాని ననుభవించు జీవుడును ఆ యా స్థానమున నుత్పన్నమగుచుండును.

యథాయథాయతన్తే తే జీవకాఃస్వాత్మసిద్ధయే
తథాతథాభవన్త్యాశు విచిత్రోపాసనక్రమైః. 4

స్వాత్మసిద్ధి కొఱకై వివిధ యుపాసనాక్రమములచే జీవు లేయేవిధమున ప్రయత్నింతురో ఆ యా విధముగనే శీఘ్రముగ నగుచుందురు.

దేవాన్దేవయజోయాన్తి యక్షాయక్షాన్వ్రజంతిహి
బ్రహ్మబ్రహ్మయజోయాన్తి యదతుచ్ఛంతదాశ్రయేత్. 5

దేవతల పూజించువారు దేవతలఁబొందుచున్నారు. యక్షుల నారాధించువారు యక్షులఁ జేరుచున్నారు. హిరణ్యగర్భుడగు బ్రహ్మనుపాసించువారట్టి బ్రహ్మనే పొందుచున్నారు. కాన నేది యుత్తమమైనదో యద్దానినే యాశ్రయింపవలెను.

సముక్తోభృగుపుత్రోహి నిర్మలత్వాత్స్వసంవిదః
బద్ధఃప్రథమదృష్టేన దృశ్యేనాశుస్వభావతః. 6

తన జ్ఞాన (చిత్త) నైర్మల్యముచే భృగుని పుత్రుడగు శుక్రుడు ముక్తుడాయెను. ప్రథమమున అప్సరారూపమగు దృశ్యమును జూచునపుడు (మలిన) చిత్తస్వభావముచే బద్ధుడయ్యెను.

భువిజాతాపరిమ్లానా బాలాయత్ప్రథమంపురః
సంవిత్ప్రాప్నోతి తద్రూపా భవత్యన్యానకాచన. 7

ప్రాపంచిక వ్యసన క్లేశాదులచే శుద్ధ చైతన్యమెంతవఱకు పరిమ్లానముగాక యుండునో, అంతవఱకును తాను ప్రథమమున పొందిన రూపమే గలిగియుండునుగాని అన్యముగాదు.

**శ్రీరామ ఉవాచ :—**

జాగ్రత్స్వప్నదశాభేదం భగవన్వక్తుమర్హసి
కథంచజాగ్రజ్జాగ్రత్స్యాత్స్వప్నో జాగ్రద్భ్రమఃకథమ్. 8

శ్రీరాముడు :—ఓ మునీంద్రా ! జాగ్రత్స్వప్నావస్థలభేదము మీచే దెలుపదగియున్నది. జాగ్రత్తు సత్యమును, వ్యవహారహేతువున్ను యెట్లగుచున్నది. మఱియు స్వప్నము జాగ్రద్భ్రమ మెట్లగును ?

**శ్రీవసిష్ఠ ఉవాచ :—**

స్థిరప్రత్యయయుక్తం యత్తజ్జాగ్రదితి కథ్యతే
అస్థిరప్రత్యయం యత్స్యాత్తత్స్వప్నః సముదాహృతః. 9

శ్రీవసిష్ఠుడు :—స్థిరప్రత్యయయుక్తమైనదే జాగ్రత్తనియు, అస్థిర ప్రత్యయయుక్తమైనది స్వప్నమనియు చెప్పబడును.

జాగ్రత్త్వేక్షణదృష్టః స్యాత్స్వప్నః కాలాన్తరేస్థితః
తజ్జాగ్రత్స్వప్నతామేతి స్వప్నో జాగ్రత్త్వమృచ్ఛతి. 10

స్వప్నమున్ను కాలాంతరముననున్నదై జాగ్రల్లక్షణములతో కూడియున్న నదియు జాగ్రత్తే యగును. జాగ్రత్తున్ను స్థిరముగానిచో స్వప్నత్వముం జెందును.

జాగ్రత్స్వప్నదశాభేదో నస్థిరాస్థిరతేవినా
సమః సదైవ సర్వత్ర సమస్తోఽనుభవోఽనయోః. 11

స్థిరత్వాస్థిరత్వములు దప్ప జాగ్రత్స్వప్నదశలందు కొంచెమైనను భేదములేదు. ఈ రెండవస్థలయొక్క యనుభవమంతయును సర్వత్ర సమమైనదే. కేవలము స్థిరాస్థిరత్వముల భేదము మాత్రము గలదు.

స్వప్నోఽపిస్వప్నసమయే స్థైర్యాజ్జాగ్రత్త్వమృచ్ఛతి
అస్థైర్యాజ్జాగ్రదేవాస్తే స్వప్నసాదృశబోధతః. 12

స్వప్నమున్ను స్వప్నకాలమున స్థిరత్వముచే జాగ్రత్తగుచున్నది. అట్లనే యస్థిరత్వముచే జాగ్రత్తున్ను స్వప్నసదృశజ్ఞానముచే స్వప్నమే యగుచున్నది.

స్వప్నోఽపిజాగ్రద్బుద్ధ్యంశో జాగ్రత్త్వమనుగచ్ఛతి
స్వప్నతాంస్వప్నబుద్ధ్యాతు యథాసంవేదనంస్థితమ్. 13

హరిశ్చంద్రున కొకరాత్రి ద్వాదశవత్సరకాలముగ దోచినట్లు జాగ్రద్బుద్ధిగ్రాహ్యమగు స్థైర్యాంశముచే స్వప్నమున్ను జాగ్రద్దశ నొందుచున్నది.

యత్తుయావత్స్థిరంబద్ధం. తత్తావజ్జాగ్రదుచ్యతే
క్షణభంగాత్తుతత్స్వప్నో యథాభవతితచ్ఛృణు. 14



స్థిరత్వముచే స్వప్నమున్ను జాగ్రత్తగును. జాగ్రత్తునందువలె యందును జ్ఞానము స్థిరమైనదే. కాని యందు స్వప్నవ్యవహారము మాత్రము స్వప్నబుద్ధిచే గలుగుచుండును. ఏదెంతవఱకు స్థిరముగ తోచునో అయ్యదంతవఱకును జాగ్రత్తనియే వచింపబడును. మఱియు క్షణభంగురమగుటచే జాగ్రత్తున్ను స్వప్నమెట్లగునో యాలకింపుము.

జీవధాతుః శరీరేఽన్తర్విద్యతే యేన జీవ్యతే
తేజోవీర్యం జీవధాతురిత్యాద్యభిధమఙ్గయత్. 15

దేనిచే నీ దేహ ముజ్జీవింపబడుచున్నదో, ఏది జీవనసాధకమో, అట్టి యే శరీరాంతర్గతమగు జీవచైతన్యము తేజ, వీర్య, జీవ, చైతన్యాది నామంబులచే బ్రసిద్ధికెక్కియున్నదో, అదియే జీవనహేతువై యున్నది.

వ్యవహారీయదాకాయో మనసాకర్మణాగిరా
భవేత్తదామరున్నున్నో జీవధాతుఃప్రసర్పతి. 16

శరీరమెపుడు మనోవాక్కర్మలచే వ్యవహారము సల్పునో అపుడు ప్రాణవాయు ప్రేరితమగు జీవచైతన్యము తటాకమునుండి ప్రణాళికద్వారా జలము బయటకు బోవునట్లు, హృదయమునుండి వినిర్గతమై బాహ్యదేశమున సంచరించును.

తస్మిన్ప్రసర్పత్యఙ్గేషు సర్వాసంవిదుదేతిహి
దృష్టత్వాత్రైతి చిత్తాఖ్యామన్తర్లీనజగద్భ్రమమ్. 17

దేహాంతర్గతమగు నాడులం దాజీవచైతన్యమెపుడు సంచరించునో అపుడే యంతటను సంవిత్తు (జ్ఞానము) వుదయించును. మఱియు దృష్టమగునపు డాభ్యంతరమున విలీనమై జగద్భ్రమయుక్తమగుచు చిత్తదశ నొందుచున్నది. (అనగా స్వప్నమును దర్శించునని భావము.)

ఈక్షణాదిషు రంధ్రేషు ప్రసరన్తిబహిర్మయమ్
నానాకారవికారాఢ్యం రూపమాత్మనిపశ్యతి. 18

నేత్రాది ఛిద్రములగుండా బాహ్యప్రదేశమున వ్యాప్తమగుచు జీవచైతన్యము పలువిధవికారములచే పూర్ణమగు రూపమును తనయందే గాంచుచున్నది.

స్థిరత్వాత్తత్తథైవాథ జాగ్రదిత్యవగమ్యతే
జాగ్రత్క్రమఇతిప్రోక్తఃసుషుప్త్యాదిక్రమంశృణు. 19

స్థిరమగుటచే నదేవిధమున అయ్యది జాగ్రత్తనబడుచున్నది. ఓ రామా ! ఇట్లు జాగ్రత్క్రమమును నీకెఱింగించితిని. ఇక సుషుప్త్యాదుల క్రమమును గూర్చి వినుము.

మనసాకర్మణావాచా యదాక్షుభ్యతినోవపుః
శాన్తాత్మాతిష్ఠతిస్వస్థో జీవధాతుస్తదాత్వసౌ. 20

సమతామాగతైర్వాతైః క్షోభ్యతేనహృదమ్బరే
నిర్వాతసదనేదీపో యథాఽఽలోకైకకారకః. 21

తతఃసరతినాడీషు సంవిత్క్షుభ్యతి తేననో
నచేక్షణాదీన్యాయాతి రంధ్రాణ్యాయాతినోబహిః. 22

ఎపుడు మనోవాక్కర్మలచే శరీరము క్షోభఁజెందక యుండునో, ఎపుడీ జీవచైతన్యము శాంతముగను స్వస్థముగను నుండునో, సమత్వముఁజెందిన ప్రాణవాయువుతోకూడి హృదయాకాశమున జీవచైతన్య మక్షుభితమైయుండి నిర్వాతస్థానమందలి దీపమువలె కేవలము ప్రకాశమాత్ర కార్యమొనర్చుచుండునో, అపుడవయవములందలి నాడులందు జీవప్రసారముండదు గాన జీవచైతన్యమున్ను క్షోభనుపొందకయు నేత్రాది ఛిద్రములగుండా బాహ్యాభ్యంతరములఁ జనకయు నుండును.

జీవోఽన్త రేవస్ఫురతి తైలసంవిద్యథాతిలే
శీతసంవిద్హిమఇవ స్నేహసంవిద్యథాఘృతే. 23

నువ్వులందు నూనెవలెను మంచునందు శీతలత్వమువలెను ఘృతమందు తైలరూపమువలెను జీవునియందు జీవసంవిత్తు స్ఫురించుచున్నది.

జీవాకారాకలా కాచిచ్చితిః స్వచ్ఛతయాత్మని
దశామాయాతిసౌషుప్తిం సౌమ్యవాతాంవిచేతనామ్. 24

అట్టి జీవాకారముగల యొకానొక జీవచైతన్యము ఉపాధివిలయముచే స్వచ్ఛత్వకారణమున బ్రహ్మాత్మయందు సౌమ్యప్రాణసహితమై, పృథక్-చైతన్యరహితమై సుషుప్తిదశను పొందుచున్నది.

జ్ఞాత్వావై చిత్యుపరతే సామ్యంవ్యవహరన్నపి
జాగ్రత్స్వప్నసుషుప్తేషు సంబుద్ధస్తుర్యవాన్స్మృతః. 25

చిత్తము సమస్త వ్యవహారములనుండి యుపరతి నెప్పుడుబొందునో అపుడు శాస్త్రముల ద్వారా చైతన్యముయొక్క సమత్వ మెఱిఁగి, ఏకాగ్రత విచారరూపములగు స్వప్నయత్నములచే బ్రహ్మసాక్షాత్కారమొందు యోగి పైనదెల్పిన జాగ్రత్స్వప్న సుషుప్తులను భిన్నభూమికలందు వ్యవహరించుచుండినను, లేక సమాధినిష్ఠుడైయున్నను, దృఢబోధ గల్గియున్నందుచే నాతడెల్లప్పుడు తురీయావస్థయందున్నవాడనియే చెప్పబడును.

సుషుప్తేసౌమ్యతాంయాతైః ప్రాణైఃసంచాల్యతేయథా
సజీవధాతుఃసాసంవి త్తశ్చిత్తతయోదితా. 26

సుషుప్తిదశయందు సౌమ్యత్వముబొందిన ప్రాణములచే నుపలక్షితమగు జీవచైతన్యము, ప్రాణములచే సంచాలితమగునపుడు, అనగా భోజకమగు అదృష్టముయొక్క పరిపాకము మున్నగు వైషమ్యములచే చలింపబడునపుడు, తత్తద్భోగానుకూలమగు ప్రాక్తనసంస్కారముల యుద్భోధనచే చిత్తరూపమున నుదయించుచున్నది.

స్వాన్తఃసంస్థజగజ్జాలం భావాభావైఃక్రమభ్రమైః
పశ్యతిస్వాన్తరేవాశు స్ఫారంబీజఇవద్రుమమ్. 27



అపుడు, బీజమందు స్థితిగల్గియున్న విశాలవృక్షమును యోగి తన యోగశక్తిచే వివేచించి యద్దానిని వేఱుగఁగాంచునట్లా జీవచైతన్యమున్ను భావాభావరూపమగు భ్రమక్రమములచే జగత్సమూహమును తన యంతఃకరణమున శీఘ్రముగ నవలోకించును.

జీవధాతుర్యదావాతైః కించిత్సంక్షుభ్యతేభృశమ్
తతోఽస్మ్యహంసుప్తఇతి పశ్యత్యాత్మనిఖేగతిమ్. 28

ప్రాణవాయువుచే కొంచెము సంక్షుభితమగు నపుడే జీవచైతన్యము 'నేనున్నానను' యనుభవమును పొందును. మఱియు నధికముగ సంక్షుబ్ధమగునపు డాకాశగమనానుభవము నొందును.

యదామ్భసాప్లావ్యతేఽసౌ తదావార్యాదిసంభ్రమమ్
అన్తరేవానుభవతి స్వామోదంకుసుమంయథా. 29

నాడులు శ్లేష్మజలముచే పూర్ణములగునపుడు పుష్పము తనయందు సుగంధానుభవము నొందునట్లు నిద్రించు జీవుడు తనయంతఃకరణమున జలాదుల సంభ్రమము ననుభవించును.

యదాపిత్తాదినాక్రాన్తస్తదా గ్రీష్మాదిసంభ్రమమ్
అన్తరేవానుభవతి స్ఫారంబహిరివాఖిలమ్. 30

పిత్తాదులచే నాక్రాంతమగు నపుడీ జీవచైతన్యము శ్లేష్మాదుల సంభ్రమమునంతయు బాహ్యమునందువలె యనుభవించును.

రక్తాపూర్ణోరక్తవర్ణాన్దేశాన్కాలాన్బహిర్యథా
పశ్యత్యనుభవాత్మత్వాత్తత్రైవచ నిమజ్జతి. 31

మఱియు రక్తముచే పూర్ణమగునపుడు బాహ్యమునందువలె రక్తవర్ణమగు గైరికాది ధాతుమయప్రదేశమును తద్రూపమగు కాలమును వీక్షించుచు, యనుభవస్వరూపమగుటచే నందే నిమగ్నుడగుచు నుండును.

సేవతేవాసనాంయాంతాం సోఽన్తఃపశ్యతినిద్రితః
నవపక్షోభితో రంధ్రైర్బహిరక్షాదిభిర్యథా. 32

ప్రాణవాయువుచే క్షుభితములగు నేత్రాది ఛిద్రముల ద్వారా బాహ్యపదార్థముల నవలోకించునట్లే జీవుడేయే వాసనల సేవించునో, నిద్రయందు వాటినే గాంచును.

అనాక్రాన్తేన్ద్రియచ్ఛిద్రో యతఃక్షుబ్ధోఽన్తరేవసః
సంవిదానుభవత్యాశు సస్వప్నఇతికథ్యతే. 33

నేత్రాది యింద్రియచ్ఛిద్రముల నాక్రమింపక యంతఃకరణముననే సంక్షుబ్ధమై జీవచైతన్యమెద్దాని ననుభవించునో, అదియే స్వప్నమనఁబడును.

సమాక్రాన్తేన్ద్రియచ్ఛిద్రో యఃక్షుబ్ధోవాయునాయదా
పరిపశ్యతి తజ్జాగ్రదిత్యాహుర్మునిసత్తమాః. 34

జీవుడు ప్రాణవాయువుచే విక్షుబ్ధమై బాహ్యశబ్దాది విషయముల గాంచుట యేదిగలదో యద్దానిని మునిసత్తములు జాగ్రత్తని వచింతురు.

ఇతివిదితవతా త్వయాధునాన్తః
ప్రథితమహామతినేహ సత్యతాఖ్యా
అసతిజగతినైవ భావనీయా
మృతిహతిసంహృతి దోషభావనీయా. 35

ఇత్యార్షే వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
జాగ్రత్స్వప్నసుషుప్తితురీయస్వరూపవిచారో
నామైకోనవింశః సర్గః ॥ 19 ॥

ఓ రామా! ఇవ్విధమున జ్ఞానవంతులును, మహాధీమంతులమునైన మనమసత్యమగు యీజగత్తునందు సత్యత్వబుద్ధి యెన్నటికిని గల్గియుండరాదు. ఏలయన, అట్టి దృష్టి ఆధ్యాత్మిక, అధిభౌతిక, అధిదైవిక తాపహేతువులచే మరణరూపమైనది, మఱియు నింకను పెక్కుదోషముల నవశ్యమది గలుగజేయునదై యున్నది.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు స్థితిప్రకరణమున
జాగ్రత్స్వప్నసుషుప్తితురీయస్వరూపవిచారమను
ఏకోనవింశ సర్గము ॥ 19 ॥

---

## వింశః సర్గః.

---

శ్రీవసిష్ఠ ఉవాచ :—

ఏతత్తేకథితంసర్వం మనోరూపనిరూపణమ్
మయారాఘవనాన్యేన కేనచిన్నామహేతునా. 1

శ్రీవసిష్ఠుడు :—ఓ రామా! ఈ జాగ్రదాదుల స్వరూపమును, కేవలము మనస్సు యొక్క యథార్థస్వరూపమును బోధించుటకొఱకే నీకు వర్ణించి చెప్పితినిగాని మఱియొక కారణమున గాదు.

దృఢనిశ్చయవచ్చేతో యద్భావయతిభూరిశః
తత్తాంయాత్యనలాశ్లేషాదయః పిణ్డోఽగ్నితామివ. 2

అగ్నిసంబంధముచే యినుపగుండు అగ్నిరూపమునే బొందులాగున దృఢనిశ్చయము గల చిత్తమేపదార్థము నధికముగ భావించునో యద్దాని రూపమునే జెందుచున్నది.

భావాభావగ్రహోత్సర్గ దృశశ్చేతనకల్పితాః
నాసత్యానాపిసత్యాస్తా మనశ్చాపలకారితాః. 3

భావాభావ, గ్రహణత్యాగాది దృష్టులన్నియు చైతన్యమునుండియే కల్పింపబడినవి. అవి సత్యములుగావు; అసత్యములును గావు. మనోచాపల్యముచే కేవల మనిర్వచనీయరూపములైయున్నవి.



మనోమోహేతుకర్తృస్యాత్కారణంచ జగత్థితేః
విశ్వరూపతయైవేదం తనోతి మలినంమనః. 4

ఈ మనస్సు వ్యష్టిరూపమున భ్రాంతికి కర్తయు, సమష్టిరూపమున జగత్థితికి కారణమును నగును. విశ్వమునకు కారణభూతమును, అవిద్యాకళంకితమునగు యీ మనస్సే జగద్విస్తారమంతయు నొనర్చుచున్నది.

మనోహిపురుషోనామ తంనియోజ్యశుభేపథి
తజ్జయైకాన్తసాధ్యాహి సర్వాజగతిభూతయః. 5

మనస్సే పురుషుడు. కాన నద్దానిని శుభమార్గమున నియోగించుటయే యుచితము. ఏలయన మనోజయముచే జగద్విభూతియంతయును సుసాధ్యమే యగును.

పురుషశ్చేచ్ఛరీరం స్యాత్కథం శుక్రోమహామతిః
అగమద్వివిధాకారం జనాన్తరశతభ్రమమ్. 6

దేహమే పురుషుడగుచో మహాబుద్ధిమంతుడగు శుక్రాచార్యుడు వివిధాకారయుక్తములగు పెక్కుజన్మల గూర్చిన భ్రమనెట్లు బొందెను?

అతశ్చిత్తంహిపురుషః శరీరంచేత్యమేవహి
యన్మయంచభవత్యేతత్తదవాప్నోత్యసంశయమ్. 7

కాన మనస్సే పురుషుడు. భిత్త్యాదులవలె శరీరము సర్వదా విషయరూపమే యగును. ఈ మనస్సేయాకారమయమగునో యద్దానినే నిశ్చయముగ బొందును.

యదతుచ్ఛమనాయాస మనుపాధి గతభ్రమమ్
యత్నాత్తదనుసంధానం కురుతత్తామవాప్స్యసి. 8

ఓ రామా! మహత్తరమైనదియు స్వస్వరూపమే యగుటచే మఱియొక చోటికేగుటయను పరిశ్రమలేకయే సాధ్యమైనదియు, ఉపాధిశూన్యమును, భ్రమరహితమునునగు ఆత్మవస్తువునే నీవు ధ్యానింపుము. అట్టిచో నీవు తద్రూపత్వమునే జెందెదవు.

అభిపతతిమనఃస్థితః శరీరం
సతువపురాచరితం మనఃప్రయాతి
అభిపతతు తవాత్ర తేనసత్యం
సుభగమనః ప్రజహాత్వసత్యమన్యత్. 9

ఇత్యార్షే వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
మనోరూపవర్ణనంనామ వింశతితమః
సర్గః ॥ 20 ॥

మనస్సెటనుండునో శరీరమట కవశ్యమును బోవును. కాని శరీరమెట నుండునో నియమపూర్వకముగ సదా మనస్సటకు బోకయుండును. కాన శుభప్రదుడవగు నోరామా! సత్యమగు ఆత్మవస్తుప్రాప్తియందే నీమనంబు నియోగింపబడుగాక! మఱియు నసత్యములగు దేహేంద్రియాదుల భ్రమను నీవు త్యజించుగాక!

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు స్థితిప్రకరణమున
మనోరూపవర్ణనమను వింశతితమ
సర్గము ॥ 20 ॥

---

## ఏకవింశః సర్గః.

---

శ్రీరామ ఉవాచ :—

భగవన్సర్వధర్మజ్ఞ సంశయోఽయోమహానయమ్
హృదివ్యావర్తతేలోలః కల్లోలఇవసాగరే. 1

శ్రీరాముడు :—ఓ మునీంద్రా! సర్వధర్మజ్ఞా! సముద్రమందు తరంగమువలె నా హృదయముననొక గొప్ప సంశయము కల్లోలమొనర్చుచున్నయది.

దిక్కాలాద్యనవచ్ఛిన్నే తతేనిత్యేనిరామయే
మ్లానాసంవిన్మనోనామ్నీ కుతఃకేయముపస్థితా. 2

దేశకాలాదులచే నపరిచ్ఛిన్నమును, వ్యాపకమును, నిరామయమును నగు బ్రహ్మమున, విషయాకారముచే కలుషితమగు యీ మనస్సనునది యే కారణమున యేరూపమున స్థితిగల్గియున్నది?

యస్మాదన్యన్ననామాస్తి నభూతంనభవిష్యతి
కుతఃకీదృక్కథం తత్రకలఙ్కస్తస్యవిద్యతే. 3

ఆ బ్రహ్మమందు అవిద్యాది కళంకమేకాలమునను లేదుగదా; అట్టిచో యీ మనస్సెల యందు వర్తించుచున్నది? మఱియు అయ్యదేరూపమున నున్నది?

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

సాధురామత్వయాప్రోక్తంజాతాతేమోక్షభాగినీ
మతిరుత్తమనిష్యన్దా నన్దనస్యేవమఞ్జరీ. 4

శ్రీ వసిష్ఠుడు :—ఓ రామా! నీవు బాగుగ వచించితివి. నందనవనమందలి లత ఉత్తమ మకరందమును ప్రవహింపజేయుచు శోభించునట్లు నీ బుద్ధియు నిపుడు మోక్షార్హమై చెన్నొందుచున్నది.

పూర్వాపరవిచారార్థ తత్పరేయం మతిస్తవ
సంప్రాప్స్యసిపదం ప్రోచ్చైర్యత్ప్రాప్తం శంకరాదిభిః. 5

ఇపుడు నీబుద్ధి పూర్వాపరవిచారణయందు తత్పరమైయున్నది గాన యచిరకాలములో శంకరాదులు పొందిన యున్నతపదమును నీవును పొందగలవు.

ప్రశ్నస్యాస్యతుహేరామ నకాలస్తవసంప్రతి
సిద్ధాన్తఃకథ్యతేయత్ర తత్రాయంప్రశ్నఉచ్యతే. 6



కాని యిపుడిది యీ నీప్రశ్నకు తగిన సమయముగాదు. సిద్ధాంతమునుగూర్చి వచించునపుడు (నిర్వాణప్రకరణమున) యీ నీప్రశ్నను ప్రత్యుత్తరమీయబడును.

సిద్ధాన్తకాలేభవతా ప్రష్టవ్యోఽహమిదంపరమ్
కరామలకవత్తేన సిద్ధాన్తస్తేభవిష్యతి. 7

సిద్ధాంతకాలమందు, అనగా శుద్ధాత్మానుభవమును గూర్చి వచించునపు డిద్దానిని నీవడుగుము. అపుడు సిద్ధాంతవస్తువు (ఆత్మ) నీకు కరతామలకముగ గోచరించును. అనుభవవిరుద్ధమగు ఆత్మ యెట్లు శుద్ధమగుననియే యిపుడు ప్రశ్నింపవలెనుగాని ఆత్మను శుద్ధముగ నంగీకరించి యద్దానియందు మలినత్వమెట్లు వచ్చినదని మాత్రము ప్రశ్నింపరాదు.

సిద్ధాన్తకాలేప్రశ్నోక్తిరేషా తవవిరాజతే
ప్రావృషీవహికేకోక్తిర్యుక్తా శరదిహంసిగీః. 8

వర్షాకాలమందు మయూరముయొక్కయు, శరదృతువందు హంసయొక్కయు వాణి శోభించునట్లు సిద్ధాంతకాలముననే యీ నీప్రశ్న శోభించును.

సహజోనీలిమావ్యోమ్ని శోభతేప్రావృషఃక్షయే
ప్రావృషిత్వతనూదగ్ర పయోదపటలోత్థితః. 9

ఆకాశముయొక్క సహజనీలత్వము వర్షాకాలాంతముననే శోభిల్లును. అట్లనే వర్షాకాలమున విశాల మేఘపటలోదయమే శోభను పొందును.

అయంప్రాకృతఆరబ్ధో మనోనిర్ణయఉత్తమః
యద్వశాజ్జనతాజన్మ తదాకర్ణయసువ్రత. 10

సువ్రతుఁడవగు నో రామా! ఉత్తమ మనస్సుయొక్క నిర్ణయము నిపుడుపక్రమించితిమి. దేనివలన ప్రాణసమూహమంతయును జన్మబంధమున తగుల్కొనుచున్నదో అట్టి మనస్సునుగూర్చి నీవిపుడు వినుము.

ఏవంప్రకృతిరూపేయం మనోమననధర్మిణీ
కర్మేతిరామనిర్ణీతం సర్వైరేవ ముముక్షుభిః. 11
శృణుదర్శనభేదేన తన్నామాభిమతాకృతిమ్
వాగ్మినాంవదతాంయాతం చిత్రాభిఃశాస్త్రదృష్టిభిః. 12

పైన దెల్పినవిధమున అజ్ఞుని యనుభవసిద్ధమగు నజ్ఞానమాలిన్యముచే నుపహితమగు చైతన్యము ప్రకృతి యనఁబడును. మననధర్మము గల్గియుండుటచే నదియే మనస్సనియు పేర్కొనబడుచున్నది. కర్మేంద్రియ వ్యాపారముల నొనర్చుటచే నద్దానిని ముముక్షువులందఱును కర్మయనియు నిర్ణయించిరి. భిన్న భిన్న మతవాదుల విచిత్ర శాస్త్రదృష్టుల ననుసరించి మతభేదముచే దాని కనేక నామములను, యాకారములను కల్పించిరి. ఓ రామా! వాటినిగూర్చి నీవు వినుము——.

యంయంభావముపాదత్తే మనోమననచంచలమ్
తత్తామేతిఘనామోద మస్తస్థపవనోయథా. 13

సుగంధమునగాని, దుర్గంధమునగాని వర్తించు వాయు వారూపమునే బొందులాగున, మనన శక్తిచే చంచలమగు యీ మనస్సే యే వాసనతోఁగూడి యెట్టిభావమును గ్రహించునో, అట్టిరూపమునే పొందుచున్నది.

తతస్తమేవనిర్ణీయ తమేవచవికల్పయన్
అన్తఃస్థయారంజనయా రంజయన్స్వామహంకృతిమ్. 14
తన్నిశ్చయముపాదాయ తత్రైవరసమృచ్ఛతి
యన్మయత్వంశరీరేతు తతోబుద్ధీన్ద్రియేషుచ. 15

ఈ కారణముచే తమ తమ వాసనలచే కల్పితమగు సిద్ధాంతమును యుక్తులచే నిర్ణయించి, అద్దాని కల్పననే చేయుచు తమ యంతఃకరణమునగల స్వకల్పితార్థమందలి యనురాగముచే, తమ యహంకారమును తద్రూపముగనే యొనర్చుచు, అట్లనే నిశ్చయించుచు, అట్టి భావనానుసారమే రసాస్వాదనాచమత్కారమును జనులు పొందుచున్నారు. శరీరమం దేయాకారము సంభవించునో బుద్ధీంద్రియములందు నదియే సంభవించుచున్నది.

యన్మయంహిమనోరామ దేహస్తదనుతద్వశః
తత్తామాయాతిగన్ధాంతః పవనోగన్ధతామివ. 16

ఓ రామా ! పదార్థమును భావనచేయు యీ మనస్సు పదార్థముతోఁటి తన్మయమగును. అనగా నా పదార్థరూపమునే జెందును. అపుడు గంధాన్తర్వర్తియగు వాయువు గంధరూపమును బొందునట్లు, అట్టి మనస్సునకు వశవర్తియగు శరీరమున్ను అదేరూపమును పొందును.

బుద్ధీన్ద్రియేషువల్గత్సు కర్మేంద్రియగణస్తతః
స్ఫురతిస్తవపవోర్వ్యా రజోలోలఇవానిలే. 17

చంచలవాయువందు ధూళిరూపమున పృథివి స్ఫురించునట్లు, జ్ఞానేంద్రియములు తమ తమ విషయములందు ప్రవర్తించునపుడు కర్మేంద్రియములున్ను స్వతః స్ఫురింపఁదొడఁగును.

కర్మేంద్రియగణేక్షుబ్ధే స్వశక్తింప్రణయత్యలమ్
కర్మనిష్పద్యతేస్ఫారం పాంసుజాలమివానిలే. 18

కర్మేంద్రియములు సంక్షుబ్ధములగునపుడు క్రియాశక్తియు వ్యక్తమగును. ఆ [illegible] వాయువందు ధూళిసమూహమువలె విశాలమగు కర్మము సిద్ధించును.

ఏవంహిమనసఃకర్మ కర్మబీజంమనఃస్మృతమ్
అభిన్నైవతయోఃసత్తా యథాకుసుమగన్ధయోః. 19

ఇవ్విధముగ మనస్సుయొక్క బీజము కర్మమే యగుచున్నది. మఱియు కర్మయొక్క బీజము మనస్సని వచింపబడినది. కాన పుష్పసుగంధములవలె మనోకర్మలు రెండును యభిన్నములైనవి.

యాదృశంభావమాదత్తే దృఢాభ్యాసవశాన్మనః
తథాస్పన్దాఖ్యకర్మాఖ్య ప్రథాశాఖావిముంచతి. 20

దృఢవాసనాభ్యాసవశమున మనస్సెట్లు భావమును గ్రహించునో, అవ్విధముననే స్పందమునట్టిదియు, కర్మ[illegible]బడునదియు నగు శాఖ యద్దానినుండి యుత్పన్నమగును.



తథాక్రియాంతత్ఫలతాం నిష్పాదయతిచాదరాత్
తతస్తమేవ చాస్వాదమనుభూయాశుబధ్యతే. 21

ఈ మనస్సే క్రియాఫలముల రెంటిని యాదరమున సిద్ధింపజేయుచున్నది. పిదప ఆ కర్మ ఫలము ననుభవించి సత్వరము బంధమునఁ దగుల్కొనుచున్నది.

యంయంభావముపాదత్తే తంతం వస్త్వితివిన్దతి
తత్రశ్రేయోఽన్యన్నాస్తీతి నిశ్చయోఽస్యచజాయతే. 22

ఏ యేభావమునది గ్రహించునో, అది వస్తువు తనయందది నిశ్చయించును, అపుడిది శ్రేయోదాయకమైనది, ఇది కాదనునిశ్చయము దానికి కలుగును.

ధర్మార్థకామమోక్షార్థం ప్రయతన్తేసదైవహి
మనాంసిదృఢభిన్నాని ప్రతిపత్త్యాస్వయైవచ. 23

వాసనాదార్ఢ్యము ననుసరించి భిన్న భిన్నములగు తమ తమ నిశ్చయములచే ధర్మార్థకామ మోక్షముల కొఱకు జనులు ప్రయత్నము సల్పుచున్నారు.

మనోవైకాపిలానాంతు ప్రతిపత్తినిజామలమ్
ఉరరీకృత్యనిర్ణీయకల్పితాః శాస్త్రదృష్టయః. 24

ఈ మతవాదులలో కపిలమతానుయాయులు వివేకులగుటచే అసంగమును చిన్మాత్రమును నగు ‘త్వం’ పదార్థమును (జీవుని లేక పురుషుని) తమ నిశ్చయముచే నిర్మలముగ యెఱుంగుచున్నారు. కాని తత్పదార్థ విషయమునుగూర్చిన శ్రుతి నవలంబించి వ్యామోహముచే తమ బుద్ధిననుసరించి, సుఖ దుఃఖమోహాత్మకమగు జగత్తున కుపాదానకారణము అట్టిదేయగు సుఖదుఃఖజడమోహాత్మకమును గుణాత్మకమును నగు ప్రధానమే యగునని అంగీకరించి, మరలమరల యట్టి నిశ్చయమునే తెల్పుచు అదియే తత్వమని నిశ్చయించి, అట్లనే శాస్త్రములను కల్పించిరి.

మోక్షేతునాన్యథాప్రాప్తిరితి భావితచేతసః
స్వాందృష్టింప్రతిబిమ్బన్తి స్థితాః స్వనియమభ్రమైః. 25

భిన్నభిన్నమతవాదులు తాముచించు యుపాయముచే దప్ప మఱియొకదానిచే మోక్షమెవరికిని గలుఁగదని నిశ్చయించి, స్వకల్పిత నియమములను భ్రమచే, అన్యోపాయములను గ్రహింపక, గ్రంథముల రచించి తద్ద్వారా తమ సిద్ధాంతమును ప్రకాశింపజేయుచు, యితరుల బుద్ధియందుగూడ యద్దానిని ప్రతిబింబింప జేయుచున్నారు.

వేదాన్తవాదినోబుద్ధ్వా బ్రహ్మేదమితిరూఢయా
ముక్తిశమదమోపేతా నిర్ణీయపరికల్పితా. 26

ముక్తౌతునాన్యథాప్రాప్తిరితి భావితచేతసః
స్వాందృష్టిం ప్రవివృణ్వంతి స్వైరేవనియమభ్రమైః. 27

శ్రుతిప్రమాణముచే, అధ్యారోపాపవాదన్యాయము ననుసరించి యీ జగత్తంతయు బ్రహ్మమే, దానికన్యముగ అణుమాత్రమైనను లేదను దృఢనిశ్చయముచేతను శమదమాదులచేతను సర్వోత్తమమగు ముక్తిలభించుననియు అందులకు విరుద్ధమగు మఱియొద్దానిచేతను లభింపనేరదనియు దృఢముగ నిశ్చయించిన వేదాంతవాదులు స్వనియమభ్రమలచే తమ సిద్ధాంతమును గ్రంథాదుల ద్వారా యితరులందు వ్యాపింపజేయుచున్నారు.

విజ్ఞానవాదినోబుద్ధ్యా స్ఫురత్స్వభ్రమపూరయా
ముక్తిః శమదమోపేతా నిర్ణీయపరికల్పితా. 28

ముక్తాతునాన్యథా ప్రాప్తిరితిభావితచేతసః
స్వాందృష్టింప్రవివృణ్వంతి స్వైః స్వైరేవనియమభ్రమైః. 29

ఇక విజ్ఞానవాదులు తలయెత్తి భ్రమపూరితమగు స్వబుద్ధిచే, శమదమములచేతనే ముక్తి సిద్ధించుననియు అన్యమగు మఱొద్దానిచేతను సిద్ధింపదనియు నిశ్చయించి స్వనియమభ్రమలచే తమ సిద్ధాంతమును గ్రంథాదుల ద్వారా ప్రకాశింపజేయుచున్నారు.

ఆర్హతాదిభిరన్యైశ్చ స్వయాభిమతయేచ్ఛయా
చిత్రాశ్చిత్రసమాచారైః కల్పితాః శాస్త్రదృష్టయః. 30

ఆర్హతాదులును (జైనులు మున్నగువారు), అన్యమతవాదులును స్వాభిమత మనుసరించి చిత్రవిచిత్రములగు వివసన (దిగంబరత్వము) భిక్షాచర్యాది యాచారములఁగల్పించి శాస్త్రరచన గావించిరి.

నిర్నిమిత్తోత్థసామ్యాంబు బుద్బుదౌఘైరివోత్థితైః
స్వనిశ్చితైరితిప్రౌఢా నానాకారాహిరీతయః. 31

నిమిత్తములేకయే శాంతజలమున బుద్బుదసమూహ ముత్పన్నమగునట్లు, అకారణముననే నుద్భూతమైన స్వస్వనిశ్చయములచే యీ పలువిధశాస్త్రరీతులన్నియు యేర్పడినవి.

సర్వాసామేవచైతాసాం రీతీనామేవమాకరః
మనోనామమహాబాహో మణీనామివసాగరః. 32

మహాబాహుఁడవగు నో రామా! మణులన్నింటికిని సముద్రము నిలయమైనట్లు ఈ వివిధ రీతులన్నింటికిని మనస్సే యునికిపట్టు.

ననింబేక్షూకటుస్వాదూ శీతోష్ణానేందుపావకౌ
యద్యథాపరమాభ్యస్తముపలబ్ధం తథైవతత్. 33

వేప చేదుకాదు, చెఱకు తీపికాదు, అట్లనే చంద్రుడు శీతలమున్ను, అగ్ని ఉష్ణమున్ను కాదు. భోగానుభవ మొనర్పఁజేయు అదృష్టఫలము ననుసరించి చిరకాలమెవ్వఁడేపదార్థము నెట్లభ్యాస మొనర్చునో దాని నాతడట్లేపొందును. ఇక్కారణమున, చంద్ర సూర్యాగ్ని మండలముల వసించుదేవతలకు శీతోష్ణాదులబాధ కలుగకున్నది.

యస్త్వకృత్రిమ ఆనంద స్తదర్థం ప్రయతైర్జనైః
మనస్తన్మయతాంనేయం యేనాసౌసమవాప్యతే. 34



నిరతిశయబ్రహ్మానందము కొఱకు యత్నించు మనుజులు తమ మనస్సును బ్రహ్మమయ మొనర్పవలెను. అపుడే బ్రహ్మప్రాప్తి చేకూరును.

దృశ్యంసంపరిపడింభఃస్వం తుచ్ఛంపరిహరన్మనః
తజ్జాభ్యాంసుఖదుఃఖాభ్యాం నావశ్యంపరికృష్యతే. 35

బాలునివలె పదార్థములందు మిగుల ప్రీతిఁగొనునట్టి వాని మనస్సపుడు తుచ్ఛములగు దృశ్యజనిత సుఖదుఃఖములచే నాకర్షింపబడక యుండును.

అపవిత్రమసద్రూపం మోహనంభయకారణమ్
దృశ్యమాభాసమాభోగి బంధమాభావయానఘ. 36

పాపరహితుఁడవగు నో రామా! అపవిత్రమును, అసద్రూపమును, అజ్ఞానదాయకమును, భయహేతువును, అవిచారముచే విశాలమును, బంధకారకమునునగు యీ దృశ్యమును నీవు భావింపక యుండుము.

మాయైషాసాహ్యావిద్యైషా భావనైషాభయావహా
సంవిదస్తన్మయత్వం యత్తత్కర్మేతి విదుర్బుధాః. 37

చైతన్యము (జ్ఞానము) దృశ్యమయమగుటయే బంధహేతువగు కర్మయని బుద్ధిమంతులు వచింతురు. మఱియు నదియే మాయయు, అవిద్యయు, భయప్రదమగు భావనయు నగును.

దృష్ట్వాదృశ్యైకతానత్వం విద్ధిత్వంమోహనంమనః
ప్రమార్జయైవతన్మిథ్యా మహామలినకర్దమమ్. 38

మనస్సును కేవలము దృశ్యమయముగ నెఱింగి యద్దానినే మోహ (అజ్ఞాన) హేతువుగ నిశ్చయింపుము. మిగుల మలినమును, కర్దమ (పంక) రూపమును మిథ్యయునగు యీ మనంబును నీవు శుద్ధమొనర్పుము.

దృశ్యతన్మయతాహ్యేషా స్వభావస్థానుభూయతే
సంసారమదిరా సేయమవిద్యేత్యుచ్యతేబుధైః. 39

స్వభావముగనే నుదయించుచు, యనుభూతమగుచున్న యీ దృశ్యతన్మయత్వమే సంసారమను మదిర యగును. ఈ దృశ్యరూపత్వమునే పండితు లవిద్యయందురు.

అనయోపహతోలోకః కల్యాణంనాధిగచ్ఛతి
భాస్వరంతాపనాలోకం పటలాన్ధేక్షణోయథా. 40

మేఘపటలముచే గప్పబడిన సూర్యుని మనుజుడు గాంచజాలనట్లు, ఈ దృశ్యముచే హతులగు జీవులున్ను శ్రేయమును ప్రాప్తినొందకున్నారు.

స్వయముత్పద్యతేసాచ సంకల్పాదోవ్యమవృక్షవత్
అసంకల్పనమాత్రేణ భావనాయామహామతే. 41

క్షీణాయాంస్వరసాదేవ విముక్తేనవిలాసినా
అసంసంగః పదార్థేషుసర్వేషుస్థిరతాంగతః. 42

ఈ యవిద్య సంకల్పమాత్రముననే ఆకాశవృక్షమువలె స్వయముగ నుత్పన్నమగుచున్నది. మఱియు మహామతివగు నో రామా ? అసంకల్పనమాత్రముచే భావన నశింప స్వభావముగనే సమాధి దార్ఢ్యముచేతను, శ్రవణ మననరూపమగు తత్వవిచారముచేతను పదార్థము లన్నిటియందును అంస గమము స్థిరమగును.

సత్యదృష్టాప్రపన్నాయామసత్యేక్షయమాగతే
నిర్వికల్పచిదచ్ఛాత్మా సఆత్మాసమవాప్యతే. 43

సత్యదృష్టి చేకూరి, అసత్యదృష్టి నశించిన మీఁదట, నిర్వికల్పమును స్వచ్ఛస్వభావయుక్తమును, పరమార్థమును, సత్యస్వరూపమును నగు ఆత్మ సంప్రాప్తించును.

నసత్తాయస్యనాసత్తా నసుఖం నాపిదుఃఖితా
కేవలం కేవలీభావో యస్యాస్తరుపలభ్యతే. 44

అట్టి పరమాత్మయందు వ్యక్తత్వముగాని, అవ్యక్తముగాని విషయజనిత సుఖదుఃఖములు గాని లేవు. కేవలము శుద్ధస్వభావ (కేవలీభావ) రూపమై స్వహృదయముననే అయ్యది జీవునిచే పొందబడుచున్నది (స్వానుభవైక వేద్యమైనది).

అభవ్యయాభావనయా నచిత్తేంద్రియదృష్టిభిః
ఆత్మనోఽనన్యభూతాభిరపి యఃపరివర్జితః. 45
వాసనాభిరనన్తాభిర్వ్యోమేవ ఘనరాజిభిః
సందిగ్ధాయాంయథారజ్జ్వాం సర్పత్వంతథైవహి. 46
చిదాకాశాత్మనా బన్ధస్త్వబద్ధేనైవకల్పితః
కల్పితంకల్పితంవస్తు ప్రతికల్పనయాన్యథా. 47

అనర్థమునకు హేతుభూతమగు దేహేంద్రియాదులందలి యహంభావనచే నా యాత్మ పొందబడదు. దేహేంద్రియాదులతోటి ఆత్మయొక్క అభేధాధ్యాసములేనివాడును, ఆకాశమునందలి మేఘసమూహమువలె అనంతములగు వాసనలెవ్వియు లేనివాడును నగు పుణ్యచరితునకు మాత్రమే ఆయాత్మ ప్రాప్తించును. రజ్జువునందు సందేహ ముదయించుటచే సర్పము భాసించునట్లు కల్పితవస్తువు నన్యవిధముగ కల్పనజేయుచు బంధరహితమగు చిదాకాశము స్వాత్మయందే బంధమును కల్పించుకొనెను.

తదేవాన్యత్వమాదత్తే ఖమహోరాత్రయోరివ

దినమందును రాత్రియందును ఆకాశము వేఱువేఱు రూపముల ధరించునట్లా యాత్మయున్ను భిన్నభిన్నరూపముల ధరించుచున్నది.

యదతుచ్ఛమనాయాస మనుపాధి గతభ్రమమ్. 48
తత్తత్కల్పనయాతీతం తత్సుఖాయైవకల్పతే

నూాత్నరమైనదియు, స్వభావసిద్ధమును, ఉపాధిరహితమును, భ్రమవర్జితమును, ఆయా కల్పనల కతీతమును నగు ఆత్మ కేవలము సుఖముకొఱకే యగుచున్నది.



శూన్యపవకుసూలేతు సింహోఽస్తీతిభయంయథా. 49
శూన్యపవశరీరేఽస్తర్బద్ధోఽస్మీతిభయంతథా

శూన్యమగు అన్నకోటరమున సింహమునుగూర్చిన భయముత్పన్నమగునట్లు శూన్యమగు యీ దేహమునను 'నేను బద్ధుఁడ'నను భయము గలుగుచున్నది.

శూన్యపవకుసూలేతు ప్రేక్ష్యసింహోనలభ్యతే. 50
తథాసంసారబన్ధార్థః ప్రేక్షితోఽసౌనలభ్యతే

మరల సరిగ జూచుటచే నా శూన్యకోటరమున సింహము లభింపనట్లు, ఆత్మను బాగుగ గాంచ [illegible] నిక సంసారబంధమున్ను తొలఁగుచున్నది.

ఇదంజగదయంచాహమితి సంభ్రాన్తముత్థితమ్. 51
బాలానాంమధ్యమేకాలే ఛాయావైతాలికీయథా

వృక్షమూలాది స్థానములందలి దట్టమైన ఛాయయందు బాలురకు బేతాళునిగూర్చిన భ్రమ కలుగునట్లు జగద్దేహాదుల సంభ్రమమున్ను జీవులకు కలుగుచున్నది.

కల్పనావశతో జన్తోర్భావాభావశుభాశుభాః 52
క్షణాదసత్తామాయాంతి సత్తామపిపునఃక్షణాత్

కల్పనావశముచేతనే జీవునకు విభవ దారిద్ర్యములున్ను, తదనురూపములగు శుభాశుభములున్ను క్షణములో ప్రాప్తించుచున్నవి. మరల క్షణములో లయించుచున్నవి.

మాతైవగృహిణీభావ గృహీతాకంఠలమ్బినీ. 53
కరోతిగృహిణీకార్యం సురతానందదాసతీ
కాంతైవమాతృభావేన గృహీతాకంఠలమ్బినీ. 54
నూనంవిస్మారయత్యేవ మన్మథంమాతృభావనాత్
భావానుసారిఫలదం పదార్థౌఘమవేక్ష్యచ. 55
నజ్ఞేనేహపదార్థేషు రూపమేకముదీర్యతే

ఆలింగనమొనర్చుకొనిన జననియు పత్నీభావముచే రత్యానంద మొనగూర్చునదై పత్నీరూపమగుచున్నది. అట్లనే యాలింగనమొనర్చుకొనిన పత్నియు మాతృభావముచే కామవికారమును విస్మరింప జేయుచున్నది. కావున భావానుసారమే పదార్థములు ఫలమును గల్గజేయునని నిశ్చయించి జ్ఞానులు పదార్థముల నేకరూపములుఁగ వచింపకుందురు. (వారివారి దృష్టిననుసరించి భిన్నభిన్నములుగ గోచరించును గాన).

దృఢభావనయాచేతో యద్యథాభావయత్యలమ్. 56
తత్తత్ఫలంతదాకారం తావత్కాలంప్రపశ్యతి

దృఢభావనచే చిత్తమెంతకాల మెవ్విధమున దేనిని భావించునో, అంతకాల మద్దాని ఫలమును, యాకృతిని గాంచుచునే యుండును.

నతదస్తి నయత్సత్యం నతదస్తి నయన్మృషా.
యద్యథాయేననిర్ణీతం తత్తథా తేనలక్ష్యతే

కాన ప్రపంచమున సత్యముకానిదియు, మిథ్యకానిదియు నగు వస్తువే లేదు. ఎవఁడేప్ర
రము నిశ్చయించునో, వానిచే నాప్రకారమే జగత్తునందలి పదార్థము లనుభూతములగును.

భావితాకాశమాతఙ్గం వ్యోమహస్తితయామనః.
వ్యోమకాననమాతఙ్గీం వ్యోమస్థామనుధావతి

ఎవని మనంబాకసమను గజభావమున కల్పనయొనర్చునో, అతడు కామాతురుఁడై ఆ
వనచారిణియగు సంకల్పముచే కల్పితమగు స్త్రీగజము వెంట పరుగిడును.

తస్మాత్సంకల్పమేవత్వం సర్వభావమయాత్మకమ్.
త్యజరామసుషుప్తస్థః స్వాత్మనైవభవాత్మనః

కాన నో రామా! సంకల్పమందు పదార్థములన్నింటిని నీవు సుషుప్తియందున్న వాని
త్యజించివైచి నీయొక్క పారమార్థిక అద్వైతానందరూపమువ స్థితి గల్గియుండుము.

మణిర్హి ప్రతిబింబానాం ప్రతిషేధక్రియాంప్రతి.
నశక్తోజడభావేన నతురామభవాదృశః 6

ఇచ్ఛారహితుడవైనను మణియందువలె నీయందపుడు ప్రతిబింబము ప్రవేశించినను హా
మేమియును లేదు. ఏలయన జడరూపమగుటచే ప్రతిబింబముల నిషేధించుటయందామణి చైత
రూపుడవగునీవలె సమర్థముగాదు.

యదాత్మనిజగద్రామ తవేహ ప్రతిబింబతి 6
తదవస్త్వితి నిర్ణీయ మా తేనాగచ్ఛరంజనమ్
తదేవసత్యమితి వాప్యభిన్నంపరమాత్మనః. 6
మత్వాన్తస్త్వనునాద్యంతం భావయాత్మానమాత్మనా
చేతసిప్రతిబింబంతి యేభావా స్తవరాఘవ
రంజయన్త్వన్యసక్తత్వాన్నా తేత్వాంస్ఫటికంయథా 6

ఓ రామా! నీయం దేజగత్తు ప్రతిబింబితమగునో అయ్యది మిథ్యయని నిశ్చయించి
యద్దానిరూపమును బొందకుము. లేక పరమాత్మకంటె యభిన్నముగాన నదియు పరమార్థరూ
మగు బ్రహ్మమేయని అంతఃకరణమున దృఢముగ నిర్ణయించి అనాదియు అనంతమునగు ఆత్మ
స్వరూపము నాత్మచేతనే నిశ్చయించుకొనుము. మఱియు నీ చిత్తమందు ప్రతిబింబించు అన్య జగ
త్పదార్థములు (దేహాత్మదృష్టిగల ప్రాపంచికజీవులు) నిన్ను రాగయుక్త మొనర్పకుండుగాక!

స్ఫటికమమననం యథాఖిశన్తి
ప్రకటతయా నచరంజనావిచిత్రా
ఇహహివిభునసంతథావిశన్తు
ప్రకటతయా భువనైషణాభవన్తమ్. 64



ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
విజ్ఞానవాదోనామైకవింశః
సర్గః ॥ 21 ॥

ఓ రామా! ప్రతిబింబిత పదార్థములయొక్క విచిత్రవర్ణములు శుద్ధస్ఫటికయందు ప్రవేశించి
..., యథార్థముగ నద్దానియందు వర్ణవైచిత్ర్యమేమియు లేనిచందమున ద్వైతపదార్థములయొక్క
..రాగాదివాసనలేవియులేని నీయొక్క శుద్ధస్వరూపమందును ప్రారబ్ధకర్మ భోగోచితమగు జగద్వ్య
...రేచ్ఛ ప్రవేశించినను దానిచే నీయందు విశేషమేమియును లేదు.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు స్థితిప్రకరణమున
విజ్ఞానవాదనమను ఏకవింశ
సర్గము ॥ 21 ॥

---

## ద్వావింశః సర్గః.

---

శ్రీవసిష్ఠ ఉవాచః—

జన్తోఃకృతవిచారస్య విగలద్వృత్తిచేతసః
మననం త్యజతోజ్ఞాత్వా కించిత్పరిణతాత్మనః. 1

శ్రీవసిష్ఠుడు:—ఓ రామా! సమాధి నభ్యసించుటవలన బాహ్యాభ్యంతర జగత్తులగూర్చిన
మననము మిథ్యయని యెఱింగి దానిని త్యజించుటచే విశుద్ధరూపముగ పరిణమించినదై, వృత్తిశూన్య
మై విచారవంతుడగు జీవుని యాత్మస్వభావము వినిర్మలమగును.

దృశ్యంసంత్యజతో హేయ ముపాదేయముపేయుషః
ద్రష్టారంపశ్యతోదృశ్య మద్రష్టారమపశ్యతః. 2

మఱియు అజ్ఞానభూమికాభేదరూపమగు దృశ్యమును త్యజించి జ్ఞానభూమికయందు
ప్రవేశించి సాక్షి చైతన్యదృష్టినుండి ద్రష్ట (ప్రమాత) నుగూడ దృశ్యముగ నెఱుంగుచు, చైతన్యము
కంటె భిన్నమగు నేవస్తువును జూడకయుండుటచే జీవుని స్వభావము నిర్మలమగును,

జాగర్తవ్యేపరేతత్త్వే జాగరూకస్యజీవతః
సుప్తస్యఘనసంమోహామయే సంసారవర్త్మని, 3

జాగృతుడైయుండదగిన ఆత్మతత్త్వవిషయమందు జాగరూకుడై యుండుటచేతను, మహా
మోహమయమగు సంసారమార్గమున నిదురించుటచేతను జీవునియాత్మ నిర్మలమగును.

పర్యన్తాత్యన్తవైరాగ్యా త్సరసేష్వరసేష్వపి
భోగేష్వాభోగరమ్యేషు విరక్తస్తనిరాశిషః. 4

బ్రహ్మదేవుని సుఖపర్యంతమునుగూడ విరక్తిగలిగి క్రమముక్తియను రసవంత పదార్థము నందును, భోగకాలమందు రమణీయములుగ దోచు రసహీనమగు భోగములందును యిచ్ఛ లేకయుండు వాని యాత్మ వినిర్మలమగును.

వ్రజత్యాత్మాంభ సైకత్వం జీర్ణజాడ్యేనభస్యలమ్
గలత్యపగతాసంగే హిమాపూరఇవాతపే. 5

ఆత్మయను జలముతో నేకత్వమునుపొంద, అనాదియగు అజ్ఞానాకాశము విగళితమగు, సూర్యరశ్మియందలి హిమసమూహమువలె విషయాసంగమంతయు నిర్మూలమగుకాగా, జీవునియాత్మ నిర్మలమగును.

తరంగితాసు కల్లోలజలలోలాన్తరాసుచ
శామ్యన్తీష్వథతృష్ణాసు నదీష్వివఘనాత్యయే. 6

మనోరథంబులను తరంగములచే వృద్ధిఁజెందినదియు, గజకల్లోలములవలె చంచలము నగు అభ్యంతరీయ తృష్ణాసమూహమంతయు వర్షాకాలాంతమందలి నదులవలె శాంతింప, ఆత్మ నిర్మల మగును.

సంసారవాసనాజాలే ఖగజాలఇవాఖునా
త్రోటితేహృదయగ్రన్థౌ శ్లథే వైరాగ్యరంహసా. 7

మూషకదంతములచే పక్షిజాలమువలె సాంసారికవాసనాజాలము త్రెంపబడి, వైరాగ్య వేగమున హృదయగంధి విచ్ఛిన్న మొనర్పబడగా, అపుడాత్మ నిర్మలమగును.

కాతకంఫలమాసాద్య యథావారిప్రసీదతి
తథావిజ్ఞానవశతః స్వభావఃసంప్రసీదతి. 8

కతకరేణువు (చిల్లగింజ) చే జలము నిర్మలమగునట్లు జ్ఞానముచేత మనస్సున్ను నిర్మల మగును.

నీరాగంనిరుపాసంగం నిర్ద్వంద్వం నిరుపాశ్రయమ్
వినిర్యాతిమనోమోహాద్విహగః పంజరాదివ. 9

కామవర్జితమును, విషయగుణాను సంధానరహితమును, పత్న్యాది జనసమూహవర్జితమును, భోగలాభవివర్జితమును నగు మనస్సు, పంజరమునుండి పక్షివలె అజ్ఞానమునుండి పారిపోవుచున్నది.

శాన్తేసందేహదౌరాత్మ్యే గతకౌతుకవిభ్రమమ్
పరిపూర్ణాన్తరంచేతః పూర్ణేందురివరాజతే. 10

సందేహమను దుష్టాత్మ శమింప భ్రమకౌతుకరహితంబును, అంతరమున పరిపూర్ణమును నగు చిత్తము పూర్ణచంద్రునివలె శోభించును.

జనితోత్తమసౌందర్యా దూరాదస్తమయోన్నతా
సమతోదేతిసర్వత్ర శాన్తే వాతఇవార్ణవే. 11

వాయువు శమింప సముద్రము ప్రశాంతమగునట్లు, బ్రహవేత్తకు ఉత్తమసౌందర్యము గలుగ జేయునదియు, అల్పముగానిదియు, యున్నతిరూపమును నగు సమదృష్టి యుదయించును.



అంధకారమయీమూకా జాడ్యజర్జరితాన్తరా
తనుత్వమేతి సంసారవాసనేవోదయే క్షపా. 12

మఱియు, అజ్ఞానాంధకారమయమగు జడత్వముచే నంతఃకరణమును జర్జరిత మొనర్పు నాగున సూర్యోదయముచే రాత్రివలె వానికి (ఆత్మజ్ఞునకు) నశించును.

స్పష్టచిద్భాస్కరాప్రజ్ఞా పద్మినీపుణ్యపల్లవా
వికసత్యమలోద్యోతా ప్రాతర్ద్యౌరివరూపిణీ. 13

ప్రాతఃకాలమున సూర్యప్రకాశముచే నిర్మలాకాశము వికాసమునొందునట్లు చైతన్య భాస్కరుని నవలోకించునదియు, గురుసేవ, శ్రవణ మనన నిధిధ్యాసన సమాధుల యభ్యాస రూపమను పుణ్యముగల వివేకమను కమలము హృదయసరోవరమున వికసించును.

ప్రజ్ఞాహృదయహారిణ్యో భువనాహ్లాదనక్షమాః
సత్వలబ్ధాఃప్రవర్ధన్తే సకలేందోరివాంశవః. 14

మఱియు నట్టిజ్ఞానికి మనోహరమును, సర్వుల ప్రసన్నులఁజేయునదియు నగు సత్వగుణ మభివృద్ధినొందుటచే చంద్రకిరణములమాడ్కి బుద్ధియు విశాలమగును.

బహునాత్రకిముక్తేన జ్ఞాతజ్ఞేయోమహామతిః
నోదేతినైవయాత్యస్త మభూతాకాశకోశవత్. 15

ఇఁకనధికముగ జెప్పనేల; వాయ్వాది భూతచతుష్టయరహితమగు ఆకాశకోశమువలె, జ్ఞాత జ్ఞేయుఁడ (బ్రహ్మవేత్త) గు ఉత్తమధీమంతు డుదయాస్తమయములఁ బొందకుండును. (అనగా నపరిచ్ఛిన్నుడని భావము.)

విచారణా పరిజ్ఞాతస్వభావస్యోదితాత్మనః
అనుకంప్యాభవన్తీహ బ్రహ్మవిష్ణ్వింద్రశంకరాః. 16

తత్వవిచారముచే ఆత్మస్వరూపసాక్షాత్కారమొందినవాని దృష్టియందు బ్రహ్మవిష్ణు రుద్రాదులున్ను దీనులేయగుదురు. ఏలయన సృష్టి, అధికారాదులందు క్లేశమేగలదు.

ప్రకటాకారమప్యన్తర్నిరహంకారచేతసమ్
నాప్నువంతివికల్పాస్తం మృగతృష్ణామివైణకాః. 17

ఆకారముతో గూడినట్లగపడినను, యెవనిచిత్త మహంకారహితమైనదో, అట్టివానికి మృగతృష్ణాజలము మృగమునకు ప్రాప్తింపని విధమున, సాంసారిక వికల్పములెవ్వియు ప్రాప్తింప కుండును.

తరంగవదిమేలోకాః ప్రయాన్త్యాయాన్తిచేతసః
క్రోడీకుర్వన్తిచాజ్ఞంతే నజ్ఞంమరణజన్మనీ. 18

వాసనావశమునసే యీ జీవులందరును తరంగములవలె ఉత్పన్నమగుచు నశించుచు నున్నారు. జనన మరణము లజ్ఞానినే వశమొనర్చుకొనును గాని జ్ఞానిని గాదు.

ఆవిర్భావతిరోభావా సంసారో నేతరక్రమః
ఇతితాభ్యాంసమాలోక్యో రమతేసనిబధ్యతే. 19

ఆవిర్భావ తిరోభావములతో కూడిన యీ ప్రపంచము అజ్ఞానికే యుదయించుచున్నది గాని జ్ఞానికికాదు. కాన, తత్వజ్ఞాని, కల్పితమగు వ్యాఘ్రాదికౌతుకమును వీక్షించునట్లే లీలారూపమున యద్దానియందు రమించునుగాని అజ్ఞాని యందు బంధింపబడును.

నజాయతేనమ్రియతే కుమ్భేకుమ్భనభో యథా
భూషితేదూషితేవాపి దేహేతద్వదిహాత్మవాన్. 20

ఘటముత్పన్నమైనను నశించినను ఘటాకాశ ముత్పన్నముగాక నశింపకయుండునట్లు శరీరము భూషింపబడినను దూషింపబడినను ఆత్మ ఉత్పన్నమవకయు నశింపకయు యే వికారములు లేకయు నుండును.

వివేకఉదితేఽశీతే మిథ్యాభ్రమమయూదితా
క్షీయతేవాసనాసాగ్రే మృగతృష్ణామరావివ. 21

ఓ రామా ! సమ్ముఖమున నుదయించిన చంద్రుడుగల సాయంకాలమందు మరుభూమి యందలి మృగతృష్ణ నశించునట్లు, ఉత్తమ వివేక ముదయించుటచే మిథ్యాభ్రమరూపమగు మరుస్థలమం దుదయించు వాసనయు క్షయించును.

కోఽహంకథమిదంచేతి యావన్నప్రవిచారితమ్
సంసారాడమ్బరం తావదన్ధకారోపమంస్థితమ్ 22

'నేనెవరను, ఈప్రపంచ మెట్లుత్పన్నమైనద'ను విచారము చేయనంతవఱకు అంధకారము వంటి యీ మిథ్యారూపమైన జగదాడంబరమంతయు ప్రాప్తించుచునే యుండును.

మిథ్యాభ్రమభరోద్భూతం శరీరంపదమాపదామ్
ఆత్మభావనయానేదం యఃపశ్యతిసపశ్యతి. 23

మిథ్యా భ్రమసమూహముచే నావిర్భవించినదియు, ఆపదలన్నింటికిని స్థానభూతమును నగు యీ దృశ్యప్రపంచమును ఆత్మభావముచే యెవఁడు నిస్సారముగజూచునో అనగా బాధితమైనట్లు గాంచునో, ఆతడే నిజముగ జూచువాడగును.

దేశకాలవశోత్థాని సమమేతిగతభ్రమమ్
శరీరేసుఖదుఃఖాని యఃపశ్యతిసపశ్యతి. 24

దేశకాలాదులవశమున నుత్పన్నమయిన ఆధ్యాత్మికాది తాపత్రయమును, సమస్త దుఃఖములును శరీరమునకేగాని పూర్ణానందరూపమైన ఆత్మస్వరూపుడనగు నాకుగాదని నిశ్చయించుచు, యివ్విధమున భ్రమరహితుడైయుండువాడే సత్యము నరసినవాడగును.

అపారపర్యన్తనభో దిక్కాలాదిక్రియాన్వితమ్
అహమేవేతి సర్వత్ర యఃపశ్యతి సపశ్యతి. 25

అనంతములగు దిక్కాలాదులతో కూడినదియు, పరిచ్ఛిన్నమును, ఉత్పత్తిచలనాది క్రియా



సహితమును నగు యీ ప్రపంచమందంతటను నేనే వ్యాపించి యున్నానను యనుభవముగలవాడే నిజమగు జ్ఞాని.

వాలాగ్రలక్షభాగాత్తుకోటిశః పరికల్పితాత్
అహంసూక్ష్మఇతివ్యాపీ యఃపశ్యతిసపశ్యతి. 26

సర్వవ్యాపకుఁడైనను తాను రోమాగ్రభాగమందలి కోటియవ భాగముయొక్క లక్షవ భాగముకంటెను యింకను సూక్ష్మమైనవాడనని యెఱుంగువాడే సత్యమును జూచువాడగును.

ఆత్మానమితరచ్చైవ దృష్ట్యా నిత్యావిభిన్నయా
సర్వంచిజ్జ్యోతిరేవేతి యఃపశ్యతిసపశ్యతి. 27

జీవాత్మయు, తద్భిన్నమగు యీ జగత్తంతయును చైతన్య జ్యోతిమాత్రయే యని యెఱింగి, యివ్విధమున జగత్తును పరమాత్మ కభిన్నముగ గాంచువాడే ఆత్మజ్ఞుడగును.

సర్వశక్తిరనన్తాత్మా సర్వభావాన్తరస్థితః
అద్వితీయశ్చిదిత్యన్త ర్యఃపశ్యతిసపశ్యతి. 28

సర్వశక్తిమంతుడును, అనంతుడును, అద్వితీయుడును నగు చిదాత్మయే సమస్తపదార్థములందును యున్నట్లు జూచువాడే నిజముగ జూచువాడగును.

ఆధివ్యాధిభయోద్విగ్నో జరామరణజన్మవాన్
దేహోఽహమితియః ప్రాజ్ఞోనపశ్యతి సపశ్యతి. 29

ఆధి (మానసికవ్యాధి) వ్యాధి భయాదులచే నుద్విగ్నమును, జననమరణ యుక్తమునునగు యీ దేహము నేనుకానని యే బుద్ధిమంతుడెఱుంగునో, ఆతడే యథార్థజ్ఞానము కలవాడు.

తిర్యగూర్ధ్వమధస్తాచ్చ వ్యాపకోమహిమామమ
ద్వితీయోనమమాస్తీతి యఃపశ్యతిసపశ్యతి. 30

తిర్యగూర్ధ్వాధోభాగములందంతటను నామహిమ వ్యాపించియున్నది. నాకు రెండవవాడే లేడని యెఱుంగువాడే సమ్యగ్జ్ఞాని.

మయిసర్వమిదంప్రోతం సూత్రేమణిగణాఇవ
చిత్తంతునాహమేవేతి యఃపశ్యతిసపశ్యతి. 31

సూత్రమందు మణులవలె నాయందీ ప్రపంచమంతయు గ్రుచ్చబడినది. మఱియు 'నేనంతఃకరణమును గాన'ను యనుభవముగలవాడే పరమార్థ మెఱింగనవాడగును.

నాహంనచాన్యదస్తీతి బ్రహ్మైవాస్తినిరామయమ్
ఇత్థంసదసతోర్మధ్యే యఃపశ్యతిసపశ్యతి. 32

అహంకారముగాని యీ దృశ్యముగాని యొకింతయును లేదు. అంతయు నిరామయమగు బ్రహ్మము మాత్రమేయని నిశ్చయించుచు, భూత భవిష్యద్వర్తమానములందును, వ్యక్తావ్యక్తముల మధ్యను స్థితిగల్గియున్న తన రూపమునెవడు గాంచునో ఆతడే సమ్యగ్దర్శి.

యన్నామకించిత్త్రైలోక్యం సవవావయవోమమ
తరంగోఽబ్ధావివేత్యన్త ర్యఃపశ్యతిసపశ్యతి.  33

'సముద్రమందు తరంగమువలె, యీ ప్రసిద్ధమగు త్రిలోకము నా అవయవమైయున్న'దని నిజాంతఃకరణమున యనుభూత మొనర్చుకొనువాడే పూర్ణజ్ఞాని.

శోచ్యాపాల్యామయైవేయం స్వసేయంమేకనీయసీ
త్రిలోకీవేలవేత్యుచ్చై ర్యఃపశ్యతిసపశ్యతి.  34

చైతన్యముయొక్క సంబంధము లేనిచో స్వసత్తచే మృతప్రాయమై యుండునదగుటచే శోచనీయమును, చైతన్యసత్తా స్ఫూర్తిచే పాలితమును, (ఆత్మ) దృష్టిమాత్రమున భాధితమగుటచే నతి కోమలమునునై యీ త్రిలోకము నాకు కనిష్ఠసోదరివలె నున్నదని యుత్తమవిచారణచే నెఱుంగువాడే సత్యము నెఱింగనవాడగును.

ఆత్మతాపరతే త్వత్తా మత్తేయస్యమహాత్మనః
భవాదుపరతేనూనం సపశ్యతి సులోచనః.  35

ఏ మహాత్ముని దృష్టియందు సాంసారిక దేహాదులనుండి మరల్పబడిన 'నీది, నాది' యను భావము కేవలమాత్మ పరమై చెన్నొందుచుండునో అట్టి యుత్తమనేత్రములు గలవాడే సత్యమును జూచువాడగును.

చేత్యానుపాతరహితం చిద్భైరవమయంవపుః
ఆపూరితజగజ్జాలం యఃపశ్యతిసపశ్యతి.  36

విషయ సంబంధరహితమును, స్వసత్తాప్రకాశముచే జగత్సమూహమంతటను వ్యాపించునదియు, భైరవమయ శరీరయుక్తమును నగు చైతన్యము (ఆత్మ) ను గాంచువాడే యథార్థమగు సతత్త్వవేత్తయగును.

సుఖందుఃఖంభవోభావో వివేకకలనాశ్రయాః
అహమేవేతివానూనం పశ్యన్నపినహీయతే.  37

సుఖదుఃఖములు, శాస్త్రగురుదేవతాదులందలి శ్రద్ధ, ఆత్మ పరిచయహేతువులగు నిత్యానిత్యవివేక శ్రవణమననాది క్రమములును—'యివన్నియు నేనే' యను అనుభవముగలవాడే యథార్థతత్త్వదర్శియగును.

స్వాత్మసత్తాపరాపూర్ణే జగత్యంశేనవర్తినా
కింమేహేయంకిమాదేయ మితి పశ్యన్నుదృజ్నరః.  38

నిరతిశయానందముచే పరిపూర్ణమును బ్రహ్మానందలేశముచే సంతర్పితమును నగు యీ జగత్తునందు యేకదేశమున వర్తించు ఐహిక పారలౌకిక భోగ్యవస్తుసముదాయమందు దుఃఖభూయిష్టమై త్యజింపదగినదేది? సుఖవంతమై గ్రహింపదగినదేది? ఇట్లు చింతించువాడే భ్రాంతిరహితమగు యుత్తమ దృష్టిగలవాడగును.

అప్రతర్క్యమనాభాసం సన్మాత్రమిదమిత్యలమ్
హేయోపాదేయకలనా యస్యక్షీణాసవై పుమాన్.  39



ఓ రామా! తర్కముచే నగమ్యమును, విక్షేపరహితమును నగు సన్మాత్రస్వరూపమే యీ జగత్తను సమ్యగ్జ్ఞానము గలిగియుండుటచే యెవనికి త్యాజ్యగ్రాహ్యముల కల్పన నశించినదో యాతడే పురుషుడనఁదగును.

యఆకాశవదేకాత్మా సర్వభాగవతోఽపిసన్
నభావరఞ్జనామేతి సమహాత్మామహేశ్వరః.  40

అకాశమువలె ఏకాత్మస్వరూపుడై, పదార్థములందు పూర్ణభావమున వ్యాపించియున్నను, ఆయా పదార్థరూపములఁబొందక వాటియందనుక్తుడుగాక యుండు మహాత్ముడే నిరతి యానంద మనుభవింప సమర్థ (మహేశ్వరు) డగును.

తమఃప్రకాశకలనాముక్తః కాలాత్మతాంగతః
యఃసౌమ్యఃసుసమః స్వస్థ స్తంనౌమింపదమాగతమ్.  41

జాగ్రత్స్వప్నసుషుప్తులనుండి వినిర్ముక్తుడును, మృత్యువునకును ప్రేమాస్పదుఁడును, సౌమ్యుడును, సర్వత్ర సమబుద్ధి గలవాడును, తురీయావస్థయను యుత్తమపదమున సుప్రతిష్ఠితుడును నగు మహాత్మునకు నేను నమస్కరించుచున్నాను.

యస్యోదయాస్తమయ సంకలనాకలాసు
చిత్రాసు చారువిభవాసు జగద్గతాసు
వృత్తిఃసదైవ సకలైకమతేరనన్తా
తస్మైనమః పరమబోధవతేశివాయ.  42

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
అనుత్తమపదవిశ్రాన్తివర్ణనంనామద్వావింశః
సర్గః ॥ 22 ॥

బ్రహ్మాండములందంతటను యొకే బ్రహ్మము వ్యాప్తమైయున్నదను నిశ్చయముగలవాడును, విచిత్రమును రమణీయమునునగు విభవముతో కూడిన యీ జగత్తుయొక్క సృష్టిస్థితిలయకల్పనయందెవనికి అపరిచ్ఛిన్నమగు బ్రహ్మవృత్తియే గలదో సాక్షాత్ శివస్వరూపుడైన అట్టి యుత్తమ జ్ఞానవంతుడగు జీవన్ముక్తునకు నేను నమస్కరించుచున్నాను.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు స్థితిప్రకరణమున
అనుత్తమపదవిశ్రాంతివర్ణనమను ద్వావింశ
సర్గము ॥ 22 ॥

---

## త్రయోవింశః సర్గః.

---

శ్రీవసిష్ఠ ఉవాచ :—

యఉత్తమపదాలమ్బీ చక్రభ్రమవదాస్థితః
శరీరనగరీరాజ్యం కుర్వన్నపినలిప్యతే.

శ్రీ వసిష్ఠుడు:— ఓ రామా! బ్రహ్మపదము నాశ్రయించి, ఘటోత్పత్త్యనంతరమును పరిభ్రమించు కులాలుని (కుమ్మరివాని) చక్రమువలె ప్రారబ్ధక్షయ పర్యంతమును వ్యవహరించు జీవన్ముక్తుడు శరీరమను నగరమును పాలించుచున్నను పాపముచే నంటక యుండును.

తస్యేయంభోగమోక్షార్థం తజ్జ్ఞస్యోపవనోపమా
సుఖాయైవనదుఃఖాయ స్వశరీరమహాపురీ. 2

వనవాటిక వంటి శరీరమను మహాపురము తత్త్వజ్ఞునకు భోగమోక్షముల రెంటిని కలుగజేయుచున్నది. మఱియు వానికది కేవలము సుఖము కొఱకేయగునుగాని దుఃఖముకొఱకు గాదు.

శ్రీరామ ఉవాచః—

నగరీత్వం శరీరస్య కథం నామమహామునే
ఏతాంచాధివసన్యోగీ కథంరాజసుఖైకభాక్. 3

శ్రీ రాముడు:— ఓ మునీంద్రా! శరీరమునకు నగరమను పేరు యెటుల కలిగినది. ఆ శరీర రాజ్యమందు వసించు యోగి సుఖభాజుఁడు మాత్రమే యేలయగును?

శ్రీవసిష్ఠ ఉవాచ :—

రమ్యేయం దేహనగరీ రామసర్వగుణాన్వితా
జ్ఞస్యానన్తవిలాసాఢ్యా స్వాలోకార్కప్రకాశితా. 4

శ్రీ వసిష్ఠుడు:— ఓరామా! ఈ దేహమను నగరము మిగుల రమణీయమై సమస్తగుణములచే నలరారుచు, జ్ఞానికి అనంతవిలాసపూర్ణమును, ఆత్మదర్శనమను సూర్యప్రకాశముచే ప్రకాశితమును నగుచున్నది.

నేత్రవాతాయనోద్యోత ప్రకాశభువనాన్తరా
కరప్రతోలీవిస్తార ప్రాప్తపాదోపజాంగలా. 5

నేత్రము లను వాతాయనములు గల్గి యింద్రియము లను దీపములచే ప్రకాశయుక్తమై యున్న భువనాంతరాళములతో నొప్పుచు, హస్తమను విస్తృతమార్గము ద్వారా యరణ్యమందలి పదార్థముల ప్రాప్తినొందుచు శరీరమను నగరము శోభించుచున్నది.

రోమరాజీలతాగుల్మా త్వచాజాలకమాలితా
గుల్ఫాంగుల్యాం ప్రవిశ్రాంత జంఘోరు స్తంభమండలా. 6

మఱియు నియ్యది రోమములను లతలుగల్గియు చర్మమందలి నాడీసమూహముచే శోభితమయ్యు, పాదాంగుళియందు విశ్రమించిన జంఘయూరువు (తొడ) లను స్తంభములతో నొప్పుచున్నది.

రేఖావిభక్తపాదాగ్ర శిలాప్రథమనిర్మితా
చర్మమర్మశిరాసార సంధిసీమామనోరమా. 7

ఈ నగరమున రేఖలచే విభక్తమైన పాదతలమందలి కఠినచర్మముచే స్తంభమునకు మూలాధారమగు శిల నిర్మితమైనది. బాహ్యాచర్మాంతర్గమగు మర్మమును, నాడీ శాఖాప్రరోహమును,



యెముకల సంధులును హద్దులుగాగల్గి శరీరనగరము మిగుల మనోరమమై యున్నది.

ఊరూరుతనుభాగాగ్ర నిర్మితోపస్థనిమ్నగా
కచత్కేశావలీ కాచదలప్రస్థవనావృతా. 8

ఇందు జంఘద్వయ, దేహమధ్యముల సంధిభాగముయొక్క చివఱను నిర్మితమైన యుపస్థేంద్రియము నదియై యున్నది. మఱియు నీ శరీరనగరము మిగుల శోభాయమానముగనున్న కేశపంక్తియను నీలదళ శిలలచేతను, శ్మశ్రు రోమ సమూహము లను వనములచేతను ఆవరింపబడి యున్నది.

భ్రూలలాటోష్ఠసచ్ఛాయ వదనోద్యానశోభితా
దృష్టిపాతోత్పలాకీర్ణ కపోలవిపులస్థలీ. 9

నీలపత్రములవంటి రెండు కనుబొమ్మలును, ధవళవర్ణముగల నూతనకమలమువంటి లలాటమును, పుష్పసదృశమగు పెదవులును, లావణ్యమైన ముఖమను కదళీవనమును గల్గి దృష్టియను కమలములచే వ్యాప్తమై, కపోలమను విశాలస్థలముతోకూడి ఈ శరీరనగర మతి రమణీయముగా నున్నది.

వక్షఃస్థలసరఃస్ఫ్యాత కుచపంకజకోరకా
ఘనరోమావళీచ్ఛన్న స్కన్ధక్రీడాశిలోచ్చయా. 10

మఱియు నిది వక్షస్థలమను తటాకమందు కుచములను లేకమలములుగల్గి, రోమములచే దట్టముగ నావరింపబడిన భుజము లను క్రీడాపర్వతములచే శోభించుచున్నది.

ఉదరశ్వభ్రనిక్షిప్త స్వాన్నేష్టాభక్ష్యతత్పరా
దీర్ఘకంఠబిలోద్గీర్ణ వాతసంరంభశాబ్దితా. 11

ఉదరమను గర్తమందు త్రోయబడిన స్వప్రార్థానుసారము లభించిన అన్నముగలదియు, అనిషిద్ధ విషయభోగముల విస్తరించు కర్ణ జిహ్వాది యుత్తమద్వారములద్వారా విషయములను నగరనివాసులీ దేహనగరమున ప్రవేశించుచున్నారు. దీర్ఘకంఠమను బిలముగుండా వినిర్గతమై వెడలు ప్రాణవాయువుచే కంఠద్వార కవాటము తెఱవబడ యీ నగరము శబ్దాయమానంబగుచున్నది.

హృదయాపణనిర్ణీత యథాప్రాప్తార్థభూషితా
అనారతనవద్వార ప్రవహత్ప్రాణనాగరా. 12

హృదయమను విక్రయశాలయందలి విచారమను రత్నములను పరీక్షకులు నిర్ణయించి నేత్రాది యింద్రియముల ద్వారా గ్రహించిన శబ్దాదిపదార్థములచే యీ నగరము విభూషితమై యున్నది. మఱియు నవద్వారములగుండా ప్రవేశించుచు, వినిర్గతమగుచునున్న ప్రాణరూపులగు నగరనివాసులిందు గలరు.

ఆస్యస్ఫారవదాదృష్ట దంతాస్థిశకలాకులా
ముఖాస్పదాభ్రమజ్జిహ్వా చండీచర్వితభోజనా. 13

ముఖద్వారము గజదంతరచన ననుకరించిన కించిద్దృష్టమగు దంతశకలములచే పూర్ణమై యొప్పుచున్నది. ఇందు ముఖనివాసినియగు జిహ్వయను చండిక పలువిధ భోజనములారగించుచున్నది.

రోమశష్పతరచ్ఛన్నా కర్ణకోటరకూపకా
స్ఫిక్ శృంఖలాస్థితోపాన్త పృష్ఠవిస్తీర్ణజఙ్గలా. 14

రోమములను దీర్ఘతృణములచే కర్ణకూపమావృతమై యున్నది. మఱియు పృష్ఠమందలి శృంఖలారూపమగు అస్థిమొదలు పృష్ఠపర్యంతము వ్యాపించిన అరణ్యముచే మనోహరముగా నున్నది.

గుదోత్థానారఘట్టాన స్రవద్రుతానన్తకర్దమా
చిత్తోద్యానమహీవల్గదాత్మ చిన్తావరాఙ్గనా. 15

అధోమార్గములగుండా వినిసృతమగు మలమాత్రములను పంకము దూరముగ తొలగింపబడుచున్నది. చిత్తమను వనవాటికయందు ఆత్మచింతనయను యుత్తమాంగన క్రీడించుచున్నది.

ధీవరత్రాదృఢాబద్ధ చపలేన్ద్రియమర్కటా
వదనోద్యానహసన పుష్పోద్గమమనోరమా. 16

బుద్ధియను చర్మరజ్జువుచే చపలములగు యింద్రియ మర్కటంబులు దృఢముగ బంధింపబడియున్నవి. ముఖమను వనవాటికయం దుత్పన్నమైన హాస్యమను కుసుమములచే యీ దేహనగరము శోభించుచున్నది.

స్వశరీరమనోజ్ఞస్య సర్వసౌభాగ్యసుందరీ
సుఖాయైవనదుఃఖాయ పరమాయహితాయచ. 17

తన దేహమనంబుల బాగుగనెఱింగిన తత్వజ్ఞున కీదేహనగరము మిగుల సౌభాగ్యవంతముగను, సుందరముగను నున్నదై ఉత్తమ సుఖముకొఱకును హితము (మోక్షము) కొఱకును మాత్రమే యగునుగాని దుఃఖము కొఱకుగాదు.

అజ్ఞస్యేయమనన్తానాం దుఃఖానాంకోశమాలికా
జ్ఞస్యత్వియమనన్తానాం సుఖానాంకోశమాలికా. 18

ఓ రామా ! ఈ శరీరనగర మజ్ఞానికి అనేకదుఃఖములకు నిలయమును, జ్ఞానికి అనేక సుఖములకు నిలయమునునై యున్నది.

కించిదస్యాంప్రనష్టాయాం జ్ఞస్యనష్టమరిందమ
స్థితాయాంసంస్థితంసర్వం తేనేయంజ్ఞసుఖావహా. 19

రిపుసూదనుఁడగు నో రామా ! ఈ శరీరనగరము నశించుచో, [illegible] తుచ్ఛవస్తువే నశించినదగును గాని సత్యవస్తువుగాదు. నిలచియున్నచో భోగమోక్షములకు హేతువగుచు వానికి సుఖప్రదమే యగును.

యదేనాంజ్ఞఃసమారుహ్య సంసారేవిహరత్యలమ్
అశేషభోగమోక్షార్థం తేనేయంజ్ఞరథఃస్మృతః. 20

దీనిపైనెక్కి జ్ఞాని ప్రపంచమున యుత్తమరీతి విహరించును గ నియ్యది వానికి రథము వంటిదే యగుచున్నది.

శబ్దరూపరసస్పర్శ గన్ధబన్ధుశ్రియోయతః
అనయైవహిలభ్యన్తే తేనేయంజ్ఞస్యలాభదా. 21



శబ్ద స్పర్శరూపరసగంధములనును విషయములును, బంధువులును, భోగమోక్షములును దీనిచే ప్రాప్తించును గాన యీ శరీరమను నగరము జ్ఞానికి లాభదాయకమే అయియున్నది.

సుఖదుఃఖక్రియాజాలం యదేషోద్వహతిస్వయమ్
తదేషారామసర్వజ్ఞ సర్వవస్తుభరక్షమా. 22

ఈ శరీరనగరము సుఖదుఃఖములను క్రియలను స్వయముగనే ధరించుచున్నది. కావున నో రామా ! జ్ఞానికి భోగమోక్షోపయుక్తములగు వస్తుసంగ్రహణమం దియ్యది సమర్థమగుచున్నది.

తస్యాంశరీరపుర్యాంహి రాజ్యంకుర్వన్గతజ్వరః
జ్ఞస్తిష్ఠతిగతవ్యగ్రః స్వపుర్యామివవాసవః. 23

దుఃఖరహితుడును, స్వస్థచిత్తుడును నగు జ్ఞాని యీ శరీరనగరమును పాలించుచు, యింద్రుడు తన పురమునసుండునట్లు సుఖముగ నుండును.

నక్షిపత్యవటాటోపే మనోమత్తతురంగమమ్
నలోభదుర్ద్రుమాదాయ ప్రజ్ఞాపుత్రీంప్రయచ్ఛతి. 24

జ్ఞానియొక్క మనస్సను మదపుటేనుగ జన్మరూపమగు గర్తమున యెన్నటికిని బడదు. మఱియు జ్ఞాని లోభమను విషవృక్షమును గొని వివేకవతియగు బుద్ధియను కన్యను మోహ, అధర్మాది దుష్కులీనుల కొసంగడు.

అజ్ఞానపరరాష్ట్రించ నరంధ్రంత్వస్యపశ్యతి
సంసారారిభయస్యాస్త ర్మూలాన్యేవనికృన్తతి. 25

అజ్ఞానరూపమగు యితర రాష్ట్రములీ జ్ఞానినాక్రమింపకుండును. సంసారదుఃఖమను శత్రుభయమునకు మూలమగు ఆసక్తిని జ్ఞాని ఛేదించివైచును.

తృష్ణాసారవరావర్తే కామనంభోగదుర్గ్రహే
ననిమజ్జతి పర్యస్తః సుఖదుఃఖప్రదేవనే. 26

కామోపభోగమను దుష్టగ్రాహము (మొసలి) నకు నిలయమును సుఖదుఃఖవిలాపములకు కారణభూతమును నగు తృష్ణయను నదియొక్క విశాలావర్తములందు జ్ఞాని తగుల్కొనడు.

కరోత్యవిరతంస్నానం బహిరన్తరవీక్షణాత్
సరిత్సంగమతీర్థేషు మనోరథగతఃక్రమాత్. 27

బాహ్యాభ్యంతరములందును పరమాత్మను సందర్శించుచు, ఆధ్యాత్మిక, అధిభౌతిక నదీసంగమ తీర్థములందు జ్ఞాని నిత్యము స్నానమొనర్చుచుండును.

సకలాక్షజనాదృశ్య సుఖప్రేక్షాపరాఙ్ముఖః
ధ్యాననామ్ని సుఖంనిత్యం తిష్ఠత్యన్తః పురాన్తరే. 28

ఇంద్రియములను జనసముదాయముయెడను, అవిచారముచే రమణీయము గనుపట్టు విషయములయెడను జ్ఞాని పరాఙ్ముఖుఁడై వర్తించుచు, ధ్యానమను యంతఃపురమున నిత్యము సుఖపూర్వకముగ వసించును.

సుఖావహైషానగరీ నిత్యంవై విదితాత్మనః
భోగమోక్షప్రదాచైషా శక్రస్యేవామరావతీ. 29

ఓ రామా! ఆత్మతత్త్వమెఱింగినవానికీ శరీరనగరము నిత్యము సుఖమునే గల్గజేయును; ఇంద్రునకమరావతీనగరమువలె ఇయ్యది భోగ మోక్షప్రదమై చెన్నొందుచున్నది.

స్థితయాసంస్థితంసర్వం కించిన్నష్టంనసజ్జయా
యయాపుర్యామహీయస్యా సాకథం నసుఖావహా. 30

ఏ శరీరనగరమున్నచో నంతయు స్థితిగల్గియుండునో, ఎయ్యది నశించిన మఱిద్దియు యొకింతయు నశింపకయుండునో, అట్టిదేల సుఖప్రదము కానేరదు?

వినష్టే దేహనగరే జ్ఞస్యనష్టంనకించన
అక్రాన్తకుంభాకాశస్య ఖస్యకుంభక్షయేయథా. 31

ఘటమునశించిన, ఘటాకాశముగాని మహాకాశముగాని నశింపనియట్లు, దేహనగరము నశించినను జ్ఞానికేమియు నాశములేదు.

విద్యమానంఘటంవాయుః కించిత్స్పృశతి నాస్థితమ్
యథాతథైవదేహీస్వాం శరీరనగరీమిమామ్. 32

ఘటమున్నపుడుకూడ దానిని స్పృశింపని వాయువు, అదిలేనపుడెట్లు స్పృశించును? అట్లే శరీరమను నగరమున జీవాత్మయొక్క స్థితియు నెఱుంగునది. అనగా దేహమున్నపుడే యది జ్ఞానినేమియు చేయజాలనపుడిక లేనపుడేమి చేయగల్గును?

అత్రస్థఃపురుషోభోగానాత్మా సర్వగతోఽపిసన్
వికల్పకృతాన్భుక్త్వా పుంసామధిగతార్థభాక్. 33

అంతట వ్యాపించియున్నను (జ్ఞానియొక్క) ఆత్మ యీ శరీరనగరమున నున్నదై ప్రపంచమున కల్పనయొనర్పబడిన ప్రారబ్ధభోగముల ననుభవించి పూర్వకాలమున సాక్షాత్కరింపబడిన పూర్ణానందమయమగు ఆత్మస్వరూపమను పరమపురుషార్థము (మోక్షము) ను పొందుచున్నది.

కుర్వన్నపినకుర్వాణః సమస్తార్థక్రియోన్ముఖః
కదాచిత్ప్రకృతాన్సర్వా న్కార్యార్థాననుతిష్ఠతి. 34

అర్థక్రియోన్ముఖుండై జ్ఞానియొకపుడు ప్రారబ్ధకర్మానుసారము ప్రాప్తించిన కర్తవ్యకర్మల నెరవేర్చును. ఇట్లు వ్యవహారదృష్టియందంతయు జేయుచున్నను యథార్థముగ నాతడేమియు జేయనివాడే యగును.

కదాచిల్లీలయాలోలం విమానమధిరోహతి
అనాహతగతిఃకాన్తం విహర్తుమమలంమనః. 35

సర్వత్ర వ్యాపించియున్న యీ ఆత్మయొకపుడు భోగకౌతుకయుక్తమై జ్ఞానికి వినోదము నొసగూర్చుటకై హృదయకమలమను విమానముపై లీలామాత్రమున యారూఢమగును.



తత్రస్థోలోకసుందర్యా సతతంశీతలాంగయా
రమతేరామయామైత్ర్యా నిత్యంహృదయసంస్థితః. 36

అట్టి విమానమునెక్కి లోకమందతిసుందరమును, పరమశాంతిదాయకమును నగు మైత్రి యను ప్రియురాలితోగూడ సుఖమనుభవించును.

ద్వేకాన్తేతిపతః సమ్యక్ పార్శ్వయోఃసత్యమైత్రకే
ఇన్దోరివవిశాఖేద్వే సమాహ్లాదితచేతసీ. 37

చంద్రుని సమీపమున మనోహరమగు విశాఖానక్షత్రద్వయమువలె జ్ఞాని కిరుపార్శ్వములందు సత్యమైత్రత్వములను ప్రియురాండ్రిరువురు యుందురు.

క్షపితానఖిలాంల్లోకాన్దుఃఖక్రకచదారితాన్
వల్లీవనస్థాన్నభసః పృష్ఠాదర్కఇవేక్షతే. 38

ఆకాశమందున్న సూర్యభగవానుడు లతలచే పరివేష్టితమగు వనమునుజూచునట్లు, జ్ఞానియు, నాశవంతమును, దుఃఖగ్రస్తమును నగు లోకములన్నింటిని జూచును.

చిరంపూరితసర్వాశః సర్వసంపత్తిసుందరః
అపునఃఖండనాయేన్దుః పూర్ణాంగఇవరాజతే. 39

చిరకాలము దిక్కులను మనోరథములను పూర్ణమొనర్చునదియు, సమస్తసంపదలతోకూడి సుందరమైయొప్పునదియు నగు పూర్ణచంద్రునివలె యఖండశోభాయుక్తమై జ్ఞాని ప్రకాశించుచుండును.

సేవ్యమానోఽపిభోగౌఘో నఖేదాయాస్యజాయతే
కాలకూటఃకిలేశస్య కంఠేప్రత్యుతరాజతే. 40

కాలకూటవిషము శ్రీ శంకరభగవానుని కంఠమును కలుషితమొనర్పక తద్విపరీతముగ శోభనే గల్గజేయునట్లు, జ్ఞానిచే సేవింపబడు భోగసముదాయము దుఃఖమునుగాక సుఖమునే గలుగజేయును.

పరిజ్ఞాతోపభుక్తోహి భోగోభవతితుష్టయే
విజ్ఞాయసేవితోమైత్రీమేతి చోరోనశత్రుతామ్. 41

'ఈతడు చోరుడ'ని యెఱింగిన పిమ్మట చోరుడు మిత్రత్వమునే గలుగజేయునుగాని శత్రుత్వమును గలుగజేయనట్లు, మిథ్యారూపములుగ నెఱుంగబడిన పిదప యనుభవింపబడు భోగములు సంతుష్టినే గలుగజేయును.

నరనారీనదౌఘానాం విరహేదూరగామినామ్
జ్ఞేనయాత్రేవసుభగా భోగశ్రీరవలోక్యతే. 42

విసమాజవిఘటనమందు దూరమేగిన స్త్రీ పురుషాది సమూహమును నిస్పృహులై జనులవలోకించునట్లు జ్ఞాని భోగ్యజాతమగు స్త్రీ పుత్రధనాదుల శోభను నిస్పృహుండై పరికించును.

అశఙ్కితోపసంప్రాప్తా గ్రామయాత్రాయథాధ్వగైః
ప్రేక్ష్యన్తేతద్వదేవ జ్ఞైర్వ్యవహారమయ్యాక్రియాః. 43

పాంథులోకస్మికముగ ప్రాప్తించిన గ్రామసమూహముల నెట్లు గాంచుదురో అట్లనే జ్ఞాని వ్యవహారమయమగు క్రియలన్నింటిని నిస్పృహుండై గాంచును.

అయత్నోపనతేష్వక్షి పదార్థేషుయథాపునః
నీరాగమేవపతతి తద్వత్కార్యేషుధీరధీః. 44

అప్రయత్నముగనే నిర్మింపబడిన పర్వత వన కూపాదులయొక్కయు, అందలి వృక్షలతాకమలాదులయొక్కయు ఛేదన భేదన హరణాదిక్రియలందు దుఃఖాభావముచే రాగరహిత దృష్టిని జనులు గల్గియుండునటుల మమత్వములేని జ్ఞానియొక్క దృష్టియు సర్వకార్యముల యెడను రాగరహితమై యుండును.

ఇంద్రియాణాంనహరతి ప్రాప్తమర్థంకదాచన
నాదదాతి తథాప్రాప్తం సంపూర్ణోజ్ఞోవతిష్ఠతే. 45

జ్ఞాని యింద్రియములను ప్రారబ్ధకర్మానుసారము ప్రాప్తించిన విషయముల ననుభవింపకుండ యరికట్టడు. అట్లనే, అప్రాప్తములగు పదార్థములను యత్నపూర్వకముగ గ్రహింపకయు నుండుచు పూర్ణరూపమున సహజస్థితిగల్గి యుండును.

అప్రాప్తచిన్తాః సంప్రాప్త సముపేక్షాశ్చసన్మతిమ్
నశక్నువన్తితరలాః పిచ్ఛాఘాతాఇవాచలమ్. 46

మయూరపంఖముయొక్క యాఘాతము పర్వతమునేమియు చేయజాలనట్లు, అప్రాప్త వస్తుచింతయు ప్రాప్తవస్తువుల యుపేక్షయు జ్ఞానినేమియును చలింప జేయజాలకుండును.

సంశాన్తసర్వసందేహో గలితాఖిలకౌతుకః
సంక్షీణకల్పనాదేహో జ్ఞఃస్వమాడివరాజతే. 47

స్థూలసూక్ష్మాది శరీరములన్నింటికిని కారణభూతమగు అజ్ఞానము నశించుటచే సంశయరహితుడును, భోగములందు మిథ్యాత్వమును దర్శించుటచే సర్వకౌతుకవర్జితుండును, స్థూలసూక్ష్మదేహకల్పనారహితుడును నగు జ్ఞాని, రాజసూయయజ్ఞఫలమునుపొందిన చక్రవర్తివలె శోభించును.

ఆత్మన్యేవనమాత్యన్తః స్వాత్మనాత్మనిజృంభతే
సంపూర్ణోఽపారపర్యన్తః క్షీరార్ణవఇవార్ణవే. 48

(చక్రవర్తి దృష్టాంతమున్నూ పామరుల కొఱకే యగును.) యథార్థముగ జ్ఞాని అపారమును పూర్ణమును నగు క్షీరసముద్రమువలె పూర్ణస్వరూపమగు తన యాత్మచే నాత్మయందే శోభించుచుండును.

భోగేచ్ఛాకృపణాఞ్జన్తూన్దీనాన్దీనేన్ద్రియాణిచ
అనుసన్ధత్తమనాః శాన్తోహసత్యున్మత్తకానివ. 49

జనులున్మత్తులనిగాంచి నవ్వునట్లు, భోగేచ్ఛచే కృపణులగు దీనజనులఁగాంచియు, భోగాభిలాషగల యింద్రియములఁ బరికించియు, సావధానచిత్తుఁడగు జ్ఞాని నవ్వుచుండును.



ఇచ్ఛతోఽన్యోజ్ఝితాంజాయాం యథైవాన్యైనహస్యతే
ఇంద్రియస్యేచ్ఛతోభోగం తద్వద్విజ్ఞేనవిహాస్యతే. 50

అన్యునిచే త్యజింపబడిన స్త్రీని వాంఛించువానిని లోకులు పరిహసించునట్లు, త్యజింపబడిన భోగముల నిచ్ఛగించు యింద్రియముల ప్రవృత్తిఁగాంచియు జ్ఞాని నవ్వుచుండును.

త్యజతాస్వాత్మసుఖం సౌమ్యం మనోవిషయవిద్రుతమ్
అంకుశేనేవనాగేన్ద్రిం విచారేణవశంనయేత్. 51

అంకుశముచే మదపుటేనుగను నిగ్రహించునట్లు, ఆత్మసుఖమును త్యజించి విషయముల వెంబడి పరుగిడుమనస్సును విచారజ్ఞానముచే నిరోధింపవలెను.

భోగేషుప్రసరోయస్యా మనోవృత్తేశ్చదీయతే
సాప్యాదావేవహన్తవ్యా విషస్యేవాఙ్కురోద్గతిః. 52

భోగవైతృష్ణ్యముచే మనస్సు వృత్తిరూపముఁ జెందునపుడు, అట్లుజెందనీయక యావృత్తిని విషాంకురముయొక్క గతినివలె ప్రారంభముననే ఛేదించివేయవలెను.

తాడితస్యహియఃపశ్చాత్సంమానః సోఽప్యనన్తకః
శాలేర్గ్రీష్మాభితప్తస్య కుసేకోఽప్యమృతాయతే. 53

గ్రీష్మర్తువందలి సంతప్తమగు ధాన్యము జలసేకముచే అమృతతుల్యమగునట్లు, చిరకాలము నిగ్రహింపబడి మనస్సునకొనర్చిన యొకింత సన్మానమున్ను విస్తారముఁ జెందుచున్నది.

అనార్తేనహిసన్మానో బహుమానోనబుధ్యతే
పూర్ణానాంసరితాం ప్రావృట్పూరః స్వల్పోనరాజతే. 54

నిండునదులకు వర్షాకాలపు యల్పజలప్రవాహమువలె సుఖవంతున కధికసన్మానమున్ను విశేషముగ తోచకుండును.

పూర్ణస్తుప్రాకృతోఽప్యన్య త్పునరప్యభివాంఛతే
జగత్పూరణయోగ్యాంబుర్గృహ్ణాత్యేవార్ణవో జలమ్. 55

తన జలముచే జగత్తును నింపునట్టి మహాసముద్రము అన్యనద్యాది జలములగ్రహించుచునే యుండునట్లు పరిపూర్ణస్థితినిబొందిన జీవన్ముక్తుడును సామాన్యులగు యితరజనుల నపేక్షించుచునే యుండును.

మనసోఽభిగృహీతస్య యాపశ్చాద్భోగమండనా
తామేవాలబ్ధవిస్తారాం క్లిష్టత్వాద్బహుమన్యతే. 56
బన్ధముక్తోమహీపాలో గ్రాసమాత్రేణతుష్యతి
పరైరబద్ధోనాక్రాన్తో నరాజ్యంబహుమన్యతే. 57

బంధవిముక్తుఁడగురాజు భోజనమాత్రముచే పరితుష్టుడగునట్లును, శత్రువులచే నాక్రమింపబడని రాజ్యమునుగూడ యధికముగ దలంచనట్లును, నిగ్రహింపబడిన మనస్సున్ను భిక్షాశనాది అల్పవిషయములనుగూడ పూర్వముకంటె యధికముగ దలంచును.

హస్తంహస్తేనసంపీడ్య దంతైర్దన్తాన్విచూర్ణ్య చ
అఙ్గాన్యఙ్గైరివాక్రమ్య జయేచ్ఛేన్ద్రియశాత్రవాన్.

చేతిని చేతితోనలిపి, దంతములను దంతములచే కొఱికి, అవయవముల నవయవము లాక్రమించి ఏవిధముగనైనను, సర్వప్రయత్నములచే యింద్రియములను శత్రువులఁ జయించవలె...

జేతుమన్యంకృతోత్సాహైః పురుషైరిహపండితైః
పూర్వంహృదయశత్రుత్వాజ్జేతవ్యానీన్ద్రియాణ్యలమ్.

మఱియు ప్రపంచమున జయోత్సాహముగల పండితుల కిది పరమశత్రువగుటచే ప్రథమము నీ యింద్రియములనే లెస్సగ జయింపవలెను.

ఏతావతి ధరణితలే
సుభగాస్తే సాధుచేతనాఃపురుషాః
పురుషకలాసు చ గణ్యా
నజితాయే చేతసా స్వేన. 60

ఈ పృథ్వీతలమందంతటను, చిత్తమును జయించినవారే భాగ్యవంతులును, సావధాన చిత్తులును, బంధవిముక్తులగుటచే కుశలత్వమందు గణనీయులును నగుదురు.

హృదయబిలే కృతకుణ్డల
కలనావివశో మనోమహాభుజగః
యస్యోపశాన్తిమాగత
మలముదితం తంసునిర్మలంవందే. 61

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
శరీరనగరవిభూతియోగోనామ త్రయోవింశః
సర్గః ॥ 23 ॥

ఓ రామా! హృదయబిలమందు కుండలాకారమున గర్వపరవశమైయున్న మనస్సను మహాసర్పమెవనికి పూర్ణరూపమున వినాశమాయెనో, స్వస్వరూప సాక్షాత్కారముచే వ్యక్తమైన నిర్మలస్వరూపముగల అట్టి తత్వవేత్తయగు మహామునికి నేను నమస్కరించుచున్నాను.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు స్థితిప్రకరణమున
శరీరనగరవిభూతియోగమను త్రయోవింశ
సర్గము ॥ 23 ॥

## చతుర్వింశః సర్గః.

శ్రీవసిష్ఠ ఉవాచ :—

మహానరకసామ్రాజ్యే మత్తదుష్కృతవారణాః
ఆశాశరశలాకాఢ్యా దుర్జయాహీన్ద్రియారయః. 1

శ్రీవసిష్ఠుడు :—ఓ రామా! తపన, అవీచి, మహారౌరవ, సంఘాత, కాలసూత్రాది మహానరకయుక్తమగు సామ్రాజ్యమున నభిషిక్తములైనవియు, పాపములను మదగజేంద్రసహితములును, తృష్ణయను బాణములచే పరిపూర్ణములును నగు యింద్రియములను శత్రువులఁ జయించుట మిగుల దుర్లభము.

సాశ్రయంప్రథమం దేహం కృతఘ్నానాశయన్తియే
తేకుకార్యమహాకోశా దుర్జయాఃస్వేన్ద్రియారయః. 2

ప్రథమమున తమకాశ్రయభూతమగు దేహమునే నశింపజేయునవియు, కృతఘ్నులును, పాపమను ధనమును సంచయమొనర్చునవియు నగు యింద్రియములను శత్రువులు దుర్జేయములై యున్నవి.

కలేవరాలయం ప్రాప్య విషయామిషగృధ్నుకాః
అక్షగృధ్రావివల్గన్తి కార్యాకార్యోగ్రపక్షిణః. 3

విషయములను మాంసము నపేక్షించునవియు, కర్తవ్యాకర్తవ్యములను భయంకరములైన రెక్కలుగలవియు నగు యింద్రియములను గృధ్రములు దేహమను తమగూటియందు ప్రవేశించి విజృంభించుచున్నవి.

వివేకతన్తుజాలేన గృహీతాయేన తేశఠాః
తస్యాఙ్గానినలుమ్పన్తి పాశానాగబలంయథా. 4

వివేకమను సూత్రజాలముచే యెవడు వాటిని (ఇంద్రియములను పక్షులను) వశమొనర్చుకొనునో, అట్టివాని శాంత్యాది యంగముల నవి గజసమూహమును పాశమువలె ఛేదింపనశక్యములై యుండును.

ఆపాతరమణీయేషు రమతేవిషయేషుయః
వివేకధనవానస్మిన్కుకలేవరపత్తనే.
ఇన్ద్రియారిభిరస్వైరవశో నాభిభూయతే 5

శరీరమను యీ తుచ్ఛనగరమున వివేకమను ధనముగల్గి, ఆపాతరమణీయములగు విషయములందు ప్రీతిఁగొననివాడంతమున యింద్రియములను శత్రువులచే పరాజితుఁడుగాక యుండును.

నతథాసుఖితాభూపా మృన్మయోగ్రపురీజుషః. 6

స్వాధీన చిత్తుడును మృణ్మయరూపమగు స్వశరీరనగరాధిపతియు నగువాడు పొందు సుఖమును భయంకర రాజ్యమునేలు నృపతులును బొందజాలరు.

యథాస్వాధీనమనసః స్వశరీరపురీశ్వరాః.
ఆక్రాన్తేన్ద్రియభృత్యస్య సుగృహీతమనోరిపోః. 7
వసన్తఇవమంజర్యో వర్ధన్తేశుద్ధబుద్ధయః

స్వాధీనచిత్తుడును, స్వశరీరనగరాధిపతియు, ఇంద్రియములను భృత్యుల వశీకరించుకొనిన వాడును, మనస్సను శత్రువును జయించినవాడును నగు మనుజునియొక్క పరిశుద్ధమగుబుద్ధి వసంతకాల లతవలె వృద్ధినొందును.

ప్రక్షీణచిత్తదర్పస్య నిగృహీతేన్ద్రియద్విషః. 8
పద్మిన్యఇవహేమన్తే క్షీయన్తేభోగవాసనాః

చిత్తముయొక్క గర్వము నశించినవాడును, ఇంద్రియములను శత్రువుల నిగ్రహించిన వాడును నగు వానికి హేమంతకాలమందలి కమలమువలె భోగవాసన నశించును.

తావన్నిశీథవేతాలా వల్గన్తిహృదివాసనాః. 9
ఏకతత్త్వదృఢాభ్యాసాద్యావన్న విజితంమనః

ఏకమగు బ్రహ్మతత్వాభ్యాసముచే మనస్సు జయింపబడనంతవఱకు అజ్ఞానమను గాఢాంధకారమున హృదయవాసనలను పిశాచములు విజృంభించుచునే యుండును.

భృత్యోభిమతకర్తృత్వాన్మంత్రీ సత్కార్యకారణాత్. 10
సామన్తశ్చేన్ద్రియాక్రాన్తేర్మనో మన్యేవివేకినః
లాలనాత్స్నిగ్ధలలనా పాలనాత్పావనః పితా. 11

వివేకవంతుని మనస్సు అభీష్టకార్యమొనర్చుటచే సేవకుడును, సత్కార్యమొనర్చుటచే మంత్రియు, ఇంద్రియములను శత్రువులపై దాడిసల్పుటచే సామంతరాజును, ప్రేమభావముగల్గి యుండుటచే ప్రియురాలగు స్త్రీయు, పాలించి రక్షించుటచే పవిత్రజనకుడును నగును.

సుహృదుత్తమవిశ్వాసాన్మనో మన్యేమనీషిణామ్.
స్వాలోకితఃశాస్త్రదృశా బుద్ధ్యాన్తఃస్వానుభావితః 12
ప్రయచ్ఛతిపరాంసిద్ధిం త్యక్త్వాత్మానంమనఃపితా.
సుదృష్టఃసుపరామృష్టః సుదృఢఃసుప్రబోధితః 13
సుగుణైర్యోజితోభాతి హృదిహృద్యోమనోమణిః.

ఇవ్విధమున, విశ్వాసకారణంబున యీ మనస్సు వివేకుల యుత్తమ మిత్రుడని నే నెంచుచున్నాను. మఱియు శాస్త్రములందు దెల్పబడినరీతి దేవతాదృష్టిచే అనుల్లంఘనీయమగు శాసనమును, చైతన్యమాత్రరూపముగ దర్శితమును స్నేహ వివేకబుద్ధులచే సంపూజితమును నగు యీ మనస్సను జనకుడు తన శరీరము (మనోరూపత్వము) ను త్యజించి, స్వార్జితమగు తత్వజ్ఞానమను సిద్ధిని ప్రసాదించుచున్నాడు. శాస్త్రోక్తమగు పరీక్షచే బాగుగ పరీక్షింపబడినదియు, లేక సౌభాగ్యవశమున గనియందు చూడబడినదియు, ఆచార్య సహపాఠకాదుల సాహాయ్యంబున స్వానుభవపర్యంతము సువిచారితమును, నిధిధ్యాసనమను యాఘాతములచే దృఢీభూతమును, తత్వసాక్షాత్కారముచే



సుప్రబోధితమును, పంచమాది భూమికారూపమగు గుణములచే విభూషితమును, మిగుల రమణీయమును నగు యీ మనస్సను మణి శోభించుచున్నది.

జన్మవృక్షకుఠారాణి తథోరర్కోదయానిచ. 14
దిశత్యేవంమనోమంత్రీ కర్మాణిశుభకర్మణి

జన్మములను వృక్షముల ఛేదించునదియు, భవిష్యత్తునందు నిరతిశయానందదాయకములు నగు యీ మనస్సనుమంత్రి సాధనచతుష్టయసంపత్తి మొదలుకొని తత్వసాక్షాత్కారపర్యంతముగల కర్మలను చేయించుచుండును.

ఏవంమనోమణింరామ బహుపఙ్కకలఙ్కితమ్. 15
వివేకవారిణాసిద్ధ్యై ప్రక్షాల్యాలోకవాన్భవ

ఓ రామా ! ఇవ్విధమున పంకవిస్తారంబున కళంకితమగు యీ మనస్సను మణిని వివేకమను జలముచే శుద్ధమొనర్చి మోక్షసిద్ధికొఱకై ప్రకాశవంతముగ చేయుము.

భవభూమిషుభీమాసు వివేకవికలోవసన్. 16
మాపాతోత్పాతపూర్ణాసు వివశఃప్రాకృతోయథా

వివేకరహితులును, వివశులుమనగు మూర్ఖులవలె నీవును అతిభయంకరమును, ఉత్పాతములచే పూర్ణమును నగు సంసారభూములందు పడకుము.

సంసారమాయాముదితామనర్థశతసంకులామ్. 17
మామహామోహమిహికామిమాంత్వమవధీరయ

పలువిధ యనర్థములతోకూడి వ్యక్తమయిన యీ సాంసారిక మాయను బలమగు వ్యాధివలె నీవు పేక్షింవలదు.

వివేకంపదమాశ్రిత్య బుద్ధ్యాసత్యమవేక్ష్యచ. 18
ఇన్ద్రియారీనలంజిత్వా తీర్ణోభవభవార్ణవాత్

ఉత్తమవివేకము నాశ్రయించి బుద్ధిచే సత్యము నవలోకించి, యింద్రియములను శత్రువులను లెస్సగ జయించి సంసారసాగరమును దాటివేయుము.

అసత్యేవశరీరేఽస్మి న్సుఖదుఃఖేష్వసత్సుచ. 19
దామవ్యాలకటన్యాయో మాతేభవతురాఘవ
భీమభాసదృఢస్థిత్యా త్వంయాస్యసివిశోకతామ్. 20

ఈ దేహేంద్రియాదులును, సుఖదుఃఖాదులును అసత్యములగుటచే వీటిని జయించిన నేమిఫలము అని యివ్విధమున తలంచుచు 'దామవ్యాళ కటన్యాయము' † నాశ్రయింపకుము. కాని వివేకము నభ్యసించుచు భీమభాసదృఢన్యాయమును చేబట్టినచో నీవు దుఃఖరాహిత్యమును పొందగలవు.

---

† ఇయ్యది రాబోవు సర్గయందు నిరూపింపబడును.

అయమహమితి నిశ్చయోపృథాయ –
స్తమలమపాస్య మహామతేస్వబుద్ధ్యా
యదితరదవలమ్బ్య తత్పదంత్వం
వ్రజపిబభుఙ్క్ష్వ నబధ్యసేమనస్కః. 21

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
మనస్యసత్తాప్రతిపాదనంనామ చతుర్వింశః
సర్గః ॥ 24 ॥

మఱియు నో రామా ! ఈ దృశ్యభూతమగు దేహము నేనను మిథ్యానిశ్చయమును పూర్ణముగ త్యజించి, అట్టి మిథ్యావస్తువునకు భిన్నమగు సత్యమైన ఆత్మతత్త్వము నాశ్రయించి నీవు వచ్చినను, పోయినను సరే. అమనస్కుండవై భోజనాది వ్యాపారముల నొనర్చినను నీవు బంధమున దగుల్కొనఁ నేరవు, ముక్తుఁడవే యగుదువు.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు స్థితిప్రకరణమున
మనస్సుయొక్క సత్తాప్రతిపాదనమను చతుర్వింశ
సర్గము ॥ 24 ॥

---

## పంచవింశః సర్గః.

---

శ్రీవసిష్ఠ ఉవాచ :—

అస్మిన్విహరతో లోకే లోకారామస్యధీమతః
శ్రేయసే తిష్ఠతోయత్నముత్తమార్థాభిధాయినః. 1
దామవ్యాలకటన్యాయో మా తేభవతురాఘవ
భీమభాసదృఢస్థిత్యా త్వంవిశోకోభవేతిచ. 2

శ్రీవసిష్ఠుడు :—ఓ రామా ! ఈ ప్రపంచమున విహరించుచున్న వాడవును, జనులకు శాంతి నొసంగువాడవును, శమదమాదియుక్తుండవును, మోక్షార్థము ప్రయత్నశీలుడవునగు నీకు 'దామవ్యాళ కటన్యాయము' వలదనియు, భీమభాస దృఢన్యాయమున స్థితుఁడవగుచో నీవు శోకరహితుఁడ వగుదువనియు ఇతఃపూర్వము వచించియున్నాను.

శ్రీరామ ఉవాచ :—

దామవ్యాలకటన్యాయో మా తేభూదిత్యుదాహృతమ్
బ్రహ్మన్కిమేతద్భవతా భవతాపాపహారిణా. 3

శ్రీరాముడు :—ఓ మునీంద్రా ! సంసారతాపమును నివర్తింపజేయు తాము పూర్వ ప్రసంగమున 'నీకు దామవ్యాళ కటన్యాయము వలదని' సెలవిచ్చియున్నాను గదా! ఆన్యాయమెద్ది ?



భీమభాసదృఢస్థిత్యా త్వంవిశోకోభవేతిచ
ప్రభోకిముక్తంభవతా భవతాపాపహారిణా. 4

ఓ మహాత్మా ! భవతాపహారకా భీమభాసదృఢన్యాయమందు స్థితిఁబొందిన శోకరహితుఁడవగుదువనియు మీరు వచించియున్నారు. ఈ న్యాయమేమి ?

ఉదారవృత్తయాశుద్ధం సంప్రబోధయమామ్గిరా
ఘనస్తాపాపహారిణ్యా ప్రావృషీవకలాపినమ్. 5

ఓ మహాత్మా ! యుదారచరితా ! ఈ రెంటినిగూర్చి వర్ణించిచెప్పుచు వర్షాకాలమందు మేఘము మయూరము నుద్బోధించు విధమున, సంతాపహారకమగు తమ యుత్తమవాక్కుచే నన్ను ప్రబోధితుని యొనర్పుము.

శ్రీవసిష్ఠ ఉవాచ :—

దామవ్యాలకటన్యాయం భీమభాసదృఢస్థితిమ్
శృణురాఘవతచ్ఛ్రుత్వా యదిష్టంతత్సమాచర. 6

శ్రీవసిష్ఠుడు :—ఓ రామా ! దామవ్యాళకటన్యాయము, భీమభాసదృఢస్థితి — ఈ రెంటిని యెఱింగి నీకిష్టమగు విధమున యాచరింపుము.

ఆసీత్పాతాలకుహరే సర్వాశ్చర్యమనోరమే
శంబరోనామదైత్యేన్ద్రో మాయామణిమహార్ణవః. 7

పలువిధ యాశ్చర్యములకూడి మనోరమమైయొప్పుచున్న పాతాళమను గర్తమున మాయయను మణులకు మహాసముద్రముకంటివాఁడగు శంబరుఁడను దైత్యులఱేఁడు వసించుచుండెను.

ఆకాశనగరోద్యాన రచితాసురమందిరః
కృత్రిమోత్తమచంద్రార్క భూషితాత్మీయమండలః. 8

అతఁడాకాశమున కల్పింపబడిన నగరోద్యానములం దసురుల మందిరముల నిర్మించువాఁడును, కృత్రిమ చంద్రసూర్యులచే నిజజనవర్గమును సుశోభితమొనర్చువాఁడునునై యుండెను.

శిలాశకలసంభూత పద్మాద్యైరమరాచలః
అనన్తవిభవారంభ పరిపూరితదానవః. 9

మఱియు నాతఁడు శిలాఖండములవలె సులభ్యములై సుమేరుపర్వతమువలె సంపన్నమైన పద్మరాగాది మణులయొక్క నిధి గల్గి అనేక వైశ్వర్యంబులచే దానవుల పరిపూర్ణులఁజేయుచునుండెను.

గృహరత్నాఙ్గనాగేయ జితామరవధూధ్వనిః
చంద్రబింబకలాపూర్ణ క్రీడోపవనపాదపః. 10

రత్నతుల్యలను తమ మధురగానముచే అప్సరసల ధ్వనినిగూడ జయించునట్టి వారును నగు స్త్రీల తన గృహమునగలవాడును, చంద్రబింబకళచే పరిపూర్ణమైయొప్పు క్రీడోపవనవాటికయందలి వృక్షములు గలవాడునునై యుండెను.

ఫుల్లనీలోత్పలవ్యూహా కరాలరమణాలయః
రత్నహంసధ్వనాహూత హేమాంబురుహసారసః. 11

వికసించిన కమలములుగల వాని క్రీడాగృహము కాముకులకు భయంకరముగ నుండెను. మఱియు నాతడు రత్నహంసల ధ్వనిచేతను, సువర్ణకమలములచేతను సారసపక్షుల నాహ్వానించుచుండును.

హేమపాదపశాఖాగ్ర కృతాంభోరుహకుడ్మలః
కరఞ్జజాలప్రపతన్మన్దార కుసుమాకరః. 12

అతడు సువర్ణవృక్షాగ్రభాగమున లేకమలమును నిర్మించును. వాని యుద్యానమందలి కరంజ వృక్షసమూహముపై మందారవృక్షములు బడుచుండును.

తర్కుయన్త్రమయానన్త దైత్యనిర్జితవాసవః
హిమశీతానలజ్వాలా నిర్మితోద్యానమండపః. 13

మఱియు నాతడు 'కర్తనీ'యను యంత్రసహాయముచే అనేకదైత్యులతోకూడి యింద్రుని జయించువాడును, మంచువలె చల్లనైన అగ్నిజ్వాలలచే ఉద్యాన వనమండపమును నిర్మించువాడునునై యుండెను.

సర్వత్రకుసుమోద్యాన జితానన్దనసన్దనః
మాయాసర్వహృతవ్యాల మలయాచలచన్దనః. 14

ఎల్లెడల వ్యాప్తమైయున్న తన పుష్పోద్యానవనములచే యింద్రుని నందనవనమునుకూడ జయించుచుండెను. తన మాయచే సర్పములచే పరివేష్టితమగు మలయాచల చందనములను గూడ హరించుచుండెను.

హేమశ్రీలోకలావణ్యా నిర్జితాన్తఃపురాఙ్గనః
నానాకుసుమసంభార జానుదఘ్నగృహాఙ్గణః. 15

ఆతని యంతఃపురస్త్రీలు తమ లావణ్యముచే సువర్ణశోభను, ప్రపంచమందలి సౌందర్యమంతను నిర్జించుచుండిరి. వాని గృహాంగణమనేక పుష్పసమూహములచే పరిపూర్ణమైయుండెను.

క్రీడార్థమృన్మయేశాన జితచక్రగదాధరః.
అజస్రోడ్డీనరత్నౌఘ తారాఢ్యఖపురాన్తరః. 16

క్రీడార్థము రచించిన మృణ్మయ శివునిచే చక్రధరుడగు విష్ణుభగవానునికూడ జయించుచుండెను. నిరంతర మెగయుచుండు రత్నసమూహములను తారాగణంబులచే వాని నగరాకాశము వ్యాప్తమై యుండెను.

నిశీథాఖిలపాతాళ శతచంద్రనభస్తలః
స్వశాలభఞ్జికాలోక గీతగీతిరణోత్కటః. 17

అర్ధరాత్రియందును వాని యాకాశము నూర్లకొలది చంద్రులతోకూడి యుండును. ఆతనిచే నిర్మింపబడిన విగ్రహమునకు గావించు పూజ నవలోకించువారు భయంకరమగు యుద్ధగీతముల బాడుచుండిరి.



మాయైరావణనాగేన్ద్ర విద్రుతామరవారణః
త్రైలోక్యవిభవోత్కర్ష పూరితాన్తఃపురాన్తరః. 18

మాయానిర్మితములగు ఐరావత గజేంద్రులచే నాతడింద్రుని గజమును బారద్రోలుచుండెను. మఱియు త్రైలోక్యైశ్వర్యములందును శ్రేష్ఠములగు స్త్రీగజాశ్వాదులచే వాని యంతఃపురము పరిపూర్ణమైయుండెను.

సర్వసంపత్తిసుభగః సర్వైశ్వర్యసమన్వితః
సమస్తదైత్యసామన్త వందితోగ్రానుశాసనః. 19

అతడు సమస్తసంపదలచే సుశోభితుడును, సర్వైశ్వర్యయుక్తుడును, సర్వవంద్యుడునునై యుండెను. వాని కఠినశాసనము సామంతరాజులందఱిచే పాలింపబడుచుండెను.

మహాభుజవనచ్ఛాయా విశ్రాన్తాసురమండలః
సర్వబుద్ధిగణాధార రత్నమండలమండితః. 20

వాని దీర్ఘభుజములను వనచ్ఛాయయందు అసురసమూహము విశ్రమించియుండెను. మఱియు నా శంబరుడను దైత్యుడు సర్వబుద్ధిగణంబుల కాధారభూతుడును, రత్నములచే సుశోభితుడునునై యుండెను.

తస్యోత్పాదితదేవస్య కఠినోడ్డామరాకృతేః
బభూవవిపులంసైన్యమాసురం సురనాశనమ్. 21

దేవతల వినాశమొనర్చువాడును, భయంకరాకృతి గలవాడునునగు ఆదైత్యునకు, దేవతల సంహరించునట్టి గొప్ప సేన గలదు.

తస్మిన్మాయాబలేసుప్తే దేశాన్తరగతేతథా
తత్సైన్యంతరసా జఘ్నుశ్ఛిద్రంప్రాప్యకీలామరాః. 22

మాయాబలము గల యా శంబరుడు నిదురించినను, లేక దేశాంతరమేగినను, ఆ యవకాశమును పురస్కరించుకొని దేవత లతి క్రోధముతో వానిసేనను దునుముచుండిరి.

అథశంబరదైత్యేన ముక్తక్రోధద్రుమాదయః
రక్షార్థమపిసామన్తాః స్వసేనాసునియోజితాః. 23

ఓ రామా! అపుడు దైత్యుడగు శంబరుడు సైన్యరక్షణకొఱకై ముక్తక్రోధ, ద్రుమాదులను సేనాపతులను నియమించెను.

తానప్యన్తరమాసాద్య జగ్మర్దేవాభయానకాః
వ్యోమాన్తరగతాః శ్యేనాః కలవిఙ్కనివాకులాన్. 24

కాని శ్యేన (డేగ) మాకాశమున కలవింకపక్షుల సంహరించునట్లు సమయముజూచి భయంకర దేవతాసమూహము వారలంగూడ వధించెను.

సేనాపతీన్పునశ్చాన్యాంశ్చకారాసురసత్తమః
చపలానుద్భటారావాం స్తరంగానివసాగరః. 25

అత్తఱి, సముద్రము తరంగములనుత్పన్న మొనర్చునట్లు ఉత్తమ దైత్యుడగు నా శంబరుడు చపలురును, వీరులును నగు మఱికొందఱు సేనాపతులను యుత్పన్నము గావించెను.

దేవాస్తానపి తస్యాశు జఘ్నుస్తేన సకోపవాన్
జగామామరనాశాయ పరిపూర్ణం త్రివిష్టపమ్. 26

కాని దేవతలా సేనాపతులఁగూడ వధించివైచిరి. అక్కారణమున శంబరుఁడు క్రుద్ధుడై దేవతలచే పూర్ణమగు స్వర్గమును, దేవతలను వినాశ మొనర్ప నిశ్చయించెను.

తస్మాత్తన్మాయయాభీతాః సురాస్తే నష్టరిమాయయుః
మేరుకాననకుంజేషు మృగా గారీహరేరివ. 27

అదివిని దేవతలు భయభీతులై సుమేరుపర్వత వనకుంజములందు పార్వతీవాహనమగు సింహముఁ జూచి భీతిల్లిన మృగములవలె స్వర్గమునుండి పారిపోయిరి.

క్రన్దత్క్షుద్రామరగణం బాష్పక్లిన్నాప్సరోముఖమ్
శూన్యం దదర్శ స స్వర్గం కల్పక్షీణజగత్సమమ్. 28

అచ్చోట క్షుద్రదేవతాసమూహము రోదనమొనర్చుచుండెను. అప్సరసల ముఖము లశ్రుపూర్ణములై యుండెను. ఇట్లా స్వర్గము నాతడు ప్రళయముచే క్షయమొందిన జగత్తువలె శూన్యముగా గాంచెను.

విహరన్కుపితస్తత్ర లబ్ధమాహృత్య సుందరమ్
లోకపాలపురీర్దగ్ధ్వా జగామాత్మీయమాలయమ్ 29

క్రుద్ధుడై యద్దానియందు సంచరించుచు శంబరుడు కోరకిన వస్తువులఁగైకొని, యింద్రుని పట్టణమును దగులబెట్టి స్వస్థానమున కఱిగెను.

ఏవం దృఢతరీభూతే ద్వేషే దానవదేవయోః
దేవాః స్వర్గం పరిత్యజ్య దిక్షు జగ్మురదర్శనమ్. 30

ఇవ్విధమున దేవదానవులందు వైరమధికముకాగా దేవతలు స్వర్గమును వీడి యంతర్ధానమైరి.

అథ శంబరదైత్యేన యే యే సేనాధినాయకాః
క్రియన్తే యత్నతస్తాంస్తు జఘ్నుర్యత్నపరాః సురాః 31

ఓ రామా! పిమ్మట దైత్యుడగు శంబరునిచే కల్పింపబడిన సేనాపతులందఱిని, ప్రయత్నపరులైయున్న దేవతలు నాశ మొనర్చిరి.

యావదుద్వేగమాయాతః శంబరః కోపవాన్భృశమ్
తార్ణోఽతిమాత్రమనల ఇవజజ్వాలసోచ్ఛ్వసన్. 32

శంబరుఁడంత క్షోభఁజెంది మిగుల క్రుద్ధుడై అగ్నిజ్వాలలకంటె యుష్ణశ్వాసలఁగైకొనుచు మండిపడెను.



త్రైలోక్యమపి చాన్విష్యన్న దేవాఀల్లబ్ధవానథ
పరేణాపి ప్రయత్నేన నిధానమివదుష్కృతీ. 33

అత్తఱి యాతడు త్రిలోకములఁగూడ వెతకెను గాని, అధికయత్నముతోఁగూడి వెతకినను పాపి ధనరాశిని పొందజాలనట్లు, దేవతలనెచటను బొందకుండెను.

ససర్జ మాయయా ఘోరానసురాంస్త్రీన్మహాబలాన్
బలరక్షార్థముదితాన్కాలాన్మూర్తిమివస్థితాన్. 34

అపుడు ప్రసన్నచిత్తులును, మూర్తివంతుడగు కాలునివలె నున్నవారును, మహాబలశాలురును, భయంకరాకృతిగలవారును నగు యసురుల ముగ్గురిని శంబరుడు స్వసేనారక్షార్థము సృజించెను.

నివృత్తా మాయయా భీమా బలపాదపవాహినః
ఉదగుస్తే మహామాయాః పక్షక్షుబ్ధా ఇవాద్రయః. 35

మాయచే నిర్మింపబడినవారును, అధిక బలశాలురును, వృక్షవాహకులును, మహామాయాకంపన్నులును నగు వారు ముగ్గురును పక్షములచే క్షుభితములైన పర్వతములవలె గన్పట్టుచు వ్యక్తమైరి.

దామో వ్యాలకటశ్చేతి నామభిః పరిలాఞ్ఛితాః
యథాప్రాప్తైకకర్తారశ్చేతనామాత్రధర్మిణః. 36

వారు, దాముడు (శత్రువుల దమనముజేయువాడు) వ్యాళుడు (సర్పమువలె యాక్రమించువాడు) కటుడు (శత్రువుల యస్త్రములనుండి స్వసైన్యమును రక్షించువాడు) — ఈ నామములచే చిహ్నితులును, ప్రాప్తించిన కార్యములఁజేయువారును, చేతనామాత్రధర్మముగలవారునునై యుండిరి.

అభావాత్కర్మణాం తేచ ప్రాక్తనానచ వాసనాః
నిర్వికల్పకచిన్మాత్ర పరిస్పన్దైకధర్మకాః 37

పూర్వజన్మ కర్మలేనందున వారలకు వాసనలున్ను లేకుండెను, వారు భయ, శంకా, పలాయనాది వికల్పరహితులును, చిన్మాత్ర సన్నిధాన కారణమున దేహపరిస్పందమను ధర్మమ్మాత్రము గలవారునునై యుండిరి.

కర్మజీవకలాం తన్వీమసారాంచ మనోభిదామ్
అపుష్టాంకృతిమామస్త శోచ్ఛదయోదయమాగతాః. 38

కర్మజీవుడగు శంబరాసురుని కౌశల్యమను యల్పపరిణామముగలదియు, భోగవర్జితమును, కర్మ, వాసనారహితమును, మాయారచితమును నగు సృష్టి—సంకల్పవృత్తిని గ్రహించి, అంతర్యామియగు చైతన్యకారణంబున ఆ దామవ్యాళకటులు ఉత్పన్నమైరి.

తేహ్యర్థపారమ్పర్యేణ కాకతాలీయవద్భటాః
ప్రకృతామనువర్తన్తే క్రియాముజ్ఝితవాసనాః. 39

ఇవ్విధమున నుత్పన్నమైన వారు ముగ్గురును, కాకతాళీయన్యాయమున సంభవించిన క్రియల సంధపారంపర్యముచే ననుసరించుచుండిరి.

అర్ధసుప్తాయథాబాలాః స్వాంగైరిజ్గన్తికేవలమ్
వాసనాత్మాభిమానాభ్యాం హీనాస్తేతద్వదేవహి. 40

గాఢనిద్రను బొందని బాలుడు తన యంగములఁ గదల్చునట్లు యాముగ్గురు సైత్యవీరులును వాసనారహితులై, ఆత్మాభిమానవర్జితులై చేష్టలనొనర్చుచుండిరి.

నాభిపాతంనచాపాతం నవిదుస్తే పలాయనమ్
నజీవితంనమరణం నరణంనజయాజయౌ. 41

యుద్ధసమయమున సమ్ముఖమందలి శత్రుపతనమునుగాని, అకస్మాత్తుగ సంభవించు శత్రువుల యాపాతమునుగాని వారెఱుంగరు. పరుగిడుటయు యెఱుంగరు. జీవనమరణములుగాని, సంగ్రామముగాని, జయ పరాజయములుగాని వారెఱుంగరు.

కేవలంసైనికానగ్రే దృష్ట్వానాహననోద్యతాన్
అభిజగ్ముఃపరానాజౌ ప్రహారదలితాద్రయః. 42

కాని తమ యాఘాతములచే పర్వతములఁగూడ చూర్ణమొనర్చునట్టి యావీరులు ముగ్గురును యుద్ధమందు మారణోద్యుక్తులగు శత్రుసైనికులను యెదుటగాంచి ధైర్యముతో వారిసమ్ముఖమున కేగుదురు.

శంబరశ్చిన్తయామాస పరితుష్టమనాఃపరమ్
విజేష్యతేహిమేసేనా మాయాసురసురక్షితా. 43

శంబరాసురుడు సంతుష్టమానసుఁడై 'మాయారచితులగు నీ యసురుల ముగ్గురిచే పరిరక్షితమగు నా యీ సైన్యమవశ్యము విజయముగాంచున'ని తలపోసెను.

అతిబలాసురదోర్ద్రుమపాలితా
మమచమూః స్థిరతామలమేష్యతి
అమరవారణ దన్తవిఘట్టనే
ష్వమరపర్వత హేమశిలాయథా. 44

ఇత్యార్షే వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
దామవ్యాలకటోత్పత్తివర్ణనంనామ
పంచవింశః సర్గః ॥ 25 ॥

మఱియు మిగుల బలయుక్తమును, అసురుల (దామవ్యాళకటుల) భుజములను వృక్షచ్ఛాయ క్రింద పాలితమగు యీ నాసైన్యము శత్రుప్రహారమందునుగూడ దిగ్గజముల దంతసంఘట్టనమును పొందిన మేరుపర్వత హిమశిలవలె స్థిరముగా నుండగలదనియు యూహించెను.



ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు స్థితిప్రకరణమున
దామవ్యాళకటోత్పత్తివర్ణనమను పంచవింశ
సర్గము ॥ 25 ॥

---

## షడ్వింశః సర్గః.

---

శ్రీవసిష్ఠ ఉవాచ :—

ఇతినిర్ణీయదైత్యేన్ద్రో దామవ్యాలకటాన్వితామ్
సేనాంసంప్రేషయామాస భూతలందేవనాశినీమ్. 1

శ్రీవసిష్ఠుడు:—ఓ రామా! దైత్యేంద్రుడగు శంబరాసురుఁడిట్లు నిశ్చయించి, దామవ్యాళకటులతోఁగూడ దేవవినాశనకరమగు తన సైన్యమును భూతలముపైకి బంపెను.

దైత్యాఃసాగరకుంజేభ్యః కందరేభ్యశ్చసాయుధాః
ఉదగుర్భీమనిర్హ్రాదాః సపక్షగిరిలీలయా. 2

భీషణశబ్దమొనర్చువారును, శస్త్రాస్త్రధారులును నగు దైత్యులపుడు సముద్రకుంజములనుండియు, పర్వతగుహలనుండియు పక్షములధరించిన పర్వతములవలె బయల్వెడలిరి.

రోదసీకోటరం హస్తప్రహారహతభాస్కరమ్
దానవాఃపూరయామాసుర్దామవ్యాలకటైధితాః. 3

హస్తప్రహారములచే సూర్యుని తేజోవిహీనమొనర్చుచు భూమ్యాకాశముల యంతరాళమును దామవ్యాళకటులచే వృద్ధినొందింపబడిన ఆ దానవసైన్యము నింపెను.

అథోత్తస్థుర్నికుంజేభ్యః కందరేభ్యఃసురాచలాత్
ప్రలయాన్తఇవాత్యుగ్రా భీమాఃస్వర్వాసినాంగణాః. 4

అప్పుడు నికుంజములనుండియు, పర్వతకందరమునుండియు, సుమేరుపర్వతమునుండియు ప్రళయసంక్షోభమువలె భయంకరమగు దేవతాసమూహము యుద్ధముకొఱకై బయలుదేఱెను.

దేవాసురపతాకిన్యోస్తద్యుద్ధమభవత్తయోః
అకాలోల్బణకల్పాన్త భీషణంభువనాన్తరే. 5

సురాసురసైన్యముల సంగ్రామము భువనాంతరాళమున దుస్సహప్రళయముఁబోలి మిగుల భయంకరముగ నుండెను.

పేతుఃప్రలయపర్యస్త చంద్రార్కా ఇవదీప్తయః
శిరాంసికుండలోద్ద్యోత తేజఃపీతతమాంస్యథ. 6

కిరీట కుండలప్రకాశముచే మిక్కిలి శోభనుగొల్పుచున్న శిరంబులు మొండెములనుండి నేలపై, ప్రళయకాలమున విసరివేయబడిన ప్రకాశవంతులగు సూర్యచంద్రులవలె క్రింద పడుచుండెను.

జుఘూర్ణుర్భటనిర్ముక్త సింహనాదవిరావితాః
ప్రళయానిలసంపూర్ణైః స్ఫుటహాసా ఇవాద్రయః. 7

వీరుల సింహనాదములచే శబ్దితములైన పర్వతములు ప్రళయకాల వాయువేగముచే పరిభ్రమింప దొడగెను.

రేణుః శైలశిలాతుల్యా హేతిఘాతాత్సభిత్తయః
కులాచలతటాభీరు విత్రస్తహరిమండలాః. 8

పర్వతశిలలవలె దృఢమైన శస్త్రాస్త్రముల యాఘాతములచే విఱిగిపడిన భిత్తిసమూహమున్ను, భీతిల్లిన సింహగణముగల హిమాలయాది పర్వతముల తటములున్ను శబ్దమొనర్చుచుండెను.

చేరుః పరస్పరాఘాతహతహేతిసముత్థితాః
లోలానలకణాః కల్పవిశీర్ణా ఇవ తారకాః. 9

ప్రళయకాలమందు విఱిగిపడిన నక్షత్రములవలె, శస్త్రాస్త్రముల పరస్పర యాఘాతముచే బయల్వెడలిన అగ్నికణములు సంచరింప దొడగెను.

విలేసూ రక్తమాంసౌఘపూర్ణైకార్ణవతీరగాః
కల్పతాలవదుత్తాలా వేతాలాస్తాలతాలితాః. 10

ప్రళయకాలోత్పాతభూతమగు తాళవృక్షమువలె యెత్తైన భేతాళురచే విసరబడిన రక్తమాంసములచే పూర్ణమగు మహాసముద్రముయొక్క తీరవాసులు విలాసమొనర్చుచుండిరి.

ప్రస్ఫురద్రుధిరాసారశాంతపాంసుపయోధరే
వ్యోమ్ని హేతిహతక్షుణ్ణా మౌలికుండలకోటయః. 11

ప్రవహించుచున్న రక్తధారలచే ధూళిరహితమొనర్పబడిన యాకసమున శస్త్రాస్త్రముల యాఘాతములచే ఘర్షితములగు ముకుటకుండలముల యగ్రభాగములు సూర్యునివలె శోభించుచుండెను.

బభూవుర్భాస్కరాకారైః కల్పభూరుహధారిభిః
ప్రహారదలితాద్రీన్ద్రైర్దైత్యైర్నిర్వివరా దిశః. 12

సూర్యునివలె విశాలాకారముగలవారును, కల్పవృక్షమును ధరించినవారును, తమ ప్రహారములచే పెద్దపెద్ద పర్వతములఁగూడ చూర్ణమొనర్చుచున్నవారును నగు దైత్యులచే దిక్కులన్నియు నిండియుండెను.

జగ్ముర్జ్వలదసిప్రాంతవాతపాతితభిత్తయః
కణప్రకరతాం శైలాః కల్పాగ్నిదలితా ఇవ. 13

దేదీప్యమానమగు ఖడ్గములయొక్క యగ్రభాగమునుండి వెడలిన వాయువుయొక్క తీవ్రవేగముచే పడిన భిత్తిసమూహముగల పర్వతములు ప్రళయాగ్నియందువలె చూర్ణమయ్యెను.



దేవాస్తే చ సమాజగ్మురశ్వమేధైధితా ఇవ
అసురానస్త్రవిభ్రష్టాఞ్జలదానివ వాయవః. 14

అశ్వమేధయాగముచే వృద్ధినొందినట్లొప్పుచున్న దేవతాసమూహమంత, వాయువు మేఘముల సమీపించునట్లు, భగ్నాస్త్రములుఁగల యసురుల సమీపమునకుఁజనిరి.

జగృహుస్తానథాక్రమ్య జరఠాఖూనివౌతవః
తే౽పి తాఞ్జగృహుర్మత్తా వృక్షారూఢానివ ద్రుమాన్. 15

అట్లేగిన దేవతలు దానవులపై నాక్రమణముసల్పి వృద్ధమూషకమును మార్జాలము పట్టుకొనునట్లు వారలఁబట్టుకొనిరి. అట్లే యసురులును, వృక్షములపై నెక్కిన మదించిన జీవులను భల్లూకము పట్టుకొనునట్లు, దేవతలను పట్టుకొనిరి.

దోర్వృక్షవిలసద్ధేతికుసుమాః శస్త్రపల్లవాః
రేజుః సురాసురాః ఫుల్లా వనలోలా ఇవ ద్రుమాః. 16

భుజములను వృక్షములపై అస్త్రములను పుష్పములును, శస్త్రములను పల్లవములును గల్గి [illegible]నితవనమందలి చంచలవృక్షములవోలె నా సురాసురులు శోభించుచుండిరి.

అన్యోన్యం పూరయామాసుః శస్త్రపూరైర్దిశో దశ
వనాని కుసుమవ్రాతైః సుమేరావివ మారుతః. 17

సుమేరుపర్వతవనములను వాయువు పుష్పసమూహముచే నింపునట్లు, వారిరువురును పరస్పర శస్త్రసమూహంబులచే దశదిక్కుల నింపిరి.

ఘోరం సమభవద్యుద్ధం దేవదానవసేనయోః
రోదోరంధ్రోదుంబరాన్తర్మహామశకసంఘయోః. 18

ఉదుంబర (మేడి) ఫలమందు మశకసమూహమువలె భూమ్యాకాశముల యంతరాళమున చేరియున్న ఆ దేవదానవులయొక్క సంగ్రామము మిగుల భయంకరముగ నుండెను.

అథోత్పతదుత్తాలైర్లోకపాలేభమండలైః
కల్పాభ్రస్ఫూర్జితాకారో దారుణః సమరారవః. 19

పిమ్మట తాళవృక్షములవలె యెత్తైన లోకపాలుర గజసమూహమునుండి ప్రళయకాల గర్జనవలె భయంకరమైన సమరనాదము బయల్వెడలెను.

పిండగ్రాహేణ నభసి భూభాగమివ కుట్టిమమ్
ముష్టిగ్రాహ్యో మహామేఘమన్థరోదరపీవరః. 20

మిగుల ఘనమగు యాసమరనాదము యొకచోట ఆకాశమున పృథ్వీభాగము నిర్మించునట్లుగను, మఱియొకచోట పిడికిటచే గ్రహింప యోగ్యమైనదిగను, ఇంకొకతావున జలభారముచే గంభీరరూపముదాల్చిన మేఘములవలెను నొప్పుచుండెను.

రథసంపాతసంపిష్టశస్త్రశైలరటన్నటః
త్రుటద్ధృదయనిఃసత్త్వకర్కశాక్రన్దఘుర్ఘురః. 21

రథములుపడుటచే. పర్వతములపై చూర్ణమొనర్పబడిన శస్త్రములు గానమొనర్చుచున్న నటునివలె తాళలయముల ననుసరించు చుండెను. విదీర్ణహృదయులయొక్కయు ధైర్యరహితుల యొక్కయు కర్కశనాదము 'ఘుర్ఘుర'శబ్దముత్పన్నము జేయుచుండెను.

ప్రలయప్రత్యయోల్లాసి కల్పాన్తారావబృంహణః
ద్వాదశాదిత్యసంఘట్ట ద్రవత్కాంచనపర్వతః. 22

అయ్యది ప్రళయమునకు హేతుభూతములగు అగ్నివాయ్వాదులచే నుల్లసితమగు బ్రాహ్మీ దివసాంతమునందలి ప్రసిద్ధమగు ప్రళయనాదముకంటె మిగుల నతిశయమైనదిగను, ద్వాదశాదిత్యుల సమ్మేళనముచే ద్రవీభూతమైన సువర్ణపర్వతమువలెను తోచుచుండెను.

బ్రహ్మాండకుణ్డసంఘట్టాత్పరావృత్త్యాచనిర్గతః
మహాస్రోతఃపయఃపూరః సత్వ్యాహతఇవాకరః. 23

మఱియు నది బ్రహ్మాండసంఘట్టనముఁగాంచి యటనుండి వినిర్గతులైనట్టియు స్వస్థానము నుండియు చలింపబడినట్టియు ప్రాణులచే పీడింపబడు జీవుల కాశ్రయభూతమగు విశాల జలప్రవాహముయొక్క ధ్వనివలెను నొప్పుచుండెను.

చంచత్సపక్షశైలేన్ద్రి పక్షపాతచలద్ధ్వనిః
కఠినాపూరణోద్ధూత స్ఫుటచ్ఛైలేన్ద్రికన్దరః. 24

అట చలించుచున్న పక్షములుగల పర్వతములనుండి వాయువుచే గల్గు ధ్వనియుత్పన్నమగు చుండెను. కర్ణకటువుగనున్న వాయువుయొక్క భయంకరనాదములచే పర్వత కందరములు పటాపంచలగుచుండెను.

మన్దరోద్ధూతదుగ్ధాబ్ధి సంక్షోభసదృశాఙ్కః
రతిశ్రుద్ఘుంఘుమాస్ఫోట ఘటితద్వీపజన్తుభూః. 25

అమృతముకొఱకై క్షీరసాగరమును మథించునపుడు గల్గిన ధ్వనివంటిదియు, అమృతముత్పన్నమయినపు డద్దానియందలి ప్రీతిచే దేవాసురులు హర్షోత్కర్షమున భుజాస్ఫాలనమొనర్ప, ఏ శబ్దము సప్తద్వీపములందలి పాణులందఱను వ్యాపించెనో, యద్దాని కనురూపముగ నున్నదియు నగు సమరనాద మపుడుత్పన్నమాయెను.

సేనయోఃక్షుబ్ధయోరాసీ ద్యుద్ధముద్ధతదానవమ్
నిష్పిష్టనగరగ్రామ గిరికాననమానవమ్. 26

క్రుద్ధులగు ఆ సైనికులిరువురకును భయంకరమగు యుద్ధము సంఘటించినది. ఆ యుద్ధమున దానవులుద్ధతులై యుండిరి. నగర గ్రామ పర్వత మనుష్యాదులు సంపీడితము లగుచుండెను.

మహాహేతిశతచ్ఛిన్న దానవాచలపూర్ణదిక్.
అన్యోన్యాహత హేత్యాది చూర్ణపూర్ణామ్బరోదరమ్. 27

తేజోయుక్తమగు శస్త్రములచే ఛిన్నభిన్నములగుచుండిన దానవులనేకులచే యొనర్పబడిన శబ్దముచే దిక్కులు పూర్ణమైయుండెను. పరస్పర ప్రహారముచే శస్త్రాదులవలన నుత్పన్నమైన ధూళిచే నాకసము నిండియుండెను.



భుశుణ్డీమండలాస్ఫోట స్ఫుటన్మేరుశిరఃశతమ్
శరమారుతనిర్గ్లాన దైత్యదేవముఖాంబుజమ్. 28

భుశుండీ సమూహముయొక్క శబ్దముచే మేరుపర్వతశిఖరములు విరుగుచుండెను. వాయువేగముగల్గిన బాణములచే దేవదానవుల ముఖకమలములు త్రెంపబడుచుండెను.

చక్రావర్తశతభ్రాన్త దేవదైత్యాజరత్తృణమ్
సేనాప్రహారకల్లోల వలనావలితాంబరమ్. 29

చక్రరూపమగు యావర్తమున దేవదానవులను పెక్కు శుష్కతృణములు పరిభ్రమించుచుండెను. సేనాప్రహారమను తరంగసముదాయముచే నాకాశము పరివేష్టిత మగుచుండెను.

హేత్యుగ్రవాతనిష్పిష్ట పతద్వైమానికవ్రజమ్
అస్త్రోదితాబ్ధివార్యోఘ ప్లావితవ్యోమపత్తనమ్ 30
వహన్మహాస్త్రపాతాసి శూలశక్తినదీశతమ్
శైలపక్షోద్భటాస్ఫోట లుఠద్బ్రహ్మాణ్డమణ్డపమ్. 31

శస్త్రములను యుగ్రవాయువుచే సమ్మర్దితమై వైమానికులగు దేవతలు క్రిందబడుచుండిరి. వరుణాద్యస్త్రములచే నుత్పన్నమైన సముద్రజలప్రవాహములచే నాకాశమందలి అమరావత్యాది నగరములును కొట్టుకొని పోవుచుండెను. పర్వతపార్శ్వములందలి యుద్ధతులగు వీరులశబ్దములచే బ్రహ్మాండమండపము చలించుచుండెను.

దైత్యపార్ష్ణిప్రహారౌఘ పతల్లోకేశపత్తనమ్
నారీహలహలారావ రణత్కంకణమందిరమ్. 32

దైత్యుల పాదప్రహారములచే యింద్రాదుల నగరములును గూలుచుండెను. స్త్రీల 'హలహలా'రవములచే శబ్దాయమానమగు మందిరములు కంకణయుక్తములుగ నగుచుండెను.

లుఠద్దైత్యబలోద్భూత మత్తాస్రౌఘజలాన్వితమ్.
రక్తధౌతనరాఘోగ్ర ముక్తనాదద్రవజ్జనమ్. 33

అచ్చోటు దోపిడియొనర్చుచున్న దానవసైన్యముచే చలింపచేయుబడుచున్న మదోన్మత్తులగు జనులు యస్త్రసమూహమను జలముతో గూడియుండెను. రక్తమున తడుపబడినవారి భయంకర నాదములచే జనులు పలాయనమగుచుండిరి.

లోకపానీకపామ్భోజ చ్ఛన్నాచ్ఛన్నయమాన్వితమ్
పునఃసురాసురైఘోరైర్లుప్తసైన్యాకులాకులమ్. 34

ప్రాణహరణార్థమొకపు డింద్రాదిసేనానాయకులను కమలములందు భ్రమరమువలె గుప్తముగనుండుచు మరల యుద్ధార్థము వ్యక్తమగుచునున్న యమరాజుతో కూడియున్న సురాసురుల సైన్యసమూహముచే నా యుద్ధభూమి వ్యాప్తమైయుండెను.

సపక్షపర్వతాకార దానవాద్రిగమాగమైః
వహచ్ఛవశవాశబ్ద భూరిభాంకారభీషణమ్. 35

ఱెక్కలుగల పర్వతములవంటి దానవుల గమనాగమనములచే జనులు హతులగుచు
'చచ్చెను చచ్చెన'ను శబ్దములచే నిండినదై యప్ప్రదేశము భయంకరముగ నుండెను.

ఆయుధాగ్రవిభిన్నోగ్ర దైత్యపర్వతనిర్ఝరైః
రక్తైరరుణితాశేష వసుధార్ణవపర్వతమ్. 36

శస్త్రముల యగ్రభాగములచే ఛిన్నులైన దానవుల రక్తప్రవాహములను సెలయేళ్ల
భూసముద్రపర్వతాదులు రక్తవర్ణము లగుచుండెను.

ఉత్పన్నరాష్ట్రనగర విపినగ్రామగహ్వరమ్
ధృతాసంఖ్యాసురేభాశ్వ మనుష్యశవపర్వతమ్. 37

అచట మేర్వాదిపర్వతములు నశించిన రాజ్యనగరారణ్యవనములచే భయంకరములై
అసంఖ్యాకములగు అసుర గజాశ్వమృగములను, మృత జీవుల దేహములను ధరించుచుండెను.

సుతాలోత్తాలనారాచ రాజిరోచితవారణమ్
ముష్టిప్రహారపిష్టాంస మత్తైరావణవారణమ్. 38

ఎత్తైన తాళవృక్షమువలె నతిదీర్ఘమైన బాణములతోగూడి గజసమూహము శోభించు
చుండెను. పిడికిటి దెబ్బలచే నలిగిన స్కంధభాగములుగల మదించిన ఐరావతములు పరుగిడుచుండెను.

కల్పాభ్రపటలాసార భారాదలితపర్వతమ్
మహాశనివినిష్పేష పిష్టోడ్డీనకులాచలమ్. 39

ప్రళయకాలమేఘములచే గల్గిన వృష్టిధారలచే పర్వతములుకూడ విదీర్ణములగుచుండెను.
భయంకర వజ్రపాతముచే చూర్ణమైన మలయాది పర్వతములున్ను యెగిరిపోవుచుండెను.

కుపితాగ్నిజ్వలజ్జ్వాలా జాలజ్వలితదానవమ్
ఏకాఞ్జలిపుటానీత సముద్రోత్సాదితానలమ్. 40

కుపితమగు అగ్నియొక్క జాజ్వల్యమానమగు జ్వాలాసమూహముచే దానవులు దగ్ధమగు
చుండిరి. అంజలియందుగైకొని తేఁబడిన సముద్రముచే అగ్నిశమింప జేయబడుచుండెను.

చండదైత్యాతిసంభార శిలీకృతమహాజ్వలమ్
వనవ్యూహేన్ధనాగ్న్యర్చిర్ద్రావితామ్బుశిలోచ్చయమ్. 41

ప్రచండ దైత్యసమూహముచే విసరబడిన శిలాదులచే జ్వలించుచున్న అగ్నియు శిలా
మయమై శమించుచుండెను. (ఇది దైత్యపరాక్రమము). వనసమూహమను ఇంధనములచే నతిశయించిన
యగ్నిజ్వాలలచే పర్వతములున్ను కరఁగి జలమువలె ప్రవహించుచుండెను. (ఇది దేవపరాక్రమము).

అస్త్రనిర్మితదుర్వార తమఃకల్పాన్తరాత్రికమ్
మాయాసూర్యగణోద్ద్యోతైః పీతాతనుతమఃపటమ్. 42

అస్త్రప్రభావముచే నుత్పన్నమైనదియు, నివారింపనశక్యమును నగు యంధకారముచే నప్పుడు
ప్రళయరాత్రివలె గన్పట్టుచుండెను. మాయారచితమగు సూర్యులప్రకాశముచే వ్యాపింపబడి అంధ
కారమను వస్త్రము పీతవర్ణముగ నొనర్పబడుచుండెను.



మాయాగ్నివర్షనిష్పీత కల్పాభ్రఘనవర్షణమ్
సశీత్కారాగ్నివమన శస్త్రసంఘట్టవర్షణమ్. 43

మాయారచితమగు అగ్నివృష్టి మాయాప్రేరితమగు మేఘవృష్టిని పూర్ణముగ గ్రసించివైచెను.
శీత్కారశబ్దమొనర్చుచు, అగ్నిని గ్రక్కుచున్న శస్త్రముల సంఘట్టనచే అగ్నివృష్టి సంభవించు
చుండెను.

వజ్రవర్షాస్త్రనిర్ధూత శైలవర్షాస్త్రసంభ్రమమ్
నిద్రాబోధాస్త్రయుద్ధాఢ్యం సంఘర్షావగ్రహాశ్రయమ్. 44

వజ్ర వృష్టిరూపమగు యస్త్రములచే పర్వతవృష్టి రూపమగు యస్త్రములు యెగుర
గొట్టబడుచుండెను. అచ్చోటు నిద్రాజాగ్రదవస్థాజనకంబులగు యస్త్రముల యుద్ధముచే పరిపూర్ణ
మగు, శత్రుపరాజయమున కాశ్రయస్థానమునునై యుండెను.

వహత్క్రకచవృక్షాస్త్రం జలాగ్న్యస్మరణాన్ధితమ్
బ్రహ్మాస్త్రయుద్ధవిషమం తతస్తేజోస్త్రసారితమ్. 45

క్రకచ (అంపపు) వృక్షాస్త్రము లట ప్రవహించుచుండెను. మఱియు నాప్రదేశము జలా
గ్నుల యభావమను వ్యామోహముచే నంధకారయుక్తముగను బ్రహ్మాస్త్రయుద్ధముచే భయంకర
ముగను నుండెను. ప్రకాశాంధకారములు రెండును పరస్పర ముత్సాహితములగుచుండెను.

అస్త్రోదీర్ణాయుధానీక నీరన్ధ్రసకలామ్బరమ్
శిలావర్షాస్త్రదలితం వహ్నివర్షాస్త్రభాసురమ్. 46

ఆసుర, పైశాచికాది యస్త్రములచేతను ముద్గరాద్యాయుధములచేతను ఆకాశమండల
మంతయును ఛిద్రరహితమొనర్పబడెను. అచ్చోటు శిలావృష్టిరూపమగు యస్త్రముచే దళితమును,
అగ్నివృష్టిరూపమగు యస్త్రముచే ప్రకాశవంతమునగుచుండెను.

పతాకాస్పృష్టశశిభిశ్చక్రచీత్కారగర్జితైః
ముహూర్తేన రథైర్లంఘితోదయాస్తమయాచలమ్. 47

పతాకములచే చంద్రుని స్పృశించుచున్నవియు, చక్రముల సీత్కారశబ్దము గల్గియున్న
వియు నగు రథములు ఉదయాస్తాచలములఁగూడ లంఘించుచుండెను.

వజ్రప్రహారావిరత మ్రియమాణమహాసురమ్
శుక్రామరమహావిద్యా జీవమానమహాసురమ్. 48

వజ్రప్రహారముచే నిరంతరము మహాయోధులగు యసురులనేకులు మృతినొందుచుండిరి.
శుక్రాచార్యుని సంజీవనీ మహావిద్యచే అసురయోధులనేకు లుజ్జీవింపబడుచు నుండిరి.

విద్రవద్దేవసంఘాతం జయప్రోడ్డామరామరమ్
శుభగ్రహామహాకేతు మాలికానామితస్తతః. 49

ఒకచోట దేవతలు బరుగిడుచుండిరి. మఱియొకచోట వారి జయభేరీ మ్రోగుచుండెను.
మహాకేతుమాలికల కొఱకును, శుభగ్రహదర్శనముకొఱకును జనులచటచట కంఠములెత్తి చూచు
చుండిరి.

ఉత్పాతమఙ్గలౌఘానాం బుద్ధేరుద్ధరకన్ధరమ్
సాద్రిఖోర్వీసముద్రద్యు జగద్రుధిరవారిధి. 50

ఒకచోట యుత్పాతముల మంగళసమూహములను జూచుటకు జనులు కంఠములనెత్తుచుండిరి. ఆకాశ పర్వత సముద్ర భూమ్యంతరిక్షములతో కూడిన జగత్తంతయు రక్తమయమై యుండెను.

ఫుల్లైకకింశుకవనం కుర్వద్దుర్వారవైరతః
పర్వతప్రతిమాసంఖ్యం శవపూర్ణమహార్ణవమ్. 51

నివారించుట కశక్యమగు నా యుద్ధముచే జగత్తు వికసించిన కింశుకవనముగల పర్వతమువలె రక్తవర్ణము గల్గియుండెను. మఱియు మృతిజెందిన యసంఖ్యాకములగు జీవులతో కూడి మహాసముద్రమువలె నొప్పుచుండెను.

సమగ్రతరుశాఖాగ్ర లమ్బలోలమహాశవమ్
దీప్యమానైఃస్వవాతార్తైః పక్షపుష్పైర్లసత్ఫలైః. 52
తాలోత్తాలైః శరవ్రాత వనైర్వ్యాప్తనభస్థలమ్
పర్వతప్రతిమాసంఖ్య కబన్ధశతబాహుభిః. 53
నృత్యద్భిఃపాతితామ్భోద విమానసురతారకమ్
శరశక్తిగదాప్రాస పట్టిశప్రోతపర్వతమ్. 54

వృక్షములన్నింటి యగ్రభాగములందును శవములు వ్రేలాడుచుండెను. సూర్యకిరణములు బాణములందు ప్రతిబింబించుటచే శోభాయమానముగ నుండెను. మఱియు స్వవేగమున నుత్పన్నమైన వాయువుచే చంచలమగు పక్షములను పుష్పములతోను, లోహభాగమను పల్లవములతోను గూడి యుండి తాళవృక్షములవలె దీర్ఘముగానున్నట్టి బాణసమూహములను వనములచే ఆకాశము వ్యాప్తమగుచుండెను. పర్వతములవలె విశాలములైయున్న అసంఖ్యాకములగు కబంధము (మొండెము) లయొక్క యూగుచున్న భుజములు మేఘ, విమాన, దేవతా, నక్షత్రముల బడద్రోయుచుండెను. బాణ, శక్తి, గదాదుల యగ్రభాగమున నిరంతరము ప్రాణులు గ్రుచ్చబడుచుండిరి.

లోకసప్తకవిభ్రష్ట కుడ్యఖణ్డచితామ్బరమ్
అనారతరసన్మత్త కల్పాభ్రదృఢదుందుభి. 55

సప్తలోకములనుండి పడిన కుడ్యాదులచే ఆకాశము వ్యాప్తమైయుండెను. మఱియు ప్రళయకాల మేఘమువలె దుందుభి యహర్నిశము మ్రోగుచుండెను.

ఏవంశబ్దశతోన్నాద పాతాలతలవారణమ్
వినాయకకరాకృష్ట దీర్ఘదానవపర్వతమ్. 56

వివిధశబ్దములచే దిగ్గజములు ఘీంకారము సల్పుచుండెను. వినాయకుని హస్తముచే గొప్ప దానవులను పర్వతములు యీడ్వబడుచుండెను.

ఏకదిక్కరనిష్పన్న సిద్ధసాధ్యమరుద్గణమ్.
పలాయమానగంధర్వ కిన్నరామరచారణమ్. 57



అసురభయంబున బరుగిడుచు దైవవశమున యొక దిక్కునందు కలసికొనిన సిద్ధసాధ్యాది [illegible]గణంబులు చేష్టారహితులగుచుండిరి. గంధర్వులు, కిన్నరులు, దేవతలు, చారణులు పరుగిడు [illegible]చుండిరి. ఇట్లా యుద్ధము మిగుల భయంకరముగ నుండెను.

వపురశనినిపాతఖణ్డితాఙ్గా
దలితశిలాశకలాః కకుమ్ముఖేషు
ప్రలయసమయసూచకాః సురాణాం
సురతరుఘర్ఘర ఘస్మరాఃసమీరాః. 58

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
దామవ్యాళకటసంగ్రామవర్ణనం నామ
షడ్వింశః సర్గః ॥ 26 ॥

ఓ రామా ! వజ్రపాతముచే ప్రాణుల అవయవములను పర్వతములను ఖండించునదియు [illegible]వరల ప్రళయమును సూచించునదియు, కల్పవృక్షములందు వసించు కోకిలాదుల శబ్దముల నశింపఁ జేయునదియు నగు ప్రచండవాయువపుడు దశదిక్కుల వీవదొడఁగెను.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు స్థితిప్రకరణమున
దామవ్యాళకటసంగ్రామ వర్ణనమను షడ్వింశ
సర్గము ॥ 26 ॥

---

## సప్తవింశః సర్గః.

---

శ్రీవసిష్ఠ ఉవాచ :—

తస్మిం స్తదావ ర్తమానే ఘోరేసమరసంభ్రమే
దేవాసురశరీరేషు గర్తేష్వభ్రోదరేష్వివ. 1
వహత్స్వసృక్ప్రవాహేషు గఙ్గాపూరేష్వివామ్బరాత్
దామ్ని వేష్టితదేవౌఘ కృతక్ష్వేడాఘనారవే. 2
వ్యాలేనిజకరాకృష్టి పిష్టసర్వసురాలయే
కటేకటినసంరమ్భ సజ్జరక్షపితామరే. 3
ఐరావతేక్షీణరవే పలాయనపరాయణే
ప్రవృద్ధేదానవానీకే మధ్యాహ్నఇవభాస్కరే. 4
పతితాఙ్గవ్యథార్తాని ప్రస్రవద్రుధిరాణిచ
పయాంసేవావసేతూని దేవసైన్యానిదుద్రువుః. 5

శ్రీ వసిష్ఠుడు :—ఓ రామా! ఇవ్విధమున ఘోర సంగ్రామము జరుగుచుండ, ఆకాశముసుండి గంగానది ప్రవహించునట్లు మేఘములవలె విశాలమైన దేవాసురుల శరీరములందలి వ్రణములనుండి రక్తధారలు ప్రవహించుచుండ దాముడను దైత్యుడు దేవతలఁ బరివేష్టించి సింహనాదం బొనర్చుచుండ, వ్యాళుడు తన హస్తములచే దేవతల స్థానము లన్నింటిని ధ్వంసము జేయుచుండ, భయంకర యుద్ధమున కటుఁడు దేవతల వినాశమొనర్చుచుండ, బలము క్షీణింప ఐరావతము పారిపోవుచుండ, మధ్యాహ్న సూర్యునివలె దానవుల సైన్యము వృద్ధినొందుచుండ, అపుడు అవయవములు భిన్నములగుటచే మిగుల బాధజెందుచు, రక్తముచే పూయబడిన దేహములు గలవారై, బంధము తెగిన జలంబంతయు వీడు చందమున అపుడు దేవతలసైన్యము పరుగిడసాగెను.

దామవ్యాళకటాస్తాని చిరమన్విష్య తానిచ
అనుజగ్ముర్లసన్నాదమిన్ధనానీవ పావకాః. 6

సింహనాదంబొనర్చుచు దామవ్యాళకటులు చిరకాలము దాగుకొనియున్న ఆ దేవతలను, ఇంధనమును అగ్ని వెంబడించునట్లు వెంబడించిరి.

అన్విష్టానపియత్నేన నాలభన్తాసురాః సురాన్
ఘనజాలవనోడ్డీనాన్సింహా హరిణకానివ. 7

కాని ఎంత యత్నించినను, లతాజాలంబులచే దట్టమైన యరణ్యమునందు పారిపోయి యదృశ్యములైన హరిణములను సింహములు గనుగొనజాలనట్లు, అసురులు దేవతలఁగనుగొనరైరి.

అలబ్ధేష్వమరౌఘేషు దామవ్యాళకటాస్తదా
జగ్ముః పాతాలకోశస్థం ప్రభుం ప్రముదితాశయాః. 8

దేవతలెచటను గన్పించనందున, ప్రసన్నచిత్తులై దామవ్యాళకటులపుడు పాతాళకుహరముననున్న తమ ప్రభువగు శంబరుని వద్దకేగిరి.

అథ దేవావిషణ్ణాస్తే క్షణమాశ్వాస్యవై యయుః
జయోపాయాయవిజితా బ్రహ్మాణమమితౌజసమ్. 9

పిమ్మట మిగుల ఖిన్నులైన దేవతలు క్షణకాలము ధైర్యము గొని శంబరుని జయించుటకు తగిన యుపాయమును అడుగుట కొఱకై మహాతేజస్వియగు బ్రహ్మచెంతకు బోయిరి.

తేషామావిరభూద్బ్రహ్మ రక్తరక్తాననశ్రియామ్
సాయంరక్తీకృతామ్భోనామబ్ధీనామివచంద్రమాః. 10

సాయంసమయమున రక్తవర్ణముగానున్న సముద్రజల మధ్యమున చంద్రునివలె, రక్తముఖులై శోభించుచున్న ఆదేవతల మధ్య బ్రహ్మదేవుడు ప్రకటితమాయెను.

ప్రణమ్య తేసురాస్తస్మా అనర్థం శంబరేహితమ్
సమ్యక్క్రకథయామాసు ర్దామవ్యాళకటక్రమమ్. 11

అపుడు దేవతలందఱును బ్రహ్మదేవునకు ప్రణమిల్లి దామవ్యాళకటుల యుత్పత్తి క్రమమున శంబరు డొనర్చుచున్న యనర్థమును బాగుగ వర్ణించి చెప్పిరి.



తదాకర్ణ్యాఖిలం బ్రహ్మా విచార్యసవిచారవిత్
ఉవాచేదంసురానీక మాశ్వాసనకరంవచః. 12

ఆ వృత్తాంతమంతయును విని విచారశీలుడగు బ్రహ్మదేవుడొకింత యోచించి దేవతాసంఘంబునకు ధైర్యము జెప్పి యిట్లనెను—

శ్రీ బ్రహ్మోవాచ:—

శతవర్షసహస్రాన్తే శంబరేణ హరేః కరాత్
మర్తవ్యం సమరే శస్య తత్కాలం సంప్రతీక్షతామ్. 13

ఓ దేవతలారా! నూఱువేల సంవత్సరములైన పిదప సమరాధీశుఁడగు విష్ణుదేవునిచే శంబరాసురుడు తప్పక హతుడగును. కాన యంతవఱకును మీరు ప్రతీక్షించి యుండవలెను.

దామవ్యాళకటానేతానద్య త్వమరసత్తమాః
యోధయన్తః పలాయధ్వం మాయాయుద్ధేన దానవాన్. 14

అందుచే నో దేవప్రముఖులారా! ఇపుడు మీరు కపటయుద్ధముచే దామవ్యాళకటులతో పోరాడుచు పారిపోవుడు.

యుద్ధాభ్యాసవశాదేషాం ముకురాణామివాశయే
అహంకారచమత్కారః ప్రతిబింబముపైష్యతి. 15

అపుడు సంగ్రామాభ్యాసవశమున వారల యంతఃకరణమున దర్పణమున ముఖాదుల వలె, అహంకారప్రతిబింబ ముదయమగును.

గృహీతవాసనాస్త్వేతే దామవ్యాళకటాఽసురాః
సుజేయావోభవిష్యన్తి లగ్నజాలాఃఖగాఇవ. 16

ఓ దేవతలారా! వాసనాసహితులగు దామవ్యాళకటులపుడు జాలబద్ధమగు పక్షివలె సులభముగ జయింప యోగ్యులగుదురు.

అద్యత్వవాసనాహ్యేతే సుఖదుఃఖవివర్జితాః
ధైర్యేణారీన్వినిఘ్నన్తో దేవాదుర్జయతాంగతాః. 17

ఓ దేవతలారా! ఇపుడు వారు వాసనారహితులై సుఖదుఃఖవివర్జితులై యున్నారు. అందుచే ధైర్య పరాక్రములచే శత్రువుల వధించుచున్న మీచే వారు నిర్జింప బడకుండిరి.

వాసనాతన్తుబద్ధాయే ఆశాపాశవశీకృతాః
వశ్యతాంయాన్తి తేలోకే రజ్జుబద్ధాఃఖగాఇవ. 18

వాసనా సూత్రమున బంధింపబడినవారును, ఆశాపాశమున తగుల్కొని యద్దానికి వశులైయున్నవారును రజ్జువుచే బంధింపబడిన పక్షివలె యీ ప్రపంచమున వశీభూతులగుదురు.

యేభిన్నవాసనాధీరాః సర్వత్రాసక్తబుద్ధయః
నహృష్యన్తినకుప్యన్తి దుర్జయాస్తేమహాధియః. 19

వాసనలు నశించినవారును, యెచటను సంసక్తముగాని బుద్ధిగలవారును, సుఖములచే ప్రసన్నులుగాని దుఃఖములచే కృద్ధులుగాని గాక సమభావముగల్గి యుండువారును నగు మహాత్ములను జయించుట మిగుల దుర్లభము.

యస్యాన్తర్వాసనారజ్జ్వా గ్రన్థిబన్ధః శరీరిణః
మహానపి బహుజ్ఞోఽపి స బాలేనాపి జీయతే. 20

వాసనారజ్జువుచే బంధింపబడిన యంతఃకరణముగలవాడెట్టి మహామహుడైనను బహుజ్ఞుడైనను బాలునిచేగూడ జయింపశక్యమై యుండును.

అయం సోఽహమిదం తన్మ ఇత్యాకల్పితకల్పనః
ఆపదాం పాత్రతామేతి పయసామివ సాగరః. 21

'ఈ దేహేంద్రియాదులు నేను, ఈ పుత్రధనాదులు నావి' — ఇత్యాది కల్పనలంజేయువాడు వివిధజలంబులకు సముద్రమువలె సమస్తయాపదలకు పాత్రుడగును.

ఇయన్మాత్రపరిచ్ఛిన్నో యేనాత్మాభవ్యభావితః
స సర్వజ్ఞోఽపి సర్వత్ర పరాం కృపణతాం గతః. 22

సర్వవ్యాపియు, సర్వజ్ఞుడును నగు ఆత్మను, పరిచ్ఛిన్నమగు దేహముగ దలంచుచు, అనగా దేహాత్మబుద్ధిగల్గి వర్తించుచునుండువాడే జననమరణరూపమను దీనత్వమును బొందును.

అనన్తస్యాప్రమేయస్య యేనేయత్తా ప్రకల్పితా
ఆత్మనస్తస్య తేనాత్మా స్వాత్మనైవావశీకృతః. 23

అనంతమును, అప్రమేయమును నగు ఆత్మను శరీరమాత్రముగ కల్పనయొనర్చువాడు తన ఆత్మను తానే యవశమొనర్చినవాడగును.

ఆత్మనో వ్యతిరిక్తం యత్కించిదస్తి జగత్త్రయే
యత్రోపాదేయభావేన బద్ధా భవతు వాసనా. 24

ఈ ముల్లోకములందును ఆత్మకంటె నన్యముగ మఱొకవస్తువున్నచో, అచట ఉపాదేయభావముచే వాసనాబద్ధమైయుండుట యుక్తమగును.

ఆస్థామాత్రమనన్తానాం దుఃఖానామాకరం విదుః
అనాస్థామాత్రమభితః సుఖానామాకరం విదుః. 25

అసద్వస్తువందు సత్యత్వబుద్ధిగల్గి యద్దానిని విశ్వసించుటయే సర్వదుఃఖములకును నిలయమును, అద్దానియందసత్యబుద్ధిగల్గి దానిని విశ్వసింపకుండుటయే సర్వసుఖములకు నిలయమును అగును.

దామవ్యాళకటా యావదనాస్థాభవసంస్థితౌ
తావన్న నామ జేయాస్తే మశకానామివానలాః. 26

దామవ్యాళకటులకు ప్రపంచస్థితియందు సత్యత్వబుద్ధి యెంతవఱకుండునో, అంతవఱకును అగ్నిని మశకములు జయింపజాలనట్లు మిమ్ములజయింప నసమర్థులైయుండురు.



అన్తర్వాసనయా జన్తుర్దీనతామనుయాతయా
జితో భవత్యన్యథా తు మశకోఽప్యమరాచలః. 27

దేహము నశించుటచే ఆత్మయు నశించుచున్నదను యసత్యవాసన యెవని అంతఃకరణమునయుండునో, అతడే జననమరణరూపమగు దీనత్వమునకు లోనగును. అట్టివాడే యితరులచే జయింపబడును. అద్దాని యభావమున అల్పమగు మశకమున్ను సుమేరుపర్వతమువలె యచలముగ నుండును.

విద్యతే వాసనా యత్ర తత్ర సా యాతి పీనతామ్
గుణో గుణిని హి ద్విత్వం సతో దృష్టం హి నాసతః. 28

ఏవాసన యెటయుండునో అదియే నట స్థూలత్వమునొందును. ఏలయన, ధర్మియుండునపుడే స్థూలత్వమను దాని ధర్మమున్ను సంభవించును. మఱియు ఉనికిగల వస్తువునందే ద్విత్వము సంభవించునుగాని అసద్వస్తువునందు కాదు గదా!

అయం సోఽహమిదం చేత్యేవమన్తః సవాసనమ్
యథా దామాదయః శక్ర భావయన్తి తథా కురు. 29

ఓ యింద్రా! 'ఈ ప్రసిద్ధమగు దేహాదులే నేను, ఈ జయాపరాజయములు నావి'-యను వాసన దామవ్యాళకటాదుల యంతఃకరణమున కలుగులాగున యుపాయమొనర్పుము.

యా యా జనస్య విపదో భావాభావదశాశ్చ యాః
తృష్ణాకరఞ్జవల్ల్యాస్తా మఞ్జర్యః కటుకోమలాః. 30

జీవునియొక్క సమస్తవిపత్తులును, భావాభావదశలును తృష్ణయను కంటకవృక్షముయొక్క కటుకోమలత్వములైయున్నవి.

వాసనాతన్తుబద్ధోఽయం లోకో విపరివర్తతే
సా ప్రవృద్ధాతిదుఃఖాయ సుఖాయోచ్ఛేదమాగతా. 31

వాసనాతంతువుచే బద్ధులగువారికే విపరీతజ్ఞానముదయించును. ఆవాసనయే వృద్ధినొందినచో మిగుల దుఃఖమున్ను, ఉచ్ఛిన్నమైన మిగుల సుఖమున్ను గల్గజేయును.

ధీరోఽప్యతిబహుజ్ఞోఽపి కులజోఽపి మహానపి
తృష్ణయా బధ్యతే జన్తుః సింహః శృంఖలయా యథా. 32

ధీరుడైనను, బహుజ్ఞుడైనను, కులీనుడైనను, మహామహుడైనను, సింహము శృంఖలముచే బంధింపబడునట్లు మనుజుడు తృష్ణచే బద్ధుడగుచున్నాడు.

దేహపాదపసంస్థస్య హృదయాలయగామినః
తృష్ణా చిత్తఖగస్యేయం వాగురా పరికల్పితా. 33

దేహమను వృక్షముపై వసించుచు, హృదయకమలమను తన గూటియందు ప్రవేశింపనున్న జీవుడను విహంగమునకొఱకు తృష్ణయను జాలము కల్పింపబడినది.

దీనో వాసనయా లోకః కృతాన్తేనాపకృష్యతే
రజ్జ్వేవ బాలేన ఖగో వివశో భృశముచ్ఛ్వసన్. 34

దాగముచే బంధింపబడినదియు, వివశమై శ్వాసనుగైకొనుచున్నదియు నగు పక్షి బాలునిచే నీడ్వబడునట్లు, తృష్ణయను రజ్జువుచే బంధింపబడిన జీవుడున్ను యమునిచే నీడ్వబడుచుండును.

అలమాయుధభారేణ సంగరభ్రమణేనచ
వాసనాయావిపర్యాసం యుక్త్యాయత్నాద్రిపోఃకురు. 35

ఓ యింద్రా! ఇపుడు శస్త్రాస్త్రముల భారమువహించుట, యుద్ధమున పరిభ్రమించుట వ్యర్థములు. ప్రయత్నముచే కేవలము శత్రుహృదయమున వాసనావిపర్యయము అనగా అభిమాన వృద్ధి గల్గులాగున చూడుము.

అన్తరాత్మభితైర్థైర్యైః రిపోరమరనాయక
నశస్త్రాణినచాస్త్రాణి నశాస్త్రాణిజయన్తిచ. 36

సురనాయకుడవగు నో యింద్రా! అక్షుభితాంతఃకరణముగల శత్రుని శస్త్రములుగాని, అస్త్రములుగాని శుక్రనీత్యాది శాస్త్రములుగాని జయింపజాలవు.

దామవ్యాళకటాస్త్వేతే యుద్ధాభ్యాసవశేనచ
అహంకారమయీంమత్తాస్తే గ్రహీష్యన్తివాసనామ్. 37

దామవ్యాళకటులు యుద్ధాభ్యాసవశమున ప్రమత్తులై సంకల్పముచే అహంకారమయమగు వాసనను పరిగ్రహింతురు.

యదా తేఽత్యజ్ఞపురుషాః శంబరేణవినిర్మితాః
వాసనామాశ్రయిష్యన్తితదా యాస్యన్తిజేయతామ్. 38

ఎపుడు శంబరునిచే సృష్టింపబడిన దామాదులజ్ఞులై వాసనల నాశ్రయింతురో, అపుడే పరాజయమును పొందుదురు.

తత్తావద్యుక్తియుద్ధేన తాన్ప్రబోధయతామరాః
యావదభ్యాసవశతో భవిష్యన్తి సవాసనాః. 39

కాన నోదేవతలారా! అభ్యాసవశమున వాసనాసహితులగునంతవఱకు యుక్తిపూర్వకమగు యుద్ధముచే యీ దామవ్యాళాదులను వ్యవహారమున నియుక్తులగునట్లు చేయుడు.

తతోవశ్యాభవిష్యన్తి భవతాంబద్ధవాసనాః
తృష్ణాఽప్రోతాశయా లోకేనచ కేచన పేలవాః. 40

వాసనాబద్ధులైన పిదప వారు మీవశులగుదురు. వాసనలచే బంధింపబడని వారెవరును శక్తివంతులుగాక యుండరు.

సమవిషమమిదం జగత్సమగ్రం
సముపనతంస్థిరతాం స్వవాసనాస్తః
చలచలలహరీభరో యథాబ్ధా
వతఇహసైవ చికిత్స్యతాంప్రయాతా. 41



ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
పితామహవాక్యం నామ సప్తవింశః
సర్గః ॥ 27 ॥

మిగుల చంచలమగు తరంగసమూహము సముద్రమున జలరూపముగనే యున్నట్లు స్వవాసనయందు ప్రవాహరూపమున నిత్యత్వమునుపొందిన సమ, విషమరూపమగు యీ జగత్తు వాసనారూపమే అయియున్నది. కాన యద్దాని చికిత్సయే నొనర్పవలెను.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు స్థితిప్రకరణమున
పితామహవాక్యమను సప్తవింశ
సర్గము ॥ 27 ॥

---

## అష్టవింశః సర్గః.

---

శ్రీవసిష్ఠ ఉవాచ :—

ఇత్యుక్త్వా భగవాన్దేవాం స్తత్రైవాన్తర్ధిమాయయా
వేలావనితటేశబ్దం కృత్వేవాంబుతరంగకః. 1

శ్రీవసిష్ఠుడు :—ఓ రామా! సముద్రతీరమున తరంగము శబ్దమొనర్చి లీనమగునట్లు, భగవంతుడగు బ్రహ్మదేవుడంతి నప్రదేశముననే యంతర్ధానుడయ్యెను.

సురాస్త్వాకర్ణ్యతద్వాక్యం జగ్ముఃస్వాభిమతాందిశమ్
కమలామోదమాదాయ వనమాలామివానలాః. 2

కమలముయొక్క సుగంధమును గ్రహించి వాయువు వనసమూహము వైపునకుఁబోవు విధమున, దేవతలు బ్రహ్మదేవుని యావాక్యము లాలించి తమ యభీష్టస్థానములకుఁ జనిరి.

దినానికతిచిత్స్వేషు కాన్తేషుస్థిరకాన్తిషు
ద్విరేఫాఇనపద్మేషు మన్దిరేషువిశశ్రముః. 3

రమణీయములును, స్థిరశోభాయుక్తములును నగు తమ మందిరములందు, కమలములందు భ్రమరములవలె వారు కొంతకాలము విశ్రమించిరి.

కంచిత్కాలంసమాసాద్య స్వాతోన్మదయకరంశుభమ్
చక్రుర్దుందుభినిర్ఘోషం ప్రలయాభ్రరవోపమమ్. 4

పిదప స్వాతోన్మదయకరమగు నొక శుభముహూర్తమున దేవతలు ప్రళయకాల మేఘములవలె దుందుభిని మ్రోగించిరి.

అథదైత్యైర్నమావ్యోమ్ని తైఃపాతాలతలేస్థితైః
కాలక్షేపకరం ఘోరం పునర్యుద్ధమవర్తత. 5

తదనంతర మంతరిక్షమున పాతాళమందున్న దైత్యులతోటి దేవతలకు మహాభయంకర మగు యుద్ధము తటస్థించెను.

పవ్రసిశరశక్తి ముద్గరౌఘా
ముసలగదాపరశూగ్ర చక్రశఙ్ఖాః
అశనిగిరిశిలాహుతాశవృక్షా
అహిగరుడాదిముఖాని చాయుధాని. 6

అత్తఱి ఖడ్గములు, బాణములు, శక్తులు, ముద్గరములు, ముసలములు (రోకళ్లు), గదలు, పరశువులు, వేగముగబోవు చక్రములు, శంఖాకారమగు అస్త్రములు, వజ్రపర్వతశిలలు, అగ్నివంటి వృక్షములు, సర్ప గరుడుల ముఖములఁబోలు శస్త్రాస్త్రములు నలువైపుల చలింపదొడఁగెను.

మాయాకృతాయుధ మహాంబుఘనప్రవాహా
క్షిప్రావహాప్రతిదిశం కిలనిర్జగామ
పాషాణపర్వత మహీరుహలక్షవృక్ష
క్షుబ్ధాంబుపూరఘనఘోషవతీ నదీద్రాక్. 7

మాయానిర్మితములగు శస్త్రాస్త్రములను జలముయొక్క వేగయుక్తమగు ప్రవాహము గలదియు, శిలాపర్వత వృక్షములచే జలప్రవాహము సంక్షోభముఁజెంద మిగుల శబ్దమొనర్చు చున్నదియు నగు ఆ శస్త్రాస్త్రరూపిణియగు నది దిక్కులఁగూర్చి ప్రవహింపఁబోవఁగెను.

మధ్యప్రవాహ వహదుల్ముకశూల శైల
ప్రాసాసికున్త శరతోమరముద్గరౌఘా
గంగోపమాంబు వలితామరమన్దిరేణ
సర్వాసు దిక్ష్వశనివర్ష నికర్షణేన. 8

ఆ నదీజలములచే దేవతల మేర్వాదిస్థానములఁ గప్పునదియు, వజ్రాదుల వర్షముచే తీరము ఛేదింపబడ మేరుపర్వతముపై ప్రవహించుచున్న గంగానదివలె నొప్పుచున్నదియు, ప్రవాహమధ్యమున నుల్ముక (కొఱవి), శూల, పర్వత, ఖడ్గ, బాణ, ముద్గరాదులు గలదియునై యుండెను.

పృథ్వ్యాదిదారుణశరీరమపి ప్రహార
దానగ్రహ గ్రహణరాశిశరీరకేవ
మాయోపశామ్యతి సురాసురసిద్ధసన్నా
మాయాకృతిః పునరుదేతినచైవనైవ. 9

ఆ యుద్ధమును నది పంచభూతములవలె మాయామయమై యుండెను. అనగా పృథివి వలె భ్రమణము, పతనము, నిరోధము మున్నగు కార్యముల జేయునదై యుండెను. జలమందు ప్రాణులు మునుగు చుండిరి. అగ్నిచే సంతప్తులగుచుండిరి. వాయువుచే యెగురగొట్టబడుచుండిరి. గర్తమువంటి ఆకాశమునందు బడుచుండిరి. మఱియు నాయుద్ధభూమి మిగుల కఠినములగు రాక్షస పిశాచాదుల శరీరములచే వ్యాప్తమైయుండెను. అచటి సేన యితరులపై ప్రహారము సల్పునదియు



నితరులను వశమొనర్చుకొనునదియు, అన్యులచే జయింప నశక్యులగు యోధులచే పూర్ణమునునై యుండెను. ఇట్టి రూపముననున్న ఆమాయయు సురాసురసిద్ధ సమూహములచే ప్రతీకారమొనర్ప బడినపుడు శాంతించుచు మరల నుత్పన్నమగుచు నుండెను. కాని అయ్యది తన పూర్వరూపమునే గ్రహించియుండెనో లేక మఱియొక రూపమును ధరించెనో తెలియకయుండెను.

శైలోపమాయుధ విఘట్టితభూధరాణి
రక్తాంబుపూరపరిపూర్ణ మహార్ణవాని
దేవాసురేంద్రశవశైల విరూఢకున్త
తాలీవనానికకుభాం వదనానిచాసన్. 10

పర్వతమువంటి యాకృతిగల అస్త్రములచే పర్వతములఁగూడ విదీర్ణమొనర్చువారును, రక్తమను జలముచే సముద్రలఁగూడ నింపువారును నగు సురాసురేంద్రుల శిరములపై గ్రుచ్చబడిన కుంత (ఈటె) సమూహమను తాళవనముచే దిక్కులన్నియు వ్యాప్తమైయుండెను.

ఉద్గీర్ణకున్తశరశక్తి గదాసిచక్ర
హేలానిగీర్ణ సురదానవ ముక్తశైలా
కాషోల్లసత్క్రకచ దన్తనఖాగ్రమాలా
జీవాన్వితా హ్యపతదాయససింహసృష్టిః. 11

కుంత, బాణ, శక్తి, ఖడ్గ, చక్రములచే దేవదానవులున్నూ తమపై పర్వతములుబడినను సహింపగల్గుచు మరల యితరులపై పర్వతముల విసరుచు నుండిరి. ఆయుద్ధభూమి ఛిన్నమొనర్చునట్టి రంపములయొక్క దంతములను నఖాగ్రభాగములచే గ్రుచ్చబడినమాలను ధరించియుండెను. ఇతరుల జీవముల గ్రహించుటచే జీవయుక్తమైయున్న లోహమయమగు అస్త్రములను సింహసమూహము పై నుండి పడెను.

ఉజ్జ్వాలలోచన విషజ్వలనాతపౌఘ
దిగ్దాహదర్శిత యుగాన్తదినేశసేనా
ఉడ్డీయమానపరిదీర్ఘ మహామహీధ్ర
మగ్నాబ్ధివద్విషధరావలిరుల్లలాస. 12

నేత్రవిషజ్వాలలచే నుత్పన్నమైన యుష్ణత్వముచే దిక్కుల సంతప్తమొనర్చుచు ప్రళయ కాలమందువలె నొకేసమయమున ద్వాదశాదిత్యులఁ దర్శింపఁజేయుచున్న విషసర్పములు, నలువైపుల నెగురుచున్న విశాలపర్వతములచే వ్యాపించిన సముద్రమువలె శోభించుచుండెను.

ఉన్నాదవజ్రమకరోత్కరకర్కశాస్త్ర
క్షుబ్ధాబ్ధివీచివలయైర్వలితాచలేన్ద్రైః
ఆసీజ్జగత్సకలమేవ సుసంకటాఙ్గ
నూనమ్రుత్రిభిర్వివిధహేతి నదీప్రవాహైః. 13

మేరుపర్వతమునుకూడ గప్పు పలువిధయస్త్రములను నదీప్రవాహములచే మిగుల శబ్ద మొనర్చునదియు, రత్నమకరాదులచే కర్కశమున్న, లోన క్షుభితమైయున్నదియు నగు సముద్రము యొక్క తరంగములచే జగత్తంతయు వ్యథఁజెందెను.

శైలాస్త్రశస్త్రగరుడాచలచాలితోచ్చ
నాగంమహాసురగణాఙ్గణ మన్తరిక్షమ్
ఆసీత్క్షణం జలధిభిః క్షణమగ్నిపూరైః
పూర్ణంక్షణం దినకరైః క్షణమన్ధకారైః. 14

పర్వతములవంటి అస్త్రశస్త్రములచేతను, మాయారచితములగు గరుడులచేతను, బలముచే పెరకి విసరివేయబడిన పర్వతములచేతను, విక్షుబ్ధమొనర్పబడిన, (సర్పసహితులగు దేవదానవుల యొక్క యుద్ధమునకు ప్రాంగణమువలెనున్న) యంతరిక్షమొక క్షణమున సముద్రములచే వ్యాప్తమయ్యు, మఱియొక క్షణమున అగ్నిసమూహములచేతను, సూర్యులచేతను, అంధకారములచేతను పూర్ణమగుచు నుండెను.

గరుడగుడగుడాకులాన్తరిక్ష
ప్రవిసృతహేతిహుతాశపర్వతౌఘైః
జగదభవదసహ్య కల్పకాలే
జ్వలితసురాలయ భూతలాన్తరాళమ్. 15

గరుడాస్త్రముచే నుత్పన్నమైన గుడగుడారవముచే వ్యాప్తమైయున్న అంతరిక్షమున విశాలశస్త్రములను అగ్నిపర్వతసమూహములచే సహింపనశక్యమగుచు, జగత్తు ప్రళయకాలమునందు వలె జాజ్వల్యమానమై యొప్పుచున్న దేవతలస్థానములను, భూమ్యాకాశముల యంతరాళమును గల్గి యున్నదాయెను.

ఉదపతన్నసురా వసుధాతలా
ద్గగనమద్రితటాదివ పక్షిణః
అతిబలాదపతన్విబుధాభువి
ప్రళయచాలితశైలశిలాఇవ. 16

అపుడు పర్వతతటమునుండి పక్షివలె భూమిపైనుండి యసురులు పైకెగిరిరి. మఱియు ప్రళయకాలమున చలింపబడిన పర్వతశిలవలె ఆకాశమార్గమునుండి దేవతలు భూమిపైబడిరి.

శరీరరూఢోన్నత హేతివృక్ష
వనావలీలగ్నమహాగ్నిదాహాః
సురాసురాః ప్రాపురథాంబరాన్తః
కల్పానిలాన్దోలితశైలశోభామ్. 17

దేహమున గ్రుచ్చబడిన తీక్ష్ణశస్త్రములను వనసమూహములతోకూడి అగ్నిదాహయుక్తులై యున్న సురాసురులు ప్రళయవాయువుచే పరిభ్రమించునట్టి జ్వలించుచున్న పర్వతములవలె శోభించు చుండిరి.



సురాసురాద్రీన్ద్రశరీరముక్తై
రక్తప్రవాహై రభితో భ్రమద్భిః
బభౌరపూర్ణం పరితో ఽమ్బరో ఽద్రేః
సంధ్యాకరౌఘ క్షతమజ్జగఙ్గామ్. 18

ఓ రామా! సుమేరుపర్వత ప్రాంత యాకాశమను నాయకుడు విశాలపర్వతములవంటి సురాసురుల దేహములనుండి వినిర్గతమై నలువైపులకేగుచున్న రక్త ప్రవాహములచే పూర్ణమైన, సంధ్యా [illegible] (శ్వేత గంగానదీ రూపమగు) నాయకురాలియొక్క కరస్పర్శను గావించునట్లుండెను.

గిరివర్షణమమ్బువర్షణం
వివిధోగ్రాయుధ వర్షణంతథా
విషమాశని వర్షణంచతే
సమమన్యోన్య మథాగ్నివర్షణమ్. 19

ఆ దేవాసురులొండొరులపై యొకపుడు పర్వతములయొక్కయు, మఱొకపుడు జలము యొక్కయు పలువిధములగు తీక్ష్ణములైన శస్త్రాస్త్రములయొక్కయు, భయంకర వజ్రములయొక్కయు వృష్టిని గురిపించుకొనుచుండిరి.

అనయన్నయమార్గ కోవిదా
దలితాశేషగిరీన్ద్రభిత్తయః
ససృజుశ్చసమం సమన్తతః
కరికుమ్భేష్వివ పుణ్యవర్షణమ్. 20

నీతిమార్గమందు ప్రవీణులును, మేరుపర్వతకుడ్యమునుగూడ విదీర్ణమొనర్చువారును నగు సురాసురులు, ఉత్సవసమయములందు కుంకుమ చందనాదియుక్తమగు జలమును యేనుగుల గండస్థలములపై జల్లునట్లు, పరస్పరము శస్త్రాస్త్రముల వృష్టిఁ గావించుకొనుచుండిరి.

దేవాసురాః సమరసంభ్రమమాకులాస్తే
అన్యోన్యమర్దనాకులహేతిహస్తాః
నాగేన్ద్రడిమ్భపృతనా పృథుపీఠపృష్ఠైః
కీర్ణశ్రియా నభసి బభ్రమురక్షిపన్తః 21

పరస్పరయంగసమ్మర్దనమున వ్యగ్రములగు (ఆయుధయుక్త) హస్తములుగల దేవాసురులు సమరోత్సాహమును త్యజింపక ఐరావతములయొక్కయు తదితర గజసమూహములయొక్కయు పీఠమువంటి పృష్ఠభాగములపై బాధాజనకమగు విశేష సంభారయుక్తముగ నారోహించి యాకాశమున సంచరించుచుండిరి.

ఛిన్నైః శిరఃకరభుజోరు భరైర్భ్రమద్భి
రాకాశకాష్ఠశకలైరశివైస్తదానీమ్
ఆసీజ్జగజ్జఠర మభ్రభరైరివోగ్రై
రాభాస్కరస్థగితదిక్తటశైలజాలమ్. 22

ఆకాశమందును దిక్కులందును ఛిన్నములగు శిర, హస్త, భుజ జంఘాదులను అశుభ పదార్థములు శలభములవలె పరిభ్రమించుచు, సూర్యునిపర్యంతము నాచ్ఛాదించుచుండ, వాటిచే పర్వత దిక్సహితమగు జగత్కోశమంతయు మేఘములచేవలె పూర్ణమైయుండెను.

రటద్భటాస్ఫోట కటీస్ఫుటద్భిః
సమీరితైర్వ్యేతికరాసితాఙ్గైః
పరస్పరాఘాతహతైః పతద్భి
ర్జగామశీర్ణా దలశోధరిత్రీ. 23

ఆక్రందన మొనర్చుచున్న వీరులనూర్తిచే కటిప్రదేశము ఛిన్నమగుచుండ పరస్పర యాఘాతములచే వ్రాలుచున్న శస్త్రిములచేతను, యంత్రక్షేపణ కౌశల్యముచే విసరబడిన శిలాపర్వత సమూహములచేతను భూమి వ్రక్కలగుచుండెను.

అన్యోన్యమాయుధశిలాచలవృక్షవర్షై
ర్మేరుప్రమాణకఠినాఙ్గ నిఘర్షణైశ్చ
ఆసీద్రణం చటచటాస్ఫుటద న్తరిక్షం
కల్పక్షయా న్తమివ భీమభరోగ్రనాదైః. 24

పరస్పర అస్త్ర, శిరా, పర్వత, వృక్ష, వర్షములచే పరిపూర్ణమై మేరుపర్వతమువలె కఠినమైన అవయవములయొక్క సంఘట్టనచే నుత్పన్నమైన భయంకర శబ్దములచే చటచటాశబ్దయుక్తమగుచు నారణరంగము కల్పాంతదృశ్యమువలె నాయెను.

మత్తానిలక్షుబ్ధ జలానలార్క
దలద్వయం దీర్ఘ సురాసురౌఘమ్
బ్రహ్మాణ్డ మాఖణ్డితకుడ్యకోణ
మకాలకల్పా న్త కరాలమాసీత్. 25

ప్రచండవాయువుచే సంక్షుబ్ధమైన జలాగ్నులను దళమధోభాగమునను, సూర్యుడను దళ మూర్ధ్వభాగమునను గల్గినదియు, అనేక మాయావిభవంబుల నెఱింగిన సురాసురులగలదియు, యిట నట విదీర్ణములైన ప్రదేశములతో కూడి యొప్పుచున్నదియు నగు ఆబ్రహ్మాండము అకాలకల్పాంతము వోలె భయంకరముగ నుండెను.

భ్రాన్తైర్భృశం భరితది క్తటమద్రికూటై
రాత్మప్రమాణఘనహేతిహతై రణద్భిః
కూజద్భిరార్తిభిరివోగ్ర గుహోచ్చవాతైః
క్రన్దద్భిరాపతిత సింహరవై రదభ్రైః. 26

అపువలె విశాలాకృతిగల శస్త్రముల ప్రహారములచే పరిభ్రమించుచున్నవియు, భయంకరమగు గుహలయందు చలించు వేగయుక్తమగు వాయువులచే శబ్దితములై యఱచుచున్నట్లున్నవియు, వినిర్గతము



గుచున్న సింహాలములయొక్క శబ్దములతో కూడి రోదన మొనర్చుచున్నవియు నగు పర్వత సమూహములచే నా రణరంగముయొక్క దిక్తటములన్నియు పూర్ణమై యొప్పుచుండెను.

మాయానదీజలధియోధ ఘనాగ్నిదాహై
ర్వృక్షైః సురాసురశనై రచలైః శిలోచ్చైః
భ్రాన్తైః శరాసిశితశక్తిగదాస్త్రశస్త్రై
ర్వ్యాప్తావకీర్ణ వనపర్ణ వద న్తర న్తః. 27

మాయా నిర్మితములగు నదీ, సముద్ర, మేఘాగ్నులచేతను, వృక్షములచేతను, సురాసురుల [illegible] లతోడను, పెద్దపెద్ద పర్వతశిలాదులతోను, వాయువుచే పడద్రోయబడి యందు పరిభ్ర [illegible] మించుచు [illegible] తీక్ష్ణశర, ఖడ్గ, శక్తి గదాస్త్రశస్త్రాదులతోను జగత్తు పూర్ణమైయుండెను.

అద్రీన్ద్రపక్షపరిమాణగమాక్షమోక్త
దుర్వారహస్తి బలదారుణదేహకైర్ద్రాక్
ఆసీత్పతద్భట శరీరగిరీన్ద్రవాత
విభ్రష్టదేవపురపూర్ణ జలార్ణవౌఘమ్. 28

మేరుపర్వతమువంటి యాకృతికలవియు, అందుచే మనుజసంచారమును నిరోధించుచున్నవియు, దుర్నివార్యములును నగు గజసమూహములయొక్క మృతశరీరములతోడను, పడుచున్న వీరుల దేహములతోను, ఉన్నత పర్వతంబులతోను, వాయువుచే పడద్రోయబడిన దేవనగరములతోను పూర్ణమై యారణరంగము సముద్రమువలె గన్పట్టుచుండెను.

ఘనఘుంఘుమపూరితా న్తరిక్షా
క్షతజక్షాలితభూధరాధరా చ
రుధిరహ్రదవృ త్తివ ర్తినీవా
భువనాభోగగుహా తదాకులాభూత్. 29

ఘనమగు ఘుంఘుమనాదంబుచే యాకసమును పూర్ణమొనర్చునదియు, పర్వత పృథివీ పాతాళాదులను రక్తముచే క్షాళనమొనర్చునదియు, రక్తపిపాసకులగు రాక్షస పిశాచాదులవలె వ్యవహరించుచున్నదియు నగు బ్రహ్మాండోదరమను గుహ వ్యాకులమయ్యెను.

అనంతదృక్ప్రసృత వికారకారిణీ
క్షయోదయోన్ముఖసుఖదుఃఖశంసినీ
రణక్రియాసురసురఘట్ట సంకటా
తదాభవత్ఖలు సదృశీహ సంసృతేః. 30

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
దామవ్యాలకట పునర్యుద్ధవర్ణనం నామాష్టావింశః
సర్గః ॥ 28 ॥

దీర్ఘదర్శులగు యింద్రాదులకుగూడ మిగుల భయమును గొల్పునదియు, ఆత్మచైతన్యము జగద్రూపమగు వికార ముత్పన్నముచేయునదియు, క్షయాభిముఖులగు జీవులకు దుఃఖమును, ఉత్తములకు సుఖమును గల్గజేయునదియు, సురాసురుల పరస్పరసమాగమముచే దుస్తరమును నగు ఆ యుద్ధక్రియ అపునవిద్యాది సంసారమువలె నాయెను.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు స్థితిప్రకరణమున
దామవ్యాళకట పునర్యుద్ధవర్ణనమను అష్టావింశ
సర్గము ॥ 28 ॥

---

## ఏకోనత్రింశః సర్గః.

---

శ్రీవసిష్ఠ ఉవాచ :—

ఏవంప్రాయాకులారమ్భైరసుక్తైరసుహారిభిః
సహసా హృతసంరబ్ధైరారబ్ధః సుమహాన్రణః. 1

శ్రీవసిష్ఠుడు :— ఓ రామచంద్రా ! ఇవ్విధమున నానాశీలమగు క్రియలనుపక్రమించువారును, ప్రాణహరులును, ఆకస్మిక యుద్ధతత్పరులును నగు దైత్యులు భయంకరమగు యుద్ధమును ప్రారంభించిరి.

మాయయాథ వివాదేనసన్ధినా విగ్రహేణచ
పలాయనేనధైర్యేణ చ్ఛన్నగోపాయనేనచ. 2
కార్పణ్యేనాస్త్రయుద్ధేన స్వాస్త్రధారానైశ్చభూరిశః
ధృతఃససంగరో దేవైస్త్రింశద్వర్షాణి పఞ్చకమ్. 3
వర్షాణిదివసాన్మాసాన్దశాష్టౌ సప్తపఞ్చచ
వర్షాణిపేతుర్వ్రజ్రాగ్ని హేత్యేకాశనిభూభృతామ్. 4

ఇక దేవతలొకపుడు మాయావివాదముతోను, మఱొకపుడు దానాద్యుపాయరూపమగు సంధిచేతను, విగ్రహముచేతను, పలాయనముచేతను, ఒకపుడు ధైర్యముచేతను యుద్ధక్రియను కొనసాగించుచుండిరి. ఒకపుడు రహస్యముగ దాగుకొని స్వీయజనరక్షణ గావించుచుండిరి. మఱియొకపుడు శరణాగతి కోరుచును, అస్త్రశస్త్రాదులతోకూడి ప్రవర్తించుచును, అనేక పర్యాయములంతర్ధానమగుచును సంగ్రామ మొనర్చుచుండిరి. అందు మొదటియుద్ధము ముప్పది వత్సరములును, రెండవది ఐదు వత్సరముల యెనిమిది మాసముల పదిదినములును మూడవది పండ్రెండుదినములును పరిమితి గల్గియుండెను. అత్తఱి యిరుసేనలనుండియు అస్త్ర శస్త్ర వజ్ర పర్వత వృక్షాగ్నుల వృష్టి గురిసెను.

ఏతావతాతుకాలేన దృఢాభ్యాసాదహంకృతేః
దామాదయోఽహమిత్యాస్థాం జగృహుర్గ్రస్తచేతసః. 5



ఇంతలో అహంకారముయొక్క దృఢాభ్యాసముచే వాసనాగ్రస్తులైన దామవ్యాళాదులు అహంభావమును పరిగ్రహించిరి.

నైకట్యాతిశయాద్యద్వద్దర్పణం బింబవద్భవేత్
అభ్యాసాతిశయాత్తన్వత్తే సాహంకారతాంగతాః. 6

సామీప్యకారణమున దర్పణము బింబసదృశమగునట్లు అభ్యాసాధిక్యముచే వారందఱును అహంకారయుక్తులైరి.

యద్వద్దూరగతంవస్తు నాదర్శేప్రతిబింబతి
పదార్థవాసనాతద్వదనభ్యాసాన్న జాయతే. 7

దూరమందున్న వస్తువు అద్దమున ప్రతిబింబించనట్లు, అభ్యాసాభావముచే పదార్థముయొక్క వాసనయు నుదయింపదు.

యదాదామాదయోజాతా అహంకారాత్మవాసనాః
తదామేజీవితంమేఽర్థ ఇతిదైన్యముపాగతాః. 8

దామాదుల కహంకారమువనే ఆత్మబుద్ధి యెపుడుగల్గెనో, అప్పటినుండియు 'నేము జీవింపవలెను, జీవితార్థము మాకు ధనము ప్రాప్తింపవలెను', అని యివ్విధమున తలంచుచు మిగుల దీనత్వము నందిరి.

భవవాసనయాగ్రస్తా మోహవాసనయాతతః
ఆశాపాశనిబద్ధాస్తే తతఃకృపణతాంగతాః. 9

ప్రథమమున విహితనిషిద్ధ ప్రవృత్తులంగూర్చిన వాసనచేతను, పిదప 'మాదేహము రోగరహితముగను భోగసమర్థమును యగుగాక' యను మోహవాసనచేతను వారు గ్రస్తులైరి. ఆ పిమ్మట ఆశాపాశమున బంధింపబడి తదనంతరము దైన్యమునొందిరి.

ముగ్ధేవహ్యనహంకారైర్మమత్వముపకల్పితమ్
రజ్జ్వాంభుజగత్వమివ దామవ్యాలకటైస్తతః. 10

ముగ్ధస్త్రీవలె అహంకారరహితులగు దామవ్యాళకటులు రజ్జువునందు సర్పమువలె మమత్వకల్పనాయుక్తులైరి.

ఆపాదమస్తకోదేహః కథంమేభవతుస్థిరః
మమేతితృష్ణాకృపణా దీనతాంతేసమాయయుః. 11

'ఆపాదమస్తకము మాదేహమెట్లు సుస్థిరముగనుండునో'ను యాశతోకూడి, అట్టి తృష్ణచే వారు దీనత్వముఁజెందిరి.

స్థిరోభవతుమేదేహః సుఖాయాస్తుధనంమమ
ఇతిబద్ధధియాంతేషాం ధైర్యమస్తమిమాయయా. 12

'మాశరీరము స్థిరముగనుండుగాక, ధనము మాసుఖముకొఱకే యగుగాక' — అని యిట్లు తలంచుచు బద్ధచిత్తులైయున్న దామవ్యాళకటుల ధైర్యమపుడస్తమించెను.

సవాసనత్వాద్వపుషా మల్పసత్వాత్సురద్విషామ్
యాతుప్రహారపరతా మార్జితేవాశుసాభవత్. 13

వాసనాసహితులగుటచే దేవతల శత్రువులగు దానవుల శరీరబలము సన్నగిల్ల, వారల పూర్వపు పరాక్రమము, శత్రుప్రహార-తత్పరతము శీఘ్రముగ లోపించినదై కార్యమొనర్చుటయందసమర్థమాయెను.

కథంసురాజగత్యస్మిన్భవామ ఇతిచిన్తయా
వివశాదీనతాంజగ్ముః పద్మాఇవనిరమ్భసః. 14

'ఈ ప్రపంచమున మరణరహితులమై యెట్లుండగలము'ను చింతచే వివశులై జలరహితమగు కమలముల వలె వారు దైన్యమునొందిరి.

తేషాంయోషాన్నపానేన స్వాహంకృతిమతాంరతిః
బభూవభావభావస్థా భీషణా భవభాజినీ. 15

అహంకారయుతులైయున్న ఆ దామవ్యాళికటాదుల కపుడు, భయంకర సంసారమును ప్రాప్తింపజేయు స్త్రీ, యన్నపానాది విషయభోగములందలి ప్రీతి యుత్పన్నమాయెను.

అథతస్మిన్రణేభీత్యా సాపేక్షత్వముపాయయుః
మత్తేభఘనసంరబ్ధే వనేహరిణకాఇవ. 16

అటుపిమ్మట యారణరంగమున మత్తగజంబులు కుపితములుకాగా భయముచే వనమందలి హరిణములవలె వారు (జీవితమునుగూర్చిన) సాపేక్షత్వమునొందిరి.

మరిష్యామోమరిష్యామ ఇతిచిన్తాహతాశయాః
మన్దంమన్దంకిలభ్రేముః కుపితైరావణేరణే. 17

ఐరావతమను యేనుగ రణరంగమున కుపితమవ, 'చచ్చెదము' 'చచ్చెదమ'ను చింతచే హతోత్సాహులై ఆదానవులు మెల్లమెల్లగ సంచరింపదొడగిరి.

శరీరైకార్థినాంతేషాం భీతానాంమరణాదపి
అల్పసత్త్వతయామూర్ధ్ని కృతమేవపరైఃపదమ్. 18

కేవలము దేహరక్షణను మాత్రమే వాంఛించుచు, మరణముయెడ భయభీతులైయున్న ఆ దామాదులబలము సన్నగిల్ల అపుడు వారి శిరంబులపై శత్రువులు పాదక్షేపమొనర్చిరి.

అథప్రమ్లానసత్త్వాస్తే హన్తుమగ్రగతంభటమ్
నశేకురిన్ధనేక్షీణే హవిర్దగ్ధుమివాగ్నయః. 19

ఇంధనము క్షీణింప అగ్ని హవిస్సును దగ్ధమొనర్ప నసమర్థమగునట్లు, పరాక్రమము క్షీణింప వారెదుటనున్న యొక్క వీరునిగూడ వధింప జాలకుండిరి.

విబుధానాంప్రహరతాం మశకత్వముపాగతాః
క్షతవిక్షతసంఘాతాస్తస్థుః సామాన్యసద్భటాః. 20



ప్రహారమొనర్చుచున్న దేవతలయెదుట వారు మశకతుల్యులై యుండిరి. మఱియు శరీరమందటచట గాయములు తగులుటచే సామాన్యులగు ఉత్తమవీరులవలె మాత్రముండిరి.

బహునాత్రకిముక్తేన మరణాద్భీతచేతసః
దైత్యాదేవేషువల్గత్సు దుద్రువుఃసమరాజిరాత్. 21

కార్యేల, దేవతలు విజృంభింప మరణభీతులగు దైత్యులు యుద్ధభూమినుండి పరుగిడిరి.

తేషుద్రవత్సుభీతేషు సర్వతోదానవాదిషు
దామవ్యాలకటాఖ్యేషు విఖ్యాతేషుసురాలయే. 22
తద్దైత్యసైన్యం న్యపతద్విద్రుతంఖాదితస్తతః
కల్పాన్తపవనోద్ధూతం తారాజాలమివాభితః. 23

స్వర్గమున సుప్రసిద్ధులగు దామవ్యాళికటులున్ను తదితర దానవులున్ను భయభీతులై పరుగిడ, అపుడు ప్రళయవాయువుచే చలింపబడిన నక్షత్రములు నలువైపులనుండి పడునట్లు దైత్యుల సేనయు యాకసమునుండి క్రిందపడెను.

అమరాచలకుఞ్జేషు శిఖరాణాంశిఖాసుచ
తటేషువారిరాశీనాం పయోదపటలేషుచ. 24
సాగరావర్తగర్తేషు శ్వభ్రేషూద్యత్సరిత్సుచ
జఙ్గలేషుదిగన్తేషుజ్వలత్స్వపివనేషుచ. 25

అత్తటి సుమేరుపర్వత కుంజములందును, పర్వతశిఖములపైనను, సముద్రతీరములందును, మేఘపటలములందును, ఆవర్తయుక్తమగు సముద్రజలమందును, ప్రవృద్ధములగు నదులందును, అరణ్యములందును, దిగంతములందును, జ్వలించుచున్న వనములందును దానవులు పడసాగిరి.

తద్బాణోచ్ఛిన్నదేశేషు గ్రామేషునగరేషుచ
అటవీషూగ్రపక్షాసు మరుభూమిదవాగ్నిషు. 26

దేవతల బాణములచే వినాశమొనర్చబడిన దేశములందును, గ్రామములందును, నగరములందును, సింహాదులనివాసస్థానమగు యరణ్యములందును, మేరుపర్వతస్థ దావాగ్నులందును దానవులు పడిరి.

లోకాలోకాచలాన్తేషు పర్వతేషుప్రదేశేషుచ
ఆన్ధ్రద్రవిడకాశ్మీర పారసీకపురేషుచ. 27
నానామ్భోధితరంగాసు గఙ్గాజలఘటాసుచ
ద్వీపాన్తరేషుజాలేషు జమ్బూఖణ్డలతాసుచ. 28
సర్వతఃపర్వతాకారాః పతితాస్తేసురారయః
విస్ఫోటితాఙ్గచరణా విభిన్నకరబాహవః. 29

లోకాలోక పర్వతాంతములందును, సామాన్యపర్వతములపైనను, జలాశయములందును, ఆంధ్ర ద్రవిడ కాశ్మీర పారశీక దేశాదులందలి నగరములందును, మిగుల వ్యాప్తమును సముద్ర

వాహినియు నగు గంగానదియొక్క ప్రవాహములందును, మత్స్యములకొఱకై పఱచిన వలలుగల ద్వీపాంతరములందును, జంబూఖండమను దేశమందలి లతలందునుగూడ దేవతల శత్రువులగు ఆ దైత్యులు పడిరి. అట్లు పడుటచే వారి బాహు హస్తపాదాద్యంగములు ఛిన్నభిన్నములయ్యెను.

శాఖాలగ్నాంత్రతన్త్రీకా ముక్తరక్తభరచ్ఛటాః
వ్యస్తశేఖరమూర్ధానో నిష్క్రాన్తాః కుపితేక్షణాః. 30

వృక్షశాఖలందు వారి ప్రేవులను తంతిసమూహములు చుట్టుకొనియుండెను. శిరోభూషణములు కేశములు చెల్లాచెదరయ్యెను. అపుడు వారు వినిర్గతులైన కుపితనేత్రధారులవలె నన్పట్టుచుండిరి.

సాయుధాబలమాయేషు చ్ఛిన్న కఙ్కటహేతయః
దూరాపాతవిపర్యస్త పతన్నానాయుధాంశుకాః. 31

శస్త్రాస్త్రసహితమగు సైన్యముచేతను మాయలచేతను బాణములచేతను వారి బాణాద్యాయుధములు ఛిన్నభిన్నము లొనర్పబడెను. మఱియు దూరదేశమునుండి పడుటచేతను, పలాయనమొనర్చుటచేతను, వారి వివిధ శస్త్రాస్త్రివస్త్రములన్నియు విపర్యాసమున క్రిందపడెను.

కణ్ఠలమ్బిశిరస్త్రాణ చటత్కారోగ్రభీతయః
శిఖాశతశిలాప్రోతా దేహభాగవిలమ్బినః. 32

కంఠమున సంలగ్నమైన కిరీటముల 'చటచటా' శబ్దములచే భయవిహ్వలులైన ఆ దానవులు అగ్రభాగమున పలుశిఖలుగల్గియున్న శిలలందు గ్రుచ్చబడుటచేతను మొండెములు మాత్రముగల్గి వ్రేలాడుచుండిరి.

శాల్మల్యుగ్రదృఢాపాత కటత్కణ్టకసంకటాః
సుశిలాఫలకాస్ఫాల శతధాశీర్ణమస్తకాః. 33

శాల్మలీవృక్షములపైబడుటచే ముండ్లుగ్రుచ్చుకొన, వారు మిగుల యాపద్గ్రస్తులైరి. మఱియు పెద్దపెద్దశిలలు పడుటచే వారి మస్తకముల నేక వ్రక్కలయ్యెను.

సర్వఏవ సకలాయుధశస్త్రి
పాతమాత్రసమనన్తరమేవ
దిక్షు నాశమగమన్న సురేన్ద్రాః
పాంసవోఽమ్బుద నిభాపయసీవ. 34

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
దామవ్యాళకటోపాఖ్యానే అసురపరిభ్రంశో
నామైకోనత్రింశః సర్గః ॥ 29 ॥

శస్త్రాస్త్రములన్నియు వ్రాలిన యనంతర మాయసురేంద్రులందఱును వర్షాకాల జలమందు ధూళివలె దిక్కులందు విలీనమైరి.



ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు స్థితిప్రకరణమున
దామవ్యాళకటోపాఖ్యానమందు అసురపరిభ్రంశమను
ఏకోనత్రింశ సర్గము ॥ 29 ॥

---

## త్రింశః సర్గః.

---

శ్రీవసిష్ఠ ఉవాచ :—

ఇతితుష్టేషు దేవేషు దానవేషు హతేషు చ
దామవ్యాలకటాదీనాం బభూవుర్భయవిహ్వలాః. 1

శ్రీవసిష్ఠుడు :— ఓ రామా! ఇవ్విధమున దానవులు నశింప, దేవతలు సంతుష్టులవ దామవ్యాళకటులు భయవిహ్వలులును దుఃఖితులునునైరి.

జజ్వాలకుపితః క్వేతి కల్పాన్తాగ్నిరివజ్వలన్
శంబరః శమితానీకో దామవ్యాలకటాన్ప్రతి. 2

పిమ్మట సైన్యమంతయు నశించిన శంబరాసురుడు ప్రళయాగ్నివలె మండిపడుచు దామాది దానవులయెడ క్రుద్ధుడై 'వారెచటనున్నార'ని ప్రశ్నింపదొడగెను.

శంబరస్యభయాద్గత్వా పాతాలమథసప్తమమ్
దామవ్యాలకటాస్తస్థుస్త్యక్త్వాథ నిజమణ్డలమ్. 3

అంత దామవ్యాళకటులు శంబరుని భయముచే తమ సైన్యమును వీడి సప్తమమగు పాతాళమునకేగి యట నివసింపదొడగిరి.

యమస్యకింకరాయత్ర యేకాలత్రాసనక్షమాః
కుతూహలేన తిష్ఠన్తి నరకార్ణవపాలకాః. 4

అచట, మృత్యువువలె బాధింప సమర్థులును, నరకమను సముద్రమును పాలించువారును నగు యమకింకరులు కౌతుకముతో వసించుచుండిరి.

తే తేషామథ యాతానాం దత్త్వాభయమభీరవః
చిన్తా ఇవఘనాకారాః కుమారీశ్చ దదుః క్రమాత్. 5

నిర్భయులగు ఆ యమకింకరులు శరణాగతులైన దామవ్యాళకటుల కభయదానమొసంగి, మూర్తీభవించిన చింతవోలెనున్న తమకన్నియలఁ గ్రమముగ వారి ముగ్గురకర్పించిరి.

తైః సార్ధంనీతవన్తస్తే తత్రదామాదయోఽవధిమ్
దశవర్షసహస్రాన్తమాత్తానన్తకువాసనాః. 6

దామాదులచట అనేక దుష్టవాసనలఁబరిగ్రహించి ఆ కన్నియలతోఁగూడ పదివేల వత్సరములఁ గడపిరి.

ఇయంమేకామినీకన్యా మమేయంప్రభుతేతిచ
దుహ్ఢస్నేహబన్ధానాం కాలస్తేషాంప్యవర్తత. 7

'ఈమె నా ప్రియమగు కన్య, ఇది నాప్రభుత్వము'—ఇట్లు తలంచుచు దృఢబంధనమున తగుల్కొనిన వారల యొక్క ఆయువు గడవసాగెను.

ధర్మరాజోఽథ తందేశం కదాచిత్సముపాయయౌ
మహానరకకార్యాణాం విచారార్థంయదృచ్ఛయా. 8

పిమ్మట, యొకానొక సమయమున మహానరకకార్యములఁగూర్చి విచారించుటకై నిజేచ్ఛ ననుసరించి యప్రదేశమునకు యమధర్మరాజు వచ్చెను.

అపరిజ్ఞాతమేనంతే ధర్మరాజం త్రయోఽసురాః
నప్రణేముర్వినాశాయ సామాన్యమివకింకరమ్. 9

అపుడు ఛత్రచామరాది చిహ్నములు గల్గియుండనందున సామాన్య కింకరునివలెనున్న యా యమధర్మరాజునకు (స్వవినాశము కొఱకై) వారలు ప్రణామమాచరింపరైరి.

అథనైవస్వతేనేతే జ్వలితాసూగ్రభూమిషు
విహితభ్రూపరిస్పన్దమాత్రేణైవ నివేశితాః. 10

అంత యమధర్మరాజు నూఱుయోజనములవఱకు వ్యాపించియున్న మండుచున్నట్టి మహారౌరవాది నరకభూములందు తన కనుసైగచేతనే వారలను పడద్రోయింప జేసెను.

తత్రతేకరుణాక్రన్దాః ససుహృద్దారబన్ధవః
ప్రదగ్ధాఃపర్ణవిటపా వృక్షాఇవవనానిలైః. 11

అచట వారు స్త్రీమిత్ర బంధుసహితులై కరుణాక్రందన మొనర్చుచు పత్రమాత్రావశిష్టమగు వృక్షమువలెనున్నవారై యా వనవాయువులచే క్షణములో దగ్ధమొనర్పబడిరి.

స్వయావాసనయా జాతాస్తయైవక్రూరయాపునః
బన్ధకర్మకరాకారాః కిరాతారాజకింకరాః. 12

పిమ్మట ఆ దామాదులు యమకింకరసహవాసంబున క్రూరవాసనాయుక్తులగుటంజేసి వధ బంధనాదులొనర్చు రాజసేవకులై కిరాతకులమున జన్మించిరి.

తజ్జన్మాథపరిత్యజ్య జాతాః శ్వభ్రేషువాయసాః
తదన్తేగృధ్రతాం యాతాస్తతోఽపి శుకతాంగతాః. 13

అనంతరము వారాజన్మనువీడి కాకములై జన్మించిరి. పిదప గృధ్రత్వముఁజెందిరి. ఆపిమ్మట శుకజాతియందు జన్మించిరి.

సూకరత్వంత్రిగర్తేషు మేషత్వంపర్వతేషుచ
మగధేష్వథకీటత్వం బభ్రుస్తేచ కుబద్ధయః. 14

తదుపరి త్రిగర్తదేశమున సూకరమైజన్మించిరి. పర్వములందు మేషమై జనించిరి. అట్లనే మగధదేశమున ఆ దుర్బుద్ధులు కీటకమైజన్మించిరి.



అనుభూయేతరామన్యాం చిత్రాం యోనిపరంపరామ్
అద్యమత్స్యాః స్థితారామ కాశ్మీరారణ్యపల్వలే. 15

ఓ రామా! పిమ్మట, వారనేక విచిత్రజన్మపరంపరలను లెస్సగ యనుభవించి యిపుడు కాశ్మీరదేశమందలి యొక యల్పజలాశయమున మత్స్యరూపమున వసించుచున్నారు.

దావాగ్నిక్వథితాల్పాల్ప పంకకల్పాంబుపాయినః
నమ్రియన్తేనజీవన్తి జరజ్జంబాలజర్జరాః. 16

దావాగ్నిచే విదగ్ధమైన పంకమువోలె జలమునుత్రావు శిథిలపంకమున జర్జరితదేహులై యున్న వారు జీవించుటయులేదు మరణించుటయులేదు.

విచిత్రయోనిసంరంభ మనుభూయ పునఃపునః
భూత్వాభూత్వా పునర్నష్టాస్తరంగా జలధావివ. 17

అనేక విచిత్రజన్మపరంపరలను మరల మరల యనుభవించుచు, సముద్రమందలి తరంగములవలె ఉత్పన్నమగుచు నశించుచునుండిరి.

భవజలధిగతాస్తే వాసనాతంతునున్నా
స్తృణమివచిరమూఢా దేహరూపైస్తరంగైః
ఉపశమముపయాతా రామనద్యాప్యనన్తం
పరికలయమహత్త్వం దారుణం వాసనాయాః. 18

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
దామవ్యాళకటజన్మాంతరచిత్రవర్ణనం నామ త్రింశః
సర్గః ॥ 30 ॥

ఓ రామా! సంసారతరంగమున చిక్కుకొని వాసనాతంతువుచే ప్రేరితులగుచు, దేహవీచికలచే చిరకాలము ప్రవాహితులగుచునున్న, వారు మువ్వురును నేటివఱకును శాంతిని పొందకుండిరి. వీరల దృష్టాంతముచే నీవు వాసనలయొక్క దారుణయనర్థమునుగూర్చి తెలిసికొనుము.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు స్థితిప్రకరణమున
దామవ్యాళకట జన్మాంతర చిత్రవర్ణనమను త్రింశ
సర్గము ॥ 30 ॥

---

## ఏకత్రింశః సర్గః.

---

శ్రీవసిష్ఠ ఉవాచ :—

అతఃప్రబోధాయ తవవచ్మిరామమహామతే
దామవ్యాలకటన్యాయో మాతేఽస్త్వితితు లీలయా. 1

శ్రీవసిష్ఠుడు :—మహామతివగు నో రామా ! ఇక్కారణమున దామవ్యాళకటన్యాయము నాశ్రయింపవలదని బోధార్థము నీకు వచించుచున్నాను.

అవివేకానుసంధానా చ్చిత్తమాపదమీదృశీమ్
అనంతభవదుఃఖాయ పరిగృహ్ణాతి హేలయా. 2

ఓ రామా ! అవివేకము ననుసంధించుచు, అనంతసంసారదుఃఖ మనుభవించుట కొఱకై చిత్తమిట్టి యాపదను గ్రహించుచున్నది.

క్వ కిలామరవిధ్వంసి శంబరాస్త్రనాథతా
క్వ తాపతప్త జంబాల జాలజర్జరమీనతా. 3

దేవతలఁగూడ వినాశమొనర్చు శంబరసైన్యముయొక్క యాధిపత్యమెచట, సూర్యతాపముచే సంతప్తమగు శైవాలమున జర్జరీభూతమగు మీనత్వమెచట !

క్వ ధైర్యమమరానీక విద్రావణకరంమహత్
క్వ కిరాతమహీపాల క్షుద్రకింకరరూపతా. 4

సురసైన్యమునుగూడ పాఱద్రోలు అసమాన ధైర్యమెచట, కిరాతరాజుయొక్క క్షుద్రదాస్యమెచట ?

క్వ నామనిరహంకార చిత్సత్త్వోదారధీరతా
క్వ మిథ్యావాసనావేశా దహంకారకుకల్పనా. 5

అహంకారరహితమగు చైతన్యసత్త్వముయొక్క యుత్తమ మహిమాతిశయ మెచట, మిథ్యావాసనల యావేశమున పరిగ్రహించిన దుష్టాహంకారకల్పన యెచట ?

శాఖాప్రతానగహనా సంసారవిషమంజరీ
అహంకారాఙ్కురాదేవ సముదేతీయమాతతా. 6

శాఖావిస్తారములచే మిగుల దట్టమైయున్న యీ సంసారవిష-లత అహంకారమను నంకురమునుండియే నుత్పన్నమై వ్యాపించుచున్నది.

అహంకారమతో రామ మార్జయాన్తః ప్రయత్నతః
అహం న కించిదేవేతి భావయిత్వా సుఖీభవ. 7

కాన నో రామా ! అహంకారమును హృదయమునుండి ప్రయత్నపూర్వకముగ తుడిచివేయుము. జడమగు దృశ్యము 'ఇదం' ప్రత్యయభూతమగుటచే అహంకారయోగ్యత్వరహితమై యుండుటచేతను, సర్వసాక్షిస్వరూపమగు చైతన్యమున అహంకారమే ఘటింపనందునను, దృగ్దృశ్యములకు భిన్నమైనది మిథ్యయగుటచేతను అహంకారమునకు స్థానమే లేదని నిశ్చయించి యట్టి భావనచే సుఖమునొందుము.

అహంకారాంబుదచ్ఛన్నం పరమార్థేన్దుమణ్డలమ్
రసాయనమయంశీత మదృశ్యత్వముపాగతమ్. 8

పరమార్థరూపమను చంద్రమండలము ఆనందమయమును, శీతల (త్రివిధ తాపరహిత) మునునైనను, అహంకారమను మేఘముచే నాచ్ఛాదితమై యదృశ్యరూపముఁజెందుచున్నది.



అహంకారపిశాచార్తా దామవ్యాలకటాస్త్రియః
గతాః సత్తామసన్తోఽపి మాయామాహాత్మ్యదానవాః. 9

దామవ్యాళకటులు ముగ్గురును అహంకారమను పిశాచముచే పీడింపబడినవారై అసద్రూపులైనను మాయామాహాత్మ్యముచే సత్తను బొందియుండిరి.

కాశ్మీరేషు మహారణ్యా సరసీవనపల్వలే
అద్య మత్స్యాః స్థితా రామా శైవాలలవలాలసాః. 10

ఓ రామా ! వారిపుడు కాశ్మీరదేశమందలి యొక యల్పజలాశయ శైవాలమున లాలసహృదయులై మత్స్యరూపముననున్నారు.

శ్రీరామ ఉవాచ:—

నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః
తే హ్యాసన్తః కథం సత్తాం సంపన్నా ఇతి మే వద. 11

శ్రీరాముడు :— ఓ మహాత్మా ! అసద్వస్తువునకు యునికియు, సద్వస్తువునకు లేమియు సంభవింపదు గదా; అట్లైన అసద్రూపులగు దామాదులెట్లు సత్తనుబొందిరో నాకు తెలియజేయుము.

శ్రీవసిష్ఠ ఉవాచ:—

ఏవమేతన్మహాబాహో నాసత్సంభవతి క్వచిత్
కాదాచిత్కించిదప్యేవ బృహత్సంపద్యతే తను. 12

శ్రీవసిష్ఠుడు :—మహాబాహుఁడవగు నో రామా ! నీవు వచించినది సత్యమే. అసద్వస్తువునకు యునికి యెచటను సంభవింపదు. కాని సూక్ష్మవస్తువు బృహద్రూపముగ నావిర్భవించును. మఱియు బృహద్వస్తువు సూక్ష్మమునగును. అట్లగుటయే నాశమని వచింతురు.

కిమసత్సంస్థితం బ్రూహి కింతత్సద్వాథసంస్థితమ్
సమ్యఙ్నిదర్శనేనైవ కరిష్యే తవబోధనమ్. 13

అసద్వస్తువెయ్యది సద్రూపముగను, సద్వస్తువెయ్యది యసద్రూపముగ నున్నదో, నీవు వచింపుము ? ఈ విషయమై దృష్టాంతములద్వారా నీకు బాగుగ బోధపఱచెదను.

శ్రీరామ ఉవాచ:—

సన్త ఏవ స్థితాసన్తో బ్రహన్వయమిమే కిల
దామాదయస్త్వసన్తోఽపి వక్షిసన్తః స్థితా ఇతి. 14

శ్రీరాముడు :— ఓ మునీంద్రా ! మనయొక్క సత్త ప్రత్యక్షముగనే సిద్ధించుచున్నది. గదా ! మాయామాత్రులగుటఁజేసి దామాదులకు సత్తలేదనియే మీరు వచించియున్నారు. అట్లైన మరల వారికి సత్తగలదనుటలో మీయభిప్రాయమేమి ?

శ్రీవసిష్ఠ ఉవాచ:—

యథా దామాదయో రామ స్థితా మాయామయా ఇతి
అసత్యా ఏవ సత్యాభా మృగతృష్ణాంబుపూరవత్. 15

తథైవేమేవయమితి ససురాసురదానవాః
అసత్యాఏవవల్గామో యామఆయామఏవచ. 16

శ్రీవసిష్ఠుడు :— ఓ రామా ! మాయామయులగు దామాదు లసద్రూపులైనను మృగతృష్ణయందలి జలమువలె సత్యముగ నెట్లు భాసించి యుండిరో, అట్లనే సురాసుర దానవాదులున్ను, మనమున్ను మిథ్యారూపముగనే విజృంభించుచు, పోవుచు, వచ్చుచు నున్నాము.

అలీకమేవత్వద్భావో మద్భావోఽలీకమేవచ.
అనుభూతోఽప్యసద్రూపః స్వప్నేస్వమరణంయథా. 17

రామ శరీరభావమున్ను, వసిష్ఠ శరీరభావమున్ను మిథ్యారూపములే అయియున్నవి. ఇయ్యవి అనుభూతములైయున్నప్పటికిని, స్వప్నమందలి స్వమరణమువలె అసద్రూపములే యగును.

మృతోబంధుర్యథా స్వప్నేఽప్యనుభూతోఽప్యసన్మయః
మృతోఽయమితి చేజ్జ్ఞప్తిర్భవేదేవమిదంజగత్. 18

మరణించిన తనబంధువు స్వప్నమం దనుభూతమైనను అసద్రూపమే యెట్లగునో, అట్లనే 'ఈతడు మరణించెన'ను జ్ఞానమున్ను యుక్తమేయగును. ఏలయన, ఈ జగత్తున్ను అవ్విధముగనే స్వప్నమాత్రమును, మాయామాత్రమును అయియున్నది గదా !

ఏషాతిమూఢవిషయ ఉక్తిరేవనరాజతే
అభ్యాసేనవినోదేతి నానుభూతేరపహ్నవః. 19

ఓ రామా ! జగత్తు సత్యమను దృఢనిశ్చయముగల పరమమూఢుని విషయమున జగత్తుయొక్క అసత్యత్వ-కథనము శోభింపదు. ఏలయన, పరమార్థతత్త్వవిచారాభ్యాసము లేకయే జగత్సత్యత్వానుభవము బాధింపబడదు.

నిశ్చయోఽన్తఃప్రరూఢోయః సంపన్నోఽభ్యాసనవినా
నాశమాయాతిలోకేఽస్మిన్న కదాచనకస్యచిత్. 20

జగత్తు సత్యమను నిశ్చయము దృఢపడ, యద్దానినాశము తత్త్వవిచారములేకనే యెవనికిని యెపుడును సంభవింపదు.

ఇదంజగదసద్బ్రహ్మ సత్యమిత్యేవవక్తియః
తమున్మత్తమివోన్మత్తో విమూఢోఽపిహసత్యలమ్ 21

ఇక్కారణమున, బ్రహ్మము సత్యము, జగత్తు మిథ్యయనివచించు నున్మత్త సదృశుండగు యనధికారిజూచి అజ్ఞానియు బాగుగ పరిహసించును.

అక్షీబక్షీబయోరైక్యం క్వకిలేహాజ్ఞతజ్జ్ఞయోః
అన్ధప్రకాశయోర్భేదే స్యాచ్ఛాయాతపయో[illegible]వ. 22

మద్య[illegible]యొనర్చిన వానికిని, యెనర్చనివానికిని మేళనమెట్లు సంభవింపదో, అంధకార ప్రకాశములకుగాని, ఛాయాతపములకు గాని యైక్యమెట్లు సిద్ధింపదో, అట్లనే యొకేప్రదేశమున నున్న[illegible]కత్వము ఘటిల్లదు.



యత్నేనాప్యనుభూతోర్థః సత్యైకర్తుమపహ్నవమ్
అజ్ఞోఽన్తశ్చనశక్నోతి శవమాక్రమణంయథా. 23

ఓ రామా ! శవము నడువజాలనట్లు యత్నముచే బోధించినను, అజ్ఞాని సత్యమగు సాక్షిస్వరూపమున నిలుకడలేనివాడై బాహ్యాంభ్యంతరములందు మనోబుద్ధ్యాదులరూపమున యనుభూతమగు ద్వైతప్రపంచమును నిషేధింప నశక్యుడై యుండును.

బ్రహ్మసర్వంజగదితి వక్తుంనాజ్ఞస్యయుజ్యతే
తపోవిద్యాననుభవే సతదేవానుభూతవాన్. 24

ఈ జగత్తంతయు బ్రహ్మమేయను కథనమున్ను అజ్ఞునికొఱకు యుక్తముగాదు. ఏలయన తపో (బ్రహ్మ)విద్యాదుల యభావముచే నాతడు జగత్తుయొక్క సత్యత్వమునే యనుభూత మొనర్చుకొనుచుండును.

అబుద్ధవిషయేహ్యేషా రామావాక్ప్రవిరాజతే
బుద్ధస్వాస్మీతిరూపేణ కిలనాస్త్యేవకించన. 25

కావ, కొంచెమైనను జ్ఞానముకలవానియందే 'జగత్తు మిథ్య' లేక 'జగత్తంతయు బ్రహ్మము'ను కథనము శోభించును. మఱియు పూర్ణజ్ఞానియెడ అహంకార పరామర్శరూపమగు కథనమున్ను సంగతముగాదు.

బ్రహ్మైవేదంపరం శాన్తమిత్యేవానుభవన్సుధీః
అపహ్నవఃస్వానుభూతేః కర్తుంతస్యక్వయుజ్యతే. 26

జ్ఞానియొక్క అనుభవమున యీ సర్వమున్ను పరబ్రహ్మమే యగును. అట్టిచో వాని యీ స్వానుభవమెట్లు పరిహరింపదగును ?

పరస్మాద్వ్యతిరేకేణ నాహమాత్మనికించన
హేమనీవోర్మికాదిత్వం నమయ్యస్తివిశిష్టతా. 27

పరమాత్మకన్యముగ ఆత్మరూపమున నేనేమియును గాదు. సువర్ణమున యంగుళీయకత్వము ప్రతీతిమాత్రమే యగునట్లు సాక్షిస్వరూపుడగు నాయందు అహంకార విశిష్టత్వమున్ను మిథ్యయే యగును.

భూతతావ్యతిరేకేణ మూఢేనాత్మనికించన
ఊర్మ్యాదిబుద్ధ్యాహేమేవ జ్ఞేనాస్తిపరమార్థతా. 28

తరంగాదులందు సువర్ణబుద్ధి యుదయింపని చందమున జ్ఞానికి యీ జగత్తునందు సత్యత్వబుద్ధి కలుగదు. అట్లనే యజ్ఞాని దృష్టియందు పరమార్థవస్తువు (బ్రహ్మసత్త) యొక్క అత్యంతాభావము సంభవించుచున్నది.

మిథ్యాహన్తామయోమూఢః సత్త్యైకాత్మమయఃసుధీః
యుజ్యతేనక్వచిన్నామ స్వభావాపహ్నవోఽనయోః. 29

అజ్ఞాని మిథ్యాహంకారమయుడును, జ్ఞాని సత్త్యైకాత్మమయుడును నగును. వీరియిరువుర స్వభావము లన్యముగ యెన్నటికిని చేయబడవు.

యో యన్మయ స్తస్య తస్మిన్న్యుజ్యతేఽపహ్నవః కథమ్
పురుషస్య ఘటోఽస్మీతి వాక్యమున్మత్తమేవ హి. 30

ఏవస్తు వేద్దాని మయమైయున్నదో, అయ్యది మఱొకరూపమెట్లగును ? మఱియు నేను ఘటమునను వాని వచనము ఉన్మత్తప్రలాపమే యగునుగదా.

తస్మాన్నేమే వయం సత్యా న చ దామాదయః క్వచిత్
అసత్యాస్తే వయం చేమే నాస్తి నః ఖలు సంభవః. 31

ఓ రామా! ఇక్కారణమున, వసిష్ఠ, రామాది దేహరూపముల ప్రత్యక్షముగ నున్ననుమనము తత్త్వదృష్టియందు సత్యముగా నేరము. మఱియు జ్ఞానుల యనుభవదృష్టిచేతను సత్యముగా నేరము. యుక్తిచేగూడ మన దేహాదుల యునికి సంభవింపదు.

సత్యం సంవేదనం శుద్ధం బోధాకాశం నిరంజనమ్
సత్యం సర్వగతం శాన్తమ స్త్యనస్తమయోదయమ్. 32

చిదాకాశమే నిరంజనమును, జ్ఞానస్వరూపమును, వేదాంతశాస్త్రదృష్టిచే సత్యమునై యున్నది. సర్వవ్యాపకమగు నదియే జ్ఞానుల యనుభవమందును సత్యమైనది. యుక్తిచేగూడ నయ్యది ఉత్పత్తివినాశరహితమగు సద్వస్తువని సిద్ధించుచున్నది.

సర్వం శాంతం చ నిఃశూన్యం న కించిదివ సంస్థితమ్
తత్ర వ్యోమ్ని విభాస్తీమా నిజాభాసోఽజ్గసృష్టయః. 33

ఓ రామా! ఈ జగత్తంతయు శాంతమును, శూన్యత్వరహితమును, సద్వస్తుపూర్ణమునై యున్నది. ఆ చిదాకాశమందే విరుద్ధరూపముగల (అసత్యమగు) యీ సృష్టియంతయు భాసించుచున్నది.

యథా తైమిరికాక్షస్వ సహజా ఏవ దృష్టయః
కేశోణ్డ్రికాదివద్భాన్తి తథేమాస్తత్ర సృష్టయః. 34

తిమిరవ్యాధిగలవాని దృష్టికి సహజముగనే ఆకాశమున కేశోండ్రకములు గన్పించునట్లు, యీ సృష్టియు పరమాత్మయందు సహజముగనే భాసించుచున్నది.

స ఆత్మానం యథా వేత్తి తథానుభవతి క్షణాత్
చిదాకాశ స్తతోఽసత్యమపి సత్యం తదీక్షణాత్. 35

ఆ సత్యాత్మ ఎట్టియనుభవమును పొందునో, చిదాకాశమట్లే శీఘ్రముగ నగును. అందుచే తన యీక్షణముచే (సత్యాత్మయొక్క దృష్టిబలముచే) క్షణములో నసత్యముగను వగుచున్నది.

న సత్యమస్తి నాసత్యమితి తస్మాజ్జగత్త్రయే
యద్యథా వేత్తి చిద్రూపం తత్తథోదేత్య[illegible]యమ్. 36

కాన ముల్లోకములందును సత్యమైనదిగాని అసత్యమైనదిగాని యేదియునులేదు. చిద్రూప మెద్దాని [illegible], ఆయ్యది దేరూపమున నుదయమగును.



యథా దామాదయ స్తద్వదేవమభ్యుదితా వయమ్
సత్యాసత్యాః కిమత్రాజ్గ తాన్ప్రత్యపి వికల్పనా. 37

ఓ రామా ! అందుచే దామాదులు చిదాకాశమున యెట్లు వ్యక్తమయిరో, అట్లే మన మున్ను వ్యక్తమయియున్నాము. దీనియందు సత్యాసత్యములేమి ? మఱియు కేవలము వారలఁగూర్చియే సత్యాసత్యముల వికల్పనయేల ?

అస్యానన్తస్య చిద్వ్యోమ్నః సర్వగస్య నిరాకృతేః
చిదుదేతి యథా యాన్తు తథా సా తత్ర భాత్యలమ్. 38

నిరాకారమును, సర్వవ్యాపియు, అనంతమునగు యీ చిదాకాశమున చైతన్యమేరూపమున నుదయించునో, ఆ రూపముననే లెస్సగ ప్రకాశించును.

యత్ర దామాదిరూపేణ సంవిత్ప్రకచితా స్వయమ్
తథా సా తత్ర సంపన్నా తథాకారానుభూతితః. 39

ఆ చైతన్యమెచట దామాదులరూపమున స్వయముగ స్ఫురించెనో, అచట యా రూపముననే యనుభవము పొందుటఁబట్టి అట్లావిర్భవించెను.

అస్మదాదిస్వరూపేణ సంవిద్యత్రోదితా స్వయమ్
తథాసా తత్ర సంపన్నా తథాకారానుభూతితః. 40

అట్లే యా చైతన్య మస్మదాదులరూపమున స్ఫురించినపుడును, అట్టి రూపానుభవము పొందుటచేతనే అవ్విధముగ సంపన్నమాయెనని నిశ్చయింపుము.

స్వస్వప్నప్రతిభాసస్య జగదిత్యభిధాకృతా.
చిద్వ్యోమ్నా వ్యోమవపుషస్తావన్యేవ మృగామ్బుతా. 41

మరుభూమియందలి సూర్యకిరణములనే మృగతృష్ణాజలమనునట్లు, నిరాకారమగు చిదాకాశము తన స్వప్నప్రతిభాసమునకే జగత్తను పేరిడెను.

యత్ర ప్రబుద్ధం చిద్వ్యోమ తత్ర దృశ్యాభిధాకృతా
యత్ర సుప్తం తు తేనైవ తత్ర మోక్షాభిధాకృతా. 42

బాహ్యపదార్థోపలబ్ధిచే చిదాకాశము జాగరూకమైయుండునపుడది దృశ్యమనియు, బాహ్యపదార్థ రహితమగునపుడు మోక్షమనియు, ఆ చైతన్యమే సంజ్ఞలిడెను.

న చ తత్క్వచిదాసుప్తం న ప్రబుద్ధం కదాచన
చిద్వ్యోమ కేవలం దృశ్యం జగదిత్యవగమ్యతామ్. 43

యథార్థముగ నా చిదాకాశమెపుడును అప్రబుద్ధమున్ను ప్రబుద్ధమున్ను గాకయున్నది. ఈ దృశ్యమంతయు చిదాకాశస్వరూపమే అయియున్నది.

నిర్వాణమేవ సర్గశ్రీః సర్గశ్రీరేవ నిర్వృతిః
నానయోః శబ్దయోరర్థభేదః పర్యాయయోరివ. 44

ఈ దృశ్యమంతయు కేవలము చిదాకాశమాత్రమును, సృష్టివైభవమంతయు మోక్షరూపమును నగుచుండ, ఇక పర్యాయశబ్దములందువలె నీ రెండిటి (జగద్బ్రహ్మల) యందును కొంచెమైనను భేదములేదు గదా!

పరమార్థో జగదితి రూపం వేత్తి స్వయం స్వకమ్
యథా తైమిరికం చక్షుః కేశోండ్రకమివేక్షతే. 45

తిమిరరోగముగలవాడాకాశమున కేశోండ్రకముల వీక్షించునట్లు అవిద్యోపహితమగు ఆత్మ తన పరమార్థస్వరూపమునే జగత్తుగ నెఱుంగుచున్నది.

న తత్కేశోండ్రకం కించిత్సా హి దృష్టిస్తథా స్థితా
నేదం దృశ్యమిదం కించిదిత్థం చిద్వ్యోమసంస్థితమ్. 46

వాస్తవముగ కేశోండ్రకము లేవియును లేక, దర్శకుని దృష్టియే యారూపమున నున్నవిధముగ, పరమార్థమున యీ దృశ్యప్రపంచముగాని, ఆ శరీరాదులేవియుగాని లేవు. చిదాకాశమే యా రూపముల స్థితిగలిగియున్నది.

సర్వత్ర సర్వమిదమస్తి యథానుభూతం
నో కించన క్వచిదిహాస్తి నచానుభూతమ్
శాన్తం సదేకమిదమాతత మిత్థమాస్తే
సంత్యక్తశోకభయభేద మతస్త్వమాస్స్వ. 47

ఓ రామా! అధ్యారోపదృష్టిచే సర్వవ్యాపకమగు చిదాకాశమున నంతయు సంభవమగుటచే, సమస్తము గలదనియు, అపవాదదృష్టిచే నేమియు లేదనియు, వచింపబడును. ఈ రెంటియందును శాంతమును, భేదరహితమునునగు నొకే పూర్ణరూపము (బ్రహ్మము) గలదు! కాన శోక, భయంబులఁద్యజించి నీ వట్టి పూర్ణస్వరూపుడవు కమ్ము!

శిలోదరాకారఘనం ప్రశాన్తం
మహాచితే రూపమిదం స్వమచ్ఛమ్
నైవాస్తి నాస్తీతి దృశౌ క్వచిత్తు
యచ్చాస్తి తత్సాధు తదేవ భాతి. 48

ఇత్యార్షే వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
నవసన్నిరాకరణం నామైకత్రింశః
సర్గః ॥ 31 ॥

ఓ రామా! స్ఫటికశిలామధ్యభాగమువలె, ఈ పరిపూర్ణమగు చైతన్యస్వరూపము ఘనమును, ప్రశాన్తమును, మిగుల స్వచ్ఛమును నగును. కాని అందలి నదీపర్వతవనాదుల ప్రతిబింబమువలె, 'ఇదికలదు' 'లేదు' యను భేదదృష్టి చైతన్యమున లేనేలేదు. ఎచటనైనను ప్రతీతిగాన్పించిన చైతన్యమే యారూపమున నట్లు ప్రకాశించుచున్నదని యెఱుంగుము.



ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు స్థితిప్రకరణమున
నవసన్నిరాకరణమను ఏకత్రింశ
సర్గము ॥ 31 ॥

---

## ద్వాత్రింశః సర్గః

---

శ్రీ రామ ఉవాచః—

సతామప్యసతామేవ బాలయక్షపిశాచవత్
దామవ్యాలకటాదీనాం దుఃఖస్యాన్తః కథం భవేత్. 1

శ్రీ రాముడు:— ఓ మునీంద్రా! బాలురకు యక్షపిశాచములవలె అజ్ఞుల దృష్టికి సత్యస్వరూపులును, కాని యథార్థముగ మిథ్యారూపులును నగు దామవ్యాళకటాదులయొక్క దుఃఖమెప్పుడు శమించును?

శ్రీ వసిష్ఠ ఉవాచః—

దామవ్యాలకటుంబైస్తైస్తదేవ యమకింకరైః
ప్రార్థితేన యమేనోక్తమిదం శృణు రఘూద్వహ. 2
యదా వియోగమేష్యన్తి శ్రోష్యన్తి చ నిజాం కథామ్
దామాదయస్తదా ముక్తా భవిష్యన్తీత్యసంశయమ్. 3

శ్రీ వసిష్ఠుడు:—రఘుకులశ్రేష్ఠుఁడవగు నో రామా! దామవ్యాళాదుల కుటుంబమునకుఁ జెందిన యమకింకరులు యమునిఁబ్రార్థింప నాతడు 'ఈ దామవ్యాళాదులు వేఱుజెందునపుడు తమ చరిత్రమును వినినవారై నిస్సందేహముగ ముక్తులు కాగలర'ని వచించెను.

శ్రీ రామ ఉవాచ :—

స్వవృత్తాన్తమిమం కుత్ర కదా కథయతే కథమ్
శ్రోష్యన్తి భగవంస్తేవా వర్ణయేదం యథాక్రమమ్. 4

శ్రీరాముడు:—ఓ మహాత్మా! వారు స్వస్వవృత్తాంతముల నెవరెవరిచే నెపుడు వింద్రో యథాక్రమముగ వచింపుము.

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

కాశ్మీరేషు మహాపద్మసరసీతీరపల్వలే
భూయోభూయోఽనుభూయైవ మత్స్యయోనిపరంపరామ్. 5
ఆలోలితాశయాలోలాః కాలేన లయమాగతాః
తత్రైవ పద్మసరసి తే భవిష్యన్తి సారసాః. 6

శ్రీవసిష్ఠుడు:—ఓ రామా! కాశ్మీరదేశమందలి యొకయల్పతటాకమున అనేక పర్యాయములు మత్స్యజన్మమెత్తిన పిదప గ్రీష్మఋతువునందు మహిషాదులచే నాతటాకము త్రొక్కబడి ధ్వంసము కాగా, వారు మువ్వురును అందు నశించి మరల ఆ పద్మసరోవరముననే సారసపక్షులై జన్మింతురు.

తత్ర కల్హారమాలాసు సరోజవటలీషు చ
శైవాలవరవల్లీషు తరంగవలనాసు చ. 7

చరత్కుసుమదోలాసు నీలోత్పలలతాసు చ
సీకరాఘాభ్రలేఖాసు శీతలావర్తవర్తిషు. 8

సారసాః సరసంభోగాన్భుక్త్వా భువనభూషణాః
విహృత్య సుచిరం కాలమలమాగతశుద్ధయః. 9

అచట శ్వేతకమలములందును, పద్మసమూహములందును, ఉత్తమ శైవాల లతలందును, తరంగ సమూహములందును, చంచలపుష్పములను ఊయేలలతో కూడిన నీలకమల లతలందును, శీతల ఆవర్త సహితములును, జలకణయుక్తములును నగు మేఘమండలములందును, ప్రపంచమునకు భూషణమువంటి ఆ సారసపక్షులు ఉత్తమభోగముల ననుభవించి, చిరకాలము విహరించి పిదప శుద్ధత్వము నొందును.

తే వియుక్తా భవిష్యన్తి ముక్తయే లబ్ధబుద్ధయః
రజఃసత్త్వతమాంసీవ భేదం ప్రాప్య యదృచ్ఛయా. 10

వివేకదృష్టిచే విచారింప సత్త్వరజస్తమోగుణములు భిన్నములై పోవునట్లు, వివేకబుద్ధి యుదయింప ముక్తికొఱకు యత్నించుటకై వారు మువ్వురును అపుడు వేఱగుదురు.

కాశ్మీరమండలస్యాన్తర్నగరం నగశోభితమ్
నామ్నాధిష్ఠానమిత్యేవ శ్రీమత్తస్య భవిష్యతి. 11

ఓ రామా! కాశ్మీరదేశమున పర్వతవృక్షాదులచే శోభించుచు, సమస్తసంపదలతో తులతూగుచునుండు అధిష్ఠానమను నగరమున వారు వసింతురు.

ప్రద్యుమ్నశిఖరం నామ తస్య మధ్యే భవిష్యతి
శృఙ్గం లఘుసరోజస్య కోశచక్రమివోదరే. 12

ఆ నగరమధ్యమున ప్రద్యుమ్నయను శిఖరముండును. దాని శిఖరము దాటయోగ్యమై యుండును. మఱియు దాని మధ్యభాగము కమలకర్ణకవలె నుండును.

తస్య మూర్ధ్ని గిరేర్గేహం కశ్చిద్రాజా భవిష్యతి
అభ్రంకషమహాశాలం శృఙ్గే శృఙ్గమివాపరం. 13

ఆ పర్వతశిఖరముపై గృహములన్నింటిలో శ్రేష్ఠమును, విశాలమగు శాలలుగలదియు, శిఖరమువలె గన్పట్టుచున్నదియు నగు గృహరాజమొకటి యుండును.

గృహస్యేశానకోణేఽస్తి శిరోభిత్తివ్రణోదరే
తస్యానిశమవిశ్రాన్తవాతాధూతతృణాన్తికే. 14

ఆలయే దానవో వ్యాలః కలవిఙ్కో భవిష్యతి
ప్రథమాల్పశ్రుతశాస్త్రః ఇవార్థరహితారవః. 15



ఆ గృహముయొక్క ఈశాన్యభాగమునగల గోడపైని పగిలిన రాతియందొక గూడు యుండును. దానిచెంత వాయువుచే నిరంతరము చలించుచుండు తృణయుక్తమగు గూటియందు అల్పశాస్త్రజ్ఞుడగు ద్విజునివలె అర్థరహితముగ కేవలము శబ్దమొనర్చు వ్యాళుడను దానవుడు చటకపక్షి (పిచ్చుక) రూపమున నుండును.

తస్మిన్నేవ తదాకాలే తత్ర రాజా భవిష్యతి
శ్రీయశస్కరదేవాఖ్యః శక్రః స్వర్గ ఇవాపరః. 16

అపుడానగరమున, స్వర్గమందు అపరేంద్రునివంటి శ్రీ యశస్కరదేవుడను నృపాలుడుండును.

దానవో దామనామాత్ర మశకస్తస్య సద్మని
భవిష్యతి బృహత్స్తంభపృష్ఠచ్ఛిద్రే మృదుధ్వనిః. 17

ఆ రాజుయొక్క గృహాంతరమున నున్నట్టి పెద్దస్తంభముయొక్క వెనుకభాగమందలి రంధ్రమున దాముడను దైత్యుడు అల్పశబ్దమొనర్చు మశకమైయుండును.

అధిష్ఠానాభిధే తస్మిన్నేవాన్తర్నగరే తదా
రత్నావలీవిహారాఖ్యో విహారోఽపి భవిష్యతి. 18

అపుడా యధిష్ఠాననగరమందు రత్నావళీవిహారమను విహారమొకటి యుండియుండును.

తస్మింస్తద్భూమిపామాత్యో నరసింహ ఇతి శ్రుతః
కరామలకవద్దృష్టబన్ధమోక్షో నివత్స్యతి. 19

ఆ నగరమున బంధమోక్షములను హస్తామలకముగ నెఱుంగు నరసింహుడను పేరుగల సుప్రసిద్ధుడగు మంత్రి యొకడు నివసించుచుండును.

భవిష్యతి గృహే తస్య క్రీడనః క్రకరః ఖగః
కటో మాయాసురో నామ కృతరాజతపంజరః. 20

ఆ మంత్రిగృహమున కటుడను మాయాసురుఁడు, రజత పంజరమున ఆ మంత్రికి క్రీడాసాధనమై బరగు సారికయను పేరుగల పక్షియగును.

స నృసింహో నృపామాత్యః శ్లోకైర్విరచితామిమామ్
దామవ్యాలకటాదీనాం కథయిష్యతి సత్కథామ్. 21

ఆ నృసింహుడను మంత్రి శ్లోకరూపమున రచింపబడిన దామవ్యాళుల యుత్తమ చరిత్రను పఠించును.

స కటః క్రకరః శ్రుత్వా తత్కథాం సంస్మృతాత్మభూః
శాన్తమిత్థం మహాశాన్తం పరం నిర్వాణమేష్యతి. 22

ఆ సారిక తన యా చరిత్రను విని శంబరాసురునిచే కల్పింపబడిన తన జీవరూపమును త్యజించి యెద్దానియందు సంసారరూపము సమూలముగ నశించునో అట్టి యుత్తమమగు మోక్షమును ప్రాప్తినొందును.

ప్రద్యుమ్నశిఖరప్రాన్తవాస్తవ్యః కలవిఙ్కకః
తత్రత్యైశ్చ కథాం శ్రుత్వా పరం నిర్వాణమేష్యతి. 23

రాజమందిర స్తంభమున వసించు ఆ మశకమున్ను ఆ స్వీయచరిత్రను విని మోక్షరూపమగు పరమశాంతిని బొందును.

రాజమందిరదార్వన్త ర్వ్రణవాస్తవ్యతాంగతః
మశకోఽపి ప్రసంగేన శ్రుత్వా శాన్తిముపైష్యతి. 24

ప్రద్యుమ్న శిఖర సమీపవాసియగు ఆ చటకమున్ను అచటి నివాసులచే నా చరిత్రను విని పరమోత్తమమగు నిర్వాణపదము నొందును.

ప్రద్యుమ్నశృఙ్గాచ్చటకో మశకో రాజమందిరాత్
విహారాత్రికకరశ్చేతి మోక్షమేష్యంతి రాఘవ. 25

ఓ రామా! ప్రద్యుమ్న శిఖరమందలి యా చటకము, రాజమందిరమందలి మశకము, రత్నావళీ విహారమందలి సారిక — ఈ మూడును మోక్షప్రాప్తి నొందును.

ఏష తే కథితః సర్వో దామవ్యాలకథాక్రమః
మాయైవమేవ సంసారశూన్యైవాత్యన్తభాసురా. 26

ఓ రామా! ఇట్లు దామవ్యాళుల వృత్తాంత క్రమమంతయు నీ కెఱింగించితిని. ఇవ్విధముననే నామరూపాత్మకమగు యీ ప్రపంచమంతయున్ను శూన్యరూపమును, మాయామాత్రమును నైయున్నది.

భ్రమయత్యపరిజ్ఞానాన్మృగతృష్ణాంబుధీరివ
మహతోఽపి పదాదేవం నానాజ్ఞానవశాదధః. 27

మృగతృష్ణయందలి జలబుద్ధివలె ఇయ్యది అజ్ఞానముచే జీవుల భ్రమింపజేయుచున్నది. మఱియు పలువిధ యజ్ఞానకారణంబులచే నిది అత్యున్నత పదములనుండియు జీవుల బడద్రోయుచున్నది.

పతన్తి మోహితామూఢా దామవ్యాలకటా ఇవ
క్వ భ్రూక్షేపవినిష్పిష్ట మేరుమన్దరసద్మతా. 28
క్వ రాజగృహదార్వన్తర్వ్రణే మశకరూపతా
క్వ చపేటభుజామాత్ర పాతితార్కేన్దుబిమ్బతా. 29
క్వ ప్రద్యుమ్నగిరా గేహే భిత్తివ్రణవిహంగతా
క్వ పుష్పలీలయా లోలకరతోలితమేరుతా. 30
క్వ వా శృఙ్గే నృసింహస్య గృహే క్రకరపోతతా

అజ్ఞానులగు మూఢులు దామవ్యాళకటాదులవలె పతనమును బొందుదురు. కనుసైగచేతనే మేరుమందర పర్వతములగూడ చూర్ణమొనర్చుటెచట! రాజగృహస్తంభ చ్ఛిద్రమందలి మశకరూపత్వమెచట! హస్తప్రహారమాత్రమున సూర్యచంద్రాదులఁ బడద్రోయుటెచట! ప్రద్యుమ్న పర్వతశిఖరస్థ గృహాంతరాళమున కుడ్యరంధ్రమందలి పక్షిరూపత్వమెచట! పుష్పమువలె లీలా



మాత్రమున మేరుపర్వతమునుగూడ హస్తముచే తులతూచుటెచట! నృసింహుని గృహమందలి సారిక శిశువగుటెచట!

చిదాకాశోఽహమిత్యేవ రజసారఞ్జితప్రభః. 31
స్వరూపమత్యజన్నేవ విరూపమపి బుధ్యతే
స్వయైవవాసనాభ్రాన్త్యా సత్యయేవాప్యసత్యయా. 32
మృగతృష్ణాంబుబుద్ధ్యేవ యాతి జన్తురివాన్తరమ్
తరన్తి తే భవాంభోధిం స్వప్రవాహాధిరైవ యే. 33
శాస్త్రేణాసాదితం దృశ్యమితి నిర్వాణసంస్థితాః
నానాదుఃఖవికారాణి శుష్కతర్కమతాని యే. 34

ప్రభావంతమగు చిదాకాశము రజోగుణరంజితమై అహంకారము నాశ్రయించి తన ప్రకాశరూపత్వమును త్యజింపకయే అహంకార ప్రాణేంద్రియాదుల ననుభవించుచున్నది. అసత్తయినను మృగతృష్ణయందలి జలమువలె సత్యముగభాసించు భ్రాంతిరూపమగు తనవాసనచేతనే ఇయ్యది తన చిద్రూపమునుండి విభేదమునొందుచున్నది. సాక్షిచైతన్యమగు ప్రత్యగాత్మవైపున కభిముఖమైన బుద్ధిగల్గి తత్త్వమస్యాది మహావాక్యరూపమగు వేదాంతశాస్త్రముచే దృశ్యమును అసత్తుగ నెఱింగి యద్దానిని రహితమొనర్చి విజ్ఞులు సంసారసాగరమును దాటి నిర్వాణపదము నొందుదురు. మోక్షమునకు హేతుభూతమగు అట్టి వేదాంతశాస్త్రమున కన్యమగు శుష్కతర్కములు దుఃఖమయములును పలువిధ వికార యుక్తములునై యున్నవి.

యాతి శ్వభ్రంజలానీవ స్వలాభం నాశయన్తి తే
స్వానుభూతిప్రసిద్ధేన మార్గేణాగమగామినా. 35
న వినాశో భవత్యఙ్గ గచ్ఛతాం పరమాంగతిమ్

కేవలము తర్కశాస్త్రము నాశ్రయించువారు పరమ పురుషార్థరూపమగు తమ ఆత్మలాభమును నశింపజేసికొనువారగుచున్నారు. కాని స్వానుభవముచే శ్రుతి ప్రసిద్ధమార్గము ననుసరించి యుత్తమగతినిబొంద యత్నించువానికి వినాశమెన్నటికిని చేకూరదు.

ఇదం మే స్యాదిదం మే స్యాదితి వృద్ధైర్మహామతే. 36
స్వేన దౌర్భాగ్యదైన్యేన న భస్మాప్యుపలభ్యతే

మహామతివగు నో రామా! 'ఇది నాకు వలయున'ని తలంచుచు, తన దౌర్భాగ్యముచే గల్గు దీనత్వముచే నశించుచునుండువానికి పురుషార్థలేశమైనను ప్రాప్తింపదు.

వేత్తి నిత్యముదారాత్మా త్రైలోక్యమపి యస్తృణమ్. 37
తం త్యజన్త్యాపదః సర్వాః సర్పా ఇవ జరత్త్వచమ్

ఏ యుదారచరితుఁడు త్రిలోకములఁగూడ తృణముగఁజూచునో, అమ్మహాత్ముని, సర్పము తన కుబుసమును వీడునట్లు సమస్తయాపదలును వీడి జనును.

పరిస్ఫురతి యస్యాన్తర్నిత్యం సత్త్వచమత్కృతిః. 38

బ్రాహ్మమణ్డమివాఖణ్డం లోకేశాః పాలయన్తి తమ్
అప్యాపది దురన్తాయాం నైవ గన్తవ్యమక్రమే. 39

ఎవని యంతఃకరణమున నిత్యము సత్త్వగుణము స్ఫురించుచుండునో, అట్టివానిని యింద్రాది దేవతలు, లోకేశులందఱును తమ యాధారభూతమగు బ్రహ్మాండమునువలె పాలించి రక్షించుచుందురు. కాన యెట్టి ఘోరవిపత్తునందైనను అసన్మార్గమున జనరాదు.

రాహురప్యక్రమేణైవం పిబన్నప్యమృతం మృతః
సచ్ఛాస్త్రసాధుసంపర్కమర్కముగ్రప్రకాశదమ్. 40

అసన్మార్గము నవలంబించుటచే రాహు వమృతపానమొనర్చినను మృతినొందెను. సచ్ఛాస్త్రాభ్యాస, సాధుసేవనమను సూర్యుడు, జగత్సంహారకారకుడగుటచే నుగ్రుడగు శివుని పరమాత్మను ప్రకాశింప (సాక్షాత్కరింప) జేయును.

యే శ్రయన్తే న తే యాన్తి మోహాన్ధ్యస్య పునర్వశమ్
అవశ్యా వశ్యతాం యాన్తి యాన్తి సర్వాపదః క్షయమ్. 41

వీనిని (సాధు, సచ్ఛాస్త్రముల) సేవించువాడు మరల యెన్నటికిని మోహాంధకారమునకు వశుడుగాకయుండును. అట్టివానికి అవశ్యములైనవికూడ వశములగును. వానికి సమస్తయాపదలున్ను శమించును.

అక్షయం భవతి శ్రేయః కృతం యేన గుణైర్యశః
యేషాం గుణేష్వసంతోషో రాగో యేషాం శ్రుతంప్రతి. 42
సత్యవ్యసనినో యే చ తే నరాః పశవోఽపరే

శమదమాదిగుణములచే విఖ్యాతినొందినవానికి అనగా సత్పురుషులలో శ్రేష్ఠుడగువానికి నాశరహితమగు పరమోత్తమ శ్రేయము లభించును. ఉపరోక్తములగు శమదమాదిగుణములందును అధ్యాత్మ శాస్త్రశ్రవణమందును సత్యమందును మిక్కిలి ప్రీతిగలవారే మనుష్యులనందగుదురు. తక్కిన వారు పశుతుల్యులే.

యశశ్చన్ద్రికయా యేషాం భాసితం జన్తుహృత్సరః 43
తేషాం క్షీరసముద్రాణాం నూనం మూర్తః స్థితో హరిః
భుక్తం భోక్తవ్యమఖిలం దృష్టా ద్రష్టవ్యదృష్టయః. 44

ఎవని యశశ్చంద్రికచే జీవుల హృదయసరోవరము లాహ్లాదితమొనర్పబడునో, అట్టి క్షీర సముద్రమువంటి పవిత్రమూర్తులందు సాక్షాత్ విష్ణుభగవానుడు వసించును. అట్టివారు భోక్తవ్యపదార్థములన్నింటిని యనుభవించినవారును, ద్రష్టవ్యపదార్థము లన్నింటిని దర్శించినవారును నగుదురు.

కిమన్యద్భవభఙ్గాయ భూయో భోగేషు లుబ్ధతా
యథాక్రమం యథాశాస్త్రం యథాచారం యథాస్థితి. 45





స్థీయతాం ముచ్యతామన్తర్భోగజాలమవాస్తవమ్
సంస్తవః క్రియతాం కీర్త్యా గుణైర్గగనగామిభిః. 46

భవిష్యజ్జన్మపరంపరలచే తమ యాత్మను నశింపజేయు యీ ప్రాపంచిక విషయభోగములం దింకను ప్రీతియేల ? (అనగా విషయలుబ్ధత్వ మయుక్తమని భావము) కాన, వానివాని యధికారము ననుసరించి, శాస్త్రానుకూలముగను, పూర్వాచార్యులచే సంప్రవర్తితమగు యాచారముల ననుసరించియు యేయే భూమికయం దెంతకాలము స్థితిగలిగియుండవలెనో, అంతకాల మాయా భూమికలందుండి యభ్యసించుచునే యుండవలెను. మిథ్యాభోగజాలమంతయు అంతఃకరణమునుండి త్యజించివేయవలెను. స్వర్గపర్యంతమును వ్యాపించి విఖ్యాతములగు తన యుత్తమగుణములచేతను, యశోమహిమచేతను, సత్పురుషులచే సంస్తుతింపబడవలెను.

త్రాయేతే మృత్యుతో హ్యేతే న కదాచన భోగకాః
గాయన్తి సిద్ధసున్దర్యో యేషామిన్దుసితం యశః. 47
గీతిభిర్గగనాభోగైస్తే జీవన్తి మృతాః పరే

తుచ్ఛములగు యీ ప్రాపంచిక విషయభోగములు మృత్యువుతో నంతమగును. కాన, చంద్రునివలె ధవళమైన యెవనియొక్క కీర్తిని సుందరులగు దేవాంగనలు గాన మొనర్చుచుందురో, యెవరి యశస్సు ఆకాశమువలె సర్వదేశకాలములందును వ్యాప్తమైయుండునో, అట్టి యుత్తములే జీవితులున్ను తక్కినవారు మృతప్రాయులున్ను నగుదురు.

పరమం పౌరుషం యత్నమాస్థాయాదాయ సూద్యమమ్. 48
యథాశాస్త్రమనుద్వేగ మాచరన్కో న సిద్ధిభాక్
యథాశాస్త్రం విహరతా త్వరాకార్యా న సిద్ధిషు. 49

కాన నుత్తమమగు పురుషప్రయత్నమును, తదనుకూలమగు సదుద్యమము నాశ్రయించి, శాస్త్రానుసార ముద్వేగరహితుడై యాచరించుచో యెవడు మోక్షసిద్ధిని బడయకుండును ?

చిరకాలపరిపక్వా సిద్ధిః పుష్టఫలా భవేత్
వీతశోకభయాయాసమగర్వమవయన్త్రిణమ్. 50
వ్యవహారో యథాశాస్త్రం క్రియతాం మా వినశ్యతామ్
జీవో జీర్ణాన్ధకూపేషు భవేష్వన్తమివాగతః. 51

ఓ రామా! చిరకాల పరిపాకముచే సిద్ధిని పొందువానియొక్క ఫలమున్ను దృఢతరమగును. కాన శోక, భయ, గర్వముల శీఘ్రముగ త్యజించి శాస్త్రానుసారము వ్యవహరించుము. వినాశము నొందకుము. జీవత్వము నాశ్రయించి విషయసేవనముచే సంసారమను అంధకూపమున బడి నశింపకుము.

భవతాం భూరిసఙ్గానామధునేన్ద్రియదామతః
ఇతఃప్రభృతి మా భూయో గమ్యతామధమాదధః. 52

అనేక పదార్థములందు సక్తమైయున్న నీ జీవుడిపుడు ఇంద్రియములను రజ్జువుచే బంధింపబడి మృత్యువునకు వశమైనట్లు తోచుచున్నది. కాన సంసారమను యంధకూపమునబడి నాశ మొందకుము. ఇది మొదలు నీవు యధమాధమగతిని అనగా నీచత్వమును బొందకయుండుము.

ఇదం విచార్యతాం శాస్త్రమస్త్రమాపన్నివారణమ్
రణే శితశరశ్రేణి శతనిర్లూనవారణే. 53

ఘోరమృత్యుభయాదులనుండి రక్షించునదియు, శస్త్రమువంటిదియు, నాశరహితమును, నిత్యమునునగు నిరతిశయానందము నొసగూర్చునదియు నగు (వేదాంత) శాస్త్రమును నిత్యము విచారించుచుండుము.

జీవముద్రా చ కిం పఙ్కే భోగగన్ధే నిరస్యతామ్
కిమర్థమాత్రయా కార్యామార్యాః శాస్త్రమవేక్ష్యతామ్. 54

గ్రీష్మర్తువందలి యుష్ణత్వముచే మిగుల దుర్గంధయుక్తమగు తటాకమందలి కర్దమమువలె యీ ప్రాపంచిక జీవిత మతితుచ్ఛమైనది. కాన భోగాశను హృదయమునుండి పారద్రోలవలెను. అనర్థప్రదములగు భోగములకొఱకగు ద్రవ్యలేశముచే నేమి ప్రయోజనము? అందుచే నో శ్రేష్ఠపుంగవులారా! మోక్షప్రదమగు శాస్త్రము నవలోకింపుడు.

ఇదం బింబమిదం బింబమితి సత్యం విచార్యతామ్
ధియా పరప్రేరణయా యాతమాపశవో యథా. 55

విషయాకార వృత్తులందలి ప్రతిబింబభూతులగు చిదాభాసులయొక్క అంతఃకరణావచ్ఛిన్నమగు చైతన్యమే బింబము. అనగా నంతఃకరణోపహితమగు చిదాభాసుని శుద్ధబ్రహ్మచైతన్యమే బింబమగును. అంతఃకరణ ప్రతిబింబితుడగు చిదాభాసుడే ప్రతిబింబము. ప్రతిబింబములును, వాని యుపాధులును రెండును మిథ్యారూపములే. అభిన్నమగు బింబము మాత్రము సత్యమైనది. ఇవ్విధమున తత్త్వవిచారము సల్పవలెను. పరులగు అర్థకాదులచే ప్రేరితమగు బుద్ధిగలవాడవై పశుత్వము నొందకుము.

దౌర్భాగ్యదాయినీ దీనా శుభహీనా విచారణా
ఘనదీర్ఘమహానిద్రా త్యజ్యతాం సంప్రబుధ్యతామ్. 56

దౌర్భాగ్యజనకమును, అతిదీనమును నగు ధనాదులఁగూర్చిన విచారణ దీర్ఘగాఢనిద్రవంటిదిగాన నద్దానిని నీవు శీఘ్రముగ త్యజించి మోక్షమార్గమున జాగరూకుడవుకమ్ము.

సుప్తం మాస్థీయతాం వృద్ధకచ్ఛపేనేవ పల్వలే
ఉత్థానమంగీక్రియతాం జరామరణశాన్తయే. 57

అల్పతటాకమున వృద్ధకచ్ఛపంబుమాడ్కి నిదురపోవలదు. జరామరణ వినాశమునకై వెంటనే సన్నద్ధుడవుకమ్ము.

అనర్థాయార్థసంపత్తిర్భోగౌఘో భవరోగదః
ఆపదః సంపదః సర్వాః సర్వత్రానాదరో జయః. 58



ధనసంపత్తి యనర్థదాయకమును, భోగములు భవరోగకారకములును, సంపదలన్నియు నాపజ్జనకములును నగును. వీని నెవ్విధముగను ఆదరింపకుండుటయే జయహేతువని యెఱుంగుము.

లోకతన్త్రానుసారేణ విచారాద్వ్యవహారిణామ్
శాస్త్రాచారానుసారేణ కర్మణా తత్ఫలాయ చ. 59

జనుల కవిరోధమగు విచారములుగల్గి వ్యవహరించుచు, శాస్త్ర శిష్టాచారముల ననుసరించి సత్కర్మల ననుష్ఠించుటయందును, సత్ఫలముల పొందుటయందును సావధానులై యుండవలెను.

ఆచారచారుచరితస్య వివిక్తవృత్తేః
సంసారసౌఖ్యఫలదుఃఖదశాస్త్రగృధ్నోః
ఆయుర్యశాంసి చ గుణాశ్చ సహైవ లక్ష్మ్యా
ఫుల్లన్తి మాధవలతా ఇవ సత్ఫలాయ. 60

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే దామవ్యాల
కటోపాఖ్యానే సదాచారనిరూపణం నామ
ద్వాత్రింశః సర్గః ॥ 32 ॥

పూర్వాచార్యప్రణీతమగు యుత్తమ ఆచారములఁగల్గి, పవిత్రయాచరణయు, వివేకబుద్ధియు గలవాడై, ప్రాపంచిక సౌఖ్యములు కేవలము దుఃఖప్రదములేయని యెఱింగి శాస్త్రమందభిరుచిగల్గి వర్తించువానికి వసంతకాలమున లతవోలె ఆయువు, యశస్సు, గుణము, సౌభాగ్యము మున్నగునవి వృద్ధినొంది సత్ఫలములఁ గలుగఁజేయును.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు స్థితిప్రకరణమున
దామవ్యాళకటోపాఖ్యానమందు సదాచారనిరూపణమను
ద్వాత్రింశ సర్గము ॥ 32 ॥

---

## త్రయస్త్రింశః సర్గః.

---

శ్రీవసిష్ఠ ఉవాచ:—

సర్వాతిశయసాఫల్యాత్సర్వం సర్వత్ర సర్వదా
సంభవత్యేవ తస్మాత్త్వం శుభోద్యోగం న సంత్యజ. 1

శ్రీ వసిష్ఠుడు:— ఓ రామా! అతిశయముగ నొనర్పబడు యుత్తమసాధనలన్నియు నియమపూర్వకముగ సఫలమగుటచే లౌకికములగు కృషిసేవాది సాధనములందును, శాస్త్రీయములగు మోక్షాదులందును, శుభోద్యోగములందును, సర్వత్ర తదనుకూలమగు ఫలమవశ్యము సంభవించును. కాన నో రామా! మోక్షఫలముకొఱకై నీవు శుభయత్నమును విడువకుము.

మిత్రస్వజనబన్ధూనాం నన్దినానన్దదాయినా
సరసీశానమాసాద్య మృత్యురప్యుపనిర్జితః. 2

మిత్ర స్వజనబాంధవుల నానందింపజేయు నందికేశ్వరుడు† తన శుభయత్నముచే సరోవర తీరమున శ్రీ పరమశివుని చరణముల నాశ్రయించి అసాధ్యమగు మృత్యువునుగూడ జయించెను.

సర్వోత్కర్షేణ సంపన్నా దేవా అపి విమర్దితాః
దానవైర్దానవార్థాఢ్యైర్గజైః పద్మాకరా ఇవ. 3

సర్వైశ్వర్య సంపన్నులైన దేవతలు, యేనుగులచే కమలములు త్రొక్కబడునట్లు, సేనాద్యైశ్వర్యములచే పరిపూర్ణులగు బలి మున్నగు దానవులచే మర్దింపబడిరి.

మరుత్తనృపతేర్యజ్ఞే సంవర్తేన మహర్షిణా
బ్రహ్మణేవాపరః సర్గో భావితః ససురాసురః. 4

మరుత్తరాజుని యజ్ఞమందు సంవర్తుడను మహర్షి తన శుభప్రయత్నమువలననే బ్రహ్మదేవుని వలె మఱియొక సురాసురులసృష్టి నొనర్చెను.

మహాతిశయయుక్తేన విశ్వామిత్రేణ విప్రతా
భూయోభూయః ప్రయుక్తేన దుష్ప్రాపా తపసార్జితా. 5

మరల మరల సాధించుచు, మహాప్రయత్నశీలుడగు విశ్వామిత్రుడు తన తపస్సుచే దుష్ప్రాప్యమగు బ్రాహ్మణత్వమునుగూడ సముపార్జించెను.

పిష్టసేకాంబుదుష్ప్రాపం రసాయనవదశ్నతా
దుర్భగేనేదృశేనాప్తః క్షీరోద ఉపమన్యునా. 6

పిష్టజలము (పిండిగలిపిన నీరు) గూడ సరిగ లభింపక, లభించిన యద్దానినే నమృతమువలె త్రావు మందభాగ్యుడగు యుపమన్యువు తన శుభప్రయత్నముచే క్షీరసముద్రమును పొందగల్గెను.

త్రైలోక్యమల్లాం స్తృణవదశ్నన్విష్ణ్వబ్జజాదికాన్
భక్త్యాతిశయదార్ఢ్యేన కాలః శ్వేతేన కాలితః. 7

ముల్లోకమందలి వీరులను, బ్రహ్మ విష్ణ్వాదులంగూడ తృణమువలె భక్షించునట్టి యముని శ్వేతుడను ముని తన భక్త్యాతిశయముచే జయింపగల్గెను.

ప్రణయేన యమం జిత్వా కృత్వా వచనసంగమమ్
పరలోకాదుపానీతః సావిత్ర్యా సత్యవాన్పతిః. 8

సావిత్రియను రాజకన్య ప్రణయముచే యమరాజును జయించి తన పతియగు సత్యవంతుడు జీవింపవలయుననియు, ఆతనికి నూఱుగురుపుత్రులు కలుగవలయుననియు వరములంగోరుచు, ఆ వరముల నాతనిచే నంగీకరింపఁజేసి పరలోకమునుండి తనభర్తను తిరిగి సంపాదింపగల్గెను.

† శిలాదుడను ముని సర్వజ్ఞుడగు పుత్రునికొఱకై చిరకాలము తపంబొనర్ప నంత పరమశివుడు ప్రసన్నుడై నాకంటె వేఱుగ మఱియొకడు సర్వజ్ఞుడులేడనియు, నాయంశమే నీకు పుత్రుడుగ జన్మించుననియు, మఱియు నాతడు పదునాఱేండ్లుమాత్రము జీవించుననియు చెప్పెను. ఇట్లామునీంద్రుడీశ్వరానుగ్రహముచే బడసిన పుత్రుడే నందికేశ్వరుడు. ఈతడొక సరోవరతీరమున శివునిలింగము నర్చించుచు, యాశివుని యనుగ్రహముచే మృత్యువును జయింపగల్గెను — లింగపురాణము.



న సోఽస్త్యతిశయో లోకే యస్యాస్తి న ఫలం స్ఫుటమ్
భవితవ్యం విచారాన్తః సర్వాతిశయశాలినా. 9

శాస్త్రీయ శుభప్రయత్నాధిక్యముయొక్క ఫలము సుస్పష్టమైనది గాన సర్వోత్తమమగు మోక్షమునుగూర్చిన యత్నమే నీవొనర్పుము.

ఆత్మజ్ఞానమశేషాణాం సుఖదుఃఖదశాదృశామ్
మూలకాషకరం తస్మాద్భావ్యం తత్రాతిశాయినా. 10

జననమరణ, సుఖదుఃఖాది భ్రాంతులన్నింటిని సమూలముగ ఛేదించివైచునది ఆత్మజ్ఞాన మొక్కటియే గాన యద్దానివిషయమే యత్నించుట యుచితము.

నాశాయాపద్గతార్థిన్యా దృష్ట్యాదృశ్యాదిదృష్టయః
దుఃఖాదృతే నిరాబాధం సుఖం కించిదవాప్యతే. 11

క్షుధ, తృష్ణ, కామము మున్నగు యాపదలఁపరిగ్రహించునట్టి బుద్ధిని నశింపజేయుటకొఱకై ప్రథమమున తద్విరోధియగు (విషయదోష దర్శనమను) దృష్టి నన్వేషింపవలెను. వైరాగ్యాభ్యాసాది దుఃఖమును స్వీకరింపకయే బాధారహితమును, మహత్తరమును నగు సచ్చిదానందసుఖము లేశమైనను ఎట్లు ప్రాప్తినొందును ?

అశమః పరమం బ్రహ్మ శమశ్చ పరమం పదమ్
యద్యప్యేవం తథాప్యేనం ప్రథమం విద్ధి శంకరమ్. 12

శమత్వముచే పరిపూర్ణమైన చిదాత్మస్వరూపమగు బ్రహ్మమే పరబ్రహ్మము. శమమున్ను, కారణసహితముగ సంసారయనర్థమును నివర్తించుటద్వారా పరమపురుషార్థమొనగూర్చుచునేయున్నది ఈ రెండు (శమము, బ్రహ్మము)ను సమములైనను, మొదటిదానిని శంకరునిగ (బ్రహ్మానందముగలుగజేయునదిగ) నెఱుంగుము.

అభిమానం పరిత్యజ్య శమమాశ్రిత్య శాశ్వతమ్
విచార్య ప్రజ్ఞయార్యత్వం కుర్యాత్సజ్జనసేవనమ్. 13

ఓ రామా ! అభిమానమును త్యజించి, నిత్యము శమమునే యాశ్రయించి, శాశ్వతమగు మోక్షప్రాప్తికి యోగ్యమైన తన యుత్తమ జన్మాదులగూర్చి విచారించుచు సజ్జనుల సేవింపవలెను.

న తపాంసి న తీర్థాని న శాస్త్రాణి జయన్తి చ
సంసారసాగరోత్తారే సజ్జనాసేవనం వినా. 14

సత్పురుషసేవనములేనిచో తప, తీర్థ, శాస్త్రాదులేవియు సంసారసాగరమును దాటింప శక్యములుగావు.

లోభమోహారుషాం యస్య తనుతానుదినం భవేత్
యథాశాస్త్రం విహరతి స్వస్వకర్మసుసజ్జనః. 15

ఎవనికి లోభమోహక్రోధాదులు ప్రతిదినము సన్నగిల్లుచుండునో, మఱియు నెవడు తన కార్యములందు శాస్త్రానుకూలముగ వర్తించునో ఆతడే సజ్జనుడనబడును.

అథాత్మవిదుషాం సంగాత్తస్య సాధోః ప్రవర్తతే
అత్యన్తాభావ ఏవాస్య యథా దృశ్యస్యదృశ్యతే. 16

ఇట్లు సజ్జనులసాంగత్యము చేయుచురాగా, ఆత్మవేత్తలగువారి సంసర్గముచే నా సాధువునకు దృశ్యముయొక్క అత్యంతాభావ మనుభూతమగును.

దృశ్యాత్యన్తాభావతస్తు పరమేవావశిష్యతే
అన్యాభావవశాదాశు జీవస్తత్రైవ లీయతే. 17

దృశ్యముయొక్క అత్యంతాభావముచే పరమాత్మయే శేషించును. అన్యపదార్థాభావముచే జీవుడు శీఘ్రముగ నా పరమాత్మయందే లీనమగును.

న చోత్పన్నం న చైవాసీ ద్దృశ్యం న చ భవిష్యతి
వర్తమానేఽపి నైవాస్తి పరమేవాస్త్యవేధితమ్. 18

యథార్థముగ ఈ దృశ్యమెపుడును ఉత్పన్నము గాకయున్నది. ఇకముందును ఇయ్యది యుండబోదు. అట్టి యీ దృశ్యము వర్తమానకాలమందును లేనిదేయగును. కాన దేనిచే బాధితము గాక పరబ్రహ్మ మొకటియే శేషించుచున్నది.

ఏవం యుక్తిసహస్రేణ దర్శితం దృశ్యతేఽపి చ
సర్వైరేవానుభూతం చ దర్శయిష్యామి చాధునా. 19

ఈ యుత్పత్త్యాదుల యభావమును యుత్పత్తిప్రకరణమునం దనేక యుక్తులచే నిరూపించితిని. ఇపుడును నిరూపించుచున్నాను. విజ్ఞుల యనుభవము ననుసరించి యిపుడీ త్రిలోకసంబంధమగు చిదాకాశమును విస్పష్టమొనర్చెదను.

తథేదమమలం శాన్తం త్రిజగత్సంవిదమ్బరమ్
ఇదం తత్త్వమతత్త్వాది కుతోఽత్ర స్యాత్కథం చ వా. 20

త్రిలోకసంబంధమగు యీ చిదాకాశము శాంతమును నిర్మలతత్త్వమును అనగా పరమార్థరూపమునైయున్నది. అతత్త్వములును, మాయాజనితములును నగు ఆకాశాదులెటనుండి యే విధముగ నుద్భవించినవి? సత్తునుండియా, అసత్తునుండియా, లేక మాయనుండియా, దేనినుండి గల్గినవి? ఇందు మొదటి రెండుపక్షములును, అవికారత్వకారణమున యుక్తములుకావు. ఇక మాయనుండి యుత్పత్తి గల్గునన్నచో మిథ్యాత్మయే సంభవించును. గాన వీని యుత్పత్తియే సిద్ధింపకుండును.

చిచ్చమత్కురుతే చారు చంచలాఽచంచలాత్మని
యత్తత్త్వమేవ తదేవేదం జగదిత్యవబుధ్యతే. 21

కాన కల్పితమును చంచలమును నగు ఆత్మ (జీవాత్మ) యందు ప్రతిబింబించిన చైతన్యమే యీ వైచిత్ర్యమంతయు నొనర్చుచున్నది. అనగా జగత్తును కల్పించుచున్నది. దేనిని చైతన్యము కల్పనచేయుచున్నదో దానినే అయ్యది జగద్రూపముగ ననుభవించుచున్నది,

త్రైలోక్యభూమయోనుభవశ్చిదాదిత్యాంశుమండలమ్
కోవా స్వాంశుమతోఽర్చిదో నిర్వికల్పః సకథ్యతామ్. 22



ఈ ముల్లోకములందలి యనుభవమంతయు చైతన్యమను సూర్యుని కిరణసమూహమే అయియున్నది. కిరణములకును సూర్యునకును భేదములేనందున, వికల్పములన్నియు మిథ్యాభూతములగుటచే ముల్లోకములందలి యనుభవమున్ను నిర్వికల్పమగు బ్రహ్మస్వరూపమనియే వచింపనగును.

స్వాభావతోఽస్యాశ్చిద్దృష్టేర్యే ఉన్మేషనిమేషణే
జగద్రూపానుభూతే స్తావేతావస్తమయోదయౌ. 23

సవికల్పమగు చైతన్యవృత్తియొక్క అనగా చిదాభాసునియొక్క యున్మేష నిమేషములే జగదనుభవముయొక్క యుత్పత్తి వినాశములై యున్నవి.

అహమర్థోఽపరిజ్ఞాతః పరమార్థామ్బరే మలమ్
పరిజ్ఞాతోఽహమర్థస్తు పరమాత్మామ్బరం భవేత్. 24

అపరిజ్ఞాతమగు అహంకారమే పరమార్థమగు చిదాకాశమున మాలిన్యము అనగా అవిద్యయగును. కాని పరిజ్ఞాతమగు ఆ యహంకారమే చిదాకాశమగుచున్నది.

అహంభావపరిజ్ఞాతో నాహంభావో భవత్యలమ్
ఏకతామమ్బునేవామ్బు యాతి చిన్నభసాత్మనా. 25

అహంకారముయొక్క యథార్థస్వరూప మెఱింగినచో నిక నయ్యది యేవిధముగనైనను యుండనేరదు. జలము జలమున గలసి యైక్యమగునట్లు, పరిజ్ఞాతమగు యహంకారము చిదాకాశముతో నేకత్వముం జెందును.

అహమాదిజగద్దృశ్యం కిల నాస్త్యేవ వస్తుతః
అవశ్యమేవతత్తస్మా చ్ఛిష్యతేఽహం విచారతః. 26

ఓ రామా! అహంకారాది యీ దృశ్యసమూహమంతయు యథార్థముగ లేనిదేయగును. కాన అహంకారమునుగూర్చిన విచారణచే ఆ చిదాకాశమే తప్పక శేషించును.

బాధ్యతే చామలధియా మపిశాచే పిశాచధీః
శిశూనాం తావదాధ్యాన్తః కరణానాం విచారణా. 27

పిశాచము లేనపుడు పిశాచబుద్ధి పరిశుద్ధులగు జ్ఞానులకు గలుగనేరదు. కాని అల్పజ్ఞులగు బాలురకు పిశాచము లేదని యెన్నిమార్లు వచించినను యింకను సంశయమే గలుగుచు పిశాచబుద్ధి నివర్తింపక యుండును.

చిజ్జ్యోత్స్నా యావదేవాన్తరహంకారఘనావృతా
వికాసయతి నో తావత్పరమార్థ కుముద్వతీమ్. 28

ఓ రామా! ప్రౌఢబుద్ధి గలవారలకుఁగూడ నెంతవఱకు చైతన్యచంద్రిక అహంకారమను మేఘముచే గప్పబడియుండునో, అంతవఱకును పరమార్థరూపమగు చంద్రిక ప్రకాశింపక యుండును.

ప్రమార్జితేఽహమిత్యస్మిన్పదే స్వార్థే స్వయంవినా
నరకస్వర్గమోక్షాది తృష్ణాయాః కల్పనైవ కా. 29

జీవునియం దహంకారము తొలగగా నట్టి అహంకారరాహిత్యముచే నిక స్వర్గనరక మోక్షములకల్పనలే యెచట!

హృది యావదహంభావో వారిదః ప్రవిజృంభతే
తావద్వికాసమాయాతి తృష్ణాకుటజమఞ్జరీ. 30

అహంకారమను మేఘము హృదయమున చరించువఱకును తృష్ణయను కుటజము (కొండమల్లె) వికాసముఁ జెందుచునే యుండును.

ఆక్రమ్య చేతనాం నిత్యమహంకారాంబుదే స్థితే
జాడ్యమేవ స్థితిం యాతి న ప్రకాశః కదాచన. 31

అహంకారమను మేఘము చైతన్య - సూర్యు నాక్రమించియుండ నిక అజ్ఞానాంధకారమే ప్రాప్తించునుగాని జ్ఞానప్రకాశము కాదు.

అసన్నయమహంకారః స్వయం మిథ్యాప్రకల్పితః
దుఃఖాయైవ న హర్షాయ బాలసంభ్రమయక్షవత్. 32

అసత్తైనను ఈ యహంకారము బాలుని భ్రమచే కల్పింపబడు పిశాచమువలె సుఖము కొఱకుగాక దుఃఖముకొఱకే స్వయముగ మిథ్యారూపమున కల్పింపబడినది.

ముధైవ కల్పితో మోహ మహంభావః ప్రయచ్ఛతి
అనంతసంసారకరం దామాదిష్వివ దుర్మతౌ. 33

అభిమానముచే కలుషితమగు యంతఃకరణమున రజ్జ్వాదులందు సర్పాదులబుద్ధి యుదయించునట్లు, మిథ్యారూపమున కల్పింపబడిన ఈ యహంభావముచే అనంత సంసారభ్రమయును గలుగుచున్నది.

అయం సోఽహమితి స్ఫారాన్మోహాదన్యతరత్తమః
అనర్థభూతం సంసారే న భూతం న భవిష్యతి. 34

'ఈ దేహము నేను' 'ఈ యింద్రియాదులు నావి' — ఇత్యాది మహామోహములకంటె అన్యములగు యనర్థము లీప్రపంచమున యుండియుండలేదు, ఇక యుండబోవు.

యత్కించిదిదమాయాతి సుఖదుఃఖమలంభవే
తదహంకారచక్రస్య ప్రవికారో విజృంభతే. 35

ఈ లోకమందు సంప్రాప్తించు సుఖదుఃఖములన్నియు అహంకార - చక్ర పరిణామము యొక్క విజృంభణమనియే యెఱుంగవలెను.

అహంకారాంకురః కృష్టో హృదయేనావరోపితః
సహస్రశాఖం దుశ్ఛేదం తస్య సంసృతినాశనమ్. 36

ఎవఁడు అహంకారమను దుర్వృక్షాంకురమును శుద్ధమానసమను నాగటిచే పెఱికి పారవైచునో, వాని యాత్మ - క్షేత్రమున సంసార నాశకరమగు జ్ఞానబీజము సహస్రశాఖలుగ వృద్ధినొంది ఫలించును.



అహంభావోఽఙ్కురోజన్మవృక్షాణామక్షయాత్మనామ్
మమేదమితి విస్తీర్ణాస్తేషాం శాఖాః సహస్రశః. 37

ఓ రామా! అహంకారాంకురమునుండి యుద్భవించిన అక్షయమగు వృక్షములకు 'నాది' 'ఇది' యున్నగు విస్తీర్ణమైన శాఖలనేకములు గలవు.

కరటాపాతివిస్ఫోటా భాన్త్యర్థా వాసనాదయః
విచార్య చాతురవవత్తరంగవరవం క్తివత్. 38

[illegible]వాసనలను పదార్థములు, కాకపతనముచే పక్వతాళ్మలీఫలములు పడి నశించునట్లు [illegible]రముచే నశించునవియు, తరంగములవలె చంచలములునునై యున్నవి. అనగా అతితుచ్ఛములు[illegible]వము.

అహంభావనయా భాతి త్వమహంభావవర్జితః
సంసారచక్రవహనమాత్మనః పరిరోధయా. 39

ఆత్మస్వరూపుడవగు నీవు యథార్థముగ అహంభావరహితుడవే యైయున్నావు. అయినను ఆత్మను గప్పునట్టి యహంభావనచే స్వయముగ ఈ సంసారచక్రమున పరిభ్రమించుచున్నట్లు గాన్పించుచున్నావు.

అహంభావతమో యావజ్జన్మారణ్యే విజృంభతే
తావదేతా వివల్గన్తి చిన్తామత్తాః పిశాచికాః. 40

జన్మయను అరణ్యమున అహంకారమను అంధకారము వ్యాపించి యున్నంతవఱకు దుఃఖమును మదించిన పిశాచము విజృంభించుచునే యుండును.

అహంకారపిశాచేన గృహీతో యే నరాధమః
న శాస్త్రాణి న మన్త్రాశ్చ తస్యాభావన్య సిద్ధయే. 41

అహంకారమను పిశాచముచే గ్రహింపబడిన యధములయొక్క అహంకార - పిశాచ నివృత్తి శాస్త్ర మంత్రాదులచే సిద్ధింప నేరదు.

శ్రీ రామ ఉవాచ:—

కేనోపాయేన భగవన్నహంకారో న వర్ధతే
తం త్వం కథయ మే బ్రహ్మన్సంసారభయశాన్తయే. 42

శ్రీ రాముడు:— ఓ మహాత్మా! ఏ యుపాయముచే అహంకారము వృద్ధినొందక యుండునను విషయమును సంసారభయ నివృత్తి కొఱకై నాకు వచింపుము.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

చిన్మాత్రదర్పణాకారే నిర్మలే స్వాత్మని స్థితే
ఇతి భావానుసంధానా దహంకారో న వర్ధతే. 43

శ్రీ వసిష్ఠుడు:—ఓ రామా! ఆత్మ చిన్మాత్ర స్వరూపమును నిర్మల దర్పణము వంటిదియునైయున్నది. అట్టి శుద్ధ చిన్మాత్రమగు ఆత్మస్వభావమును నిరంతరము ధ్యానించుచుండుటచే అహంకారము వృద్ధినొందకుండును.

మిథ్యేయమిన్ద్రజాలశ్రీః కిం మే స్నేహవిరాగయోః
ఇత్యంతరానుసంధానాదహంకారో న జాయతే. 44

దృశ్యరూపమగు ఈ యింద్రజాలవైభవమంతయు మిథ్యయే. రాగద్వేషములచే నాకేమి ప్రయోజనము? — ఇట్లు మనమున నిరంతరము చింతన యొనర్చుచుండుటచే అహంకారము వృద్ధి నొందకుండును.

నాహమాత్మని నో యస్య దృశ్యశ్రీయ ఇతి స్వయమ్
శాన్తేన వ్యవహారేణ నాహంకారః ప్రవర్ధతే. 45

ఎవనియం దహంభావముగాని, దృశ్యవైభవముగాని యుండదో, ఎవడు ప్రశాంతచిత్తుడై వ్యవహరించునో, అట్టివానికి అహంకారము వృద్ధినొందదు.

అహం హి జగదిత్యన్తర్హేయాదేయదృశోః క్షయే
సమతాయాం ప్రసన్నాయాం నాహంభావః ప్రవర్ధతే. 46

ద్రష్ట (నేను) దర్శనము (చిత్తు) దృశ్యము (జగత్తు) — అను నీ త్రిపుటియందు త్యాజ్యగ్రాహ్యదృష్టు లుపశమింప, సమత్వ ముత్పన్నముకాగా అపుడు అహంకారము ప్రవృద్ధము కానేరదు.

అహం చిజ్జగదిత్యన్తర్హేయాదేయ దృశోః క్షయే
సమతాయాం ప్రసన్నాయాం నాహంభావః ప్రవర్ధతే. 47

'నేను, చిత్తు, జగత్తు' — అను నీ ప్రతీతులందు అంతఃకరణమున [illegible] త్యాజ్యగ్రాహ్యముల భేదదృష్టి నశింప అహంకారము వృద్ధి [illegible].

శ్రీ రామ ఉవాచ:—

కిమాకృతిరహంకారః కథం సంత్యజ్యతే ప్రభో
సశరీరోఽశరీరశ్చ త్యక్తే తస్మింశ్చ కిం భవేత్. 48

శ్రీ రాముడు:— ఓ మునీంద్రా! అహంకారముయొక్క స్వరూపమేమి? జాగ్రత్తునందును, స్వప్నమందును, మనోరథములందును దీని రూపమేమి? దేహమాత్రమని దేహాంభావరూపమగు అహంకారముయొక్కయు, దేహముకంటె భిన్నమగు బుద్ధిమాత్రమగు యుపాధియందలి అహంకారముయొక్కయు స్వరూపమెయ్యది? వివిధరూపములగు యీ అహంకారములన్నియు యెట్లు త్యజింపబడును? మఱియు నట్లు త్యజించుటచే నేమిఫలము?

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

త్రివిధో రాఘవాస్తీహ త్వహంకారో జగత్త్రయే
ద్వౌ శ్రేష్ఠావితరస్త్యాజ్యః శృణు త్వం కథయామి తే. 49

శ్రీ వసిష్ఠుడు:— ఓ రామా! ఈ జగంబున మూడువిధములగు యహంకారములు గలవు. వానిలో మొదటి రెండును శ్రేష్ఠములు. మూడవది శ్రేష్ఠముగాదు. అయ్యది త్యజింపదగినది. వానిని గూర్చి వచించుచున్నాను, వినుము,



అహం సర్వమిదం విశ్వం పరమాత్మాహమచ్యుతః
నాన్యదస్తీతి పరమా విజ్ఞేయా సా హ్యహంకృతిః. 50
మోక్షాయైషా న బన్ధాయ జీవన్ముక్తస్య విద్యతే

'ఈ జగత్తంతయు కార్యరూపము, కారణరూపుడును నాశరహితుడును నగు పరమాత్మను [illegible], [illegible]కన్యము జగత్తే లేదు' — అను నీ యహంకారము సర్వోత్తమమని యెఱుంగవలెను. [illegible] మోక్షమునే గలుగజేయును కాని బంధమును గాదు. ఇయ్యది జీవన్ముక్తున కుండును.

సర్వస్మాద్వ్యతిరిక్తోఽహం వాలాగ్రశతకల్పితః 51
ఇతి యా సంవిదేషాసా ద్వితీయాహంకృతిః శుభా
మోక్షాయైషా న బన్ధాయ జీవన్ముక్తస్య విద్యతే. 52

'నేనన్నిటికంటె భిన్నమై (సాక్షిస్వరూపుడనై) కేశాగ్రభాగముయొక్క నూఱవభాగముకంటెను సూక్ష్మమై యున్నాను, అనగా నిరవయవుండను — ఇట్టి మనోనిశ్చయమున్ను శుభాహంకృతియే యగును. ఈ రెండవ యహంకారమున్ను మోక్షమునే గలుగజేయునుకాని బంధమును గాదు. ఇదియు జీవన్ముక్తున కుండును.

అహంకారాభిధా యాసా కల్ప్యతే న తు వాస్తవీ
పాణిపాదాది మాత్రోఽయమహమిత్యేష నిశ్చయః. 53
అహంకారస్తృతీయోఽసా లౌకికస్తుచ్ఛ ఏవ సః
సర్వ ఏవ దురాత్మాసా శత్రురేవ పరః స్మృతః. 54

సప్తమ భూమికయందుండువారలకీ రెండు అహంకారములును కేవలము కల్పనామాత్రములేగాని వాస్తవములు గావు. ఇక హస్తపాదాది యుక్తమగు దేహము మాత్రమే నేనను నిశ్చయము, లౌకికమును, తుచ్ఛమును నగు మూడవ యహంకారమనబడును. ఇది నీచమైనది. మఱియు నియ్యది ప్రబలశత్రువని వచింపబడినది గాన త్యజింపదగిన దగును.

అనేనాభిహతో జన్తుర్న భూయః పరిరోహతి
రిపుణానేన బలినా వివిధాధిప్రదాయినా. 55

పలువిధ విపత్కారకమును బలవత్తరమును నగు యీశత్రువుచే వధింపబడు జీవుడు మఱల నిలువజాలడు.

కష్టీకృతమతిర్లోకః సంకటేష్వేవ మజ్జతి
అనయా దురహంకృత్యా భావాత్సంసక్తయా చిరమ్. 56

స్వభావముగనే అనాదికాలమునుండి సంసక్తమైయున్న దేహాహంభావరూపమగు యహంకారముచే, దుర్వాసనాదులందు ప్రవృత్తమై వానిచే బాధితమగు బుద్ధిగల్గి జనులు నిరంతరమనేక విపత్తులఁగూలుచున్నారు.

శిష్టాహంకారవాఞ్జన్తుర్భగవాన్యాతి ముక్తతామ్
లోకాహంకారవద్దోషవపురస్మిన్నిరూపణః. 57

కాని, పూర్వోక్తమగు శుద్ధాహంకారసహితుఁడై, దేహాహంభావరూపమగు లౌకికాహంకారముయొక్క దోషముల విచ్ఛిన్న మొనర్చుచు, ఈ సర్వాత్మాహంభావరూపమగు యహంకారమును ప్రసిద్ధమగు దేహాహంభావరూపమగు యహంకారమువలననే నిరూపించుచు, మహాత్ముఁడగు పురుషుడు దేహాహంకారమునుండి విముక్తిఁబొందును.

ప్రథమం ద్వావహంకారా వంగీకృత్యా త్వలౌకికా
న దేహోఽస్మీతి నిర్ణీయ వర్జనం మహతాం మతమ్. 58

మొదటి రెండహంకారములను మూడవదగు దేహాహంకారమువలె దృఢపఱచుకొని, 'నేను దేహమునుకాన'ని నిశ్చయించినమీదట ఆ యహంకారములగూడ త్యజించివైచుట పూర్వీకులగు మహాత్ముల సమ్మతము.

ప్రథమం ద్వావహంకారా వంగీకృత్యా త్వలౌకికా
తృతీయాహంకృతిస్త్యాజ్యా లౌకికీ దుఃఖదాయినీ. 59

మొదటి రెండహంకారములను లౌకికమగు దేహాహంభావము వలెనే స్థిరపఱచుకొని, మిగుల దుఃఖప్రదమైన మూడవదగు దేహాహంకారమును త్యజింపవలెను.

అనయా దురహంకృత్యా దామవ్యాలకటాః కిల
తాం దశాం సమనుప్రాప్తా యా కథాస్వపి ఖేదదా. 60

ఈ దుష్టమగు యహంకారము (దేహాహంభావము) చే దామవ్యాళకటులకు గల్గిన దుర్దశను స్మరించుటచేగూడ దుఃఖము కల్గుచున్నది.

శ్రీ రామ ఉవాచ:—

తృతీయాం లౌకికీమేతాం త్యక్త్వా చిత్తాదహంకృతిమ్
కింభావః పురుషో బ్రహ్మన్ప్రాప్నుయాదాత్మనో హితమ్. 61

శ్రీ రాముడు:— మూడవదగు లౌకిక దేహాహంకారమును పరిత్యజించి మానవుడెట్లు వర్తించుచు తన హిత మొనర్చుకొనునో వచింపుము.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

ఏషా తావత్పరిత్యాజ్యా త్యక్త్వైతాం దుఃఖదాయినీమ్
యథాయథా పుమాంస్తిష్ఠే త్పరమేతి తథాతథా. 62

శ్రీ వసిష్ఠుడు:— ఓ రామా! దుఃఖప్రదమగు యీ మూడవ అహంకారమును త్యజించి, సర్వాహంభావ, శుద్ధాహంభావ, గురు శుశ్రూషాదులచే సప్తభూమికాదులం దేయే విధమున స్థితిగల్గియుండుటకు సమర్థుడగునో, ఆ యా రీతిగనే స్వరూప సుఖాధిక్యలాభ మొందుచు జీవుడు క్రమముగ పరబ్రహ్మమును ప్రాప్తినొందును.

అహంకారదృశావేతే పూర్వోక్తే భావయన్యది
తిష్ఠేదుష్టైతి పరమం తత్పదం పురుషోఽనఘ. 63



పాపరహితుడవగు నో రామా! పూర్వోక్తములైన మొదటి రెండహంకారముల నాశ్రయించి, అట్టి యుత్తమదృష్టినే భావించుచుండినచో, మనుజుఁడా పరమపదమగు బ్రహ్మమునే ప్రాప్తినొందును.

అథ తే అపి సంత్యజ్య సర్వాహంకృతివర్జితః
సంతిష్ఠేత తథాత్యుచ్చైః పదమేవాధిరోహతి. 64

పిమ్మట యా శుభాహంకారముల రెంటినిగూడ వదలి, ఏ యహంకారమును లేకయుండునో, సర్వోత్తమమగు బ్రహ్మపద మధిరోహించును.

సర్వదా సర్వయత్నేన లౌకికీ దురహంకృతిః
పరమానన్దబోధాయ వర్జనీయాఽనయా ధియా. 65

దేహాహంభావరూపమగు దుష్టాహంకారమును పూర్వోక్తబుద్ధిచే, పరమానందస్వరూపమగు పరబ్రహ్మమునుగూర్చిన బోధకొఱకై సర్వవిధముల సర్వదా వర్జింపవలెను.

శరీరాస్థామయా పుణ్యా దురహంకారవర్జనమ్
అత్యన్తపరమం శ్రేయ ఏతదేవ పరంపదమ్. 66

దేహమందలి రోగమువంటియు, పాపరూపమునునగు దేహాహంభావరూపమైన దుష్టాహంకారమును వర్జించుటయే పరమశ్రేయమున్ను, పరమపదమును నైయున్నది.

భావాదహంకృతిం త్యక్త్వా స్థూలామేతాం హి లౌకికీమ్
తిష్ఠన్వ్యవహరన్వాపి న నరః ప్రపతత్యధః. 67

స్థూలమగు యీ లౌకికాహంకారమును తత్త్వవిచారముద్వారా త్యజించిన పిదప, మనుజుడు వ్యవహరించినను, వ్యవహరింపకున్నను అధఃపతనమును జెందడు.

సంశాన్తాహంకృతేర్జన్తోర్భోగా రోగా మహామతే
న స్వదన్తే సుతృప్తస్య యథా ప్రతివిషారసాః. 68

మహామతివగు నో రామా! అహంకారము శమించిన పూర్ణతృప్తుఁడగు మానవునకు రోగరూపములగు భోగములు విషమిశ్రిత రసమువోలె రుచింపకుండును.

భోగేష్వస్వదమానేషు పుంసః శ్రేయః పురోగతమ్
క్షీణేఽన్ధకారే కింనామ మనసోఽన్యత్ప్రవర్తతే. 69

మనుజునకు భోగములెపుడు రుచింపకుండునో, అపుడే మోక్షరూపమగు శ్రేయము కలుగుచున్నదని యెంచుము. ఏలయన మనస్సునం దంధకారము వంటి అహంకారము శమింప నిక మఱియొక ప్రతిబంధమేమి గలదు?

అహంకారానుసంధానవర్జనాదేవ రాఘవ
పౌరుషేణ ప్రయత్నాశ్చ తీర్యతే భవసాగరః. 70

ఓ రామా! అహంకారమును వర్జించుటచేతను, ధైర్యావలంబన, శాస్త్రశ్రవణాది పురుషప్రయత్నముల వలనను సంసారసాగరము దాటబడును.

నాహం నతేన మమ కించిదపీతి మత్వా
సర్వం చ మే సకలమవ్యహమేవ చేతి
లబ్ధాస్పదం మనసి సంవిదమేవమిద్ధ్యాం
నీత్వా స్థితిం పరముపైతి పదం మహాత్మా. 71

ఇత్యార్షే వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
దామవ్యాలకటోపాఖ్యానే అహంకారవిచారో నామ
త్రయస్త్రింశః సర్గః ॥ 33 ॥

ప్రథమమున, 'ఈ జగత్తంతయు నేనే, కాన అంతయు నా స్వరూపమే యగునని నిశ్చయించి, పిదప 'ఈ దేహాదులు నేను గాను, దేహసంబంధములగు ధనపుత్రాదులు నావి గావని భావించి ప్రతిబంధములన్నియు రహితమగుటచే, పూర్వోక్తమగు పరిశుద్ధాత్మచైతన్యమును పొంది క్రమముగ సప్తమభూమికయందు స్థితిగల్గి స్వయముగ అపరిచ్ఛిన్నమగు పరిపూర్ణాత్మస్వరూపుడై జీవుడు విదేహకైవల్యమును ప్రాప్తినొందును.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు స్థితిప్రకరణమున
దామవ్యాళకటోపాఖ్యానమందు అహంకారవిచారమను
త్రయస్త్రింశ సర్గము ॥ 33 ॥

---

## చతుస్త్రింశః సర్గః

---

శ్రీ వసిష్ఠ ఉవాచః—

అత్ర తే శృణు వక్ష్యామి దామాదిషు గతేష్వథ
యద్వృత్తం శంబరస్యైవ నగరే నగసంనిభే. 1

శ్రీ వసిష్ఠుడు:—ఓ రామా! దామాదులు నశించిన వెనుక, మేరు తుల్యమగు సంపదవలె మహత్తరమగు యా నగరమందలి శంబరునియొక్క వృత్తాంతమును గూర్చి వచించుచున్నాను వినుము.

తథా గగనవిభ్రష్టే సమస్తే ధ్వస్తసంస్థితౌ
వినష్టే శంబరానీకే శరదీవాబ్దమండలే 2
దేవనిర్జితసైన్యోఽసౌ నీత్వా కతిపయాః సమాః
పునర్దేవవధోద్యుక్తశ్చిన్తయామాస దానవః. 3

అట్లాకాశమునుండి దైత్యులందఱును పడిన పిమ్మట, అంతయును ధ్వంసముకాగా, శరదృతువందలి మేఘసమూహమువలె శంబరుని సైన్యమంతయు నశింప, దేవతలచే వారల సైన్యమంతయు జయింపబడ అప్పుడు, కొన్ని వత్సరములూరకుండి మఱల శంబరాసురుడు దేవతల వధించుట కుపాయ మిట్లాలోచించెను—



దామాదయస్తు రచితా యే మయా మాయయాఽసురాః
మౌర్ఖ్యాత్తైర్భావితా యుద్ధే మిథ్యైవ దురహంకృతిః. 4

దామాద్యసురులను మాయచే నేను సృష్టించితిని, కాని వారు తమ మూర్ఖత్వముచే సంగ్రామమున మిథ్యయగు దురహంకారమును కల్పనజేసిరి.

ఇదానీం సంసృజామ్యన్యాన్దానవాన్మాయయోదితాన్
తానధ్యాత్మశాస్త్రజ్ఞాన్సవివేకాన్కరోమ్యహమ్. 5

కాన యిపుడు మాయచే మరల అన్యదానవుల సృష్టించెదను. మఱియు వారలను అధ్యాత్మశాస్త్రవేత్తలుగను, వివేకవంతులుగను యొనర్చెదను.

తతస్తత్త్వపరిజ్ఞానాన్మిథ్యాభావనయోజ్ఝితాః
నాహంకారం ప్రయాస్యన్తి విజేష్యన్తి చ తాన్సురాన్. 6

అపుడు వారు తత్త్వజ్ఞానముచే మిథ్యాభావనారహితులై అహంకారమును పొందకయుండి దేవతలను జయింపగల్గుదురు.

ఇతి సంచిన్త్య దైత్యేన్ద్రః స్వాదృశాన్దానవాన్ధియా
మాయయోత్పాదయామాస బుద్బుదానీవ వారిధిః. 7

ఇట్లు విచారించి యా దైత్యేంద్రుడు సముద్రము బుద్బుదముల రచించు విధమున తన బుద్ధిచే మాయాకౌశల్యమున దానవులను సృష్టించెను.

సర్వజ్ఞా వేద్యవేత్తారో వీతరాగగతైనసః
యథాప్రాప్తైకకర్తారో భావితాత్మాన ఉత్తమాః. 8

ఆదానవులు సర్వజ్ఞులును, వేద్యమగు పరబ్రహ్మము నెఱింగినవారును, వీతరాగులును, పాపరహితులును, ప్రాప్తించిన కార్యమును జేయువారును, శుద్ధబుద్ధిగలవారును, యుత్తములును అయియుండిరి.

భీమో భాసో దృఢ ఇతి నామభిః పరిలాఞ్ఛితాః
జగత్తృణమివాశేషం పశ్యన్తః పావనాశయాః. 9

భీమ భాస దృఢులని పేర్కొనబడిన వారు మువ్వురును పవిత్రాంతఃకరణులై [illegible]ంతయు తృణప్రాయముగ జూచువారై యుండిరి.

తే దైత్యా భువనం ప్రాప్య ఛాదయామాసురంబరమ్
గర్జన్తో హేతితడితః ప్రావృషీవ పయోధరాః. 10

ఆ దైత్యులు భూమండలమును ప్రవేశించి వర్షాకాలపు మేఘములవలె నాకసమును పరివేష్టించిరి. మఱియు శస్త్రాస్త్రములచే విద్యుల్లతవోలె గర్జన యొనర్చుచుండిరి.

అయుధ్యన్త సమం దేవైరపి వర్షగణాన్బహూన్
వివేకవశతో జగ్ముర్నాహంకారం కదాచన. 11

వారనేక వత్సరములు దేవతలతో పోరాడినను, వివేకయుక్తులైయున్నందున అహంకారము నొందకుండిరి.

తేషాం యావదుదేత్యన్తర్మమేదమితి వాసనా
తావత్కోఽయమహం చేతి విచారాద్యాత్యసత్యతామ్. 12

'నాది' 'ఇది' యనునట్టి భావనలతో గూడిన వాసనలు వారల యంతఃకరణమున నుదయించిన తోడనే, 'ఈ ప్రపంచమేమి, మా స్వరూపమేమి' యను విచారణచే నయ్యవి అసత్తుల్యములుగ నొనర్పబడుచుండెను.

అసచ్ఛరీరం విబుధాః కోఽసావహమితి స్థితిః
విచారాదిత్థమేతేషాం ప్రోదగుర్న భయాదయః. 13

దేహమసత్యము; దేవతలున్ను అసత్తుల్యులు; ఈ ప్రపంచమేమి? మేమెవరు? ఈ జగత్స్థితి మిథ్యయే — ఇట్టి విచారముచే వారి హృదయమున భయాదు లుత్పన్నము గాకయుండెను.

అసచ్ఛరీరం నాస్తీదం చిచ్ఛుద్ధైవాత్మని స్థితా
అహం నామ న చాన్యోఽస్తి నిశ్చిత్యైవాసురా యయుః. 14

'శరీరము మిథ్యగాన లేనిదేయగును. ఆత్మయందే స్థితిగల్గియున్న శుద్ధచైతన్యము సత్యమైనది. మేముగాని యితరులుగాని యథార్థముగ లేము' — అని యిట్లు నిశ్చయించి ఆ యసురులు యుద్ధమునకుఁ బయనమైరి.

తతస్తైర్నిరహంకారైర్జరామరణనిర్భయైః
ప్రాప్తార్థకారిభిర్ధీరైర్వర్తమానానుసారిభిః. 15
అసక్తబుద్ధిభిర్నిత్యం హతాన్యైరవ్యహన్తృభిః
వాసనాజాలనిర్ముక్తైః కృతకార్యైరకర్తృభిః. 16
ప్రభోః కార్యమిదం కార్యమితి సంగరతత్పరైః
వీతరాగైర్గతద్వేషైః సర్వదా సమదృష్టిభిః. 17
సాదైవీ దానవైః సేనా భీమభాసదృఢాదిభిః
హతా భుక్తా హృతా ప్లుష్టా స్వాన్నశ్రీరివ భోక్తృభిః. 18

పిమ్మట, అహంకారవర్జితులును, జరామృత్యుభయరహితులును, ప్రాప్తించిన కార్యములఁ జేయువారును, ధీరులును, వర్తమానకాలమునే యనుసరించి వర్తించువారును, నిత్యమసక్తబుద్ధిగల్గి యుండువారును, యితరుల వధించినను అభిమానము లేనందుచే వధింపకయున్నవారును, వాసనాజాలవినిర్ముక్తులును, కృతకృత్యులును, అకర్తలును, 'ఇయ్యది ప్రభుకార్యము గాన నియమపాలనకొఱకై దీనిని తప్పక యాచరింపవలెనని తలంచి యుద్ధతత్పరులైనవారును, వీతరాగులును, ద్వేషరహితులును, నిరంతరము సమదృష్టిగలవారును నగు భీమభాసదృఢాదిదానవులచే దేవతల సైన్యము వధింపబడెను, హరింపబడెను, దగ్ధమొనర్పబడెను, భోక్తచే భోగ్యవస్తువు ననుభవింపబడునట్లు యనుభవింపబడెను. (సేవాది కార్యములను వారలచే జేయించుకొనిరి.)



భీమభాసదృఢక్షుణ్ణా జాతా గీర్వాణవాహినీ
పరిద్రుద్రావ వేగేన గఙ్గేవ హిమవచ్చ్యుతా. 19

అపుడు భీమభాసదృఢులచే సమ్మర్దింపబడిన దేవతాసైన్యము హిమాలయమునుండి గంగానదివలె వేగముగ పరుగిడి పారిపోయెను.

సాసురానీకినీ దేవం క్షీరోదార్ణవశాయినమ్
జగామ శరణం శైలం వాతార్తేవాబ్దమాలికా. 20

అంత, వాయువుచే పీడితమగు మేఘపంక్తి పర్వతము నాశ్రయించునట్లు, ఆ దేవతాసైన్యము క్షీరసాగరమున శయనించు విష్ణుభగవానుని శరణుబొందెను.

హరిరాశ్వాసయామాస తాం భీతాం దేవవాహినీమ్
భుజంగాభివృతామేకాం రమణీమివ నాయకః. 21

జారులచే పరివేష్టింపబడిన స్త్రీకి తన భర్త ధైర్యముగొల్పునట్లు, భయభీతమగు దేవతాసైన్యమునకు విష్ణుభగవానుడు ధైర్యప్రదానము గావించెను.

అథ క్షీరోదకుహరే తావత్సాసురవాహినీ
ఉవాస యావద్భగవాంస్తన్నిరాసార్థముద్యయౌ. 22

ఆ పిమ్మట విష్ణుభగవానుడు శంబరుని వధించుటకై పయనమువనంతవరకును దేవతాసైన్యము శ్వేతద్వీపమందు వసించియుండెను.

బభూవ దారుణం యుద్ధం శౌరిశంబరయోస్తతః
అకాల ఇవ కల్పాన్తే సముడ్డీనకులాచలమ్. 23

పిదప మహేంద్రాది కులపర్వతములున్ను ఎగురగొట్టబడు అకాలప్రళయమువలె, విష్ణుశంబరాసురులకు భయంకరమగు యుద్ధము సంభవించెను.

శశామ సమరే తస్మిన్దైత్యః సబలవాహనః
నారాయణహతో యాతః శంబరో వైష్ణవీం పురీమ్. 24

అపుడు సేనావాహనములతోగూడ నా దైత్యుఁడు వధింపబడెను. ఇట్లు నారాయణునిచే హతుడైన ఆ శంబరాసురుడు విష్ణుపురముఁజేరెను.

భీమభాసదృఢాస్తే తు తస్మిన్విషమసంగరే
విష్ణునైవ శమం నీతాః పవనేనేవ దీపికాః. 25

వాయువు దీపమును శమింపజేయునట్లు, ఆ ఘోరసంగ్రామమున విష్ణుభగవానుడు భీమభాసదృఢులకు విదేహకైవల్యప్రాప్తి నొనగూర్చెను.

తే హి నిర్వాసనా ఏవ యదా శాన్తిముపాగతాః
న తద్వైషాం గతిర్జ్ఞాతా దీపానామివ శామ్యతామ్. 26

వాసనారహితులగు నా దానవులుపశమింప, అంత శమించిన దీపములవలె వారి గతియు లభింపకుండెను.

తస్మాద్వాసనయా బద్ధం ముక్తం నిర్వాసనం మనః
రామ నిర్వాసనీభావమాహరస్వ వివేకతః. 27

కాన నో రామా ! వాసనాయుక్తమగు మనస్సు బద్ధమును, వాసనారహితమగునది ముక్తమును నగును. అందుచే నీ వవశ్యము వాసనారాహిత్యమును సంపాదించుకొనుము.

సమ్యగాలోకనాత్సత్యాద్వాసనా ప్రవిలీయతే
వాసనావిలయే చేతః శమమాయాతి దీపవత్. 28

సత్యవస్తువును బాగుగ విచారించుటచే వాసనలు లెస్సగ నివర్తించును. వాసనలు నశించుటచే చిత్తము దీపమువలె ప్రశమన మొందును.

న సత్యం కించిదేవేహ సద్భావో భావయత్యలమ్
నాస్త్యేవ భావనా తస్మాదిత్యేతత్సమ్యగీక్షణమ్. 29

పరిపూర్ణమగు చిదాత్మయే దృశ్యకల్పన యొనర్చుచున్నచో, అట్టిది కొంచెమైనను సత్యము గాదు. కాన దృశ్యాకారమగు భావన భావనయే గాదు. చిన్మాత్రస్వరూపమగు పరమాత్మయొక్క సాక్షాత్కారమే సమ్యక్-దర్శనమగును.

ఆత్మైవేదం జగత్సర్వం కః కిం భావయతు క్వవా
భావనానామ నాస్త్యేవ తదేతత్సమ్యగీక్షణమ్. 30

ఈ జగత్తంతయు ఆత్మయే అయియుండ నిక యెవడెచట దేనిని భావించును ? కాన యీ త్రిపుటియు అద్దాని భావనయు (సంస్కారమున్ను) సత్యము గాదు. ఇదియే సమ్యక్-జ్ఞానము.

వాసనాచిత్తనామాసౌ శబ్దావర్థసమన్వితౌ
సత్యావలోకనాద్యత్ర విలీనౌ తత్పరంపదమ్. 31

సత్యవస్తువిచారముచే చిత్త, వాసనాశబ్దములు రెండును అర్థసహితముగ యెట లీనమగునో అదియే పరమపదము.

వాసనా వలితం చిత్తమిహ స్థితి ముపాగతమ్
తదేవ తద్వినిర్ముక్తం విముక్తమితి కథ్యతే. 32

వాసనాగ్రస్తమగు చిత్తము జగత్తున స్థితిగల్గియున్నదగుచున్నది; అనగా బద్ధమగుచున్నది. అదియే వాసనారహితమగుచో ముక్తమని (జీవన్ముక్తస్థితిని బడసెనని) వచింపబడును.

నానాఘటపటాకారైశ్చేతః స్థితిముపాగతమ్
తదేవాశు శమం నేయం మిథ్యాయక్ష ఇవోత్థితః. 33

ఘటపటాద్యనేక పదార్థరూపములుగ చిత్తము జగత్తున స్థితిని బడసియున్నది. బాలుని మిథ్యాబేతాళమువలె నద్దానిని శీఘ్రముగ శమింపజేయవలెను.

దామవ్యాలకటాకారైశ్చేతః పరిణతం యథా
భీమభాసదృఢన్యాయో రాఘవా స్వచలస్తవ. 34



ఓ రామా ! దామవ్యాళకటుల చిత్తమువలె దేహాత్మభావమున పరిణమించిన నీ చిత్తమును భీమభాసదృఢుల చిత్తమువలె ఆత్మాకారముగ పరిణమింపజేసి నిశ్చలుడవై యుండుము.

దామవ్యాలకటన్యాయో మా తే భవతు రాఘవ
ఏతద్రామ పురా ప్రోక్తం పిత్రా కమలజేన మే. 35

ఓ రామా ! 'దామవ్యాళకట న్యాయము నీ కెన్నటికిని వలద'ని పూర్వము నా తండ్రియగు బ్రహ్మదేవుడు నాతో స్పష్టముగ బల్కియుండెను.

భవతే యన్మయా ప్రోక్తం శిష్యాయాత్యన్తధీమతే
దామవ్యాల కటన్యాయస్తస్మాన్మాతేఽస్తు రాఘవ
భీమభాసదృఢన్యాయో నిత్యమస్తు తవానఘ. 36

అందుచే దామవ్యాళకటన్యాయము నీ కెన్నటికి వలదనియు, భీమభాసదృఢన్యాయమే నిత్య మనుకరణీయమనియు, మిగుల బుద్ధిమంతుడవును శిష్యుడవునగు నీకు నే నుపదేశించియున్నాను.

అవిరలసుఖదుఃఖసంకటేయం
భవపదవీ భవతాపనోపయాతా
వ్యవహరణవతో విభూతియాతౌ
సతతమసక్తతయైవ నశ్యతీతి. 37

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
దామవ్యాలకటోపాఖ్యానసమాప్తిర్నామ
చతుస్త్రింశః సర్గః ॥ 34 ॥

ఓ రామా ! ఇట్టి భీమభాసదృఢ న్యాయము ననుసరించి వ్యవహరించుచు, సర్వత్ర అసంసక్తబుద్ధిగల్గి వర్తించుటచే దృఢబోధయను ఐశ్వర్యము లభింపనపుడే వివిధ సుఖదుఃఖములచే పరిపూర్ణమును, జన్మపరంపరనొసంగి త్రివిధ సంతాపముల ననుభవింపజేయునదియు నగు సంసార పదము సమూలముగ నుచ్ఛిన్నమగుకాని అన్యవిధముగ గాదు.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు స్థితిప్రకరణమున
దామవ్యాళకటోపాఖ్యానసమాప్తియను
చతుస్త్రింశ సర్గము ॥ 34 ॥

——:o:——

## పంచత్రింశః సర్గః.

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

జయన్తి తే మహాశూరాః సాధవో యైర్వినిర్జితమ్
అవిద్యామేదురోల్లాసైః స్వమనోవిషమోన్ముఖమ్. 1

శ్రీ వసిష్ఠుడు:— ఓ రామా! అవిద్యాకారణంబున నతి యుత్సాహముతో విషయముల వైపునకు పరుగిడు మనస్సును జయించిన మహాశూరులగు సాధుపుంగవులు సర్వోత్తము లనందగుదురు.

సంసారస్యాస్య దుఃఖస్య సర్వోపద్రవదాయినః
ఉపాయ ఏక ఏవాస్తి మనసః స్వస్య నిగ్రహః. 2

దుఃఖదాయకమును సమస్త ఆపదలకు హేతుభూతమును నగు యీ సంసారముయొక్క ప్రశమనముకొఱకై మనోనిగ్రహమే ముఖ్యమగు నుపాయము.

శ్రూయతాం జ్ఞానసర్వస్వం శ్రుత్వా చైవావధార్యతామ్
భోగేచ్ఛామాత్రకో బన్ధస్తత్త్యాగో మోక్ష ఉచ్యతే. 3

ఓ రామా! జ్ఞానముయొక్క సర్వస్వమును వచించుచున్నాను వినుము. విని నీ హృదయమున యద్దానిని చక్కగ ధారణయొనర్పుము. అదేదన— విషయభోగములందలి యిచ్ఛయే బంధనము, అట్టి యిచ్ఛను పరిత్యజించుటయే మోక్షము.

కిమన్యైః శాస్త్రసందర్భైః క్రియతామిదమేవ తు
యద్యత్స్వాద్విహ తత్సర్వం దృశ్యతాం విషవహ్నివత్. 4

అనేకములగు నితరశాస్త్రములచే నేమి ప్రయోజనము. ఈ యొక్క విషయమును మాత్ర మాచరింపుము — ఈ ప్రపంచమున ఏ యే వస్తువు ప్రీతివంతముగ తోచునో, దానిని విషమువలెను అగ్నివలెను చూడుము.

విషమా విషయాభోగాః ప్రవిచార్య పునఃపునః
ఉపరిష్టాత్పరిత్యజ్య సేవ్యమానాః సుఖావహాః. 5

విషయభోగములు భయంకరములని మఱల మఱల విచారించి భోగవాసనా త్యాగపూర్వకముగ వానిని సేవించిన సుఖప్రదములే యగును.

దోషాన్ప్రసవతి స్ఫారా న్వాసనావలితామతిః
కీర్ణకంటకబీజా భూః కంటకప్రసరం యథా. 6

భూమి కంటక బీజమునుండి కంటకముల నుత్పన్న మొనర్చునట్లు, వాసనాగ్రస్తమగు బుద్ధి రాగాది పెక్కుదోషముల నుత్పన్నము చేయును.

అలగ్నవాసనాజాలా మతిః ప్రసరవర్జితా
అదృష్టరాగద్వేషా యా శమమేతి శనైః పరమ్. 7

వాసనాజాలమందు తగుల్కొనక రాగద్వేషరహితమై యచంచలముగనుండు బుద్ధి క్రమముగ పరమశాంతిని బొందును.

శుభాశుభానసద్గ్లానీన్ప్రసూతే సుగుణాన్సదా
ఫలదానన్కులాన్కాలే శ్రేష్ఠబీజవతీవ భూః. 8



శాల్యాది ఉత్తమ బీజముగల భూమి కాలక్రమమున ఫలముత్పన్న మొనర్చునట్లు, శుభ స్వరూపమును, దుఃఖరహితమును, శాంత్యాది శుభగుణయుక్తమును నగు బుద్ధి జ్ఞాన, సమాధిరూపమును మోక్షదాయకమును నగు ఫలము నుత్పన్నము చేయుచున్నది.

శుభభావానుసంధానాత్ప్రసన్నే మనసి స్థితే
శనైః శనైః ప్రశాన్తే చ మిథ్యాజ్ఞానఘనామ్బుదే. 9
బుద్ధిం యాతే చ సౌజన్యే యత్నే శుక్ల ఇవోడుపే
వివేకే ప్రసృతే పుణ్యే నభసీవార్కతేజసి. 10

ఓ రామా! ఉత్తమభావానుసంధానముచే మనస్సు ప్రశాంతినొంద, అజ్ఞానమను దట్టమైన మేఘము క్రమముగ నశింప, అపుడు శుక్లపక్ష చంద్రునివలె సౌజన్యము వృద్ధినొందును. మఱియు ఆకాశమందు సూర్యతేజమువలె వివేకము వ్యాపించును.

ధృతావన్తర్వివృద్ధాయాం ముక్తాయామివ కీచకే
స్థితావన్తః కృతార్థాయాం మధావివ నిశాకరే. 11

వెదురునందు ముత్యమువలె అపు డాత్మలాభముచే హృదయమున ధైర్యము వృద్ధినొందును. మఱియు వసంతకాలమునాటి చంద్రునివలె, ఆత్మానందలాభముచే కృతార్థత సంభవించును.

ఫలితే శీతలచ్ఛాయే సత్సంగసఫలద్రుమే
ప్రవత్యానందసురసే సమాధిసరలద్రుమే. 12

అపుడు శీతలచ్ఛాయాయుక్తమగు సంత్సాంగత్యమను ఫలవృక్షము ఫలించును. సమాధియను ఉత్తమ తరువునుండి సచ్చిదానందమను శ్రేష్ఠరసము ప్రవహించును.

మనో భవతి నిర్ద్వంద్వం నిష్కామం నిరుపద్రవమ్
ప్రశాన్తచాపలానర్థ శోకమోహభయామయమ్. 13

మఱియు మనస్సు నిర్ద్వంద్వమును, నిష్కామమును, నిరుపద్రవమును, ప్రశాంతమును, చపలత్వాది అనర్థరహితమును, శోక మోహ భయ రోగవర్జితమును నగును.

క్షీణశాస్త్రార్థసందేహం విగతాశేషకౌతుకమ్
నిరస్తకల్పనాజాలం మోహాముక్తమలేపకమ్. 14
నిరీహం నిరుపాక్రోశం నిరపేక్షం నిరాధికమ్
సంశాంతశోకనీహారమసక్తం గ్రన్థివర్జితమ్. 15

అపుడు మనంబు శాస్త్రార్థసంశయ రహితమును, విషయవైచిత్ర్యాదర్శనేచ్ఛావర్జితమును, మోహ కల్పనాజాల వినిర్ముక్తమును, నిర్లిప్తమును, ఆశా నిందావర్జితమును, ప్రవృత్తేచ్ఛారహితమును, మానసికచింతావిరహితమును, ప్రశమితశోక నీహారయుక్తమును, కనుకనే స్వచ్ఛమును, విషయాసక్తి గ్రంథివర్జితమును నగును.

సందేహోగ్రసుతం సాగ్రం సత్తృష్ణాదారపంజరమ్
నాశయిత్వా స్వమాత్మానం సాధయత్యర్థమైశ్వరమ్. 16

సంశయములను దుష్టపుత్రులుగలదియు, శాఖావంతములగు పలువిధ మనోరథములతోఁగూడి నదియు, తృష్ణయను భార్యచే సంపన్నమును, స్థూలదేహమను పంజరముగలదియు నగు స్వమనోరూప మును నశింపజేసి యీ మనస్సు ఈశ్వరస్వరూపమును, ప్రత్యగాత్మసంబంధమును నగు జీవన్ముక్తి పదమును సాధించుచున్నది.

ఆత్మవీవరతాహేతూన్వికల్పాంశ్చాయముజ్ఝతి
సంస్మృత్య ప్రభుతామేషు జహాతి తృణవత్తనుమ్. 17

నిగ్రహమందలి స్వసామర్థ్యమును యోచించి యీ మనస్సు తన్ను పోషించు శత్రు మిత్ర, సాధ్యసాధ్యాది వికల్పములను త్యజించివైచి, పిమ్మట కల్పితమగు తన రూపమునుకూడ తృణమువలె పరిత్యజించుచున్నది.

మనసోఽభ్యుదయో నాశో మనోనాశో మహోదయః
జ్ఞమనోనాశమభ్యేతి మనోఽజ్ఞస్య వివర్ధతే. 18

విషయాదులందు ప్రవర్తింపకుండుటయే మనోనాశము. అట్టి మనోనాశమే ఆత్మలాభోదయ మగును. బ్రహ్మజ్ఞానియొక్క మనస్సు వినాశమొందును, అజ్ఞానియొక్క మనస్సు వృద్ధినొందును.

మనోమాత్రం జగచ్చక్రం మనః పర్వతమండలమ్
మనోవ్యోమ మనోదేవో మనోమిత్రం మనోరిపుః. 19

ఈ జగచ్చక్రమంతయు మనోమాత్రమే అయియున్నది. పర్వతములున్ను మనస్సే, ఆకాశము, దేవతలు, శత్రుమిత్రాదులున్ను మనస్సేయగును.

వికల్పకలుషా యా స్యాచ్చిత్త్వస్యాత్మవిస్మృతిః
మన ఇత్యుచ్యతే సేయం వాసనాభవభాగినీ. 20

వికల్పములచే ఆత్మ మలినముకాగా అపుడు సంభవించు చిద్వస్తు విస్మరణమే మనస్సన బడును. సంసారమున బడద్రోయునట్టి యీ మనస్సే వాసనయనియు పేర్కొనబడును.

చేత్యానుపాతకలిత చిన్మాత్రేతిష్ఠతాభిధమ్
మనాగ్వికల్పకలుషం చిత్త్వం జీవ ఉచ్యతే. 21

వాసనావశమున మనస్సునందలి విషయప్రవేశముచే పరిచ్ఛిన్నమై [illegible] సహితమై వికల్పములచే మాలిన్యమొందిన చిద్వస్తువే (బ్రహ్మము) జీవుడనంబడును.

చేత్యప్రపతితం రూఢసంజ్ఞ మజ్ఞత్వమాగతమ్
తదేవాధికనిఃసారం కల్ప్యతేఽన్తర్మనస్తయా. 22

విషయములందు పడి, చిరకాలాభ్యాసముచే ప్రరూఢమైన అభిమానముచే స్వస్వరూప మును విస్మరించి అజ్ఞత్వమొంది జీవుడనేక వికల్పములచే మోహితుడయి [illegible] ఆత్మ సుఖమును బోగొట్టుకొని నిస్సారభూతు డెపుడగునో అపుడా జీవుని [illegible] మనోరూపమున కల్పింపబడును.

నాత్మా సంసారిపురుషో న శరీరం న శోణితమ్
జడం సర్వం శరీరాది దేహీ ఖవదలేపకః. 23



శుద్ధాత్మ జీవరూపము గాదు, శరీరరూపము గాదు, రుధిరరూపమును గాదు. ఏలయన, శరీ రాదులన్నియు జడములును పరిచ్ఛిన్నములును నై యున్నవి. కాని ఆత్మ ఆకాశమువలె నిర్లిప్తమై యుండునది యగును.

శరీరే కణశః కృత్తే నాస్త్యన్యద్రుధిరాదికాత్
నిర్భిన్నే కదలీస్తంభే నాస్త్యన్యత్పల్లవాదృతే. 24

కదళీస్తంభమును ఛేదించిన యందు దళములు తప్ప అన్యమేమియు నుండనట్లు దేహమును విచ్ఛిన్నమొనర్చినను, అందు రక్తాదుల కన్యముగ నెద్దియు లభింపదు.

మనో జీవో నరం విద్ధి తదేవాకారమాగతమ్
ఆత్మనాత్మానమాదత్తే స్వవికల్పాత్మకల్పితమ్. 25

ఓ రామా ! నీవు మనస్సునే జీవునిగ యెఱుంగుము. అదియే యాకారమును పొందుచున్నది. అదియే స్వవికల్పముచే కల్పితమగు తన యాత్మను తాను గ్రహించుచున్నది.

స్వవికల్పాన్నరస్తత్ర ప్రసార్య రచయత్యలమ్
జాలమాత్మనిబంధాయ కోశకారకృమిర్యథా. 26

జీవుడీ జగంబున స్వవాసనా వికల్పముల విస్తరించి కోశకారకృమి (పట్టుపురుగు) వలె స్వీయబంధముకొఱకై జాలమును నిర్మించుకొనుచున్నాడు.

ఇమం దేహభ్రమం త్యక్త్వా దేశకాలాన్తరే పునః
శరీరత్వమథాదత్తే పల్లవత్వమివాంకురః. 27

అంకురము పల్లవరూపమును ధరించునట్లు, మనస్సున్ను భ్రమమయమగు యీ దేహమును త్యజించి అన్యదేశకాలములందు మఱియొక దేహమును ధరించుచున్నది.

యాదృగ్వాసనమేతత్స్యా న్మనస్తాదృక్ప్రజాయతే
జాతం స్వపితి యచ్చిత్తం తత్స్వప్నే నిశి తిష్ఠతి. 28

ఈ మనస్సు ఏ యే వాసనలతో గూడియుండునో, వాని కనురూపముగనే శరీరముత్పన్న మగును. రాత్రినిద్రించునపుడు చిత్తమెవ్విధమున నుండునో యవ్విధముననే స్వప్నమును గాంచునుగదా.

ఆమ్లం మధురసాసిక్తం మధురం మధురంజితమ్
బీజం ప్రతివిపాకల్కసిక్తం చ కటు జాయతే. 29

ఆమ్ల బీజమును మధురరసమున సేచనమొనర్చి నాటిన అంకురమై క్రమముగ మధుర ఫలమునే గలుగజేయును. అట్లే విషరసమందు సేచనమొనర్చి నాటిన కటుఫలములనే గలుగజేయును.

శుభవాసనయా చేతో మహాత్మ్యా జాయతే మహత్
భవతీన్ద్రిమనోరాజ్య ఇంద్రతా స్వప్నభాఙ్నరః. 30

మనోరాజ్యమునగాని, స్వప్నమునగాని మనుజు డింద్రత్వము ననుభవించునట్లు, ఉత్తమ (శుభ) వాసనాయుక్తమగు చిత్తమున్ను మహత్తరరూపముఁ జెందును.

క్షుద్రవాసనయా చేతః క్షుద్రతామపి పేలవామ్
పిశాచవిభ్రమాత్స్వప్నే పిశాచాన్నిశి పశ్యతి. 31

పిశాచములఁగూర్చిన వాసనలుగలవాడు రాత్రి స్వప్నమున పిశాచములనే గాంచునట్లు క్షుద్రవాసనాయుక్తమగు చిత్తము నీచత్వమునే పొందును.

సరసి స్ఫారనైర్మల్యే కాలుష్యం యాతి న స్థితమ్
తథైవ స్ఫారకాలుష్యే ప్రసాదో యాతి న స్థితమ్. 32

సరోవరమున అధికనైర్మల్యకారణమున మాలిన్యమేమియు నుండజాలనట్లు, అధికమాలిన్యమంగును నిర్మలత్వముండజాలదు.

మనసి స్ఫారకాలుష్యే తద్రూపం జాయతే ఫలమ్
తథైవ స్ఫారనైర్మల్యే తద్రూపం జాయతే ఫలమ్. 33

మనస్సు మిగుల మలినమైనచో ఫలమున్ను తదనురూపముగనే నుండునట్లు, మిగుల నిర్మలమైనచో తదనురూపమగు యుత్తమఫలమే ప్రాప్తించును.

త్యజత్యుదారాం న గతిం క్షీణోఽప్యనిశముత్తమః
ఉద్యోగవాననిరతం పూరణాశామివోడుపః. 34

క్షయించుచున్నను ప్రయత్నశీలుడగు చంద్రుడు నిరంతరమెట్లు తన పూర్ణత్వమునుగూర్చిన యాశను త్యజింపకుండునో, అటులనే నిర్మలచిత్తుడు దారిద్ర్యాదులచే పీడితుఁడైనను శాంతి, శమ స్సమాధానరూపమగు తన యుత్తమగతిని త్యజింపకయుండును.

నేహ బంధో న మోక్షోఽస్తి నాబంధోఽస్తి న బంధతా
మిథ్యోత్థితైవ మాయేయ మింద్రజాలలతా యథా. 35

యథార్థముగ నిట బంధము గాని మోక్షము గాని లేదు. మఱియు బంధాబంధముల యభావమున్ను లేదు. అంతయు ఇంద్రజాలలతవలె మిథ్యారూపమున నుదయించిన మాయయేయగును.

గంధర్వనగరాకారా మృగతృష్ణా ఇవోత్థితా
ద్విచంద్రవిభ్రమాభాసా ద్వైతైకత్వవివర్జితా. 36

ఈ మాయయు గంధర్వనగరాకారమువలెను, మృగతృష్ణవలెను, ద్విచంద్రాభాసవలెను మిథ్యారూపమున నావిర్భవించి, ద్వైతాద్వైతవివర్జితమైయున్నది.

సర్వైవ బ్రహ్మసత్తేయ మిత్యేషా పరమార్థతా
పరిస్ఫురతి నిఃసారః సంసారోఽయమసన్మయః. 37

అంతయును బ్రహ్మసత్తయే యనుట పరమార్థసత్యమగును. ఈ జగత్తు అసన్మయమును, నిస్సారమునై స్ఫురించుచున్నది.

నానన్తోఽహం వరాకోఽహమితి దుర్నిశ్చయోదితః
[illegible]స్మీశ్వరోఽస్మీతి నిశ్చయేన విలీయతే. 38



‘నేననంతుడనుగాను, అల్పుడనను’ దుష్టభావనచేగల్గిన వికల్పమును ‘నేననంతుడను, ఈశ్వరుడనను’ నిశ్చయముచే నశింపజేయవలెను.

సర్వగే స్వాత్మని స్వచ్ఛే ఏషోఽహమితి భావనా
ఏతత్తద్బంధనం లోకే స్వవికల్పోపకల్పితమ్. 39

సర్వవ్యాపకమును, నిర్మలమునునగు ఆత్మస్వరూపమున ‘ఈ దేహమాత్రుఁడనే నేను’ను భావనయే స్వవికల్పకల్పితమగు ప్రపంచమున బంధమగును.

బంధమోక్షదశాహీనా ద్విత్వైకత్వవివర్జితా
సర్వైవ బ్రహ్మసత్తేయ మిత్యేషా పరమార్థతా. 40

ఇదంతయును బంధమోక్షరహితమును, ద్వైతాద్వైతవర్జితమును నగు బ్రహ్మసత్తయేయైయున్నది. ఇదియే పరమార్థసత్యము.

నైర్మల్యప్రాప్తమరణమసక్తం సర్వదృష్టిషు
అమనస్త్వమివాపన్నం బ్రహ్మపశ్యతి నాన్యథా. 41

నైర్మల్యముచే తనరూపమును రహితమొనర్చి సర్వవిషయములందును అసక్తమై, అమనస్కస్థితిని పొందిననే మనస్సు ఈ యధికారిదేహమున బ్రహ్మమును సందర్శింపగల్గును గాని అన్యవిధముగ గాదు.

మనోనిర్మలతాం యాతం శుభసంతానవారిభిః
బ్రాహ్మీం దృష్టిముపాదత్తే రాగం శుక్లపటో యథా. 42

శ్వేతవస్త్రము రంజకద్రవ్యవర్ణమును గ్రహించునట్లు, సమాధ్యభ్యాసజనితమగు ధర్మవృద్ధి యను జలముచే నైర్మల్యమొందిన మనస్సు బ్రహ్మసంబంధమగు దృష్టిని గ్రహించును.

సర్వమేవ మమాత్మేతి సర్వభావనయాఽనఘ
హేయాదేయబలేక్షిణే బంధమోక్షో విముచ్యతామ్. 43

పాపరహితుడవగు నో రామా! ‘అంతయు నా ఆత్మయే’ యను సర్వాత్మకభావనచే త్యాజ్యగ్రాహ్యబుద్ధి శమింప నపుడిక బంధమోక్షదృష్టిఁగూడ పరిత్యజించుము.

శుద్ధస్య మనసః కాయ శాస్త్రవైరాగ్యబుద్ధిభిః
అభిజాతోపలస్యేవ జగత్తస్యేతి విద్యుతిః. 44

అధికార్యనధికారి శరీరాభిమానముచే శరీరమువలనను, శాస్త్రశ్రవణాభిమానముచే శాస్త్రమువలనను, వైరాగ్యాత్మబోధలవలనను స్ఫటికమణియందువలె గల్గు శుద్ధమగు మనస్సుయొక్క వివిధ ప్రతిభాసములే యీ జగత్తగును.

పదార్థైనైకతామేత్య మనసో నైకతా నతా
అసత్యజ్ఞానదృష్టిం తాం విద్ధి క్షణవినాశినీమ్. 45

పదార్థములతో మనస్సు యొప్పు డేకరూపత్వమునొందునో అపుడాత్మతో ఏకరూపత్వమొందజాలదు. అసత్యదృష్టి క్షణములో నశించునదియే యని నీ వెఱుంగుము.

స బాహ్యాభ్యంతరం త్యక్త్వా సర్వాం దృశ్యదృశం యదా
మన స్తిష్ఠతి తల్లీనం సంప్రాప్తం తత్పదం తదా. 46

బాహ్యాభ్యంతర దృశ్యవిషయములన్నిటిని త్యజించి మనస్సు ఆత్మయందు యెపుడు లీనమై యుండునో, అపుడయ్యది సర్వోత్తమమగు బ్రహ్మపదము నొందెననియే గ్రహింపనగును.

దృశ్యదృష్టిః స్ఫుటాదేయం సాహ్యావశ్యమసన్మయీ
తన్మయత్వం చ మనసః స్వరూపం విద్ధి నేతరత్. 47

ప్రత్యక్షముగ గాన్పించు యీ దృశ్యమంతయు మిథ్యయే యైయున్నది. అట్టి దృశ్యమయమగుటయే మనస్సుయొక్క రూపమగును, కాని అన్యము గాదు.

ఆద్యన్తయోర్వినాశిత్వాన్మధ్యేఽపి తదసన్మయమ్
అజ్ఞాతమనసస్తేన దుఃఖితా హ స్తసంస్థితా. 48

ఆద్యంతములందేది అసత్తయియుండునో, అది మధ్యమందును అసత్తే యగును. కాన మనస్సు సద్రూపముగ దెలియంగనివానికి దుఃఖము కరమున నేయున్నదని నిశ్చయింపుము.

ఆత్మైవేదం జగదితి వినా భావేన దుఃఖదా
దృశ్యశ్రీరన్యథా త్వేషా భోగమోక్షప్రదాయినీ. 49

ఈ జగత్తంతయు ఆత్మస్వరూపమేయను భావనగలిగియుండనిచో దృశ్యము దుఃఖప్రదమే యగును. కాని అంతయు నాత్మస్వరూపమే యను జ్ఞానముచే నయ్యది భోగమోక్షముల రెంటిని ప్రసాదించును.

జలమన్యత్తరంగోఽన్య ఇతి నానాతయాఽజ్ఞతా
జలమేవ తరంగోఽయ మిత్యేకత్వాత్కిల జ్ఞతా. 50

జలము వేఱు, తరంగము వేఱను ఈ నానాత్వబుద్ధియే అజ్ఞానము. జలతరంగములు రెండును యొకటియే యను ఏకత్వబుద్ధి జ్ఞానమగును.

దుఃఖమాయాత్యసదితి హేయోపాదేయరూపి యత్
తదభావేన తు జ్ఞానాదానన్త్యమవశిష్యతే. 51

హేయోపాదేయరూపమగు యీ నానాత్వ మసద్రూపమైనది గాన నద్దానిచే జననమరణరూపమగు దుఃఖమే ప్రాప్తించుచున్నది. దాని యభావముచే ఆనన్తరూపమగు ఆత్మయే శేషించును.

సంకల్పకల్పితత్వాచ్చ మనోరూపమసన్మయమ్
అసన్మయవినాశే తు కః శోకో వద రాఘవ. 52

ఓ రామా! సంకల్పముచే కల్పితమగుటచే మనస్సుయొక్క రూపము అసత్తే యగును. అసద్వస్తునాశముచే దుఃఖమేల?

అవత్సలో యథా బంధురరాగద్వేషయా ధియా
దృశ్యతే పశ్య తద్వత్త్వం తత్త్వం పంజరమాత్మనః. 53



ఉదాసీనుడగు బంధువును రాగద్వేషరహితమగు దృష్టిచే పరికించునట్లు నీవున్న స్థూలదేహాదులను పంచభూతరూపములుగనే గాంచుము (అనగా దేహాదులయెడల ఉదాసీనదృష్టి గలిగియుండుమని భావము)

అవత్సలాద్యథా బంధోః సుఖదుఃఖైర్న లిప్యతే
తత్త్వేన సంపరిజ్ఞానాత్తథా తత్త్వాచయాత్మనః. 54

ఉదాసీనుడగు బంధువుతో సుఖదుఃఖముల సంబంధమెట్లుండనేరదో, అట్లే యథార్థరూపముగ నెఱుంగబడిన యీ పాంచభౌతిక దేహపంజరముతోటిన్ని సంబంధముండదు.

తదనాది శివం జ్ఞానం యన్మధ్యం ద్రష్టృదృశ్యయోః
తస్మిన్సత్యే మనః శాన్తం పాంసుర్వాయుక్షయే యథా. 55

ద్రష్టృదృశ్యముల మధ్యగల దృగ్రూపమే అనాదియు, అనంతమునగు శివస్వరూపమును, నిరతిశయానందదాయకమగు ఆత్మజ్ఞానస్వరూపమును నగును. వాయువు శమించుటచే ధూళి శమించునట్లు సత్యమగు ఆ యధిష్ఠానమందు మనస్సు శమించుచున్నది.

ఉపశాన్తే మనోవాయౌ దేహపాంసుః ప్రశామ్యతి
పునః సంసారనగరే న నీహారః ప్రవర్తతే. 56

మనస్సను వాయువు శమించుటచే శరీరమను ధూళియు శాంతించుచున్నది. మఱల నగరతుల్యమగు సంసారముయొక్క అధిష్ఠానమున అవిద్యావరణమను నీహారము కురియకుండును.

వాసనాప్రావృషి క్షీణే సంస్థితౌ రామమాగతే
జాడ్యే జనితహృత్కంపే పంకే శోషముపాగతే. 57

శుష్కే తృష్ణావటే శాంతే మన్దే హృదయకాననే
క్షీణేష్వక్షకదంబేషు మిథ్యాజ్ఞానఘనే క్షతే. 58

క్షీయతే మోహమిహికా ప్రభాత ఇవ శర్వరీ
క్వాపి గచ్ఛతి తజ్జాడ్యం విషం మంత్రహతం యథా. 59

వాసనారూపమగు వర్షము శమింప, స్వరూపస్థితియందు మనస్సునకు నిలుకడ ప్రాప్తింప, హృదయమున భయముత్పన్నముజేయు అజ్ఞానమను పంకము పూర్ణముగ శుష్కించిపోవ, తృష్ణయను వటవృక్షము నశింప, హృదయవనమున రాగాదిలతలు అల్పీభూతములుకాగా, యింద్రియములను కదంబ వృక్షములు క్షీణింప మిథ్యారూపమగు అజ్ఞాన మేఘము నశింప, ప్రాతఃకాలమున రాత్రి యందలి యంధకారమంతయు నశించునట్లు మోహమను మంచును నశించుచున్నది. మఱియు మంత్రముచే హతమొనర్పబడిన విషమువలె నా మోహజాడ్య మెచటికో పోవుచున్నది.

దేహాద్రౌ న భయక్షుద్రాః సరితః ప్రసరన్త్యలమ్
నోల్లసన్తి లసత్పక్షాః సంకల్పోగ్రకలాపినః. 60

అపుడు (మోహమునశించిన పిదప) దేహమను పర్వతముపై క్షుద్రనదులు ప్రవహింపకుండును. మఱియు మనోహరపక్షయుక్తమగు సంకల్పమను ఉగ్రమయూరమేమియు శోభింపకుండును,

పరాం నిర్మలతామేతి సంవిదాకాశగోచరః
రాజతేఽతితరామచ్ఛో జీవాదిత్యో మహోదయః. 61

అపుడాత్మస్వరూపమను ఆకాశమున ప్రత్యక్షముగ స్ఫురించుచుండు మహోదయ సంపన్నుడగు జీవుడను సూర్యుడతినైర్మల్యమునొంది స్వచ్ఛముగ ప్రకాశించుచుండును.

ఘనమోహాభ్రరోన్ముక్తా వివిక్తత్వం పరంగతాః
సమయేవ్యాతిశోభన్తే ధాతా ఆశామహాదిశః. 62

విమోహ ఘననిర్ముక్తమును; వివేకయుక్తమును, తృష్ణావర్జితమును, తమోగుణ రజోగుణ దోషరహితమును నగు హృదయాకాశరూపమగు విశాల దిక్సమూహము సమాధ్యాదికాలములందు మిగుల శోభించుచుండును.

భృశమాభాతి విమలా ముదితాకాశమంజరీ
శీతలీకృతదిక్చక్రా శరద్వ్యోమ్నీవ చంద్రికా. 63

శరత్కాలమున దిక్కులన్నింటిని శీతలమొనర్చు చంద్రికవలె, చిత్తాకాశలత పూర్ణవిమలత్వము నొందును.

సర్వసంపత్ప్రకాశేన పరమానందదాయినా
భృశం సఫలతామేతి సువివిక్తావేకభూః. 64

విషయానందలేశరూపమగు సంపదనంతయు ప్రకాశింపజేయునదియు, పరమానంద దాయకమును నగు ఆత్మజ్ఞానఫలముచే మిగుల పవిత్రమైన వివేకమను వృథివి పూర్ణసాఫల్యము నొందును.

సపర్వతవనాభోగం పరమాలోకసుందరమ్
అచ్ఛాచ్ఛం శీతలచ్ఛాయం జాయతే భువనాన్తరమ్. 65

అత్తఱి బ్రహ్మాండమంతయు పర్వతవనవిస్తార సహితమును, ఆత్మప్రకాశయుక్తమును, సూర్యచంద్రుల ప్రకాశముచే నతిరమణీయమును, స్వచ్ఛశీతలచ్ఛాయా సహితమున్నునై విరాజిల్లుచుండును.

విస్తారితం సుసుమతాం స్ఫారితం స్ఫటికాకృతిమ్
ఉపైతి హృత్సరః స్వచ్ఛం నీరజోంబుజకోశకమ్. 66

ఉత్తమబుద్ధియను పలువిధ కుసుమముల విస్తరించునదియు, విశాలమగు స్ఫటికమణివంటి యాకృతిగలదియు నగు హృదయసరోవరము రజోగుణమను ధూళిచే గప్పబడక నిర్మలముగా నుండును.

హృత్పద్మకోశాన్మలినః స్వాహంకారమధువ్రతః
అపునర్దర్శనాయైవ చంచలః క్వాపి గచ్ఛతి. 67

మలినమును, చంచలమును నగు అహంకార భ్రమరము హృదయ కమలకోశమునుండి యెగిరి యెచటికో పోయి మఱల తిరిగి రాకయుండును.



భవత్యపగతాక్షేపః సర్వగః సర్వనాయకః
నిర్వాసనః శాంతమనాః స్వదేహనగరేశ్వరః. 68

అపుడపరిచ్ఛిన్నుడును, సర్వవ్యాపకుడును, సర్వేశుండును, వాసనారహితుడును, శాంతచిత్తుండును నగు ఆత్మ స్వదేహనగరమునకు ప్రభువై శోభిల్లుచుండును.

విచారణాసమధిగతాత్మదీపకో
మనస్యలంపరిగలితేవ ధీరధీః
విలోకయన్నయ భవనీరసాగతీ
ర్గతజ్వరో విలసతి దేహపత్తనే. 69

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
ఉపశమవర్ణనం నామ పంచత్రింశః
సర్గః ॥ 35 ॥

తత్త్వవిచారణచే ఆత్మయను దీపజ్యోతి ప్రాప్తింప శరీరమునకు ప్రభువగు ఆయాత్మ సమస్త దోషములను రహితమొనర్చి ధైర్యయుక్తమై ప్రపంచమున జననమరణ దశలందు, ఐహిక పారలౌకిక నీరస స్థితులఁగాంచుచు, స్వదేహనగరమున తాపత్రయరహితుడై విలాసముగ చరించుచుండును.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు స్థితిప్రకరణమున
ఉపశమవర్ణనము పంచత్రింశ
సర్గము ॥ 35 ॥

---

## షట్ త్రింశః సర్గః.

---

శ్రీ రామ ఉవాచః—

యథేదృశం స్థితం విశ్వం విశ్వాతీతే చిదాత్మని
తన్మే కథయ హే బ్రహ్మన్ పునర్బోధవివృద్ధయే. 1

శ్రీ రాముడు:— ఓ మునీంద్రా! ఈ ప్రపంచము విశ్వాతీతమగు చిదాత్మయందెట్లు స్థితి గల్గియున్నదో యను విషయమును జ్ఞానాభివృద్ధికొఱకై నాకు మఱల తెలియజేయుము.

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

యథోర్మయోఽనభివ్యక్తా భావినః పయసి స్థితాః
న స్థితాశ్చాత్మనోఽన్యత్వాచ్చిత్తత్వే సృష్టయస్తథా. 2

శ్రీ వసిష్ఠుడు:— ఓ రామా! ఉత్పన్నముకానున్న తరంగము లెట్లభిన్నరూపమున సముద్రమునగలవో, అట్లే యీ సృష్టియంతయును చిదాత్మయందు గలదు.

యథా సర్వగతః సౌక్ష్మ్యాదాకాశో నోపలభ్యతే
తథా నిరంశశ్చిద్భావః సర్వగోఽపి న లక్ష్యతే. 3

ఆకాశమంతటను వ్యాపించియున్నను సూక్ష్మత్వకారణమున గోచరింపకయున్నట్లు, అతి సూక్ష్మమగు ఆత్మయు సర్వవ్యాపియైనను దృగ్గోచరము గాకయున్నది.

సుస్థితే వాస్థితేవాన్తః ప్రతిభాస్తి మణౌ యథా
న సత్యభూతానాసత్యా తథేయం సృష్టిరాత్మని. 4

నిరావరణప్రదేశమందున్న స్ఫటికాదిమణులందు సదసద్రూపమును, అనిర్వచనీయమ్మునగు ప్రతిబింబముండునట్లు ఆత్మయందును ఈ సృష్టిగలదు.

స్వాధారై రంబుధైః స్వస్థైర్న స్పృష్టం గగనం యథా
చిత్స్థైః సర్గైశ్చిదాధారైర్న స్పృష్టా చిత్పరా తథా. 5

తమయందున్న మేఘములు కాధారభూతమైయున్నను వానిచే నాకాశము స్పృశింపబడకుండునట్లు, ఆ పరాచైతన్యమున్ను తమయందు స్థితిగల్గియున్న సృష్టులకు ఆధారభూతమైయున్నను వానిచే స్పృశింపబడదు.

జలధిస్థితతత్తేజో యథాంగ ప్రతిబింబతి
తథా పుర్యష్టకేష్వేవ చిద్ధి దేహేషు లక్ష్యతే. 6

జలమందుజొచ్చు సూర్యకిరణములు ప్రత్యక్షముగ గాన్పింపక ప్రతిబింబరూపమున నగుపడునట్లు, శరీరమందును ఆత్మ ప్రతిబింబరూపమున వ్యక్తమగుచున్నది.

సర్వసంకల్పరహితా సర్వసంజ్ఞావివర్జితా
సైషా చిదవినాశాత్మా తచ్చేత్యాదికృతాభిధా. 7

ఈ చిదాత్మ సర్వసంకల్పసంజ్ఞావర్జితమును, నాశరహితమును నై యున్నది. జీవ, విషయాది సంజ్ఞలన్నియు దీనియందే కల్పింపబడినవి.

ఆకాశశతభాగాచ్ఛా జ్ఞేషు నిష్కలరూపిణీ
సకలాకలసంసార స్వరూపైకాత్మ్యదర్శినీ. 8

విజ్ఞులీయాత్మను ఆకాశముకంటెను శతగుణమధికస్వచ్ఛముగను నిష్కళంకరూపముగను, కళాసహితమైనను కళారహితముగను, జగత్తునకభిన్నముగను గాంతురు.

తరంగాదిమయీ స్ఫారా నానాతా సలిలార్ణవే
తస్మాన్న వ్యతిరేకేణ యథా భావవికారిణీ. 9
త్వత్తామత్తామయీ స్ఫారా నానాతేయం చిదర్ణవే
చిన్మాత్రవ్యతిరేకేణ తథా నైవ ప్రకాశతే. 10

సముద్రమున తరంగాదులరూపమున యనేకత్వము గోచరించినను, జలముకంటె వేఱుగ యే వికారమును లేనట్లే, చైతన్యమహాసముద్రమున 'నీది' 'నాది' యను రూపమున అనేకత్వము స్ఫురించినను చైతన్యమునకు భిన్నముగ యీ ప్రపంచమున నేదియు ప్రకాశింపనిదై యున్నది.



చిచ్చినోతి చితంచేత్యం తేనేదం స్థితమాత్మని
అజ్ఞేఽజ్ఞేత్వన్యదాయాత మన్యద స్తీతి కల్పనా. 11

చైతన్యమేదేని విషయము ననుభవించునపుడు తన స్వరూపమునే యనుభవించుచున్నదగును. కాన చైతన్యము తన యాత్మస్వరూపముననే స్థితిగల్గియున్నదని విద్వాంసుల యనుభవమైయున్నది. అజ్ఞులైనను ఈ జగత్తంతయు ఆత్మకంటె వేఱుగనున్నదని అజ్ఞులు కల్పన యొనర్చుచున్నారు.

అజ్ఞేష్వసత్స్వభావోగ్ర సంసారగణగర్భిణీ
జ్ఞేషు ప్రకాశరూపైవ సకలైకాత్మికా సతీ. 12

అజ్ఞానుల దృష్టియందీ చైతన్యము మిథ్యాస్వభావముగల ప్రపంచమున్ను, జ్ఞానుల దృష్టియందు కేవలము ప్రకాశస్వరూపమున్ను యైయున్నది.

అనుభూతివశాన్నిత్య మర్కాదీనాం ప్రకాశినీ
స్వాదినీ సర్వభూతానాం భావినీ భవభోగినామ్. 13

ఈ చైతన్యము స్వభావముగనే సూర్యచంద్రాదుల ప్రకాశింపజేయునదగును. మఱియు నయ్యది సర్వభూతసంహారమునకును, జీవుల జన్మాదులకును కారణమై యొప్పుచున్నది.

నాస్తమేతి న చోదేతి నోత్తిష్ఠతి న తిష్ఠతి
న చాయాతి న వా యాతి న చేహ న చ నేహ చిత్. 14

ఈ చైతన్యమెపుడును నశించుటలేదు; ఉత్పన్నమగుటలేదు, లేచుటలేదు, కూర్చుండుటలేదు; వచ్చుటలేదు, పోవుటలేదు. ఈ స్థానమునగాని, ఆ స్థానమునగాని లేక, సర్వత్ర వ్యాపించి యేకరూపముననున్నది.

సైషా చిదమలాకారా స్వయమాత్మని సంస్థితా
రాఘవేత్థం ప్రపంచేన జగన్నామ్నా విజృంభతే. 15

ఓ రామచంద్రా! నిర్మలమగు యీ చైతన్యము తన స్వరూపముననే వ్యవస్థితమైయుండి రజ్జువందు సర్పమువలె ప్రపంచరూపమున వివర్తభావము నొందుచున్నది.

తేజఃపుంజైర్యథా తేజః పయః పూరైర్యథా పయః
పరిస్ఫురతి సంస్పందైస్తథా చిత్సర్గవిభ్రమైః. 16

తేజోసమూహరూపమున అగ్నియున్ను జలప్రవాహరూపమున జలమున్ను స్ఫురించునట్లే సృష్టివిలాసరూపమున ఈ చైత్యమున్ను స్ఫురించుచున్నది.

తత్స్వభావేన చిన్నామ్నా సర్వగేనోదితాత్మనా
ప్రకాశేనాప్రకాశేన నిరంశేనాంశధారిణా. 17
స్వయం స్వకలనాభోగాదనన్తం పదముజ్ఝితా
అహమస్మీతి భావేన గచ్ఛతాఽజ్ఞపదం శనైః. 18

సృష్టిరచనాస్వభావసహితమును, సర్వవ్యాపియు, నిత్యమును, యథార్థముగ ప్రకాశమయమును, వ్యవహారదృష్టిచే సప్రకాశమయమును, యథార్థముగ అంశరహితమును, వ్యవహార దృష్టిచే అంశసహితమును నగు చిదాత్మ అవిద్యాకారణమున, ఆ యవిద్యయందు ప్రతిబింబించిన కృత్రిమరూపముచే స్వయముగ తన యనంతపదమును త్యజించుచు అహంభావమును పరిగ్రహించి క్రమముగ జీవత్వమును ప్రాప్తినొందుచున్నది.

నానాతాయాం ప్రరూఢాయామస్యాం సంసృతిపూర్వకమ్
భావాభావగ్రహోత్సర్గపదే స్థితిముపాగతే. 19

పుర్యష్టకస్పన్దశతైః కరోతి న కరోతి చ
ఉత్సేధమేతి భూకోశ కోటరస్థోఽఙ్కురోత్కరః. 20

ఇట్లు జీవత్వమున్ను, పదార్థముల యనేకత్వమున్ను దృఢపడగా ప్రపంచకల్పనాపూర్వకముగ 'ఇది గలదు' 'ఇది లేద'నుభావముచే ఇష్టానిష్టముల గ్రహణత్యాగములకు స్థానభూతమగు దేహాత్మభావము ప్రాప్తింప, విహితనిషిద్ధరూపములగు పలువిధ శారీరకక్రియలద్వారా యీ చిదాత్మయే ప్రపంచమును తనకు భోగ్యముగ నొనర్చుచున్నది. కాని యథార్థముగ నట్లొనర్చుటయు లేదు. పృథ్వీకోశమున నున్నదై యీ చైతన్యము జగదంకురరూపమున యున్నతిని బొందుచున్నది.

వ్యోమసౌషిర్యమాదత్తే సర్వమూర్త్యవిరోధి యత్
స్పన్దైకధర్మవాన్వాతో రసరూపతయా జలమ్. 21

ఈ చిదాత్మయే మూర్తిమంతమగు పదార్థముల కవిరోధియగు ఆకాశరూపమును పరిగ్రహించుచున్నది. అట్లుగానిచో జగత్తను అంకురమునకు అవకాశమే లేకుండుటచే వృద్ధినొందక యుండును. ఇట్టియది స్పందధర్మముగల వాయువుచేతను ద్రవత్వధర్మముగల జలముచేతను జగదాంకురమును పోషించుచున్నది.

దృఢోర్వీప్రకటం తేజః స్థితిమన్తి జగన్తి చ
ప్రతిబన్ధాభ్యనుజ్ఞాసు కాలః కలనయా స్థితః. 22

మఱియు నది కాఠిన్యధర్మముగల పృథ్వీచేతను, రూపధర్మముగల అగ్నిచేతను, వివిధ రూపముల స్థితిగల్గియున్న లోక లోకాంతరములచేతను జగదంకురమును పరిపోషించుచున్నది. వసంతహేమంతాది కాలకల్పనచే ధాన్యాదులకు విరోధియగు తృణాదులయొక్క ప్రతిబంధకరూపమునను యవాది ధాన్యోత్పత్తి రూపమునను నయ్యది యుపకరించుచున్నది.

పుష్పేషు గన్ధతాం యాతి శనైః సంచితకేసరమ్
మృత్కోటరరసోల్లాసః స్థాణుతామేతి భూతలే. 23

ఈ చైతన్యమే కింజల్కముల నేకరించుచు పుష్పములందు గంధరూపము నొందుచున్నది. మఱియు మృత్తికయందలి రసరూపమగుచు నయ్యది భూమిపై స్థాణుత్వముఁ జెందుచున్నది.

మూలస్థాః ఫలమాయాన్తి పేలవా రసలేశకాః
సంనివేశం వ్రజన్త్యేతా రేఖాః పల్లవపాలిషు. 24





వృక్షమూలముననున్నదై కోమలపత్రములుగను, శాఖాదులుగనునై ఫలత్వముఁ నొందుచున్నది. పత్రముల యంతర్గతమునఁ బ్రవేశించి నాడీరూపమగుచున్నది.

నవతామనుగృహ్ణాతి శక్రబాణాసనేన చ
యోయో భవత్యవిరతం సంస్థానేన వనేన చ. 25

ఇంద్రధనుస్సువలె వృక్షముయొక్క నూతనత్వమును పరిగ్రహించుచున్నది. నిరంతర మేయే అవయవము లుత్పన్నమగునో వానియన్నిటి రూపమునను యీ చైతన్యము జగదంకురమున కుపకరించుచున్నది.

వసన్తముపతిష్ఠన్తి పుష్పపల్లవరాశయః
నిదాఘవిధిమాయాన్తి దైవదాహవిభూతయః. 26

ఈ చైతన్యమువలననే వసంతఋతువునందు పుష్పపల్లవ సమూహములు స్థితిఁబొందుచున్నవి. గ్రీష్మర్తువందు సూర్యతేజోవిభవము ప్రతిష్ఠఁగాంచుచున్నది.

ప్రావృట్సమయమాయాన్తే నీలాజలదరాశయః
శరదం చానుధావన్తి సమగ్రాః ఫలరాశయః. 27

మఱియు వర్షాకాలమున నీలమేఘసమూహము నలువైపుల చేష్టలనొనర్చుచున్నవి. శరదృతువందు ఫలరాశియంతయు ఆకృతిని బడయుచున్నది.

హేమన్తే హిమహాసిన్యో భవన్తి కకుభో దశ
నయన్త్యుపలతామంబు శిశిరే శీతలానిలాః. 28

హేమంతఋతువునందు నలుదెసలు హిమాన్వితమై యలరుచుండును. శిశిరఋతువందు శీతలవాయువులు జలమునుగూడ శిలారూప మొనర్చుచుండును.

న జహాతి స్వమర్యాదాం కాలో యుగమయీమిమామ్
తరంగిణీతరంగౌఘ లీలయా యాన్తి సృష్టయః. 29

దిన, వర్ష, యుగాదిరూపమగు కాలము తన నియతిని త్యజింపకయున్నది. మఱియు నదులందలి తరంగములవలె సృష్టిసమూహములన్నియు గమనశీలములగుచున్నవి.

నియతిః స్థితిమాయాతి స్థైర్యచాతుర్యకారిణీ
తిష్ఠత్యాప్రలయం ధీరాధరాధరణధర్మిణీ. 30

సమస్త బ్రహ్మాండములయొక్క నియతియు స్థిరరూపమున వర్తించుచున్నది. సర్వాధారణమొనర్చు నీ పృథివి ప్రళయమునకును స్థితిగలదై యున్నది.

చతుర్దశవిధానీహ భూతాని భువనాన్తరే
నానాచారవిహారాణి నానావిరచితాని చ. 31

పునఃపునర్విలీయన్తే జాయన్తే చ పునః పునః
ధారాపరంపరా యాతి వినావారీవ బుద్బుదాః. 32

పదునాల్గు భువనములందును పలువిధ యాచార విచారములుగలవియు, వివిధ వేషభాషలు గలవియు నగు పదునాల్గు జీవజాతులు మఱల మఱల యుత్పత్తి విలయముల నొందుచున్నవి. ఓ రామచంద్రా! ఈ పూర్వోక్త పదార్థరూపముల చైతన్యమే విలాసమొనర్చుచున్నది. జలాభావముచే బుద్బుదములవలె జీవుల యీ జనన మరణప్రవాహము తత్త్వజ్ఞానముచే వినాశమొందుచున్నది.

> ఆయాతి యాతి పరితిష్ఠతి లీలయాఽతి
> స్వార్థానుపార్జయతి ధావతి జన్మనాశైః
> ఉన్మత్తవద్విహితభావనమాహితేహా
> ముగ్ధాకృతాన్తవివశా జనతా వరాకీ. 33

ఇత్యార్షే వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
చిదాదిత్యస్వరూపవర్ణనంనామ షట్త్రింశః
సర్గః ॥ 36 ॥

ఓ రామా! ఈ దీనజనసమూహము పూర్వజన్మ సంకల్పవాసనాదులచే వివిధమనోరథములఁ జేబట్టి, అందుచే స్వస్వరూప విచారానభిజ్ఞులై మోహవశులై యున్మత్తునివలెనె యీ లోకమున జన్మించుచున్నది. పరలోకమునకుఁజనుచున్నది. అంతటను స్థావరాది జన్మలంబొందుచున్నది. భోగాభిలాషచే యైహిక పారలౌకికభోగములకు హేతువులగు ధనధర్మాదులను తమ పురుషార్థముల సాధించుచున్నది. మఱియు జననమరణాదులద్వారా యిట్లే సంసారమున పరిభ్రమించుచున్నది.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు స్థితిప్రకరణమున
చిదాదిత్యస్వరూపవర్ణనమను షట్త్రింశ
సర్గము ॥ 36 ॥

—:o:—

## సప్తత్రింశః సర్గః.

---

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

> ఇత్థం స్థిరతరాకారాః సంసారావలయోఽభితః
> స్వభావాద్బ్రహ్మణః సర్వాః పునరాయాన్తి యాన్తి చ. 1

శ్రీ వసిష్ఠుడు:— ఓ రామా! ఇవ్విధమున స్థిరాకృతిగల ఈ బ్రహ్మాండ సమూహములన్నియు బ్రహ్మమునుండియే మఱల మఱల నుద్భవించుచు లయించుచున్నవి.

> స్వతః సర్వమిదం జాతమన్యోన్యం హేతుతాంగతమ్
> అన్యోన్యమభినశ్యత్తత్స్వత ఏవ విలీయతే. 2



పరస్పరకారణభావమునొందిన యీ జగత్తులన్నియు తమ యధిష్ఠానమగు చైతన్యముననే యుత్పన్నమగుచు మఱల యందే లయమగుచునున్నవి.

> స్వతోఽస్పందోఽపి తు స్పందో యథాఽగాధజలోదరే
> తథైవేయమసత్సచ్చ చిదేవ పరిదృశ్యతే. 3

లోతున నీటియందు జలము ప్రవహించుచున్నను, దాని చలనము వ్యక్తము కానివిధమున, సదసద్రూపమున చైతన్యమే ప్రకాశించుచున్నను వ్యక్తము గాకయున్నది.

> వ్యోమన్యేవ నిరాకారే నిదాఘాత్సరితో యథా
> లక్ష్యన్తే తద్వదేవేమాశ్చిత్త్వే సృష్టిదృష్టయః. 4

ఉష్ణత్వకారణమున నిరాకారమగు యాకసమున మృగతృష్ణానదులు దృగ్గోచరమగునట్లు, చిదాత్మయందును యీ సృష్టి సమూహములన్నియు గోచరించుచున్నవి

> యథా మదవశాదాత్మా సోఽన్యవత్ప్రతిభాసతే
> తథైవ చిత్త్వాచ్చిద్ధాతుః స ఏవాఽస ఇవ స్థితః. 5

మదవశమున తనయాత్మయే అన్యవిధమున భాసించునట్లు, చిత్-సారమగు చిదాత్మయే అచిత్తుగ భాసించుచున్నది.

> న చేదం సదసన్నేదం తత్త్వాతత్త్వతయాచితః
> నాతిరిక్తాతిరిక్తా చ కటకాదిషు హేమతా. 6

ఓ రామా! ఈ జగత్తు సత్తునుగాదు. అసత్తునుగాదు; చైతన్యమున స్థితిగల్గియుండలేదు. అద్దానికి భిన్నముగను లేదు. కటకాది ఆభరణములందు సువర్ణత్వము భిన్నాభిన్న రూపములనున్నట్లే యీ జగత్స్వరూపమున్ను అనిర్వచనీయమై యొప్పుచున్నది.

> యేన శబ్దం రసం రూపం గంధం జానాసి రాఘవ
> సోఽయమాత్మా పరంబ్రహ్మ సర్వమాపూర్య సంస్థితః. 7

ఓ రామా! దేనిచే నీవు శబ్దస్పర్శ రూప రసగంధముల నెఱుంగగల్గుచున్నావో, అట్టి యాత్మయే సర్వత్ర వ్యాపించియున్నది.

> నానైకత్వాదతీతాత్తు సర్వగాదమలాత్మనః
> ద్వితీయా కలనా నాస్తి కాచిన్నేతరథా క్వచిత్. 8

సర్వవ్యాపియు నిర్మలమునగు ఆత్మయం దేకత్వానేకత్వములు అవిద్యచేతనే భాసించుచున్నవి. యథార్థముగ నా పరమాత్మయందు మఱియొక కల్పనయేదియును లేదు.

> రామ భావనాదన్యస్య భావాభావాశ్శుభాశుభాః
> సృష్టయః పరికల్ప్యన్తేఽనాత్మన్యేవాథవాత్మని. 9

ఓ రామా! పదార్థములయొక్క భావాభావములున్ను శుభాశుభ సృష్టులన్నియును వాసనావశముననే కల్పింపబడుచున్నవి. అయ్యవి మాయాదృష్టియందు అనాత్మభూతమగు మాయయందును లేక తత్త్వదృష్టియందు (ఆత్మమాత్రములే యగుటచే) ఆత్మయందును కల్పింపబడినవగును.

యస్మాదాత్మనో వ్యతిరిక్తే వస్తుని సిద్ధే సతి తత్రేచ్ఛా ప్రవర్తతే
యత్ర త్వాత్మనో వ్యతిరిక్తం న కించిదపి సంభవతి తత్రాత్మా కిమివ
వాంఛత్విమనుస్మరన్భావతు కిముపైతు. 10

ఆత్మకంటె నన్యముగ నేదేని పదార్థముండుచో దానియందు కోర్కె గలుగవచ్చును. కాని తన కన్యముగ యేపదార్థమును సంభవించమిచే యిక నాయాత్మ దేని నిచ్ఛగించును? దేనిని స్మరించును? దేనిని నిర్మించును? దేని ఫలముకొఱకు ప్రవృత్తమగును? — అనగా నీ సృష్ట్యాదు లన్నియు ఆత్మయం దవిద్యచేతనే కల్పింపబడినవని యెఱుంగవలెను.

అత ఇదమీహితమిద మనీహితమిత్యాత్మానం న స్పృశన్తి వికల్పాః.
అతో నిరిచ్ఛతాయామాత్మా న కించిదపి కరోతి కర్తృకరణకర్మణామేక
త్వాత్, న క్వచి త్తిష్ఠత్యాధారాధేయయోరేకత్వాత్, న చ నిరిచ్ఛస్యా
త్మనో నైష్కర్మ్యమభిమతమ్, ద్వితీయాయాః కల్పనయా అభావాత్. 11

ఇక్కారణమున యిష్టానిష్టము లనఁగు వికల్పములు ఆత్మను స్పృశింపవు. మఱియు యిచ్ఛాభావంబున కర్తృకరణక్రియల యేకత్వము సంభవించుటచే ఆత్మ యేమియు చేయునదిగాక యున్నది. ఆధారాధేయంబు లేకపగుటచే నయ్యది యే ఆశ్రయమును లేకయున్నది. ద్వితీయకల్పనా భావముచే యిచ్ఛారహితమగు ఆత్మయందు నైష్కర్మ్యమును అభిమతముగా లేదు.

నేతరా జానాసి రామ త్వమియం బ్రహ్మసంస్థితిః
సర్వద్వంద్వవినిర్ముక్తః కర్తా భవగతజ్వరః. 12

ఓ రామా! దీనికి భిన్నముగ సాఫల్యమొనగూర్చు కల్పన మఱియొండు లేదు. ఇదియే బ్రహ్మముయొక్క స్థితియగును. దీని కన్యముగ మఱియొక సాఫల్యకల్పన నీ వెఱుంగుచో సమస్త ద్వంద్వ సంతాపములనుండి విముక్తుఁడవైనను కర్తవగుదువు; దానిని మేము విచారించుటలేదు.

అన్యచ్చ రాఘవ పునః
పునః కృత్వాకృత్వా బహువిధమిదం కర్మతరసా
త్వయా ప్రాప్యం కిం తద్వద యదుచితం భూతకరణాత్
అకర్తృత్వేనాస్థాభవతు తవ చాప్యాగమవతో
భవస్వస్థః స్వచ్ఛః స్తిమిత ఇవ నిర్వాతజలధిః. 13

ఓ రామా! ఈ ప్రపంచమున మాటిమాటికి కర్తృత్వాభిమానముచే అనేక క్రియలను సత్వరంబుగ నొనర్చుటచే భౌతిక వస్తుసముదాయముకంటె భిన్నముగ ఏ యుచితఫలమును నీవు పొందియుంటివో వచింపుము? కాన కర్తృత్వాభినివేశమంతయు త్యజించి స్వస్వరూపోచితమగు అకర్తృత్వమందే నిశ్చయము గలిగియుండుము. అందులకై శాస్త్రగురువాక్యములందు విశ్వాసము గలిగియుండుము. మఱియు వాయువుచే చలింపబడని సముద్రమువలె స్వస్థుడవును, నిర్మలుడవును, గంభీరహృదయుఁడవును గమ్ము.



గత్వా సుదూరమపి యత్నవతా జవేన
నాసాద్యతే తదిహ యేన సుపూర్ణతైతి
మత్వేతి మా వ్రజ పదార్థగణాన్ధియా త్వం
న త్వం త్వమేవ పరమార్థతయా చిదాత్మా. 14

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
ఉపశమవర్ణనంనామ సప్తత్రింశః
సర్గః ॥ 37 ॥

ఓ రామచంద్రా! ఏ సాధనమువలన అపరిచ్ఛిన్నమగు సుఖము ప్రాప్తించుటచే పూర్ణకామత్వము సిద్ధించునో అయ్యది మిగులయత్నముచే నతివేగముగ దిగంతములందు భ్రమణము సల్పుటచేనైనను ప్రాప్తింపదు. కాన యివ్విధమున స్వబుద్ధిచే విచారించి బాహ్యపదార్థముల పైపునకు బోక యుండుము. నీవు యథార్థముగ సర్వప్రపంచరహితమగు పరమార్థదృష్టిచే పూర్ణమును, సుఖ స్వరూపమును నగు చిదాత్మవే యైయున్నావు.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు స్థితిప్రకరణమున
ఉపశమవర్ణనమను సప్తత్రింశ
సర్గము ॥ 37 ॥

---

## అష్టత్రింశః సర్గః

---

శ్రీ వసిష్ఠ ఉవాచః—

ఏవం స్థితే తు తజ్జ్ఞానాం యద్యేతత్కర్తృత్వం దృశ్యతే సుఖ
దుఃఖాదిషు యోగాదిషు వా తదసన్నతు మూర్ఖాణామ్. 1

శ్రీ వసిష్ఠుడు:— ఓ రామా! ఇక్కారణమున జ్ఞానులందు సుఖదుఃఖభోగఫలమునకు సాధనభూతములగు కర్మలందును, సమాధ్యభ్యాసపరిపాకమునకు వలయు భూమికలందును యే కర్తృత్వము గన్పించుచున్నదో, అయ్యది సత్యము గాదు. కాని అజ్ఞానుల విషయమట్లు గాదు.

యతః కర్తృత్వం నామ కిముచ్యతే యో హ్యన్తస్థాయా మనోవృ
త్తేర్నిశ్చయ ఉపాదేయతాప్రత్యయో వాసనాభిధానస్తత్కర్తృత్వ
శబ్దేనోచ్యతే. 2

ఏలయన అంతఃకరణమందలి మనోవృత్తిచే నిశ్చితమగునదియే కర్తృత్వమనంబడును. మఱియు దానియం దుపాదేయత్వబుద్ధియు సంభవించును. దానినే వాసన యనియు చెప్పెదరు.

చేష్టావశాత్తాదృక్ఫలభోక్తృత్వం వాసనానురూపం స్పందతే పురుషః స్పందానురూపం ఫలమనుభవతి. ఫలభోక్తృత్వం నామ కర్తృత్వాదితి సిద్ధాన్తః. 3

క్రియల ననుసరించియే ఫలభోగము సంభవమగుచున్నది. వాసనల ననుసరించియే మనుజుడు క్రియల నొనర్చుచున్నాడు. అట్లే క్రియానుసారము ఫలమున్ను అనుభవించుచున్నాడు. కాన ఫలభోక్తృత్వమే కర్తృత్వమని నిశ్చయమగుచున్నది.

తథా చ కుర్వతోఽకుర్వతోవాపి స్వర్గేఽపి నరకేఽపివా
యాదృగ్వాసనమేతత్స్యాన్మనస్తదనుభూయతే. 4

అందుచే స్థూలేంద్రియములచే కర్మయొనర్చినను, యొనర్పకున్నను మనుజుడెట్టి వాసనలు గల్గియుండునో, వాసిననుసరించియే మనస్సు స్వర్గనరకములందు సుఖదుఃఖముల ననుభవించుచుండును.

తస్మాదజ్ఞాతతత్త్వానాం పుంసాం కుర్వతామకుర్వతాం చ
కర్తృతా న తు జ్ఞాతతత్త్వానామవాసనత్వాత్. 5

కాన కర్మలయొనర్చినను, యొనర్పకున్నను అజ్ఞానికి కర్తృత్వము గలుగుచున్నది. మఱియు వాసనాభావంబుచే తత్త్వజ్ఞానులకు కర్తృత్వమే లేకయున్నది.

జ్ఞాతతత్త్వో హి శిథిలీభూతవాసనః కుర్వన్నపి ఫలం నానుసందధాతి అథ చ స్పందనమాత్రం కేవలం కరోత్యసక్తబుద్ధిః సంప్రాప్తమపి ఫల మాత్మైవేదం సర్వమేవ కర్మఫలమనుభవత్యకుర్వన్నపి కరోతి మగ్నమనాః. 6

ఏలయన తత్త్వజ్ఞునకు వాసననశించును గాన కర్మలంజేయుచున్నను యాతడు ఫలానుసంధాన మొనర్పకయుండును. అసక్తబుద్ధిగల్గి శరీరచేష్టామాత్రము గావించుచుండును. ఫలములు ప్రాప్తించి నపుడు అదంతయు ఆత్మయే యని తలంచుచుండును. కర్మల నాచరించుచున్నను, అందు మగ్న చిత్తుడు గాకయుండును.

మనో యత్కరోతి తత్కృతం భవతి యన్న కరోతి తన్న కృతం భవతి అతో మన ఏవ కర్తృ న దేహః. 7

ఓ రామా! మనస్సుచే చేయబడినదే చేయబడినదగును. అట్లు మనస్సుచే చేయబడనిది చేయబడినది గాకయుండును. కాన మనస్సే కర్తయగును గాని దేహముకాదు.

చిత్తాదేవాయం సంసార ఆగతశ్చిత్తమయ ఏవ చిత్తమాత్రం చిత్త ఏవ స్థిత ఇతి విజ్ఞాతమ్. విషయశ్చ సర్వముపశాన్తమభూద్వాసనై వేతి జ్ఞ ఏవాస్తీతి. 8

ఈ ప్రపంచమంతయు చిత్తమునుండియే యావిర్భవించినది. చిత్తమందే స్థితిగల్గియున్నది. కాన వస్త్వాది చిత్తమాత్రమే యగునను విషయము పూర్వప్రసంగమున నిర్ధారింపబడియే యున్నది.



సర్వవిషయములున్ను, విషయవృత్తులున్ను శమించి సద్వాసనారూపముం జెందనపుడు తదుపహిత మగు జీవచైతన్యము మాత్రముండును.

ఆత్మవిదాం హి తన్మనః పరముపశమమాగతం మృగతృష్ణాజలమివ వర్షతి జలదే హిమకణ ఇవ చణ్డాతపే విలీయనం తుర్యదశాముపాగతం స్థితమ్. 9

ఓ రామా! మేఘములువర్షింప మృగతృష్ణాజలము శమించునట్లు ఆత్మజ్ఞుల మనంబును పరమశాంతిని పొందుచు, ప్రచండ సూర్యతేజమున హిమకణమువలె, లయమునుపొందినదై తురీయ స్థితిని ప్రాప్తిజెంది బ్రహ్మరూపమున నుండును.

నానన్దం న నిరానన్దం న చలం నాచలం స్థిరమ్
న సన్నాసన్న చైతేషాం మధ్యం జ్ఞానిమనో విదుః. 10

జ్ఞానుల మనంబు విషయసుఖయుక్తము గాదు, ఆత్మానందరహితమును గాదు; చంచలము గాదు, శిలాదులవలె జడమును స్థిరమును గాదు; సత్తును గాదు, అసత్తును గాదు. ఉపరోక్తములగు ఆనంద నిరానంద, చలాచల, సదసత్తుల సంధిరూపమున్ను గాదు. కేవలము సుఖస్వరూపమగు ఆత్మయే యగును.

న వాసనామయే స్పందరసే గజ ఇవ పల్వలే మజ్జతి తజ్జ్ఞో
మూర్ఖమనోభోగభూమిమేవ పశ్యతి న సత్తత్త్వం. 11

జ్ఞానియొక్క మనస్సు, స్వల్పోదకపంకమున గజమువలె వాసనామయమగు క్రియలందు నిమగ్నము గాదు. అజ్ఞానియొక్క మనస్సు విషయభోగభూమినే యవలోకించును గాని సత్స్వరూప మగు నాత్మతత్త్వమును గాదు.

తథాచాయమత్రాపరో దృష్టాన్తః. అకుర్వన్నపి శ్వభ్రపతనం శయ్యాసనగతోఽపి శ్వభ్రపాతవాసనావాసితే చేతసి శ్వభ్రపతనదుఃఖమనుభవతి. అపరస్తు కుర్వన్నపి శ్వభ్రపతనం పరమముపశమముపగతవతి మనసి శయ్యాస్థనసుఖమనుభవతి. ఏవమనయోః శయ్యాసనశ్వభ్రపాతయోరేకః శ్వభ్రపతనస్యాకర్తాపి కర్తాసంపన్నో ద్వితీయశ్చ శ్వభ్రపతనస్య కర్తాప్యకర్తా సంపన్నశ్చిత్తవశాత్తస్మాద్యచ్చిత్తం తన్మయో భవతి పురుష ఇతి సిద్ధాన్తః. 12

ఈ విషయమై మఱియొక దృష్టాంతము గలదు. అదేదన — ఎవనిచిత్తమున శ్వభ్రపతనము (గోతియందు బడుట)ను గూర్చిన వాసనగలదో, అతడు శయ్యపైనుండినను స్వప్నాదులందు గర్తమున గూలుటచే దుఃఖమునే యనుభవించును. శాంతచిత్తముగల మఱియొకడు గర్తమున బడు చున్నను, శయ్యాసుఖమునే యనుభవించుచున్నాడు. ఇట్లు, వీరిరువురిలోను యొకడు గర్తమున బడ కున్నను పడినట్లనుభవించుటచే కర్తయున్ను, మఱియొకడు పడినను అకర్తయు నగును. కాన చిత్త మెవ్విధమున నుండునో పురుషుడున్ను యట్లే యుండుననుట నిశ్చయమైయున్నది.

తేన తత్ర కర్తురకర్తుర్వా నిత్యమసంసక్తం భవతు చేతో నహి కించిదస్త్యాత్మతత్త్వవ్యతిరిక్తం యత్ర సంసక్తిర్భావ్యతే యత్కించిదిదం జగద్గతం తత్సర్వం శుద్ధచిత్తత్త్వాదాభాసమవేహి. 13

కాన నో రామా! నీవు కర్మలఁజేసినను జేయకున్నను సరియే కాని నీచిత్తమువాత్రము వానియందు మగ్నముగానీయకుము. ఏలయన యీ జగత్తునం దాత్మతత్త్వమొకటి దప్ప మఱేపదార్థమున్ను సత్యముకాదు. గాన యిక నీచిత్త మెద్దానియందాసక్తి గొనును? ఈ జగత్తున్ను, తదంతర్గతమగు పదార్థములన్నియును, శుద్ధచైతన్యముయొక్క ఆభాసమాత్రములే యని నీవెఱుంగుము.

ఏవం చాస్య జ్ఞాతజ్ఞేయస్య పుంసో నాహమాత్మా సుఖదుఃఖానాం న గమ్య ఇతి నిశ్చయే జాతే నాత్మవ్యతిరిక్తా ఆధారాధేయ దృష్టయో విద్యన్త ఇతి నిశ్చయే జాతే కర్తా భోక్తా సర్వపదార్థవ్యతిరిక్తో వాలాగ్రసహస్రభాగోఽహమితి నిశ్చయే జాతే యత్కించిదిదం తత్సర్వమహమేవేతి వా నిశ్చయే జాతే సర్వసత్త్వావభాసకః సర్వగస్తిష్ఠామ్యేవాహమితి నిశ్చయే జాతే నాహం సుఖదుఃఖానాం గమ్య ఇతి విగతజ్వరతయా చిత్తవృత్తిర్లీలయైవ తిష్ఠతే వ్యవహారేషు. 14

ఇవ్విధమున జ్ఞేయము (ఆత్మ) నెఱింగిన మహాత్ముడు సుఖదుఃఖముల నొందడను నిశ్చయము గలిగినమీదట, ఆత్మకంటె వేఱుగ ఆధారాధేయములు లేవను సత్యమనుభూతమగును. పిదప కర్తభోక్తయున్నగు సమస్త పదార్థములకంటె వేఱును, కేశాగ్రముయొక్క సహస్రభాగముకంటెను మిక్కిలి సూక్ష్మమును, ఆకాశమువలె సర్వవ్యాపకమును నగునదే నా స్వరూపమను నిశ్చయము మనుజున కుదయించును. ఆ పిమ్మట యీ జగత్తంతయు నా స్వరూపమే యను భావముగలుగును. తదనంతరము 'సర్వభూతములను ప్రకాశింపజేయునట్టి సర్వవ్యాపకమగు ఆత్మయే నేన'ను దృఢభావ ముత్పన్నమగును. పిదప 'నేను సుఖదుఃఖములకు స్థానభూతుడను గాన'ను దుఃఖరహితవృత్తి నవలంబించి ప్రారబ్ధకర్మ ననుసరించి సర్వవ్యవహారములందును లీలామాత్రముగ నాతడు వర్తించును.

తజ్జ్ఞస్య సంకటే చ ముదితైవ కేవలం జ్యోత్స్నేవ భువనభావమలం కరోతి యేన చిత్తాదృతే తు జ్ఞః కుర్వన్నప్యకర్తా సంపన్నో మనసోఽలేపకత్వాన్నాఽసౌ పాదపాణ్యాది విక్షేపస్య యత్నకృతస్యాపి కర్మణః ఫలమనుభవతి. 15

జ్ఞానియొక్క మనస్సు ఆపదలందును చంద్రికవలె ప్రపంచమును శోభావంతముగ జేయును. ఏలయన చిత్తముకంటె వేఱుగ సుఖదుఃఖములేవియును లేవు గాన చిత్తము వాసనారహితమగుటచే జ్ఞాని కర్మలనొనర్చుచున్నను అకర్తయే యగును. మఱియు, జ్ఞాని హస్తపాదాదుల సంచలనాది కర్మల ఫలమునుగూడ ననుభవింపకుండును.



ఏవం మనః సర్వకర్మణాం సర్వేహితానాం సర్వభావానాం సర్వలోకానాం సర్వగతీనాం బీజం తస్మిన్పరిహృతే సర్వకర్మాణి పరిహృతాని భవన్తి సర్వదుఃఖాని క్షీయన్తే సర్వకర్మాణి లయముపయాన్తి; మానసేనాపి కర్మణా యత్కృతేనాపి జ్ఞో నాక్రమ్యతే న వివశీక్రియతే న రంజనాముపైత్యవ్యతిరిక్తాత్. 16

ఇవ్విధముగ సర్వకర్మలకును, సర్వచేష్టలకును, సర్వభావములకును, సమస్తలోకములకును, సర్వ[illegible]లకును బీజమగు మనస్సును త్యజించిన, కర్మలన్నియు స్వయముగనే నశించును. దుఃఖములన్ని[illegible]ను క్షయించును. పుణ్యపాపమయమగు సర్వకర్మలున్ను లయమునుబొందును. జ్ఞాని ఆత్మకంటె వేఱుగ యేపదార్థమును లేదని యెఱుంగుటచే శారీరక వాచిక మానసిక కర్మలచే నాక్రాంతమైనను వానికి వశీభూతుడు గాకయుండును.

యథా బాలో మనసా నగరస్య నిర్మాణం నిర్మథనం చ కుర్వన్నగరనిర్మాణం మనఃకృతమకృతమివ లీలయాఽనుభవతి నోపాదేయతయా సుఖదుఃఖమకృత్రిమమితి పశ్యతి నగరనిర్మథనం చ మనఃకృతం కృతమితి పశ్యతీతి దుఃఖమపి లీలయాఽనుభవన్నపి న దుఃఖమితి పశ్యతి; ఏవమసౌ పరమార్థతః కుర్వన్నపి న లిప్యత ఏవేతి. 17

ఓ రామా! బాలుడు మనస్సుచే నగరమును నిర్మించుచు, దాని నలంకరించుచున్నను 'ఈ నగరము మనస్సుచే నిర్మింపబడినది, కాన యథార్థముగ లేనిదే'యని తలంచి లీలామాత్రమున దాని నెట్లనుభవించునో, మఱియు ఉపాదేయబుద్ధిచే స్వాభావిక సుఖదుఃఖములను బొందక ఆ నగర వినాశంబునుగూడ లీలామాత్రముగ నెట్లు గాంచునో, అట్లే ఆత్మయు కర్మలఁజేయుచున్నను పరమార్థదృష్టియందేమియు జేయకయే యున్నది. మఱియు లీలామాత్రముగ దుఃఖమనుభవించుచు 'ఇది దుఃఖము కాద'ని యెంచుచున్నది.

సర్వభావేషు హేయోపాదేయతాభ్యాం జగతి కిం కారణం దుఃఖస్య న చోపాదేయే కించిదపి సంభవతి యదవినాశం వ్యతిరిక్తం చాత్మనస్తస్మాదయమాత్మాఽకర్తాఽభోక్తాఽతత్త్వతో యదేతత్కర్తృత్వం చ స్వధ్యారోప్యతే. 18

ఈ ప్రపంచమున హేయోపాదేయ (త్యాజ్యగ్రహణముల) బుద్ధి ననుసరించి వ్యవహారయోగ్యములగు సర్వపదార్థములందును దుఃఖకారణ మేదియగును? హేయవస్తువు దుఃఖకారణము కాజాలదు. ఏలన ఉపాదానకారణమున దుఃఖము సంభవించుచున్నది. ఉపాదానరాహిత్యముచే హేయవస్తువువలన దుఃఖము కలుగనేరదు. ఇక ఉపాదేయవస్తువు దుఃఖకారణమనిన నదియుఁగాదు. ఏలయన, ఆత్మకంటె వేఱగు ఉపాదేయవస్తువేదియు నాశరహితము గాదు. కాన ఆత్మ అకర్తయు అభోక్తయు నగును. అవిద్యచే దీనియందు కర్తృత్వ భోక్తృత్వము లనుభూతములగుచున్నవో, అయ్యవి అధ్యారోపముచే గల్గినవని యెఱుంగుము.

ఆవశ్యకం తత్సమ్యగ్దర్శనమోహాన్న వస్తుత ఇతి యథాభూతవస్తు
విచారణాత్కర్తృత్వ భోక్తృత్వే న స్తః; ఇన్ద్రియేన్ద్రియార్థద్వేషాభిలాషా
దికా దృష్టయ స్తద్దృష్టీనాం దృశ్య న్తే నాతద్దృష్టీనామ్. 19

శరీర నిర్వహణము కొఱకు ఆవశ్యకములైనట్టి కర్మలను జీవుడు త్యజింపజాలడు. ఆ యావశ్యకకర్మలున్ను, సమ్యగ్దర్శనాభావమును మోహముచే గల్గినవగును. గాన, యథార్థముగ నవియును లేవు. సత్యవస్తువునుగూర్చి విచారించిన శుద్ధమగు ఆత్మయందు కర్తృత్వ భోక్తృత్వములు సంభవింప నేరవని తెలియగలదు. కాని, ఇంద్రియార్థములను విషయములందు రాగద్వేషాదులుగల్గి, వానికొఱకై పుణ్యాపాపము లాచరించుచు అట్టి పుణ్యాపాపరూపమగు యదృష్టములచే వివశమొనర్పబడిన బుద్ధి గలవారి దృష్టియందే ఆ కర్తృత్వ భోక్తృత్వముల ప్రతీతి సంభవించును గాని ఆత్మజ్ఞానుల దృష్టి యందు గాదు.

మోక్షోఽస్తి న సంసారే స్వసంసక్తమనసామిహాసంసక్తమనసాం
త్వేతత్సర్వ మేవాస్తి. 20

ఎవరిచిత్తము సంసారమందాసక్తము గాక ఆత్మవిచారమం జే మగ్నమైయుండునో, అట్టి తత్త్వవేత్తలను మోక్షకల్పనయున్ను ఉండనేరదు. బంధమోక్షాది రూపమగు యీ వ్యవస్థయంతయు సంసారమందాసక్తిగల అజ్ఞానులకొఱకే యగును.

యథాస్థితం జ్ఞస్య కేవలమాత్మతత్త్వమేవోల్లసతి తద్ద్వైత్వైకత్వ
వాదిసిద్ధే ద్విత్వైకత్వే కరోతి సత్త్వాసత్త్వే కరోతి శక్తిజాలాదభిన్నాం
సర్వశక్తితాం చ దర్శయతి తస్య. 21

జ్ఞానియందు శుద్ధాత్మతత్వము కేవలము సహజరూపమున ప్రకాశించును. వాని జీవన వ్యవహారసిద్ధికొఱకై, ఆత్మయే అన్యవాదిప్రసిద్ధమగు ద్వైతాద్వైత వ్యవస్థను, సత్త్వాసత్త్వములను గావించుచున్నది. మఱియు తనశక్తిసమూహముచే అభిన్నమగు ఆత్మతత్త్వముయొక్క సర్వశక్తిత్వము నదియే ప్రదర్శించుచున్నది.

న బంధోఽస్తి న మోక్షోఽస్తి నాబంధోఽస్తి న బంధనమ్
అప్రబోధాదిదం దుఃఖం ప్రబోధాత్ప్రవిలీయతే. 22

యథార్థముగ బంధముగాని మోక్షముగాని లేదు. బంధకారణమున్ను లేదు. అజ్ఞానము చేతనే దుఃఖముగల్గుచున్నది. కాని జ్ఞానముచే నదంతయు నశించును.

సంకల్పితా జగతి మోక్షమతిర్మృషైవ
సంకల్పితా జగతి బంధమతిర్మృషైవ
సంత్యజ్య సర్వమనహంకృతిరాత్మనిష్ఠో
ధీరో ధియా వ్యవహరన్భువి రామ తిష్ఠ. 23

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
ఉపశమవర్ణనం నామ అష్టత్రింశః
సర్గః ॥ 38 ॥



ఈ ప్రపంచమున బంధమోక్షములు మిథ్యారూపముననే కల్పింపబడినవి. కాన నో రామచంద్రా! సర్వమును త్యజించి ధీరుడవై అహంకారమును పారద్రోలి అసక్తబుద్ధిచే ప్రపంచమున వ్యవహరించుచుండుము.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు స్థితిప్రకరణమున
ఉపశమవర్ణనమను అష్టత్రింశ
సర్గము ॥ 38 ॥

---

## ఏకోనచత్వారింశః సర్గః.

---

శ్రీ రామ ఉవాచః—

భగవన్నేవం స్థితే పరే బ్రహ్మణ్యేవ విద్యమానే కుత ఏవాభిత్తి
చిత్రరూపాయాః సృష్టేరాగమ ఇతి కథయ మహాత్మన్. 1

శ్రీరాముడు:— ఓ మహాత్మా! తాము వచించినరీతి బంధమోక్షాదు లసంభవమై కేవలము పరబ్రహ్మమున్మాత్రము సత్యమైనచో, భిత్తిరహితమగు చిత్రమువంటి యీ సృష్టి యెటనుండి వచ్చినదో తెలియజేయుము.

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

రాజపుత్ర బ్రహ్మతత్త్వమేవేదమావర్తతే యస్మాత్సర్వశక్తి తత్త
స్మాత్సర్వాః శక్తయో బ్రహ్మణి దృశ్యన్తే. 2

శ్రీ వసిష్ఠుడు:— రాజపుత్రుడవగు నో రామా! బ్రహ్మమే యీ సర్వజగద్రూపమున వివర్తభావము నొందుచున్నది. బ్రహ్మము సర్వశక్తివంతము గాన కార్యశక్తులన్నియు నా బ్రహ్మమున నే యూహింపబడుచున్నవి.

సత్త్వమసత్త్వం ద్విత్వమేకత్వమనేకత్వమాద్యత్వమన్తత్వమితి. 3

సర్వశక్తివంతమగు దానియందే సత్త్వాసత్త్వ, ద్విత్వైకత్వ, ఏకత్వానేకత్వ, ఆద్యత్వానన్తత్వాది విరోధిధర్మముల కల్పన సంభవించును గాని శక్తిహీనమగుదానియందు గాదు.

తచ్చ నాన్యత్; యథా జలరాశేర్జలాశయ ఉల్లాసప్రఫుల్లానేన నానా
కారతాం దర్శయన్ప్రకటతాం గచ్ఛతి. 4

తథా చిద్ఘనశ్చిత్తం చిత్త్వాచ్చ సర్వాః శక్తీః కర్మమయీర్వాసనా
నామయీర్మనోమయీశ్చనోతి దర్శయతి బిభర్తి జనయతి క్షపయతి
చేతి. 5

ఆ సత్త్వాదులున్ను అన్యములు గావు. సముద్రజలము చంద్రోదయోల్లాసమున వివిధ రూపములఁ జెందుచు వ్యక్తమగునట్లు చిదాత్మ ప్రథమమున చిత్తోపహితమగు జీవరూపముఁ జెందు

చున్నది. చిత్తముచేతనే అయ్యది కర్మమయు, వాసనామయు, మనోమయ శక్తులన్నిటిని సంచయ మొనర్చుచున్నది. పిదప అట్టి సంచిత శక్తులను ఫలరూపమున దర్శింపజేయుచు ఉపభోగము వాటిని ధరించుచు మఱల తిరోభావముచే నశింపజేయుచునున్నది.

సర్వేషామేవ జీవానాం సర్వాసామభితోదృశామ్
సమగ్రాణాం పదార్థానాముత్పత్తిర్బ్రహ్మణోఽనిశమ్. 6

జీవులందఱి వివిధదృష్టులయొక్కయు, సమస్త పదార్థములయొక్కయు ఉత్పత్తి బ్రహ్మము నుండియే నిరంతరము గలుగుచున్నది.

లోకాత్పరాదుపాయాన్తి తస్మింశ్చిత్త్వాద్విశన్త్యలమ్
తన్మయా ఏవ సతతం తరంగా ఇవ సాగరే. 7

ఆ పరమాత్మనుండియే సమస్తము నుద్భవించుచున్నది. మఱల ఆతనియందే లయమగు చున్నది. వర్తమానకాలమునను సముద్రమందు తరంగములవలె నీ సర్వమున్ను నిరంతరము ఆ పరమాత్మ యందు తన్మయమై యొప్పుచున్నది.

శ్రీ రామ ఉవాచః—

భగవంస్తవాతిగహనేయం వచనవ్యక్తిర్న ఖల్వద్య వాక్యార్థ
మవగచ్ఛామి. 8

శ్రీ రాముడు:— ఓ మునీన్ద్ర! మీ వచనము లతిగహనములుగా నున్నవి. అగ్నియందు శీతలత్వమును, జలమందు దహనశక్తియును సంభవించనివిధమున చైతన్యమందు జడత్వమును, అదృశ్య మందు దృశ్యత్వమును నిత్యమం దనిత్యత్వమును ఎట్లు సంభవించును ? కాన మీరు వచించిన దాని తాత్పర్యము నాకు బోధపడకున్నది.

త్వకిలాతీతమనః షష్ఠేన్ద్రియవృత్తి బ్రహ్మతత్త్వం క్షణభఙ్గురేయం
తజ్జా పదార్థశ్రీరితి వచనరచనా; యది చాయమారంభో బ్రహ్మణ ఆపతిత
స్తదనేన తత్సదృశేనైవ భవితవ్యమ్. 9

ఇంద్రియ మనంబులకును పరమగు పరబ్రహ్మమెచట, దానినుండి యుత్పన్నమైనదియు, క్షణభంగురమును నగు యీ పదార్థజాలమెచట! ఈ జగత్తుయొక్క నామరూపములు బ్రహ్మమునుండి యుత్పన్నమైన పక్షమున బ్రహ్మమువలెనే యుండవలెనుగదా!

యో యస్మాజ్జాయతే స తత్సదృశ ఏవ భవతి. 10
యథా దీపాద్దీపః పురుషాత్పురుషః సస్యాత్సస్యమ్. 11

దీపమునుండి దీపమును, మనుజునినుండి మనుజుడును, గోధూమాది ధాన్యములనుండి గోధూమాది ధాన్యములును గలుగునట్లు, లోకమున యేది దేనినుండి యుత్పన్నమగునో అయ్యది యద్దాని కనురూపముగనే నుండును.

యతో నిర్వికారాద్యదాగతం నిర్వికారేణైవానేన భవితవ్యమ్. 12

ఈ జగత్తు నిర్వికారమగు బ్రహ్మమునుండి గల్గినదగుచో, ఇదియున్ను నిర్వికారముగ నుండవలెను గదా!



అథైతద్వ్యతిరిక్తం చిదాత్మనస్తన్నిష్కలంకస్య పరమేశ్వరస్య యే
యం కలంకాపత్తిరిత్యాకర్ణ్య భగవాన్ బ్రహ్మర్షిరువాచ. 13

ఈ జగత్తు ఆత్మకంటె భిన్నముగ వికారవంతమైనచో, ఉపరోక్తవిధమున పరబ్రహ్మ మున్ను జగద్భావము గల్గియుండవలెను గాన, మీరు వచించినరీతి నిశ్చయించుచో పరమేశ్వరునకు కళంకము సంభవించు చున్నది గదా! — శ్రీ రామచంద్రుని యీ వాక్యములవిని భగవత్స్వరూపుడును బ్రహ్మర్షియునగు శ్రీ వసిష్ఠ మునీంద్రులిట్లు బల్కిరి —

శ్రీ వసిష్ఠ ఉవాచః—

బ్రహ్మైవేదం స్థితం నామమలమస్తీహ నానఘ
తరంగౌఘగణై రమ్యైః సింధౌ స్ఫురతి నో రజః. 14

శ్రీ వసిష్ఠుడు:— ఓ రామా! సముద్రమున జలము తరంగరూపమున స్ఫురించునట్లు నీ సమస్తమున్ను బ్రహ్మమునుండియే స్ఫురించుచున్నది. మఱియు సముద్రమందు ధూళి లేనివిధమున దానియందును మాలిన్యము లేశమైనను లేదు.

ద్వితీయాకల్పనైవేహ న రఘూద్వహ విద్యతే
బ్రహ్మమాత్రాదృతే వహ్నౌ రౌష్ణ్యమాత్రాదృతే యథా. 15

రఘుకులశ్రేష్ఠుడవగు నో రామా! అగ్నియం దుష్ణత్వముదప్ప అన్యమేమియు లేనట్లు, ఈ ప్రపంచమున బ్రహ్మముకంటె భిన్నమగు మఱియే కల్పనయు లేదు.

శ్రీరామ ఉవాచః—

నిర్దుఃఖం బ్రహ్మ నిర్ద్వంద్వం తజ్జం దుఃఖమయం జగత్
అస్పష్టార్థమిదం బ్రహ్మన్న వేద్మి వచనం తవ. 16

శ్రీ రాముడు:— ఓ మహాత్మ! బ్రహ్మము దుఃఖరహితమును, నిర్ద్వంద్వమును అయి యున్నది గదా; దానినుండి గల్గిన యీ జగత్తు దుఃఖమయమై యుండనేల ? మీ వాక్యార్థము నాకు స్పష్టముగ బోధపడకున్నది. నేను మీ వాక్యముల నెఱుంగజాలకున్నాను.

శ్రీ వాల్మీకి రువాచః—

ఇత్యుక్తే తత్ర రామేణ చిన్తయామాస చేతసా
వసిష్ఠో మునిశార్దూలో రాఘవస్యోపదేశనే. 17

శ్రీ వాల్మీకి:— రామచంద్రుడిట్లుబల్క మునిశ్రేష్ఠుడగు వసిష్ఠుడు వాని కుపదేశించుటకై యుపాయమును మనంబున చింతనజేసెను —

పరం వికాసమాయాతా నాస్య తావదియం మతిః
కించిన్నిర్మలతాం ప్రాప్తా ప్రోహ్యతే చేహ వస్తుని. 18

రామచంద్రుని బుద్ధి యింకను మిగుల ప్రకాశత్వము నొందలేదు. అల్పనైర్మల్యమును మాత్రమే పొందియున్నది. మఱియు నిపుడే ఆత్మవస్తువందు ప్రవేశమొనర్ప బడుచున్నది.

యో వ్యుత్పన్నమనాస్తస్య జ్ఞాతజ్ఞేయస్య ధీమతః
మోక్షోపాయగిరాం పారం ప్రయాతస్య వివేకతః. 19

న కశ్చిత్క్వచిద్దోషో నాస్తి విద్యాత్మని హ్యలమ్
యావన్నోక్తం న విశ్రాన్తిం తావదేత్యేష రాఘవః. 20

ఎవఁడు పరిపక్వబుద్ధి గల్గియుండునో అనగా జగత్తుయొక్క జడభావమును త్యజించి చిద్రసమగు ఆత్మతత్త్వమునుమాత్రము దర్శింప సమర్థుఁడై యుండునో, అట్టి జ్ఞాతజ్ఞేయుఁడును, ధీమంతుడును, మోక్షోపాయభూతమగు వచనముల పరాకాష్ఠను బొందినవాడును నగు మహాత్మuని దృష్టియందు ఏ వస్తువునందును దోషములేక యుండును. (అనగా జగత్తు ఆత్మవస్తువునకు విరుద్ధమగురూపము గల్గియున్నను అంతయు ఆత్మస్వరూపముగ గాంచు ఆత్మజ్ఞునకు దానిచే విరోధమేమియు లేకుండును గాన మనము లెస్సగ నుపదేశింపనంతవఱకును శ్రీ రాముఁడు చిత్తవిశ్రాంతిని బొంద నేరడు.

అర్ధవ్యుత్పన్నబుద్ధేస్తు నైతద్వ్యక్తం హి శోభతే
దృశ్యానయా భోగదృశా భావయన్నేష నశ్యతి. 21

కాని పూర్ణపరిపాకము నొందని బుద్ధిగలవానికి 'ఇదంతయు బ్రహ్మమే' యను వాక్యము శోభింపదు. ఏలయన నాతడు దృశ్యప్రపంచమును ప్రాప్తింపజేయు భోగదృష్టిగలవాడై, దానిచే దృశ్యమునే భావించుచు తత్త్వజ్ఞానమునుండి చ్యుతుడగును.

పరాం దృష్టిం ప్రయాతస్య భోగేచ్ఛా నాభిజాయతే
సర్వం బ్రహ్మేతి సిద్ధాన్తకాలే నామాస్య యుజ్యతే. 22

ఉత్తమదృష్టి ప్రాప్తించినవానికి విషయభోగేచ్ఛ యుండదు గాన కాలపరిపాకముచే 'అంతయును బ్రహ్మమే' యను సిద్ధాంతము వానికవగతమగును.

ఆదౌ శమదమప్రాయైర్గుణైః శిష్యం విశోధయేత్
పశ్చాత్సర్వమిదం బ్రహ్మ శుద్ధస్త్వమితి బోధయేత్. 23

అర్ధప్రబుద్ధుడుగాని, అప్రబుద్ధుడుగాని నగు శిష్యుని ప్రథమమున శమదమాది గుణములచే, పరిశుద్ధునిగ చేయవలెను. తదుపరి 'ఇదంతయు బ్రహ్మమే' యనియు, ఆ పిమ్మట 'ఆ శుద్ధబ్రహ్మము నీవే' యనియు వానికి బోధింపవలెను.

అజ్ఞస్యార్ధప్రబుద్ధస్య సర్వం బ్రహ్మేతి యో వదేత్
మహానరకజాలేషు స తేన వినియోజితః. 24

అజ్ఞునకుగాని, అర్ధప్రబుద్ధునకుగాని "సర్వము బ్రహ్మమే"యని బోధించువాడు, ఆ శిష్యుని వలన మహానరకజాలంబున నియోగింపబడినవాడగును.

ప్రబుద్ధబుద్ధేః ప్రక్షీణభోగేచ్ఛస్య నిరాశిషః
నాస్త్యవిద్యామలమితి యుక్తంవక్తుం మహాత్మనః. 25

ప్రబుద్ధుడును, ఉత్తమబుద్ధిగలవాడును, భోగేచ్ఛ నశించినవాడును, తనకొఱకేవిధమగు నాశీస్సును వాంఛింపనివాడును, అవిద్యామలరహితుడును నగు మహాత్మునికే "సర్వము బ్రహ్మ"మని బోధించుట యుక్తమగును.



అపరీక్ష్య చ యః శిష్యం ప్రశాస్త్యతివిమూఢధీః
స ఏవ నరకం యాతి యావదాభూతసంప్లవమ్. 26

మిగుల మూఢబుద్ధిగల శిష్యుని పరీక్షింపక జ్ఞానప్రదానమొనర్చువాడు ప్రళయకాల పర్యంతమును నరకమునే పొందును.

ఇతి సంచిన్త్య భగవానజ్ఞానతిమిరాపహః
తమువాచ మునిశ్రేష్ఠో వసిష్ఠో భూమిభాస్కరః. 27

ఇట్లు విచారించి, అజ్ఞానాంధకారమును నశింపజేయువాడును, మునిశ్రేష్ఠుడును, పృథ్వీతలమున భాస్కరునివంటివాడును నగు వసిష్ఠమునీంద్రుడు శ్రీ రామునితో నిట్లనియె —

శ్రీవసిష్ఠ ఉవాచః—

కలంకకలనా బ్రహ్మణ్యస్తి నాస్తీతి వానఘ
సిద్ధాన్తకాలే వక్తవ్యం స్వయం జ్ఞాస్యసి రాఘవ. 28

పాపరహితుడవగు నో రామా! జగత్తున కళంకమున్నదియు, లేనిదియు సిద్ధాంతకాలముననే వచింపదగియున్నది. అపుడు నీవిద్దానిని స్వయముగ నెఱుంగగలవు.

బ్రహ్మ సర్వశక్తి సర్వవ్యాపి సర్వగతం సర్వోఽహమేవేతి. 29

బ్రహ్మము సర్వశక్తివంతమును, సర్వవ్యాపకమును, సర్వవస్తువులందును ప్రత్యక్షమునునై యున్నది.

యథేన్ద్రజాలినః పశ్యసి చిత్రామాయామయక్రియా జనయన్తః సదసతాం నయన్త్యసచ్చ సత్తాం నయన్తి తథైవాత్మా అమాయామయోఽపి మాయామయ ఇవ పరమ ఐంద్రజాలికో ఘటం పటం కరోతి పటం చ ఘటం కరోతి ఉపలే లతాం జనయతి మేరౌ కనకతటే నందనవనమివ లతాయాముపలముత్పాదయతి కల్పపాదపేషు రత్నస్తబకమివ వ్యోమ్ని కానన మధ్యారోపయతి. 30

ఐంద్రజాలికులు మాయచే ననేక క్రియలనొనర్చుచు సత్తును అసత్తుగను అసత్తును సత్తుగను జేయునట్లు, ఆత్మ మాయారహితమైనను మాయామయముగనై గొప్ప యింద్రజాలికునివలె ఘటమును పటము (వస్త్రము)గను, పటమును ఘటముగను చేయుచున్నది. సువర్ణతటయుక్తమగు మేరుపర్వతముపై నందనవనమును నిర్మించుచున్నది. కల్పవృక్షములందు రత్నగుచ్ఛములవలె, శిలపై లతను, లతపై శిలను ఉత్పన్నము జేయుచున్నది. మఱియు నాకాశమున వనమును కల్పించుచున్నది. ఆత్మయొక్క ఈ యపూర్వశక్తిని గాంచుము!

గంధర్వఉద్యానమివ తస్మిన్ జగతి భవిష్యతి గగనే కల్పనయా నగరతాంజనయతి నష్టచ్ఛాయాంజనమివ వ్యోమధరాతలం నయతీతి. 31

ఆ స్థానముననే గంధర్వోద్యానవనమువలెనే కల్పనావిశేషముచే భవిష్యదాకాశమున నగరనిర్మాణమొనర్చుచున్నది. ఆకాశముయొక్క నీలత్వమును రహితమొనర్చి పృథ్వీతలమును నిర్మించుచున్నది.

**గంధర్వనగరరాజగృహే విపులాంగనాజనమివ భూతలే వ్యోమ నివేశయతి.** 32

గంధర్వనగర రాజగృహములందనేక లలనాగణంబుల కల్పించునట్లు భూతలమందాకాశము స్థాపితమొనర్చుచున్నది.

**రక్తకుట్టిమేష్వాకాశప్రతిబింబమివ కించిదస్తి జగతి భవిష్యతి వా బభూవ.** 33

రక్తవర్ణమయమగు పద్మరాగమణితోఁగూడిన భవనములందలి రక్తవర్ణ ఆకాశప్రతిబింబము స్వతః అసత్తైయైనను అధిష్ఠానముయొక్క రక్తవర్ణత్వముచే సత్తగునట్లు, ఈ జగత్తునందుత్పన్నము కానున్నదియు, ఉత్పన్నమైనదియు, అంతయును స్వతః అసత్తైనను బ్రహ్మముయొక్క సత్తచే సత్తుగ నగుచున్నది.

**యదీశ్వరోఽవ్యక్తరూపో విచిత్రతాముపేత్య నిదర్శయతి.** 34

ఏలయన, ఈశ్వరుఁడవ్యక్తరూపుఁడైనను, విచిత్రరూపమున తన్ను బ్రదర్శింపజేయుచున్నాఁడు.

**సర్వమేవ సర్వథా సర్వత్ర యథా సంభవత్యేకమేవేహ వస్తు**
**విద్యత ఇతి తస్మాద్ధర్షామర్ష విస్మయానాం క్వవాఽవసరో రామ.** 35

ఇవ్విధమున నొకే యాత్మవస్తువు సర్వకాలములందును సర్వత్ర సర్వరూపమున సంభవమగుచున్నది. కాన నో రామా! యిక హర్షామర్ష విస్మయములకు తావెచట?

**సమతయైవ సతతం ధృతిమతా స్థాతవ్యమ్.** 36

ధీరుడగు వాడెల్లపుడును సమరూపముననే యుండవలెను.

**విస్మయస్మయసంమోహ హర్షామర్ష వికారితామ్**
**సమతావలితస్త్వజ్ఞో న కదాచన గచ్ఛతి.** 37

సమత్వముగల జ్ఞాని విస్మయ, గర్వ, సమ్మోహ, హర్షామర్ష వికారముల నెన్నిటికిని బొందడు.

**అపర్యవసానే దేశకాలవతి చిత్రా హి జగతి యుక్తయో దృశ్యన్తే.** 38

అనంత దేశకాలయుక్తమగు ఆత్మయందు విచిత్ర దృశ్యరచనాశక్తి గాన్పించుచున్నది.

**ఏతాశ్చయుక్తీర్నామాసావాత్మా యత్నేన రచనాం కరోతి**
**న చోత్పన్నాం తిరస్కరోతి సాగర ఇవ వీచీః.** 39

ఈ సామగ్రులన్నింటిచే ఆత్మ యత్నపూర్వకముగ ఫలావస్థా సహితమగు రచనను గావించుచున్నది. కాని సముద్రము తరంగములఁ దిరస్కరించునట్లు ఉత్పన్నమైన రచన నయ్యది తిరస్కరింప కుండును.

**కిం తర్హి క్షీర ఇవ ఘృతం ఘట ఇవ మృది ఫట ఇవ తన్తుషు వట ఇవ ధానాయాత్మన్యేవ స్థితాః శక్తయః ప్రకటతా మాగతా వ్యవహ్రియన్తేఽవిరచితమేవ తరంగవత్.** 40





క్షీరమందు ఘృతమును, మృత్తికయందు ఘటమును, తంతువందు వస్త్రమును, సూక్ష్మవట బీజమున వటవృక్షమును స్థితిగలిగియుండునట్లు, ఆత్మయందు సర్వశక్తులును స్థితిగలిగియున్నవి. అవియే వ్యక్తమగుచు వ్యవహారవంతములగుచున్నవి. కాని జలముకంటె తరంగము వేఱుకానట్లు యథార్థముగ బ్రహ్మముకంటె జగద్రచనయు వేఱుకాదు.

**నాత్ర కశ్చిత్కర్తా న భోక్తా న వినాశమేతి.** 41

ఈ ప్రపంచమున కర్తగాని భోక్తగాని యెవడును లేడు. మఱియు యెవఁడును వినాశమొందుటలేదు.

**కేవలమాత్మతత్త్వే సాక్షిణి నిరామయే సమతయాత్మని నిత్యమసంక్షుబ్ధే తిష్ఠతి సత్యేవం సంపద్యతే.** 42

కేవలము సాక్షిస్వరూపమును, నిరామయమును, సమరూపమును, నిత్యమును, సంక్షోభరహితమును నగు ఆత్మతత్త్వమందే యివ్విధమున నంతయుఁ సిద్ధించుచున్నది.

**సతి దీప ఇవాలోకః సత్యర్క ఇవ వాసరః**
**సతి పుష్ప ఇవామోదః స్వతః సంపద్యతే జగత్.** 43

దీపమున్నచో ప్రకాశమును, సూర్యుడున్నచో దినమును, పుష్పమున్నచో సుగంధమును గలుగునట్లు అధిష్ఠానమగు చైతన్యమువలననే యీ జగత్తు స్వయముగ నుత్పన్నమగుచున్నది.

**ఆభానమాత్రమేవేదం పరిదృశ్యత ఏవ చ**
**స్పన్దః సమీరణస్యేవ న సన్నానదవస్థితమ్.** 44

ఓ రామా! వాయువుయొక్క స్పందమువలె యీ దృశ్యమానమగునదంతయు బ్రహ్మముయొక్క ఆభాసమాత్రమే యైయున్నది. ఇది సత్తును గాదు, అసత్తును గాదు.

**నిర్దోషవదేవ జాగతీనాం దృష్టీనాం పరమార్థతో భగవాన్ స్థితో వినష్టానాం పునః కర్తా కృతానాం వా నాశయితా స కేవలం కదాచిత్ప్రకటాః కదాచిదల్పప్రకటాః కదాచిదప్రకటాస్తారకా ఇవ కుసుమరాశయః.** 45

ఇట్టి జగద్భావములతోడను, తన సన్నిధానమాత్రముచే నుత్పన్నమైన జగద్దోషముల చేతను, ఆత్మ యెన్నటికిని లిప్తము గాకయుండును. భగవానుడగు యా పరమాత్మ పరమార్థస్థితియందే యెల్లపుడుండును. లయమయినదానిని సృష్టించునదియును, సృష్టించినదానిని లయమొనర్చునదియు ఆ చిదాత్మయే. ఆ చిదాత్మయందే, ఆకాశమున నక్షత్రములవలెను, వనవాటికయందు పుష్పములవలెను ఈ జగత్-శక్తి యొకపుడు పూర్ణముగ వ్యక్తమగుచును, మఱొకపుడు అల్పముగ వ్యక్తమగుచును, ఇంకొకపుడు వ్యక్తముగాకయు నున్నది.

**నశ్యతీహ హి తద్వస్తునాత్మభూతం యదాత్మనః**
**కథం నశ్యతి తద్వస్తు స్వాత్మభూతం యదాత్మనః.** 46

ఆత్మస్వరూపము గానివస్తువే నశించునుగాని, ఆత్మ స్వరూపమగున దెట్లు నశించును?

జాయతే నైవ తద్వస్తు నాత్మభూతం యదాత్మనః
జాయతే చైవ తద్వస్తు స్వాత్మభూతం యదాత్మనః. 47

మఱియు ఆత్మస్వరూపము గానివస్తువు స్థితిగల్గియుండదు. ఆత్మస్వరూపమైన వస్తువే స్థితిగల్గియుండును.

కథం తజ్జాయతే తస్మాత్స్వాత్మభూతం యదాత్మనః. 48

ఏ వస్తువాత్మయొక్క స్వరూపభూతమే అయియున్నదో అయ్యది దానినుండి యెట్లుత్పన్నమగును?

తస్మాత్సమ్యగ్జ్ఞానవశాద్బ్రహ్మణం సర్వపదార్థానామాగమః. 49

కాన సమ్యగ్-జ్ఞానవశమున (పరమార్థసత్యమగు చిత్స్వరూప బలముచే) బ్రహ్మమునుండియే సమస్తపదార్థముల యుత్పత్తియు సంభవించుచున్నది.

అవతీర్ణానాం చ తేషామవతరణ సమకాలమేవావిద్యోదేతి తత్త్వ
జ్ఞానం దృఢతామేతి తదను శతసహస్రస్కన్ధో విచిత్ర శుభాశుభ ఫలభర
ఫలితో భూరిశాఖః స్ఫారతామేతి సంసారద్రుమః. 50

పదార్థోత్పత్తికి సమకాలముననే అవిద్యయను వృక్షముదయించి దృఢత్వముఁ బొందుచు క్రమముగ సహస్రస్కంధయుక్తమై, విచిత్ర శుభాశుభ ఫలభారముచే నొప్పుచు విస్తరించుచున్నది.

ఆశామంజరితాకృతిం విఫలితం దుఃఖాదిభిర్దారుణై
ర్భోగైః పల్లవితం జరాకుసుమితం తృష్ణాలతాభాసురమ్
సంసారాభిధవృక్షమాత్మనిగడం ఛిత్వా వివేకాసినా
ముక్తస్త్వం విహరేహ వారణపతిః స్తంభాదివోన్మోచితః. 51

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
సర్వైకత్వప్రతిపాదనం నామైకోనచత్వారింశః
సర్గః ॥ 39 ॥

ఓ రామా! ఆశలను పుష్పములుగలదియు, అనేక భయంకరములైన సుఖదుఃఖములను ఫలములతోఁగూడినదియు, భోగములను పల్లవములును వృద్ధావస్థయను పుష్పములును గలదియు, తృష్ణయను లతచే భూషితమును నగు ఆత్మకు బంధనస్థానమును నగు యీ సంసారవృక్షమును వివేకమను ఖడ్గముచే ఛేదించి యద్దానినుండి విముక్తిఁ జెంది స్తంభమునుండి విడువబడిన గజరాజమువలె యీ ప్రపంచమున విహరింపుము.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు స్థితిప్రకరణమున
సర్వైకత్వప్రతిపాదనమను ఏకోనచత్వారింశ
సర్గము ॥ 39 ॥

~~~~~~~

## చత్వారింశః సర్గః.

శ్రీరామ ఉవాచ:—

ఉత్పత్తిః కథమేతేషాం జీవానాం బ్రహ్మణః పదాత్
కియతీ కీదృశీ చేతి విస్తరేణ వద ప్రభో. 1

శ్రీరాముడు:— ఓ మునీంద్రా! బ్రహ్మపదమునుండి జీవులయుత్పత్తి యెట్లు యే ప్రకారము యెన్నివిధముల సంభవించుచున్నదో, విస్తారముగ వచింపుడు?

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

ఉత్పద్యన్తే యథా చిత్రా బ్రహ్మణో భూతజాతయః
యథా నాశం ప్రయాన్త్యేతా యథా ముక్తా భవన్తి హి. 2
యథా చ పరివర్ధన్తే తిష్ఠన్త్యన్తర్హితా యథా
సంక్షేపేణ మహాబాహో శృణు వక్ష్యామి తేఽనఘ. 3

శ్రీ వసిష్ఠుడు:— పాపరహితుడవును, మహాబాహుఁడవు నగు నో రామచంద్రా! బ్రహ్మము నుండి విచిత్రములగు జీవజాతు లెట్లుత్పన్నమగుచున్నవో, యెట్లు నశించుచున్నవో, యెట్లు ముక్తిని జెందుచున్నవో, యెట్లు వృద్ధియగుచున్నవో, యెట్లు స్థితిగల్గియున్నవో, అవ్విషయమంతయు సంక్షేపముగా జెప్పెద వినుము.

బ్రాహ్మీచిచ్ఛక్తిరమలా కల్పయన్తీ యదృచ్ఛయా
సర్వశక్తిః స్వయంచేత్యం భవత్యాకలనాత్మకమ్. 4

సర్వశక్తిస్వరూపమును, నిర్మలమగు బ్రహ్మమునకు జెందినదియు నగు చిత్-శక్తి సంకల్పముచే ప్రథమమున బ్రహ్మాదుల దేహాదులరూపమున కించిత్ స్ఫురణరూపమగు విషయాకారమును బొందుచున్నది.

కలనాద్ఘనతామేత్య యత్కించిదపి సా స్వయమ్
సంకల్పయతి పశ్చాత్తత్తత్తామేతి మనఃపదమ్. 5

అట్టి సంకల్పముచే చైతన్యము ఘనత్వముఁ జెందుచు, అట్టి ఘనత్వముచే జీవ, మనోపాధి రూపమున సంకల్పమొనర్చుచున్నది.

మనః సంకల్పమాత్రేణ గంధర్వపురవత్క్షణాత్
తనోతీదమసద్దృశ్యం బ్రాహ్మీం స్థితిమివ త్యజత్. 6

ఇట్లు మనస్సుయొక్క సంకల్పమాత్రముచే గంధర్వనగరమువలె క్షణములో నయ్యది తన బ్రాహ్మీ దృగ్రూపత్వమును త్యజించుచున్నదానివలె నుండి అసత్తగు యీ దృశ్యమును విస్తరింపజేయుచున్నది.

చిత్స్వరూపం పరికచచ్ఛూన్యమేవావతిష్ఠతే
యత్తద్దృశ్యం స్థితం తస్మాద్దృశ్యమాకాశమేవ తత్. 7
~~~~~~~

అంతటను ప్రకాశించుచున్నను చిత్స్వరూపము బాహ్యదృష్టిచే శూన్యముగనే యున్నది. అందుచే యథార్థముగ చిన్మయరూపమైనను, యీ దృశ్యమును ప్రసిద్ధమగు నాకాశరూపముగనే జనులు గాంచుచున్నారు.

కృత్వా పద్మజసంకల్పం రూపం పశ్యతి పద్మజమ్
తతో జగత్కల్పయతి సప్రజాపతిపూర్వకమ్. 8

ఆ చైతన్యము బ్రహ్మదేవునిగూర్చి సంకల్పించినదై తన్నుబ్రహ్మదేవుని రూపముగనే గాంచుచున్నది. పిదప దశప్రజాపతిసహితంబగు జగత్కల్పనయంతయు నొనర్చుచున్నది.

చతుర్దశవిధానన్తభూతజాతసఘుంఘుమా
సృష్టిరేవమియం రామ చిత్తనిర్మితిమాగతా. 9

ఓ రామా! పదునాలుగులోకములందలి అనంతప్రాణికోట్ల రూపముననున్న యీ సృష్టియంతయు చిత్తమునుండియే యేర్పడినది.

చిత్తమాత్రమయీ శూన్యా వ్యోమమాత్రశరీరికా
సంకల్పమాత్రనగరీ భ్రాన్తిమాత్రాత్మికా సతీ. 10

ఈ సృష్టి చిత్తమాత్రమును, ఆకాశమువలె శూన్యమును, సంకల్పనగరము వంటిదియు, భ్రాంతిమాత్రమునై యున్నది.

ఇహ కాశ్చిన్మహామోహా భూతానాం జాతయః స్థితాః
కాశ్చిదభ్యుదితజ్ఞానాః కాశ్చిన్మధ్యే స్ఖలన్తి హి. 11

ఈ బ్రహ్మాండమున కొన్ని జీవజాతులు కేవల మజ్ఞానమందున్నవియు, కొన్ని జ్ఞానయుక్తములును, మఱికొన్ని విఘ్నకారణమున మధ్యముననే చ్యుతిని బొందునవియునై యున్నవి.

భువి సంబధ్యమానానాం యాస్త్వేనాముపదేశ్యతామ్
సర్వాసాం భూతజాతీనాం యా ఏతా నరజాతయః. 12

ప్రపంచముతోటి సంబంధముగల జీవజాతులన్నింటిలోను భరతఖండమందలి జీవజాతులే వైరాగ్యాదికారణములచే యుపదేశార్హులై యున్నారు.

బహ్వ్యధమా దుఃఖమయా మోహద్వేషభయాతురాః
తాసాం సమ్యక్ప్రవక్ష్యామి తావద్రాజససాత్త్వికీః. 13

మానసికవ్యాధులచే పీడితమగుచు దుఃఖమయమై, రాగద్వేష భయమోహాదులచే వ్యాకులమగుచుండు యీ జీవజాతులందలి రాజస సాత్త్విక జాతులగూర్చి ముస్ముందు బాగుగ వివరించి చెప్పెదను.

యత్తదప్యమృతం బ్రహ్మ సర్వవ్యాపి నిరామయమ్
చిదాభాసమనన్తాఖ్యమనాది విగతభ్రమమ్. 14

మఱియు నాశరహితమును, సర్వవ్యాపియు, నిరామయమును, చిదాభాసస్వరూపమును, భ్రమరహితమును, అనాదియు, అనంతమునగు బ్రహ్మము గూర్చియు నపుడే వివరించెదను.



నిస్పన్దవపుషస్తస్య స్పన్దః సత్తైకదేశతః
ఘనతామేతి సౌమ్యేఽబ్ధౌ చలతా చలతామివ. 15

నిశ్చలసముద్రమందలి తరంగముల చంచలత్వమువలె, స్పందరహితమగు యాకృతిగల యా పరమాత్మయొక్క స్పంద (క్రియావిశేష)మే సత్తయొక్క యేకదేశమున జీవభావమున ఘనత్వమునొందుచున్నదను విషయమునుగూడ నపుడే తెలిపెదను.

శ్రీరామ ఉవాచః—

అనన్తస్యాత్మతత్త్వస్య ఏకదేశః క ఉచ్యతే
కథం వికారితా వాస్యాత్కథం వా ద్వయవిక్రమః. 16

శ్రీరాముడు:—ఓ మహాత్మా! అనంతమగు ఆత్మతత్త్వమునకేకదేశమేమి? అయ్యదెట్లు సంభవించును? ఆత్మయందు వికారమెట్లుద్భవించును? మఱియు అద్వితీయమగు ఆ యాత్మయందు స్పందమేల గలుగును?

శ్రీ వసిష్ఠ ఉవాచః—

తేన జాతం తతో జాతమితీయం రచనా గిరామ్
శాస్త్రసంవ్యవహారార్థం న రామ పరమార్థతః. 17

శ్రీవసిష్ఠుడు:—ఆ పరమాత్మచేగాని, లేక యా పరమాత్మ నుండిగాని యుత్పన్నమైన యీ వాగ్రచన యంతయు శాస్త్రవ్యవహారము కొఱకేగాని పరమార్థమున గాదు.

వికారితావయవితా దిక్సత్తా దేశతాదయః
క్రమా న సంభవన్తీశే దృశ్యమానోదయా అపి. 18

వికారిత్వము, అవయవిత్వము, దిక్-సత్త, ఏకదేశిత్వము మున్నగునవి ప్రత్యక్షముగ గన్పించుచున్నను పరమాత్మయందు సంభవముగానేరవు.

తం వినా కల్పనైవాన్యా నాస్తి నాపి భవిష్యతి
కుతస్త్యాక్రమశబ్దార్థావుక్తయో వ్యవహారజాః. 19

ఆ చిత్-ప్రకాశమున కన్యముగ మఱొకల్పనయు లేదు, యుండబోదు. కాన యిక శబ్దార్థక్రమ (కార్యకారణత్వ) మెచట? మఱియు వ్యవహారోత్పన్నమగు వాక్యరచనయు యెట నుండి గల్గును!

యా యేహ కలనా యోఽర్థో యః శబ్దో యో గిరాం గణః
తజ్జత్వాత్తన్మయత్వాచ్చ తత్తత్పదమివేష్యతే. 20

ఈ ప్రపంచమున యే కల్పనలును, శబ్దార్థములును, వాక్యసమూహములును గలవో, అవన్నియు ఆ పరమాత్మనుండియే యుత్పన్నమగుటచే ఆత్మమయమును సన్మాత్రస్వరూపములునునై యున్నవి.

తజ్జః స ఏవ భవతి వహ్నేర్వహ్నిరివోత్థితః
జన్యోఽయం జనకశ్చాయ మిత్యుక్తా భేదకల్పనా. 21

అగ్నినుండి యుత్పన్నమగునది అగ్నియే యగునట్లు పరమాత్మనుండి యావిర్భవించునది పరమాత్మస్వరూపమే యగును. జన్యజనకరూపమగు భేదకల్పన మిథ్యయే యైయున్నది.

అయమస్మాత్సముత్పన్న ఇతీయం యా జగత్స్థితిః
ఆధిక్యం తత్క్రియాశక్తా జన్యం జనకమేవ వా. 22

'ఈ ద్వీపముగాని, ఈ ప్రదేశముగాని దీనినుండి యుత్పన్నమైనది' — అను నీ క్రమము గల యీ జగత్స్థితియంతయు మాయాశక్తిచేతనే సంభవించునది. ఒక దీపమునుండి మఱియొక దీపరచన గావింపబడునట్లు, ఆత్మయొక్క క్రియాశక్తియందలి యాధిక్యమే జన్యజనక రూపమున వేఱుగ గన్పించుచున్నది.

ఇదమన్యదిదం చాన్యదితి శబ్దార్థవిక్లవః
ఉక్తావేవ న దేవేఽస్తి ప్రమితౌ భిన్నతా యతః. 23

'ఇది వేఱు' 'ఇది వేఱ'ను నీ శబ్దార్థ వ్యవహారక్రమము వాఙ్మాత్రమేయగును. అయ్యది పరమాత్మయందు లేదు. ఏలయన, పరిచ్ఛేదముండునపుడేగదా భిన్నత్వము సంభవించును.

తజ్జమైవ మనః శక్త్యా స్వతః నంజ్ఞా ప్రవర్తతే
దృఢభావనయా తస్మాదిష్టోఽర్థః ప్రతిపద్యతే. 24

బ్రహ్మమునుండి యుత్పన్నమైన మనస్సుయొక్క శక్తిద్వారా స్వభావముగనే నామ విభాగమంతయు ప్రవృత్తమగు చున్నది. మఱియు మనస్సుయొక్క దృఢభావనచేతనే జగద్వ్యవహారము సంభవించుచున్నది.

అగ్నేః శిఖాయా ఏకస్యా ద్వితీయా జనకేతియా
ఉక్తివైచిత్ర్యమేవైతన్నోక్త్యర్థేఽత్రాస్తి సత్యతా. 25

ఒక యగ్నిశిఖనుండి మఱియొక యగ్నిశిఖ యుత్పన్నమగుననుటయు వాగ్వైచిత్ర్య మాత్రమేగాని యథార్థముగాదు.

న జన్యజనకాద్యాస్తాః సంభవన్త్యుక్తయః పరే
ఏకమేవ హ్యనన్తత్వాత్కిం కథం జనయిష్యతి. 26

పరమాత్మయందు జన్యజనకాదులు సంభవింపనేరవు. ఏకమగు పరవ[illegible]ట్లు దేనిని యుత్పన్న మొనర్చును ?

ఉక్తేరేవ స్వభావోఽయ ముక్తేరుక్తిరనంతరమ్
ప్రతియోగివ్యవచ్ఛేద సంఖ్యాద్యర్థే న యుజ్యతే. 27

ఒక వచనమునకు పిమ్మట దానికి విరుద్ధమును, భిన్నమును, ద్విత్వా[illegible]సంఖ్యాయుక్తమును నగు మఱియొక వచనముండుననుట వచనస్వభావమై యున్నది.

ఊర్మిజాలమివాంభోదా పరే యః పరిదృశ్యతే
[illegible]కలనాకారస్తద్బ్రహ్మైవ విదుర్బుధాః. 28



శబ్దార్థకల్పనయొక్క రూపము సముద్రమందలి తరంగసమూహమువంటిదేయగును. దీనిని విద్వాంసులు బ్రహ్మమనియే వచించుచున్నారు.

బ్రహ్మచిద్బ్రహ్మ చ మనో బ్రహ్మవిజ్ఞానవస్తు చ
బ్రహ్మార్థో బ్రహ్మశబ్దశ్చ బ్రహ్మచిద్బ్రహ్మధాతవః. 29

ప్రత్యగాత్మ బ్రహ్మమే యైయున్నది. మనోబుద్ధులున్ను బ్రహ్మమే. శబ్దార్థములున్ను బ్రహ్మమే. ఈశ్వరుడు (లేక) సాక్షి చైతన్యమున్ను బ్రహ్మమే. సర్వవస్తువులందలి సారమున్ను బ్రహ్మమే యగును.

బ్రహ్మసర్వమిదం విశ్వం విశ్వాతీతం చ తత్పదమ్
వస్తుతస్తు జగన్నాస్తి సర్వం బ్రహ్మైవ కేవలమ్. 30

ఈ విశ్వమంతయు బ్రహ్మస్వరూపమే. అయినను బ్రహ్మపదము విశ్వముకంటె పరమునై యున్నది. ఏలయన యథార్థముగ జగత్తు లేనిదేయగును. అంతయు కేవలము బ్రహ్మము మాత్రమే.

అయమన్యోఽయమన్యోఽయం భాగ ఇత్యంబరాత్మని
మిథ్యాజ్ఞానవికల్పోక్తిర్వాచి సత్యార్థతాత్ర కా. 31

'ఇది వేఱు' 'ఇది వేఱ'ను విభాగకల్పన ఆకాశమువలె విశాలమగు పరమాత్మయందు లేదు. మిథ్యాజ్ఞానరూపమగు యీ వికల్పోక్తి వాఙ్మాత్రమే గాని, దీనియందు సత్యార్థమెచట ?

వహ్నేః శిఖేవ జాతేయం శిఖేతి మనసోఽభిధా
చాపలోత్థవికల్పశ్రీర్వస్తుతః స్యాన్న సిధ్యతి. 32

అసత్యైవ వికల్పోక్తిః సత్యభావో వికల్ప్యతే
తమోపహతదృష్టిత్వాద్ద్విచంద్రజ్ఞానదోషవత్. 33

ఒక యగ్నిశిఖనుండి మఱియొక యగ్నిశిఖ యుత్పన్నమగునట్లు బ్రహ్మమునుండి మనస్సు యుద్భవించుచున్నదను యీ వికల్పోక్తి అసత్యమైనదే యగును. భ్రాంతిదృష్టిచే గల్గు ద్విచంద్ర జ్ఞాన దోషమువలెనే సత్యస్వరూపమగు బ్రహ్మమునందు వికల్పమొనర్పబడుచున్నది. మనోచాపల్యముచే నుత్పన్నమగు వికల్పజాలము నిత్యశుద్ధకూటస్థ బ్రహ్మమందు సిద్ధింపనేరదు.

సర్వస్మాత్సర్వగాత్తస్మాదనంతాద్బ్రహ్మణః పదాత్
నాన్యత్కించిత్సంభవతి తదుత్థం యత్తదేవ తత్. 34

సర్వరూపమును సర్వవ్యాపియునగు నా యనంత బ్రహ్మపదమునుండి మఱొద్దియును సంభవింపనేరదు. మఱియు దానినుండి యావిర్భవించుదనంతయున్నూ బ్రహ్మస్వరూపమే యగును.

బ్రహ్మతత్త్వం వినా నేహ కించిదేవోపపద్యతే
సర్వం చ ఖల్విదం బ్రహ్మేత్యేషైవ పరమార్థతా. 35

బ్రహ్మతత్వములేనిచో నేదియు యుత్పన్నము గానేరదు. 'ఇదంతయు బ్రహ్మమే'యను కథనము మాత్రమే యథార్థమైనది.

ఏవంప్రాయశ్చ హే ప్రాజ్ఞ సిద్ధాన్తస్తే భవిష్యతి
తత్రైవోదాహరిష్యామః సిద్ధాన్తార్థోక్తిపంజరమ్. 36

ప్రాజ్ఞుఁడవగు నో రామా! ఈ మున్నగు సిద్ధాంతములు నీకు మున్ముందు అవగతము కాగలవు. సిద్ధాంతార్థకథనమును నిర్వాణప్రకరణమున నిరూపించెదను.

ఇహాపేద్యాదికాః కేచిద్విద్యన్తే నేతరక్రమాః
జ్ఞాస్యస్యలమశేషార్థాం స్తత్తదజ్ఞానసంక్షయే. 37

ఈ పరమార్థతత్వమగు బ్రహ్మమందు అవిద్యాదుల సంసారము లేశమైనను లేదు. ఈ విషయముల నన్నింటిని, ఆయా యజ్ఞానదోషములు నశించినవెనుక నీవు బాగుగ నెఱుంగగలవు.

అవస్తుసంక్షయేవస్తు యథా వస్తు ప్రసీదతి
యథా చ దృశ్యతే దృశ్యం జగన్నైశతమఃక్షయే. 38

మాలిన్యము నశించిన, పదార్థముయొక్క యథార్థరూపము ప్రకటితమగునట్లును, రాత్రియందలి యంధకారము నశింప దృశ్యజగత్తు గోచరించునట్లును, అజ్ఞానము నశింప బ్రహ్మపదమున్ను ప్రత్యక్షమగును.

యదిదమఖిలమాతతం కుదృష్ట్యా
తదుపశమే తవ రామ నిర్మలాభే
అవితథపదనిర్మలే భవిష్య
త్యవితథమేవ న సంశయోఽత్ర కశ్చిత్. 39

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
బ్రహ్మైవేదం సర్వం జగదితి ప్రతిపాదనం నామ
చత్వారింశః సర్గః ॥ 40 ॥

ఓ రామచంద్రా! అజ్ఞానముచే కలుషితమగు దృష్టిచే గాన్పించు యీ విశాలదృశ్యజగత్తు శమింప, దర్పణమువలె నిర్మలమైన సత్యస్వరూపమగు బ్రహ్మపదమున నీ బుద్ధి నిశ్చయముగ స్థిరము నొందగలదు.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు స్థితిప్రకరణమున
బ్రహ్మైవేదంసర్వం జగదితి ప్రతిపాదనమను
చత్వారింశ సర్గము ॥ 40 ॥

---

## ఏకచత్వారింశః సర్గః.

---

శ్రీరామ ఉవాచః—

క్షీరోదకుక్షితుల్యాభిః శీతలామలదీప్తిభిః
[illegible]క్తిభిర్విచిత్రాభిర్గంభీరాభిరివాభితః 1



క్షణమాన్ధ్యమివాప్నోమి క్షణం యామి ప్రకాశతామ్
శాన్తాతపలవః ప్రావృడ్లోలాభ్ర ఇవ వాసరః. 2

శ్రీరాముడు:—ఓ మునీంద్రా! శీతలమును నిర్మలప్రకాశయుక్తమునునగు చంద్రునివలె విచిత్రములును గంభీరార్థావబోధకంబులునునగు తమ వచనములచే, వర్షాకాలమున క్షణములో చంచలమేఘమున్ను మఱుక్షణమున స్వల్పాతపమున్ను సంభవించునట్లు, క్షణకాలమంధత్వ (అజ్ఞాన)మును, క్షణకాలము ప్రకాశత్వ (జ్ఞాన)మును నేను పొందుచున్నాను.

అనన్తస్యాప్రమేయస్య సర్వస్యైకస్య భాస్వతః
అనస్తమితసారస్య కలనా కథమాగతా. 3

ఓ దేవా! అనంతమును, అప్రమేయమును, పరిపూర్ణమును, సదా ప్రకాశవంతమును, ఏకరసమును, నిత్యోదితమును, పరమార్థస్వరూపమును నగు పరమాత్మయందు వికార కల్పన యేల సంభవించినది?

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

యథా భూతార్థవాక్యార్థాః సర్వా ఏవ మమోక్తయః
నాసమర్థావిరూపార్థాః పూర్వాపరవిరోధవాః. 4

శ్రీవసిష్ఠుడు:— ఓ రామా! నేను వచించునదంతయు సత్యార్థయుక్తమైనదే. దానియందెట్టి అయోగ్యత్వము గాని పూర్వాపరవిరోధము గాని లేదు. మఱియు ఆ నావాక్యములు మహావాక్యసంబంధరహితములును గావు.

జ్ఞానదృష్టౌ ప్రసన్నాయాం ప్రబోధే వితతోదయే
యథావజ్జ్ఞాస్యసి స్వస్థో మద్వాగ్దృష్టిబలాబలమ్. 5

నిర్మల జ్ఞానదృష్టి యుదయింప, పూర్ణప్రబోధముఁజెందునపుడు స్వస్థచిత్తుడవై యితరుల వాక్యములకంటె నా వాక్యములందుగల ప్రాబల్యమును యథారీతి నీ వెఱుంగగలవు.

ఉపదేశ్యోపదేశార్థం శాస్త్రార్థప్రతిపత్తయే
శబ్దార్థవాక్యరచనాభ్రమో మా తన్మయో భవ. 6

అసత్య శబ్దార్థయుక్తమగు వాక్యరచనాభ్రమయయున్నా స్వప్నాదులందువలె సత్యార్థజ్ఞానమునకు హేతువగును. కాన యుపదేశ్య (జ్ఞేయ) వస్తువు నుపదేశించుటకొఱకు మాత్రమే యీ వాగ్జాలమంతయు కల్పింపబడినది. కాన నీవు మిథ్యాభ్రమయందు తగుల్కొనకుము.

యదా పురా జ్ఞాస్యసి తత్సత్యమత్యన్త నిర్మలమ్
వాచ్యవాచకశబ్దార్థభేదం త్యక్ష్యసి వై తదా. 7

మున్ముందు యెపుడా అత్యంత నిర్మలమగు సత్యపదము నీవెఱుంగుదువో, అపుడే యీ వాచ్యవాచక శబ్దార్థ భేదములను త్యజించివైచెదవు.

భేదకృద్వాక్ప్రపంచోఽయముపదేశ్యేషు కల్పితః
ఉపదేశ్యోపదేశార్థం శాస్త్రార్థప్రతిపత్తయే. 8

ఉపదేశ్యమగు బ్రహ్మమునుపదేశించుట కొఱకును, సత్యశాస్త్రార్థావబోధము కొఱకును, ఉపదేశింపదగిన అజ్ఞులనిమిత్తమే భేదయుక్తమగు యీ వాక్ప్రపంచమంతయు కల్పింపబడినది.

శబ్దార్థవాక్ప్రపంచోఽయముపదేశేషు కల్పితః
సదాఽజ్ఞేషు న తజ్జ్ఞేషు విద్యతే పారమార్థికః. 9

ఓ రామా! అజ్ఞులయుపదేశార్థమే శబ్దార్థరూపమగు యీ ప్రపంచము కల్పింపబడినది. కాని కేవలము పరమార్థస్థితియందుండు జ్ఞానులకొఱకు గాదు.

కలనామలమోహాది కించిన్నాత్మని విద్యతే
నీరాగం బ్రహ్మపరమం తదేవేదం జగత్స్థితమ్. 10

విషయోన్ముఖత్వ, సంస్కార, కర్మ, మోహాదులెవ్వియును ఆత్మయందొకింతయును లేవు. బ్రహ్మము రాగరహితమైనది. పరమమగు ఆ బ్రహ్మరూపముననే యీ జగత్తు స్థితిగల్గియున్నది.

ఏతద్విచిత్రరూపాభిర్యుక్తిభిర్బహులాశ్శః పునః
విస్తరేణైవ వక్తవ్యం సిద్ధాన్తావసరేఽనఘ. 11

పాపరహితుఁడవగు నో రామా! ఈ విషయమునే విచిత్రరూపమున ననేక యుక్తులచే సిద్ధాంతకాలమున (నిర్వాణ ప్రకరణమున) విస్తరించి చెప్పెదను.

వాక్ప్రపంచం వినా త్వేతదజ్ఞానమతులం తమః
భేత్తుమన్యోన్యముదితం యత్నం కర్తుం న శక్యతే. 12

సాధనాజ్ఞాన మూలాజ్ఞానరూపమగు తమస్సు పరస్పర సాహాయ్యముచే ననేక శాఖలుగ విస్తరించియున్నది. వాక్ప్రపంచము లేకయే యద్దానిని భేదించుట కెవరును యత్నింపజాలరు.

అవిద్యయైవోత్తమయా స్వాత్మనాశోద్యమేచ్ఛయా
విద్యా సా ప్రార్థ్యతే రామ సర్వదోషాపహారిణీ. 13

ఓ రామా! అనేక జన్మలందలి సుకృతములచే శుద్ధాంతఃకరణ రూపమున పరిణమించినదియు, స్వనాశార్థముద్యుక్తమగునదియునగు యుత్తమ అవిద్య (ఉపదేశాది వాక్ప్రపంచము) ద్వారా సర్వదోషవినాశినియగు విద్య (జ్ఞానము) వాంఛింపబడుచున్నది.

శామ్యతి హ్యస్త్రమస్త్రేణ మలేన క్షాల్యతే మలః.
శమం విషం విషేణైతి రిపుణా హన్యతే రిపుః. 14

అస్త్ర మస్త్రముచే శమించును. క్షారమృత్తికచే మాలిన్యము తొలగును. విషము విషముచే శమించును. శత్రువినాశనము శత్రువుచేతనే సంభవించును. అట్లే అవిద్యచేతనే అవిద్య నశించును.

ఈదృశీ రామ మాయేయం యా స్వనాశేన హర్షదా
న లక్ష్యతే స్వ[illegible]ఽస్యాః [illegible]క్షమాణైవ నశ్యతి. 15



ఓ రామా! ఈ మాయ స్వవినాశముచే ఆనందము గొల్పునదై యున్నది. దీని స్వభావము దృగ్గోచరము గాకయున్నది; కాని దృష్టిపథమున వచ్చుటతోడనే నశించుచున్నది.

వివేకమాచ్ఛాదయతి జగన్తి జనయత్యలమ్
న చ విజ్ఞాయతే కైషా పశ్యాశ్చర్యమిదం జగత్. 16

ఈ మాయ వివేకము నాచ్ఛాదించుచున్నది. అనేక జగత్తుల నుత్పన్నము జేయుచున్నది. [illegible]మేమిటో తెలియకయున్నది. ఆహా! దీని కార్యమగు యీ జగత్తు యెట్లసంభావితము[illegible]శ్చర్య[illegible]గనున్నదో వీక్షింపుము.

అప్రేక్షమాణా స్ఫురతి ప్రేక్షితా తు వినశ్యతి
మాయేయమపరిజ్ఞాయమానరూపైవ వల్గతి. 17

అవలోకింపమి చేతనే యీ మాయ స్ఫురించుచున్నది. అవలోకించిన నశించుచున్నది. అపరిజ్ఞాతరూపముననే అయ్యది విజృంభించుచున్నది.

అహో ను ఖలు చిత్రేయం మాయాసంసారబన్ధనీ
అసత్యైవాతిసత్యేవ స్వజ్ఞానం విహితం తయా. 18

ఆహా! ఈ విచిత్ర సంసారబంధముగల్గజేయు మాయ యెట్టి అపూర్వమైనది! అసత్యమైనను సత్యముగనే యిది భాసించుచున్నది. ఎట్టి మిథ్యాజ్ఞానము నిది రచించినదో చూడుము!

అత్యభిన్నపదే తస్మింస్తన్వానా భేదమాతతమ్
సంసారమాయాయేనాసా తేనాసా పురుషోత్తమః. 19

అక్షరమగు యీ మాయ అభిన్నమును పరమపదమునగు పరమాత్మయందు, క్షరమును విశాలమునునగు యీ భేదమంతయు విస్తరింపజేయుచున్నది. కాన నియ్యది క్షరాక్షరస్వరూపుఁడగు పురుషునికంటె అతీతమై పురుషోత్తమరూపమున దనరుచున్నది.

నాస్త్యేషా పరమార్థేన త్వేవంభావనయేద్ధయా
జ్ఞో భూత్వా జ్ఞేయసంప్రాప్తో జ్ఞాస్యస్యస్యాస్త్వమాశయమ్. 20

ఓ రామా! పరమార్థస్థితియందీ మాయ లేదను నిశ్చయముగల్గి ఆచార్య వేద తర్కస్వానుభవములచే సుదీప్తమగు భావనచే జ్ఞానివై జ్ఞేయమగు ఆత్మస్వరూపమును ఎపుడు నీ వెఱుంగుదువో, అపుడే యీ నా వాక్యముల యాశయమున్ను చక్కగ నెఱుంగ గల్గుదువు.

యావత్తు న ప్రబుద్ధస్త్వం తావన్మద్వచసైవ తే
నిశ్చయో భవతూద్దామో నాస్త్యవిద్యేతి నిశ్చలః. 21

కాని ప్రబుద్ధుఁడవు గానంతవఱకును, మా వాక్యములచే అవిద్య లేదనిమాత్రము నిశ్చయింపుము.

యదిదం దృశ్యతాం యాతం మానసం మననం మహత్
అసన్మాత్రమిదం యస్మాన్మనోమాత్రవిజృంభితమ్. 22

మనస్సంబంధమును, మనస్సుయొక్క మననముచే విశాలరూపమున నుదయించినదియు నగు యీ దృశ్యమంతయు మనోవిలాసమాత్రమే యగుటచే అసద్రూపమైయున్నది.

సత్త్వద్భ్రాన్తిరితి యస్యాన్తర్నిశ్చయః సోఽపిమోక్షభాక్

ఈ జగత్తు మాయామయమును, మిథ్యయునైయున్నదను నిశ్చయమెవని యంతఃకరణమున నుదయించునో యాతడే మోక్షభాగుడగును.

చలాచలాకృతిర్యాయా దృష్టిరాబద్ధభావనా. 23
సావమగ్రజగద్భూత ఖగబంధనవాగురా

చంచలమును బాహ్యార్థభావనారూపమునగు దృష్టియే ప్రపంచమున జీవులనునట్టి పక్షుల బంధించు జాలమైయున్నది.

యఃస్వప్నభూమివద్భ్రాన్త మనస్సద్వ్యైకనిశ్చయః. 24
జగత్పశ్యత్యసక్తాత్మా న స దుఃఖే నిమజ్జతి

భూతభవిష్యద్వర్తమాన జగద్విషయమై అసద్రూపమునగాని సద్రూపమునగాని యొక దృఢనిశ్చయమొనర్చుకొని అసక్తబుద్ధిచే జగత్తును వీక్షించువాడు దుఃఖములందు నిమగ్నుడుగాక యుండును.

యస్యైతాస్వస్వరూపాను భావనాస్వాత్మభావనా. 25
అస్వరూపస్య తస్యాపి సా హ్యవిద్యైవ విద్యతే

దేహేంద్రియాదులం దెవనికి అహంభావము గలదో యాతడే తన యేకరూపము నెఱుంగమి అవిద్యావంతుడగును. మఱియు నాతడే దుఃఖముల బాల్పడును.

వికారితాదయో దోషా న కేచన మహాత్మని. 26
పరమాత్మని విద్యన్తే పయసీవేహ పాంసవః
భావనాశబ్దశబ్దార్థ రంజనేయం జగద్గతా. 27
వ్యవహారార్థముత్పన్నా వ్యతిరిక్తా చ నాత్మనః
అనేన వ్యవహారేణ వినైతాః శాస్త్రదృష్టయః. 28
సంస్థితిం నాధిగచ్ఛన్తి పటా ఇవ వితన్తవః

సముద్రమందు ధూళి లేనిచందమున వికారిత్వాది దోషములు పరమపదమగు ఆత్మయందులేవు. నామరూపములందలి చిద్భావన స్ఫటికమణియందలి తాత్కాలిక రంజనామాత్రమువంటిదేయగును. ఈ రంజనయు వ్యవహారముకొఱకుత్పన్నమైనను ఆత్మకంటె వేఱుకాదు. ఇట్టి వ్యవహారములేనిచో, సూత్రాభావంబున వస్త్రము స్థితిఁబొందనట్లు, శాస్త్రదృష్టియు స్థితిఁబొందకుండును.

ఉహ్యమానోహ్యవిద్యాయా మాత్మా నేహోపలభ్యతే. 29

అవిద్యాప్రవాహమున గొట్టుకొని పోవుచున్న జీవుడే ప్రపంచమున ఆత్మజ్ఞానములేనిచో స్వాత్మానుభవము నొందజాలడు.



ఆత్మజ్ఞానాదృతే తచ్చ శాస్త్రార్థాత్సమవాప్యతే
అవిద్యాసరితః పారమాత్మలాభాదృతే కిల. 30

ఆత్మజ్ఞానానుభవము శాస్త్రార్థములచే సంప్రాప్తించుచున్నది. ఓ రామా! ఆత్మప్రాప్తి లేకయే అవిద్యానది నెవరును దాటజాలరు.

రామ నాసాద్యతే తద్ధి పదమక్షయముచ్యతే
యతః కుతశ్చిజ్జాతేయ మవిద్యామలదాయినీ. 31

ఆ యాత్మలాభమే అక్షయపదమని వచింపబడినది. ఈ యవిద్యయెటనుండి ప్రాప్తించినదో యను విషయమటుండనిమ్ము. దీనిచే మాలిన్యమే సంభవించుచున్నదిగదా!

నూనం స్థితిముపాయాతా సమాసాద్య పదంస్థితా
కుతో జాతేయమితి తే రామ మాస్తు విచారణా. 32

ఇయ్యది హృదయస్థానము నాక్రమించి స్థితిఁబొందియున్నది. ఓ రామా! ఈ యవిద్య యెటనుండి యుత్పన్నమైనదను విచారము నీకు వలదు.

ఇమాం కథమహం హన్మీత్యేషా తేఽస్తు విచారణా
అస్తంగతాయాం క్షీణాయామస్యాం జ్ఞాస్యసి రాఘవ. 33

కాని 'దీనినెట్లు నశింపజేతు'నని మాత్రమే విచారించుచుండుము. ఈ యవిద్య నశించినపుడే దాని యథార్థతత్వమంతయు నీకు సుబోధము కాగలదు.

యత ఏషా యథా చైషా యథా నష్టేత్యఖండితమ్
వస్తుతః కిల నాస్త్యేషా విభాత్యేషా నవేక్షితా. 34

ఇదెటనుండి వచ్చినది; యేరూపముననున్నది; యెట్లు నశించునను విషయములన్నియు అపుడే నీవు బాగుగ నెఱుంగగలవు. యథార్థముగ నీ యవిద్య లేనిదే యగును. వీక్షింపమి (జ్ఞానాభావము)చే నియ్యది ప్రకాశించుచున్నది.

అసతో భ్రాన్తతాం సత్యరూపాం జానాతు కః కుతః
జాతేయం ప్రౌఢిమాపన్నా దోషాయైవాతతాకృతిః. 35

అసద్వస్తువుల భ్రాంతిత్వముగాని, సత్యరూపత్వముగాని యెవడెఱుంగగల్గును? ఈ యవిద్య యుత్పన్నమైనదై దోషార్థమే విశాలాకృతి బడయుచు దృఢత్వముఁజెందుచున్నది.

బలాత్ప్రణాశయత్వేనాం పరిజ్ఞాస్యసి వై తతః
అపి శూరా అతిప్రాజ్ఞాస్తే న సన్తి జగత్త్రయే. 36
అవిద్యయా యే పురుషా న నామ వివశీకృతాః
తదస్యా రోగశీలాయా యత్నం కురు వినాశనే. 37

ఓ రామా! ఈ యవిద్యను బలపూర్వకముగ నశింపజేయుము. అపుడే నీవు దీని నెఱుంగగలుదువు. గొప్ప ధీమంతులైనను, శూర వీరులైనను అవిద్యచే వశీభూతులు గానివారెవరును యీ ముల్లోకమునగూడ లేరు. కాన రోగరూపమగు ఈ యవిద్యను నశింపజేయుటకై నీవు యత్నశీలుడవు గమ్ము.

యథైషా జన్మదుఃఖేషు న భూయస్త్వాం నియోక్ష్యతి
సర్వాపదామేకసఖీమజ్ఞాన తరుమంజరీమ్
అనర్థసార్థజననీమవిద్యామలముద్ధర. 38

అట్లొనర్చుటచే యిక నయ్యది మరల జన్మదుఃఖమున నిన్ను బడద్రోయకుండును. ఈ యవిద్య యాపదలన్నింటికిని ముఖ్యసఖియు, అజ్ఞానవృక్షమునకు లతయు, అనర్థసమూహమునకు మాతయు నైయున్నది. కాన నీ యవిద్యామలమునుండి నిన్ను నీ వుద్ధరించుకొనుము.

భయవిషాదదురాధి విపత్ప్రదాం
హృదయమోహమహా పటలాఙ్కురమ్
భృశమపాస్య కుదృష్టిమిమాం బలా
ద్భవ భవార్ణవ పారముపాగతః. 39

ఇత్యార్షే వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
అవిద్యాకథనం నామైకచత్వారింశః
సర్గః ॥ 41 ॥

ఓ రామా! భయమును, విషాదమును, దుష్టమానసిక చింతలను, విపత్తులను గల్గజేయు నదియు, హృదయమందలి మహామోహపటలమునకు అంకురమును, కుదృష్టిరూపమునునగు యీ యవిద్యను బాగుగ నిర్మూలించి సంసార సముద్రమును దాటివేయుము.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు స్థితిప్రకరణమున
అవిద్యాకథనమను ఏకచత్వారింశ
సర్గము ॥ 41 ॥

---

## ద్విచత్వారింశః సర్గః

---

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

కుపితస్యాసతోఽప్యస్య ప్రేక్షామాత్రవినాశినః
అవిద్యావితతవ్యాధేరౌషధం శృణు రాఘవ. 1

శ్రీవసిష్ఠుడు:—ఓ రామా! విచారమాత్రమున నశించునదియు అసత్తయినను కుపితవంతమై అనేక అనర్థముల గల్గజేయునదియు విస్తృతమునగు ఈ యవిద్యారోగమున కౌషధము వచించుచున్నాను వినుము.

యాం తాం కథయితుం జాతిం రామ రాజససాత్త్వికీమ్
మనోవీర్యవిచారార్థం ప్రస్తుతోఽస్మీహ తాం శృణు. 2



ఇంతకు పూర్వము రాజససాత్త్విక జీవజాతులఁగూర్చి వర్ణించెదనని చెప్పియుంటిని. ఆ విషయము నెఱింగించుటకై, ప్రథమమున మనోపరాక్రమ నిరూపణ గావించుచున్నాను. కాన నీ విద్దాని నాకర్ణింపుము.

యత్తదవ్యమృతం బ్రహ్మ సర్వవ్యాపి నిరామయమ్
చిదాభాసమనన్తాఖ్యమనాది విగతభ్రమమ్ 3
చిత్స్పందవపుషస్తస్య స్పందస్తస్మాచ్చిదేవ హి
ప్రదేశాద్ఘనతామేతి సౌమ్యోఽబ్ధిశ్చలనాదివ. 4

అమృతస్వరూపమును, సర్వవ్యాపియు, నిరామయమును, అనాదియు, అనంతమును, భ్రమరహితమును, చైతన్య శరీరధారియునగు బ్రహ్మముయొక్క స్పందము (చలనాత్మకమగు క్రియా శక్తియు) న్ను చిద్రూపమే యైయున్నది. శాంత సముద్రము తరంగాదుల రూపమున చలనము బొందునట్లు, ఆ యుపాధిక బ్రహ్మమున్ను ఒక ప్రదేశమునుండి మఱియొక ప్రదేశమునకు బోవుచు చంచలమైయున్నది.

అన్తరర్ధే ర్జలం యద్వత్స్పందాస్పందవదీహతే
సర్వశక్తిస్తథైకత్ర గచ్ఛతి స్పందశక్తితామ్. 5

సముద్రాదులందలి జలము యేకదేశము (బహిర్భాగము) న స్పంద సహితముగను, అన్యత్ర స్పందరహితముగ నుండునట్లు, సర్వశక్తివంతమగు బ్రహ్మమున్ను ఏకదేశమున క్రియాశక్తిత్వమును బొందుచున్నది.

ఆత్మన్యేవాత్మనా వ్యోమ్ని యథా సరతి మారుతః
తథేహాత్మాత్మశక్త్యైవ స్వాత్మన్యేవైతి లోలతామ్. 6

ఆకాశమందు వాయువెట్లు తనయందే తాను చలనము బొందుచుండునో, అట్లే స్వతః కూటస్థస్వరూపమైనను ఆత్మ ఈ ప్రపంచమున తనయందే తాను అధ్యాసముచే చంచలత్వమును బొందుచున్నది.

స్వశిఖాస్పందశక్త్యైవ దీపః సౌమ్యో యథోన్నతమ్
ఏతి తద్వదసావాత్మా తత్స్వేవపుషి వల్గతి. 7

వాయ్వాది విక్షేప రహితమైనను దీపము స్వశిఖాశక్తిచే ఊర్ధ్వప్రదేశమునే బొందునట్లు, ఆత్మయు స్వశక్తిచే స్వస్వరూపముననే జగజ్జీవాదిరూపమున ప్రకాశించుచున్నది.

జలాన్తరేఽమ్బుధిర్యద్వల్లసద్వారీవ చంచలః
సర్వశక్తిర్వపుష్యేవ తథా స్పందవిలాసవాన్. 8

ఆతపాదుల సంబంధముచే సముద్రాంతర్గత జలము యేకదేశమున చంచలముగ గన్పట్టునట్లు, సర్వశక్తివంతమగు ఆత్మయు తన స్వరూపమున గల్పింపబడిన యేకదేశమందు క్రియాశక్తి విలాసయుక్తమై నొప్పుచున్నది.

యథోల్లసతి భాశ్చక్రైః కచన్కనకసాగరః
తథాత్మని పరిస్పందైః స్ఫురత్యాత్మైశ్చిదర్ణవః. 9

ఆతపాదుల దీప్తి సమూహంబులచే సముద్రము దేదీప్యమానమగు తప్తకాంచనమువలె స్ఫురించునట్లు, ఇంద్రియ ప్రకాశములచే చిద్రూప సముద్రమున్ను స్ఫురించుచున్నది.

లక్ష్యతే మహాశక్తిస్పందో యథా వ్యోమ్ని దృశోఽదృశి
తథా భాతి లసద్రూపా చిచ్ఛక్తిశ్చిన్మహాంబరే. 10

అతీంద్రియమగు నాకసమున ముత్యముల సమూహము దృష్టిగోచరమగునట్లు, అతీంద్రియమగు చిదాకాశమున శోభాయమానంబగు చిత్-శక్తియు స్ఫురించుచున్నది.

కించిత్క్షుభితరూపా సా చిచ్ఛక్తిశ్చిన్మహార్ణవే
తన్మయీ చిత్స్ఫురత్యచ్ఛా తత్రైవోర్మిరివార్ణవే. 11

స్వతః నిర్మల స్వరూపమైనను చిద్రూప మహాసాగరమున, చిత్-శక్తి యల్ప విక్షోభము నొందునపుడు, అయ్యది యాస్పందముతోటి తన్మయముఁజెంది, సముద్రమందు తరంగమువలె నట స్ఫురించును.

ఆత్మనోఽవ్యతిరిక్తైవ వ్యతిరిక్తేవ తిష్ఠతి
ఆలోకశ్రీరివాలోకకోటరే యత్తతాంగతా. 12

ఇంద్రియ సంబంధమగు చిత్-శక్తి, ఆత్మచిత్-శక్తికంటె వేఱుగాకున్నను వేఱుగనే గన్పించుచున్నది. మఱియు నయ్యది సూచ్యాదులయొక్క కల్పిత యాలోకచ్ఛిద్రమున యాలోకము (ప్రకాశము)వలె ఉపాధి పారవశ్యమునొందుచున్నది.

క్షణం స్ఫురతి సా దేవీ సర్వశక్తితయా తయా
చేతతి స్వాం స్వయం శక్తిం కలేన్దోః శీతతామివ. 13

ఈ చిత్-శక్తియను దేవి తన సర్వశక్తిత్వకారణంబున కాలరూపమున స్ఫురించుచున్నది. చంద్రకళ శీతలత్వమును వ్యక్తమొనర్చునట్లు, ఇయ్యది స్వయముగ తన కాలశక్తిని ప్రదర్శించుచున్నది.

ఉదితైషా ప్రకాశాఖ్యా చిచ్ఛక్తిః పరమాత్మనః
దేశకాలక్రియాశక్తిర్వ్యయస్యాః సంప్రకర్షతి. 14

పరమాత్మ-ప్రకాశస్వరూపమగు యీ చిత్-శక్తి యుదయమును పొందినదై, దేశకాలాది క్రియాశక్తి స్వరూపులైన సఖులను తన చెంతకు జేర్చుచున్నది.

స్వస్వభావం విదిత్వైవమనాద్యన్తపదే స్థితా
రూపం పరిమితే వాసౌ భావయత్యవిభావితా. 15

ఈ చిత్-శక్తి స్వస్వభావము నెఱింగి, ఆద్యంతరహితమగు పరమాత్మపదమున స్థితిఁబొందుచున్నది. కాని అవిచారముచే భ్రాంతివశమున పూర్వోక్త కల్పితరూపమునే తన స్వభావముగ నెంచి 'నేను పరిచ్ఛిన్నుడ'నమనట్టి భావనను తనయందు దృఢపఱచుకొనుచున్నది.

యదైవం భావితం రూపం తయా పరమసత్తయా
తదైవైనామనుగతా నామసంఖ్యాదికాదృశః. 16





ఎపుడా పరమసత్త యీవిధమున పరిచ్ఛిన్నమైనదానినే తన రూపముగ నిశ్చయించెనో, అపుడే యది నామరూప, ప్రాణేంద్రియాదులం దనుగమించుచున్నది.

చిదేవైతదవస్త్వేవ వ్యతిరిక్తా తథాత్మనః
అనన్తా తద్గతైవాశు లహరీవ మహార్ణవాత్. 17

ఇవ్విధమున చిద్వస్తువందు కల్పింపబడిన సమస్త పదార్థములున్ను చైతన్యమాత్రములే యగును. ఏలయన, సద్రూపమగు ఆత్మకంటె వేఱుగునది అవస్తువేగాని సత్యముగాదు. సముద్రమందు తరంగములవలె, అనంతమగు యీ దృశ్యకల్పన యంతయు చిత్స్వరూపముననే యనుగతమైయున్నది.

యథా కటకకేయూరైర్భేదో హేమ్నో విలక్షణః.
తథాత్మనశ్చితోరూపం భావయన్త్యాః స్వమాంశికమ్. 18

కటక కేయూరాద్యాభరణములతోడ సువర్ణముయొక్క భేదము విలక్షణమైనట్లు, ఆత్మేతర భావన యొనర్చు చిదంశకల్పనాధీనమైయున్న యీ జగత్తంతయున్ను చైతన్యముతోడ విలక్షణ భేదముగల్గి యొప్పుచున్నది.

యథా దీపేన దీపానాం జాతానామాత్మనాం తథా
దేశకాలకలామాత్రభేదః స్వాభావికశ్చితేః. 19

ఒక దీపమునుండి వెలిగింపబడిన అనేక దీపములందు ఉపాధిసంబంధములగు దేశకాలాద్యవయవములందే భేదముగల్గి, దీపాగ్ని స్వరూపములందు భేదములేక యుండునట్లు, దేశకాలాది ఉపాధిస్వభావమాత్రముచే చైతన్యమునకు భేదముగలదు గాని యథార్థముగ లేదు.

దేశకాలపరిస్పంద శక్తిసన్దీపితాథచిత్
సంకల్పమనుధావన్తీ ప్రయాతి కలనాపదమ్. 20

దేశకాలాదుల స్పందశక్తిచే గూడుకొనిన చైతన్యము సంకల్పములవైపునకు పరుగిడుచు మలినరూపమును బొందుచున్నది.

వికల్పకలితాకారం దేశకాలక్రియాస్పదమ్
చితోరూపం మహాబాహో క్షేత్రజ్ఞ ఇతి కథ్యతే. 21

మహాబాహుఁడవగు నో రామా! దేశకాలక్రియలకు స్థానమున్ను, వికల్పములచే మలినమైన యాకృతిగలదియునగు చిద్రూపమే క్షేత్రజ్ఞుడనబడును.

క్షేత్రం శరీరమిత్యాహుస్తదసౌ వేత్త్యఖండితమ్
న బాహ్యాభ్యంతరం తేన క్షేత్రజ్ఞ ఇతి కథ్యతే. 22

శరీరము క్షేత్రమని వచింపబడినది. శరీరముయొక్క బాహ్యాభ్యంతరములను పూర్ణరూపముగ నెఱుంగువాడగుటచే జీవుడు క్షేత్రజ్ఞుడని పిలువబడుచున్నాడు.

వాసనాం కలయన్సోఽపి యాత్యహంకారతాం పునః
అహంకారోఽపి నిర్ణీతా కలంకీ బుద్ధిరుచ్యతే. 23

ఈ జీవుడు (క్షేత్రజ్ఞుడు), వాసనలం గూర్చిన కల్పనయొనర్చుచు మఱల అహంకారరూపమును పొందుచున్నాడు. పదార్థముల నిశ్చయించుటచేతను, కల్పనాంతరమునకు హేతువగుటచేతను ఈ యహంకారమే బుద్ధియని వచింపబడుచున్నది.

బుద్ధిః సంకల్పకలితా ప్రయాతి మనసః పదమ్
మనోఘనవికల్పం తు గచ్ఛతీన్ద్రియతాం శనైః. 24

సంకల్పముచే కలుషితమగు బుద్ధి మనోరూపమును బొందుచున్నది. ఘన వికల్పంబుచే ఆ మనస్సున్ను క్రమముగ ఇంద్రియరూపమును జెందుచున్నది.

పాణిపాదమయం దేహ మిన్ద్రియాణి విదుర్బుధాః
దేహోఽసౌ జ్ఞాయతే లోకే సూయతేఽపి చ జీవతి. 25

ఇంద్రియములున్ను హస్త పాదాద్యవయవసహితమగు దేహరూపమును బొందుచున్నవి. ఈ దేహము ప్రపంచమున నుత్పన్నమగుచు ప్రత్యక్షముగ విదితమగుచు జీవధారణయొనర్చుచు నున్నది.

ఏవం జీవో హి సంకల్పవాసనారజ్జువేష్టితః
దుఃఖజాలపరీతాత్మా క్రమాదాయాతి చిత్తతామ్. 26

ఇవ్విధమున సంకల్ప వాసనాపాశములచే బంధింపబడి దుఃఖజాలంబుచే పరివేష్టితుడగు జీవుడు క్రమముగ బాహ్యాభ్యంతర పదార్థముల నెఱుంగగల్గుచున్నాడు.

క్రమేణ పాకవశతః ఫలమేతి యథాన్యతామ్
అవస్థామేవనాకృత్యా జీవో మలవశాత్తథా. 27

బదరీ (రేగు) ఫలము మున్నగునవి పక్వమైనకొలది రూపరసాదుల పరిణామముచే క్రమముగ వైలక్షణ్యమును బొందును గాని, బదరత్వాది జాతియందు మార్పును బొందకయుండునట్లే, క్షేత్రజ్ఞుడగు జీవాత్మయున్ను, అవిద్యామల పరిణామవశముచే విలక్షణత్వమునొందును గాని పరిణామ రహితమగు చిత్స్వభావముచే గాదు.

జీవోఽహంకారతాం ప్రాప్తస్త్వహంకారశ్చ బుద్ధితామ్
సంకల్పజాలకలితాం మనస్తాం బుద్ధిరాగతా. 28

ఈ ప్రకారము జీవుడహంకారరూపమును, అహంకారము బుద్ధిరూపమును, బుద్ధి సంకల్ప జాలముచే కలుషితమగు మనోరూపమును పొందుచున్నది.

మనో హి సంకల్పమయం సంస్థాగ్రహణతత్పరమ్
ప్రతియోగివ్యవచ్ఛిన్నప్రాప్తిసత్త్యైరపీహితైః. 29

మనస్సున్ను సఫల విఫలమనోరథములతోఁ గూడి సంకల్పమయమై, స్త్రీపుత్రాది శరీరాకార వృత్తి గ్రహణమందు తత్పరమై, పరిచ్ఛిన్నములును తుచ్ఛములునునగు విషయములం దాసక్తమగుచున్నది.

ఇచ్ఛాద్యాః శక్తయశ్చేతో గావో వృషమివోన్మదమ్
అనుధావన్తి దోషాయ సరితః సాగరం యథా. 30



మదోన్మత్త వృషభమువైపునకు గోవును, సముద్రమువైపునకు నదులును బోవునట్లు చిత్తమునొక్క యిచ్ఛాదిశక్తుల దోషార్థమే విషయములవైపునకు పరుగిడుచున్నవి.

ఇతి శక్తిమయం చేతో ఘనాహంకారతాం గతమ్
కోశకారక్రిమిరివ స్వేచ్ఛయా యాతి బంధనమ్. 31

ఇట్లు పలువిధశక్తియుతమును, ఘనాహంకారముచే ప్రవృద్ధమునునగు నీ చిత్తము కోశకారకృమి (పట్టుపురుగు)వలె తన కోర్కెచొప్పున తానే బంధమున తగుల్కొనుచున్నది.

స్వసంకల్పానుసంధానాత్పాశైరివ నయస్వపుః
కష్టమస్మిన్స్వయం బంధ మేత్యాత్మా పరితప్యతే. 32

మత్స్యాదులు స్వయముగనే బంధమున తగుల్కొని మృత్యుప్రాతబడునట్లు నీ మనస్సున్ను స్వసంకల్పానుసంధానముచే స్వయముగ నిబద్ధమై దుఃఖమునొందుచున్నది. అహా! ఎట్టి విషాదకరమైన విషయము!

బద్ధమస్మీతి కలయద్విద్యాత్తత్త్వం జహచ్ఛనైః
అవిద్యాం జనయత్యన్తర్జగజ్జంగలరాక్షసీమ్. 33

చైతన్యము తన పారమార్థిక శుద్ధరూపమును క్రమముగ త్యజించుచు 'నేను బద్ధుడనని భావించుచు జగజ్జంగల రాక్షసియగు జననమరణాదులరూపమైన అవిద్యను స్వాంతఃకరణమున నుత్పన్నము జేయుచున్నది.

స్వసంకల్పితతన్మాత్ర జ్వాలాభ్యంతరవర్తి చ
పరాం వివశతామేతి శృంఖలాబద్ధసింహవత్. 34

స్వసంకల్పరచితమగు శబ్దాదివిషయములనునట్టి అగ్నిజ్వాలయందు వసించునదియు, అవిద్యాయుక్తమునునగు నీ మనస్సు శృంఖలాబద్ధమగు సింహమువోలె మిగుల అవ్యవస్థనొందుచున్నది.

విచిత్రకార్యకర్తృత్వ మాహరద్వాసనావశాత్
స్వేచ్ఛామాత్రానురచితా దశాశ్చానువతత్తథా. 35

ఇవ్విధమున క్రమముగ ననేక విహిత నిషిద్ధకార్యముల కర్తృత్వము వహించుచు, తన యిచ్ఛామాత్రముచే కల్పింపబడిన పలువిధజన్మలందును, నరకాది దుర్దశలందును బడుచు నీ మనస్సు అవ్యవస్థను బొందుచున్నది.

క్వచిన్మనః క్వచిద్బుద్ధిః క్వచిజ్జ్ఞానం క్వచిత్క్రియాః
క్వచిదేతదహంకారః క్వచిత్పుర్యష్టకం స్మృతమ్. 36

ఈ మనస్సే యొకపుడు (మననశక్తిచే) మనోరూపమును, మఱియొకపుడు బుద్ధిరూపమును అట్లే యొకపుడు జ్ఞానరూపమును, క్రియారూపమును, అహంకారరూపమును, శరీరరూపమును పొందుచున్నది.

క్వచిత్ప్రకృతిరిత్యుక్తం క్వచిన్మాయేతి కల్పితమ్
క్వచిన్మలమితి ప్రోక్తం క్వచిత్కర్మేతి సంస్థితమ్. 37

ఒకచోట నియ్యది ప్రకృతియని వచింపబడినది. మఱియొకచోట నిదియే మాయారూపమున కల్పింపబడినది. ఇంకొక చోట మలరూపమునను యెన్నబడినది. మఱియు కర్మరూపమున స్థితిగల్గియున్నది.

క్వచిద్బన్ధమితిఖ్యాతం క్వచిచ్చిత్తమితి స్ఫుటమ్
ప్రోక్తం క్వచిదవిద్యేతి క్వచిదిచ్ఛేతి సంస్థితమ్. 38

ఈ మనస్సే యొకచోట బంధమని వచింపబడినది. ఒకచోట నియ్యది ప్రత్యక్షమగు చిత్తరూపమునను, మఱొకచోట అవిద్యారూపమునను, ఇంకొకచోట యిచ్ఛారూపమునను స్థితిగల్గియున్నది.

తదేతదాబద్ధమిహ చిత్తం రాఘవ దుఃఖితమ్
తృష్ణాకోశసమావిష్టం రాగాయతనమాతతమ్. 39

ఓ రామా! ఇట్టి చిత్తమే ప్రపంచమున నలువైపుల బంధింపబడి, తృష్ణాశోకంబులచే పరిపూర్ణమై, రాగమునకు విశాలస్థానమై యొప్పుచున్నది.

జరామరణమోహాన్తర్భవభావనయా హతమ్
ఈహితానీహితైర్గ్రస్తమవిద్యారాగరంజితమ్. 40

ఇచ్ఛాసంక్షుభితాకారం కర్మవృక్షవనాంకురమ్
సువిస్మృతోత్పత్తిపదం కల్పితానర్థకల్పితమ్. 41

ఈ మనస్సు జరామరణమూర్ఛాదులచేతను, జననమరణాదుల భావనచేతను వినష్టమైనదియు, ఇష్టానిష్ట విషయములచే గ్రస్తమును, అవిద్యారాగముచే రంజితమును, ఇచ్ఛచే సంక్షుభితమగు యాకృతిగలదియు, కర్మయను వనవృక్షములకు అంకురమును, తన యుత్పత్తిస్థానమగు పరమాత్మపదమును లెస్సగ విస్మరించునదియు, అనేక అనర్థముల గల్పనజేయునదియునై యున్నది.

కోశకారవదాబద్ధం శోకాకారపదంగతమ్
తన్మాత్రవృన్దావయవ మన స్తనరకాతపమ్. 42

స్వదృశ్యమపి శైలేంద్ర సమభారభయావహమ్.
జరామరణశాఖాఢ్యం సంసారవిషదుర్ద్రుమమ్. 43

ఈ చిత్తము పట్టుపురుగువలె నలువైపుల బంధింపబడి దుఃఖమును పొందునదియు, వివిధ నరకదుఃఖసంయుక్తమును, ఆత్మకంటె భిన్నమగు దృశ్యరూపమునుగూర్చిన యథార్థజ్ఞానము లేనందున సుమేరువువంటి తనభారముచే భయోత్పాదకమొనర్చునదియు, జరామరణమను శాఖలచే పూర్ణమైన దుష్టసంసార విషవృక్షమును నైయున్నది.

ఇమం సంసారమఖిల మాశాపాశవిధాయకమ్
దధదన్తఃఫలైర్హీనం వటధానావటం యథా. 44

వటబీజము వటవృక్షమును ధరించునట్లు ఆశాపాశమును నిర్మించునదియు, పురుషార్థ ఫలహీనమును నగు యీ సంసారమును చిత్తము ధరించుచున్నది.



చిన్తానలశిఖాదగ్ధం కోపాజగరచర్వితమ్
కామాబ్ధికల్లోలహతం విస్మృతాత్మపితామహమ్. 45

ఓ రామా! చింతయను అగ్నిశిఖచే దగ్ధమును, క్రోధమను అజగరముచే చర్వితమును, కామమను సముద్రముయొక్క తరంగములచే హతమును, తన మూలకారణమగు ఆత్మస్వరూపమును విస్మరించునదియు నగు యీ మనస్సును నీవు యుద్ధరింపుము.

మృగం యూథాదివ భ్రష్టం శోకోపహతచేతనమ్
పతంగకమివ జ్వాలాదగ్ధం విషయపావకే. 46

ఛిన్నమూలమివాంభోజం పరమాం మ్లానిమాగతమ్
ఛిన్నాంగమాత్మనఃస్థానాద్విశేషాసంగదుఃస్థితమ్. 47

సమూహమును వీడిన మృగమువలె దుఃఖాక్రాంతమై నశించునదియు, విషయాగ్నిజ్వాలచే దగ్ధమగునదియు, ఛిన్నమూల కమలంబువోలె పరమమ్లానియుక్తమును, మృత్యుకారణమున తన నివాసమునుండి వేఱగుటచే నా యా పూర్వదేహములందలి యభిమానముచేతను, వాని వియోగముచేతను భిన్నమైన యంగములుగలదియు, మఱియు నా యా దేహములందలి మిక్కిలి యాసక్తిచే దుఃఖమును బొందునదియు నగు యీ మనస్సును నుద్ధరింపుము.

విషయాదిషు మధ్యస్థం చిత్రరూపేషు శత్రుషు
దశాస్వేతాస్వనన్తాసు లుఠితం సంకటాస్వితి. 48

తన్ను వధించుట కుద్యుక్తులగు విషయేంద్రియాది శత్రువులను విశ్వసించి వారిమధ్య వసించునదియు, ఇట్లు పూర్వోక్తవిధమున దుఃఖమయమగు ననేకదశలందు తిరుగాడుచున్నదియు నగు యీ మనస్సును నీవు యుద్ధరింపుము.

దుఃఖే నిపతితం ఘోరే విహంగః సాగరే యథా
స్వబంధాస్థం జగజ్జాలే శూన్యే గంధర్వపత్తనే. 49

సముద్రమందు పక్షివలె ఘోరదుఃఖమున బడునదియు, జగజ్జాలమను శూన్య గంధర్వనగరమున తన బంధహేతువును బంధనసాధనమును నైన దేహాదులందధిక ప్రీతిగల్గియుండునదియునగు యీ మనస్సు నుద్ధరింపుము.

ఉహ్యమానమనాస్థాబ్ధౌ మనోవిషయవిద్రుతమ్
ఉద్ధరామరసంకాశ మాతంగమివ కర్దమాత్. 50

దేవతుల్యుఁడవగు నో రామా! తత్త్వజ్ఞానమందును, తత్సాధనాదులందును ఆదరములేక, అట్టి యనాదరసముద్రమున కొట్టుకొనిపోవునదియు, విషయమగ్నమునునగు యీ మనస్సును పంకమునుండి గజమునువలె యుద్ధరింపుము.

బలీవర్దవదామగ్నం మనోమదనపల్వలే
ఆలూనశీర్ణావయవం బలాద్రామ సముద్ధర. 51

ఓ రామా! కామమనుపంకముచే ప్రపూర్ణమగు యల్పతటాకమున నిమగ్నమును, ఛిన్నాంగయుక్తమును నగు యీ మనస్సును బలపూర్వకముగ లేవనెత్తి యుద్ధరింపుము.

శుభాశుభప్రసర పరాహతాకృతౌ
జ్వలజ్జరామరణ విషాదమూర్ఛితే
వ్యథేహ యస్య మనసి భో న జాయతే
నరాకృతిర్జగతి స రామ రాక్షసః. 52

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
జీవావతరణంనామ ద్విచత్వారింశః
సర్గః ॥ 42 ॥

ఓ రామా! శుభాశుభ కర్మలతో గూడినదై మలినాకృతిగలదియు, భయంకరమగు జరామరణవిషాదంబులచే సమ్మూర్ఛితమును నగు యీ జగత్తునుగూర్చి యెవని చిత్తమందు క్లేశముద యింపకుండునో యాతడు రాక్షసుడే యగును.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు స్థితిప్రకరణమున
జీవావతరణమను ద్విచత్వారింశ
సర్గము ॥ 42 ॥

~~~~~~~

## త్రిచత్వారింశః సర్గః.

---

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

ఏవం జీవాశ్రితో భావా భవభావనమోహితాః
బ్రహ్మణః కల్పితాకారాల్లక్షశోఽప్యథ కోటిశః. 1
అసంఖ్యాతాః పురా జాతా జాయన్తే చాపివాద్య భోః
ఉత్పతిష్యన్తి చైవాంబుకణౌఘా ఇవ నిర్ఝరాత్. 2

శ్రీవసిష్ఠుడు:—ఓ రామా! ఇవ్విధమున ఉపాధిచే విభక్తములగు చేతనాకారములు గలవారై సంసారవాసనా ప్రవాహమున తగుల్కొనినట్టి యసంఖ్యాకములగు కల్పితాకారములు గల జీవులు సెలయేరునుండి జలకణములవలె బ్రహ్మమునుండి యుత్పన్నమై యుండిరి. ఇపుడును ఉత్పన్నమగుచున్నారు. ఇంకను ఉత్పన్నము కాగలరు.

స్వవాసనాదశావేశాదాశావివశతాం గతాః
దశాస్వతివిచిత్రాసు స్వయం నిగడితాశయాః. 3
అనారతం ప్రతిదిశం దేశే దేశే జలే స్థలే
జాయన్తే వా మ్రియన్తే వా బుద్బుదా ఇవ వారిణి. 4

స్వవాసనావశమున వివశత్వముఁ జెందుచున్నవారును, సుఖదుఃఖమయమగు పలువిధ విచిత్రదశలందు నిబద్ధమైన యంతఃకరణము గలవారును నగు యీ జీవులు దిక్కులందును, వివిధ దేశములందును, జలమందును, స్థలమందును బుద్బుదములవలె నుత్పన్నమగుచు నశించుచు నున్నారు.



కేచిత్ప్రథమజన్మానః కేచిజ్జన్మశతాధికాః
కేచిద్వాఽజన్మసంఖ్యాకాః కేచిద్ద్విత్రిభవాన్తరాః. 5

వారిలో కొందఱీకల్పమున ఒకేజన్మను పొందినవారును, మఱికొందఱు నూఱుకంటె అధికమగు జన్మలను పొందినవారునునై యున్నారు. కొందఱసంఖ్యేయములగు జన్మల నెత్తియున్నారు. కొందఱు రెండు లేక మూడు జన్మలనెత్తియుండిరి.

భవిష్యజ్జాతయః కేచిత్కేచిద్భూతభవోద్భవాః
వర్తమానభవాః కేచిత్కేచిత్త్వభవతాం గతాః. 6

కొందఱీకల్పమున నింకను జన్మించకయే యున్నారు. కొందఱికి (జీవన్ముక్తులకు) జన్మయే పరిసమాప్తియయ్యెను. ఎందఱో కైవల్యపదమును ప్రాప్తినొందిరి.

కేచిత్కల్పసహస్రాణి జాయమానాః పునఃపునః
ఏకామేవాస్థితా యోనిం కేచిద్యోన్యన్తరం శ్రితాః. 7

కొందఱు వేలకొలది జన్మలవఱకు మఱల మఱల నుద్భవించుచు నొకే దేహజాతియందు స్థితిని బడయుచున్నారు. మఱికొందఱు భిన్నభిన్న దేహములనుకూడ పొందుచున్నారు.

కేచిన్మహాదుఃఖసహాః కేచిదల్పోదయాః స్థితాః
కేచిదత్యన్తముదితాః కేచిదర్కాదివోదితాః. 8

కొందఱు జీవులు నరకమున గొప్ప యాతనను పొందుచున్నారు. కొందఱల్పసుఖమును బడయుచు మనుజరూపమున నున్నారు. దేవాదులై కొందఱు మిగుల ప్రసన్నులుగా నున్నారు. కొందఱు సత్యలోకవాసులై యున్నారు.

కేచిత్కింనరగంధర్వ విద్యాధరమహోరగాః
కేచిదర్కేంద్రవరుణా స్త్ర్యక్షాధోక్షజపద్మజాః. 9

కొందఱు కిన్నర గంధర్వ విద్యాధర మహోరగరూపముల నున్నారు. మఱికొందఱు సూర్యేంద్ర వరుణులుగను, బ్రహ్మ విష్ణు మహేశ్వరులుగను నున్నారు.

కేచిత్కూశ్మాండవేతాల యక్షరక్షః పిశాచకాః
కేచిద్బ్రహ్మండభూపాలా వైశ్యశూద్రగణాః స్థితాః. 10

కొందఱు కూష్మాండ (దేవతలలో నొకతెగ) వేతాల, యక్ష, రాక్షస, పిశాచాదుల రూపమునను, మఱికొందఱు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులరూపమునను స్థితిఁబొంది యున్నారు.

కేచిచ్ఛ్వపచచాండాల కిరాతావేశపుష్కసాః
కేచిత్తృణౌషధీ కేచిత్ఫలమూలపతంగకాః. 11
~~~~~~~

కొందఱు శ్వపచ, చాండాలురుగను, కిరాతిజాతియందు జన్మించిన పుక్కసులు (చండాలురు) గను నున్నారు. ఇక కొందఱు తృణ ఓషధిరూపములుగను, ఫలమూలాదులరూపముగను నున్నారు. కొందఱు పక్షిరూపమున స్థితిఁబొంది యున్నారు.

కేచిచ్చిత్రలతాగుల్మ తృణోపలదృశోఽభితః
కేచిత్కదమ్బజమ్బీర శాలతాలతమాలకాః. 12

కొందఱు చిత్ర విచిత్రములగు లతాగుల్మతృణ పర్వతశిలాదులుగను, కొందఱు కదంబ, జంబీర, శాల, తమాలవృక్షరూపములుగను నున్నారు.

కేచిద్విభవసంసార మంత్రిసామన్తభూమిపాః
కేచిచ్చీరాంబరాచ్ఛన్నా మునిమౌనముపస్థితాః. 13

కొందఱు సాంసారికవైభవముల నొందుచు మంత్రులుగను, సామంతులుగను, రాజులుగను నున్నారు కొందఱు నారవస్త్రముల గట్టుకొని మునులవలె మౌనము ధరించి యున్నారు.

కేచిద్భుజంగగోనాస కృమికీటపిపీలికాః
కేచిన్మృగేంద్రమహిష మృగాజచమరైణకాః. 14

కొందఱు సర్ప, అజగర, కృమి, కీట, పిపీలికారూపమున నున్నారు. మఱికొందఱు సింహ, మహిష, చమర, మేషాది మృగరూపముల బడసియున్నారు.

కేచిత్సారసచక్రాహ్వ బలాకాబకకోకిలాః
కేచిత్కమలకల్హార కుముదోత్పలతాం గతాః. 15
కేచిత్కలభమాతంగ వరాహవృషగర్దభాః
కేచిద్ద్విరేఫమశకాః పుత్తికాదంశవంశజాః. 16

అట్లే కొందఱు జీవులు సారస, చక్రవాక, బక, కోకిలాదుల రూపమునను, కమల, రక్తకమల, కుముద, నీలకమలములుగను, గజశిశు, మాతంగ, వరాహ, వృషభ, గర్దభరూపములుగను నున్నారు. మఱికొందఱు భ్రమర, మత్స్యకీటాది జాతులందుద్భవించుచున్నారు.

కేచిదాపద్బలాక్రాన్తాః కేచిత్సంపదమాగతాః
కేచిత్స్థితాః స్వర్గపురే కేచిన్నరకమాస్థితాః. 17

కొందఱాపదల వశమగుచున్నారు. మఱికొందఱు సంపదలను పొందుచున్నారు. కొందఱు స్వర్గపురమున స్థితిని బడయుచున్నారు. మఱికొందఱు నరకమును జేరుచున్నారు.

ఋక్షచక్రగతాః కేచిద్వృక్షరంధ్రగతాః పరే
వాతభూతాః స్థితాః కేచిత్కేచిద్వ్యోమపదే [illegible]తాః. 18

కొందఱు నక్షత్రమండలమును పొందియున్నారు. కొందఱు వృక్షచ్ఛిద్రముల నాశ్రయించుకొని యున్నారు. కొందఱు చలనశీలమగు వాయువుయొక్కయు, కొందఱాకాశముయొక్క [illegible] ను పొందియున్నారు.



సూర్యాంశుషు స్థితాః కేచిత్కేచిదిన్ద్వంశుషు స్థితాః
కేచిత్తృణలతాగుల్మ రసస్వాదుష్వవస్థితాః. 19

కొందఱు సూర్యభగవానుని కిరణములందు రసగ్రహణాధికారమున నున్నారు. కొందఱు చంద్రకిరణములందు ఓషధుల వృద్ధిపఱచు యధికారమును బొందియున్నారు. కొందఱు స్వాదిష్టమైన తృణలతాగుల్మాదుల రూపమున స్థితిఁబొందియున్నారు.

జీవన్ముక్తా భ్రమన్తీహ కేచిత్కల్యాణభాజనాః
చిరముక్తాః స్థితాః కేచిన్నూనం పరిణతాః పరే. 20

శ్రేయోభాగులగు కొందఱు జీవన్ముక్తులై యీ ప్రపంచమున విహరించుచున్నారు. కొందఱు చిరకాలము జీవన్ముక్తత్వమనుభవించి విదేహముక్తిని పొందుచున్నారు.

కేచిచ్చిరేణ కాలేన భవిష్యన్ముక్తయః శివాః
కేచిద్ద్విషన్తి చిద్భావాః కేవలీభావమాత్మనః. 21

ఉత్తములగు మఱికొందఱు భవిష్యత్తునందు చిరకాలమునకు ముక్తిని బొందనున్నారు. భోగలంపటులగు కొందఱు విదేహముక్తత్వమును విద్వేషించుచున్నారు.

కేచిద్విశాలాః కకుభః కేచిన్నద్యో మహారయాః
కేచిత్స్త్రియః కాన్తదృశః కేచిత్షండనపుంసకాః. 22

కొందఱు విశాలదిక్సమూహము యొక్కయు, తీవ్రవేగమున ప్రవహించు నదులయొక్కయు అధిష్ఠాన దేవతారూపమున నున్నారు. కొందఱు ఉత్తమ స్త్రీ రూపమునను, కొందఱు పురుష రూపమునను, మఱికొందఱు నపుంసక రూపమునను నున్నారు.

కేచిత్ప్రబుద్ధమతయః కేచిజ్జడతరాశయాః
కేచిజ్జ్ఞానోపదేష్టారః కేచిదాత్తసమాధయః. 23

ఒకరు ప్రబుద్ధమతులుగను, మఱియొకరు మిగుల జడమగు యంతఃకరణము కలవారుగను, కొందఱు జ్ఞానము నుపదేశించువారుగను, మఱికొందఱు సమాధినవలంబించినవారును నైయున్నారు.

జీవాః స్వవాసనావేశ వివశాశయతాం గతాః
ఏతాస్వేతాస్వవస్థాసు సంస్థితాబద్ధభావనాః. 24

ఓ రామా ! తమ తమ వాసనా సంస్కార వశముచే వివశత్వమునొంది అవిద్యచే బద్ధులై, అట్టి బద్ధభావనతోగూడి పూర్వోక్తవిధమున జీవులాయా దశలందు స్థితిఁగొనియున్నారు.

విహరన్తి జగత్కేచిన్నిపతన్త్యుత్పతన్తి చ
కన్దుకా ఇవ హస్తేన మృత్యునాఽవిరతం హతాః. 25

కొందఱు భూమిపై విహరించుచున్నారు. కొందఱు నరకమున బడుచున్నారు. కొందఱు స్వర్గమున కెగయుచున్నారు. మఱికొందఱు హస్తతాడితకందుక మొకప్రదేశమునుండి మఱియొక ప్రదేశమునకు బోవునట్లు, ఒక శరీరమునుండి మఱియొక శరీరమునకు జనుచునున్నారు.

ఆశాపాశశతాబద్ధా వాసనాభావధారిణః
కాయాత్కాయముపాయాన్తి వృక్షాద్వృక్షమివాండజాః. 26

పక్షి యొక వృక్షమునుండి మఱియొక వృక్షమున కేగునట్లు పలువిధ ఆశాపాశములచే బద్ధులై వాసనారూపములగు భావిదేహముల ధరించుచు జీవులొక శరీరమునుండి మఱియొక శరీరమును పొందుచున్నారు.

అనన్తానన్తసంకల్ప కల్పనోత్పాదమాయయా
ఇన్ద్రజాలం వితన్వానా జగన్మయమిదం మహత్. 27

తావద్భ్రమన్తి సంసారే వారిణ్యావర్తరాశయః
యావన్మోహా న పశ్యన్తి స్వమాత్మానమనిందితమ్. 28

అసంఖ్యాకములగు విషయములకును, సంకల్పములకును మూలకారణమగు మాయ (అవిద్య) చే నింద్రజాలమయమగు యీ విశాల ప్రపంచమును విస్తరించుచు, అత్యుత్తమమగు తమ యాత్మను దర్శించనంతవఱకు జీవు లజ్ఞానులవలె యీ సంసారమున జలమందావర్తములభంగి పరిభ్రమించుచునే యుందురు.

దృష్ట్వాత్మానమసత్త్యక్త్వా సత్యామాసాద్య సంవిదమ్
కాలేన పదమాగత్య జాయన్తే నేహ తే పునః. 29

ఆత్మను సందర్శించి అసద్వస్తువును త్యజించి సత్యజ్ఞానమును ప్రాప్తినొంది జ్ఞానభూమికాక్రమమున ఆత్మపదమందు స్థిరత్వముబడసినవారై జీవులీ ప్రపంచమున మఱల జన్మింపకుందురు.

భుక్త్వా జన్మసహస్రాణి భూయః సంసారసంకటే
పతన్తి కేచిదబుధాః సంప్రాప్యాపి వివేకతామ్. 30

కొందఱు జీవులు వివేకమును పొందియు విషయలంపటులై వేలకొలది జన్మల ననుభవించి మఱల సంసారసంకటమున బడుచున్నారు.

కేచిచ్ఛక్తత్వమప్యుచ్చైః ప్రాప్య తుచ్ఛతయా ధియా
పునస్తిర్యక్త్వమాయాన్తి తిర్యక్త్వాన్నరకానపి. 31

కొందఱుత్తమ దేశకాల జన్మలఁబొందియు, సత్సమాగమమును బడసియు, దేవగంధర్వ బ్రాహ్మణాదుల విభవమునొందియు తుచ్ఛమగు విషయాశచే మఱల తిర్యగాది యోనులఁబ్రాప్తించి నరకమునకు బోవుచున్నారు.

కేచిన్మహాధియః సన్త ఉత్పద్య బ్రహ్మణః పదాత్
తదైవ జన్మనైకేన తత్రైవాశు విశన్త్యలమ్. 32

కొందఱు మహాబుద్ధిశాలురు బ్రహ్మదేవునినుండి యుత్పత్తినిబడసి ఆయా కల్పముననే లేక ఆయా జన్మముననే శీఘ్రముగ బ్రహ్మమును మోక్షపదమును ప్రవేశించుచున్నారు.



బ్రహ్మాండేష్వితరేష్వన్యే తేష్వన్యే జీవరాశయః
ప్రయాన్తి పద్మోద్భవతామన్యే చ హరతామపి. 33

తమ యుత్పత్తిస్థానమగు బ్రహ్మాండమందు గాని లేక (ఐందవనిర్మిత బ్రహ్మాండములవంటి) యితర బ్రహ్మాండములందుగాని కొందఱు జీవులు బ్రహ్మదేవుడుగను, కొందఱు విష్ణువుగను, మఱి కొందఱు మహేశ్వరుడుగను నగుచున్నారు.

అన్యే ప్రయాన్తి తిర్యక్త్వమన్యే చ సురతామపి
అన్యేఽపి నాగతాం రామ యథైవేహ తథైవ హి. 34

ఇక నన్యులలో కొందఱు పశు పక్ష్యాదిరూపములను, కొందఱు దేవరూపమును, కొందఱు సర్పగజరూపములను బొందుచున్నారు. ఓ రామా! జీవుల యుత్పత్తిక్రమమీ బ్రహ్మాండమందు వలెనే తక్కిన బ్రహ్మాండములందును గలదు.

యథేదం హి జగత్స్ఫారం తథాఽన్యాని జగన్త్యపి
విద్యన్తే సమతీతాని భవిష్యన్తి చ భూరిశః. 35

ఈ జగత్తెట్లు విశాలమైనదో, అట్లే తక్కిన యనేక బ్రహ్మాండములును విశాలమైనవే. ఇంతకు ముందెన్నియో బ్రహ్మాండములు నిర్మింపబడినవి. ఇకనెన్నియో నిర్మింపబడనున్నవి.

అన్యేనాన్యేన చిత్రేణ క్రమేణాన్యేన హేతునా
విచిత్రాః సృష్టయస్తేషామాపతన్తి పతన్తి చ. 36

ఇకను అన్యములగు హేతువుల ననుసరించి అనేక చిత్రవిచిత్రములగు జగత్తులాయా జీవులనిమిత్త మావిర్భవించుచు విలయము నొందుచునున్నవి.

కశ్చిద్గంధర్వతాం యాతి కశ్చిద్గచ్ఛతి యక్షతామ్
కశ్చిత్ప్రయాతి సురతాం కశ్చిదాయాతి దైత్యతామ్. 37

కొందఱు గంధర్వత్వమును, కొందఱు యక్షత్వమును, కొందఱు దేవత్వమును, కొందఱు దైత్యత్వము నొందుచున్నారు.

యేనైవ వ్యవహారేణ బ్రహ్మాండేఽస్మిన్జనాః స్థితాః
తేనైవాన్యేషు తిష్ఠన్తి సన్నివేశవిలక్షణాః. 38

ఓ రామా! మనుష్యాదులు వారివారికి యోగ్యములగు వ్యవహారములాచరించుచు బ్రహ్మాండమున నున్నట్లే తక్కిన బ్రహ్మాండములందును గలరు. కాని అన్య ద్వీపవాసులందువలె శరీరరచనయందు వారలకు కొంత వైలక్షణ్యము గలదు.

స్వస్వభావవశావేశాదన్యోన్యపరిఘట్టనైః
సృష్టయః పరివర్తన్తే తరంగిణ్యా ఇవోర్మయః.

స్పర్ధచేతను, పరస్పర సంఘట్టనముచేతను వారివారి స్వభావముననుసరించియు [illegible] తరంగములవలె జీవసృష్టులు పరివర్తితములగుచున్నవి.

5
వాడును నగు జ్ఞాని

ఆవిర్భావతిరోభావై రున్మజ్జననిమజ్జనైః
సృష్టయః పరివర్తన్తే తరంగిణ్యా ఇవోర్మయః. 40

ఉత్పత్తి వినాశములచేతను ఊర్ధ్వాధోగమనములచేతను నదులందలి తరంగములవలె సృష్టులును పరివర్తితములగుచున్నవి.

నిర్యాన్త్యవిరతం తస్మాత్పరస్మాజ్జీవరాశయః
అనిర్దేశ్యాః స్వసంవేద్యాస్తత్రైవాశు స్ఫురన్తి చ. 41

గుణాధీనులును అంతఃకరణాద్యుపాధియుక్తులును అనిర్దేశ్యులును స్వసంవేద్యులును నగు జీవులు పరమపదమగు బ్రహ్మమునుండీ యుత్పన్నమగుచు, ఆ పరమపదముననే ప్రత్యక్షముగా వ్యవహరించుచు నున్నారు.

దీపాదివాలోకదృశః సూర్యాదివ మరీచయః
కణాస్తప్తాయస ఇవ స్ఫులింగా ఇవ పావకాత్. 42

కాలాదివర్తవశ్చిత్రా ఆమోదాః కుసుమాదివ
శీతలా ఇవ వర్షాణు పూరాదబ్ధేరివోర్మయః. 43

ఉత్పత్యోత్పత్య కాలేన భుక్త్వా దేహపరంపరామ్
స్వత ఏవ పదే యాన్తి నిలయం జీవరాశయః. 44

దీపమునుండి ప్రకాశమువలెను, సూర్యునినుండి కిరణములవలెను, తప్తలోహమునుండి యగ్నికణములవలెను, అగ్నినుండి స్ఫులింగములవలెను, కాలమునుండి చిత్రవిచిత్రమగు ఋతువులవలెను, పుష్పమునుండి సుగంధమువలెను, వర్షసమూహములనుండి జలబిందువులవలెను, సముద్రమునుండి తరంగములవలెను, జీవరాశియంతయు కాలపరిపక్వమునననుసరించి యుత్పన్నమై, అనేక దేహముల ధరించి భోగానుభవమొందుచు ప్రళయకాలమున బీజభూతమగు శాంతిపదమున స్వయముగ విలీనమగుచున్నది.

అవిరతమియమాతతా తథోచ్చై
ర్భవతి వినశ్యతి వర్ధతే ముధైవ
త్రిభువనరచనాదిమోహమాయా
పరమపదే లహరీవ వారిరాశౌ. 45

ఇత్యార్షే వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
జీవనిచయస్థానోపదేశోనామ త్రిచత్వారింశః
సర్గః ॥ 43 ॥

ఓ రామా! త్రిలోకరచనాభ్రాంతి రూపమగు యీ మాయ ఆత్మస్వరూపమగు పరమపదమున మిథ్యయగు సృష్టిరూపమున విస్తరించుచు, వృద్ధినొందుచు, పరిణమించుచు, తుదకు సముద్రమందలి తరంగమువలె నశించుచున్నది.



ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు స్థితిప్రకరణమున
జీవనిచయస్థానోపదేశమను త్రిచత్వారింశ
సర్గము ॥ 43 ॥

---

## చ తు శ్చ త్వా రిం శః స ర్గః

---

శ్రీరామ ఉవాచః—

క్రమేణానేన యేనాప్తా జీవేన స్థితిరాత్మనః
స కథం భగవన్దేహం సమాధత్తేఽస్థిపంజరమ్. 1

శ్రీ రాముడు:— ఓ మునీంద్రా! ప్రళయకాలమున జీవుడు స్వయముగ ఆత్మపదము నొందునని వచించితిరి గదా; అట్లయిన, యాతడు మరల అస్థిపంజరరూపమగు యీ దేహము నెట్లు ధరించును?

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

పూర్వమేవ మయా ప్రోక్తం రామ కిం నావబుధ్యసే
పూర్వాపరవిచారార్హా శేముషీ క్వ గతా తవ. 2

శ్రీ వసిష్ఠుడు:— ఓ రామా! ఈ విషయమును నేను మునుపే వచించియున్నాను. నీవేల యద్దానిని గ్రహింపకుంటివి? పూర్వాపర విచారణాయోగ్యమగు నీబుద్ధి యిపుడెట పోయినది?

యదిదం హి శరీరాది జగత్స్థావరజంగమమ్
ఆభాసమాత్రమేవైతదసత్స్వప్న మివోత్థితమ్. 3

దేహాది స్థావరజంగమాత్మకమగు యీ జగత్తు అసత్తైనది. స్వప్నమువలె నిది యాభాసమాత్రముగనే యుదయించినది.

దీర్ఘస్వప్నో హ్యయం రామ మిథ్యైవానఘ దృశ్యతే
ద్విచంద్రవిభ్రమాకారం భ్రమాన్తర్భ్రాంతశైలవత్. 4

ఓ రామా! చిరకాలము స్థిరముగనున్న యీ బ్రహ్మాండము, లోకములు మున్నగునవి దీర్ఘస్వప్నమువలె మిథ్యారూపముగ నగపడుచున్నవి. దీని యాకృతి ద్విచంద్రభ్రమవంటిదియు భ్రమాంతర్గతమగు భ్రమణశీల పర్వతమువంటిదియు నగును.

ప్రశాన్తాజ్ఞాననిద్రస్తు నూనం గలితభావనః
ప్రబుద్ధచేతాః సంసారస్వప్నం పశ్యన్న పశ్యతి. 5

అజ్ఞాననిద్ర శమించినవాడును, మఱియు సాంసారిక వాసనలు నశించినవాడును నగు జ్ఞాని సంసారస్వప్నమును వీక్షించుచున్నను పరమార్థదృష్టియందు వీక్షింపనివాడే యగును.

స్వభావకల్పితో రామ జీవానాం సర్వదైవ హి
ఆమోక్షపదసంప్రాప్తి సంసారోఽస్త్యాత్మనోఽన్తరే. 6

ఓ రామా ! ఈ సంసారము మోక్షపర్యంతము బీజభూతమగు అజ్ఞానాత్మయందే వా(రి) వారి స్వభావముననుసరించి జీవులచే పరికల్పింపబడుచున్నదగును.

జీవస్య తరలః కాయ ఆవర్తః పయసో యథా
యథా బీజేఽంకురః స్ఫారః పల్లవః స్వాంకురే యథా. 7

జలమందావర్తములును, బీజమందంకురమును, అంకురమున పల్లవవిస్తారమును నుండునట్లే జీవునియందీ చంచలమగు శరీరమున్ను గలదు.

పల్లవే చ యథా పుష్పం పుష్పకోశే ఫలం యథా
యతః సకల్పనారూపో దేహోఽస్తి మనసోఽన్తరే. 8

పల్లవమందు పుష్పమును, పుష్పకోశమున ఫలమును నుండునట్లు కల్పనారూపమగు యీ దేహము మనస్సునందు గలదు.

బహురూపతయా రామ యతో స్త్యేకతమః స్ఫుటః
స ఏవ ప్రతిభాసోఽస్య మనసః కిల జాయతే. 9

ఓ రామా ! మనస్సనేక రూపములుగలదగుటచే, వాసనా రూపముచే ననేక దేహము లద్దానియందు స్థితి గల్గియున్నవి. వానిలో కర్మపరిపాకముచే నేశరీరమభివ్యక్తమగునో, అద్దాని ప్రతిభాసమే జీవునకు కాలక్రమమున సంభవించును గాని, అన్నిటియొక్క ప్రతిభాసము గాదు.

స ఏవాశుభవత్యేతన్మృత్పిండో ఘటకోవమః
ఆదిసర్గే పురా కాయః ప్రతిభాసోఽస్య చోత్తమః. 10

మృత్తిక ఘటాకారమగునట్లు ఉత్తమకర్మల పరిపాకముచే ఆదిసృష్టియందు జీవునకు ఉత్తమ శరీరరూపముననే ప్రతిభాసముదయించుచున్నది.

యస్మాదేవ విభుర్బ్రహ్మ పద్మకోశగృహస్థితః
తత్సంకల్పక్రమేణైవ తతః స్థితిముపాగతా. 11

ఇయం సృష్టిరపర్యన్తా మాయేవ ఘనమాయయా

సర్వక్రియాసమర్థుడును, పద్మకోశస్థితుడును నగు బ్రహ్మదేవునియొక్క సంకల్పమాత్రముచే ఘనమగు అవిద్యచేవలె ఈ యపారసృష్టియంతయు స్థితిబొందినది.

శ్రీరామ ఉవాచ :—

జీవో మనఃపదం ప్రాప్య వైరించం పదమాగతః. 12
యథా బ్రహ్మంస్తథా సర్వం విస్తరేణ వదాశు మే.



శ్రీ రాముడు:—ఓ మహాత్మా ! ఈ జీవచైతన్యము మనోరూపమంది పిదప హిరణ్యగర్భపదమునొందెను గదా ! అట్టైన ఆవిరించిరూపము నయ్యదెట్లు పొందెనో శీఘ్రముగ విస్తారపూర్వకముగ నాకు వర్ణించి చెప్పుము.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

బ్రాహ్మే శృణు మహాబాహో శరీరగ్రహణే క్రమమ్. 13

శ్రీ వసిష్ఠుడు:—మహాబాహువగునో రామా ! బ్రహ్మదేవుని శరీర గ్రహణమును గూర్చిన క్రమము నెఱిగించుచున్నాను వినుము.

నిదర్శనేన తేనైవ జాగతీం జ్ఞాస్యసి స్థితిమ్
దిక్కాలాద్యనవచ్ఛిన్నమాత్మతత్త్వం స్వశక్తితః. 14
లీలయైవ యదాదత్తే దిక్కాలకలితం వపుః
తదైవ జీవపర్యాయం వాసనావేశతత్పరమ్. 15
మనః సంపద్యతే లోలం కలనాకలనోన్ముఖమ్
కలయన్తీ మనఃశక్తిరాదౌ భావయతి క్షణాత్. 16
ఆకాశభావనామచ్ఛాం శబ్దబీజరసోన్ముఖీమ్
తతస్తాం ఘనతాం యాతం ఘనస్పన్దక్రమాత్మనః. 17
భావయత్యనిలస్పందం స్పర్శబీజరసోన్ముఖమ్
తాభ్యామాకాశవాతాభ్యా మదృష్టాభ్యాం మనోదృశా. 18
శబ్దస్పర్శస్వరూపాభ్యాం సంఘాతాజ్జన్యతేఽనలః
మనస్తద్ఘనతాం ప్రాప్య తతో భాసయతి క్షణాత్. 19
ప్రకాశ్యమమలాలోక మాలోకస్తేన వర్ధతే
మనస్తావద్గుణగతం రసతన్మాత్రవేదనమ్. 20
క్షణార్ధేన త్వపాం శైత్యం జలసంవిత్తతో భవేత్
తతస్తాదృగ్గుణగతం మనోభావయతి క్షణాత్. 21
స్వరూపం గన్ధవత్స్థూలం యేనోదేష్యతి మేదినీ

దీనిచే నీవు జగత్స్థితినిగూడ నెఱుంగగలవు. దేశకాలాదులచే పరిచ్ఛిన్నముగాని ఆత్మతత్త్వము స్వశక్తిచే లీలామాత్రముగ దేశకాలాదులచే కలుషితమగు పరిచ్ఛిన్న దేహమును ధరించినపుడు వాసనావేశముచే జీవపర్యాయమును కల్పనాకల్పనోన్ముఖమునునగు చంచలమనోరూపము నొందుచున్నది. పూర్వసృష్టియం దాకాశాదుల రూపమున వ్యక్తమయిన బ్రహ్మమును గూర్చిన యుపాసనచే సంస్కరింపబడి, యట్లే అవ్యాకృతరూపమును బడసిన మనస్సే మనశ్శక్తియనఁబడును. అ

మనశ్శక్తి పైక్రమముననే తన యావిర్భావమును గూర్చిన కల్పనయొనర్చుచు సృష్ట్యాదియందు క్షణములో శబ్దములకు బీజభూతమగు శబ్దతన్మాత్రను, శ్రోత్రేంద్రియోన్ముఖమగు నిర్మలయాకాశమును భావనజేయుచున్నది. పిదప స్పందక్రమముచే ఘనత్వముఁజెందిన మనస్సు స్పర్శములకు బీజభూతమగు స్పర్శతన్మాత్రను, త్వగింద్రియోన్ముఖమగు చలనాత్మకమైన వాయువును భావించుచున్నది. చేతనస్వరూపమగు జీవునిచే నదృష్టమును, శబ్దస్పర్శరూపములును నగు ఆకాశవాయువుల సంఘాతముచే అగ్ని యుత్పన్నమగుచున్నది. ఇట్లీ మూడింటిరూపమునను పరిణమించుటచే ఘనత్వముఁజెంది మనస్సు క్షణములో ప్రకాశయుక్తమగు నిర్మల ఆలోకమును భావింప, యద్దానిచే ప్రకాశము వర్ధిల్లుచున్నది. ఆ పిమ్మట ఆకాశవాయ్వగ్ని గుణంబులచే వృద్ధిఁజెందిన మనస్సు రసములకు బీజభూతమగు రసతన్మాత్రను, రసనేంద్రియమును భావించుచున్నది. అపుడు వెంటనే రసతన్మాత్ర దశనుపొంది జలరూపమగుచున్నది. ఇట్లాకాశాది నాల్గుభూతముల గుణములను పొందినదై పిదప మనస్సు క్షణములో గంధతన్మాత్రను భావింప నంత రసతన్మాత్ర గంధగుణయుక్తమగు తన స్థూల స్వరూపమును నుత్పన్న మొనర్చుచున్నది.

అథేత్థంభూతతన్మాత్రవేష్టితం తనుతాం జహత్. 22

వపుర్వహ్నికణాకారం స్ఫురితం వ్యోమ్ని పశ్యతి

అహంకారకలాయుక్తం బుద్ధిబీజసమన్వితమ్. 23

అటుపిమ్మట యీ పంచభూతములు తమ సూక్ష్మదశను త్యజించుచు, అగ్నికణమువంటి యాకృతిగల్గి, అహంకారయుక్తమై బుద్ధిబీజసహితమై స్ఫురించిన దేహమును ఆకాశమున వీక్షించుచున్నవి.

తత్పుర్యష్టకమిత్యుక్తం భూతహృత్పద్మషట్పదమ్

తస్మింస్తు తీవ్రసంవేగాద్భావయద్భాస్వరం వపుః. 24

స్థూలతామేతి పాకేన మనోబిల్వఫలం యథా

మూషాస్థద్రుతహేమాభం స్ఫురితం విమలాంబరే. 25

సన్నివేశముపాదత్తే తత్తేజః స్వస్వభావతః

తస్మిన్స్వసన్నివేశే చ తేజఃస్ఫుంజమయే పునః. 26

భజతే భావనాం స్ఫారాం నిశ్చితామాతతాంబరామ్

ఊర్ధ్వం శిరః పీఠమయీ మధఃపాదమయీం తథా. 27

పార్శ్వయోర్హస్తసంస్థానాం మధ్యే చోదరధర్మిణీమ్

ప్రకటావయవో బాలో జ్వాలామాలామలాకృతిః. 28

మనోరథవశోపాత్త వపుస్తిష్ఠత్యసావథ

ఏవం స్వవాసనావేశాత్కలితాంగో మనోమునిః. 29





దానినే పుర్యష్టక* మందురు. ఇయ్యది ప్రాణుల హృదయకమలమందు భ్రమరమును బోలియున్నది. తీవ్రవాసనాయుక్తమై మనస్సంత నా పుర్యష్టకమున ప్రకాశమానమగు దేహమును భావించుచు కర్మపరిపాకముచే బిల్వఫలాకృతిని స్థూలత్వముఁ జెందుచున్నది. అపుడు మూస యందలి కరగిన బంగారువలె మనస్సు బాహ్యాభ్యంతరములందు స్థూల సూక్ష్మ దేహముల రూపమున ప్రకాశించుచుండును. స్థూలదేహముచే పరివేష్టితమగు పుర్యష్టకరూపమైన లింగదేహము విశేష రచనాయుక్తమగు నా స్థూలదేహమును స్వభావముగనే గ్రహించును. మఱియు మనస్సు ప్రకాశవంతమగు నా దేహమును ఆకాశమున వ్యాప్తమైనదిగను, అతివిశాలమైనదిగను, ఊర్ధ్వభాగమున శిరస్సును, యధోభాగమున పాదములును, యిరుపార్శ్వములందు హస్తములును, మధ్యభాగమున ఉదరమును గలదిగ భావించుచున్నది. అంగుల్యాది అవయవయుక్తమై ప్రకటితమగు దేహమున్ను జ్వాలాసమూహముచే వ్యాప్తమైన నిర్మలయాకృతియుఁగల్గి, మనోరథవశమున దేహమును గ్రహించిన బ్రహ్మదేవుడపుడు ప్రకాశించును. ఇవ్విధమున మననశీలమగు యీ మనస్సు స్వవాసనావేశముచే కల్పితమగు శరీరముగల్గి వర్తించుచున్నది.

నయత్యుపచయం దేహం స్వస్వభావమృతుర్యథా

కాలేన స్ఫుటతామేతి భవత్యమలవిగ్రహః. 30

కాలపరిపాకముచే మనజునకీ నిర్మలదేహము ప్రత్యక్షరూపమున నుదయమగునట్లు, కాల క్రమముననే స్వశరీరవృద్ధిచే మనస్సే బ్రహ్మదేవునిపదము నొందుచున్నది.

బుద్ధిసత్త్వబలోత్సాహ విజ్ఞానైశ్వర్యసంస్థితః

స ఏవ భగవాన్బ్రహ్మా సర్వలోకపితామహః. 31

సర్వలోకపితామహుడైన భగవంతుడగు ఆ బ్రహ్మదేవుఁడే బుద్ధి, సత్త్వ, బల, విజ్ఞానైశ్వర్యయుక్తుడై విరాజిల్లుచున్నాడు.

ద్రవత్కనకసంకాశః పరమాకాశసంభవః

యథాసౌ పరమాకాశే తిష్ఠత్యపరరూపవాన్. 32

జనయత్యాత్మనో మోహా మాత్మస్థం చిత్తలీలయా

తప్తకాంచనసన్నిభుఁడును, చిదాకాశసంభూతుడును నగు బ్రహ్మదేవుడు పరబ్రహ్మ ... నేస త్తతోగూడి రూపమును ధరించియుండునో, అట్టి సత్తచేతచే అజ్ఞానరూపములును, పంచీకృతము ... స్థితములును నగు ఆకాశాది భూతములను లీలామాత్రముగ సృష్టించును.

...దాచిత్కేవలం వ్యోమ పరమం పారవర్జితమ్. 33

అనాదిమధ్యపర్యన్తం కదాచిదమలం పయః

కదాచిత్కల్పకాలాగ్ని జ్వాలాభాస్వరమండకమ్. 34

---

* పుర్యష్టకము:— 1. జ్ఞానేంద్రియ పంచకము, 2. కర్మేంద్రియ పంచకము, 3. వాయు పంచకము, 4. భూత పంచకము, 5. అంతఃకరణ చతుష్టయము, 6. అవిద్య, 7. కామము, 8. కర్మము.

కదాచిత్కాననం కార్ష్ణ్యం కాలం కమలకుడ్మలమ్
అన్యాన్యన్యాన్యనేకాని ప్రతిజన్మావధిః ప్రభుః. 35
కల్పయన్పాలయత్యేష నానారూపాణి హేలయా
తత్రేదం ప్రథమత్వేన యద్దైవ బ్రహ్మణః పదాత్. 36

ఆ బ్రహ్మదేవుఁడొకపుడు ఆద్యంతరహితమగు యీ విశాలాకాశమును సృజించును. ఒకపుడు నిర్మల జలముత్పన్నముజేయును. మఱియొకపుడు ప్రళయాగ్నిజ్వాలచే ప్రకాశమయమగు మండలమును రచించును. ఒకపుడు కృష్ణవర్ణయుక్తమగు పృథివిని నిర్మాణమొనర్చును. మఱియొకపుడు వృక్షములచే వ్యాప్తమగు లోకమును సృజించును. పద్మకల్పమున విష్ణునాభినుండి యుత్పన్నమగు కమలమును రచించును. ఇంకను పృథ్వ్యాది అనేకలోకములను జన్మావధి పర్యంత మీ ప్రభువు కల్పనజేయుచు విష్ణ్వాది అనేకరూపముల ధరించి తానే పాలనచేయుచుండును. వాని యీ దేహమున్నూ సంకల్పముచే బ్రహ్మపదమునుండియే యుత్పన్నమైనది.

అవతీర్ణస్తదాఽజ్ఞానాత్తథైవ సుఖమస్మృతమ్
గర్భనిద్రావ్యపగమే వపుః పశ్యతి భాస్వరమ్. 37

అట్లు మనంబు బ్రహ్మస్వరూపమునుండి యుదయించినదై, అజ్ఞానావృతమై విష్ణుభగవానుని కుక్షియందు ప్రాక్తనసంస్కారములను విస్మరింపజేయు సుషుప్తి దశనుపొంది, నిద్రాంతమున ప్రకాశమయమగు తనదేహము నవలోకించుచున్నది.

ప్రాణాపానప్రవాహాఢ్యం ద్రవ్యైరివ వినిర్మితమ్
రోమకోటిభిరాకీర్ణం ద్వాత్రింశద్దశనాన్వితమ్. 38
త్రిస్థూణం పంచదైవత్య మధశ్చరణలాంఛితమ్
పంచభాగం నవద్వారం త్వగ్లేపమసృణాఙ్గకమ్. 39
యుక్తమంగులివింశత్యా నఖవింశతిలాంఛితమ్
ద్విబాహుం ద్విస్తనం ద్వ్యక్షం బహ్వక్షిభుజమేవ చ. 40
నీడం చిత్తవిహంగస్య నీడం మన్మథభోగినః
తృష్ణాపిశాచ్యానిలయం జీవకేసరికందరమ్. 41
అభిమానగజాలానం మానసాంభోజశోభితమ్
అథాలోచ్య వపుర్బ్రహ్మా కాంతమాత్మీయముత్తమమ్. 42
చిన్తయామాస భగవాంస్త్రికాలామలదర్శనః
అస్మిన్నాకాశకుహరే తతే మధుపలాంఛితే. 43
అదృష్టపారపర్యన్తే ప్రథమం కిమభూదితి
ఇతి చిన్తితవాన్బ్రహ్మా సద్యోజాతోఽమలాత్మదృక్. 44



ఆ దేహము ప్రాణాపానవాయుప్రవాహములచే పూర్ణమును, పంచభూతముల శుద్ధభాగములచే రచితమును, కోట్లకొలది రోమములచే వ్యాప్తమును, శోభాయమానమగు ముప్పదిరెండు దంతములు గలదియు, రెండు జంఘము (పిక్క)లును, పృష్ఠభాగమందలి యెముకయు స్తంభములుగా గలిగియున్నదియు, పంచప్రాణములను దేవతలుగలదియు, హస్తపాదములు, శిరస్సు, వక్షస్థలము, కుక్షియను ఐదు అంగములతో కూడినదియు, నవద్వారయుతమును, చర్మలేపనచే సుందరమును, ఇరువది వ్రేళ్లు, ఇరువది నఖములచే శోభితమును, భుజద్వయ స్తనద్వయ నేత్రద్వయ యుక్తమును, ఒకపుడు యిచ్ఛానుసారమనేక భుజనేత్రములు గలదియు, చిత్తమను పక్షికి గూడును, మన్మథుడను సర్పమునకు నివాసస్థానమును, తృష్ణయను పిశాచమునకు నిలయమును, జీవుడను సింహమునకు గుహయు, అభిమానమను గజమునకు బంధస్థానమును, మనస్సను కమలముచే శోభితమును, మిగుల మనోహరమును నగు తనదేహముఁగాంచి, త్రికాలజ్ఞుడును నిర్మలదృష్టిగలవాడును, భగవానుడును నగు బ్రహ్మదేవుడంత భ్రమరసదృశమును, శ్యామవర్ణయుక్తమును నగు ఈ యనంతాకాశమున మొమ్మొదట దేనిని రచింతునని తన మనంబున జింతించెను. ఇట్లు చింతించిన వెంటనే భగవంతుడగు బ్రహ్మదేవుడు భూతభవిష్యద్వర్తమానముల నెఱుఁగ గల్గెను.

అపశ్యత్సర్గవృందాని సమతీతాన్యనేకశః
అథ సస్మార సకలాన్సర్వాన్ధర్మగణాన్క్రమాత్. 45

అపుడు గడచిన యనేక సృష్టిసమూహముల నాతడు దర్శించెను. పిదప ఆయా జీవుల ధర్మాధర్మములన్నింటిని యాతఁడు క్రమముగ సంస్మరించెను.

వసంతః కుసుమానీవ వేదానాదాయ సంస్తుతాన్
లీలయా కల్పయామాస చిత్రసంకల్పజాః ప్రజాః. 46

తదనంతరము వసంతఋతువు పుష్పగ్రహణపూర్వకముగ వృక్షములందు ఫలాదుల రచన యొనర్చునట్లు బ్రహ్మదేవుడు వేదముల నిర్మించి తదుక్తక్రమమున లీలామాత్రముగా చిత్రవిచిత్రములగు సంకల్పములచే జీవోత్పత్తి గావించెను.

నానాచారసమాచారం గంధర్వనగరే యథా
తాసాం స్వర్గాపవర్గార్థం ధర్మకామార్థసిద్ధయే. 47

ఆ యా ప్రాణులకు స్వర్గ, మోక్ష, ధర్మ, కామములు సిద్ధించుకొఱకై పలువిధ ఆచారవిచారములను గంధర్వనగరమునందువలె రచించెను.

అనన్తాని విచిత్రాణి శాస్త్రాణి సమకల్పయత్
దృష్టిరేవమియం రామ సర్గేఽస్మిన్స్థితిమాగతా
విరించిరూపాన్మనసః పుష్పలక్ష్మీర్మధోరివ. 48

ఓ రామా! ఆతడు పలువిధములగు విచిత్రములైన శాస్త్రములగూడ రచించెను. వసంతకాలముచే పుష్పశోభవలె దృశ్యమానమగు యీ సృష్టియొక్క శోభయంతయు బ్రహ్మ (హిరణ్యగర్భుని) పదమునొందిన మనస్సువలననే స్థితిఁబొందినది.

వివిధవిరచనైః క్రియావిలాసైః
కమలజరూపధరేణ చేతసైవ
రఘుసుత పరికల్పనేన సీతా
స్థితిమతులాం జగతీహ సర్గలక్ష్మీః. 49

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
సంసారావతరణప్రతిపాదనోపదేశోనామ
చతుశ్చత్వారింశః సర్గః ॥ 44 ॥

రఘువంశజుడవగు నో రామా! వివిధరచనలచేతను క్రియావిలాసంబులచేతను, బ్రహ్మ రూపధారియగు చిత్తమే సృష్టియొక్క అనుపమమగు నీ శోభనంతయు జగంబున కల్పనయొనర్చినది.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు స్థితిప్రకరణమున
సంసారావతరణప్రతిపాదనోపదేశమను
చతుశ్చత్వారింశ సర్గము ॥ 44 ॥

~~~~~~

## పంచచత్వారింశః సర్గః.

---

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

జగత్సంపన్నమేవేదం సంపన్నం కించిదేవ న
శూన్యమేవచభామాత్రం మనోవిలసితం స్థితమ్. 1

శ్రీ వసిష్ఠుడు:— ఓ రామా! ఈ జగత్తు సిద్ధరూపమేగాని నిర్మితముగాదు. ఇదంతయును మనోవిలాసమును, ప్రతిభాసమాత్రమునై యున్నది. ప్రతిభాసముకంటె వేఱుగ నిందేమియును లేదు

న దేశకాలావేతేన బ్రహ్మాండేనావృతౌ స్థితౌ
మనాగపి మహారూపవతాప్యాకాశరూపిణా. 2

ఈ బ్రహ్మాండమొక్కదానిచే దేశకాలములు పరివ్యాప్తములై యుండలేదు. ఏలయన, గడచినవియు, యింక సృష్టింపబడనున్నవియు నగు కోట్లకొలది బ్రహ్మాండములు దేశకాలస్వరూపమగు ప్రతిభాసాంతర్గతమున స్ఫురించుచున్నవి. వెయ్యేల, అనంతపరిమాణముగల ఆకాశమున్ను దేశకాలముల యల్పభాగమునైనను వ్యాప్తమొనర్పకున్నది.

ఏతత్సంకల్పమాత్రాత్మ స్వప్నదృష్టపురోపమమ్
యత్రైవ తత్ర తచ్ఛూన్యం కేవలం వ్యోమ సంస్థితమ్. 3



స్వప్నదృష్టనగరమువలె ఈ జగత్తు సంకల్పమాత్రమే అయియున్నది. ఏ దేశకాలములందు చైతన్యమున జగత్తు ప్రతిభాసమగునో, అచట నద్దాని యధిష్ఠానము చైతన్యమే యగును. మఱియు జగత్తు కేవలము శూన్యాకాశమువలెనే యున్నది.

అభిత్తిరాగరచనమపి దృష్టమసన్మయమ్
అకృతం కృతమేవైతద్వ్యోమ్ని చిత్రం విచిత్రకమ్. 4

గంధర్వనగరమందలి చిత్రమువలె భిత్తి రంజక ద్రవ్యాదిరహితమును, దృశ్యమానమైనను అసత్తును, నిర్మితమైనను అకృతమునునైన యీ జగత్తు ఆకాశమందలి విచిత్ర చిత్రమువోలె నున్నది.

మనసా కల్పితం సర్వం దేహాదిభువనత్రయమ్
సంస్మృతౌ కారణం చైతచ్చక్షురాలోకనే యథా. 5

ఈ దేహాదులును, త్రిలోకములును మనస్సుచేతనే కల్పింపబడినవి. దర్శన క్రియయందు నేత్రమువలె యిది కేవలము స్మృతిమాత్ర హేతువగునేగాని సత్యముగాదు.

ఆభానమాత్రం హి జగద్ఘటావటపటభ్రమైః
ఆవర్తతే న సద్రూపాత్పృథక్కుడ్యాదయః స్థితాః. 6

ఘటపటకుడ్యాది పదార్థయుక్తమగు యీ జగత్తు ఆభాసమాత్రమే అయియున్నది. ఏలయన సత్తునకు వేఱుగ ఘటపటకుడ్యాదులే లేవుగదా!

మనసేదం శరీరం హి వాసనార్థం ప్రకల్పితమ్
కృమికోశప్రకారేణ స్వాత్మకోశ ఇవ స్వయమ్. 7

పట్టుపురుగు తనకొఱకు గూటిని నిర్మించుకొనునట్లు మనస్సు తన నివాసార్థము శరీరమును కల్పించుకొనినది.

న తదస్తి చ యన్నామ చేతః సంకల్పమంబరమ్
న కరోతి న చాప్నోతి దుర్గమప్యతిదుష్కరమ్. 8

అర్థశూన్యమును, సంకల్పరూపమును నగు మనస్సు రచింపనదిగాని ప్రాప్తింపనిదిగాని నగు దుష్కరవస్తువెద్దియును లేదు.

సర్వశక్తిధరే దేవే కా నామ నను శక్తయః
న సంభవన్త్యాశ్రియస్తే యాభిరన్తర్మనోగుహాః. 9

మనో-గుహ నాశ్రయింపని శక్తులేవియు జగదీశ్వరునియందైనను లేవు. (అనగా సర్వశక్తులును మనంబున గలవని భావము)

సత్తానత్తే పదార్థానాం సర్వేషాం సర్వదైవ హి
మహాబాహో సంభవతః సర్వశక్తా విభాసతి. 10

పశ్య భావనయా ప్రాప్తం మనసైవాత్మజం వపుః
తస్మాత్తత్కలనాం రామ సర్వశక్తియుతాం విదుః. 11
~~~~~~

మహాబాహువగు నో రామా! సత్తాసత్తాస్వరూపములగు సమస్త పదార్థములను, సర్వశక్తివంతమగు మనస్సుచేతనే సదా స్థితివంతములగుచున్నవి. ఈ నీశరీరమును గాంచుము-మనోభావనచేతనే ఇయ్యది నీకు ప్రాప్తించినది. కనుకనే విజ్ఞులు మనఃకల్పనను సర్వశక్తియుతముగ వచించుచున్నారు.

స్వసంకల్పకృతాః సర్వే దేవాసురనరాదయః
స్వసంకల్పోపశమనే శామ్యన్త్యస్నేహదీపవత్. 12

దేవాసురమనుష్యాదులందఱును మనస్సుయొక్క సంకల్పమాత్రముచేతనే రచింపబడిరి. అట్టి మనస్సంకల్పము శమింప, తైలములేని దీపమువలె వారున్ను శమించెదరు.

ఆకాశసదృశం సర్వం కలనామాత్రజృంభితమ్
జగత్పశ్య మహాబుద్ధే సుదీర్ఘం స్వప్నముత్థితమ్. 13

మహాబుద్ధిమంతుడవగు నో రామా! ఈ జగత్తునంతయును దీర్ఘస్వప్నమువలె నుదయించిన దానినిగ వీక్షింపుము. ఆకాశమువలె నీవిద్దానిని కల్పనామాత్రముగను, మనోవిలాసమాత్రముగను నెఱుంగుము.

న జాయతే న మ్రియతే ఇహ కించిత్కదాచన
పరమార్థేన సుమతే మిథ్యాసర్వం తు విద్యతే. 14

సుమతుఁడవగు నో రామా! పరమార్థమున యీ జగత్తునందేదియు నుత్పన్నమగుటలేదు, నశించుటలేదు. వాస్తవముగ నిదంతయు మిథ్యయేయగును.

న వృద్ధిమేతి నో హ్రాసం యన్న కించిత్కదాచన
కింవా తనుభవేత్తత్ర కస్య కా నామ ఖండనా. 15

వృద్ధిక్షయముల నెపుడును పొందని ఆత్మవస్తువు సూక్ష్మమెట్లగును? మఱియు నఖండమగు యద్దాని ఖండనమెట్లు సంభవమగును?

భూమభూతం స్వకాయోత్థమపశ్యన్నిపుణం దృశా
రాఘవామహతాస్వాన్తః కిమజ్ఞ ఇవ ముహ్యసి. 16

ఓ రాఘవా! దేహముకంటె వేఱగు అపరిచ్ఛిన్నమైన అనంతాత్మను వీక్షింపక పరిచ్ఛిన్నాత్మ (అహంకారము)ను దర్శించి యేల నీవంతరమున విమోహితుఁడవగుచుంటివి?

మృగతృష్ణా యథా తాపాన్మనసో నిశ్చయాత్తథా
అనన్త ఇవ దృశ్యన్తే సర్వే బ్రహ్మాదయోఽవ్యయా. 17

మరుభూమియందలి యుష్ణత్వమునుగూర్చిన మనోనిశ్చయముచే మృగతృష్ణానదులు గోచరించునట్లు, ఈ బ్రహ్మాదులందఱును మిథ్యారూపముననే యుదయించిరి.

ద్విచంద్రవిభ్రమప్రఖ్యా మనోరథవదుత్థితాః
మిథ్యాజ్ఞానఘనాః సర్వే జగత్యాకారరాశయః. 18



ద్విచంద్రభ్రమవలెను, సంకల్పితపదార్థమువలెను, ఈ జగత్తునందలి సర్వవస్తువులును మిథ్యారూపములై, ఘనమగు అజ్ఞానముచే నావృతములై యున్నవి.

యథా నౌయాయినో మిథ్యా స్థాణుస్పందమతిస్తథా
అసత్యైవోత్థితా నిత్యమాకారాణాం పరంపరా. 19

నౌకయందలి యాత్రికునకు తీరమందలి వృక్షాదులు చలించుచున్నట్లు ప్రతీతమగు చందమున పదార్థముల యాకారములన్నియు మిథ్యారూపముననే యావిర్భవించినవి.

ఇంద్రజాలమిదం విద్ధి మాయారచితపంజరమ్
మనోమననిర్మాణం న సన్నాసదివ స్థితమ్. 20

ఓ రామా! నీవీజగత్తునంతయు మాయానిర్మితముగను, ఇంద్రజాలమయముగను నెఱుంగుము. ఈ సమస్తమున్ను మనఃకల్పితమాత్రమేయగుచు సదసద్విలక్షణమై యనిర్వచనీయరూపముననున్నది.

బ్రహ్మైవేదం జగత్సర్వమన్యథాయాస్తతః కుతః
ప్రసంగః కీదృశః కోఽసౌ క్వ వా సా పరితిష్ఠతి. 21

ఇదంతయు బ్రహ్మముమాత్రమే యగును. దీనియందు భిన్నత్వప్రసంగమేల? ఇందు భేదమిచట యెట్లు సిద్ధించును?

అయం గిరిరయం స్థాణురిత్యాడంబర విభ్రమః
మనసో భావనాదార్ఢ్యాదసన్నప్యివ లక్ష్యతే. 22

ఇది పర్వతము, ఇది స్థాణువు - ఇత్యాది యాడంబరవిభ్రమమంతయు అసద్రూపమైనను, మనోభావనాదార్ఢ్యముచే సద్రూపమున లక్షితమగుచున్నది.

ప్రపంచపతనారంభం ప్రమత్తస్య ఇదం జగత్
సకామతృష్ణామననం త్యక్త్వాన్యద్రామ భావయ. 23

ఓ రామా! తత్త్వవిచారములేనివాని కీజగత్తు కామనాసహితమును, తృష్ణారూపమునునై, స్వర్గనరకములను తిర్యగాది జన్మలను గల్గజేయుచున్నది. కాన నీవు ప్రపంచరహితమగు ఆత్మను గూర్చియే భావింపుము.

యథా స్వప్నే మహారంభో భ్రాంతిరేవ న వస్తుతః
దీర్ఘస్వప్నం తథైవేదం విద్ధి చిత్తోపపాదితమ్. 24

స్వప్నమందలి పదార్థజాతమంతయు భ్రాంతిమాత్రమే గాని యథార్థముగానివిధమున చిత్తనిర్మితమగు యీ జగత్తున్ను దీర్ఘస్వప్నమని యెఱింగి యద్దాని నసద్రూపముగ నిశ్చయింపుము.

దృశ్యమానమహాభోగం గృహ్యమాణమవస్తుకమ్
కోశమాశాభుజంగానాం సంసారాడంబరం త్యజ. 25

ఓ రామా! అనేక భోగవైభవముల కాటపట్టై, విశాలముగను రమణీయముగను గన్పట్టునదియు, కాని గ్రహించినచో తుచ్ఛమును క్షణభంగురమును నైయొప్పునదియు, ఆశలను సర్పములకు నిలయమునునగు ఈ సంసారము (దృశ్యప్రపంచము)ను నీవు త్యజింపుము.

అసదేతదితి జ్ఞాత్వా మాఽత్ర భావం నివేశయ
అనుధావతి న ప్రాజ్ఞో విజ్ఞాయ మృగతృష్ణికామ్. 26

ఓ రామా! అసత్తని యెఱింగి, యీ దృశ్యప్రపంచమున అనురాగము గల్గియుండకుము. ఏలనన మృగతృష్ణయని యెఱింగిన బుద్ధిమంతుడద్దానికొఱకై పరువిడునా?

స్వసంకల్పాత్స్వరూపాఢ్యాం మనోరథమయీం శ్రియమ్
యోఽనుగచ్ఛతి మూఢాత్మా దుఃఖస్యైవ స భాజనమ్. 27

సంకల్పస్వరూపమును, మనోరథమయమునగు మాయావైభవము వెంట బరువిడు మూఢుడు కేవలము దుఃఖభాజుడేయగును.

వస్తున్యసతి లోకోఽయం యాతు కామమవస్తుని
యస్తు వస్తు పరిత్యజ్య యాత్యవస్తు స నశ్యతి. 28

ఆత్మవస్తువులేనిచో, అసత్తగుదృశ్యప్రపంచము వెంటబరువిడుట యుక్తమేగాని ఆత్మవస్తువనునది యున్నపుడు యద్దానిని త్యజించిపోవువాడు పరమపురుషార్థమును పొందక నశించును.

మనోవ్యామోహ ఏవేదం రజ్జ్వామహిభయం యథా
భావనామాత్రవైచిత్ర్యా చ్చిరమావర్తతే జగత్. 29

రజ్జువునందలిసర్పమునుగూర్చిన భయమువలెనే ఈ జగత్తు వ్యామోహమాత్రమే అయియున్నది. మఱియు భావనావైచిత్ర్య మాత్రముననే యీ జగత్తు చిరకాలము స్థితిగలిగియున్నది.

అసదభ్యుదితైర్భావై ర్జలాన్తశ్చంద్రవచ్చలైః
వంచ్యతే బాల ఏవేహ న తత్త్వజ్ఞో భవాదృశః. 30

జలమందలి చంచలమగు యనేకచంద్రులవలె మిథ్యాభూతమగు అసత్పదార్థములచే బాలుడే (అజ్ఞానియే) మోసగింపబడును గాని నీవంటి తత్త్వజ్ఞానికాదు.

య ఇమం గుణసంఘాతం భావమున్సుఖమీహతే
ప్రమార్ష్టి స జడో జాడ్యం వహ్నిభావనయా స్వయా. 31

శబ్దాది గుణసంఘాతమగు దేహాదులయం దహంభావముకల్గి సుఖమపేక్షించు మూఢుడు, స్వమనోరథకల్పితమగు యగ్నిచే శైత్యమును నివారించుకొనువాడే యగును.

అసదేవేదమాభోగి దృశ్యతే జలపంజరమ్
మనోమనననిర్మాణహృదయే నగరం యథా. 32

మనస్సుయొక్క మననశక్తిచే హృదయమున నగరముభాసించునట్లు, విశాలమును, జడమును నగు పంచభూతములయొక్క సంఘాతమైన దేహాదు లసద్రూపముగనే కన్పట్టుచున్నవి.



ఇదం చిత్తేచ్ఛయోదేతి లీయతే తదనిచ్ఛయా
మిథ్యైవం దృశ్యతే స్ఫీతం గంధర్వనగరం యథా. 33

ఈ జగత్తు చిత్తముయొక్క యిచ్ఛచేతనే యుదయించుచు, అట్టి యిచ్ఛలేనిచో నశించుచునున్నది. మఱియు గంధర్వనగరమువలెను, లేక సంకల్పనిర్మిత నగరమువలెను, ఈ విశాల, నిర్మల దృశ్య మంతయు మిథ్యారూపముననే దృశ్యమానమగుచున్నది.

రామ నష్టే జగత్యస్మిన్న కించిదపి నశ్యతి
సముత్థేఽపి చ జగత్యస్మిన్న కించిదపి యుజ్యతే. 34

ఓ రామా! ఈ జగత్తు నశించిన, యేమియు నశించుటలేదు; అట్లే ఇయ్యది వృద్ధినొందిన నేమియు వృద్ధినొందుటలేదు.

మనః ప్రకల్పితే భగ్నే హృది విస్తీర్ణపత్తనే
వృద్ధిం చోపగతే బ్రూహి కిం వృద్ధం కస్య కిం క్షతమ్. 35.

హృదయమందలి మనఃకల్పితమగు విశాలనగరము నశించినను, లేక వృద్ధినొందినను, యేమి నశించుచున్నదో, యేమి వృద్ధినొందుచున్నదో వచింపుము?

క్రీడార్థేన యథోదేతి బాలానాం హృది వర్తనమ్
మనసా తద్వదేవేదముదేత్యవిరతం జగత్. 36

క్రీడార్థము బాలురచే నాటబొమ్మలు కల్పింపబడువిధమున యీ జగత్తున్నూ నిరంతరము మనస్సుచే కల్పింపబడుచున్నది.

న కించిత్కస్యచిన్నష్టమింద్రజాలజలే యథా
భ్రష్టే నష్టే తథైవాస్మిన్సంసారే వితథోత్థితే. 37

ఇంద్రజాలమందలి జలమునశించిన, యెవనికిని యేమియు హానిలేనట్లు, మిథ్యారూపమున యావిర్భవించిన యీ ప్రపంచము నశించిన యెవనికిని యేమియు హానిలేదు.

యదసత్తదసత్త్వాచ్చేన్న కిం కస్య కిల క్షతమ్
తతో హర్షవిషాదానాం సంసారే నామ నాస్పదమ్. 38

ఏది యథార్థముగలేదో, అయ్యది నశించిన యెవనికి యేమిహాని? కాన నీ ప్రపంచమున హర్షశోకాదులకు తావెచట?

అసదేవ యదత్యన్తం తస్మాత్కిం నామ నశ్యతి
నాశాభావే హి దుఃఖస్య కః ప్రసంగో మహామతే. 39

మహామతివగునో రామా! ఎల్లప్పుడు అసత్తైయున్న దానికిక నాశమేమి? నాశములేనిచో నిక దుఃఖమేల?

సదేవ వా యదత్యన్తం తస్య కిం నామ నశ్యతి
బ్రహ్మైవేదం జగత్సర్వం సుఖదుఃఖే కిముత్థితే. 40

లేక యెల్లప్పుడు సద్వస్తువై యుండుదానికి నాశమేమి? ఈ జగత్తంతయు బ్రహ్మమే అయియుండ నిక సుఖదుఃఖము లేల?

అసద్వాపి యదత్యన్తం వృద్ధిః స్యాత్తస్య కీదృశీ
వృద్ధేరభావే హర్షస్య కః ప్రసంగో మహామతే. 41

మహామతివగు నో రామా! ఏది యెల్లకాలములందు అసత్తై యున్నదో, యద్దానికి వృద్ధియెట్లు సంభవించును! వృద్ధియే లేనపుడిక హర్షమేల?

సర్వత్రాసత్యభూతేఽస్మిన్ప్రపంచే కాన్తకారిణి
సంసారే కిముపాదేయం ప్రాజ్ఞో యదభివాంఛతు. 42

ఎల్లకాలములందసత్యమును, నిరంతరము జనన మరణాదుల గలుగజేయునదియునగు యీ ప్రపంచమున విజ్ఞులచే నభిలషింపబడు గ్రాహ్యవస్తు వెద్దిగలదు?

సర్వత్ర సత్యభూతేఽస్మిన్ప్రిహ్మత త్త్వమయేఽపి చ
కిం స్యాత్త్రిభువనే హేయం ప్రాజ్ఞః పరిహరస్తు యత్. 43

లేక, సర్వత్ర సత్యస్వరూపమై విలసిల్లు యీ ముల్లోకమున విజ్ఞులచే త్యజింపబడు త్యాజ్య వస్తువెయ్యదిగలదు?

అసత్సద్వా జగద్యస్య తేనాసౌ సుఖదుఃఖయోః
అగమ్య ఏవ మూర్ఖస్తు తద్వినాశేన దుఃఖితః. 44

నామరూపాత్మకమగు విశ్వమును అసత్తుగను, అద్దాని యధిష్ఠానమగు బ్రహ్మమును సత్తుగను నెఱుంగు ప్రాజ్ఞుడు సుఖదుఃఖములకు లోనుగాడు. కాని జగత్తునందు సత్యత్వబుద్ధిగల యజ్ఞాని, జగత్తునశించిన దుఃఖమునొందును.

ఆదావన్తే చ యన్నాస్తి వర్తమానేఽపి తత్తథా
యోఽభివాంఛత్యసద్రామ తస్యాసత్తైవ దృశ్యతే. 45

ఓ రామా! ఏవస్తువాద్యంతములందులేదో, అది వర్తమాన కాలమునను లేనిదేయగును. అసత్తు నిచ్ఛగించువానికి సర్వత్ర అసత్తయే కాన్పించును.

ఆదావన్తే చ యత్సత్యం వర్తమానే సదేవ తత్
యస్య సర్వం సదేవ స్యాత్తస్య సత్తైవ దృశ్యతే. 46

ఏవస్తువాద్యంతములగదు సత్యమైనదో, అది వర్తమానకాలమందును సద్రూపమేయగును. జగత్తంతయు సత్యస్వరూపమగు బ్రహ్మమయమే యను నిశ్చయముగలవానికి అంతటను సత్తయే గోచరమగును.

అసత్యభూతం తోయాన్తశ్చంద్రవ్యోమతలాదికమ్
బాలా ఏవాభివాంఛన్తి మనోమోహాయ నోత్తమాః. 47

జలమందు గన్పించు చంద్రమండలమును, ఆకాశమును మనోమోహ (అజ్ఞాన) కారణమున బాలురే (అజ్ఞులే) సత్యమని తలం[illegible] ప్రాజ్ఞులు కాదు.



బాలో హి వితతాకారైర్వస్తురిక్తైః ప్రయోజనైః
సంతోషమేత్యనన్తాయ దుఃఖాయ న సుఖాయ తు. 48

అర్థశూన్యములును, సుఖాభాసమాత్రములునునగు ప్రాపంచిక వస్తువులచే సంతుష్టిజెందు అజ్ఞాని వానిచే దుఃఖములనే బడయును గాని సుఖమును గాదు.

తస్మాన్మా త్వం భవో బాలో రామ రాజీవలోచన
అవినాశమిహాలోక్య నిత్యమాశ్రయ సుస్థిరమ్. 49

[illegible] కండవగు నో రామచంద్రా! కాన నీవజ్ఞానివిగాక నాశరహితమగు ఆత్మనువర్శించి, అట్టి సుస్థిర[illegible]మునే నిరంతరమాశ్రయింపుము.

అసదిదమఖిలం మయా సమేతం
త్వితి విగణయ్య విషాదితాస్తు మా తే
సదిహ హి సకలం మయా సమేతం
త్వితి చ విలోక్య విషాదితాస్తు మా తే. 50

మాయాకారణమున, అజ్ఞులచే నాత్మరూపముగ గల్పింపబడిన అహంకారసమేతమగు నీ జగత్తునంతయు అసద్రూపముగ నెఱింగి, యద్దానియందనురాగము లేకయుండుము. మఱియు అజ్ఞానరహితుడవును, స్వస్వరూపసహితుడవునునై ఈ జగత్తునంతయు సత్యమగు బ్రహ్మమని యెఱింగిన పిదపకూడ దీనియందు నీకు రాగముదయించకుండును గాక!

శ్రీ వాల్మీకి రువాచ:—

ఇత్యుక్తవత్యథ మునౌ దివసో జగామ
సాయంతనాయ విధయేఽస్తమినో జగామ
స్నాతుం సభాకృతనమస్కరణా జగామ
శ్యామాక్షయే రవికరైశ్చ సహాజగామ. 51

ఇత్యార్షే వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
యథాభూతార్థయోగోపదేశో నామ పంచ
చత్వారింశః సర్గః ॥ 45 ॥

నవమోదివసః

శ్రీ వాల్మీకి:—వసిష్ఠ మునీంద్రు లిట్లు వచింప నంత సూర్యాస్తసమయము కాగా, సభ్యు లందఱును స్నానసంధ్యాది కృత్యముల నిర్వర్తించుటకై తను తమ స్థానములకు జనిరి. ఆరాత్రి గడచిన మీదట మరునాడు సూర్యోదయకాలమున కందఱును మఱల నాసభాస్థలమునకు విచ్చేసిరి.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు స్థితిప్రకరణమున
యథాభూతార్థయోగోపదేశమను పంచచత్వారింశ
సర్గము ॥ 45 ॥

తొమ్మిదవ రోజు.

## షట్చత్వారింశః సర్గః.

శ్రీ వసిష్ఠ ఉవాచః—

రమ్యే ధనేషు దారాదౌ శోకస్యావసరో హి కః
ఇంద్రజాలే క్షణాద్దృష్టే నష్టే కా పరిదేవనా. 1

శ్రీ వసిష్ఠుడు:— ఓ రామా ! రమణీయములగు ధనదారాపుత్రాదులు నశించినను దుఃఖింప నగత్యమేమి ? క్షణకాలము గన్పించు యింద్రజాలము నశించిన దుఃఖమేటికి ?

గంధర్వనగరస్యార్థే దూషితే భూషితే తథా
అవిద్యాంశే సుతాదౌ వా కః క్రమః సుఖదుఃఖయోః. 2

గంధర్వనగరమునందలి పదార్థములుగాని అవిద్యాంశములగు స్త్రీ పుత్రాదులుగాని దూషితములైనను భూషితములైనను, సుఖదుఃఖముల బొందనేల ?

రమ్యే ధనేఽథ దారాదౌ హర్షస్యావసరో హి కః
వృద్ధాయాం మృగతృష్ణాయాం కిమానందో జలార్థినామ్. 3

ధనదారాపుత్రాదులు వృద్ధినొందిన హర్షమేల ? మృగతృష్ణానది వృద్ధిజెందిన జలార్థులకేమి యధికసుఖము గల్గును ?

ధనదారేషు వృద్ధేషు దుఃఖం యుక్తం న తుష్టయః
వృద్ధాయాం మోహమాయాయాం కః సమాశ్వాసవానిహ. 4

ధనదారాదులు వృద్ధినొందిన దుఃఖించుటగాని సంతుష్టి జెందుటగాని కూడదు. మాయా మోహమతిశయించిన నెవరు సుఖింతురు ?

యైరేవ జాయతే రాగో మూర్ఖస్యాధికతాంగతైః
తైరేవ భోగైః ప్రాజ్ఞస్య విరాగ ఉపజాయతే. 5

ఓ రామా ! ఏయధిక విషయభోగములందు మూఢుల కనురాగముదయించుచున్నదో అట్టి భోగములవలననే జ్ఞానికి వైరాగ్యముత్పన్నమగుచున్నది.

నష్టే ధనేఽథ దారాదౌ హర్షస్యావసరో హి కః
పారావలోకిన స్వైస్తైర్విరాగం యాన్తి సాధవః. 6

ధనదారాదులు నశించిన హర్షశోకముల బొందనేల ? అయ్యవి నశ్వరములనియు, నరక హేతువులనియు నెఱింగి సాధువులగు మహాత్ములు వానియెడల విరక్తిగల్గి వర్తించుచున్నారు.

అతో రాఘవ తత్త్వజ్ఞో వ్యవహారేషు సంసృతేః
నష్టం నష్టముపేక్షస్వ ప్రాప్తం ప్రాప్తముపాహర. 7

కాన నోరామా! తత్త్వజ్ఞుడవై ప్రపంచవ్యవహారములందు వినష్టమగు పదార్థముల నుపేక్షించి ప్రాప్తించినవాటినె సేవింపుము.



అనాగతానాం భోగానామవాంఛనమకృత్రిమమ్
ఆగతానాం చ సంభోగ ఇతి పండితలక్షణమ్. 8

స్వభావముగనే అప్రాప్తభోగములయం దిచ్ఛ లేకయుండుట, ప్రాప్తించినవానిననుభ వించుట జ్ఞానుల లక్షణమైయున్నది.

సంసారసంభ్రమే హ్యస్మింశ్ఛన్నాత్మన్యాతతాయిని
తథా విహరసంబుద్ధో యథా నాయాసి మూఢతామ్. 9

ఓ రామా ! ప్రపంచమున భ్రమను గలుగజేయునదియు, ప్రచ్ఛన్నరూపమున వధించునట్టి శత్రువువంటిదియునగు ఈకామవిషయమున మిగుల జాగరూకుడవైయుండి జ్ఞానవంతుడవై అజ్ఞానమునకు తావీయక వ్యవహరింపుము.

సంసారాడంబరస్యాస్య ప్రపంచరహితే క్రమే
సమ్యగ్జ్ఞా నానుపశ్యన్తి యే హతాస్తే కుబుద్ధయః. 10

ప్రపంచరహితమగు బ్రహ్మమునుగూర్చిన జ్ఞానముగల్గియున్నను, ప్రమత్తతచే ఈ సంసారాడంబరముయొక్క పంచనను గుర్తెఱుంగని దుర్బుద్ధులు తమ ప్రమత్తతచేతనే వినాశమొందుదురు.

యయాకయాచిద్యుక్త్యైవ దృశ్యాద్యస్యగతా రతిః
పరిమజ్జతి తస్యాస్థా న క్వచిద్విమలామతిః. 11

ఏ యుక్తిచేనైనను ఈ దృశ్యప్రపంచమందలి ప్రీతి యెవనికి నివర్తించునో, అట్టివాని పరమార్థతత్త్వప్రవిష్టమగు నిర్మలబుద్ధి మోహసముద్రమున మఱల యెన్నటికిని గ్రుంకదు.

యస్యాసదిదమిత్యాస్థా నివృత్తా సర్వవస్తుషు
క్రోడీకరోతి సర్వజ్ఞం నావిద్యాతమవాప్తపి. 12

ఈ జగత్తంతయు నసత్యమని యెఱింగి యెవడు సమస్తపదార్థముల నుండి యుపరతిని బొందునో, అట్టి సర్వజ్ఞుని మిథ్యయగు యవిద్య తన వశమొనర్పజాలదు.

అహం జగచ్చైకమిదం సర్వమేవేతి యస్య ధీః
ఆస్థానాస్థే పరిత్యజ్య సంస్థితా న స మజ్జతి. 13

ఈ సమస్త జగత్తున్ను, నేనును, ఒకే పరబ్రహ్మస్వరూపమని నిశ్చయించువానిబుద్ధి యిచ్ఛానిచ్ఛల రెంటిని పరిత్యజించియుండును. అట్టి ప్రాజ్ఞుడు సంసారసముద్రమున మునుంగనేరడు.

శుద్ధం సదసతోర్మధ్యం పదం బుద్ధ్వాఽవలంబ్య చ
స బాహ్యాభ్యంతరం దృశ్యం మా గృహాణ విముంచ మా. 14

వ్యక్తావ్యక్తముల రెంటియందును వ్యాపించియున్న శుద్ధబ్రహ్మపదము నెఱింగి, అట్టి ప్రత్యగాత్మ స్వరూపమునే యాశ్రయించి బాహ్యాభ్యంతర జగత్తుల గ్రహింపకయు త్యజింపకయు నుండుము.

అత్యన్తవిరతః స్వస్థః సర్వవాసనవివర్జితః
వ్యోమవత్తిష్ఠ నీరాగో రామ కార్యపరోఽపి సన్. 15

పూర్ణవిరక్తి, సంతుష్టి, నిరభిమానముగల్గి ఆకాశమువలె దేనియందు నాసక్తముగాక ఈ ప్రపంచమున వ్యవహారము సల్పుచునైనను యుండుము.

యస్య నేచ్ఛా న వానిచ్ఛా జ్ఞస్య కర్మణి తిష్ఠతః
న తస్య లిప్యతే ప్రజ్ఞా పద్మపత్రమివాంబుభిః. 16

ఇచ్ఛానిచ్ఛలు రెండునులేని తత్త్వజ్ఞానవ్యవహారము సల్పుచున్నను, కమలపత్రమున జలమంటనట్లు యాతనిబుద్ధి ప్రపంచమున లిప్తము గాకయుండును.

దర్శనస్పర్శనాదీని మా కరోతు కరోతు చ
తవేంద్రియమనోగాణం త్వమనిచ్ఛో భవాత్మవాన్. 17

ఓ రామా ! ఆసక్తిరహితమగు నీ మనస్సు యింద్రియసహితముగ దర్శన స్పర్శనాది క్రియలనొనర్చుగాక లేక యొనర్పకుండుగాక, కాని నీ వెల్లపుడును ఆత్మనిష్ఠుడవై అంతరంగమున యిచ్ఛారహితుడవై యుండుము.

మమేదమిత్యసద్భావత మింద్రియార్థే భవన్మనః
మా నిమజ్జత్వమగ్నః సన్మా కరోతు కరోతు వా. 18

'ఇది నాది' యను భావము నసత్తుగ యెఱింగి, శబ్దస్పర్శాది యింద్రియార్థంబుల నీ మనస్సభిముఖమగుచున్నను, అందు నిమగ్నుడవు గాకయుండుము. అట్లు వానియందు నిమగ్నుఁడవు గాక యింద్రియ వ్యాపారములజేయుము, లేక చేయకుండుము.

యదా తేనేన్ద్రియార్థశ్రీః స్వదతే హృది రాఘవ
తదా విజ్ఞాతవిజ్ఞానః సముత్తీర్ణ భవార్ణవః. 19

ఓ రామా ! ఇంద్రియార్థంబులగు శబ్దస్పర్శాదులెపుడు నీకు రుచింపకుండునో, అపుడే నీవు జ్ఞాన విజ్ఞానసంపన్నుడవై సంసారసముద్రమును దాటితివని యెఱుంగుము.

అస్వాదితేన్ద్రియార్థస్య సతనోరతనోరపి
అనిచ్ఛతోఽపి సంపన్నా ముక్తిరర్థవశాత్తవ. 20

ఇహ పరలోకమందలి యింద్రియార్థములెపుడు నీకరుచికరములగునో, అపుడు నీవు ప్రపంచమున వ్యవహరించుచున్నను లేక సమాధినిష్ఠుడవైయున్నను సరియే, ఇచ్ఛగింపకున్నను ముక్తి అనాయాసముగ లభింపగలదు.

ఉచ్చైఃపదాయ పరయా ప్రజ్ఞయా వాసనాగణాత్
పుష్పాద్గన్ధమివోదారం చేతో రామ పృథక్కురు. 21

ఓ రామా ! సర్వోత్తమ పదప్రాప్తికొఱకై, జ్ఞానవైరాగ్యముల నాశ్రయించి, పుష్పము నుండి గంధమువలెనే ఉత్తమప్రజ్ఞచే చిత్తమును వాసనాసమూహమునుండి వేఱుచేయుము.



సంసారాంబునిధావస్మిన్వాసనాంబుపరిప్లుతే
యే ప్రజ్ఞానావమారూఢాస్తే తీర్ణా బుడితాః పరే. 22

ప్రజ్ఞయను నౌక నారోహించువారే వాసనాజలపరిపూర్ణమగు ఈ సంసారసాగరమును దాటుదురు. గాని తక్కినవారందఱును యందు మునుంగుదురు.

క్షురధారాప్రమితయా ధియా పరమధీరయా
ప్రవిచార్యాత్మనస్తత్త్వం తతః స్వపదమావిశ. 23

ఓ రామా ! వివేకవైరాగ్యాది యుక్తమును, క్షురాగ్రభాగమువలె తీక్ష్ణమును, పరమ ధైర్యోపేతమునునగు బుద్ధిచే ఆత్మతత్త్వమును విచారించి తదనంతరము స్వాత్మపదమునఁ బ్రవేశింపుము.

యథా తత్త్వవిదః ప్రాజ్ఞా జ్ఞానబృంహితచేతసః
విహరన్తి తథా రామ విహర్తవ్యం న మూఢవత్. 24

ఓ రామచంద్రా ! జ్ఞానముచే పరివర్ధితమగు చిత్తముగలవారును, బుద్ధిమంతులును, తత్త్వవేత్తలు నగు మహాత్ములవలెనే యీ ప్రపంచమున విహరించవలెనుగాని అజ్ఞానులవలెగాదు.

జీవన్ముక్తా మహాత్మానో నిత్యతృప్తా మహాధియః
ఆచారైరనుగన్తవ్యా న భోగకృపణాః శఠాః. 25

నిత్యతృప్తులును, మహాధీశాలురును, జీవన్ముక్తులు నగు మహాత్ముల యాచరణనే అనుసరించవలెనుగాని, స్వపరవంచకులగు కుత్సితుల యాచరణనుగాదు.

న త్యజన్తి న వాంఛన్తి వ్యవహారం జగద్గతమ్
సర్వమేవానువర్తన్తే పారావారవిదో జనాః. 26

జగద్బ్రహ్మల యథార్థము నెఱింగిన మహాత్ములు జగద్వ్యవహారములఁ ద్యజింపరు, యిచ్ఛగింపరు. కాని ప్రాప్తించినవానినన్నింటినిమాత్ర మనువర్తించెదరు.

ప్రభావస్యాభిమానస్య గుణానాం యశసః శ్రియః
న క్వచిత్కృపణా లోకే మహాన్తస్తత్త్వదర్శినః. 27

తత్త్వజ్ఞానులగు మహాత్ములు, విద్యాతపంబుల యుత్కర్షతారూపమగు ప్రభావము, అభిమానము, ప్రావీణ్యము, కులశీలాదిగుణములు, కీర్తి, సంపద — వీని నెపుడును అభివాంఛింపరు. ఏలయన ఇవన్నియు మిథ్యారూపములగుటచే పరమపురుషార్థ మొసంగజాలవని వారెఱుంగుదురు.

సుశూన్యేఽపి న ఖిద్యన్తే దేవోద్యానే న సంగినః
నియతిం చ న ముంచన్తి మహాన్తో భాస్కరా ఇవ. 28

అట్టి మహాత్ములు సర్వము నశించినను ఖిన్నులు గాకయుందురు. మఱియు నింద్రుని యుద్యానమగు నందనవనమందును యాసక్తి లేకయుందురు. అట్టివారు సూర్యునివలె శాస్త్రప్రసిద్ధమగు తమ నియతిని యెపుడును త్యజింపరు.

విగతేచ్ఛా యథా ప్రాప్తవ్యవహారానువర్తినః
విచరన్తి సమున్నద్ధాః స్వస్థా దేహరథే స్థితాః. 29

జీవన్ముక్తులగు మహాత్ములు ఇచ్ఛారహితులై ప్రాప్తించిన వ్యవహారమాచరించుచును, విజ్ఞానమను సారథిగల్గి, స్వస్థచిత్తులై దేహమను రథమధిరోహించి ప్రపంచమున విహరింతురు.

త్వమపి ప్రాప్తవాన్ రామ వివేకమిమమాతతమ్
ప్రజ్ఞాబలేన చానేన జ్ఞానే స్వస్థోఽసి సున్దర. 30

సౌందర్యవంతుడవగునో రామా! నీకును యిట్టి మహత్తరమైన విజ్ఞానము ప్రాప్తించియే యున్నది. ఇవ్విధమున నిశ్చయించి బుద్ధిబలముచే జ్ఞానమున సుస్థిరుడవు కమ్ము.

స్వష్టాం దృష్టిమవష్టభ్య నిర్మనోగతమత్సరః
విహరాస్మిన్భువఃపీఠే పరాం సిద్ధిమవాప్స్యసి. 31

ప్రత్యక్షమగు ఆత్మదృష్టి నవలంబించి, అభిమాన మాత్సర్యరహితుడవై యీ భూతలంబున విహరింపుము. అపుడే నీవు సర్వోత్తమమగు సిద్ధిని బడసెదవు.

స్వస్థః సర్వే హితత్యాగీ దూరాలోకనవాంఛనః
పరాం శీతలతామన్తరాదాయ విహరానఘ. 32

పాపరహితుఁడవగు నో రామా! స్వస్థచిత్తుఁడవును, సర్వక్రియావర్జితుఁడవును, విషయకౌతుకముల వీక్షింప కోర్కి లేనివాడవునునై అంతఃకరణమున పరమప్రశాంతినిబడసి యీ ప్రపంచమున విహరింపుము.

శ్రీ వాల్మీకి రువాచ:—

ఇత్థం గిరా విమలయా విమలాశయస్య
రామో మునేః సపది మృష్ట ఇవావభాసే
జ్ఞానామృతేన మధురేణ విరాజితాన్తః
పూర్ణః శశాఙ్క ఇవ శీతలతాం జగామ. 33

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
జీవన్ముక్త స్థితగుణవర్ణనం నామ షట్చత్వారింశః
సర్గః ॥ 46 ॥

శ్రీ వాల్మీకి:—ఇట్లు నిర్మలాంతఃకరణుఁడగు వసిష్ఠమునీంద్రుఁడు బల్కినంత వాని నిర్మల వాక్కుచే శ్రీరామచంద్రుడు శీఘ్రముగ సంశోధితుఁడై చెన్నొందెను. మఱియు నతి మధురమగు జ్ఞానామృతముచే దీపితమగువాని యంతఃకరణము పూర్ణచంద్రుని పగిది మిగుల శీతలత్వము (ప్రశాంతి) నొందెను.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు స్థితిప్రకరణమున
జీవన్ముక్త స్థితగుణవర్ణనమను షట్చత్వారింశ
సర్గము ॥ 46 ॥



## సప్తచత్వారింశః సర్గః

శ్రీరామ ఉవాచ:—

భగవన్సర్వధర్మజ్ఞ సర్వవేదాంగపారగ
ఆశ్వస్త ఇవ తిష్ఠామి శుద్ధాభిర్భవదుక్తిభిః. 1

శ్రీ రాముడు:— ఓ మహాత్మా! సర్వధర్మజ్ఞా! వేదవేదాంగపారఁగుడవగు నో మునీంద్రా! తమ నిర్మల వచనంబులచే నేనిపుడు పూర్ణరూపమున స్వస్థుడనై యున్నాను.

ఉదారాణి వివిక్తాని పేశలాన్యుదితాని చ
శ్రోతుం తృప్తిం న గచ్ఛామి వచాంసి వదతస్తవ. 2

ఉత్తమ అర్థయుక్తములును, వర్ణ పద వాక్య ప్రకరణభేదములచే వ్యక్తములును, విచిత్ర కథాయుక్తుల సందర్భములచే అతినిపుణములును, ఆత్మతత్త్వమును ప్రకాశింపజేయుటచేతను హృదయకమలమును వికసింపజేయుటచేతను సూర్యాదులవలె సంశోభితంబులును నగు తమ శ్రేష్ఠవచనంబుల వినఁ దనివితీరకున్నది.

జాత్యా రాజససాత్త్వికాః కథనావసరాన్తరే
ఉత్పత్తిర్భవతా ప్రోక్తా శాస్త్రైః కమలజన్మనః. 3

ఓ మహాత్మా! రాజస సాత్త్విక జీవజాతులఁగూర్చిన ప్రసంగమున, బ్రహ్మదేవుని యుత్పత్తిని గూర్చి వివిన సృష్టిప్రతిపాదకములగు వేదపురాణాది ప్రమాణములచే తెలిపియున్నారు. అద్దానినే మఱల విస్పష్టముగ దెలుపగోరెద.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

బహూని బ్రహ్మలక్షాణి శంకరేంద్రశతాని చ
నారాయణసహస్రాణి సమతీతాని రాఘవ. 4

శ్రీ వసిష్ఠుడు:—ఓ రాఘవా! నేటికి నేకలక్షల బ్రహ్మలున్ను, వందలకొలది శంకరులును, వేలకొలది నారాయణులున్ను గతించిరి.

అన్యేషు చ విచిత్రేషు బ్రహ్మాండేషు చ భూరిశః
నానాచారవిహారాణి విహరన్తి సహస్రశః. 5

ఈ బ్రహ్మాండమందును, తదితరములగు విచిత్ర బ్రహ్మాండములందును, పలువిధ యాచార విచారములుగల్గిన దేవదైత్యాదులు విహరించుచున్నారు.

తుల్యకాలమనన్తేషు కాలాన్తరభవేషు చ
జగత్సు ప్రోద్భవిష్యన్తి బహూన్యన్యాని భూరిశః. 6

ఒకే కాలమునందును, భిన్నకాలములందును యేర్పడు అనేక బ్రహ్మాండములందు దేవతాదులనేకులు పలుమారులు జన్మింతురు.

తేషామబ్జోద్భవాదీనాం బ్రహ్మాండేషు దివౌకసామ్
ఉత్పత్తయో మహాబాహో విచిత్రాభ్యుత్థితా ఇవ. 7

మహాబాహువగు నో రామా! ఆ బ్రహ్మాదులచే నిర్మితములగు బ్రహ్మాండములందు దేవతాదుల యుత్పత్తి విచిత్రయింద్రజాలముచే గల్గినదానివలె యొప్పును.

కదాచిత్సృష్టయః శార్వ్యః కదాచిత్పద్మజోద్భవాః
కదాచిదపి వైష్ణవ్యః కదాచిన్మునినిర్మితాః. 8

సృష్టి యొకపుడు మహేశ్వరునిచే నొనర్పబడును. మఱొకపుడు బ్రహ్మచే గావింపబడును. అట్లనే వేఱొకపుడు విష్ణువుచేతను, మునులచేతను నొనర్పబడును.

కదాచిత్పద్మజో బ్రహ్మ కదాచిత్సలిలోద్భవః
అండోద్భవః కదాచిత్తు కదాచిజ్జాయతేఽమ్బరాత్. 9

బ్రహ్మదేవుడొకపుడు కమలమునుండియు, ఒకపుడు జలమునుండియు, అట్లే యొకపుడు అండమునుండియు, ఆకాశమునుండియు నుద్భవించును.

కస్మింశ్చిదండే త్ర్యక్షోఽర్కః కస్మింశ్చిదపి వాసవః
కస్మింశ్చిత్పుండరీకాక్షః కస్మింశ్చిత్త్ర్యక్ష ఏవ హి. 10

ఒకానొక బ్రహ్మాండమున మహేశ్వరుడున్ను, మఱొక దానియందు సూర్యుడును, ఒకదానియం దింద్రుడును, మఱొకదానియందు విష్ణువును, దేవతలందఱిపై యధికారముగల్గియుండును.

కస్యాంచిద్భూరభూత్సృష్టౌ నీరంధ్రతరుసంకటా
కస్యాంచిన్నరనీరంధ్రా కస్యాంచిద్భూధరావృతా. 11

ఒకానొక సృష్టియందీ పృథివి ప్రథమమున వృక్షములచే వ్యాప్తమైయుండెను. అట్లే మఱియొకపుడు మనుష్యులచేతను ఒకపుడు పర్వతములచేతను వ్యాప్తమైయుండెను.

భూరభూన్మృన్మయీ కాచిత్కాచిదాసీద్దృషన్మయీ
ఆసీద్ధేమమయీ కాచిత్కాచిత్తామ్రమయీ తథా. 12

ఒకానొక భూమండలము మృత్తికామయమును, వేఱొకటి శిలామయమును, సువర్ణమయమును, తామ్రమయమునునై యుండెను.

ఇహైవ కాని చిత్రాణి జగన్త్యన్యాన్యథాన్యథా
అన్యాన్యేకైకలోకాని నిర్మహాంస్యపి కానిచిత్. 13
అనన్తాని జగన్త్యస్మిన్బ్రహ్మతత్త్వమహాంబరే
అంభోధివీచిజలవన్నిమజ్జన్త్యుద్భవన్తి చ. 14

ఈ బ్రహ్మాండముననే యెన్నియో ఆశ్చర్యమయములగు జగత్తులుగలవు. అట్లే తదితర బ్రహ్మాండములును మిగుల ఆశ్చర్యమయములై యున్నవి. ఒకానొకదానియందు యొక్క సూర్యుని ప్రకాశముమాత్రమే గలదు, కొన్నిటియందు ప్రకాశమేలేదు. బ్రహ్మరూపమగు యీ మహాకాశమున సముద్రమందు తరంగములవలె యసంఖ్యాకములగు బ్రహ్మాండము లుత్పన్నమై, లయించుచున్నవి.



యథా తరంగా జలధౌ మృగతృష్ణా మరౌ యథా
కుసుమాని యథా చూతే తథా విశ్వశ్రియః పరే. 15

సముద్రమందు తరంగములవలెను, మరుభూమియందు మృగతృష్ణలవలెను, ఆమ్రవృక్షమున పుష్పములవలెను పరమాత్మయందీ ప్రపంచశోభయు గలదు.

భానోర్గణయితుం శక్యా రశ్మిషు త్రసరేణవః
ఆలోలవపుషో బ్రహ్మతత్త్వే న జగతాంగణాః. 16

సూర్యకిరణములందలి త్రసరేణువులను లెక్కింపవచ్చును గాని పరబ్రహ్మమున గల చంచల జగత్సమూహములను లెక్కింప శక్యము గాదు.

యథా మశకజాలాని వర్షాదిష్వాకులాని తు
ఉత్పత్త్యోత్పత్త్య నశ్యన్తి తథేమా లోకసృష్టయః. 17

వర్షాదిఋతువులందు పెక్కు దోమలుత్పన్నమై నశించునట్లు ఈ వివిధ జగంబులును ఉత్పన్నమై విలయమునొందుచున్నవి.

న చ విజ్ఞాయతే కస్మాత్కాలాత్ప్రభృతి చాగతాః
నిత్యాగమాపాయపరా ఏతాః సర్గపరంపరాః. 18

నిరంతరముత్పన్నమగుచు, నశించుచున్నట్టి యీ సృష్టిసమూహ మెప్పటినుండి కొనసాగుచున్నదో యెవరును యెఱుంగరు. అనగా ప్రవాహరూపమున అనాదియైయున్నదని భావము.

అనాదిమత్యోఽవిరతం ప్రస్ఫురన్తి తరంగవత్
పుర్వాత్పూర్వం కిలాభూవన్తతః పూర్వతరం యథా. 19

ఆద్యంతరహితమగు యీ సృష్టి నిరంతరము తరంగమువలెనే స్ఫురించుచున్నది. పూర్వసృష్టికిముందును సృష్టిగలదు. దాని పూర్వమున్ను సృష్టియుండియే యున్నది.

భూత్వాభూత్వా ప్రలీయన్తే ససురాసురమానవాః
సరిత్తరంగభంగ్యేవ సమస్తా భూతజాతయః. 20

నదియందు తరంగములవలె సురాసుర మనుష్యాది ప్రాణికోట్ల వివిధజాతులన్నియు ఉత్పన్నమై నశించుచున్నవి.

యథేదమణ్డం వైరించం తథా బ్రహ్మాండపంక్తయః
యాః సహస్రాః పరిక్షీణా నాడికా వత్సరేష్వివ. 21

బ్రహ్మదేవునియొక్క యీ బ్రహ్మాండమువంటి వేలకొలది బ్రహ్మాండము లెన్నియో సంవత్సరమునందు గడియలవలె యింతకుపూర్వము నశించియున్నవి.

అన్యాః సంప్రతి విద్యన్తే వర్తమానశరీరకాః
ప్రాన్తే బ్రహ్మపురస్యాన్య వితతే బ్రహ్మణఃపదే. 22

వర్తమానకాలముననున్న యితర బ్రహ్మాండ సమూహములన్నియును, బ్రహ్మపురమని చెప్పనబడు హృదయపుండరీకమందలి అతివ్యాప్తమగు బ్రహ్మపదమున స్థితిగల్గియున్నవి.

బ్రహ్మాణ్యాన్యా భవిష్యన్తి బ్రాహ్మ్యో బ్రహ్మపురశ్రియః
పునస్తాశ్చ వినంక్ష్యన్తి భూత్వాభూత్వా యథా గిరః. 23

బ్రహ్మపురశోభారూపములును బ్రహ్మదేవవిరచితములును నగు యితర బ్రహ్మాండములున్ను మఱల మఱల నుత్పన్నమయి స్థితిఁబొంది పిదప ఆకాశమందు శబ్దమువలె నశించుచున్నవి.

బ్రహ్మాణ్యాన్యా భవిష్యన్త్యః స్థితాః సర్గపరంపరాః
ఘటా ఇవ మృదోరాశావఙ్కురే పల్లవా ఇవ. 24

మృత్తికయందు ఘటమును, అంకురమందు పల్లవమునునున్నట్లే బ్రహ్మమునందు భవిష్యత్కాల సృష్టి-పరంపరలన్నియును గలవు.

యావద్బ్రహ్మచిదాకాశే తథా త్రిభువనశ్రియః
స్ఫారాకారవికారాఢ్యాః ప్రేక్ష్యమాణా న కించన. 25

తత్త్వజ్ఞానముచే బాధింపబడనంతవఱకు విశాలాకారయుక్తములగు యీ త్రిలోకములు బ్రహ్మమునందు దృశ్యమానమగుచునే యుండును.

ఉన్మజ్జన్త్యో నిమజ్జన్త్యో న సత్యా నాప్యసచ్ఛ్రియః
జడారమ్భా వితన్వన్త్యస్తా ఏవ ఖలతా ఇవ. 26

అనిర్వచనీయమును, అజ్ఞులచే బ్రహ్మమునందధ్యాస మొనర్పబడినదియు, విశాలరూపమును నగు యీ బ్రహ్మాండముత్పన్నమగుచు, నశించుచు ఆకాశమందలి లతవలె మిథ్యారూపమున నున్నది.

తరంగసమధర్మిణ్యో దృష్టనష్టశరీరకాః
సర్వాసాం సృష్టిరాశీనాం చిత్రాకారవిచేష్టితాః. 27

తరంగమువలె క్షణభంగురమైన యాకృతిగల ఈ సృష్టిసమూహమంతయు చిత్రవిచిత్రములగు యాకారములతోను ప్రాణుల విచిత్రచేష్టలతోడను కూడియున్నది.

చిత్రాకారవికారాశ్చ చిత్రరూపా హి సృష్టయః
వ్యతిరిక్తా న సర్వేషాం సమస్తాః సృష్టిదృష్టయః. 28
తత్త్వజ్ఞవిషయే రామ సలిలాదివ వృష్టయః
ఆయాన్తి సృష్టయో దేవాజ్జలదాదివ వృష్టయః. 29

చిత్రవిచిత్రములగు ఆకార వికారములతోను రూపములతోనుకూడి యొప్పుచున్న యీ సృష్టిసమూహమంతయు జ్ఞానిదృష్టియందు - జలముకంటె వృష్టి భిన్నముగానట్లు - పరమాత్మకంటె భిన్నముగా నేరదు. అజ్ఞానుల దృష్టియందు - మేఘమునుండి వృష్టివలె - పరమాత్మనుండి సృష్టి సమూహమంతయు ప్రాదుర్భవించుచున్నది.

వ్యతిరిక్తా న సర్వేషాం నమస్తాః సృష్టిదృష్టయః
వ్యతిరిక్తాద్రవామ్భోధిస్వాష్ఠీలాః శాల్మలేరివ. 30



శాల్మలీ వృక్షముయొక్క పత్రరేఖాదులావృక్షమునకు వేఱుగానట్లు యథార్థముగ జ్ఞానికి గాని, అజ్ఞానికిగాని సృష్టి బ్రహ్మముకంటె వేఱుగాదు.

ఇహ సృష్టిషు పుష్టాసు నికృష్టాసు చ రాఘవ
పరమాన్నభసో జాతా స్తన్మాత్రమలమాలికా. 31

ఓ రామా! ఈ బ్రహ్మాండమందు అవ్యాకృతాకాశమునుండి యుత్పన్నమైన స్థూలభూత నిర్మితములగు దేహాదులును, సూక్ష్మ భూతనిర్మితములగు యింద్రియాదులును, తక్కిన సమస్తపదార్థములును సూక్ష్మభూత (తన్మాత్ర) ములను సూత్రమునగ్రుచ్చబడిన మాలవలె నున్నవి.

కదాచిత్ప్రథమం వ్యోమ ప్రతిష్ఠామధిగచ్ఛతి
తతః ప్రజాయతే బ్రహ్మ వ్యోమజోఽసౌ ప్రజాపతిః. 32

ఒకప్పుడన్నిటికంటెను ప్రథమమున ఆకాశము స్థూలభావమునొందును. అద్దానినుండి బ్రహ్మదేవుఁ డుద్భవించును. కనుకనే ఆ ప్రజాపతి 'ఆకాశజుడ'నఁబడును.

కదాచిత్ప్రథమం వాయుః ప్రతిష్ఠామధిగచ్ఛతి
తతః ప్రజాయతే బ్రహ్మ వాయుజోఽసౌ ప్రజాపతిః. 33
కదాచిత్ప్రథమం తేజః ప్రతిష్ఠామధిగచ్ఛతి
తతః ప్రజాయతే కర్తా తేజసోఽసౌ ప్రజాపతిః. 34
కదాచిత్ప్రథమం వారి ప్రతిష్ఠామధిగచ్ఛతి
తతః ప్రజాయతే బ్రహ్మ వారిజోఽసౌ ప్రజాపతిః. 35
కదాచిత్ప్రథమం పృథ్వీ స్ఫారతామధిగచ్ఛతి
తతః ప్రజాయతే బ్రహ్మ పార్థివోఽసౌ ప్రజాపతిః. 36

మఱియొకపుడు ప్రథమమున వాయువు స్థూలభావమునొందును. అద్దానినుండి బ్రహ్మదేవుడావిర్భవింప నాతడు 'వాయుజుడ'నంబడును. అట్లనే యొకపుడు అగ్నియు, జలమును, పృథివియు, ప్రథమమున స్థూలభావమునొంద వానినుండి యుత్పన్నమగు ప్రజాపతియు క్రమముగ తైజసుడనియు, వారిజుడనియు, పార్థివుఁడనియు పిలువబడును.

ఇదం చత్వారి సంపీడ్య పంచమం వర్ధతే యదా
తదా తజ్జాత ఏవైష కురుతే జాగతీం క్రియామ్. 37

ఈ యైదుభూతములను రెండేసిగ విభజించి, మఱల యొక్కొక్క దానిని నాల్గుభాగములుగజేసి, అట్టి విభక్తములైనవాటి నొక్కొక్కదానిని తక్కిన నాల్గుభూతములందును జేర్చ మిగుల యధికముగనుండు తక్కిన యర్ధభాగమునుండి యుత్పన్నమగునాతడే బ్రహ్మదేవుడనఁబడును. అతడే భవిష్యత్కాల జగత్క్రియల నొనర్చును.

కదాచిదప్సు వాయౌ వా సుస్ఫారేవాపి తేజసి
స్వయం సంపద్యతేఽకస్మాత్పుమాన్ప్రకృతిభావితః. 38

ఒకొక్కప్పుడు అధికభాగయుక్తమగు జలవాయ్వగ్నులందు అయాభూతోపాధి సహితముగ తన పూర్వకాలోపాసనచే స్వయముగ నుత్పన్నమగు పురుషుడు వారిజ, తైజసాద్యాకారముల స్థితిఁబొందును.

తస్యాథ శబ్దోవదనాత్కదాచి జ్జాయతే పదాత్
కదాచిదంశాత్పృష్ఠాద్వా కదాచిల్లోచనాత్కరాత్. 39

అపుడొకసమయమున వాని ముఖమునుండియు, మఱియొకసమయమున పాదములనుండియు, ఒకప్పుడు పురోభాగమునుండియు, మఱియొకప్పుడు పృష్ఠభాగమునుండియు, అట్లే యొకప్పుడు నేత్రహస్తాదులనుండియు, నామరూపశబ్దము లుదయించును.

కదాచిత్పురుషస్యాస్య నాభౌ పద్మం ప్రజాయతే
తస్మిన్సంవర్ధతే బ్రహ్మా పద్మజోఽసౌ ప్రకీర్తితః. 40

నారాయణుడనఁబరగు యా పురుషుని నాభిప్రదేశమునుండి కమలముత్పన్నమగును. అద్దానినుండి బ్రహ్మదేవుడావిర్భవించి చెన్నొందును. కనుకనే యాతఁడు పద్మజుఁడని పేర్కొనబడెను.

మాయేయం స్వప్నవద్భ్రాంతిర్మిథ్యారచితచక్రికా
మనోరాజ్యమివాలోల సలిలావర్తసుందరీ. 41

విద్యమానమగు యా పురుషుని నాభికమలమునుండి యాతడే యెట్లుద్భవించెనని శంకింపవలదు. ఏలయన ఇదంతయు స్వప్నభ్రాంతివంటి మిథ్యా - చక్రరచనయొనర్చునదియు, చంచలమగు జలమందలి యావర్తనమువలె సుందరమును, మనోరాజ్యమువంటిదియు నగు మాయయే యగును.

కిమివాస్యాం వదజ్ఞప్తౌ కథం సంభవతీహ తే
క్వచిద్బాలమనోరాజ్యమిదం పర్యనుయుజ్యతే. 42

ఈ మాయయందు ఆశ్చర్యజనకమగు యుత్పత్తి సంభవింపకున్నచో అసంగమును, అద్వితీయమును నగు పరమాత్మయందు ద్వితీయమగు జగత్తుయొక్క యుత్పత్తి యేల సంభవము కావలెను? కాన పురుషుని నాభికమలమునుండి పురుషుడెట్లుద్భవించెనని శంకించుట బాలుని మనోరాజ్యము వంటిదే యగును.

కదాచిదమ్బరే శుద్ధే మనస్తత్త్వానురంజనాత్
సౌవర్ణం బ్రహ్మగర్భం చ స్వయమణ్డం ప్రవర్తతే. 43

ఒకప్పుడు నిర్మలాకాశమున మనశ్శక్తిచే సువర్ణాంశము నిర్మింపబడ యద్దానినుండి బ్రహ్మదేవు డుద్భవించును.

కదాచిదేవ పురుషో వీర్యం సృజతి వారిణి
తస్మాత్ప్రజాయతే పద్మం బ్రహ్మాణ్డమథవా మహత్. 44

పరమపురుషుఁడొకప్పుడు జలమందు వీర్యమునుంచ దానినుండి భూపద్మము గాని విశాలమగు బ్రహ్మాండము గాని యుత్పన్నమగును.



తస్మాత్ప్రజాయతే బ్రహ్మా కదాచిద్భాస్కరోఽప్యసౌ
కదాచిద్వరుణో బ్రహ్మా కదాచిద్వాయురణ్డజః. 45
ఏవమన్తర్విహీనాసు విచిత్రాస్విహ సృష్టిషు
విచిత్రోత్పత్తయో రామ బ్రహ్మణో వివిధాగతాః. 46
నిదర్శనార్థం సృష్టేస్తు మయైకస్య ప్రజాపతేః
భవతే కథితోత్పత్తిర్న తత్ర నియమః క్వచిత్. 47

దానినుండి బ్రహ్మదేవు డావిర్భవించును. అందుచే నాతనికి పద్మజుఁడను పేరుకలిగినది. ఒకప్పుడు పూర్వకల్పమందలి సూర్యుఁడీకల్పమున బ్రహ్మయగును. అటులనే యొకప్పుడు పూర్వకల్పమందలి వరుణ వాయువులీకల్పమున బ్రహ్మలగుదురు. ఓ రామా! పరమార్థముగ బ్రహ్మమున లేని యీ బ్రహ్మదేవుల పలువిధ విచిత్రోత్పత్తులఁగూర్చి నీకిపు డెఱింగించితిని. వీరల యుత్పత్తియందు నియమమేమియును లేదు. ఒక బ్రహ్మదేవుని యుత్పత్తిచే నీవన్యబ్రహ్మల యుత్పత్తినిగూడ నెఱుంగుము.

మనోవిజృంభణమిదం సంసార ఇతి సంమతమ్
సంబోధనాయ భవతః సృష్టిక్రమ ఉదాహృతః. 48

ఈ ప్రపంచము కేవలము మనోవిలాసమాత్రమే యనుట సిద్ధాంతమైయున్నది. ఈ విషయమును నీకు లెస్సగ బోధించు నిమిత్తమే పై సృష్టిక్రమ మెఱింగించితిని.

సాత్త్వికీప్రభృతయో యాశ్చ జాతయశ్చేత్థమాగతాః
ఇతి తే కథనాయైవ సృష్టిక్రమ ఉదాహృతః. 49

సాత్త్వికీ మున్నగు జీవజాతులున్ను యిట్లే మనోవిలాసమాత్రముననే సంభవించిన వను విషయమును తెలుపుటకొఱకే యీ సృష్టిక్రమమును నీకు వర్ణించి చెప్పితిని.

పునఃసృష్టిః పునర్నాశః పునర్దుఃఖం పునఃసుఖమ్
పునరజ్ఞః పునస్తజ్జ్ఞో బన్ధమోక్షదృశః పునః. 50

ఎంతవఱకీ మనస్సు సమూలముగ నశింపకుండునో అంతవఱకును సృష్టివినాశములును, సుఖదుఃఖములును, జ్ఞానాజ్ఞానములు, బంధమోక్షములు మఱల మఱల సంభవించుచునే యుండును.

పునః సృష్టికరాఽతీతవీతస్నేహదృశః పునః
దీపా ఇవ కృతాలోకాః ప్రశామ్యన్త్యుద్భవన్తి చ. 51

సృష్టికర్తలున్ను, భూతభవిష్యద్వర్తమాన కాలములందలి ప్రియవస్తువులయెడల స్నేహభావములున్ను దీపముచే ప్రకాశమువలె మఱల మఱల శమించుచు నుత్పన్నమగుచు నున్నవి.

దేహోత్పత్తౌ వినాశే చ దీపానాం బ్రహ్మణామపి
కాలేనాధికతాం త్యక్త్వా నాశే భేదో న కశ్చన. 52

దీపాకారముయొక్కయు, బ్రహ్మదేవుని విశాలమగు చతుర్ముఖాద్యాకారయుక్తమగు దేహముయొక్కయు ఉత్పత్తివినాశములందు కాలాధిక్యము తప్ప మఱేమియును భేదములేదు.

అనగా దీపము శీఘ్రముగ లయించును. బ్రహ్మదేవుడు ద్విపరార్ధాంతమున లయించును. ఇంతియే వీనియందలి భేదము.

పునః కృతం పునస్త్రేతా పునః సద్వాపరః కలిః
పునరావర్తతే సర్వం చక్రావర్తతయా జగత్. 53

కృత, త్రేత, ద్వాపర, కలియుగములు మఱల మఱల సంభవించుచున్నవి. చక్ర పరిభ్రమణమువలె యీ జగత్తు వచ్చుచు పోవుచునున్నది.

పునర్మన్వన్తరారమ్భాః పునఃకల్పపరంపరాః
పునఃపునః కార్యదశాః ప్రాతఃప్రాతరహో యథా. 54

మన్వంతరారంభములును కల్పపరంపరలును మఱల మఱల కలుగుచున్నవి. దిన, ప్రాతః కాలములవలె కార్యసమూహమంతయు మఱల మఱల సంభవించుచున్నది.

లోకాలోకకలాకాల కలనాకలితాన్తరమ్
పునఃపునరిదం సర్వం న కించన పునఃపునః. 55

దిన, రాత్రి, కళా*దులచే ఘటితమగు జీవుల ఆయువను కాలకల్పనచే పరిచ్ఛిన్నమైన పదార్థయుక్తమగు యీ జగత్తంతయును మఱల మఱల వచ్చుచు పోవుచున్నది.

అనాహతే ప్రతప్తేఽయఃపిణ్డేఽనలకణా ఇవ
ఇమే భావాః స్థితా నిత్యం చిదాకాశే స్వభావతః. 56

అనాహత (కొట్టబడని) తప్తలోహపిండమున అగ్నికణములుండునట్లే, చిదాకాశమున యీ సమస్తపదార్థములును స్వభావముగనే స్థితిగల్గియున్నవి.

కదాచిదనభివ్యక్తం కదాచిద్వ్యక్తిమాగతమ్
ఇదమస్తి పరే తత్త్వే సర్వం వృక్ష ఇవార్తవమ్. 57

వృక్షమునందాయా ఋతువుల పుష్పఫలాదులుండునట్లు, ఒకప్పుడు వ్యక్త[illegible]మును, మఱియొకపుడవ్యక్తరూపమును పొందునట్టి యీ జగత్తంతయును పరమాత్మయం[illegible]

చిత్స్పన్ద ఏవ సర్వాత్మా సర్వదైవేదృశాకృతిః
యదస్మాజ్జాయతే సర్గో ద్విన్దుత్వమివ లోచనాత్. 58

సర్వాత్మకమగు చైతన్యముయొక్క వివర్తమున్నూ చి[illegible]రూప[illegible]యగును. అద్దానినుండి దృష్టియేర్పడుట నేత్రదోషముచే రెండు చంద్రులగుపడుటవంటిదే యగును.

చితః సర్వాః సమాయాన్తి సంతతాః సృష్టిద[illegible]యః
తత్థాస ఏవావ్యతత్థాసభాశ్చన్ద్రాదివ మరీచయః 59

---

* ముప్ప[illegible]కాష్ఠములొక ముహూర్తము. అందలి పంద్రెండవ భాగము క్షణము. క్షణములోని ముప్పదవభాగము కళ.



చైతన్యమునుండియే సృష్టియంతయు నావిర్భవించుచున్నది. అట్టి చైతన్యమందే స్థితిగల్గియున్నను, చంద్రకిరణములు చంద్రునికంటె వేఱుగ గన్పించునట్లు, అయ్యదద్దానికి వేఱుగ గన్పట్టుచున్నది.

న కదాచన సంసారః కిలాయం రామ సత్సదా
సర్వశక్తావసంసారశక్తితా విద్యతే యతః. 60

ఓ రామా! ఈ ప్రపంచమెపుడును సత్యముగాదు. ఏలయన సర్వశక్తిమంతుడగు పర[illegible]సంగత్వమును, అద్వితీయత్వమును సదా స్వభావములై యొప్పుచున్నవి.

న చైవేదం కదాచిత్తు సాధో జగదనీదృశమ్
సర్వశక్తా హి సంసారశక్తితా విద్యతే యతః. 61

సాధువగు నో రామా! ఇవ్విధమున జగత్తు చిత్స్వభావమున కెపుడును భిన్నముగాదు. ఏలన సర్వశక్తిమంతుడగు పరమాత్మయందే జగచ్ఛక్తిగలదు.

మహాకల్పావధిః కాలేన సంసారితయేద్ధయా
న భవిష్యతి సంసార ఇదానీమితి యుజ్యతే. 62

అధిష్ఠానమగు చైతన్యముచే ప్రకాశితమగు ప్రపంచత్వమును, కాలముచే నుపలక్షితమగు యీ జగత్తున్ను, వైజ్ఞానికమును మోక్షమని పేర్కొనబడినదియు నగు ప్రళయమువఱకే యుండును గాని అటుపిదప యుండదనుటయే యుక్తము.

జ్ఞదృష్ట్యా సర్వమేవేదం బ్రహ్మైవేతి మహామతే
నాస్తి సంసార ఇత్యేతదుపపద్యత ఏవ చ. 63

మహామతివగు నో రామా! జ్ఞానియొక్క దృష్టియందీ జగత్తంతయును బ్రహ్మమేయగును. కాన నివ్విధముగగూడ ప్రపంచము లేదనుటయే యుక్తము.

అజ్ఞదృష్ట్యా త్వవిచ్ఛిన్న సంసారత్వాదనారతమ్
నిత్యా సంసారమాయేయం మిథ్యాపీహోపపద్యతే. 64

అజ్ఞానియొక్క దృష్టియందీ ప్రపంచము ప్రవాహరూపమున నిరంతరముండియే యుండును గాన మిథ్యయైనను యీ సాంసారికమాయ నిత్యమైనదే యగును.

పునఃపునశ్చ భావిత్వాన్న కదాచిదనీదృశమ్
జగదిత్యేతదిత్యుక్తం న మృషా రఘునన్దన. 65

ఓ రామా! మఱల మఱల గలుగునదగుటచే జగత్తు యిదేస్వభావము గల్గియున్నది గాని భిన్నముకాదన. మీమాంసకుల సిద్ధాంతముచేగూడ ఈ జగత్తు (ప్రవాహరూపమున) సత్యమైనదనుటయు తథ్యమే గాని యసత్యముగాదు.

అనారతపతద్రూపా దిశో దృష్టా వినశ్వరాః
వినాశీదం జగత్సర్వమితి కిం నోపపద్యతే. 66

క్షణవిధ్వంసస్వరూపములును, నశ్వరములునగు విద్యుత్తు మొదలుగాగల పదార్థములు దృశ్యమానములగుచున్నవి. కాన, యీ జగత్తు నాశవంతమైనది — ఇవ్విధమున అజ్ఞులు దృష్టివైచిత్ర్యము ననుసరించి తమ తమ ప్రక్రియానిర్వహణార్థము కల్పించిన (బౌద్ధాదులచే కల్పితమగు క్షణిక పరమాణ్వాది) వ్యవహారమున్ను వారిదృష్టి ననుసరించి యుక్తమే యగునుగదా!

సర్వత్రోదితచన్ద్రార్కా-దిశో దృష్టాః స్థిరాచలాః
అవినాశి జగత్సర్వమిత్యప్యవితథోపమమ్. 67

అట్లే సర్వత్ర యుదయమగు చంద్రసూర్యులయొక్క నిర్మలప్రకాశముచే వ్యాప్తమగు దిక్కులందు భూపర్వతాదులు స్థిరముగనుండుటఁగాంచి స్వసత్తచే నీ జగత్తెల్లపుడును సత్యమైనదేయని వచించు సాంఖ్యాదుల కల్పనయున్ను యుక్తమేయగును.

న తదస్తి న యత్తస్మిన్నేకస్మిన్వితతాత్మని
సంకల్పకలనాజాలమనాఖ్యే నోపపద్యతే. 68

యథార్థముగ ఏకమును, అనంతమును, అనిర్వచనీయమును నగు పరమాత్మయందు సంకల్పిత వస్తుజాలమెద్దియును లేదు. బ్రహ్మమున సంకల్పజాలమే సిద్ధింపనేరదు.

పునఃపునరిదం సర్వం పునర్మరణజన్మనీ
పునః సుఖం పునర్దుఃఖం పునః కరణకర్మణీ. 69

ఈ సమస్తమున్ను మఱల మఱల సంభవించుచునే యున్నది. జననమరణములు, సుఖదుఃఖములు, కరణకర్మలు మున్నగునవియు మఱల మఱల కలుగుచునున్నవి.

పునరాశాః పునర్వ్యోమ పునరమ్భోదయోఽద్రయః
అభ్యుదేతి పునఃసృష్టిః ఖపదర్కప్రభా యథా. 70

ఆకాశమున సూర్యప్రకాశము మఱల మఱల యుదయమగునట్లు, సమస్త ఆశలును, ఆకాశ, సముద్ర, పర్వతములును, సృష్టియంతయును మఱల మఱల యుత్పన్నమగుచున్నవి.

పునర్దైత్యాః పునర్దేవాః పునర్లోకాన్తరక్రమాః
పునః స్వర్గాపవర్గేహాః పునరిన్ద్రః పునః శశీ. 71
పునర్నారాయణో దేవః పునర్దనుసుతాదయః
పునరాశాచలచ్చారు చన్ద్రార్కవరుణానిలాః. 72

దేవతలు, దైత్యులు, ఇంద్రచంద్రాదులు, విష్ణుభగవానుడు, దానవులు మున్నగువారును, దిక్కులందు చంచలముగను మనోహరముగను నుండునట్టి సూర్య చంద్ర వరుణ వాయ్వాదులును మఱల మఱల నుత్పన్నమగుచున్నారు. లోకాంతరనిర్మాణము, స్వర్గమోక్షక్రియలును మఱల మఱల సంభవించుచున్నవి.

సుమేరుకర్ణికాకాన్తా సహ్యకేసరశాలినీ
పున్నాగస్ఫీతోదరోదేతి రోదసీనలినీ పునః. 73



సహ్యపర్వతమను కేసరములచే శోభితమును, సుమేరుపర్వతమను అందమైన మొగ్గ గలదియు, ప్రాణులపుణ్యమను సుగంధమును, భోగమను మకరందమును గల్గియున్నదియు, విశాలాకాశమను మధ్యభాగముగలదియు నగు పృథివియను కమలము పలుమారు లుత్పన్నమగుచున్నది.

వ్యోమ కాననమాక్రమ్య వల్గత్యంశునఖోత్కరైః
తమః కరిఘటాభేత్తుం పునర్భాస్కరకేసరీ. 74

[illegible]మను యరణ్యముపై నాక్రమణముసల్పి, కిరణములను తన నఖములచే నంధకారమను గజసమూహమును భేదించివైచు సూర్యుడను సింహము మఱల మఱల ప్రాదుర్భవించుచునే యున్నది.

పునరిన్దుశ్చలత్స్వచ్ఛ మంజరీసున్దరైః కరైః
కరోత్యమృతమాహ్లాది దిగ్వధూముఖమండలమ్. 75

చంచలమును, స్వచ్ఛమునగు లతవలె సుందరమైయున్న కిరణములను హస్తములచే చంద్రుడు దిగ్వనితాముఖమండలమునందలి యాభూషణమును, సర్వజీవులకును సుఖప్రదమును నగు అమృతమును మఱల మఱల వర్ధిల్లజేయుచున్నాడు.

పునః స్వర్గతరోః పుణ్యక్షయ వాతసమీరితాః
పతన్తీహ విసున్నాఙ్గాః పుణ్యకృత్పుష్పరాశయః. 76

స్వర్గమను వృక్షమునుండి పుణ్యక్షయమను వాయువుచే కదల్పబడి స్వర్గవాసులను పుష్పసమూహములు ఛిన్నభిన్నములైన యంగములు గలవియై భూమిపై మఱల మఱల పడుచున్నవి.

పునః కార్యక్రియాపక్షైః సంసారారమ్భనామకమ్
కించిత్పటపటం కృత్వా యాతి కాలకపింజలః. 77

కార్యక్రియలను రెక్కలుగల్గి, సృష్టికాలమను కపింజలపక్షి మెల్లగ జగదారంభమను పటపటాశబ్దమొనర్చుచు పలుమారు వచ్చుచు పోవుచున్నది.

పునరిన్ద్రదికే యాతే సజ్జమాస్థాయ కేవలమ్
ఆయాత్యపరదేవేన్ద్ర షట్పదః స్వర్గపఙ్కజమ్. 78

పూర్వేంద్రుని యధికారము పూర్తికాగా, నూతనమన్వంతర అధికారీదేవతాగణంబులచే సుసజ్జితుఁడై, ఐరావతాదులపై నారూఢుడై ద్వితీయేంద్రుడను భ్రమరము స్వర్గమను కమలముపై పలుమారు లాసీనమగుచున్నది.

పునః కాలంకృతా పూతం కలుషీకురుతే కలిః
సచక్రిణమివామ్భోధిం ప్రవృద్ధోఽపరానిలః. 79

శయనించుచున్న విష్ణుభగవానుడుగల క్షీరసముద్రమును ప్రళయవాయువులు కంపితమొనర్చునట్లు, కలియుగము ప్రవేశించి కృతయుగముచే నతి పవిత్రవంతమగు కాలమును మఱల మఱల యపవిత్ర మొనర్చుచున్నది.

పునః కాలకులాలేన కృతభూతశరావకమ్
చక్రమావర్త్యతే వేగాదజస్రం కల్పనామకమ్. 80

కాలమను కులాలునిచే నిర్మింపబడిన ప్రాణులను మృణ్మయ పాత్రను ధరించిన కల్పమను చక్రము నిరంతరమతివేగమున పలుమార్లు పరిభ్రమించుచున్నది.

పునర్నీరసతామేతి జగదన్తశుభస్థితి
అభ్యాసీభూతసంకల్పం సంశుష్కమివ కాననమ్. 81

ఎవనికేవిషయమున పూర్వకాలాభ్యాసము గల్గియుండునో, తదనుకూలమగు సంకల్పముచే నుదితమగునదియు శుభస్థితిరహితమును నగు యీ జగత్తు శుష్కవనమువోలె ధర్మరసహీనమై మఱల మఱల యొప్పుచున్నది.

పునరర్కగణేష్వగ్ని దగ్ధానన్తకళేవరమ్
సర్వభూతాస్థిసంపూర్ణం జగదేతి శ్మశానతామ్. 82

సూర్యులందలి యగ్ని ప్రాణికోట్లశరీరములను మఱల మఱల భస్మీభూత మొనర్చుచున్నది. జీవులందఱియొక్క అస్థులచే పరిపూర్ణమై యీ జగత్తు మాటిమాటికి శ్మశానసాదృశ్యము నొందుచునే యున్నది.

పునః కులాచలాకార పుష్కరావర్తవర్షణైః
నృత్యద్భవ బృహత్ఫేనాం యాత్యేకార్ణవతాం జగత్. 83

కులపర్వతములవంటి యాకృతిగల పుష్కరావర్తమనెడి వర్షధారలతోఁగూడి నృత్యమొనర్చునట్టి సృష్టిసంహారకుఁడగు రుద్రుడను బృహదాకారయుక్తమగు ఫేనముగలదై యీ జగత్తు మఱల మఱల సముద్రరూపముఁ జెందుచున్నది.

పునః సంశాన్తవాయ్వంబురిక్తం సకలవస్తుభిః
తదపూర్వమివాకాశం జగదాయాతి శూన్యతామ్. 84

అట్లే లయమునుబొందిన జలవాయువులుగలదై సర్వవస్తుశూన్యమై, యీ జగత్తు అపూర్వమగు యాకాశమువలె మఱల మఱల శూన్యత్వముఁ జెందుచున్నది.

పునః కతిపయాః భుక్త్వా సమాః సమరసాశయః
జీవితం జీర్ణయాతన్వా పునః స్వాత్మని లీయతే. 85

సమరసస్వరూపమగు మనస్సు కొన్ని వత్సరములవఱకును తన జీవితముపభోగించి శిథిలాకృతి గలదై మఱల తనస్వరూపమందు లీనమగును.

పునరన్యేన కాలేన తథైవ జగతాం గణాన్
మనస్తనోతి వై శూన్యే గంధర్వనగరం యథా. 86

పిమ్మట కొంతకాలమున కీమనస్సు శూన్యప్రదేశమున గంధర్వనగరమువలె యవ్విధముననే జగత్సమూహముల మఱల విస్తరించును.



పునః సర్గసమారంభః ప్రలయే సర్వసంభవః
సర్వం పునరిదం రామ చక్రవత్పరివర్తతే. 87

ఓ రామా! ప్రళయమైన వెనుక మఱల సృష్టి యారంభమగును. అపుడు సకలపదార్థములును మఱల యుత్పన్నమగును. అపుడే యీ జగత్తంతయు చక్రమువలె మఱల పరిభ్రమింపదొడఁగును.

కిమేతస్మిన్మహామాయాడమ్బరే దీర్ఘశంబరే
రామ సత్యమసత్యం వా నిర్ణేయం యదిహోచ్యతే. 88

ఓ రామా! దీర్ఘభ్రమరూపమగు ఈ మహామాయయొక్క యాడంబరమున, నిర్ణయింపయోగ్యమగు సత్యవస్తువుగాని అసత్యవస్తువుగాని ఎయ్యది గలదు? (ఏదియు లేదని యర్థము.)

దాశూరాఖ్యాయికేవేయం రామ సంసారచక్రికా
కల్పనారచితాకారా వస్తుశూన్యా న వస్తుతః. 89

ఓ రామా! కల్పనచే రచింపబడిన యాకారముగలదియు, వస్తుశూన్యమును నగు ఈ సంసారచక్రము దాశూరాఖ్యాయికవంటిదే యగును. యథార్థముగ నియ్యది లేనిదేయగుచున్నది.

అవిరలమిదమాతతం సికతైః
రసదుదితైరపి తైర్ద్విచన్ద్రికలైః
విరచితమసతానువన్న సత్యం
జగదిహ తేన విమూఢతా కిముత్థా. 90

ఇత్యార్షే వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
జగద్భావనిర్ణయయోగోపదేశో నామ
సప్తచత్వారింశః సర్గః ॥ 47 ॥

అజ్ఞానముచే నావిర్భూతములును, నేత్రదోషముచే నుదయించుచు ద్విచంద్రభ్రమ తుల్యములునగు వికల్పములచే నీ జగత్తు నిరంతరము వ్యాప్తమైయున్నది. అవిద్యమానమగు కర్తచే నిర్మింపబడిన ఇయ్యది అధిష్ఠానమగు బ్రహ్మముకంటె భిన్నము కాదు. కాన జగద్రూపమున నియ్యది అసత్యమే యగును. ఓ రామా! ఈ జగత్తు సత్యమను మూఢబుద్ధి నీకేల గల్గినది?

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు స్థితిప్రకరణమున
జగద్భావనిర్ణయయోగోపదేశమను
సప్తచత్వారింశ సర్గము ॥ 47 ॥

# అష్టచత్వారింశః సర్గః.

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

క్రియావిశేషబహులా భోగైశ్వర్యహతాశయాః
నాపేక్షన్తే యదా సత్యం న పశ్యన్తి శఠాస్తదా. 1

శ్రీ వసిష్ఠుడు:—ఓ రామా ! క్రియాబాహుళ్యముగలవారును, భోగైశ్వర్యములచే నశించిన బుద్ధిగలవారును, స్వపరవంచకులును నగువారు సత్యవస్తువగు పరమాత్మను జూడజాలరు.

యే తు పారంగతాబుద్ధేరింద్రియైర్న వశీకృతాః
త ఏనాం జాగతీం మాయాం పశ్యన్తి కరబిల్వవత్. 2

బుద్ధి నతిక్రమించినవారును, ఇంద్రియములచే వశీభూతులుకానివారును నగు మహాత్ములీ జగన్మాయను, అరచేతియందలి బిల్వఫలమువలె స్పష్టముగ గాంతురు.

తుచ్ఛాం తాం జాగతీం మాయాం దృష్ట్వా జీవో విచారవాన్
అహంకారమయీం మాయాం త్యజత్యహిరివ త్వచమ్. 3

విచారశీలురు తుచ్ఛమును అహంకారమయాత్మకమును నగు యీ జగన్మాయను బాగుగ నెఱింగి సర్పము కుబుసమును త్యజించునట్లు యద్దానిని త్యజించివై చెదరు.

అసక్తతాం తతోఽభ్యేత్య పునా రామ న జాయతే
క్షేత్రేష్వపి చిరం తిష్ఠన్బీజం దగ్ధమివాగ్నినా. 4

అట్టి జీవులీప్రపంచమున యాసక్తిగల్గియుండరు గాన ప్రాపంచిక క్షేత్రములందు వ్యవహరించుచున్నను బంధమున తగుల్కొనక యుందురు. అగ్నిదగ్ధబీజమువలె మఱల వారు జన్మింప నేరరు.

ఆధివ్యాధిపరీతాయ ప్రాతర్వాద్యవినాశనే
ప్రయతన్తే శరీరాయ హితమజ్ఞాస్తునాత్మనే. 5

శారీరిక మానసిక వ్యథలచే పూర్ణమును, నేడో రేపో నశించునదియు నగు దేహముయొక్క హితముకొఱకే అజ్ఞాని యత్నించునుగాని ఆత్మకొఱకుగాదు.

త్వమప్యజ్ఞవదజ్ఞస్య శరీరస్య సమీహితమ్
మా సంపాదయ దుఃఖాయ భవాత్మైకపరాయణః. 6

కాన నోరామా ! అజ్ఞునివలె నీవు దుఃఖప్రదములగు దేహాభీష్టపదార్థముల సంచయ మొనర్పక కేవలమాత్మపరాయణుడవు కమ్ము.

శ్రీరామ ఉవాచ:—

దాశూరాఖ్యాయికేవేయం సుఖసంసారచక్రికా
కల్పనారచితాకారా వస్తుశూన్యేతి కిం ప్రభో. 7



శ్రీరాముడు:—ఓ మహాత్మా ! విషయసుఖార్థము కల్పింపబడిన యాకారముగలదియు, వస్తు శూన్యమును నగు యీ సంసారచక్రము దాశూరాఖ్యాయిక వంటిదని తాము తెలిపియుంటిరి. ఆ యాఖ్యాయిక నెఱింగింపవేడెద.

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

జగన్మాయాస్వరూపస్య వర్ణనావ్యపదేశతః
దాశూరాఖ్యాయికాం రామ వర్ణ్యమానాం మయా శృణు. 8

శ్రీ వసిష్ఠుడు:—ఓ రామా ! జగన్మాయాస్వరూపమును తెలుపునిమిత్తము యీ దాశూరాఖ్యాయికను నీకు వర్ణించిచెప్పెద వినుము.

అస్త్యస్మిన్వసుధాపీఠే విచిత్రకుసుమద్రుమః
మాగధో నామ విఖ్యాతః శ్రీమాఞ్జనపదో మహాన్. 9

ఓ రామచంద్రా ! ఈ భూతలమున విచిత్ర పుష్పవృక్షసహితమును ధన-సమృద్ధియుక్తమును నగు మగధయను ప్రసిద్ధమగు జనపదమొండు గలదు.

కదంబవనవిస్తార లీలావలితజఙ్గలః
విచిత్రవిహగవ్యూహ సర్వాశ్చర్యమనోహరః. 10

ఆ ప్రదేశము క్రీడార్థము నెలకొల్పబడిన కదంబవనములచే పరివేష్టింపబడిన యరణ్యములు గలదియు, వివిధ పక్షిసమూహములతోను పలువిధ ఆశ్చర్యములతోను కూడి మనోహరమై యొప్పుచున్నదియునై యుండెను.

సస్యసంకటసీమాన్తః పురోపవనమండితః
కమలోత్పలకల్హార పూర్ణసర్వసరిత్తటః. 11

అద్దాని సీమాంతప్రదేశము సస్యసమృద్ధివంతమై యుండెను. దాని యంతఃపురములు ఉపవనములచే శోభించుచుండెను. మఱియు నద్యాది శ్వేత, నీల, రక్తకమలముచే నదీతటములన్నింటిని పరిపూర్ణమొనర్చునదై యుండెను.

ఉద్యానదోలావిలసల్లలనా గేయఘుంఘుమః
నిశోపభుక్తకుసుమ నీరన్ధ్రవిశిఖావనిః. 12

వనవాటికయందలి యూయెలలపై విలాసమొనర్చు స్త్రీల గానముచే నప్రదేశము శబ్దాయమానమై యుండెను. మన్మథశరంబులవంటి పుష్పములచే యద్దాని భూతలము పూర్ణమై యొప్పుచుండెను.

తత్రైకస్మిన్గిరితటే కర్ణికారసమాకులే
కదలీఖండనీగంధ నీపగుల్మవిరాజితే. 13

పుష్పౌఘసుస్ఫూర్జదనిలే కేసరారుణధూలిని
కారణ్డవకృతారావే రసత్సరససారసే. 14

అజ్జనపదంబున కదళీ కదంబ వృక్షములచే పూర్ణమును, వివిధతరుగుల్మాదులచే శోభితమును, పుష్పసమూహములందు శబ్దమొనర్చుచున్న వాయువుకలదియు, పుష్ప కేసరములచే రక్తవర్ణయుక్తమును, సారసాదిపక్షుల శబ్దముతోఁగూడినదియు నగు నొకపర్వతముగలదు.

తస్మిన్నగవరే పుణ్యే విచిత్రవిహగద్రుమే
కశ్చిత్పరమధర్మాత్మా మునిరాసీన్మహాతపాః. 15

విచిత్రములైన పక్షులును, వృక్షములునుగలదియు, మిగుల పవిత్రవంతమునునగు నా పర్వతముపై పరమధార్మికుడును మహాతపస్వియు నగు నొక ఋషిసత్తముఁడు వసించుచుండెను.

దాశూరనామామహాతా తపోయోగేన సంయుతః
కదంబవృక్షవాస్తవ్యో వీతరాగో మహామతిః. 16

మహాతపస్సంపన్నుడును, కదంబవృక్షవాసియు వీతరాగుడును నగు నమ్మహాముని దాశూరుఁడనఁబరగెను.

శ్రీ రామ ఉవాచః—

అసౌ తపస్వీ భగవన్విపినే కేన హేతునా
కథం చాప్యవసత్పృష్ఠే కదంబస్య మహాతరోః. 17

శ్రీ రాముడు:—ఓ మునీంద్రా! అయ్యరణ్యమందలి విశాల కదంబవృక్షముపై నా తాపసి యేల వసించుచుండెను?

శ్రీ వసిష్ఠ ఉవాచః—

శరలోమేతి విఖ్యాతః పితా తస్య బభూవ హ
రామాఽపర ఇవబ్రహ్మ తస్మిన్నేవావసద్గిరౌ. 18
తస్యాసావేకపుత్రోఽభూత్కచో దేవగురోరివ
తేన సార్థం సపుత్రేణ నీతవాఞ్జీవితం వనే. 19
అథాసౌ శరలోమాత్ర భుక్త్వా యుగగణం యయౌ
త్యక్తదేహః సురాగారం ముక్తనీడః ఖగో యథా. 20
ఏక ఏవ వనే తస్మిన్దాశూరః ప్రరురోద హ
దశాపనీతపితృకః కరుణం కురరో యథా. 21
మాతాపితృవియోగేన శోకసంతాపితాశయః
మ్లానిమభ్యాయయౌ నూనం హేమన్త ఇవ పఙ్కజమ్. 22
బాలోఽసావతి దీనాత్మా వనదేవతయా వనే
ఇత్థమాశ్వాసితో రామ తదాఽదృశ్యశరీరయా. 23

శ్రీ వసిష్ఠుడు:—ఓ రామా! వినుము. శరలోముఁడని ప్రసిద్ధికెక్కిన యాతని తండ్రి అపరబ్రహ్మవోలె నా పర్వతముపై వసించుచుండెను. శరలోముని యేకైకపుత్రుడగు దాశూరుడు



బృహస్పతి పుత్రుడగు కచునివలె యలరుచుండె. తనయునితోఁగూడ నాతాపసి యావనమున తన జీవితమును గడపుచుండెను. ఇట్లు కొన్నివత్సరములు గడచినవెనుక నా శరలోముడు శరీరమును త్యజించి, గూటినివిడిచి పక్షి యాకసమునకుఁజనునట్లు స్వర్గమునకుఁజనెను. అపుడు దాశూరుడు అవ్వనమున కురర (గోరువంక) పక్షివోలె కరుణాక్రంద మొనర్చుచుండెను. ఏకాకియై మాతాపితరుల వియోగముచే దుఃఖాక్రాంతచిత్తుడై హేమంతకాలమందలి కమలమువలె మ్లానిఁబొందెను. ఓ రామా! అంత యతి దీనచిత్తుఁడగు నాబాలునిఁగాంచి అదృశ్యశరీరులగు వనదేవతలు వాని కిట్లు ధైర్యమును గొల్పిరి—

ఋషిపుత్రమహాప్రాజ్ఞ కిమజ్ఞ ఇవ రోదిషి
సంసారస్య న కస్మాత్త్వం స్వరూపం వేత్సి చంచలమ్. 24

మహాప్రాజ్ఞుఁడవగు నోఋషి తనయా! అజ్ఞానివలె నీవేల దుఃఖించుచున్నావు? ఈ ప్రపంచముయొక్క చంచలస్వరూపమును నీవేల గుర్తెఱుంగకుంటివి?

సర్వదైవేదృశీ సాధో సంసారే సంసృతిశ్చలా
జాయతే జీవ్యతే పశ్చాదవశ్యం చ వినశ్యతి. 25

ఓ సాధూ! ఈ ప్రపంచమున జీవాదులసృష్టి చంచలమై యావిర్భవించుచు, స్థితిగల్గి, మఱల అవశ్యము వినాశమొందుచుండును.

యద్యత్కించిద్ధి దృశ్యదృశి బ్రహ్మాదికమిదం మునే
గన్తవ్యం తేన సర్వేణ వినాశో నాత్ర సంశయః. 26

ఓ మునీ! ఈ వ్యవహారదృష్టియందు ప్రసిద్ధులగు బ్రహ్మాదులందఱుకూడ వినాశమొందెదరు. ఇందు సంశయమేమియును లేదు.

తదర్థం మా కృథా వ్యర్థం విషాదం మరణే పితుః
అవశ్యభావ్యస్తమయో జాతస్యాహర్పతేరివ. 27

కాన నీజనకుని మరణవిషయమై నీవు వ్యర్థముగ శోకింపజనదు. సూర్యునివలె యుదయమునుపొందు ప్రతిదిన్ని తప్పక యస్తము నొందుచుండును.

అశరీరామితి శ్రుత్వా గిరమారక్తలోచనః
ధైర్యమాసాదయామాస శిఖండీ స్తనితాదివ. 28

అరుణనేత్రుఁడగు దాశూరబ్రాహ్మణుడా యశరీరవాణి నాలించి మేఘశబ్దమును వినిన మయూరమువలె ధైర్యమునొందెను.

ఉత్థాయావశ్యకం కృత్వా పాశ్చాత్యం పితురాదరాత్
చకార తపనే బుద్ధిం దృఢాముత్తమసిద్ధయే. 29

పిమ్మట యాతడు లేచి పితృమరణానంతరమవశ్య మాచరింపదగిన క్రియలనొనర్చినవాడై యంత తపంబొనరింప నిశ్చయించెను.

బ్రాహ్మేణ కర్మణా తస్య విపినే చరతస్తపః
అనన్తసంకల్పమయం శ్రోత్రియత్వం బభూవ హ. 30

బ్రాహ్మణధర్మమగు తపంబాచరించుచుండ నాతనికి శ్రోత్రియత్వము (వేదాధ్యయనము, తదర్థవిచారణ, తదనుష్ఠాననిష్ఠత్వము) సిద్ధించెను.

అజ్ఞాతజ్ఞేయబుద్ధేస్తు శ్రోత్రియస్య తయాతయా
న విశశ్రామ చేతోఽన్య పవిత్రేఽపి ధరాతలే. 31

జ్ఞేయమగు బ్రహ్మము నెఱుంగనేరని శ్రోత్రియుండగు నా దాశూరుని చిత్తము శుద్ధ్యశుద్ధ్యాది వికల్పనలచే పవిత్రమగు ధరాతలంబున విశ్రాంతి నొందకుండె.

కేవలం సర్వమేవేదమపి శుద్ధం ధరాతలమ్
అశుద్ధమివ పశ్యన్స న రేమే క్వచిదేవ హి. 32

పృథ్వీతలమంతయు శుద్ధముగానున్నను, దాని నాతడశుద్ధముగనే గాంచుచు నెచటను ప్రీతిఁగొనకయుండెను.

అథ సంకల్పయామాస స్వసంకల్పనయైవ సః
వృక్షాగ్రమేవ సంశుద్ధం స్థితిస్తత్రోచితా మమ. 33
తదిదానీం తపస్తప్స్యే తపసా యేన శాఖిషు
ఖగవత్థ్సితిమాప్నోమి శాఖాసు చ దలేషు చ. 34

తదుపరి యాతడు స్వకల్పనచే వృక్షాగ్రభాగమే శుద్ధమైనదనియు, అచటనే యుండుట యోగ్యమైనదనియు యెంచి, వృక్షశాఖలపైనను, పత్రములపైనను పక్షివలె స్థితిఁబొందుటకై తపం బొనర్పనెంచెను.

ఇతి సంచిన్త్య సంజ్వాల్య హుతాశమతిభాస్వరమ్
జుహావ తస్మిన్నోత్కృత్య మాంసం స్వస్కన్ధభిత్తితః. 35

కాని యా తపంబుచే తన సంకల్పము శీఘ్రముగ నీడేరకుండుటగాంచి, అగ్నిని ప్రజ్వలింపజేసి భిత్తివలెనున్న తన భుజమునుండి మాంసమునుకోసి హోమముచేయ నారంభించెను.

అథ గీర్వాణవృన్దస్య సమగ్రాగలభిత్తయః
మన్ముఖత్వేన మాయాన్తు విప్రమాంసేన భస్మతామ్. 36
ఇతి సంచిన్త్య భగవాన్సప్తార్చిస్తస్య దేవతా
పురో బభూవ దీప్తాంశుర్దీప్తాంశుర్వ్యాక్సతేరివ. 37
ఉవాచ వచనం ధీరం కుమారాభిమతం వరమ్
గృహాణ స్థాపితం సాధో కోశాత్కోశాన్మణిం యథా. 38

'దేవతల కంఠప్రదేశమగు నాశరీరమను ముఖము ('అగ్నిముఖా వై దేవాః') ద్వారా యీ బ్రాహ్మణుని మాంసము భస్మమవకుండుగాక' యని నిశ్చయించి అగ్నిభగవానుడు తన యధిష్ఠాన దేవుడగు సూర్యునివంటి యాకృతిని ధరించి, బృహస్పతియెదుట సాక్షాత్ సూర్యభగవానునివలె,



ఆ దాశూరబ్రాహ్మణుని యెదుట ప్రత్యక్షమై యిట్లు ధైర్యవచనంబులఁ బల్కెను — సాధువగు నో బ్రాహ్మణ కుమారా! ఆకాశకోశమున నెలకొల్పబడిన మణినివలె నీవభిమత వరంబును గైకొనుము.

ఇత్యుక్తవన్తమనల మర్ఘ్యపుష్పేణ శోభినా
సంపూజ్య స్తుతివాదేన ప్రాహ విప్రకుమారకః. 39
భగవన్ భూతపూర్ణాయా భువః పావనమండలమ్
నాప్నోమి తేన వృక్షాణాముపరి స్థితిరస్తు మే. 40
ఇత్యుక్తే మునిపుత్రేణ సర్వదేవముఖం శిఖీ
ఏవమస్తు తవేత్యుక్త్వా జగామాన్తర్ధిమీశ్వరః. 41

అని యిట్లుబల్కిన యగ్నిదేవుని అర్ఘ్యపుష్పస్తోత్రాదులచే పూజించి యా బ్రాహ్మణ బాలకుఁడిట్లనియె — ఓ మహాత్మా! ప్రాణులచే పరిపూర్ణమగు యీ ప్రథ్వీతలము పరిశుద్ధము గానందున నేను వృక్షముపై స్థితిఁబొందు నట్లనుగ్రహింపుము? శరలోముని పుత్రుఁడగు దాశూరు డిట్లు బల్కినంత దేవముఖరూపుఁడగు అగ్నిదేవుడు 'అట్లే యగుగాక' యని వచించి యంతర్ధానమయ్యెను.

తస్మిన్నన్తర్హితే దేవే క్షణాత్సాన్ధ్య ఇవాంబుజే
పూర్ణకామః కుమారోఽసౌ పూర్ణేందురివ చాబభౌ. 42

సంధ్యాకాలమందలి కమలమువలె నా యగ్నిదేవుడు క్షణములో లుప్తముకాగా పూర్ణకాముడగు నా బ్రాహ్మణకుమారుఁడపుడు నిండుచంద్రుని పగిది శోభించెను.

అధిగతాభిమతాననమండల
ద్యుతిభరేణ జహాస నతుష్టిమాన్
శశినమాప్తకలాకులమంబుజం
వికసితం చ సితస్మితశోభినా. 43

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
దాశూరోపాఖ్యానే దాశూరవరప్రదానవర్ణనం
నామాష్టచత్వారింశః సర్గః ॥ 48 ॥

ఇష్టమనోరథప్రాప్తిచే మిగుల ప్రసన్నుడైన యా దాశూరబ్రాహ్మణుడంత చిరునగవుచే శోభించుచున్న ముఖమండలముయొక్క కాంతులచే కిరణయుక్తమగు పూర్ణచంద్రుని, వికసితకమలమునుగూడ నిర్జించెను.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు స్థితిప్రకరణమున
దాశూరోపాఖ్యానమున దాశూరవరప్రదానవర్ణనమను
అష్టచత్వారింశ సర్గము ॥ 48 ॥

---

# ఏకోనపంచాశః సర్గః.

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

అథ కాననమధ్యస్థం చుంబితాంబుదమండలమ్
మధ్యాహ్నఖిన్న సూర్యాశ్వ సేవితస్కన్ధమండలమ్. 1

వితానమివ దిక్కుక్షీ దీర్ఘం విటపబాహుభిః
ఆలోకయన్తం కకుభో వికాసికుసుమేక్షణైః. 2

వాతావధూలితానల్ప భ్రమద్భ్రమరకున్తలమ్
ప్రమార్జయన్తమాశానాం ముఖం పల్లవపాణిభిః. 3

కస్మైశ్చిరురుగుడుచ్ఛాచ్ఛ మఞ్జరీపుఞ్జకఞ్జరైః
ఆస్యైరివ సతాంబూలైర్హసన్తం వనమాలికాః. 4

ఆ దాశూరుడు పనింప నెంచిన కదంబవృక్షము వనమధ్యమందున్నదై, మేఘమండలమును గూడ స్పృశించుచుండెను. మధ్యాహ్నకాలమందు అలసిన సూర్యుని యశ్వములచే సేవింపబడుచుండెను. దీర్ఘశాఖలను చంద్రికను విస్తరించుచు, అట్టి చంద్రికచే వ్యాప్తముగాని స్థలమెద్దియేని గలదాయని తన వికసితపుష్పనేత్రములచే పరికించుచున్నట్లుండెను. ఆ వృక్షము వాయువుచే ధూళి రహిత మొనర్పబడినదియు, భ్రమరసమూహములను కేశములుగలదియు, పల్లవములను హస్తములచే ఆశయను లలనయొక్క ముఖమండలమును మార్జన మొనర్చుచున్నదియునై యుండెను. హిమజల బిందుయుక్తమగు పల్లవములును, స్వచ్ఛమైన కేసరములును, దంతములవంటి తెల్లనైన లతాసమూహములునుగలదై తాంబూలయుక్త ముఖంబులచే హసించుచున్నట్లుండెను.

లతావిలసితోల్లాసైః పుష్పకేసరధూళిభిః
ఆబద్ధమండలాభోగం పూర్ణేందుమివదీప్తిభిః. 5

సంకటం విటపావల్యా కుఞ్జకూజచ్చకోరయా
ఛన్నయా సిద్ధవీథ్యేవ జగదుచ్చతయాశ్రితమ్. 6

స్కన్ధపీఠోపవిష్టానాం లంబమానైః కలాపినామ్
కలాపైః శోభితం వ్యోమ సేన్ద్రచాపైరివాంబుదైః. 7

మనోన్మగ్నైః ప్రతిస్కన్ధ మాశ్రితైశ్చమరైః సితైః
పూర్ణం ముహుర్దలత్ప్రైః సంవత్సరమివేన్దుభిః. 8

ఆ కదంబవృక్షము లతాసముదాయముయొక్క యధికశోభచేతను, శోభాయమానమగు పుష్పకేసరములందు ప్రవేశించిన ధూళిసమూహములచేతను, (తన కాంతులచే) పూర్ణచంద్రునివలె



మండలాకారమగు రూపమును నిర్మించియుండెను. లతలచే నాచ్ఛాదితమగు శాఖాప్రదేశములందు చకోరపక్షులు శబ్దమొనర్చుచుండెను. శాఖలచే ఘనీభూతమైయున్న యా వృక్షము గ్రహనక్షత్ర సమూహములచే నాచ్ఛన్నమగు సిద్ధమార్గముచే నాశ్రితమైన బ్రహ్మాండమువోలె గన్పట్టుచుండెను. ఇంద్రధనుస్సుగల మేఘములచే నాకాశమువలె శాఖలపైనున్న నెమళ్లపింఛములచే నాకసంబవృక్షము శోభించుచుండెను. కొన్ని బాహ్యప్రదేశమునను కొన్ని అంతర్ప్రదేశమునను నున్నదై యొకక్షణ మగ్ని గన్పించుచు, మఱుక్షణమునందే యదృశ్యమగుచు శాఖలందు వసించుచుండునట్టి శ్వేత చమర మృగముల చే, చంద్రులచే వత్సరమువలె నావృక్షము పూర్ణమైయుండెను.

కపిఞ్జలకులాలాపైః కలకోకిలకూజితైః
జీవం జీవ విరావైశ్చ ప్రగాయన్తమివోచ్ఛ్రితైః. 9

కాదంబకకదంబైశ్చ కులాయకృత కేలిభిః
స్వర్గకోటరవిశ్రాన్తైః సిద్ధైర్జగదివావృతమ్. 10

ప్రవాలచలహస్తాభిరలినేత్రాభిరాశ్రితమ్
అప్సరోభిరివ స్వర్గం మంజరీభిరిత స్తతః. 11

సేన్ద్రచాపవిలాసేన కుముదోత్కరరేణునా
మఞ్జరీపిఞ్జరాశ్యామం విద్యుత్వన్తమివాంబుదమ్. 12

కపింజల, కోకిల, చకోరపక్షుల మధురగానముచే నావృక్షము వ్యాప్తమైయుండెను. స్వర్గమందు విశ్రమించు సిద్ధగణంబులచే బ్రహ్మాండమువలె, గూళ్లయందు క్రీడించుచున్న కలహంస, కదంబ పక్షులచే నాతరువాచ్ఛాదితమై యుండెను. పత్రములను హస్తములును, భ్రమరములను నేత్రములును గల్గియున్న లతాసమూహమను వనితాబృందముచే నయ్యది అప్సరసలచే స్వర్గమువలె పరిసేవితమగు చుండెను. ఇంద్రధనుస్సువలె శోభించు రక్త, నీలకమలముల పరాగముగల్గి, పత్రయుక్తమగు లతలచే విద్యుల్లతాసహితమగు మేఘమువలె శ్యామవర్ణముగా నుండెను.

సహస్రభుజశాఖాఢ్యం పూరితాకాశకోటరమ్
విశ్వరూపమివోన్నృత్తం చంద్రార్కకృతకుండలమ్ 13

తలేనిమఙ్గనాగేన్ద్రం వ్యోమ్ని తారాగణాకులమ్
లతాపుష్పమయం మధ్యే ఖమండలమివాపరమ్. 14

పితామహమివాశేష శైలకాననశాలినమ్
ఫలపల్లవపుష్పాణాం కోశమేకమివావనౌ. 15

దధానం కలికాజాలం స్థగితం పుష్పధూళిభిః
కచ్ఛేష్వర్కకరచ్ఛన్న తారాజాలమివాంబరమ్. 16

ఆ వృక్షము సహస్రాధికములగు భుజరూప శాఖాసమూహములచే పూర్ణమును, ఆకాశమును వ్యాప్తమొనర్చునదియు, చంద్రసూర్యులను కుండలములధరించి నృత్యమొనర్చుచున్న విష్ణు

వలె గన్పట్టుచున్నదియునై యుండెను. దాని యధోభాగమున సర్పములు, గజములు వసించు చుండెను. ఊర్ధ్వభాగము నక్షత్రములచేతను, మధ్యభాగము లతాపుష్పములచేతను వ్యాప్తమై అపరాకాశమువలె గన్పట్టుచుండెను. అనేకపర్వత కాననంబులచే శోభాయమానమై యుండుటచే వృక్షములన్నింటికిని పితామహుడుగను, ఫలపుష్పములకు ప్రధాననిలయముగను నుండెను. పుష్ప రాగముచే కప్పబడిన మొగ్గలుకలదియు, పత్రముల ఛిద్రప్రదేశములందు సూర్యకిరణమూలాచ్ఛాదిత మగుటచే తారాగణయుక్తమగు యాకాశమువలె గన్పట్టుచుండెను.

విలోలవిహగైః స్కన్ధైః కులాయకులసంకులైః
వలితం భూతలం లోకే పూర్ణైర్జనపదై రివ. 17

మంజరీసుపతాకాఢ్యం లతామండలమండితమ్
పుష్పమణ్కోలధవలం పుష్పప్రకరపూరితమ్. 18

కూజచ్చకోరభ్రమర శుకకోకిలసారికమ్
ఘనస్తబకసంచ్ఛన్న కుహరోగ్రగవాక్షకమ్. 19

సంచరత్పక్షిబహులం ఘనమన్థరకోటరమ్
సర్వాసాం వనదేవీనా మన్తఃపురమివోత్తమమ్. 20

గూళ్లు నిర్మించుకొనియున్న పక్షులచే వ్యాప్తమగు శాఖలచే నావృక్షము జనపదంబులచే భూమండలమువలె పూర్ణమై యొప్పుచుండెను. లతాగణంబులను పతాకములతో కూడి పుష్పసమూహ యుక్తమై చకోర, భ్రమర, శుక, కోకిల, సారికాదిపక్షులచే నలంకృతమై ఘనపుష్పగుచ్ఛంబులను గవాక్షములుగల్గి యావృక్షమలరుచుండెను. అద్దానిపై పక్షులెగయుచుండెను. దాని యధోభాగ మునగల ఛాయ ప్రాణులచే నాశ్రితమగుచుండ అయ్యది వనదేవతల యుత్తమ అంతఃపురమువలె శోభించుచుండెను.

కూజద్భృఙ్గతరఙ్గాఢ్యైః పుష్పకేసరరాజిభిః
రాజమానం పతన్తీభిః సరిద్భిరివ పర్వతమ్. 21

భ్రమద్భిః పుష్పపత్రౌఘైర్మందవాతవిలాసిభిః
వర్ధమానైర్వృతస్కన్ధం శుభ్రాభ్రైరివ భూధరమ్. 22

మాతంగకటఘృష్టేన జానుస్తమ్భేన పీనా
ఆభోగినాబద్ధపదం తరుణేవ మహాచలమ్. 23

విచిత్రవర్ణపక్షాణాం స్కన్ధకోటరచారిణామ్
వృతం ఖగానాం వృన్దేన భూతానామివ శార్ఙ్గిణమ్. 24

శబ్దమొనర్చుచున్న భ్రమరసమూహముగల పుష్పకేసరములచే నా కదంబవృక్షము నదులచే పర్వతమువలె శోభాయమానముగ నుండెను. మందవాయుయుక్తమును, నిత్యప్రవర్ధనశీలమును నగు



పత్రపుష్పసముదాయముచే నావృక్షశాఖాప్రదేశము, మేఘములచే పర్వతములవలె నాచ్ఛాదింపబడి యుండెను. మఱియునది యేనుగుల గండస్థలముచే, రాచుకొనబడు దృఢమైన మూలభాగముగల్గి, వృక్షసమూహయుక్తమగు పర్వతమువలె నుండెను. విచిత్రవర్ణయుక్తమై, శాఖాప్రదేశములందు చరించు పక్షిగణములచే, పార్షదుల (సమీపమునసుండువారి)చే శ్రీకృష్ణభగవానునివలె నావృతమైయుండెను.

స్తబకాఙ్గులిజాలేన లోలేనాభినయక్రియామ్
దిశన్తమివ వల్లీనాం ప్రవృత్తానాం వనానిలైః. 25

కశ్చిదేవ నివాసో మే నార్థినామితి తుష్టితః
నృత్యన్తమివ బహ్వోఢ్య లతావలయవల్గనైః. 26

లతాకాన్తకకాన్తత్వాచ్ఛృంగారరసనిర్భరమ్
కాకల్యేన ప్రగాయన్తం మత్తాలినిజనిఃస్వనైః. 27

ఆదరోన్ముక్తకుసుమం సిద్ధానాం వ్యోమచారిణామ్
స్వాగతానీవ కుర్వాణం కోకిలాలికులారవైః. 28

చంచల పుష్పగుచ్ఛములను వ్రేళ్లచే వనవాయువుచే చలింపబడి నృత్యమొనర్చుచున్న లతాసమూహమును యంగనలకు భావవ్యంజకచేష్టల నుపదేశించునట్లుండెను. మూలస్కంధశాఖా పత్రపుష్పాదులలో నేదియో యొకటిమాత్రమే అర్థిగణంబునకు నివాసస్థానముగాక యున్నదిగాని తక్కినవన్నియు యుపకృతినే నొనగూర్చుచున్నవను సంతోషముచే నావృక్షము శాఖలను భుజ ములతోను, లతాసమూహములతోను గూడి నృత్యమొనర్చు చున్నట్లుండెను. లతలను కాంతాగణం బుల కేకైక ప్రియుడగుటఁజేసి శృంగారరసయుక్తమై మధురభ్రమనాదముచే గానమొనర్చుచున్న ట్లుండెను. ఆకాశవిహారులగు సిద్ధులకొఱకు యాదరమున పుష్పములరాల్చుచు, కోకిల భ్రమర సమూహముల శబ్దముచే వారలకు స్వాగతమొనర్చుచున్నట్లుండెను.

లతాపుష్పఫలోల్లాసం ప్రాన్తపక్ష్మమహీరుహమ్
విహసన్తమివాచ్ఛాభిః పుష్పకుడ్మలదీప్తిభిః. 29

పారిజాతమివాజేతు మూర్ధ్వాగ్రైః ఖగమణ్డలైః
వ్యోమాన్తరాభిధావన్తమలముద్ధతకన్ధరమ్. 30

మధ్యభాగస్ఫురత్తుఙ్గైః స్తబకైర్ఘనవంక్తిభిః
సహస్రాక్షత్వమతులైర్జేతు మిన్ద్రమివోద్యతమ్. 31

క్వచిత్కుసుమగుచ్ఛాచ్ఛ ఫణామణిగణావృతమ్
పాతాలాదుత్థితం శేషమివవ్యోమదిదృక్షయా. 32

రజసోద్ధూలితాకారం ద్వితీయమివ శంకరమ్
ఛాయయాఫలశాలిన్యా సమస్తజనశంకరమ్. 33

నిబిడదలనివాహ భిన్నకోశై:
కుసుమలతానవమండపై రుపేతమ్
పురమివ గగనే కదంబవృక్షం
ఖగకులనాగరసంకులం దదర్శ. 34

ఇత్యార్షే వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
దాశూరోపాఖ్యానే దాశూరకదంబవర్ణనం
నామైకోనపంచాశః సర్గః ॥ 49 ॥

లతాపుష్పఫలయుక్తమై విరాజిల్లుచు, నిర్మలపుష్పములను దంతములతోకూడి అన్యవృక్షములఁగూర్చి నవ్వుచున్నట్లుండెను. మఱియు నయ్యది కంఠములనెత్తి యూర్ధ్వగమనమొనర్చుచున్నట్టి పక్షిగణంబులుగల్గి పారిజాతవృక్షమును నిర్జించుటకై స్వర్గమున పరుగిడుచున్నదా యని పించుచుండెను. దాని మధ్యభాగమున భ్రమరసమూహములుండెను. ఘనముగ వ్యాప్తమైయున్న పుష్పగుచ్ఛములను అసంఖ్యాకములగు నేత్రములుగలదై యింద్రునికూడ జయించుచున్నట్లుండెను. ఆ వృక్షము పుష్పపంక్తులను మణిగణంబులచే నాచ్ఛాదితమై యుండెను. మఱియు ఆకాశము నవలోకించుటకై పాతాళమునుండి బయల్వెడలిన శేషునివలె గన్పట్టుచుండెను. పుష్పపరాగయుక్తమై అపరశంకరునివోలె తోచుచుండెను. ఫలసంయుక్తమై శోభించుచు, తన ఛాయచే ప్రాణులకందఱకు శంకరునివలె నాశ్రయభూతమై యొప్పుచుండెను. ఘనముగ వ్యాపించిన దళములందు వికసించిన పుష్పములును, లతామండపములును గల్గి, పక్షిసమూహమును నగరనివాసులతోగూడి ఆకాశమున నిర్మింపబడిన నగరమువలెనున్న యా కదంబవృక్షమును దాశూరుఁడవలోకించెను.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు స్థితిప్రకరణమున
దాశూరోపాఖ్యానమున దాశూరకదంబవర్ణనమను
ఏకోనపంచాశ సర్గము ॥ 49 ॥

---

## పంచాశః సర్గః.

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

తమథాసౌ తథా బుద్ధిఫలపల్లవశాలినమ్
ఆనందమంథరమనాః పుష్పరూపాచలోపమమ్. 1
కదంబం రోదసీస్తంభ మారురోహ వనస్థితమ్
ఏకార్ణవగతం శౌరి ర్వటవృక్షమివోన్నతమ్. 2

శ్రీవసిష్ఠుడు:— ఓ రామా! ఫల, పుష్పములచే రమణీయమును, శ్వేతపుష్పములచే రూపొందలపర్వతమువలె శోభించునదియు, భూమ్యాకాశముల మధ్యస్తంభమువలె నున్నదియు నగు



యా కదంబవృక్షముపై, భూమియందపవిత్రత్వబుద్ధిగలవాడును, పరప్రాప్తిచే నానందయుక్తుడును నగు యా దాశూరబ్రాహ్మణుడు ప్రళయకాలమహాసముద్రమున వటవృక్షముపై విష్ణుభగవానునివలె యారూఢుఁడాయెను.

తత్రాసౌ వ్యోమలగ్నాయాః శాఖాయాః ప్రాన్తపల్లవే
వివేశ విగతాశంకమేకాగ్రం తప ఆస్థితః. 3

…వృక్షముపై యాతడు గగనచుంబితమగు యొకానొక శాఖాసమీపమునగల … ప్రవేశించి, అపవిత్రత్వశంకారహితుడై యేకాగ్రచిత్తుడై తపంబొనర్చి…

అథోపవిశ్య మృదుని నవపల్లవవిష్టరే
క్షణమాలోకితాస్తేన దిశః కౌతుకచంచలమ్. 4

పిదప నూతనమును, కోమలమును, పల్లవరూపమునునగు యాసనముపై విరాజితుఁడై చంచలదృష్టిగల్గి యొక్కక్షణము కౌతుకముతో దిక్కులఁబరికించెను.

సరిదేశావలీరమ్యాః శైలేన్ద్రస్తనకుడ్మలాః
నిర్మలాకాశకబరా లోలనీలాంబుదాలకాః. 5
నీలపల్లవవసనాః పుష్పపూరావతంసికాః
గృహీతసాగరాపూర్ణకలశాః పురుభూషణాః. 6
ధృతప్రఫుల్లపద్మిన్యః సుగన్ధిముఖమారుతాః
నీలఘుంఘుమకాకల్యో నిర్ఝరారావనూపురాః. 7
ద్యుమూర్ధానో మహీపాదా వనాలీరోమరాజయః
జంగలోరునితమ్బిన్యశ్చన్ద్రార్కకృతకుడ్మలాః. 8
శాలిసంసారకేదారాశ్ఛన్దన స్థాలికాన్వితాః
శిఖరోరసిజాలగ్న హిమశుభ్రామ్బువాంశుకాః. 9
మహార్ణవపయఃపూర నవమండనదర్పణాః
ఋక్షౌఘఘర్మపులకా భువనాన్తఃపురాన్తరాః. 10
ఆర్తవస్తనధారిణ్యో లగ్నసూర్యాంశుకుఙ్కుమాః
విచిత్రకుసుమోపేతాశ్చన్ద్రాంశుసితచన్దనాః. 11
గగనగతలతాదలోపవిష్టః
ప్రసృతవనావని వారివాహవేషాః
త్రిభువనవనితా దదర్శ హృష్టః
కుసుమనిరన్తరమండితా దశాశాః. 12

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
దాశూరోపాఖ్యానే దాశూరదిగవలోకనం నామ
పంచాశః సర్గః ॥ 50 ॥

నదులను ముక్తాహారంబులచే మనోహరమైనదియు, పర్వతేంద్రములను స్తనములుగలదియు, నిర్మలాకాశమును కేశపాశములతో నొప్పునదియు, నీలమేఘమువంటి ముంగురులుగలదియు నగు దిగ్రూపవనిత నాతండపుడు వీక్షించెను. మఱియు నీల పల్లవములను వస్త్రములుగలదియు, పుష్ప సమూహములను శిరోభూషణములచే శోభితములును, సముద్రమను పూర్ణకలశమును గ్రహించి యున్నదియు, అధిక యాభూషణములచే నలంకృతములును, వికసితకమలముల ధరించినదియు, సుగంధయుక్త వాయుసహితములును, నీలవర్ణముగల పక్షులు పెండ్లైనవాని ద్వారా మధురధ్వని యొనర్చుచున్నదియు, పెలరేళ్ల శబ్దములను నూపురధ్వనులుగలదియు, స్వర్గమను మస్తకమును, పృథివి యను పాదమును, వనసమూహములను రోమములును, అరణ్యములను నితంబమును, చంద్రసూర్యులను కుండలములును గలదియు, చలించుచున్న శాలిధాన్యముగల క్షేత్రములచే నలరారుచున్నదియు, పర్వతశిఖరములను స్తనములందు సంలగ్నమైన శ్వేతమేఘములను వస్త్రములచే శోభాయమానముగ నున్నదియు, తమ నూతన యాభరణములం జూచుకొనుటకు సముద్రజలమే దర్పణముగాగలదియు, నక్షత్రములను స్వేదబిందువులచే నొప్పునదియు, త్రిలోకయంతఃపురధారుణులును, ఆయా ఋతువులం దుత్పన్నమగు పుష్పపత్రాదులను కంచుకము (అవిక) ను ధరించియున్నదియు, విచిత్రపుష్ప సహితములును, చంద్రకిరణములను శ్వేతచందనముచే విభూషితములును, విశాల నన, పృథివీ, మేఘరూపమగు కృత్రిమమైన యాకృతిగలదియు, త్రిలోక వనితారూపములును నగు దశదిక్కులను, ఆకాశము నంటుచున్నట్టి మిగుల యెత్తైనయొక శాఖపైగూర్చుండి మిగుల ప్రసన్నచిత్తుడగు నా దాశూర బ్రాహ్మణుం డవలోకించెను.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు స్థితిప్రకరణమున
దాశూరదిగవలోకనమను పంచాశ
సర్గము ॥ 50 ॥

## ఏకపంచాశః సర్గః.

శ్రీ వసిష్ఠ ఉవాచః—

తతఃప్రభృతి తత్రాసౌ ప్రసిద్ధస్తాపసాశ్రమే
కదంబదాశూర ఇతి శూర స్తపసి దారుణే. 1

శ్రీ వసిష్ఠుడు:—ఓ రామా ! అదిమొదలుకొని యా బ్రాహ్మణుండా తాపసాశ్రమమున ఘోరతపంబాచరించుచు కదంబనివాసియగు దాశూరుడని ప్రసిద్ధిగాంచెను.

తస్మింల్లతాదలే స్థిత్వా విలోక్య కకుభః క్షణాత్
దృఢపద్మాసనం బద్ధ్వా దిగ్భ్యః ప్రత్యాహృతాత్మనా. 2



అజ్ఞాతపరమార్థేన క్రియామాత్రే చ తిష్ఠతా
ఫలకార్పణ్యయుక్తేన మనసా సోఽకరోన్మఖమ్. 3

ఆ కదంబలతాదళముపై నాసీనుడై యొక్కక్షణకాలము దిక్కుల నవలోకించి, పిదప యటనుండి చిత్తమును మరల్చి పద్మాసనస్థుడై పరమార్థజ్ఞానరహితుడును, కేవలకర్మకాండతత్పరుడును, స్వర్గప్రాప్త్యాద్యల్ప ఫలసంయుక్తుడును నగు నా బ్రాహ్మణుడంత మనస్సుచే యజ్ఞము నాచరించెను.

నభోగతలతాపత్ర సంస్థితేనాన్తరాత్మనా
సర్వాః స్వమనసా తేన కృతా యజ్ఞక్రియాః క్రమాత్. 4

ఆకాశస్థ కదంబవృక్షలతాపత్రములపై యాసీనుడై, మనస్సుచేతనే అగ్న్యాధానము మొదలుకొని అశ్వమేధపర్యంతము గల యజ్ఞక్రియల నన్నింటిని క్రమముగ నాతడాచరించెను.

తత్రాసౌ దశవర్షాణి మనసైవాయజత్సురాన్
గవాశ్వనరమేధాద్యైర్యజ్ఞైర్విపులదక్షిణైః. 5

మఱియు నా వృక్షముపైననే అధిక దక్షిణాయుక్తముగ గవాశ్వనరమేధాది యజ్ఞములను దేవప్రీత్యర్థము దశవర్షములు మనంబుచే నాచరించెను.

కాలేనామలతాం యాతే వితతే తస్య చేతసి
బలాదవతతారాన్తర్జ్ఞాన మాత్మప్రసాదజమ్. 6

తతో విశీర్ణావరణో విగలద్వాసనామలః

కొంతకాలమునకు వానిచిత్తము రాగద్వేషాదిరహితమై విశాలత్వముం జెంద, ప్రతిబంధము క్షయింప, పూర్వజన్మ సంస్కారబలముచే చిత్తము నిర్మలముకాగా వానికి జ్ఞానోదయమయ్యెను. జ్ఞానముచే వాని అజ్ఞానావరణము ఛిన్నమైపోయెను. వాసనామలము నశించెను.

స దదర్శైకదా తస్యాం లతాయామగ్రతః స్థితామ్. 7
వనదేవీం విశాలాక్షీమాలోక కుసుమామ్బరామ్
కామినీం కాన్తవదనాం మదఘూర్ణితలోచనామ్. 8

అపుడొక సమయమున మునియగు నా దాశూరుడు లతాగ్రభాగమున విశాల నేత్రములు గలదియు, ప్రకాశవంతములగు పుష్పములే వస్త్రముగాగలదియు, కామనాసహితయై యొప్పుచున్నదియు, మదభరలోచనయు నగు యొక వనదేవిని గాంచెను.

నీలోత్పలామోదవతీమలీవ సుమనోహరామ్
తామువాచానవద్యాంగీం స మునిర్వినతాననామ్. 9
కోకిలాకుసుమాపూరనతాం వనలతామివ
కా త్వముత్పలపత్రాక్షి కాన్తివిక్షోభితస్మరా. 10

వయస్యామివ పుష్పాఢ్యాం లతాం కిమివ తిష్ఠసి
ఇత్యుక్తే మృగశావాక్షీ గౌరపీనపయోధరా. 11
మునిమాహ మనోహారి ముగ్ధాక్షరమిదం వచః

అపుడు నీలకమల సుగంధయుక్తమును, అతి మనోహరమును, అనింద్యమును నగు శరీరముగలదియు, నమ్రముఖియు, కోకిల, పుష్పాదులభారముచే వంగిన వనలతవలె నున్నదియు నగు యా వనదేవితో నా ముని యిట్లనియె — ఓ కమలాక్షీ! స్వశోభాతిశయముచే మన్మథుని కూడ విక్షోభితమొనర్చు నీ వెవ్వతెవు? నిజసఖివోలెనున్న యీ లతపై యేల గూర్చొనియున్నావు? అంత మృగనేత్రయు, గౌరవర్ణయుక్త విశాల స్తనధారిణియు నగు నావనదేవి మనోహరములును, మధురాక్షర సహితములును నగు వచనముల నిట్లుబల్కెను.

యానియాని దురాపాని వాంఛితాని మహీతలే. 12
ప్రాప్యన్తే తాని తాన్యాశు మహతామేవ యాంచయా
అహమస్మింల్లతాకీర్ణే త్వత్కదంబాభ్యలంకృతే. 13
లతాలీలాలయా బ్రహ్మన్విపినే వనదేవతా
యశ్చైత్రసితపక్షస్య త్రయోదశ్యాం స్మరోత్సవే. 14
బభూవ వనదేవీనాం సమాజో నన్దనేవనే
తత్రాహమగమం నాథ త్రైలోక్యలలనాసదః. 15
తత్ర దృష్టా మయా సర్వా వయస్యా మదనోత్సవే
అపుత్రయా పుత్రయుతా స్తేనాహం దుఃఖితా భృశమ్. 16
త్వయి సర్వార్థసార్థస్య బృహత్కల్పతరౌ స్థితే
అనాథేవ కథం నాథ కిల శోచామ్యపుత్రికా. 17
దేహి మే భగవన్పుత్ర నోచేద్దేహమిహాగ్నయే
ప్రకరోమ్యాహుతిం పుత్ర దుఃఖదాహోపశాన్తయే. 18

‘ఈ భూతలముపై దుష్ప్రాప్యమగు వాంఛితపదార్థము లెయ్యవిగలవో, అవన్నియు మహాత్ముల యాచించుటచే శీఘ్రముగ సంప్రాప్తమగును. కదంబవృక్షలతలచే శోభించు నివ్వనమున నేను వనదేవతనై యున్నాను. నేనీ లతానికుంజములందు వసించుదానను. చైత్రశుక్ల త్రయోదశి నాడు కామోత్సవసందర్భమున నందనవనమందు వనదేవతలందఱును గూడిరి. ముల్లోకమందలి వనదేవతలందఱును సమావేశమైన యచ్చోటికి నేనుకూడ నరిగితిని. ఆ కామోత్సవమున పుత్రసహితులగు నా సఖులందఱిని గాంచితిని. కాని పుత్రహీనయగుటఁజేసి నేను మిగుల పరితాపమునొందుచుంటి. సమస్త పురుషార్థములకును కల్పవృక్షమువలె యభీష్టసిద్ధి యొనర్చు తాముండగ నిక పుత్రహీనయై నేను శోకింపనేల? ఓ మహాత్మా! నాకు పుత్రునొసంగుము. అట్లొసంగనిచో పుత్రదుఃఖోపశమనార్థము మదీయ దేహంబును అగ్నిహోత్రమున కాహుతియొనర్చెద.



తామిత్యుక్తవతీం తన్వీం విహస్య మునిపుంగవః
ప్రాహ హస్తగతం పుష్పం తస్యై దత్వా దయాన్వితః. 19

ఆ తన్వాంగి యిట్లుపలికిన మునిశ్రేష్ఠుడగు నా దాశూరుడామెపై దయగలిగి తన హస్తమునయున్న పుష్పమును యవ్వనదేవికొసంగి నవ్వుచు యిట్లుపల్కెను. —

గచ్ఛ తన్వఙ్గి మాసేన పూజార్హమలిలోచనమ్
ప్రసోష్యసే సుతం కాన్తం ప్రసూనమివ సల్లతా. 20
కిం త్వసౌ మరణావేశదాయిన్యా నస్త్వయా సుతః
యాచితః కృచ్ఛ్రం సంప్రాప్య జ్ఞాతా తేన భవిష్యతి. 21

సూక్ష్మాంగివగు నో దేవీ! ఇఁక నీవేగుము. మంజులతకు పుష్పమువోలె యొకమాసములో నీవు కమలనేత్రములను జగత్పూజ్యుడును సౌందర్యవంతుడును నగు కుమారుడు కలుగగలడు. పుత్రునికై స్వశరీరపరిత్యాగమునకుగూడ నియ్యకొంటివిగాన నీవు జన్మించు యాతఁడాత్మజ్ఞానసంపన్నుడై విలసిల్లును.

ఇత్యుక్త్వా స మునిస్తన్వీం ప్రసన్నముఖమండలామ్
పరిచర్యాం కరోమీతి ప్రార్థనోత్కాం వ్యసర్జయత్. 22

అని యిట్లుబల్కి మునీంద్రుడు ప్రసన్నముఖియు, పరిచర్యాభిలాషిణియునగు నాతన్వాంగిని పంపివైచెను.

సా జగామాత్మసదనం సోఽతిష్ఠత్స్వాత్మనా సహ
అపహస్త్రక్రమశః కాల ఋతుసంవత్సరాదికాః. 23

అంత నామె తన స్వస్థానమునకేగి యేకాకియై క్రమముగ ఋతువులను, వత్సరములను గడపెను.

అథ దీర్ఘేణ కాలేన సైవోత్పలవిలోచనా
ద్వాదశాబ్దముపాదాయ సుతం మునిముపాయయౌ. 24

పిదప, చాల కాలమునకు కమలనేత్రయగు నా వనదేవి ద్వాదశవర్షప్రాయుఁడగు కొమరుని వెంటనిడుకొని మునీంద్రుని చెంతకేగెను.

సా ప్రణమ్యోపవిశ్యాగ్రే మునిమిన్దుసమాననమ్
ఉవాచ కలయా వాచా చూతద్రుమమివాలినీ. 25

చంద్రునివలె దీపిల్లు నా మునిసత్తమునకుఁ బ్రణమిల్లి సమ్ముఖమున యాసీనయై, భ్రమర మామ్రవృక్షముఁగూర్చి బల్కువిధమున యామె మునీంద్రునితో మధురవాక్యముల నిట్లుబల్కెను.

అయం స భగవన్భవ్యః కుమారః పుత్ర ఆవయోః
కృతో మయా సమగ్రాణాం కలానాం కిల కోవిదః. 26
ప్రభో కేవలమేతేన జ్ఞానం నాధిగతం శుభమ్
యేన సంసారచక్రేఽస్మిన్న పునః పరిపీడ్యతే. 27

జ్ఞానం త్వమేవాస్య విభో కృపయోపదిశాధునా
కో హి నామ కులే జాతం పుత్రం మౌర్ఖ్యేణ యోజయేత్. 28

ఓ దేవా! మనయిర్వుర తనయుఁడీతఁడే. నేనీతనిని సర్వవిద్యాసంపన్నునిగ నొనర్చితిని. కాని యెద్దానిచే జీవుడు మఱల సంసారచక్రమున తగుల్కొననేరడో, అట్టి దివ్యమగు ఆత్మజ్ఞానమును మాత్రమీతడు పొందకయుండెను. కాన నో మహాత్మా! దయయుంచి తామే యాతనికి జ్ఞానోపదేశముఁజేయుఁడు. స్వకులోద్భూతుఁడగు తనయుని జ్ఞానహీనునిగజేయ నెవరుంకింతురు?

ఏవం వదన్తీం స మునిః సచ్ఛిష్యమబలే సుతమ్
ఇహైవ స్థాపయైనం త్వమిత్యుక్త్వా తాం వ్యసర్జయత్. 29

అని యిట్లుబల్కు యపుడామునీంద్రుడు "ఓ యబలా! ఉత్తమశిష్యుఁడగు యీ తనయునిటనే యుండనిమ్మ"ని వచించి యామెను బంపివైచెను.

తస్యాం గతాయాం స పితురన్తేవాసితయా తయా
అతిష్ఠత్సంయతో ధీమానర్కస్యేవారుణః పురః. 30

తల్లివెడలిన పిదప బుద్ధిమంతుడగు నా కొమరుఁడు గురుసేవాతత్పరుడై, సూర్యుని యెదుట గరుడుని జ్యేష్ఠసోదరుడగు అరుణునివలె, తండ్రి సమీపముననే వసించుచుండెను.

కదర్థః ప్రాప్య విజ్ఞానం తతశ్చిత్రాభిరుక్తిభిః
చిరకాలమసౌ తత్ర మునిః పుత్రమబోధయత్. 31

పెక్కు క్లేశము లనుభవించి జ్ఞానమార్జించిన యా మునీంద్రుండంత పలువిధయుక్తులచే తన పుత్రునకు చిరకాలము జ్ఞానబోధ గావించెను.

ఆఖ్యాయికాఖ్యానశతైః దృష్టాన్తైర్దృష్టికల్పితైః
తథేతిహాసవృత్తాన్తైర్వేదవేదాన్తనిశ్చయైః. 32
అనుద్వేగితయా నిత్యం విస్తరేణ కథాక్రమైః
అనుభూతిముపారూఢైః రూఢిమేతి యథా మయి. 33

ఉద్వేగరహితుడై, ప్రత్యగాత్మయందు నిరంతరము స్థితిని గలుగజేయుటకొఱకై పెక్కు ఆఖ్యాయికలచేతను, కల్పిత దృష్టాంతములచేతను, ప్రసిద్ధమగు యితిహాసములచేతను, వేదవేదాంత సిద్ధాంతములచేతను, అనేక కథాక్రమములచేతను మునీంద్రుడాతనికి జ్ఞానమును బోధించెను.

అనుభవవశతో రసాతిరిక్తైః
రలముచితార్థ వచోగణైర్మహాత్మా
జలద ఇవ శిఖండినం పురఃస్థం
తనయమబోధయదప్సరో మహర్షిః. 34

ఇత్యార్షే వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
దాశూరోపాఖ్యానే దాశూరసుతానుబోధనం
నామైకపంచాశః సర్గః ॥ 51 ॥

---



ఆత్మజ్ఞానమను చమత్కృతిచేతను, అర్థయుక్తములగు యుత్తమవచనంబులచేతను, మహర్షియగు నా దాశూరుడు, సమ్ముఖముననున్న మయూరమునకు మేఘమువలె, తన పుత్రున కుపదేశించెను.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు స్థితిప్రకరణమున
దాశూరోపాఖ్యానమందు దాశూరసుతానుబోధనమను
ఏకపంచాశ సర్గము ॥ 51 ॥



## ద్వి పం చా శః స ర్గః.

---

శ్రీవసిష్ఠ ఉవాచః—

కదాచిదథ మార్గేణ తేన కైలాసవాసినీమ్
అహం స్నాతుమదృశ్యాత్మా వ్యోమవీథిగతోఽగమమ్. 1
నిర్గత్య నభసః సప్తమునిమండలకోటరాత్
రాత్రౌ ప్రాప్తోఽస్మి సుమతే దాశూరతరుమున్నతమ్. 2
యావచ్ఛృణోమి విటపకుహరాత్కాననే వచః
కుడ్మలాంభోజలగ్నస్య షట్పదస్యేవ నిఃస్వనమ్. 3
శృణు పుత్ర మహాబుద్ధే వస్తుతోఽన్యసమామిమామ్
వర్ణయామి మహాశ్చర్యా మేకామాఖ్యాయికాం తవ. 4

శ్రీ వసిష్ఠుడు:— సుమతుఁడవగు నో రామా! నేనొకప్పుడిటనుండి యదృశ్యరూపమున ఆకాశమార్గముగుండా కైలాసమందలి మందాకినీ (గంగా) నదియందు స్నానమొనర్చుటకేగితిని. సప్తర్షిమండలముగల స్వర్గలోకాకాశమునుండి బయలుదేఱి రాత్రిసమయమున నీ యిల యీ నాయున్నత వృక్షంబును జేరితిని. అంత నీ వృక్షమధ్య భాగమున, కమలమధ్యమందలి భ్రమరముయొక్క ధ్వనివంటి ధ్వని నాకీప్రకారముగ వినవచ్చెను. (దాశూరబ్రాహ్మణుడు తన పుత్రునితో నిట్లనియె —) మిగుల బుద్ధిమంతుడవగు నో కుమారా! ఈ విశ్వమును బోలినదే యగు మఱియొక విశ్వముఁగూర్చిన యాశ్చర్యకరమగు వృత్తాంతము (ఆఖ్యాయిక) ను నీకిపుడు వర్ణించి చెప్పెద, వినుము.

అస్తి రాజా మహావీర్యో విఖ్యాతో భువనత్రయే
నామ్నా ఖోత్థ ఇతి శ్రీమానాక్రాన్తజగదాక్రమణక్షమః. 5

ముల్లోకములందు సుప్రసిద్ధుడును, శ్రీమంతుడును, జగద్విజయసమర్థుడునునగు 'ఖోత్థుడు' (అవ్యాకృతాకాశమందు బుట్టినవాడు) యను భూపాలుఁడుండెను.

అస్యానుశాసనం సర్వే భువనేష్వపి నాయకాః
శిరోభిర్ధారయన్త్యుచ్చైశ్చూడామణిమివార్థినః. 6

ధనికులు చూడామణిని శిరంబున ధరించునట్లు ఆ నృపాలుని యాజ్ఞలను లోకేశులగు బ్రహ్మేంద్రాదులందఱును శిరోధారణ మొనర్చి వర్తించుచుండిరి.

యః సాహసైకరసికో నానాశ్చర్యవిహారవాన్
కేనచిత్త్రిషు లోకేషు న మహాత్మా వశీకృతః. 7

యస్యారంభసహస్రాణి సుఖదుఃఖప్రదాన్యలమ్
సంఖ్యాతుం కేన శక్యన్తే కల్లోలా జలధేరివ. 8

యస్య వీర్యం సువీర్యస్య న శస్త్రైర్న చ పావకైః
కేనచిద్భువనే క్రాన్తమాకాశమివ ముష్టినా. 9

యదీయాం వితతారంభాం లీలాం నిర్మాణభాసురామ్
న మనాగనువర్తన్తే శక్రోపేన్ద్రహరా అపి. 10

ఆ యువనీశుడు మిగుల సాహసి; పరాక్రమసంపన్నుడు; పలువిధ ఆశ్చర్యకరము లగు విహారముల నొనర్చువాడు. ముల్లోకములం దెవనిచేతను వశీభూతుడు గానివాడు. సుఖదుఃఖప్రదములగు వాని ప్రవృత్తులన్నియు సముద్రతరంగములవలె అసంఖ్యాకములై యొప్పుచుండెను. పిడికిటిచే నాకసము నిర్జింపజాలనట్లు, ఆయుత్తమ పరాక్రమశీలుని త్రిలోకమం దెవరును శస్త్రములచేగాని అగ్నిచే గాని జయింపజాలకుండిరి. గంభీరములును, స్వప్నమనోరథాది రచనాయుక్తములునగు వాని దివ్య లీలలను ఇంద్ర విష్ణు శంకరులుగూడ కొంచమైనను అనువర్తింపలేకుండిరి.

త్రయస్తస్య మహాబాహో దేహావిహరణక్షమాః
జగదాక్రమ్య తిష్ఠన్తి హ్యుత్తమాధమమధ్యమాః. 11

మహాబాహుండవగు నో కుమారా! సర్వవ్యవహారసమర్థములైన యుత్తమ మధ్యమాధము లను యాతని మూడుశరీరములును జగంబు నాక్రమించియుండెను.

వ్యోమన్యేవాతివితతే జాతోఽసౌ త్రిశరీరకః
తత్రైవ చ స్థితిం యాతః శబ్దపాతశ్చ పక్షివత్. 12

మిగుల విశాలమగు అవ్యాకృతాకాశమున త్రిశరీరధారియగు నాతఁడుద్భవించినవాడై పక్షివలె నయ్యాకసముననే స్థితిఁబొంది, తుచ్ఛవిషయములం దాసక్తిఁగొనుచు, విధినిషేధంబుల ననుగమించుచు నుండెను.

తత్రైవాపారగగనే నగరం తేన నిర్మితమ్
చతుర్దశమహారథ్యం విభాగత్రయభూషితమ్. 13

వనోపవనమాలాఢ్యం క్రీడాశిఖరిసుందరమ్
ముక్తాలతావిగలితవాపీసప్తకభూషితమ్. 14

శీతలోష్ణాత్మకాక్షీణదీపద్వయవిరాజితమ్
ఊర్ధ్వాధోగతిరూపేణ వణిజ్మార్గేణ సంకులమ్. 15





అనంతమగు నా యవ్యాకృతాకాశమున చతుర్దశభువనము, (లేక చతుర్దశవిద్య) లను విశాలమార్గములు గలదియు, ముల్లోకములచేతను మూడు వేదములచేతను శోభించునదియు నగు బ్రహ్మాండ నగరము నాతడు నిర్మించెను. అబ్ధ్యాది నందనాద్యుపవనములచే పూర్ణమును, మేర్వాది క్రీడాపర్వతములచే రమణీయమును, ముత్యములను తీగలచే యలంకృతమై సప్తసముద్రములను కూపములచే శోభించునదియునై యుండెను. మఱియు చంద్రసూర్యులనునట్టి అక్షయమైన విశాలదీపంబులచే విరాజితమును, ఊర్ధ్వాధోగతిరూపంబగు (శాస్త్రీయ కర్మలచే యూర్ధ్వగతి, అశాస్త్రీయ కర్మలచే యధోగతి) వ్యాపారమార్గము గలదియునై యుండెను.

తస్మిన్నేవాతివిపులే పత్తనే తేన భూభృతా
సంసారిణో విరచితా మూర్ధాపవరకా గణాః. 16

అతివిశాలంబగు యా నగరంబున నారాజు జంగమాత్మస్వరూపులును విషయవిమూఢులును ఆత్మాకాశపరిచ్ఛేదకులును నగు దేవమనుష్యాదులను సృష్టించెను.

ఊర్ధ్వం కేచిదధః కేచిత్కేచిన్మధ్యే నియోజితాః
కేచిచ్చిరేణ నశ్యన్తః కేచిచ్ఛీఘ్రవినాశినః. 17

అసితచ్ఛాదనచ్ఛన్నా నవద్వారవిభూషితాః
అనారతవహద్వాతా బహుగవాక్షసమన్వితాః. 18

దీపపంచకసాలోకా స్త్రిస్థూణాః శుక్లదారవః
మసృణాలేపమృదవః ప్రతోలీభుజసంకులాః. 19

వారిలో కొందఱూర్ధ్వభాగమునను, కొందఱధోభాగమునను, కొందఱు మధ్యభాగమునను నియోగింపబడిరి. అందు కొందఱు చిరకాలమునకు వినాశమొందువారును, కొందఱు శీఘ్రముగ నశించువారునునై యుండిరి. వారందఱును కృష్ణకేశపాశములుగల్గి, నవేంద్రియద్వారములచే విభూషితులై, వాయునిర్గమనద్వారములను వాతాయనములుగలవారై, పంచజ్ఞానేంద్రియములను దీపప్రకాశయుక్తులై, జంఘద్వయ పృష్ఠాస్థులను స్తంభములచే శోభించుచు, చర్మమను మృత్తికాలేపనముచే మృదుత్వముఁజెందినవారై భుజరూపమార్గములచే నొప్పుచునుండిరి.

మాయయా రచితాస్తేన రాజ్ఞా తేషు మహాత్మనా
రక్షితారో మహాయక్షా నిత్యమాలోకభీరవః. 20

మహాత్ముఁడగు నారాజు ఆత్మాకాశము నాచ్ఛాదించువారును, ఆత్మజ్ఞానప్రకాశముచే నిత్యము భయభీతులగువారును నగు యక్షసమూహము (అహంకారము) ను మాయచే రచించెను.

అథాపవరకౌఘేషు చలత్సు స మహీపతిః
కరోతి వివిధాం క్రీడాం నీడేష్వివ విహంగమః. 21

ఆ యాత్మాచ్ఛాదకులు కార్యప్రవృత్తులైన పిదప సంకల్పోదితుఁడైన జీవరూపుఁడగు నారాజు గూటియందలి పక్షిచందమున పలువిధక్రీడల నొనర్చును.

త్రిశరీరశతేష్వన్తస్సైర్యత్నైః సహ పుత్రక
లీలావశముషిత్వా తు పునర్నిర్గమ్య గచ్ఛతి. 22

ఓ పుత్రా! అనేక త్రివిధ (స్థూలసూక్ష్మకారణ) శరీరములందు యత్నముల (అహంకారముల) తోఁగూడ లీలావిలాసంబున తన యిచ్ఛచొప్పున వసించి యీజీవుడనుపక్షి మఱల యటనుండి వెడలిపోవును.

తస్యేచ్ఛా జాయతే వత్స కదాచిచ్చలచేతసః
పురం భవిష్యన్నిర్మాణం కించిద్యామీతి నిశ్చలా. 23

ఆ చంచలచిత్తమున కొకపుడు భవిష్యన్నగరమునకుఁ (అవిద్యమానమగు స్వప్నాదులందు) జన నిచ్ఛపొడముచుండు.

భూతావిష్ట ఇవావేగాత్తత ఉత్థాయ ధావతి
పురం తదప్యభావ్నోతి గంధర్వైరివ నిర్మితమ్. 24

అపుడు భూతమావేశించినదాని చందమున నయ్యది, జాగ్రత్సుషుప్తులఁ ద్యజించి గంధర్వరచితనగరమును బోలు స్వప్నమును బొందును.

తస్యేచ్ఛా జాయతే పుత్ర కదాచిచ్చలచేతసః
వినాశం సంప్రయామీతి తేనాశు న వినశ్యతి. 25

ఓ పుత్రా! అటుపిమ్మట యా చపలచిత్తునకు సంకల్పవిలయస్థితియగు సుషుప్తిని బొంద కోర్కెజనింప, నపుడయ్యది కర్మబీజములు సంస్కారరూపమున శేషించియుండు కారణరూపమగు అవిద్యయందు లీనమగును (సుషుప్తిని బొందును).

పునరుత్పద్యతే తూర్ణం స్వాత్మనోర్మిరివాంభసః
వ్యవహారం తనోత్యుచ్చైః పునరారంభమంథరమ్. 26

మఱల, సముద్రమునుండి తరంగమువలె నయ్యది శీఘ్రముగ యటనుండి ఉత్పన్నమగును. అనగా సుషుప్తినుండి జాగ్రత్స్వప్నదశలఁబొంది యనేక కార్యవిస్తారములఁ గావించును.

స్వయైవ వ్యవహృత్యాథ కదాచిత్పరిభూయతే
కింకరోఽస్మ్యహమజ్ఞోఽస్మి దుఃఖితోఽస్మీతి శోచతి. 27

ఒకపుడది తనచే తాను పరాజితమగును. మఱియు 'నేనజ్ఞుడను, భృత్యుడను, దుఃఖితుడ' నని తలంచి చింతించును.

ముదమేత్య కదాచిచ్చ స్వయమాయాతి దీనతామ్
ప్రావృడ్వర్షకలోల్లాన పూరాదివ నదీరయః. 28

మఱియొకపుడు పూర్వానుభూతసుఖమును సంస్మరించి వర్షాకాలజలప్రవాహముచే నదీవేగమువలె దీనత్వమును పొందును.



జయతి గచ్ఛతి వల్గతి జృంభతే
స్ఫురతి భాతి న భాతి చ భాసురః
సుతమహామహిమా న మహీపతిః
పతిరపామివ వాతరయాకులః. 29

ఇత్యార్షే వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
దాశూరోపాఖ్యానే ఖోత్థవిభవవర్ణనం నామ
ద్విపంచాశః సర్గః ॥ 52 ॥

ఓ కుమారా! మహాత్ముఁడగు నాభూవరుఁడు వాయువేగముచే సంక్షుబ్ధమగు సముద్రమువలె జయసామర్థ్యయుక్తుడై, జాగ్రత్స్వప్నదశలందలి శత్రువుల నాక్రమించి విజయముగాంచును. మఱియు నచటి సంపదలనుపొంది మిగుల ప్రసన్నచిత్తుడై భాసించును. అంతరంగమందలి యాత్మజ్యోతిచే ప్రకాశితుడైనను వ్యవహారదృష్టియందు శోభింపక యుండును.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు స్థితిప్రకరణమున
దాశూరోపాఖ్యానమందు ఖోత్థవిభవ వర్ణనమను
ద్విపంచాశ సర్గము ॥ 52 ॥

---

## త్రిపంచాశః సర్గః.

---

శ్రీవసిష్ఠ ఉవాచః—

అథావృచ్ఛత్సుతస్తత్ర జంబూద్వీపే మహానిశి
కదంబాగ్రావచూడస్థం పితరం పావనాశయమ్. 1

పుత్ర ఉవాచః—

కోఽసౌ ఖోత్థ ఇతి ఖ్యాతో భూపస్తాతోత్తమాకృతిః
కథితం చ కిమేతన్మే త్వయేతి బ్రూహి తత్త్వతః. 2
క్వ భవిష్యతి నిర్మాణం వర్తమానే క్వ గమ్యతా
ఉభయార్థవిరుద్ధత్వాన్మనోమోహాయ వచస్తవ. 3

శ్రీవసిష్ఠుడు:— అటుపిమ్మట జంబూద్వీపమున రాత్రిసమయమున కదంబ వృక్షాగ్రభాగమున శిరోభూషణమువలె శోభించుచున్న పవిత్రాంతఃకరణుఁడగు నా దాశూరునితో యాతని కుమారుడిట్లనెను — తండ్రీ! ఖోత్థు (ఆకాశజు) డని ప్రసిద్ధికెక్కిన యుత్తమాకారవంతుడగు నా రాజెవరు? పరోక్షరూపమున తాము వర్ణించినదానిని యథార్థరూపమున మఱల వచింపుడు. భవిష్యన్నగరనిర్మాణమెచట? వర్తమానకాలమందాతని యునికి యెచట? ఈ యుభయార్థములును విరుద్ధములగుటచే మీవచనములు నాకు వ్యామోహమును గొల్పుచున్నవి.

దాశూర ఉవాచ:—

శృణు పుత్ర యథాభూత మేతత్తే కథయామ్యహమ్
యేన సంసారచక్రస్య తత్త్వమస్యావబుధ్యసే. 4

దాశూరుడు:— కుమారా! ఇవ్విషయమంతయు యథార్థరూపమున వచించుచున్నాను. వినుము. ఇద్దానిచే సంసారచక్రముయొక్క తత్త్వమును నీవు బాగుగ నెఱుంగగలవు.

అసదవ్యుత్థితారంభ మసత్తామయమాతతమ్
సంసారసంస్థానమిద మేవమాకథితం మయా. 5

ఈ ప్రపంచ మసత్యమును, అజ్ఞానముచే ప్రకటితమును, పరమార్థసత్తారహితమును, మాయామయమును నై యున్నదను విషయమును బోధించుటకొఱకే పరోక్షరూపమున నీకిట్లు వర్ణించి చెప్పితిని.

పరమాన్నభసో జాతః సంకల్పః శ్రోత్ర ఉచ్యతే
జాయతే స్వయమేవాసౌ స్వయమేవ విలీయతే. 6

అవ్యాకృతాకాశమునుండి యుత్పన్నమైన సంకల్పాత్మకమగు మనస్సే శ్రోత్రుడు. ఈతఁడు స్వసంకల్పజనితమగు వాసనలచే నుత్పన్నమై వాసనారాహిత్యముచే స్వయముగ వినాశనము నొందును.

తత్స్వరూపమిదం సర్వం జగదాభోగి విద్యతే
జాయతే తత్ర జాతే తు తస్మిన్నష్టే వినశ్యతి. 7

ఈ విశాలజగంబంతయు సంకల్పమయమగు యా మనస్సుయొక్క స్వరూపమేయగును. మనస్సుయుత్పన్నమైన, జగత్తున్ను నుత్పన్నమగుచున్నది. మనస్సునశించిన, జగత్తున్ను నశించుచున్నది.

బ్రహ్మవిష్ణ్విన్ద్రరుద్రాద్యాం స్తస్యైవావయవాన్విదుః
విటపానివ వృక్షస్య శృఙ్గాణీవ మహీభృతః. 8

వృక్షమునకు శాఖలవలెను, పర్వతమునకు శిఖరములవలెను, బ్రహ్మవిష్ణు రుద్రేంద్రాదు లందఱును సంకల్పాత్మకమగు యామనస్సుయొక్క అవయవములే యగుదురు.

శూన్యే వ్యోమని తేనేదం నిర్మితం త్రిజగత్పురమ్
ప్రతిభాసానుసంధాన మాత్రేణైత్య విరించితామ్. 9

త్రికాలములందును జగత్సత్తారహితమగు బ్రహ్మమందు, అధిష్ఠానచైతన్యముయొక్క యనుగ్రహమాత్రముచే విరించిపదమునొంది, సంకల్పమయమగు నీ మనస్సే త్రిలోకనగరమును రచించుచున్నది.

యత్రేమే వితతాలోకా లోకకోశాశ్చతుర్దశ
వనోపవనమాలాశ్చ యత్రోద్యానపరంపరాః. 10



క్రీడాశిఖరిణో యత్ర సహ్యామందరమేరవః
శీతోష్ణదీప్తిచంద్రార్కా దీపౌ యత్రానలాకృతీ. 11

సూర్యాంశుకచదాలోల తరంగోత్తుంగమౌక్తికాః
వహన్తి సరితో యత్ర సన్ముక్తావలయశ్చలాః. 12

ఇక్షుక్షీరాదిసలిలా మణిరత్నబిసాఙ్కురాః
ఔర్వానలాంబుజా యత్ర వాప్యః సప్తమహార్ణవాః. 13

అథ ఉర్వ్యాం తథోర్ధ్వే ఖే పుణ్యాపుణ్యాధనక్రియః
నరామరకిరాతానాం యత్రాన్తః క్రయవిక్రయా. 14

ఈ మనోనిర్మితనగరమున సూర్యాదులచే ప్రకాశితమగు పదునాల్గుభువనములే కోశములుగను, వనయుపవనాదుల పుష్పమాలలే వాటికలుగను, సహ్యామందరమేర్వాదికులపర్వతములే క్రీడాస్థానములుగను, శీతోష్ణప్రకాశముల గల్గజేయు అగ్నివంటి యాకృతిగల చంద్రసూర్యులే దీపములుగను నుండెను. మఱియు నచట సూర్యకిరణములచే శోభితములగు యున్నత చంచల తరంగములను ముత్యములచే పూర్ణములై యున్న నదులు ప్రవహించుచుండెను. ఇక్షురస, క్షీరాదులను జలసమూహములును, మణి రత్నములను కమలాంకురములును, బడబాగ్నియను కమలమును గల సప్తసముద్రములను కూపము లట విరాజిల్లుచుండెను. ఆ నగరమున క్రిందిభాగమగు భూమిపైనను, పైభాగమగు ఆకాశమునందును పుణ్యాపాపములను ధనముచే దేవమనుజకిరాతాదులు క్రయవిక్రయముల సల్పుచుండిరి.

తస్మిన్నేవ జగత్యస్మిన్పురే సంకల్పభూభృతా
క్రీడార్థమాత్మనశ్చిత్రా దేహాపవరకాః కృతాః. 15

ఆ జగద్రూపనగరమున సంకల్పాత్మకమగు మనస్సను రాజు క్రీడార్థమై విచిత్రరూపులగు అహంకార - దేహసంరక్షకులను నిర్మించెను.

కేచిద్గీర్వాణనామాన ఊర్ధ్వ ఏవ నియోజితాః
నగనాగాదయః కేచిదథ ఏవ నియోజితాః. 16

వారిలో దేవతలనఁబడు కొందఱూర్ధ్వభాగమునను మనుజ నాగాదులను మఱికొంద ఱధోభాగమున నెలకొల్పబడిరి.

వాతయన్త్రప్రవాహేణ చలన్తో మాంసమృన్మయాః
సితాస్థిదారవశ్చిత్రా స్త్వగ్లేప మసృణామలాః. 17

వారు ప్రాణవాయుసంచలనయుక్తులును, మాంసమృత్తికామయ శ్వేతాస్థిరూపకాష్ఠనిర్మయుక్తులును, విచిత్రతైలలేపనాది సహితులును, నిర్మలదేహులునునై యుండిరి.

కేచిచ్చిరేణ నశ్యన్తి కేచిచ్ఛీఘ్రవినాశినః
కేచిత్కేశోలపోల్లాన రచితాచ్ఛాదనశ్రియః. 18

కర్ణాక్షినాసాప్రముఖై ర్ద్వారై ర్నవభిరన్వితాః
అనారతవహ త్ప్రాణ పవనేనోష్ణశీతలాః. 19

కర్ణనాసాస్యతాల్వాది వాతాయనగణాన్వితాః
భుజాద్యఙ్గప్రతోలీకాః పంచేన్ద్రియకుదీపకాః. 20

వారిలో కొందఱు చిరకాలమునకు నశించువారును, కొందఱు శీఘ్రవినాశనమును బొందువారునునై యుండిరి. కేశరూపతృణములచే వారాచ్ఛాదింపబడి శోభించుచుండిరి. మఱియు వారు కర్ణనేత్రనాసికాదులను నవద్వారములుగల్గి, నిరంతరము చలించునట్టి ప్రాణాపానవాయువులచే శీతోష్ణాదిసహితులై యుండిరి. కర్ణనేత్రముఖాదులను వాతాయనములును, భుజాద్యవయవములను మార్గములునుగల్గి, పంచేంద్రియములను దీపములచే ప్రకాశితులైయుండిరి.

మాయయా రచితా స్తేషు సంకల్పేన మహామతే
అహంకారమహాయక్షాః పరమాలోకభీరవః. 21

మహామతివగు నోకుమారా! మాయానిర్మితులగు వీరందఱును యీ సంకల్పనగరనివాసులేయై యున్నారు. అందు సంకల్పాత్మకమగు మనస్సు ఆత్మజ్ఞానమను ప్రకాశముచే మిగుల భీతిఁజెందునట్టి అహంకారరూపులగు మహాయక్షుల రచించెను.

దేహాపవరకేష్వ న్త ర్మహాహంకారయక్షకైః
సహ సంక్రీడతేఽత్యర్థం స సదైవాసదుత్థితైః. 22

దేహరక్షణ యొనర్చువారును, అజ్ఞానముచే నావిర్భూతులును నగు అహంకారరూపులగు మహాయక్షులతో నా భూపాలుడు సదా క్రీడించుచుండును.

యథా కుసూలే మార్జారో భస్త్రాయాం భుజగో యథా
ముక్తాఫలం యథా వేణావహంకార స్తథా తనౌ. 23

కుసూలమందు (ధాన్యముంచెడు చోటునందు) మార్జాలమువలెను, భస్త్రి (కొలిమి తిత్తి) యందు సర్పమువలెను, వెదురునందు ముత్యమువలెను, శరీరమం దహంకారమున్ను గలదు.

క్షణమభ్యుదయం యాన్తి క్షణం శామ్యన్తి దీపవత్
దేహగేహేషు సంకల్పతరంగాః సాగరేష్వివ. 24

దీపమువలె నియ్యది క్షణములో విజృంభించుచు, మఱల క్షణములో నశించుచుండును. శరీరగృహములందు సంకల్పమయ తరంగములు సముద్రమునందువలె నుల్లసితమగుచుండును.

భవిష్యన్నవనిర్మాణం సవ్యాప్నోతి తదా పురమ్
యదా సంకల్పితం వస్తు క్షణాదేవ ప్రపశ్యతి. 25

సంకల్పమయాత్మకమగు నీ మనస్సు నిజసంకల్పితవస్తువును గాంచిన వెంటనే యద్దానిని భవిష్యన్నూతన నగరమును (స్వప్నమందు) ప్రాప్తి నొందును.



అసంకల్పనమాత్రేణ స్వేనైవాశు వినశ్యతి
శ్రేయసే పరమా యస్య నాశత్వేన తు సంభవః. 26

మాయాచక్రమున తగుల్కొని జాగ్రత్స్వప్నములందు పరిభ్రమించి (లేక అనేక జన్మలందు తిరుగాడి) విశ్రాంతి సుఖమపేక్షించినదై సుషుప్తి (లేక సమాధిని) జొచ్చి యియ్యది సంకల్పాభావమాత్రమున శీఘ్రముగ వినాశమొందుచున్నది.

స్వయం సంకల్పనామాత్రం జాయతే బాలయక్షవత్
అనన్తాయాత్మదుఃఖాయ నానన్దాయ కదాచన. 27

బాలుని సంకల్పముచే శీఘ్రముగ పిశాచాదులుత్పన్నమగునటుల, ఈ మనస్సే స్వసంకల్పనామాత్రమున అనంతదుఃఖముకొఱకే యుత్పన్నమగుచున్నది గాని సుఖముకొఱకు గాదు.

ఇదం స్ఫారం జగద్దుఃఖం ప్రతనోత్యాత్మస త్తయా
అస త్తయా నాశయతి ఘనమాన్ధ్యం యథా తమః. 28

సంకల్పమయాత్మకమగు మనస్సను యీ నృపాలుడు స్వసత్తచే నీ విశాల ప్రపంచ రూప దుఃఖమును విస్తరించుచున్నాడు. మఱియు గాఢాంధకారమును సూర్యుడు నశింపజేయువిధమున స్వసత్తాభావముచే నద్దానినాతడు నశింపజేయును.

స్వయైవ దుఃఖదాయిన్యా చేష్టయా పరిరోదితి
కాష్ఠావష్టబ్ధవృషణః కీలోత్పాటీ కపిర్యథా. 29

కాష్ఠద్వయమధ్యమందలి కీలము నూడబెరుకగా, అండకోశము చిక్కుకొనుటచే దుఃఖమునుపొందిన వానరమువలె, క్లేశదాయకములగు తన చేష్టలచే నీ మనస్సున్ను పరితాపము నొందుచున్నది.

సంకల్పితానన్దలవ స్తిష్ఠత్యుద్ధరకన్ధరమ్
అకస్మాత్ప్రచ్యుతమధు బిన్దుభుక్కరభో యథా. 30

మధుబిందువు నాస్వాదించుటచే గర్దభమానందము నొందునట్లు, స్వసంకల్పిత విషయ భోగముచే నీ మనస్సున్ను మిగుల యానందము నొందుచున్నది.

క్షణం విరతిమాయాతి రతిమేతి క్షణం స్వయమ్
క్షణం వికారమాయాతి సంకల్పేనైవ బాలవత్. 31

క్షణములో నియ్యది వైరాగ్యమవలంబించును. క్షణములో ఆసక్తిఁజెందును. మఱియు బాలుని సంకల్పమువలె క్షణములో వికారమును బొందును.

ఏనం సకలభావేభ్యః కృత్వా నిర్మూలమాదరాత్
మతిర న్తఃపదం యాతి యథా పుత్ర తథా కురు. 32

పుత్రా! సంకల్పాత్మకమగు యీ మనస్సును బాహ్యవస్తువులన్నింటినుండి మఱల్చి సమాధ్యభ్యాసముచేతను ఆత్మజ్ఞానముచేతను దాని నత్యాదరమున నిర్మూలించి, బ్రహ్మపదము నాశ్రయించి, ఇవ్విధమున ఆత్మ విశ్రాంతి నొనగూర్చు యత్నమాచరింపుము.

త్రయస్తస్యామతే దేహాః అధమోత్తమమధ్యమాః
తమస్సత్త్వరజః సంజ్ఞాః కారణం జగతః స్థితేః.　　33

ఈ సంకల్పమయమనంబునకు ఉత్తమ మధ్యమాధమములనునట్టివియు, సత్త్వరజస్తమోగుణ సంజ్ఞాసహితమైనవియు, జగత్స్థితికి కారణభూతములును నగుమూడు శరీరములు గలవు.

తమోరూపో హి సంకల్పో నిత్యం ప్రాకృతచేష్టయా
పరాం కృపణతామేత్య ప్రయాతి కృమికీటతామ్.　　34

ప్రాకృత (స్వాభావిక) క్రియలచే నిత్యము తమోరూపసంకల్ప ముదయమగును. అద్దానిచే జీవుడు మిగుల నీచత్వమునొంది కృమికీటస్థావరాదియోనులం బ్రాప్తినొందును.

సత్త్వరూపో హి సంకల్పో ధర్మజ్ఞానపరాయణః
అదూర కేవలీభావం స్వారాజ్యమధితిష్ఠతి.　　35

సత్త్వరూపసంకల్పముచే జీవుడు ధర్మజ్ఞానపరాయణుండై యచిరకాలములోనే కేవలీభావ (మోక్ష) రూపమగు స్వారాజ్యసిద్ధిని (బ్రహ్మపదమును) బొందును.

రజోరూపో హి సంకల్పో లోకసంవ్యవహారవాన్
పరితిష్ఠతి సంసారే పుత్రదారానురంజితః.　　36

రజోగుణ సంకల్పముచే జీవుడు మానవ జన్మయోగ్య వ్యవహారంబుల నాచరించుచుండును. అపుడాతండీలోకమున పుత్రధనాదులచే ప్రమోదమును బడయును.

త్రివిధం తు పరిత్యజ్య రూపమేతన్మహామతే
సంకల్పః పరమాయాతి పదమాత్మపరిక్షయే.　　37

ఓ, మహామతీ! సత్త్వరజస్తమోరూపమగు యీ మూడు గుణములను త్యజించి, తన రూపమును నశింపజేసికొని యీ సంకల్పాత్మకమగు మనస్సు మోక్షపదమును బొందుచున్నది.

సర్వాదృష్టీః పరిత్యజ్య నియమ్య మనసా మనః
సబాహ్యాభ్యన్తరార్థస్య సంకల్పస్య క్షయం కురు.　　38

బాహ్యదృష్టులన్నింటిని త్యజించి మనస్సును మనస్సుచేతనే నిగ్రహించి బాహ్యాభ్యంతర పదార్థములంగూర్చిన సంకల్పములన్నింటిని రహితమొనర్చుము.

యది వర్షసహస్రాణి తపశ్చరసి దారుణమ్
యది వా విలయాత్మానం శిలాయాం చూర్ణయస్యలమ్,　　39
యది వాగ్నిం ప్రవిశసి బడవాగ్నిమథాపి వా
యది వా పతసి శ్వభ్రే ఖడ్గధారజవే లఘా.　　40
హరో యద్యుపదేష్టా తే హరిః కమలజోఽపి వా
శ్రీత్రయాక్రాన్తో లోకనాథోఽథవా యతిః.　　41



పాతాలస్థస్య భూస్థస్య స్వర్గస్థస్యాపి తత్త్వవ
నాన్యః కశ్చిదుపాయోఽస్తి సంకల్పోపశమాదృతే.　　42

వేలకొలది సంవత్సరములు యుగ్రతపంబాచరించినను, దేహమును శిలపై చూర్ణమొనర్చినను, అగ్నియందుగాని బడబాగ్నియందుగాని ప్రవేశించినను, భయంకర గర్తమునగాని ఖడ్గధారపైగాని బడినను, బ్రహ్మ విష్ణుహరాదులను, కరుణాసముద్రులగు దుర్వాస దత్తాత్రేయ బుద్ధదేవులను యోగులుపదేష్టలుగాగల్గినను, స్వర్గ పాతాళ భూలోకములందు వసించినను సరియేగాని సంకల్పనాశమునకు వేరొండు యుపాయమెద్దియును లేదు.

అనాబాధేఽవికారే చ సుఖే పరమపావనే
సంకల్పోపశమే యత్నం పౌరుషేణ పరం కురు.　　43

పుత్రా! బాధారహితమును, నిర్వికారమును, పరమపవిత్రమును, సుఖమయమును నగు సంకల్పనాశముకొఱకై శ్రవణమనననిదిధ్యాసనారూపమగు యుత్తమ పురుష ప్రయత్నము గావింపుము.

సంకల్పతన్తావఖిలా భావాః ప్రోతాః కిలానఘ
ఛిన్నే తన్తౌ న జానే తే క్వ యాన్తి విశరారవః.　　44

పాపరహితుడవగు నో కుమారా! సంకల్పసూత్రముననే సమస్తపదార్థములును గ్రుచ్చబడియున్నవి. అట్టి సంకల్పసూత్రము విచ్ఛిన్నమైనచో క్షణభంగురములగు నా పదార్థము లెచటకో పోయమైపోవును.

అసత్సత్సదసత్సర్వం సంకల్పాదేవ నాన్యతః
సంకల్పం సదసచ్చైవ విహ సత్యే కిముచ్యతామ్.　　45

సదసన్మయమగు వికల్పములన్నియు సంకల్పమునుండియే యుత్పన్నమగునుగాని మఱియొకదానినుండిగాదు. కాన కారణమగు సంకల్పము సత్తా? అసత్తా? యను వికల్ప మయ్యావిధమొనర్పబాలకుండును. అట్లైన నిక నావికల్పములు పరమార్థమగు బ్రహ్మము నెట్లు స్పృశింపగలవు? కార్యము స్వసంగియగు కారణవిషయముననే కుంఠితమవ, యిక అసంగమగు పరబ్రహ్మవిషయమున వేఱుగ జెప్పవలయునా?

సంకల్ప్యతే యథా యద్యత్తత్తథా భవతి క్షణాత్
మా కించిదపి తత్త్వజ్ఞ సంకల్పయ కదాచన.　　46

సంకల్పమయమగు నీమనంబెవ్విధమున జింతించునో శీఘ్రముగ నట్లేయగును. కాన తత్త్వజ్ఞుండవగు నో కుమారా! నీవెపుడును లేశమైనను సంకల్ప మొనర్పక యుండుము.

నిఃసంకల్పో యథా ప్రాప్త వ్యవహారపరో భవ
చిదచేత్యోన్ముఖత్వం హి యాతి సంకల్పసంక్షయే.　　47

సంకల్పరహితుడవైయుండి ప్రాప్తించిన వ్యవహారముల నాచరించుము. సంకల్పనాశమైన పిదప చిదాత్మ విషయములనుండి పరాఙ్ముఖమగును.

ఉత్థాయ సత్త్వరూపేణ యోఽన్యా సత్యమయాత్మకమ్
న తజ్జగద్దుఃఖమిదం వ్యర్థం సదృశమాత్మనః. 48

కేవలము సత్యస్వరూపమును, బ్రహ్మమయమును నగు ఆత్మ అసత్యమగు మాయకు వశమై దేవమనుష్యతిర్యగాది భిన్నభిన్నయోనుల జన్మించి వ్యర్థముగ నీజగద్రూప దుఃఖము ననుభవించుచున్నది. ఇదంతయును శుద్ధాత్మకు యోగ్యము కానేరదు.

తేన దుఃఖాయ మహతే కిం మృతేన తవానఘ
యదదుఃఖాయ తత్ప్రాజ్ఞాః సంశ్రయన్తీహ నేతరత్. 49

పాపరహితుఁడవగు నో పుత్రా! పలువిధయోనులందు జన్మించుచు, మఱల మృతినొందుచు నివ్విధమున దుఃఖమనుభవించుచుండుటచే నేమి ప్రయోజనము? కాన బుద్ధిమంతులగువారు దుఃఖరహితమగు ఆత్మనే యాశ్రయింతురుగాని మఱియొకదానిని గాదు.

అధిగతపరమార్థతాముపేత్య
ప్రసభమపాస్య వికల్పజాలముచ్చైః
అధిగమయపదం తదద్వితీయం
వితతసుఖాయ సుషుప్తచిత్తవృత్తిః. 50

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
దాశూరోపాఖ్యానే సంసారనగరవికల్పయోగ విచారో
నామ త్రిపంచాశః సర్గః ॥ 53 ॥

అందుచే నీవు తత్త్వజ్ఞానమునుబడసి వికల్పజాలమునంతయును బలాత్కారముగ దూరీకరించి సమాధినిష్ఠుడవై నిరతిశయానందప్రాప్తికొఱకు అద్వితీయమగు మోక్షపదమునుగూర్చి యత్నింపుము.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు స్థితిప్రకరణమున
దాశూరోపాఖ్యానమందు సంసారనగరవికల్పయోగవిచార
మను త్రిపంచాశ సర్గము ॥ 53 ॥

---

## చతుఃపంచాశః సర్గః.

---

పుత్ర ఉవాచ:—

కీదృశస్తాత సంకల్పః కథముత్పద్యతే ప్రభో
కథం చ వృద్ధిమాప్నోతి కథం చైష వినశ్యతి. 1

దాశూరునితో పుత్రుఁడిట్లనెను – తండ్రీ! సంకల్పమెవ్విధమున నుండును? అయ్యదెట్లుత్పన్నమగును? యెట్లు వృద్ధినొందును? యెట్లు నశించును?



దాశూర ఉవాచ:—

అనన్తస్యాత్మతత్త్వస్య సత్తాసామాన్యరూపిణః
చితశ్చేత్యోన్ముఖత్వం యత్తత్సంకల్పాఙ్కురం విదుః. 2

దాశూరుడు:— కుమారా! అనంతమును, సత్తాసామాన్య రూపమును, ఆత్మ స్వరూపమును నగు చైతన్యముయొక్క విషయోన్ముఖత్వమే సంకల్పముయొక్క అంకురమని యెఱుంగుము.

లేశతః ప్రాప్తసత్తాకః స ఏవ ఘనతాం శనైః
యాతి చిత్తఖమాపూర్య దృఢజాడ్యాయ మేఘవత్. 3

అయ్యది అల్పమాత్రమైనను సత్తనుబొంది చిదాకాశముయొక్క నలువైపుల వ్యాపించి అస్థిరమగు చిత్స్వరూపమును మఱుఁగుపఱచుచు జడమగు ప్రపంచాకారము నొందుటకొఱకై క్రమముగ ఘనత్వముఁ జెందును.

భావయన్తీ చితిశ్చేత్యం వ్యతిరిక్తమివాత్మనః
సంకల్పతాముపాయాతి బీజమంకురతామివ. 4

ఈ చిచ్ఛక్తి తనకంటె నన్యముగ విషయరూపమును భావనచేయుచు బీజము అంకురత్వమును బొందునట్లు సంకల్పత్వమును బొందుచున్నది.

సంకల్పేన హి సంకల్పః స్వయమేవ ప్రజాయతే
వర్ధతే స్వయమేవాశు దుఃఖాయ న సుఖాయ తు. 5

ఒక సంకల్పమునుండి మఱియొక సంకల్పముదయించుచు శీఘ్రముగ వృద్ధియగుచు దుఃఖమునే గలుగజేయుచున్నది.

సంకల్పమాత్రం హి జగజ్జలమాత్రం యథాఽర్ణవః
ఋతే సంకల్పమన్యా తే నాస్తి సంసారదుఃఖితా. 6

సముద్రము జలమాత్రమే యగునట్లు యీ జగత్తున్ను సంకల్పమాత్రమే యగును. సంకల్పమొకటిదప్ప యీ ప్రపంచమున నన్యమగు దుఃఖమెద్దియును నీకు లేదు.

కాకతాలీయయోగేన సంజాతోఽస్తి ముధైవ హి
మృగతృష్ణాద్విచన్ద్రత్వమివాసత్యం చ వర్ధతే. 7

కాకతాళీయన్యాయముచే సంకల్పాత్మకమగు యీ మనస్సు వివర్తభావము నాశ్రయించి మిథ్యారూపమున నుత్పన్నమగుచున్నది. మఱియు మృగతృష్ణవలెను, ద్విచంద్రభ్రాంతివలెను అసత్యమైనను నియ్యది వృద్ధినొందుచున్నది.

నిగీర్ణమాతులిఙ్గస్య కనకప్రత్యయో యథా
స్వయమభ్యేత్య సత్యోఽన్తః సంకల్పస్తే తథా హృది. 8

'మాతులుంగ' (మాది) ఫలభక్షకుని యంతఃకరణమున శ్వేతపదార్థమందలి పీతత్వభ్రాంతి స్వయముగ యెట్లుగల్గునో, మఱియు నా పీతత్వమసత్యమైనను వానికి సత్యముగ యెట్లు భాసించునో అట్లే నీయందును సంకల్పము స్థితిగలిగియున్నది.

అసత్యమేవ జాతస్త్వ మసత్యమపి వర్ధసే
అస్మింజ్ఞాతే చ విజ్ఞానే హ్యసత్యం సంవిలీయతే.　　9

మిథ్యారూపముననే నీవుత్పన్నమైతివి. మిథ్యారూపముననే స్థితిగల్గియున్నావు. కాని యుపదేశాత్మకమగు ఈ యధ్యాత్మ శాస్త్రమెఱింగినచో అట్టి మిథ్యాత్వము నశించును.

అసౌ సోఽహమిమే భావాః సుఖదుఃఖమయా మమ
వ్యర్థమేవేతి నానాస్థా యేనాన్తః పరితప్యసే.　　10

'వేదాంతప్రసిద్ధమగు పూర్ణాత్మయేతత్స్వరూపమగలదో, అదియే నేను. ఆత్మేతరములగు 'నేను' 'నాది' మున్నగు సుఖదుఃఖజన్మాది పదార్థములన్నియు మిథ్యారూపములే', యను విశ్వాసము నీకు (అజ్ఞానకారణమున) లేనందుచే అంతఃకరణమున దుఃఖితుడవగుచున్నావు.

అసన్నేవాస్య జాతోఽపి కుతో జన్మవిలాసతః
వ్యర్థమేవావమూఢోఽసి సంకల్పవశతః స్వతః.　　11

ఈ జన్మాదులతో నీకెపుడును సంబంధములేకున్నను, భ్రాంతిచే నట్టి సంబంధము గల్పజేసికొనుచున్నావు. యథార్థముగ విచారించిన ఆత్మకు జన్మయెచటిది? సంకల్పవశముచేతనే నీవు స్వయముగ మూఢునివలె నగుచుంటివి.

మా సంకల్పయ సంకల్పం భావం భావయ మా స్థితౌ
ఏతావతైవ భావేన భవ్యో భవతి భూతయే.　　12

పూర్వానుభూతములగు సుఖదుఃఖాది పదార్థముల నీవిపుడు సంస్మరింపక కేవలమాత్మను మాత్రము భావనజేయుము. ఇట్టి భావనచే ఆత్మసిద్ధియను ఐశ్వర్యమొంది జీవుడు భవ్యరూపుడగును.

సంకల్పనాశయత్నేన నభయాన్యనుగచ్ఛతి
భావనాభావమాత్రేణ సంకల్పః క్షీయతే స్వయమ్.　　13

సంకల్పనాశమున కెత్నించుటచే జీవుడు జననమరణాదిభయముల నొందకుండును. భావనయొనర్పకుండినమాత్రముచే సంకల్పము స్వతహాముగ క్షీణించును.

సుమనః పల్లవామర్దే కించిద్వ్యతికరో భవేత్
సుసాధ్యో భావమాత్రేణ న తు సంకల్పనాశనే.　　14

పుష్పదళముల మర్దించుటయందైనను కొంచెము పరిశ్రమగలదుగాని అభావనామాత్ర సాధ్యమగు సంకల్పవినాశమందదియున్ను లేదు.

పుష్పాక్రాన్తౌ కరస్పన్ద యత్నః పుత్రోపయుజ్యతే
తదప్యుపకరోత్యస్మిన్న సంకల్పపరిక్షయే.　　15

పుత్రా! పుష్పదళసమ్మర్దనమందు హస్తచేష్టారూపమగు అల్పప్రయత్నము గలదుగాని సంకల్పనాశమందట్టిదియును లేదు.



సంకల్పో యేన హన్తవ్యస్తేన భావవిపర్యయాత్
అవ్యర్థేన నిమేషేణ లీలయైవ నిహన్యతే.　　16

కేవలము భావనావిస్మరణమాత్రముచే యర్ధనిమిషములో సంకల్పవినాశము లీలామాత్రమున చేకూరగలదు.

భావమాత్రోపసంపన్నే స్వాత్మని స్థితిమాగతే
సాధ్యతే యదసాధ్యం తత్కస్య స్యాత్కిమివాంగ తే.　　17

నిరంతరమాత్మయొక్క పూర్ణానందస్వరూపమును చింతనజేయుటచేతను, ఆత్మయందే స్థితిగల్గియుండుటచేతను అసాధ్యమగు వస్తువుకూడ సిద్ధించును. ఆత్మ యెద్దానిచేతను హరింపబడుటగాని నశింపబడుటగాని సంభవింపదు.

సంకల్పేనైవ సంకల్పం మనసా స్వమనో మునే
ఛిత్త్వా స్వాత్మని తిష్ఠ త్వం కిమేతావతి దుష్కరమ్.　　18

ఓ మునీ! (అసంకల్పరూప) సంకల్పముచే సంకల్పమును జయించి, మనస్సుచేతనే మనస్సును విచ్ఛిన్నమొనర్చి నీవు స్వాత్మయందు స్థితుడవై యుండుము. సులభసాధ్యమగు నీకార్యమున (అసంకల్పన మాత్రమున) దుష్కరమెయ్యది గలదు?

ఉపశాన్తే హి సంకల్పే ఉపశాన్తమిదం భవేత్
సంసారదుఃఖమఖిలం మూలాదపి మహామతే.　　19

సంకల్పము లెస్సగ శమించునపుడే యీ జగత్తంతయును శమించును. ఓ మహామతీ! సంకల్పాభావముచే ఈ సంసారదుఃఖమంతయు సమూలముగ నశించును.

సంకల్పో హి మనో జీవచ్చిత్తం బుద్ధిః సవాసనా
నామ్నైవాన్యత్వమేతేషాం నార్థేనార్థవిదాంవర.　　20

అర్థవేత్తలలో శ్రేష్ఠుడగు నో కుమారా! ఈ సంకల్పమే మనస్సు, జీవుడు, చిత్తము, వాసనాసహితమగు బుద్ధియునగును. వీనియందలి భేదము నామమాత్రమేగాని యథార్థముగాదు.

సంకల్పనాదృతే నేహ కించిదేవాస్తి కుత్రచిత్
తమేవ హృదయాచ్ఛిన్ధి కిమేతత్పరిశోచసి.　　21

సంకల్పమున కన్యముగ నీప్రపంచమున యెద్దియును లేదు. అట్టి సంకల్పమును నీవు స్వహృదయముచే విచ్ఛిన్నమొనర్పుము. అట్లు గావింపక యేల యివ్విధమున పరితపించుచున్నావు?

యథైవేదం నభః శూన్యం జగచ్ఛూన్యం తథైవ హి
అసన్మయవికల్పోత్థే ఉభే ఏతే తతే యతః.　　22

ఆకాశమువలె యీ జగత్తున్ను శూన్యమైనదే. కాని మరుభూమియందలి మృగతృష్ణ నశించినను మరుభూమి శూన్యముగానట్లే, జగజ్జీవాదులు బాధింపబడినను దృగ్రూపమగు ఆత్మ

శూన్యముగా నేరదు. ఏలన, మృగతృష్ణయు జగత్తున్ను, అసత్స్వరూపములును వికల్పముచే నావిర్భూతములును ఆరోపితములునై యున్నవి.

అసిద్ధం సర్వమేవైతదసిద్ధేనైవ సాధితమ్
సంకల్పేన జగద్యస్మాద్భావనా క్వావతిష్ఠతామ్. 23

స్వయముగ మిథ్యాభూతమగు సంకల్పము మిథ్యాభూతమగు యీ జగత్తునంతయును ప్రకటితమొనర్చినది. కాన నట్టి బాధితపదార్థమును మఱల సిద్ధింపజేయుటయందు భావనయే యెట్లు సంభవమగును?

[సత్యాస్థాయామసత్యాం తు కిం నిష్ఠా వాసనా భవేత్]
భావనాక్షయతః సిద్ధిస్తతః ప్రాప్యం న శిష్యతే
తస్మాదసదిదం సర్వం విజ్ఞేయం హేలయేద్ధయా. 24

జగత్తునందలి సత్యత్వబుద్ధి తొలగగా నిక దేనియందు వాసనయనునది సంభవించును? భావనాక్షయముచే మోక్షసిద్ధి సంప్రాప్తమగును? కాన దృఢాభ్యాసముచే దృశ్యమును రహితమొనర్చి యీ జగత్తంతయు నసత్యమని యెఱుంగవలెను.

తనుభావనయా తేన సుఖదుఃఖైర్న లిప్యతే
అవస్త్వితి చ నిర్ణీయ స్నేహాస్థా న ప్రవర్తతే. 25

దృశ్యరాహిత్యమొనర్చుటచేతను, దేహాదులందాత్మభావము లేకుండుటచేతను, జీవుడు సుఖదుఃఖములందు తగుల్కొనక యుండును. మఱియు దేహబాంధవమిత్రాదులు మిథ్యారూపులని నిశ్చయించుటచే వానియందాసక్తి జనింపక యుండును.

ఆస్థాక్షయే న జాయేతే హర్షామర్షౌ భవాభవౌ
తస్మాదసదిదం సర్వం సుఖదుఃఖాదివిభ్రమైః. 26

ఆసక్తినశించుటచే హర్షామర్ష జననమరణాదులు సంభవింపకుండును. కాన సుఖదుఃఖాది విభ్రమములందు 'ఇదంతయు అసత్త'ని నిశ్చయింపవలెను.

మనో జీవః స్ఫురత్యుచ్చైర్మానసం నగరం జగత్
భవిష్యద్వర్తమానం చ భూతం చ పరివర్తయన్. 27

మనస్సే చిద్వస్తుప్రతిబింబమగు జీవరూపమై, జగద్రూపమగు భూతభవిష్యద్వర్తమాన మానసనగరమును నిర్మించుచు, పరివర్తనము గావింపుచు, నశింపజేయుచు స్ఫురించుచున్నది.

వాసనావలితం లోకే స్ఫురచ్ఛక్తిమనఃస్థితమ్
కరోతి స్వాశయేనేమాం వ్యవస్థాం మలినశ్చలః. 28

ఏలయన, జీవుని యీ మనస్సే విషయసంబంధముచే వాసనాచ్ఛాదితంబును, అధిష్ఠానమగు చైతన్యముయొక్క సంబంధముచే స్ఫురణశక్తియుతమునునై యున్నది. అందుచే మలినమును, చంచలమును యిచ్ఛాప్రేరితమునునై యిట్టిది జగద్రచనాది వ్యవస్థలను గావించుచున్నది.

ఆత్మనః సదృశీం లీలాం జీవో హృద్వనమర్కటః
దీర్ఘమాకారమ[illegible]యు నిమేషాద్యాతి హ్రస్వతామ్. 29



హృదయవనమర్కటమగు జీవుడు స్వకర్మానుసారము లీల యొనర్చుచున్నాడు. అతడే దీర్ఘాకారయుతుడై మఱల శీఘ్రముగ హ్రస్వరూపమును బొందుచున్నాడు.

గ్రహీతుం చ న శక్యన్తే సంకల్పజలవీచయః
మనాగ్దృష్టా వివర్ధన్తే హ్రసన్తి సపరిచ్ఛదాః. 30

సంకల్పజలతరంగములు గ్రహింప శక్యములు గాకున్నను, కించిద్విషయ సందర్శనముచే నుద్బోధితంబై వృద్ధినొందును. కాని విషయవిస్మరణమాత్రమున సపరివారము నశించును.

తృణమాత్రేణ దీవ్యన్తే సంకల్పా వహ్నిశేషవత్
జగత్ప్రకటాకారాః ప్రదీప్తాః క్షణభంగురాః. 31

భ్రమదా జడసంస్థానాః సంకల్పాస్తడిదగ్నయః
యదేవాసన్మయం పుత్ర తదేవాశు చికిత్సితమ్. 32

తృణమాత్రమగు యల్పవిషయముచేగూడ నగ్నికణమువలె సంకల్పము ప్రదీప్తమగును. ఈ జగత్తున అవ్యక్తరూపములును, క్షణభంగురములును, ప్రదీప్తములును, జడత్వము నాశ్రయించి యుండునవియు నగు సంకల్పరూప విద్యుదగ్ని సమూహములు గలవు. కుమారా! ఈ ప్రపంచము నసత్యమైనదంతయు శీఘ్రముగ నివారింపయోగ్యమైనదే యగును.

శక్యతే నాత్ర సందేహో నాసత్సద్భవతి క్వచిత్
సంస్థితో యది సంకల్పో దుశ్చికిత్స్యః స్వతో భవేత్. 33

అసద్వస్తువు సద్వస్తువెన్నటికిని కానేరదు. సంకల్పము సత్స్వరూపమేయగుచో స్వతః నిగ్రహింప దుస్సాధ్యమేయగును.

కిం త్వసద్భూత ఏవైష సుచికిత్స్యస్తదా భవేత్
అకృత్రిమం చేత్సంసార మలమంగార కార్ష్ణ్యవత్. 34

తదేతత్క్షాలనే సాధో కః ప్రవర్తేత దుర్మతిః
కిం త్వేతత్తండులేష్వేవ తుషకఞ్చుకవత్స్థితమ్. 35

కాని సంకల్పమసత్తైనది గాన యద్దాని దమనము సుసాధ్యమేయగును. ఈ ప్రపంచరూప మాలిన్యము సత్యమేయైన నయ్యది అంగారము (బొగ్గు) యొక్క నలుపుదనమువంటిదగును. సాధువగు నో కుమారా! అట్టిచో నద్దాని ప్రక్షాళనమందు యే దుర్బుద్ధి ప్రవృత్తుడగును? అట్లు గాక యియ్యది ధాన్యముపైని పొట్టువంటిదై యున్నది గాన వేఱుజేయవగినదే యగును.

యతస్తతః ప్రయత్నేన పౌరుషేణ వినశ్యతి
అకృత్రిమమపి ప్రాప్తం భృశం పుత్ర తథా పునః. 36

కుమారా! ఈ ప్రపంచస్థితి యనిర్వచనీయమును, అనాదికాలసిద్ధమునునై యున్నది గాన జ్ఞానమను పరమార్థముచే సంపూర్ణముగ నశించును.

సుఖోచ్ఛేద్యతయాజ్ఞస్య సంసారమలమాతతమ్

అతి విస్తారమగు సంసారమాలిన్యమంతయు జ్ఞానిచే సులభముగ యుచ్ఛిన్నమొనర్పబడును.

తండులస్య యథా చర్మ యథా తామ్రస్య కాలిమా. 37

నశ్యతి క్రియయా పుత్ర పురుషస్య తథా మలమ్

నశ్యత్యేవ న సందేహ స్తస్మాదుద్యమవాన్భవ. 38

పుత్రా! ధాన్యముపైని పొట్టు, రాగిపైని చిలుము క్రమముగ దంచుట, తోముట యను క్రియలచే నశించువిధమున యీ సంసారమాలిన్యమున్ను జ్ఞానభూమికాభ్యాసమను పురుష ప్రయత్నముచే నశించును. ఇందు సందియమేమియును లేదు. కాన నీవు ప్రయత్నశీలుడవు కమ్ము.

అసత్కల్పైర్వికల్పైర్యత్సంసారో న జితో ముధా

స్తోకేనాశు లయం యాతి క్వాసద్వస్తు చిరం స్థితమ్. 39

మిథ్యావికల్పయుక్తమగు యీ సంసారము, ఉపాయాభావముచే యింతవఱకు నీచే జయింపబడకున్నది. ఇట్టి అసంకల్పమను యత్నముచే శీఘ్రముగ విలయమొందును. ఏలయన, అసద్వస్తువు చిరకాలమెచటనైన స్థితిగల్గియుండునా?

అసత్యామేతి సంసారః స్వవ్యవస్థాం విచారతః

దీపాలోకాదివాన్ధస్య ద్విన్దుత్వం స్వీక్షితాదివ. 40

అంధకారముననున్నదాని యంధత్వము దీపప్రకాశముచేతను, ద్విచంద్రభ్రమ సమ్యగీక్షణముచేతను అసత్యమగునట్లు, ఈ సంసారవ్యవస్థయు తత్త్వవిచారముచే మిథ్యాత్వము నొందుచున్నది.

నాసౌ తవ న చాస్య త్వం భ్రాన్తిం పుత్ర పరిత్యజ

అసత్యే సత్యవద్దృష్టే భావనామాన్మహీదృశః. 41

కుమారా! నీవీ సంసారమునకు గాని, సంసారము నీకు గాని చెందియుండలేదు. ఈ సంసారభ్రాంతిని నీవు వీడుము సంసారముయొక్క మిథ్యాత్వమెఱింగిన పిదప యద్దానికై చింతించుట నీకు యుక్తము గాదు.

మమ గురువిభవోజ్జ్వలావిలాసా

ఇతి తవ మాస్తు వృథైవ విభ్రమోఽన్తః

త్వమపి చ వితతాశ్చ తే విలాసా

విలసతి సర్వమిదం తదాత్మతత్త్వమ్. 42

ఇత్యార్షే వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే

దాశూరోపాఖ్యానే సంకల్పచికిత్సానామ

చతుఃపంచాశః సర్గః ॥ 54 ॥

కుమారా! 'నేను సంసారిని, పలువిధ విభవయుక్తములగు నా యీ భోగవిలాసములు నిత్యము' లనునట్టిభ్రమ నీకు గలుగకుండును గాక! ఏలయన నీరూపముననను, దృశ్యమానమగు నీ



యీ భోగవిలాసముల రూపముననను, సర్వవిధరూపముల ఆత్మతత్త్వమొకటియే ప్రకాశించుచున్నదగును.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు స్థితిప్రకరణమున

దాశూరోపాఖ్యానమందు సంకల్పచికిత్సయను

చతుష్పంచాశ సర్గము ॥ 54 ॥

---

## పంచపంచాశః సర్గః.

---

శ్రీవసిష్ఠ ఉవాచః—

ఇత్యాకర్ణ్య తదా తత్ర రాత్రావాలపనం ద్వయోః

అహం రఘుకులాకాశ శశాఙ్క రఘునన్దన. 1

పతితః ఖాత్కదంబాగ్రే పత్రపుష్పఫలాకులే

తూష్ణీం నిర్వ్యష్టముక్తాత్మా శృఙ్గాగ్ర ఇవ తోయదః. 2

శ్రీవసిష్ఠుడు.— రఘుకులాకాశచంద్రుడవగు నో రామా! ఇట్లా రాత్రియందు వారిరువుర సంలాపమును విని, శబ్దరహితవృష్టిరూపమున మేఘము పర్వతాగ్రభాగముపై పడులాగున, పత్ర పుష్పఫలాకీర్ణమగు యా కదంబవృక్షాగ్రభాగముపై నేనాకసమునుండి పడితిని.

అపశ్యం తత్ర దాశూరం శూరమిన్ద్రియనిగ్రహే

పరేణ తపసా యుక్తం తేజసేవ హుతాశనమ్. 3

తేజోభిర్దేహనిష్క్రాన్తైః కాంచనీకృతభూతలమ్

తాపయన్తం ప్రదేశం తం భువనం భాస్కరో యథా. 4

ఇంద్రియముల నిగ్రహించుటయందు శూరుడును, అత్యధికతపోయుక్తుడై అగ్నివంటి తేజముగల్గి ప్రకాశించుచున్నవాడును, దేహవినిర్గత తేజఃపుంజములచే భూతలమును సువర్ణ సంకాశముగ నొనర్చుచున్నవాడును, సూర్యునివలె వెలుగొందుచున్నవాడును నగు దాశూరమునిని యచ్చోట నేను వీక్షించితిని.

మామథాలోక్య సంప్రాప్తం దాశూరోఽర్ఘ్యసపర్యయా

వితీర్ణవిష్టరం పత్రపూజయా పర్యపూజయత్. 5

అటకు విచ్చేసిన నన్నవలోకించి యా దాశూరుడు ఆసనార్ఘ్యపాద్యములచే నన్ను లెస్సగ పూజించెను

తతః పూర్వకథాన్తేన సహ దాశూరభాస్వతా

కృతాన్తనయసంబోధాః సంసారోత్తరణక్షమాః. 6

అటు పిమ్మట నేనున్న వారిరువురిని సంబోధించి సంసారతారణసమర్థములగు పలువిధ పూర్వకాలగాథలను వర్ణించి చెప్పితిని.

దృష్టవాం స్తమహం వృక్షం కోరకోత్తరకోటరమ్
దాశూరస్యేచ్ఛయా సర్వైరయతద్భిర్మృగవ్రజైః. 7

సేవ్యమానం వనమివ లతామండలమండితమ్
స్మితేన విస్ఫుటమివ శ్వననస్ఫురితచ్ఛదమ్. 8

లతాకోటిగతైర్భ్రాన్తైశ్చామరైరిన్దుసున్దరైః
శుభ్రాభ్రఖండనికరైః శరన్నభ ఇవావృతమ్. 9

ప్రాలేయకణపద్ధత్యా ముక్తావల్యాభ్యలంకృతమ్
సర్వావయవమేవాచ్ఛ పుష్పపూరైః ప్రపూరితమ్. 10

స్వరేణుచన్దనాలేపైః సమాలబ్ధమఖండితమ్
స్వచ్ఛదాభోగవిపుల రక్తాంబరపరిచ్ఛదమ్. 11

వివాహాయేవ వేషేణ పుష్పభారాతిభారిణా
లతాఙ్గనానుషక్తేన నాగరేణ కృతోపమమ్. 12

అంత పుష్పముకుళములచే పరిపూర్ణమగు అభ్యంతరప్రదేశముగల యాకదంబవృక్షమును నేను గాంచితిని. దాశూరుని యిచ్ఛచే నిర్వ్యాకులమైయున్న మృగసమూహములచే నా వృక్షము సేవింపబడుచుండెను. మఱియు నది లతామండపయుక్తమై వికసితపల్లవములచే శోభించుచుండెను. శరత్కాలమందు ధవళమేఘపంక్తిచే నాకసమాచ్ఛాదింపబడునట్లు శాఖాగ్రభాగముల సంచరించుచున్నవియు, చంద్రునివలె యతిసుందరములును నగు చమరమృగములయొక్క పుచ్ఛములచే నావృక్షము గప్పబడియుండెను. హిమకణయుక్తమగు నయ్యది ముక్తాసమూహంబులచే నలంకరింపబడినట్లుండెను. మఱియు నావృక్షమంతటను పుష్పములచే పరిపూర్ణమైయుండెను. పుష్పరేణువులను చందనముచే నది సర్వత్ర లిప్తమై వెలయుచుండెను. పల్లవవిస్తారయుక్తమై యయ్యది విశాలరక్తవర్ణ వస్త్రము ధరించియున్నట్లుండెను. ఇక్కారణమున పుష్పభారయుక్తమగు నా కదంబవృక్షము నగరనివాసులచే వివాహార్థము కల్పింపబడిన వేషమును ధరించిన లతాసమూహములను యంగనలచే పరిసేవితమైయున్నట్లు గన్పట్టుచుండెను.

మునిబద్ధోటజాకార లతామండపమండితమ్
మంజరీభిః పతాకాభిర్యుక్తం పురమహోత్సవే. 13

మృగకండూయనధ్వస్త పుష్పధూలివిధూసరమ్
ప్రోత్సారితోపాన్తవనం వృషమల్లమివోత్థితమ్. 14

బర్హిభిః కుసుమోద్యాన్త పరాగపరిపాటలైః
నిశ్శేషశుష్తసంధ్యాభ్ర బాలవాలమివాచలైః. 15



ప్రవాలారుణహస్తేన కుసుమస్మితశోభినా
మధునా ఘూర్ణమానేన ప్రాప్తేన పులకత్విషా. 16

సీరంధ్రపుష్పపూర్ణేన ఘూర్ణితేన వనానిలైః
నిద్రాలు కుడ్మలదృశా స్తబక స్తనధారిణా. 17

పుష్పజాలరజఃపుంజ కుంకుమారుణవాససా
లతావితానసిలయ వాతాయననిషక్తిణా. 18

ఆ వృక్షము మునులకుటీరములవంటి యాకృతిగల లతామండపములచే శోభించుచు, మహోత్సవసమయమందలి నగరమువలె లతాసముదాయమను పతాకములచే వ్యాప్తమైయుండెను. మృగములు ఘర్షణచే రాలిన పుష్పపరాగముచే ధూసరమైయుండెను. మఱియు నది సమీపస్థవనమును నిర్జించి చెన్నొందుచుండెను. పుష్పపరాగములచే శ్వేత, రక్తవర్ణయుక్తములైయున్న మయూరములు తమ కేశములచే సంధ్యాకాల మేఘపంక్తియను కేశముల గ్రహించు పర్వతములవలె నుండెను. నూతనపల్లవములను రక్తముగలదియు, పుష్పములను హాస్యముతోకూడి వసంతయుక్తమై భాసించుచున్నదియు, కేసరములను పులకితశరీరశోభ గలదియు, నిరంతరము పుష్పములచే పరిపూర్ణమును, వనవాయుసహితమై మదించియున్నట్లు తోచునదియు, ముకుళములను నిద్రితుని దృష్టిగలిగియున్నదియు, లతాయుక్త పుష్పగుచ్ఛములను స్తనములుగలదియు, పల్లవములను హస్తములచే స్పృశించుచున్నదియు, పుష్పపరాగమను కుంకుమయును రక్తవస్త్రమును ధరించినదియు, లతానిర్మితమండపము లనునట్టి గృహవాతాయనములందనురక్తయు నగు యంగనవోలె నా వృక్షము శోభించుచుండెను.

నీలపుష్పలతాదోలా లీలాలాస్యవిలాసినా
ఆపాదమస్తకప్రాన్తం సర్వతోనిర్మితాలయమ్. 19

వృన్దేన వనదేవీనాం కోకిలాలాపశాలినా
సందిగ్ధమంజరీజాల మలినేత్రేణ భాసినా. 20

అవశ్యాయోపశమిత రతిఖేదైర్మదాలసైః
పుష్పధూలిసమాలబ్ధై రాశ్లిష్టైర్నిబిడం మిథః. 21

పుష్పాన్తరాన్తఃపురగైః కిమపి ప్రణయోచితమ్
ధ్వనద్భిరభితః స్వచ్ఛ మత్తాలియుగలైర్వృతమ్. 22

కాననోపాన్తనగరీ ఘుంఘుమాకర్ణనేచ్ఛయా
క్షణముత్కర్ణమాశాన్త చారువర్ణాటాంకృతైః. 23

క్షణందలాగ్రవిశ్రాన్త ముగ్ధముగ్ధశిరస్తయా
పశ్యద్భిరివ్యాంశుకవ జ్జాలామర్ణవమేఖలామ్. 24

మఱియు నా కదంబవృక్షము నీలవర్ణపుష్పములు గల లతలచే నిర్మితములగు యూయెలలందు కౌతుకముచే నాడు విలాసపురుషుని భంగి చెన్నొందుచున్నదియు, కోకిలధ్వనులచే శోభితమును

దేవీగణసేవితమును, ఆపాదమస్తకము సర్వావయవములచే పక్ష్యాదుల కాశ్రయభూతమును, కృష్ణవర్ణ నయనలగు వనదేవతలా యని భ్రమింపజేయు భ్రమరయుక్త లతాసమూహముగలదియు, హిమకణములచే రతిఖేదనివారకమును, పుష్పపరాగయుక్తమును, ఘనశాఖాయుతమును, పుష్పకోశమను యంతఃపురమున చరించునదియు, క్షేమ సుకూల వ్యవహారము సల్పుచు స్వచ్ఛమై యలరుచున్నదియు, భ్రమరద్వయములచే నావృతమునునై యుండెను. నీలవర్ణమక్షికల మధురశబ్దములుగల్గి, సమీప ప్రదేశమను స్వనగరమందలి మృగపక్ష్యాదుల శబ్దము వినుటకై క్షణకాలము కర్ణముల నూర్ధ్వముఖ మొనర్చినట్లుండెను. పత్రముల యగ్రభాగములందు విశ్రమించుచున్న రమణీయసిగలచే చంద్ర కిరణములను వస్త్రములచే నాచ్ఛాదితమై యున్నట్లున్నదియు, సప్తసముద్ర మేఖలాయుక్తమగు భూమిని చూచుచున్నదియునై యుండెను.

వనస్థలీనాం తనయై ర్నయైర్మూర్తిమివాస్థితైః
శుభైః పత్రపుటేష్వన్త ర్మృగైః సారతలాన్తరమ్. 25

నీడశ్వసత్సువిశ్వస్త సుప్తమాత్రకపక్షిణమ్
పాకచ్యుతఫలోపాన్త భూతకంచుకమండలీ. 26

సందిగ్ధమూకభ్రమరం గుచ్ఛైః పూజాక్షసూత్రకైః
శ్యామలీకృతపర్యంతం నీడైః పల్లవమండితైః. 27

సుగన్ధితాశేషవనం పుష్పమేఘీకృతాంబరమ్
ధూలీకదంబశబల ఫలౌఘవలితం తలే. 28

అయ్యది వనభూమిసుతుడుగను, మునిప్రభావమున మూర్తివంతమైయున్న వినయముగను గన్పట్టుచుండెను. పత్రాంతర్భాగమున లీనమైయున్న యుత్తమమృగములచే నద్దాని యధోభాగమును శాఖాద్యవయవములును శోభితములైయుండెను. అమ్ముని యనుగ్రహముచే పక్షిగణము తమ తమ గూళ్లయందు శ్వాసగైకొనుచు సుఖముగ నిదురించుచుండెను. పక్వములై వ్రాలిన భ్రమర సంయుక్త ఫలముల చెంతనున్న మృగాదులను కనుచుచే నయ్యది నలువైపుల వ్యాప్తమైయుండెను. సమ్మర్దనభయంబున భ్రమరములు శబ్దరహితములైయుండెను. ఆ వృక్షము అక్షమాలవలె పొడవైన లతాగుచ్ఛములచే నవ్వనమునంతయును సుగంధిత మొనర్చుచు, పత్రనిర్మితములగు గూళ్లచే శ్యామ వర్ణయుక్త ప్రదేశముగల్గి యలరారుచుండెను. మఱియు నయ్యది పుష్పసమూహములను మేఘములచే నాకాశమును గప్పుచు మూలప్రదేశమున పుష్పపరాగములచేతను, నానావిధ ఫలములచేతను వ్యాప్తమై యుండెను.

బహునాఽత్ర కిముక్తేన న కించిదపి విద్యతే
పత్రం యత్ర తరౌ యత్ర నోష్యతే వా న యుజ్యతే. 29

పత్రేపత్రే మృగాః సుప్తా విశ్రాన్తాశ్చ పదేపదే
కచ్ఛేకచ్ఛే ఖగా లీనా స్తస్య భూరుహభూపతేః. 30

వెయ్యేల; ఆ వృక్షమందు ప్రాణులు నివసింపనిదియు, ఉపయుక్తము కానిదియు నగు నొక పత్రమైనను లేదు. ఆ వృక్షము క్రింద వ్రాలిన ప్రతిపత్రముపైనను మృగములు శయనించుచు



యంతటను విశ్రాంతి నొందుచుండెను. ఆ వృక్షరాజముయొక్క పత్రములన్నియు పక్షి సమూహములచే నిండి యుండెను.

ఏవంగుణవిశిష్టం తం సమాలోకయతో మమ
మహోత్సవేన సదృశీ సా బభూవ తమస్వినీ. 31

ఇట్టి విశిష్టగుణములు గల్గియున్న యా వృక్షమును బరికించుచుండ నాకారాత్రి యెంతయు మహోత్సవముగ గన్పట్టెను.

తతః కథాభిరమ్యాభిః స తస్య తనయో మయా
విజ్ఞానాలోకరమ్యాభిర్నీతో బోధం పరం పునః. 32

అటుపిదప విజ్ఞానప్రకాశముచే నతిరమణీయములగు కథాప్రసంగములచే మఱల నేనా దాశూరతనయునకు లెస్సగ ప్రబోధము గావించితిని.

ఆవయోస్తత్ర చిత్రాభిః కథాభిరితరేతరమ్
శర్వరీ సా వ్యతీయాయ ముహూర్త ఇవ కాన్తయోః. 33

ఇట్లిర్వుర పరస్పర కథా సల్లాపములచే నారాత్రి సమాగమయుక్తులగు స్త్రీ పురుషుల ముహూర్తకాలమువలె గడచెను.

ప్రాతః ప్రతనుతాం యాతే పుష్పర్ధి ఘనజాలకే
స్వర్గాంగనాంగభోగాభే తారకానికరే శనైః. 34

ఆకదంబనభోభాగ ముపయాతం సుతాన్వితమ్
అహం విసృజ్య దాశూరం తతోఽమరనదీం గతః. 35

తత్రాభిమతమాసాద్య స్థానమేత్య నభస్తలమ్
ప్రవిశ్య ఖం మునీనాం చ మధ్యం స్వస్థ ఇవ స్థితః. 36

పిమ్మట ప్రాతఃకాలమున పుష్పసమూహములవలె శోభించుచున్న తారాగణంబులు క్రమముగ కాంతిహీనములవలన, కదంబవృక్షాకాశపర్యంతము పుత్రసహితుడై నన్నే తెంచుటకు వచ్చిన దాశూరుని స్వస్థానమునకు పంపివైచి నేనాకాశమార్గమున దేవగంగానదిఁగూర్చి బయనమైతిని. అట యభిమతస్థానమునకుఁజని మఱల నాకాశమునఁ బ్రవేశించి మునులమధ్యమున స్వస్థుఁడనై యుంటిని.

దాశూరాఖ్యాయికైషా తే కథితా రఘునన్దన
జగతః ప్రతిబింబాభా సత్యాకారాప్యసన్మయీ. 37

ఓ రామచంద్రా! జగత్ప్రతిబింబమువలె అసత్యమైనను సత్యముగదోచు నీ దాశూరాఖ్యాయికను నీకిపుడు వర్ణించి చెప్పితిని.

దాశూరాఖ్యాయికేవేయ మిత్యేతత్కథితం మయా
తుభ్యం రాఘవ బోధాయ జగద్రూపనిరూపణే. 38

రాఘవా! ఈ జగత్తు దాశూరాఖ్యాయికవంటిదేయని బోధించుటకొఱకై జగత్స్వరూప నిరూపణ సందర్భమున నీకిద్దానిని జెప్పితిని.

తస్మాదవాస్తవీం త్యక్త్వా వాస్తవీమపి రంజనామ్
దాశూరసిద్ధాన్తదృశా సదోదారో భవాత్మవాన్. 39

కాన వాస్తవమును, అవాస్తవమును నగు 'నేను' 'నాది' ఇత్యాదుల యధ్యాసమును ద్యజించి దాశూరోపదిష్టసిద్ధాన్తదృష్టి నవలంబించి యుదారచిత్తుడవును, ఆత్మనిష్ఠుడవును గమ్ము.

తస్మాద్వికల్పం మలమాత్మనస్త్వం
నిర్ధూయ పశ్యామలమాత్మతత్త్వమ్
ఆసాదయిష్యస్యచిరాత్పదంత
ద్భవిష్యసీజ్యో భువనేషు యేన. 40

ఇత్యార్షే వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
దాశూరోపాఖ్యానే వసిష్ఠదాశూరమేలనం నామ
పంచపంచాశః సర్గః ॥ 55 ॥
దాశూరోపాఖ్యానం సమాప్తమ్.

ఓ రామా ! వికల్పాత్మకమనంబునకు హేతువగు అజ్ఞానమాలిన్యమును కడిగివైచి ఆత్మతత్త్వము నవలోకించుచో శీఘ్రముగ మోక్షపదమునొంది చతుర్దశ భువనములందును పూజ్యుడవు కాగలవు.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు స్థితిప్రకరణమున
దాశూరోపాఖ్యానమందు వసిష్ఠదాశూరసమ్మేళనమను
పంచపంచాశ సర్గము ॥ 55 ॥
దాశూరోపాఖ్యానము సమాప్తము.

---

## షట్పంచాశః సర్గః.

---

శ్రీ వసిష్ఠ ఉవాచః—

నాస్తీదమితి నిర్ణీయ సర్వతస్త్యజ రంజనామ్
యన్నాస్తి తత్ప్రతి కిల కేవాస్థేహ విచారిణామ్. 1

శ్రీవసిష్ఠుడు:— ఓ రామా ! జడాత్మకమగు యీ ప్రపంచము లేదని నిర్ణయించి 'నేను, నాది' యన్నగు అభేదాధ్యాసరూపములందలి విశ్వాసమును త్యజింపుము. లేనిదానియందు వివేకులకు విశ్వాసమేల గల్గును?

దృశ్యమానమథేదం చేదస్తి సత్తాముపాగతమ్
తిష్ఠస్వాత్మని బధ్నాసి త్వం కిమత్ర కిలాత్మతామ్. 2



దేహాదిరూపమగు యీదృశ్యజగత్తు ఆత్మకంటె వేఱుగ సత్తనుబొందియున్నచో, నీవున్ను నిరపేక్షుండవై అసంగమును, యుదాసీనమును చిద్రూపమును నగు స్వాత్మయందు స్థితుడవగుము. అధ్యాసముచే ఆత్మకంటె వేఱగు దేహాదులందు నీవాత్మత్వమేల యారోపించుకొనుచున్నావు?

అథ చేదస్తి నాస్తీదమితి నిశ్చయవానసి
తథాపి భావనాసంగః కథం యుక్తశ్చలాచలే. 3

ఇక ఈ జగత్తు సదసత్తను నిశ్చయము నీకు గల్గియున్నచో, సదసద్రూపముచే అనియత స్వభావము గల్గియుండు దేహాది దృశ్యజగత్తునందు నీకు విశ్వాసము తగదు.

నేదమస్తి జగద్రామ తవ నాస్తి మహామతే
కేవలం స్వచ్ఛమేవేత్థ మాతతం మితమీదృశమ్. 4

మహామతివగు నో రామా! ఈ జగత్తు లేదని నీవు నిశ్చయించుచో యిక బంధమే యుండదు. కేవలము నిర్మలమును, వ్యాపకమును, అనంతమును, సర్వప్రమాణసిద్ధమును నగు ఆత్మతత్త్వము మాత్రము శేషించును.

నేదం కర్తృకృతం కించిన్న వా కర్తృకృతక్రమమ్
స్వయమాభాసతే చేదం కర్త్రీ కర్తృపదంగతమ్. 5

ఈ జగత్తు కర్తచే నొనర్పబడినది కాదు. మఱియు నిట కర్తచే గావింపబడిన క్రమమియ్యదియు లేదు. (ఆత్మ సన్నిధాన మాత్రమున) కర్త్రి కర్తృపదంబును బొంది జగత్తు స్వయముగ భాసించుచున్నది.

అకర్తృకం జగజ్జాలం భవత్వథ సకర్తృకమ్
మాత్వమేతేన శబలం భావయన్నాస్వచేతసి. 6

ఈ జగజ్జాలము కర్తృసహితమైనను, అకర్తృసహితమైనను నీవు మాత్రము పరస్పరాభేదాధ్యాసముచే సంభవించు దేహాదులందలి ఆత్మభావమును త్యజించి బుద్ధ్యుపాధిచే పరిచ్ఛిన్నమగు దేహాదులందు స్థితిగల్గియుండక వర్తింపుము.

సర్వేంద్రియవిహీనాత్మా కర్తేవ సజడోపమః
అకర్తృ చ తదా మన్యే కాకతాలీయవజ్జగత్. 7

సర్వేంద్రియరహితమై జడమును బోలియుండి ఆత్మ స్వసత్తామాత్రముచే జగత్తునకు కర్తవలె గన్పట్టుచున్నదనినను, కాకతాలీయన్యాయముచే జగత్తు కర్తృరహితమనియే నెంచుచున్నాను.

కాకతాలీయయోగేన జాతం యత్కించిదేవతత్
తస్మిన్భావానుసంధానం బాలో బధ్నాతి నేతరః. 8

ఏలన, కాకతాలీయన్యాయముచే యుత్పన్నమైనది యుత్పన్నము గానిదే యగును. అది అనిర్వచనీయము గాన యద్దానినిగూర్చి అజ్ఞుడే మఱల మఱల చింతించును గాని వివేకి గాదు.

న కదాచిదిదం శాన్తం జగద్రామ న చ క్షయి
అజస్రం దృశ్యమానత్వాద్భావిత్వాచ్చ పునఃపునః. 9

ఓ రామా! ఈ జగత్తు కేవల మత్యంతాభావరూపము గాదు, ప్రధ్వంసాభావయుక్తమై శూన్యస్వభావము కలదియును గాదు. ఇయ్యది ప్రవాహరూపమున గిన్పట్టునదియు మఱల మఱల యుత్పన్నమగునదియునై యున్నది.

న కదాచిదిదం చాస్తి జగద్రామ న చ క్షయి
అజస్రం క్షీయమాణత్వా న్నాస్తిత్వాచ్చానుమానతః. 10

ఓ రామా! ఈ జగత్తు నిత్యసత్తాస్వభావముగలదికాదు, క్షణికసత్తాస్వభావము గలదియును కాదు. ఏలన నియ్యది నిత్యపరిణామ భేదముచే క్షయశీలమును, అనుమానముచే అసత్స్వభావయుతమునునై యున్నది.

సర్వేంద్రియపదాతీతో యదాకర్తైవ విజ్వరః
కుర్వాణః సర్వదా ఖేదం న కదాచన గచ్ఛతి. 11

ఇద్దాని కర్త సర్వేంద్రియాతీతుడును, త్రివిధతాపవర్జితుడును యనిన, ఆత్తటి జగత్కార్యమును నిరంతరము జేయుచున్నను యాతడు ఖేదమును పొందకనే యుండును. ఏలయన ఆత్మయొక్క సన్నిధానమాత్రముచే జగత్కార్యము సిద్ధించుచున్నది గదా.

తేనేయం నియతిః ప్రోథా భావాభావదశామయీ
ఈదృశ్యైవ స్థిరా దీర్ఘా మిథ్యోత్థాపి చ దృశ్యతే. 12

ఇక్కారణమున జగత్స్థితి సదసద్రూపమై అనగా అనిర్వచనీయమై యున్నది. నిరంతర మిట్టి స్థితియేగల్గి, విశాలాకారవంతమై మిథ్యారూపమున యావిర్భవించుచున్నట్లు దృశ్యమానమగుచున్నది.

అపర్యన్తస్య కాలస్య కశ్చిదంశః శరచ్ఛతమ్
తావన్మాత్రమహాశ్చర్యః కిమర్థం సోఽనుధావతి. 13

మానవజీవిత పరిమితియగు నూఱువత్సరముల కాలము అనంతకాలమందలి స్వల్పాంశమే యగును. అట్టి స్వల్పకాలమందగూడ మానవుడు [illegible] సర్వేంద్రియాతీతమగు ఆత్మ విషయాభిముఖమగుటయు మిగుల నాశ్చర్యకరమై[illegible].

స్థిరాశ్చేజ్జగతాం భావా స్తత్త్వాదాస్థా న శోభతే
కథమన్యోన్యసంశ్లేషో జడచేతనయోః కిల. 14

కర్తృరహితమగు యీ జగత్తునందలి దేహాది సమస్త పదార్థములను స్థిరములని యెంచినను వాని నపేక్షించుట యుక్తముగాదు. అసంగమగు చైతన్యమునకును జడపదార్థమునకును పరస్పర సంయోగమెట్లు సంభవించును?

అస్థిరాశ్చేజ్జగద్భావా స్తదపాస్థా న శోభతే
[illegible] ఫేనాస్థిరన్యస్తే దుఃఖమేషా దదాతి తే. 15



ఈ జగత్పదార్థము లస్థిరములైనచో వానినపేక్షించుట యుక్తముకాదు గదా. ఏలయన, బుద్బుదమువలె చంచలములైన దేహాదులు నశించునవిగాన, వానియందలి యాసక్తి దుఃఖమునే గల్గించును.

ఆస్థాబన్ధో మహాబాహో జగద్భావత్వమాత్మనః
న స్థిరా స్థిరయోః ఫేనశైలయోరివ రాజతే. 16

[illegible]వగు నో రామచంద్రా! ఉత్పత్తి వినాశయుక్తమగు దేహాది దృశ్య[illegible] ఆత్మ[illegible]పమొనర్చుట, అనగా ఆత్మను జగత్స్వభావయుక్తముగ జూచుట బంధమే యగును. [illegible], స్థిరాస్థిర స్వభావయుక్తములగు ఆత్మ జగత్తుల సంబంధము ఫేన పర్వతముల సంబంధమువలె శోభింపనేరదు.

సర్వకర్తాప్యకర్తైవ కరోత్యాత్మా న కించన
తిష్ఠత్యేవముదాసీన ఆలోకం ప్రతి దీపవత్. 17

సమస్తమునకును కర్తయైనను ఆత్మ అకర్తయేయగును. ఏలన నయ్యది యేమియు [illegible]నర్పనిద్ర ప్రకాశక్రియయందు దీపమువలె నుదాసీనముగ నుండును.

కుర్వన్న కించిత్కురుతే దివాకార్యమివాంశుమాన్
గచ్ఛన్న గచ్ఛతి స్వస్థః స్వాస్పదస్థో రవిర్యథా. 18

సూర్యుడు ప్రాణులందఱి దైనికకృత్యములకు హేతువైనను వాస్తవముగ నేమియు [illegible]నర్పకున్నట్లు, ఆత్మయున్ను యేమియు నొనర్చుట లేదు. మఱియు స్వప్రతిభయందు ప్రతిష్ఠితమై [illegible] సూర్యునివలె చలించుచున్నను ఆత్మ యథార్థముగ చలింపకయే యున్నది.

యతః కుతశ్చిదేవేదం సంపన్నమివ లక్ష్యతే
అరుణాతీరవద్వారి పూరావర్తవదాతతమ్. 19

'అరుణా' నదీతీరము స్వభావముగనే శిలామయమైయున్నట్లు, ఈ జగత్తు స్వభావముగనే అనిర్వచనీయరూపమున లక్షితమగుచున్నది. మఱియు, ఆ నదియందు జలప్రవాహము అధోమార్గమున జనుచుండును గాన, రెంటి (శిలాజలముల) యొక్క సన్నిధానముచే ఆవర్తము లాకస్మికముగ సిద్ధించు విధమున, జడచేతనముల సంయోగమాత్రముచే నీజగత్తున్ను ఆకస్మికముగ నుత్పన్నమైనదగును గాన యిందు కర్త యెవరును లేరు.

ఇతి చేద్భవతా రామ నైపుణ్యేనావధారితమ్
ప్రమాణపరిశుద్ధేన చేతసా చ విచారితమ్. 20

తథాపి భావనాం సాధో పదార్థం ప్రతి నార్హసి
అలాతచక్రే స్వప్నే చ భ్రమమేవాకేవభావనా. 21

సాధువగు నో రామా! ఈ జగత్తు ఆత్మసన్నిధానమాత్రమున నుత్పన్నమగుచున్నదను [illegible]యమును నీవు బాగుగ నిశ్చయించినను, ప్రమాణమున కతీతమగు శుద్ధచిత్తముచే నద్దానిని

విచారించినను, దేహాది పదార్థములందాత్మభావన నీకు దగదు. ఏలనన, అలాతచక్ర (కొఱవి), స్వ
భ్రమాదులందు భావనయే యెట్లు పొసగును.

అకస్మాదాగతో జన్తుః సౌహార్దస్య న భాజనమ్
భ్రమోద్భూతం జగజ్జాల మాస్థాయా స్తన్న భాజనమ్.

ఆకస్మికముగ నేతెంచినవాడు మిత్రత్వమునకు పాత్రుడుగాని చందమున భ్రమచే నుత్ప
మైన యీ జగత్తున్ను విశ్వాసపాత్రము గానేరదు.

ఔష్ణ్యేన్దౌ శీతలే భానౌ మృగతృష్ణాజలే తథా
యథా న భావయస్యాస్థామేవం భావయమాస్థితౌ.

చంద్రునియం దుష్ణత్వమును, సూర్యునియందు శీతలత్వమును, మృగతృష్ణయందు జల
భావింపకయుండునట్లే యీ జగత్ - స్థితియందును భావనయొనర్పక యుండుము.

సంకల్పపురుషస్వప్న జనద్వీన్దుత్వవిభ్రమమ్
యథా పశ్యసి పశ్య త్వం భావజాతమిదం తథా.

సంకల్ప, స్వప్న పురుష, ద్విచంద్రభ్రమలనువలెనే యీ జగత్సమూహ పదార్థజాతమంత
వీక్షింపుము.

అన్తరాస్థాం పరిత్యజ్య భావశ్రీభావనామయీమ్
యోఽసి సోఽసి జగత్యస్మిం ల్లీలయా విహరానఘ.

పాపరహితుడవగు నో రామా! భావనామయమగు యీ ప్రాపంచిక విషయముల
విశ్వాసమును త్యజించి, నీపారమార్థిక రూపమెయ్యదిగలదో, యద్దానితో లీలామాత్రముగ నీ జగ
బున విహరింపుము.

అకర్తృత్వపదం పీత్వా పీత్వేచ్ఛామపి కుర్వతః
సర్వభావాన్తరస్థస్య సర్వాతీతస్య చాత్మనః.

సమస్త పదార్థముల యాభ్యంతరమున నున్నదియు, సర్వమునకతీతమును నగు ఆత్మయొక్క
కర్తృత్వాకర్తృత్వములను, వానిఁగూర్చిన యిచ్ఛను తొలగించి, శేషించిన పారమార్థిక రూపము
పరిగ్రహించి జగంబున విహరింపుము. అత్తరి నీవు సాక్షిమాత్రుడవై యిచ్ఛారహితముగ వ్యవహరించ
నీ యొక్క సన్నిధానమాత్రముననే నియతి జగద్వ్యవహార రూపమున ప్రవర్తించును.

ఇదం సన్నిధిమాత్రేణ నియతిః పరిజృంభతే
దీపసన్నిధిమాత్రేణ నిరిచ్ఛైవ ప్రకాశతే. 27

దీపపు సన్నిధానమాత్రమున అనిచ్ఛాపూర్వకముగనే ప్రకాశము విస్తరించునట్లు
జగన్నియతియు ఆత్మసన్నిధానమాత్రముచే తన రూపమును విస్తరించుచున్నయది.

అభ్రసన్నిధిమాత్రేణ కుటజాని యథా స్వయమ్
ఆత్మసన్నిధిమాత్రేణ త్రిజగన్తి తథా స్వయమ్.



మేఘసన్నిధిమాత్రమున కుటజ (కొండమల్లె) పుష్పములు స్వయముగ వికసించునట్లు,
ఆత్మసన్నిధిమాత్రమున ముల్లోకములును స్వయముగ నుత్పన్నమగుచున్నవి.

సర్వేచ్ఛారహితే భానౌ యథా వ్యోమని తిష్ఠతి
జాయతే వ్యవహారశ్చ సతి దేవే తథా క్రియా. 29

సర్వేచ్ఛారహితుడగు సూర్యుండాకసమున స్థితినొందినమాత్రముననే జగద్వ్యవహార
మంతయు సిద్ధించునట్లు, పరమాత్మయొక్క సత్తామాత్రముచే నీ జగత్క్రియయంతయు సంభవించు
చున్న.

నిరిచ్ఛే సంస్థితే రత్నే యథా లోకః ప్రవర్తతే
సత్తామాత్రేణ దేవే తు తథైవాయం జగద్గణః. 30

అతః స్వాత్మని కర్తృత్వ మకర్తృత్వం చ సంస్థితమ్
నిరిచ్ఛత్వాదకర్తాసౌ కర్తా సన్నిధిమాత్రతః. 31

ఇచ్ఛారహితముగనే రత్నముచే లోకమున ప్రకాశముత్పన్నమగు విధమున పరమాత్మయొక్క
సత్తామాత్రముచే జగత్సమూహము ఉత్పన్నమగుచున్నది. ఇక్కారణమున ఆత్మయందు కర్తృత్వా
కర్తృత్వములు రెండును గలవు. ఇచ్ఛారహితమగుటచే అకర్తయు, సన్నిధానమాత్రముచే కర్తయు
నగును.

సర్వేంద్రియాద్యతీతత్వా త్కర్తా భోక్తా న సన్మయః
ఇంద్రియాన్తర్గతత్వాత్తు కర్తా భోక్తా స ఏవ హి. 32

ఇంద్రియములకు విషయము గానందుచే సత్యస్వరూపమగు పరమాత్మ కర్తయు, భోక్తయు
గానేరదు. మఱియు సత్తామాత్రమున యింద్రియాంతర్గతమై యుండుటచే కర్తయు, భోక్తయును
నగును.

ద్వే ఏవాత్మని విద్యేతే కర్తృతాకర్తృతానఘ
యయైవ పశ్యసి శ్రేయ స్తామాశ్రిత్య స్థిరో భవ. 33

పాపరహితుడవగు నో రామా! ఇవ్విధమున ఆత్మయందు కర్తృత్వాకర్తృత్వములు
రెండును గలవు. ఈ రెంటియందెద్దానిని నీవు శ్రేయఃప్రదముగ దలంతువో దానినే యాశ్రయింపుము.

సర్వస్థోఽహమకర్తేతి దృఢభావనయాఽనయా
ప్రవాహపతితం కార్యం కుర్వన్నపి న లిప్యతే. 34

'సమస్త పదార్థములయందును వ్యాపించియున్న చిత్స్వరూపుడనగు నేను అకర్త'నను దృఢ
భావనగల్గి ప్రవాహపతిత (ప్రాప్తించిన) కార్యముల నాచరించుచో మనుజుడు కర్మలచే లిప్తుడు
గానేరడు.

యాతి నీరసతాం జన్తురప్రవృత్తేశ్చ చేతసః
యస్యాహం కించిదేవేహ న కరోమీతి నిశ్చయః. 35

'శుద్ధస్వరూపుఁడనగు నేనేమియు నొనర్చుటలేదు'ను నిశ్చయము గలవాఁడు, చిత్తము యొక్క అప్రవృత్తికారణంబున వైరాగ్యమును బొందును.

భోగౌఘకామనాం స్తత్ర కః కరోతు జహాతు వా
తస్మాన్నిత్యమకర్తాఽహమితి భావనయేద్ధయా. 36
పరమామృతనామ్నీ సా సమతైవావశిష్యతే
అథ సర్వం కరోమీతి మహాకర్తృతయా తయా. 37
యదీచ్ఛసి స్థితిం రామ తత్త్వామప్యుత్తమాం విదుః
అహో యన్న కరోమీహం సమగ్రం జాగతం భ్రమమ్. 38
రాగద్వేష భ్రమ స్తత్ర కుతోఽన్యస్యాస్య సంభవాత్
యదన్యేన శరీరం తు దగ్ధమన్యేన లాలితమ్. 39
సోఽస్మదారంభ ఏవాతః కః ఖేదోల్లాసయోః క్రమః
మత్సుఖాసుఖవిస్తారే జగజ్జాలోదయే. 40
అయం కర్తేతి మత్వాన్తః కః ఖేదోల్లాసయోః క్రమః

భోగములందపేక్షయే లేనపుడు మనుజుఁడెద్దాని నాచరించును? కాన 'నేనెల్లపుడును అకర్తనే యగుదు'నను దృఢభావనచే పరమామృతమనఁబఱగు సమత్వమే శేషించును; లేక, 'అంతయు నేనే యొనర్చుచున్నాన'ను మహాకర్తృత్వభావమందు స్థితిఁబొందదలంచుటయున్ను యుత్తమమేయని వచింపబడినది. శుద్ధస్వరూపుఁడనగు నేను యీ జగద్భ్రమనేమియు నొనర్పక యున్నందున, నాకంటె నన్యమగునది సంభవింపమిచే నిక రాగద్వేషములకు నాయందు తావెచట? ఇఁక కర్తృత్వపక్షమందును, 'అన్యులచే దగ్ధమొనర్పబడిన పూర్వజన్మశరీరమునకు అన్యులచే లాలింపబడు యీ దేహమునకు కారకుఁడను నేనే యగుదున'ను నిశ్చయముచే నిక సుఖదుఃఖము లేల గల్గును? ఏలయన, 'నా యీ సుఖదుఃఖ విస్తారంబునకు హేతువగు జగత్తుయొక్క ఉత్పత్తి వినాశములకు కర్తను నేనే' యని నిశ్చయించు మనుజునకిక సుఖదుఃఖములేల?

ఖేదోల్లాసవిలాసేషు స్వాత్మకర్తృతయైతయా.
స్వయమేవ లయం యాతే సమతైవావశిష్యతే 41
సమతా సర్వభూతేషు యాసా సత్యాపరాస్థితిః. 42

ఆత్మయొక్క సమష్టిరూప కర్తృత్వముచే సుఖదుఃఖంబులు స్వయముగ విలీనమవ, కేవలము సమత్వమే శేషించును. మఱియు సర్వభూతములందలి సమభావమే సర్వోత్తమస్థితి యగును.

తస్యామవస్థితం చిత్తం న భూయో జన్మభాఙ్మనాక్
అథవా సర్వకర్తృత్వ మకర్తృత్వం చ రాఘవ. 43
సర్వం త్యక్త్వా మనః పీత్వా యోఽసి సోఽసి స్థిరో భవ
అహంసోఽహమయం నాహం కరోమీదమిదం తు న. 44
ఇతి భావా[illegible] [illegible]స్థిర్న తుష్టయే



అట్టి సమత్వమందు స్థితిఁబొందువాఁడు మఱల యెన్నటికిని జన్మనుబొందఁడు. ఓ రామా! కర్తృత్వాకర్తృత్వముల నన్నింటిని త్యజించి మనస్సునుగూడ నశింపజేసి నీ శుద్ధరూపమెయ్యది గలదో యద్దానియందే స్థిరుడవుగమ్ము. 'అహంకార, దేహేంద్రియాదులు నేనుగానందున నేనేమియు నొనర్చువాడను గాను' — ఇవ్విధమున ఆత్మయొక్క కర్తృత్వాదులను నిషేధించి 'త్వం' పదార్థమాత్రమున స్థితిఁబొందినను ('తత్త్వమసి' యందలి) తత్పదార్థము లభింపమిచే, పూర్వోక్త భావానుసంధానరూపమగు దృష్టి తృప్తికరమును పూర్ణమును గాజేరదు. (అనగా, దృశ్యవస్తువుల నిరసించుటతో బాటు తచ్ఛబ్దలక్ష్యభూతమగు ఆత్మస్వరూపమునుగూడ భావింపవలెననుట)

సా కాలసూత్రపదవీ సా మహావీచివాగురా. 45
సాసిపత్రవనశ్రేణీ యా దేహోఽహమితి స్థితిః
సా త్యాజ్యా సర్వయత్నేన సర్వనాశేఽప్యుపస్థితే. 46

దేహాత్మబుద్ధియే కాలసూత్ర (నరకవిశేషము) పదమగును. అదియే 'మహావీచి' సమూహమున్ను, 'అసిపత్ర' సముదాయమున్ను యగును. కాన సర్వవినాశము చేకూరినను మనుజుఁడిద్దానిని యత్నశతములచే విడనాడవలెను.

స్ప్రష్టవ్యా సా న భవ్యేన సశ్వమాంసేవ పుల్కసీ
తయా సుదూరోజ్ఝితయా దృష్టౌ పటలలేఖయా. 47
ఉదేతి పరమాదృష్టిర్జ్యోత్స్నేవ విగతాంబుదా
యయాభ్యుదితయా రామ తీర్యతే భవసాగరః. 48

ఓ రామా! శునకమాంసముగల చండాల స్త్రీనివలె దేహాత్మబుద్ధిని యుత్తమపురుషుఁడెన్నటికిని స్పృశింపరాదు. ఏలయన అధిష్ఠానచైతన్యమగు విశుద్ధాత్మను గప్పునట్టి దేహాత్మదృష్టియను పటలను దూరముగ త్యజించివేయ, నపుడు మేఘరహితమగు చంద్రుని చంద్రికవలె సర్వోత్తమమగు ఆత్మదృష్టి యుదయించును. అపుడే జీవుడు సంసారసాగరమును తరించును.

కర్తా నాస్మి న చాహమస్మి స ఇతి జ్ఞాత్వైవమన్తఃస్ఫుటం
కర్తా చాస్మి సమగ్రమస్మి తదితి జ్ఞాత్వాఽథవా నిశ్చయః
కోఽప్యేవాస్మి న కించిదేవమితి వా నిర్ణీయ సర్వోత్తమే
తిష్ఠ త్వం స్వపదే స్థితాః పదవిదో యత్రోత్తమాః సాధవః. 49

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
కర్తృత్వవిచారయోగోపదేశకరణం నామ
షట్పంచాశః సర్గః ॥ 56 ॥

ఓ రామా! 'నేను కర్తనుగాదని'యు, 'దేహాదులు నేనుగాన'నియు స్పష్టముగ నెఱుంగుము. లేక, 'సమస్తమునకు నేనే కర్త'యనియు, 'బ్రహ్మాండమంతయు నేనే' యనిస్థిరమైన భావింపుము. లేక జడరూపమగు దృశ్యము నేనేమియు గాను; లోకప్రసిద్ధమును, పరిచ్ఛిన్నము నగు సుఖదుఃఖములను

విలక్షణమును, పూర్ణానందస్వరూపమును నగు చైతన్యమే నేనను నిశ్చయముగల్గి, వివేకులును, ఉత్తమసాధువులగు బ్రహ్మవేత్తలున్ను ప్రాప్తినొందు బ్రహ్మపదమున స్థితిగల్గియుండుము.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు స్థితిప్రకరణమున
కర్తృత్వవిచారయోగోపదేశకరణమను షట్
పంచాశ సర్గము ॥ 56 ॥

---

## సప్తపంచాశః సర్గః.

---

శ్రీరామ ఉవాచ:—

సత్యమేతత్త్వయా బ్రహ్మన్యదుక్తం సూక్తిసుందరం
అకర్తైవ హి కర్తాత్మా భోక్తా భోక్తైవ భూతకృత్. 1

శ్రీరాముడు:— ఓ మహాత్మా! ఉత్తమ యుక్తులద్వారా తాము వచించినదంతయు సత్యమే యైయున్నది. పరమాత్మ కర్తయైనను అకర్తయు, భోక్తయైనను అభోక్తయు నగును.

సర్వేశ్వరః సర్వగశ్చ చిన్మాత్రమమలం పదమ్
స్థానం భువి వపుర్దేవః సర్వభూతాన్తరస్థితః. 2

మఱియు నాపరమాత్మ సర్వేశ్వరుఁడును, సర్వవ్యాపియు, చిన్మాత్రస్వరూపమును, నిర్మలపదమునునై యొప్పును. భూతలముపై చతుర్విధప్రాణులు వసించునట్లు, సర్వభూతముల అంతరమున నెలకొనియుండు ఆ దేవుఁడే సమస్తమునకు స్థానభూతమగును.

హృదయంగమతాం ప్రాప్తమిదానీం బ్రహ్మ మే విభో
త్వదుక్తిభిర్యథాంభోద ధారాభిర్భూభృదవ్యథః. 3

దేవా! నా హృదయమున నిపుడు బ్రహ్మము భాసించుచున్నది. వర్షధారలచే గ్రీష్మకాల సంతప్తపర్వతమువలె తమ వచనములచే నేను దుఃఖరహితుఁడనైతి.

ఔదాసీన్యాదనిచ్ఛత్వాన్న భుఙ్క్తే న కరోతి చ
సమగ్రాలోకకారిత్వాద్భుఙ్క్తే దేవః కరోతి చ. 4

దేవుఁడగు ఆ పరమాత్మ యుదాసీనుఁడును ఇచ్ఛారహితుఁడును నగుటచే కర్తయు భోక్తయు గానేరడు. కాని సత్తామాత్రముచే సర్వలోకంబులను సృష్టించువాడగుటచే కర్తయు భోక్తయు నగును.

కిం త్వయం భగవన్స్ఫారః సంశయో మే హృది స్థితః
తం త్వం ఛిన్ధి గిరా బ్రహ్మన్దీధిత్యేన్దుర్యథా తమః. 5



ఓ మహాత్మా! అయినను యొక గొప్ప సంశయము నాకు గలదు. సూర్యుడు తన కిరణములచే నంధకారము నుచ్ఛిన్నము జేయువిధమున తామద్దానిని తొలగింప వేడెద.

ఇదం సత్తదిదం వాఽసదయం సోఽహమిదం న తు
అయమేకో ద్వితీయోఽయమిత్యాది కలనామయమ్. 6

ఏకస్మిన్విద్యతేఽధ్వాన్తే నీహార ఇవ భాస్కరే
ఇదం ప్రథమమేవాచ్ఛే కథమాత్మని సంస్థితమ్. 7

ఈ జగత్తు సదసద్రూపమైనది; 'సమష్టిరూపమగు జగత్తే నేను గాని వ్యష్టిదేహమాత్రుడను గాను.' ఈ ప్రపంచమంతయు సమష్టిదృష్టిచే నేకమును, వ్యష్టిదృష్టిచే ననేకమునునైయున్నది — ఇత్యాది అనియతకల్పనామయమగు యీ జగత్తు, అద్వితీయమును, నియతస్వభావయుక్తమును, స్వయంప్రకాశమును, మోహాంధకారరహితమును, నిర్మలమును నగు పరమాత్మయందు సూర్యునియందంధకారమువలె యెట్లుండగలదు? మాయాశబలిత బ్రహ్మమం దీజగత్తు ప్రథమమున గలదు; అదియే యిపుడు వ్యక్తరూపమున గన్పట్టుచున్నదనను, అద్వితీయమగు పరమాత్మయం దీజగత్తు మొట్టమొదటయైనను యెట్లు స్థితిఁబొందియుండెనో దయచేసి వచింపుము.

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

సిద్ధాన్తకాల ఏవాస్య సంప్రశ్నస్యోత్తరం స్థిరమ్
కథయిష్యామి తే రామ యేన జ్ఞాస్యసి తత్త్వతః. 8

శ్రీవసిష్ఠుడు:— ఓ రామా! ఈ నీ ప్రశ్నకుత్తరము సిద్ధాంతకాల (నిర్వాణ ప్రకరణ) మందొసంగెద; అపుడు నీవిద్దానిని యథార్థరూపమున నెఱుంగ గలవు.

మోక్షోపాయస్య సిద్ధాన్త మసంప్రాప్య న రాఘవ
శ్రోతుం ప్రశ్నోత్తరాణ్యేతాన్యలం యోగ్యో భవిష్యసి. 9

రాఘవా! మోక్షోపదేశసిద్ధాంతము (అఖండాకారమగు నాత్మబోధ) ను ప్రాప్తినొందనపుడు నీవిట్టి ప్రశ్నలకుత్తరము పూర్ణముగ నెఱుంగ యోగ్యుడవు కానేరవు.

కాన్తా గీతగిరాం రామ తరుణో భాజనం యథా
ప్రశ్నానాముత్తమోక్తీనాం పుణ్యకృద్భాజనం తథా. 10

తరుణవయస్కుఁడే యువతుల రాగమయగీతములకు పాత్రుడగునట్లు సిద్ధాంతకాలమున వచింపఁదగు నిట్టిప్రశ్నలకు ఆత్మజ్ఞానియే పాత్రుఁడగును.

వృథా భవతి బాలేషు యథా రాగమయీ కథా
నిరర్థకాల్పబోధేషు తథోదారోదయా కథా. 11

రాగమయగీతములను బాలురకు వచించిన వ్యర్థమగుచందమున, అల్పబోధగలవారికి వచించిన యుత్తమ ఆత్మసాక్షాత్కార జ్ఞానమున్ను నిరర్థకమగును.

కస్మింశ్చిదేవ సమయే కించిత్పుంసో విరాజతే
ఫలమాభాతి వృక్షస్య శరద్యేవ న మాధవే. 12

నారింజ, నిమ్మ మొదలగు ఫలవృక్షములు శరదృతువందే శోభించును గాని వసం ఋతువందుగాదు. అట్లే యొకానొక సమయమున మాత్రము యొకానొకనికి యొకానొక వి యము శోభించును.

ఉపదేశగిరో వృద్ధే రంజనానిర్మలే పటే
లగన్త్యుదారవిజ్ఞాన కథా చాధిగతాత్మని. 13

వివేకునకు వైరాగ్యోపదేశమున్ను, శుభ్రవస్త్రమునకు రంగును శీఘ్రముగ నంటునట్లు ఆత్మ జ్ఞానియగువానియందే ఆత్మజ్ఞానోక్తి సఫలమగును.

ప్రశ్నస్యాస్యోత్తరం పూర్వం లేశతః కథితం మయా
న విస్తరేణ తేనైతన్న జ్ఞాతం భవతా స్ఫుటమ్. 14

ఈ నీప్రశ్నకుత్తరమును భార్గవోపాఖ్యానమున కొంతవఱకు వచించియున్నాను. అన కారివగుటచే నీకద్దానిని విస్తారముగ వచింపకుంటిని. అందుచే నీవా విషయమును స్పష్టముగ నెఱుంగ కున్నావు.

యది త్వమాత్మనాత్మాన మధిగచ్ఛసి తం స్వయమ్
ఏతత్ప్రశ్నోత్తరం సాధు జానాస్యత్ర న సంశయః. 15

ఓ రామా! నీ యాత్మను నీవు స్వయముగ నెఱుంగుచో, అనగా అఖండాత్మావబోధము నీకు గల్గుచో, నేను వచింపకనే యీ ప్రశ్నోత్తరమును పూర్ణముగ నెఱుంగ గల్గియుందువు. ఇందు సంశయమేమియును లేదు.

మయా సిద్ధాన్తకాలే తు ప్రాప్తబోధే త్వయి స్థితే
వక్తవ్యో విస్తరేణైవ సాధో ప్రశ్నోత్తరక్రమః. 16

సాధుశీలుఁడవగు నో రామా! సిద్ధాంతకాలమున నీకాత్మబోధము ప్రాప్తించినపుడీ ప్రశ్నోత్తరక్రమమును నేను విస్తారముగ వర్ణించి చెప్పెద.

జానాత్యాత్మానమాత్మైవ కృత ఆత్మాత్మనైవ హి
ఆత్మైవ సంప్రసన్నః సన్నాత్మానం ప్రతిపద్యతే. 17

అజ్ఞానదశయందాత్మచే నొనర్పబడిన కార్యము నాత్మయే యెఱుంగునట్లు, జ్ఞానస్థితియందాత్మబోధచే సుప్రసన్నమగు నాత్మయు తన యథార్థస్వరూపము నెఱుంగగల్గును.

తదేతత్కథితం రామ కర్త్రకర్తృవిచారణమ్
అజ్ఞాతత్వాత్తు తామేతామక్షీణవాసనో భవేత్. 18

ఓ రామా! అఖండబ్రహ్మను బోధించుటకొఱకే యీ కర్తృత్వ విచారమునుగూర్చి నేనిపుడు వచించినాను. కాని నీవఖండాత్మ స్వరూపమును నెఱుంగకున్నావు. దీనిచే నీకింకను దృశ్యవాసన శమింపలేదని తోచుచున్నది.

బద్ధో హి వాసనాబద్ధో మోక్షః స్యాద్వాసనాక్షయః
వాసనాస్త్వం పరిత్యజ్య మోక్షార్థిత్వమపి త్యజ. 19





వాసనలచే బద్ధుడగువాడే బద్ధుడు. మఱియు వాసనాక్షయమే మోక్షము. కాన నీవు వాసనలఁబరిత్యజించి మోక్షేచ్ఛనుగూడ విడనాడుము (బంధదశయందే మోక్షేచ్ఛగాని, ముక్తస్థితియందుకాదు గాన.)

తామసీర్వాసనాః పూర్వం త్యక్త్వా విషయవాసితాః
మైత్ర్యాది భావనానామ్నీం గృహాణామలవాసనామ్. 20

దృశ్యవిషయములచే బరిపూర్ణమగు రాజసిక తామసిక వాసనలను మొట్టమొదట బరిత్యజించి, ఆ పిదప మైత్ర్యాది శుభవాసనలను గ్రహింపుము.

తామప్యన్తః పరిత్యజ్య తాభిర్వ్యవహరన్నపి
అన్తః శాన్తసమస్తేహో భవ చిన్మాత్రవాసనః. 21

అట్టి మైత్ర్యాది శుభవాసనలుగల్గి వ్యవహరించుచు, క్రమముగ వానినిగూడ త్యజించి, అంతఃకరణమున నే విధమైన యిచ్ఛయు లేనివాఁడై, సమ్యక్ జ్ఞానయుక్తమగు సమాధి నభ్యసించుచు చిన్మాత్రవాసనా సహితుఁడవు కమ్ము.

తామప్యథ పరిత్యజ్య మనోబుద్ధిసమన్వితామ్
శేషే స్థిరసమాధానో యేన త్యజసి తత్త్యజ. 22

పిమ్మట మనోబుద్ధియుక్తమగు ఆ వాసనఁగూడ బరిత్యజించి, శేషించిన ఆత్మ స్వరూపమందు స్థిరసమాధానమును బడసి, ద్వైతకల్పనా మూలభూతమగు నే అహంకారముచే యింతదనుక నంతయు పరిత్యజించుచుంటివో యద్దానినిగూడ త్యజించి వేయుము.

చిన్మయః కలనాకాల ప్రకాశ తిమిరాదికమ్
వాసనాం వాసితారం చ ప్రాణస్పందనపూర్వకమ్. 23
సమూలమపి సంత్యక్త్వా వ్యోమసౌమ్యప్రశాన్తధీః
యస్త్వం భవసి సద్బుద్ధే సభవానస్తు సత్కృతః. 24

సుమతుఁడవగు నో రామా! ప్రాణస్పంద రూపమగు కాలకల్పనతోఁగూడిన యజ్ఞానాంధకారమును, వాసనలను, విషయములను, వానికి ద్వారభూతములగు యింద్రియాదులను, అహంకారమును సమూలముగ నశింపజేసి ఆకాశమువలె నిర్మలమును, అఖండబ్రహ్మాకారయుక్త బుద్ధి సహితమును, కేవలము చిన్మయమును, విశ్వవంద్యమును నగు నీపారమార్థిక స్వరూపమెయ్యదిగలదో అద్దానియందే స్థిరుఁడవై యుండుము.

హృదయాత్సంపరిత్యజ్య సర్వమేవ మహామతిః
యస్తిష్ఠతి గతవ్యగ్రః సముక్తః పరమేశ్వరః. 25

ఓ మహామతీ! వాసనలనన్నింటిని హృదయమునుండి పారద్రోలి చింతారహితుడై యుండువాడే ముక్తుడనఁబడును. మఱియు నాతడే పరమేశ్వరుఁడగును.

సమాధిమథ కర్మాణి మా కరోతు కరోతు వా
హృదయేనాస్తసర్వాస్థో ముక్త ఏవోత్తమాశయః. 26

సమస్తయాశలను హృదయమునుండి పారద్రోలిన శుద్ధాంతఃకరణుడగు మనుజుడు సమాధినిష్ఠుడైయున్నను, లేక ప్రపంచమున వ్యవహరించినను ముక్తుడేయగును.

నైష్కర్మ్యేణ న తస్యార్థో న తస్యార్థోఽస్తి కర్మభిః
న సమాధానజప్యాభ్యాం యస్య నిర్వాసనం మనః. 27

వాసనారహితచిత్తునకు నైష్కర్మ్యముచేగాని, కర్మలచేగాని, సమాధిచేగాని, జపముచేగాని యేమియు ప్రయోజనము లేదు.

విచారితమలం శాస్త్రం చిరముద్గ్రాహితం మిథః
సంత్యక్తవాసనాన్మౌనాదృతే నాస్త్యుత్తమం పదమ్. 28

సమస్తశాస్త్రములు మాచే నిపుణముగా విచారింపబడినవి. మఱియు చిరకాలము పరస్పరము బోధింపబడినవి. ఇట్లన్ని విధముల శాస్త్రములను పర్యాలోచన చేసినను వాసనాత్యాగపూర్వకముగా నవలంబించు ఆత్మస్థితికి మించిన పదమొద్దియు గన్పింపలేదు.

దృష్టం ద్రష్టవ్యమఖిలం భ్రాన్త్వాభ్రాన్త్వాదిశో దశ
జనాః కతిపయా ఏవ యథావస్త్వవలోకినః. 29

దశదిక్కులు సంచరించి, చూడదగిన పదార్థములనెల్ల జూచితిని. గాని యథార్థవస్తువు (బ్రహ్మము) నెఱింగినవారు కొలదిమందిమాత్రమే కలరు.

యద్యదాలోక్యతే కించిత్కశ్చిద్యత్తన్న విద్యతే
ఈప్సితానీప్సితాదన్యన్న తత్ర యతతే జనః. 30

ఈ ప్రపంచమున యిష్టానిష్టముల కన్యముగ యేమియును లేదు. ఈ యిష్టానిష్టములకొఱకే సర్వజీవులును యత్నించుచున్నారు. కాని తద్భిన్నస్వరూపమగు ఆత్మతత్త్వముకొఱకు యెవరును ప్రయత్నించుట లేదు.

యే కేచన సమారంభా యే జనస్య క్రియాక్రమాః
తే సర్వే దేహమాత్రార్థ మాత్మార్థం న తు కించన. 31

లౌకిక వైదిక క్రియాక్రమమంతయు అనాత్మభూతమగు దేహముకొఱకు మాత్రమే యగునుగాని ఆత్మకొఱకు గాదు.

పాతాలే బ్రహ్మలోకే చ స్వర్గే చ వసుధాతలే
వ్యోమ్ని కతిపయా ఏవ దృశ్యన్తే దృష్టదృష్టయః. 32

పాతాళ, బ్రహ్మలోక, స్వర్గ, భూమ్యాకాశములందునుగూడ చిదేకరసమగు బ్రహ్మమును సాక్షాత్కరించుకొనిన మహనీయులు మిక్కిలి యఱుదుగనున్నారు.

ఇదం హేయముపాదేయ మిదమిత్యసదుత్థితా
నిశ్చయా గలితా యస్య జ్ఞస్యాసావతిదుర్లభః. 33



అజ్ఞానముచే నావిర్భూతమగు త్యాజ్యగ్రాహ్య-దృష్టి శమించిన జ్ఞానియగు మహాత్ముడు లభించుట మిగుల దుర్లభము.

కరోతు భువనే రాజ్యం విశత్వంభోదమమ్బువా
నాత్మలాభాదృతే జన్తుర్విశ్రాన్తిమధిగచ్ఛతి. 34

చక్రవర్తియై భూమండలమును రాజ్యమేలినను, ఇంద్రపదముపొంది వృష్ట్యాధికారముచే మేఘమండలమున ప్రవేశించినను, వరుణపదముపొంది జలముపై సంచరించినను, యోగసిద్ధినిబడసి యంతటనువిహరించి నప్పటికిని ఆత్మప్రాప్తిచేసుకొను మహదౌద్దానిచేతను జీవుడు విశ్రాంతిని బడయజాలడు.

యే మహామతయః సన్తః శూరాశ్చేన్ద్రియశత్రుషు
జన్మజ్వరవినాశాయ త ఉపాస్యా మహాధియః 35

ఇక్కారణమున యింద్రియములను శత్రువుల జయించుటచే శూరులును, మహాధీమంతులును నగు సాధుమహాత్ములే జననమరణరూప జ్వరవినాశనముకొఱకై సేవింపదగుదురు.

సర్వత్ర పంచభూతాని షష్ఠం కించిన్న విద్యతే
పాతాలే భూతలే స్వర్గే రతిమేతు క్వ ధీరధీః. 36

పాతాళ భూతల స్వర్గములందంతటను పంచభూతములు (లేక వానికార్యములగు పాంచభౌతిక పదార్థములు) దప్ప ఆఱవవస్తువెద్దియును లేదు. అట్టిచో ధీరుడును బుద్ధిమంతుడును వివేకియునగువాడు అట దేని నభిలషించును?

యుక్త్యా వై చరతో జ్ఞస్య సంసారో గోష్పదాకృతిః
దూరసంత్యక్తయుక్తేస్తు మహామత్తార్ణవోపమః. 37

వేదములందు వచింపబడిన యుక్తిచే బ్రహ్మసాక్షాత్కారమొంది సంచరించు ఆత్మజ్ఞానికి యీ ప్రపంచము గోష్పదమువలె (అల్పముగ) తోచును. అట్టి యుక్తిని దూరముగ విడనాడువానికి యిది ప్రళయకాల మహాసముద్రమువోలె విస్తారముగ గన్పట్టును.

కదంబగోలకైస్తుల్యం బ్రహ్మాండం స్ఫారచేతసః
కిం ప్రయచ్ఛతి కిం భుంక్తే ప్రాప్తేఽస్మిన్సకలేఽపి సః. 38

అపరిచ్ఛిన్నమగు ఆత్మానంద మనుభవించు విశాలచిత్తుడగు ఆత్మజ్ఞానికి బ్రహ్మాండమంతయు సంప్రాప్తించినను, కదంబ ఫలగోలక తుల్యమగు నయ్యది వానికేమి యొసంగగలదు? లేక దానియందాతడేమి యనుభవించును?

ఏతదర్థమబుద్ధీనాం యన్మహాసమరక్రియాః
తన్మన్యే రామ ధిక్కార్యం ద్వంద్వలక్షక్షయావహమ్. 39

ఓ రామా! ఇట్టి యల్పజగంబున రాజ్యాదిసుఖములకొఱకై మూఢులచే గావింపబడు నట్టి లక్షలకొలది యోధుల వినాశమునకు హేతుభూతములగు సమరక్రియలు దయాళువగు తత్త్వజ్ఞాని దృష్టియందు నింద్యములే యగునని నేను తలంచెద.

కల్పమాత్రేణ కాలేన సుమహాపేలవోదరే
తస్మిన్నపి హి యో నాశః సర్వాధిరమహాధియామ్. 40

మహాకల్పాంతమున నశించునదగుటచే మిగుల యల్పమును, సమస్తప్రాణులయొక్క విలయమునకు హేతువగుటచే వాసనికవ్యథాయుక్తమునగు విరించిపదము అజ్ఞులకే ప్రశంసాయోగ్యమగును గాని జ్ఞానులకు గాదు. కాన నట్టి విరించిపదమందును జ్ఞానికాకాంక్ష యుండనేరదు.

---

ఆత్మనో జ్ఞస్య సర్గాదేర్యన్మనాగపి నోద్గతమ్
తస్మిఞ్జగత్త్రయే ప్రాప్తే కించిదాత్మా బలీ భవేత్. 41

తత్త్వవేత్తయొక్క దృష్టియందు సృష్ట్యాదులచేగూడ నేమియు నుత్పన్నముగాకయే యుండ నిక ముల్లోకములు సంప్రాప్తించినను వాని ఆత్మ యొకింతైనను బలవంతమగునా?

ఇతః శైలశతైర్వ్యాప్తా తథేతో జలరాశిభిః
కియానస్య భువో దేహో యేనోదారం ప్రపూరయేత్. 42

ఒకప్రక్క యనేక పర్వతములచేతను, మఱియొకప్రక్క జలరాసులచేతను యీ భూమండలము వ్యాప్తమైయున్నది. ఇక శేషించిన (రాజ్యాది యోగ్యమగు) యే భూభాగము సర్వత్యాగముచే మహోత్తరపదమునొందిన జ్ఞానిని పూర్ణమొనర్పగలదు?

న తదస్తి జగత్యస్మిన్స పాతాలసురాలయే
యన్నామాత్మవతో జ్ఞస్య కించిత్కార్యతరం భవేత్. 43

పాతాళ స్వర్గ భూతలములందెచటను ఆత్మజ్ఞాని కవశ్యకర్తవ్యంబగు కార్యమెద్దియును లేదు.

ఏకతామనుయాతస్య వ్యోమవద్వితతస్య చ
స్వస్థస్యాత్మవతో జ్ఞస్య స్థితస్యాత్మన్యచేతసః. 44
శరీరజాలనీహార ధూసరాశూన్యకోటరా
శాన్తసంసారసుభగా త్రిలోకీ విపులాతటీ. 45

ఏకత్వమును ప్రాప్తినొందినవాడును, ఆకాశమువలె విశాలమైన రూపముగలవాడును, అమనస్కుఁడును, స్వస్థచిత్తుఁడునునగు ఆత్మజ్ఞానియొక్క దృష్టియందు, దేహసముదాయముచే నీహారమువలె ధూసరిత మొనర్పబడినదియు, శాంతరూపముచే రమణీయమును నగు త్రిలోకమను మృగతృష్ణానదీతటము ఆకాశమువలె శూన్యరూపమేయగును. అనగా జ్ఞాని యద్దానిని తుచ్ఛముగ దలంచి దానిపై దృష్టినైన మరల్పడని భావము.

స్ఫారబ్రహ్మామలాంభోధి ఫేనాః సర్వే కులాచలాః
చిదాదిత్యమహాభాస మృగతృష్ణాజలశ్రియః. 46

బ్రహ్మమను నిర్మలసముద్రమున మేర్వాదికులపర్వతములు ఫేనములును, మహాప్రకాశశీలమగు నా చైతన్య భాస్కరుని తేజమందు సముద్రనద్యాదులు మృగతృష్ణా సమూహములును నగును.



ఆత్మతత్త్వమహాంభోధివీచయః సర్గరాజయః
అనుత్తమపదాంభోద వృష్టయః శాస్త్రదృష్టయః. 47

సృష్టులన్నియు ఆత్మతత్త్వమను మహాసముద్రమందలి తరంగములు. వివిధశాస్త్ర దృష్టులు సర్వోత్తమబ్రహ్మపదమను మేఘముయొక్క వృష్టిసమూహము.

చంద్రాగ్నితపనాలోకా ఘటకాష్ఠాదిసన్నిభాః
ప్రకాశనీయాశ్చిద్రూపాత్ప్రియో మలకణాస్తథా. 48

మిగుల మలినమగు పార్థివాది ధాతువులున్ను వాని యధిష్ఠానమగు ఆత్మచేతనే ప్రకాశింపబడుచున్నవి. అట్లే చంద్ర సూర్యాగ్నుల ప్రకాశములున్ను, ఘటకాష్ఠాదులఁ బ్రకాశింపజేయు ఆత్మచేతనే ప్రకాశితములగుచున్నవి.

విహరన్తి స్వమాత్మానః సంసారవనచారిణః
కామభోగోపలగ్రాసమృగా నరసురాసురాః. 49

పరిచ్ఛిన్న దేహభావము గలవారును లేక హింసాస్వభావయుతులును నైన ప్రపంచ-వనచారులగు మనుజదైత్యాదులు కామభోగములను తృణముల సేవించుచు మృగతుల్యులై యున్నారు.

అస్థిఖండార్గలామూర్ధ పిధానాః స్నాయుశృంఖలాః
జగద్దేహాజరజ్జీవ రక్తమాంససముద్గకాః. 50

అస్థి-ఖండములను ఆధారకాష్ఠములును, శిరంబులను ఆచ్ఛాదకములును, నాడులను బంధనములును గల దేవమనుజాదుల దేహములు అనాదిసంసారారణ్యమందలి అభాగజీవుల బంధనార్థము కల్పింపబడిన పేటికలే యగును.

వనమాలామృగాముగ్ధాః పురసంచారసంస్థితౌ
బాలబుద్ధివినోదాయ యోజితాశ్చర్మపుత్రికాః. 51

సంసార వనమృగములును వివేకరహితులును నైన జీవులను చర్మపుత్రికలు (తోలుబొమ్మలు) భోగభూమియను నగరమున సంచరించుటకై బాలుర (అజ్ఞానుల) వినోదార్థము బ్రహ్మదేవునిచే నియోగింపబడెను.

నైవంవిధోదారమనా మనాగపి మహామతిః
న జ్ఞశ్చలతి భోగౌఘైర్మందవాతైరివాచలః. 52

మందవాయువులచే పర్వతము చలించనట్లు సర్వత్యాగియగు వివేకి ప్రాపంచిక విషయభోగములచే చలింపకయుండును.

తస్మిన్కిల పదే రామ జ్ఞస్తిష్ఠతి మహోత్తమే
యస్మింశ్చంద్రార్కదేశోఽపి న పాతాలమివ స్థితః. 53

ఓ రామా! చంద్ర సూర్యమండలములున్ను పాతాళకుహరమువలె నెచట నిస్తేజములై యుండునో యట్టి సర్వోత్తమ బ్రహ్మపదమున జ్ఞాని స్థితిగల్గియుండును.

యస్యాలోకాల్లోకపాలాః సమాలోకాః సువేదినః
శరీరం పాన్థ్యయమివ పశ్యన్త్యజ్ఞాః ఉపార్ణవే. 54

తత్త్వజ్ఞానియొక్క చిత్ప్రకాశముచేతనే బ్రహ్మాదిలోకపాలురు జగత్తునంతయు బ్రకాశింపజేయుచు, నేత్రాదీంద్రియములచే బాహ్యప్రదేశమునను బుద్ధిచే నంతఃకరణమునను ఉత్తమరీతి వ్యవహరించుచు దేహరహితమగు ఆత్మను వివేచించి చూచుచున్నను, అజ్ఞానసాగరమున నిమగ్నులైన అజ్ఞులవలె దేహాత్మభావముచే దేహములను సంరక్షించుచున్నారు.

న కేచన జగద్భావాస్తత్త్వజ్ఞం రంజయన్త్యమీ
అవ్యఖ్యానగతాః స్ఫారహృదయఖం ఖమివాంబుదాః. 55

దృఢవైరాగ్యముచే భోగభావనలు నంతరింపజేసినవాడును విశాలహృదయుడును, శుద్ధాంతఃకరణుడును నగు జ్ఞానిని అధిక ప్రయత్నముచేసైనను జగత్తునందలి యేపదార్థములున్ను మేఘములు ఆకాశమునువలె అనురక్తుని జేయజాలకుండును.

న కేచన జగద్భావాస్తత్త్వజ్ఞం రంజయన్త్యమీ
మర్కటా ఇవ నృత్యన్తో గౌరీలాస్యార్థినం హరమ్. 56

పార్వతీదేవియొక్క నృత్యమభిలషించు పరమశివుని, మర్కటము తన నాట్యముచే అనురక్తుని జేయజాలనట్లు ప్రపంచమందలి నృత్యగీతాది పదార్థములెవ్వియు తత్త్వజ్ఞానికి ఆసక్తిని గలుగజేయజాలవు.

న కేచన జగద్భావాస్తత్త్వజ్ఞం రంజయన్త్యమీ
ప్రాప్తప్రతిబింబశ్రీ రత్నం కుంభగతం యథా. 57

ఘటమునకు బాహ్యదేశమున నున్నపుడు రత్నమందు ప్రతిబింబించిన స్తంభగృహాదుల శోభ ఘటాంతర్గతమున నున్నపుడద్దాని నెట్లనురక్తముగ జేయజాలకుండునో, అట్లే తత్త్వజ్ఞానికి జగత్తునందలి యేపదార్థమున్ను ఆసక్తిని గలుగజేయజాలదు.

వజ్రార్పితోపమమనన్మయమంబుభంగ
తుంగం తరంగకృతబింబమివావలోక్య
లోలాంతదీహితసుఖేషు రతిం న యాతి
తజ్జ్ఞః కుశైవలలవేష్వివ రాజహంసః. 58

ఇత్యార్షే వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే స్థితిప్రకరణే
పూర్ణాశయస్వరూపవర్ణనం నామ సప్తపంచాశః
సర్గః ॥ 57 ॥

ఓ రామా! బ్రహ్మలోకపర్యంతముగల యీ జగదైశ్వర్యములన్నియు అజ్ఞానుల దృష్టియందు స్థిరములును దుశ్ఛేద్యములునై యున్నవి గాన వజ్రసమానములగును. కాని జ్ఞానుల దృష్టియందు జలముయొక్క యున్నత తరంగాగ్రభాగమందలి చంద్రాదుల ప్రతిబింబమువలె అస్థిరములగును. వివేకి తత్త్వదృష్టిచే వానిని మిథ్యారూపములుగను తుచ్ఛములుగను గాంచుచు యల్పశైవాలమందు రాజహంస ప్రీతిగొననట్లు, అట్టి విషయసుఖములందజ్ఞునివలె ప్రీతిగొనకయుండును.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు స్థితిప్రకరణమున
పూర్ణాశయస్వరూపవర్ణనము సప్తపంచాశ
సర్గము ॥ 57 ॥



---

## అష్టపంచాశః సర్గః.

---

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

అత్రైవ వస్తున్యుదితా శృణు రాఘవ పూర్వజాః
కచేన గాథా యా గీతా బార్హస్పత్యేన పావనాః. 1

శ్రీవసిష్ఠుడు:— ఓ రామా! ఇవ్విషయమున, పూర్వము బృహస్పతి పుత్రుడగు కచుడు వచించిన యతిపవిత్రమగు గాథను వచించెద వినుము.

కస్మింశ్చిన్మేరుగహనే ఽతిష్ఠన్సురగురోః సుతః
కదాచిదభ్యాసవశాద్విశ్రాన్తిం ప్రాప చాత్మని. 2

మేరుపర్వతమందలి యొకానొక వనమందు వసించు బృహస్పతి కొమరుడు పూర్వము తాను వినిన బ్రహ్మవిద్యను మననదిధ్యాసనాదులచే బాగుగ నభ్యసించి, అభ్యాసపరిపాకముచే ఆత్మయందు విశ్రాంతిని బడసెను.

సమ్యజ్జ్ఞానామృతాపూర్ణా మతిర్నారమతాస్య సా
పంచభూతమయేఽమాన్యే దృశ్యేఽస్మిన్పేలవాత్మని. 3

అంత సమ్యజ్జ్ఞానామృతపూర్ణమగు వాని యుత్తమబుద్ధి, పంచభూతమయమును యతినికృష్టమును నగు దృశ్యమందనురాగము బొందకుండెను.

స తేన నిర్విణ్ణ ఇవ సదాత్మత్వాదృతే పదమ్
అపశ్యన్సముదాచేదమేకో గద్గదయా గిరా. 4

అక్కారణమున ఉదాసీనునివలె నున్నవాడై ఆత్మాతిరిక్తమగు యొద్దానిని రమణీయముగ నెంచక, గద్గదస్వరముతో నిట్లు గానము చేసెను —

కిం కరోమి క్వ గచ్ఛామి కిం గృహ్ణామి త్యజామి కిం
ఆత్మనా పూరితం విశ్వం మహాకల్పాంబునా యథా. 5

నేనేమి చేయుదును! యెటకేగదను! దేనిని గ్రహించెదను! ఈ విశ్వమంతయు మహాప్రళయోదకములవలె ఆత్మచే పరిపూర్ణమై యొప్పుచున్నది.

దుఃఖమాత్మాసుఖంచైవ ఖమాశాసుమహత్తయా
సర్వమాత్మమయంజ్ఞాతం నష్టకష్టోఽహమాత్మనా. 6

దుఃఖము, దుఃఖము ననుభవించు జీవుడు, జీవున కిష్టమగు సుఖము - అంతయు తత్త్వజ్ఞానోదయానంతరము కేవలము శూన్యమాత్రముగ దోచుచున్నది. సమస్తము ఆత్మమయముగ నెఱుంగుటచే నేను సర్వదుఃఖరహితుడనై యున్నాను. ఆత్మవ్యతిరిక్తమగు నేవస్తువుచేతను నాకిపుడు ప్రయోజనము లేదు.

సబాహ్యాభ్యన్తరేదేహే అధశ్చోర్ధ్వంచదిక్షుచ
ఇతఆత్మాతతశ్చాత్మా నాస్త్యనాత్మమయంక్వచిత్. 7

శరీరముయొక్క బాహ్యాభ్యంతరములందును, ఊర్ధ్వాధోభాగములందును, దిక్కులందందంతటను సర్వత్ర ఆత్మయే వ్యాపించియున్నది. ఆత్మమయముగాని స్థానమెద్దియును లేదు.

సర్వత్రైవస్థితోహ్యాత్మా సర్వమాత్మమయంస్థితమ్
సర్వమేవేదమాత్మైవ మాత్మన్యేవభవామ్యహమ్. 8

అధిష్ఠానరూపమున నంతటను ఆత్మయే గలదు. వివర్తభావమున నీజగత్తంతయు ఆత్మరూపమే యగును. తత్త్వదృష్టిచే నిదంతయు ఆత్మయే యైయున్నది. ఇవ్విధమున నేనెల్లపుడు పరమాత్మస్వరూపమగు ఆత్మయందే నెలకొనియున్నాను.

యన్నామనామతత్కించి త్సర్వమేవాహమాన్తరః
ఆపూరితాపారనభాః సర్వత్రసన్మయఃస్థితః. 9

చేతనాచేతనము లందంతటను నేనాత్మస్వరూపమున వ్యాపించియున్నాను. ఆకాశమండలమునుగూడ పూర్ణమొనర్చినదై సన్మయమగు ఆత్మయే సర్వత్ర వెలయుచున్నది.

పూర్ణస్తిష్ఠామిమోదాత్మా సుఖమేకార్ణవోపమః
ఇత్యేవంభావయంస్తత్ర కనకాచలకుంజకే. 10
ఉచ్చారయన్నోంకారం చ ఘంటాస్వనమివక్రమాత్
ఓంకారస్యకలామాత్రం పాశ్చాత్యంవాలకోమలమ్
నాన్తరస్థోనబాహ్యస్థో భావయన్పరమేహృది. 11
వ్యపగతకలనా కలఙ్కశుద్ధో
హృదయనిరన్తర లీనవాతవృత్తిః
గతఘనశరదాశయోపమానః
స్థితఇతిరామకచః సగాయమానః. 12

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
స్థితిప్రకరణే కచగాథా నామాష్టపంచాశః
సర్గః ॥58॥



పరిపూర్ణుడను, ఆనందస్వరూపుడను, సుఖరూపుడనునై యేకమగు మహాసముద్రమువోలె [illegible]ను స్థితిగల్గియున్నాను — ఇట్లు భావనచేయుచు యా మేరుపర్వతకుంజములందు ఘంటానాదమువలె ఓంకారము (ప్రణవము) నుచ్చరించుచు, కళామాత్రమును, కేశాగ్రభాగమువలె నతిసూక్ష్మమును, తురీయస్వరూపమును నగు అర్ధమాత్రయందు సమస్తమును లయమొనర్చుచు, ఆభ్యంతరమున కారణమందుగాని, బాహ్యమున కార్యమందుగాని స్థితుడుగాక, కేవలము పరమాత్మస్వరూపము నే భావించుచు సమస్త కల్పనాకళంక రహితుడును, శుద్ధుడును, హృదయమున విలయమొందిన ప్రాణగతి గలవాడును, మేఘరహితమగు శరదాకాశమువలె నిర్మలమైన యంతఃకరణముగలవాడును నగు కచుడు ఉపరోక్తవిధమున గాన మొనర్చుచు నుండెను.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు స్థితిప్రకరణమున
కచగాథయను అష్టపంచాశ
సర్గము ॥ 58 ॥

---

ఏకోనషష్టితమః సర్గః.

---

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

అన్నపానాంగనాసంగాదృతేనాస్తీహకించన
శుభమస్త్వితిసంవాది మహాత్మాకిమివవాంఛతు. 1

శ్రీ వసిష్ఠుడు :— ఓ రామా ! ఈ ప్రపంచమున అన్న, పాన, స్త్రీ సంగాది విషయములు దప్ప శుభపురుషార్థ మేమియు లేదని శ్రుతిస్మృతులచేతను, ఆప్తోపదేశముచేతను, అనుభవముచేతను నిశ్చయించునట్టి మహాత్ముడగు వివేకి యిక భోగములందు దేనిని వాంఛించును ?

తిర్యఞ్చఃపశవోమూఢా యేనతుష్యన్త్యసాధవః
భోగైఃకృపణసర్వస్వై రాదిమధ్యాన్తపేలవైః. 2
విశ్వాసంయాన్తియేలోకే తైరలంనరగర్దభైః

పశుపక్ష్యాదులును, మూఢులును, అసాధువులును సంతుష్టిజెందునవియు, అతి నీచములును, ఆదిమధ్యాంతములందు నాశస్వభావము గలవియునగు విషయభోగములందు విశ్వాసముగల మనుజులు గార్దభసమానులే యగుదురు. అట్టివారి జీవితము వ్యర్థము.

ఇతఃకేశాఇతోరక్త మితీయంప్రమదాతనుః. 3
ఏతయాత్రోషమాయాస్తి సారమేయానమానవాః

ఒక ప్రక్క కేశములును, మఱియొక ప్రక్క రక్తమాంసములు దప్ప స్త్రీయొక్క సుందరశరీరమందు మఱేమియును లేదు. ఇద్దానిచే సంతుష్టిజెందునవి శునకములేగాని మానవులు గారు.

మృణ్మహీదారుతరవో దేహామాంసమయాఅపి. 4

అధోభూరమ్బరంపృష్ఠే కిమపూర్వంసుఖాయతు

పృథివి మృత్తికామయమును, వృక్షములు కాష్ఠమయములును, ప్రాణుల శరీరములు మాంసమయములునునై యున్నవి. అధోభాగమున భూమియు, ఊర్ధ్వభాగమున ఆకాశము మాత్రమే గల యీ ప్రపంచమందు సుఖప్రదమగు అపూర్వవస్తు వెయ్యది గలదు ?

మాత్రాస్పర్శానుసారిణ్యో వివేకపదభంగురాః. 5

ఇంద్రియములు స్వస్వవిషయములం దనుకూలములును, వివేకవిషయమున బాధకములు నునై యున్నవి.

మోహాయైవాపరామృష్టాః సకలాలోకసంవిదః

సర్వస్యాపవపర్యన్తే సుఖాశాయాశ్చసంస్థితమ్. 6

జనులందఱియొక్క వ్యవహారములును అవిచారముచే రమణీయముగ గన్పట్టుచున్నవి గాని యథార్థముగ మోహహేతువులే యగును. మఱియు, సుఖమును గూర్చిన యాశలన్నియు అంతమున వర్తమాన సుఖాంతస్థితివోలె దుఃఖరూపములే అయియున్నవి.

మాలిన్యందుఃఖమప్యేవం జ్వాలాయాఇవకజ్జలమ్

ఆగమాపాయినోఽసిత్యా మనఃషష్ఠేన్ద్రియక్రియాః. 7

పాప విషయ కాలుష్యమున్ను, వియోగ విషాదాదులచే గల్గు దుఃఖమున్ను అగ్ని జ్వాలాంతమున ధూమమువలె సుఖాంతమున స్థితి గల్గియున్నవి. పంచేన్ద్రియ మనంబుల క్రియలన్నియు అనిత్యములును, ఉత్పత్తివినాశశీలములును నైయున్నవి.

లతానాగేన్ద్రమృదితా ధారయన్తినసంపదః

విషయ సంపదలన్నియును మదగజముచే మర్దింపబడిన లతవలె సదా ప్రక్షీణములగు చుండును.

పుత్రికారక్తమాంసస్య కాన్తేయమితిసాదరమ్. 8

స్వదేహనామ్నాస్థితయే శ్లిష్యతేమోహకక్రమః

సర్వంసత్యమిదంరామ స్థిరమజ్ఞస్యతుష్టయే. 9

రక్తమాంసమయ పుత్రిక (బొమ్మ)ను అతిసుందరమగు కాంతయనితలంచి పురుషుడు యాదరమున అస్థిమాంససంఘాతమగు స్వదేహముచే దానిని యాలింగన మొనర్చుకొనుచున్నాడు. కామక్రమ మిదియే యగును. ఓ రామా ! ఇదంతయు అజ్ఞానికి సత్యమును, సంతోషప్రదమును నగుచున్నది.

జ్ఞస్యాస్థైర్యమసత్యంచ జగద్రామనతుష్టయే

అభుక్తేఽపివిషామైషా విషమూర్ఛాంప్రయచ్ఛతి. 10

కాని జ్ఞాని దృష్టియం దయ్యది అస్థిరమును అసత్యమును దుఃఖప్రదమునునై యున్నది. అనుభవింపకున్నను భోగతృష్ణ విషమువలె మూర్ఛను గల్గజేయుచున్నది.

తాంపరిత్యజ్యభోగాస్థాం స్వామైకత్వగతింభజ

అనాత్మమయభావేన చిత్తంస్థితిముపాగతమ్. 11



యదాతదైతదాజాతం జగజ్జాలమసన్మయమ్

ఓ రామా ! కాన యిట్టి భోగములందు విశ్వాసముఁ ద్యజించి నీవు కేవలము ఆత్మనే శరణు బొందుము. భోగవాసనచే అనాత్మస్వరూపమగు దేహాదులఁగూర్చిన భావన యొనర్చుచు నెపుడు చిత్తము స్థితిఁబొందునో, అపుడే యసన్మయమగు నీ జగజ్జాలమంతయు నుత్పన్నమగు చున్నది.

వాసనావశతోబ్రహ్మ మనసాకల్పితంవపుః. 12

తేజసాశ్రితకుడ్యేన హేమాభత్వమివాత్మనః

లాది ఇంద్రనీ మణియుక్తమగు భిత్తినాశ్రయించిన సూర్యాదుల ప్రకాశముచే ఆయా వర్ణముల ననుసరించిన స్వరూపము కల్పింపబడు విధమున, బ్రహ్మదేవుని మనస్సంకల్పముచే ఆస్మదాదుల వాసనయు, కర్మాదుల వశముచే తదనుసారము యీ జగద్రూపమున్ను కల్పింపబడినవి.

(శ్రీ) రామ ఉవాచ :—

వైరించపదమాసాద్య మనోబ్రహ్మన్మహామతే. 13

ఇదంజగత్సుఘనతాం కథమానయతిక్రమాత్

శ్రీరాముడు :— బ్రహ్మజ్ఞుఁడవగు నో మహాత్మా ! మనస్సు హిరణ్యగర్భ పదమును బొందినదై యీ జగద్రూపమున క్రమముగ నెట్లు ఘనత్వముఁ జెందుచున్నది ?

(శ్రీ) వసిష్ఠ ఉవాచ :—

గర్భతల్పాత్సముత్థాయ పద్మజఃప్రథమఃశిశుః. 14

బ్రహ్మేతిశబ్దమకరోద్బృహ్మ తేనసఉచ్యతే

సంకల్పజాలరూపస్య మనసాకల్పితాకృతేః

అకరోత్తస్యసంకల్ప లక్ష్మీఃపదమథోత్తరే. 15

శ్రీ వసిష్ఠుడు :— ఓ రామా ! కమలకోశరూపమగు గర్భమునుండి ప్రథమమున యుత్పన్నమైన బాలుడు బ్రహ్మదేవుఁడని వచింపబడెను. కల్పానంతరము సంకల్పాత్మకమనోరూపమున కల్పితమైన యాకృతిగల బ్రహ్మదేవుని సంకల్పము భావిసృష్టినిగూర్చి యత్న మొనర్చెను.

తతఃసంకల్పయామాస పూర్వం తేజోమహాప్రభమ్

శరదన్తేలతాచక్ర చక్రీకృతదిగన్తరమ్ 16

పక్షప్రతిమసిస్యూత కర్మణాతిగుణాకురమ్

పుంజపింజరపర్యన్తం హేమజ్ఞానసభాంబరమ్. 17

జాలహేమలతాజాల జటాలసిజమందిరమ్

కచత్ప్రసరదుద్యానాకారకుండలమండితమ్. 18

పిమ్మట మహాప్రకాశయుక్తమగు తేజమును సంకల్పముచే రచించెను. అయ్యది శరత్కాలాంతమందలి హిమలతలవంటి పాండురవర్ణచక్రములచే దిగంతములను చక్రమయముగ గావిం

చెను. మఱియునది క్షయధర్మవర్జితమును, తేజసమూహములచే దిగంతముల వ్యాపించునదియు సువర్ణమువలె ప్రకాశవంతమును ఆవరణరహితమును అపరిచ్ఛిన్నమును ప్రకాశరూపము నగుటచే బ్రహ్మజ్ఞానమువలె నొప్పుచున్నదియు, కమలదళముల వికసింపజేయు కిరణములచేత సువర్ణలతాజాలమువలె భాస్వరమగు కేసరములచేతను బ్రహ్మదేవుని మందిరమును జటాయు ... మెనర్చునదియు, దేదీప్యమానమైనదియు, వ్యాపించుచున్న కిరణమండలములచే శోభించుచున్న యున్నదై యుండెను.

తంశరీరంమన స్తస్మిం స్తతస్తేజసి భాస్వరే
ఆత్మాకారసమాకారం భాస్వరంసమకల్పయత్ 19

అట్టి తేజోమండలమును సృష్టించిన పిదప చతుర్ముఖాకారముననున్న మనంబు ప్రకాశమయమగు నా తేజమున అతిభాస్వరమును స్వసదృశము నగు యాకారమును సంకల్పముచే నిర్మించెను.

సతతస్తేజస స్తస్మా దభ్యుదేతిదివాకరః
జాలమండలమధ్యస్థో జ్వలత్కనకకుండలః. 20

ఆ తేజమునుండి ప్రభామండలమధ్యస్థుఁడును, జాజ్వల్యమానమగు కుండలములు బోలినవాడును నగు సూర్యభగవానుఁ డుద్భవించెను.

జ్వలజ్జటాభారధరోపాస్త విస్ఫారపావకః
జ్వాలావిశాలావయవః పూరితాకాశమండలః. 21

అతడు జ్వలించుచున్న అగ్నిజ్వాలలు గలవాడును, విశాలమైన అవయవములతో గూడియున్నవాడును, నభోమండలమును పూర్ణమొనర్చువాడును నైయుండెను.

అథబ్రహ్మమహాబుద్ధి రన్యాస్తాస్తేజసఃకలాః
అపాల్యయదసద్బ్రహ్మ తరంగానివసాగరః. 22

అటుపిమ్మట సమష్టిబుద్ధ్యాత్మకుఁడును, సర్వజ్ఞుఁడును, మహాధీశాలియునగు చతుర్ముఖబ్రహ్మ సూర్యసృష్ట్యనంతరము శేషించిన తేజోకళాసమూహమును, సముద్రము తరంగములను విభజించునట్లు నవవిభాగములు గావించెను.

తేఽపిసంకల్పసంప్రాప్త సిద్ధయఃశమశక్తయః
యథాసంకల్పితంవస్తు క్షణాద్దృష్ట్వాపురగ్రతః. 23

ఆ తేజోఖండములు బ్రహ్మదేవుని సంకల్పముచే ప్రాప్తించిన సమస్త సిద్ధులుగల్గి, బ్రహ్మదేవునకు సమానమైన శక్తిగల్గిన ప్రజాపతులై స్వసంకల్పానుసార మాయాపదార్థముల క్షణములో సమ్ముఖమున గాంచుచుండిరి.

సంకల్పయన్తోయాన్యాంస్తే నానాభూతగణాన్బహూన్
భూతేష్వన్యాంస్తు తేష్వన్యాం స్తేష్వన్యాన్వివిధానపి. 24

మరీచ్యాది యీ ప్రజాపతులు దేవదానవాది జాతిభేదములచేతను, వ్యక్తిభేదముల



చేతను అనేక జీవరాశుల సంకల్పించి వారినట్లనే గాంచిరి. వారింకను అనేక భూతములను సృజించిరి. కాలక్రమమున పుత్రపౌత్రాది పరంపరచే నాసృష్టి యంతయు పరివర్ధమానంబయ్యె.

సంస్మృత్య వేదాం స్తదను యజ్ఞక్రమగుణాన్బహూన్
జగద్గృహోదయంబ్రహ్మా మర్యాదాంసమకల్పయత్. 25

పిమ్మట బ్రహ్మదేవుడు వేదముల సంస్మరించి యీ జగద్గృహంబున నియతిని కల్పనచేసెను.

బ్రాహ్మంరూపముపాదాయ మనోనామమహద్వపుః
తనోతీత్థమిమాందృష్టిం భూతసంతతిసంకులామ్. 26

ఇవ్విధమున మనంబు విశాలమగు బ్రహ్మరూపమును ధరించి భూతసంతతిచే పరివ్యాప్తమగు నీసంకల్పమయసృష్టిని విస్తరించెను.

సముద్రాచలవృక్షాఢ్యాం కృతలోకోత్తరక్రమామ్
మేరుభూపీఠదిక్కుంజ జటాలోదరమండలామ్. 27

సుఖదుఃఖజరాజన్మ మరణాస్వాధిబోధితామ్
రాగద్వేషమయోద్విగ్నాం గుణత్రయమయాత్మికామ్. 28

ఈసృష్టి సముద్ర పర్వత వృక్షాదులచే పూర్ణమును, లోకక్రియాయుక్తమును, మేరు, భూమండల, దిక్కుంజములచే వ్యాప్తమైన జటాసహిత యుదరభాగము గలదియు, శారీరక సుఖదుఃఖములచేతను, జరాజన్మమరణములచేతను, మానసికవ్యథలచేతను కూడినదగుటచే సంసారము దుఃఖమయమని భోధించునదియు, రాగద్వేషమయమగుటచే యుద్విగ్నతకు కారణమును, సత్వరజస్తమోగుణమయమును నైయుండెను.

మనోహస్తైర్విరించోత్థై ర్యద్యథాకల్పితంపురా
తత్తథైవాఖిలంద్రష్టుం దృశ్యతేఽద్యాపిమాయయా. 29

బ్రహ్మదేవునినుండి యావిర్భూతమైన మనస్సను హస్తములచే పూర్వకల్పమందేవస్తువెట్లు కల్పింపబడెనో, మఱియు నెట్లు దృశ్యమానమగుచు పొందబడుచుండెనో, నేటివఱకును మాయచే నయ్యది అట్లనే గన్పట్టుచు పొందబడుచునున్నది.

ఇత్థంసర్వేషుభూతేషు కేషుచిత్త్వథవాపునః
సంకల్పయతిసంసారం పరంపశ్యతిచిత్స్థితమ్. 30

ఇట్లు సమష్టిపక్షమున సమస్తభూతములందును, వ్యష్టిపక్షమున కొన్నిజీవులందును గల మనస్సు ప్రపంచమును సంకల్పించుచు తదనుసారము దానిని వీక్షించుచు నున్నది.

మోహావనంమనోమిథ్యా జాగతఃస్థిరతాంగతః
సంకల్పనేనమనసా కల్పితోఽచిరతఃస్వయమ్. 31

అకస్మాత్తుగ మనస్సువలన గల్పింపబడిన ఈ జగన్మోహము క్రమముగ స్థిరత్వమును పొందుచున్నది.

సంకల్పవశతః సర్వాః ప్రసవస్తి జగత్క్రియాః
సంకల్పవశతో దేవా నిర్యాస్తి నియతిస్థితాః. 32

సంకల్పబలముననే జగత్క్రియలన్నియు నుత్పన్నములగుచున్నవి. సంకల్పబలముననే దేవతలు నియతికి వశులై వెలువడుచున్నారు.

కోపితాయాః ప్రజానార్థైర్జగత్సృష్టేః కులోద్భవః
బ్రహ్మా సంచిన్తయ త్యేష పద్మాసనగతః ప్రభుః. 33
మనఃస్పన్దనమాత్రేణ చిత్రం చిత్తం యదుత్థితమ్
సృష్టిర్వా భోగినీస్ఫారా వ్యవహారవికారిణీ. 34
రుద్రోపేన్ద్రమహేన్ద్రాద్యా శైలసాగరసంకులా
పాతాలర్భోదో దిక్స్వర్గ మార్గసంకటకోటరా. 35
సంకల్పజాలమత్యన్తం మమేదమభితస్తతమ్
అధునా విరతోఽస్మ్యస్మా ద్వికల్పోల్లాసనక్రమాత్. 36
ఇతి నిశ్చిత్య విరతః కల్పనానర్థసంకటాత్
అనాదిమత్పరం బ్రహ్మ స్మరత్యాత్మానమాత్మనా. 37

విభిన్నధర్మావలంబులగు ఇంద్రవిరోచనాదులు అనగా దేవదానవాధిపతులు తమ తమ గౌరవవృద్ధి కొఱకు వారివారి స్వభావములగు సాత్త్విక రాజసిక తామసవృత్తులను ప్రేరేపించి జన్మ జరాబంధన మరణములవలన బ్రహ్మ - సృష్టిని పీడింపనారంభించినపుడు, స్రష్టయగు పద్మోద్భవుఁడు పద్మాసనోపవిష్టుఁడై ఇట్లు చింతించును; 'మనః స్పందమునుండియే ఈ వ్యష్టిజగత్తు అనగా, పాతాళము, భూమి, ఆకాశము, దిక్కులు, సంకీర్ణమగు స్వర్గమార్గము, రుద్రులు, ఉపేంద్రుడు, మహేంద్రుడు, పర్వతములు, సాగరములతో నిండిన వ్యవహారమయమగు సృష్టి ఉద్భవిల్లినది; ఇదంతయు నా సంకల్పమే. నేనే దీనిని నలువైపుల వెదజల్లితిని. ఇప్పుడీ సంకల్పములను విరమింతును.' అని నిశ్చయ మొనరించుకొని బ్రహ్మ శాంతుడై కల్పనలను అనర్థసంకటమునుండి విరతినందె, అనాది పరబ్రహ్మమును ఆత్మచే స్మరింపసాగెను.

తమాసాద్య తదాభాసే పదే గలితమానసే
సుఖం తిష్ఠతి శాన్తాత్మా తల్పేఽధ్వశ్రమవానివ. 38
నిర్మమో నిరహంకారః పరాం శాన్తిముపాగతః
అవిక్షుబ్ధ ఇవాంభోధి రాత్మనాత్మని తిష్ఠతి. 39

స్మరణమాత్రముననే అతడు పరమాత్మను బొంది, పరిశ్రాంతవ్యక్తి నిర్జనస్థానమున సుఖముగ విశ్రాంతినందునట్లు, ఆత్మాకారమున ప్రకాశించు బ్రహ్మపదమున విలీనచిత్తుడై వెలయసాగెను. అహంకారమమకారవర్జితుడై పరమబ్రహ్మశాంతిని బొంది, అలలులేని సముద్రమువలె ఆత్మయందు స్థితుడై నిస్తబ్ధభావమున నుండెను.

ధ్యానాత్కదాచిద్భగవాన్స్వయం విరమతి ప్రభుః
బన్ధనాత్సలిలస్యన్దా త్సౌమ్యత్వాదివ వారిధిః. 40



విచారయతి సంసారం సుఖదుఃఖసమన్వితమ్
ఆశాపాశశతైర్బద్ధం రాగద్వేషభయాతురమ్. 41

సముద్రములలనుండి విడువడునట్లు, ఒకానొకప్పుడు బ్రహ్మ ధ్యానమునుండి విరతుడై, 'ఈ సంసారము సుఖదుఃఖసమన్వితము, ఆశాపాశబద్ధము, రాగద్వేష భయాన్వితము' అని విచారించెను.

తతః సకరుణాక్రాన్త మనా భూతవిభూతయే
కరోతీహ మహార్థాని శాస్త్రాణి వివిధాని చ. 42
అధ్యాత్మజ్ఞానగర్భాణి వేదవేదాంగసంగ్రహమ్
పురాణాదీని చాన్యాని ముక్తయే సర్వదేహినామ్. 43

అనంతరము బ్రహ్మ దయార్ద్రచిత్తుఁడై జీవగణముయొక్క సుఖము కొఱకును, మోక్షము కొఱకును ఉపయోగపడు వివిధ ఆధ్యాత్మశాస్త్రములను విరచించెను. వేదవేదాంగములను సంగ్రహించెను. తదితర పురాణములనుగూడ రచించెను.

పునస్తత్పదమాలంబ్య పరమాపద్వినిర్గతః
స్వస్థస్తిష్ఠతి శాన్తాత్మా నిర్మన్దర ఇవార్ణవః. 44
అవలోక్య జగచ్చేష్టాం మర్యాదాం వినియోజ్య చ
బ్రహ్మా కమలపీఠస్థః పునః స్వాత్మని తిష్ఠతి. 45

మరల సృష్టియను ఈ విపత్తునుండి వెలువడి పూర్వపు పరమపదము (బహ్మైక్య భావము) నవలంబించి నిర్మందరమగు సముద్రమువలె శాంతుడై, స్వస్వరూపమున వెలయసాగెను. కమలాసనుఁడగు బ్రహ్మ పైన జెప్పినట్లు జగద్గతిని నిరీక్షించి, శాస్త్రరచనవలన నియమములను కల్పించి, మరల నాత్మస్థుఁడయ్యెను.

కదాచిత్కేవలం సర్వ సంకల్పపరిహీనయా
యదృచ్ఛయానుగ్రహార్థం లోకక్రమవదాస్థితః. 46
నార్జవం నాస్య సంత్యాగో న పుష్టో న చ సంగ్రహః
నానాసచేతనం నేహ న స్థితిర్నాస్థితిః స్థితా. 47
సర్వభావసమారంభః సమః సర్వాసు వృత్తిషు
పరిపూర్ణార్ణవాకారో ముక్తశేషోఽవతిష్ఠతే. 48

బ్రహ్మ సంకల్పహీనుడయ్యు, ఇచ్ఛించియే కేవలము లోకానుగ్రహార్థము సాధారణుని వలె లోకవ్యవహార పరాయణుడయ్యెను. వాస్తవమునకాతనికి ఆర్జనానార్జవములు, శరీరగ్రహణము, త్యాగాతత్త్వము, చేతనత్వము, స్థితివినాశములులేవు. అతనికి అన్ని భావములు, చిత్తవృత్తులు, సమానములు. అతడు పరిపూర్ణస్వరూపుడై సముద్రమువలె వెలయుచుండును.

కదాచిత్కేవలం సర్వ సంకల్పపరిహీనయా
యదృచ్ఛయానుగ్రహార్థం లోకానాం ప్రతిబుధ్యతే. 49

ఏషాబ్రాహ్మీస్థితిఃపుణ్యా యామయోక్తామహామతే
యాతాంవిధిసురానీకో తామేతాంసాత్త్వికీమపి. 50

ఒక్కొక్కప్పుడు కేవలము లోకానుగ్రహార్థమే సర్వసంకల్పహీనుడై జాగరిల్లును. మహామతీ! నీకు జెప్పిన ఈ బ్రహ్మస్థితి సాత్వికము. ప్రజాపతులు, దేవతలు మాత్రమే దీనిని బొందెదరు.

చిత్సర్గోపరమాకాశే బ్రహ్మణోయన్మనఃఫలమ్
ఉదేతిప్రథమంసైవ బ్రహ్మత్వంసమవాప్నుతే. 51
సర్గేస్థితింగతేత్వన్యా యోదేతికల్పనాపరా
సావ్యోమానిలమాశ్రిత్య ప్రవిశ్యౌషధిపల్లవాన్. 52
కాచిత్సురత్వమాయాతి కాచిదాయాతియక్షతామ్
ఉదేతిప్రథమంసైషా బ్రహ్మత్వంసమవాప్నుతే. 53
యాయత్సత్త్వంసమన్వేతి సాతదేవానుజాయతే
జాతాసంసర్గవశత స్తస్మిన్నేవచజన్మని
బధ్యతేముచ్యతేవాసా స్వయమన్యాగభేదతః. 54

సృష్టి యుపరమమగు చిదాకాశమున బ్రహ్మమనోకల్పితమగు ఫలము ఉత్పన్నమగుచున్నది; ఈప్రథమ సృష్టియే ప్రజాపతులు. వీరికి బ్రహ్మప్రాప్తి స్వతఃసిద్ధము. ప్రజాపతులు, ఓషధులు స్థిరత్వమునందిన పిమ్మట, దేవతలరూపమున నుదయించిన కల్పన మొదట చంద్రికళారూపమున ఆకాశమును, వాయువును ఆశ్రయించి ఓషధులంబ్రవేశించి, సోమలత, ఆజ్యము, పయస్సులుగ పరిణతి నందుచున్నది. పిదప నయ్యది అగ్నియందాహుతమై సూర్యమండలమున అమృతముగ మారుచున్నది. ప్రజాపతులు దానిని భక్షింప శుక్రమై మైథునకర్మవలన సాత్వికులగు దేవయక్షులుగ జన్మించుచున్నది. వీరు మనుష్యులకంటె ముందుగనే ప్రజాపతులకడ నుపదేశమునంది బ్రహ్మస్వరూపము నందగల్గుచున్నారు. మనుష్యులేయే గుణము నాశ్రయించుదురో, ఆయాగుణానురూపమగు భోగవైరాగ్యముల నాశ్రయించి బద్ధులు ముక్తులు నగుచున్నారు. ప్రజాపతులకు బ్రహ్మజ్ఞానము స్వతఃస్థితము, దేవతలకు ఉపదేశమాత్రముననే లభించుచున్నది. మనుష్యులకు పురుషప్రయత్నమువలన లభించును. కాన సాధుసంగము శాస్త్రాభ్యాసము, ఇంద్రియజయము మున్నగు ఉపాయములను మనుజులందఱును ఫలప్రాప్తి యగునంతవఱకు అభ్యసింపవలెను.

ఇత్థంగతాస్థితిరియం కిలరామభద్ర
సృష్టేఃస్ఫుటప్రకట సంకటకర్మలబ్ధా
ఆవిర్భవేద్వివిధ వేగవిహారభార
సంరంభగర్భవిధృతా కలనాపదేసా. 55

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
స్థితిప్రకరణే కమలజవ్యవహారవర్ణనం నామ ఏకోనషష్టితమః
సర్గః ॥ 59 ॥



రామభద్రా! ఇట్లీసృష్టి స్పష్టములగు ఉపాసనలతోడను, యజ్ఞాది ఉచిత కర్మలతోడను, నిషిద్ధమిశ్రములగు అనర్థకర్మలతోడను, వీటివలన గల్గు ప్రారబ్ధవేగముతోడను, క్రీడాకౌతుకములతోడను, క్రోధలోభవ్యవహారములతోడను ధరింపబడి, బ్రహ్మయొక్క సంకల్పబలమున సత్తను బొందుచున్నది. ఇట్లు త్రివిధసృష్టి ఆవిర్భవించుచున్నది.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు స్థితిప్రకరణమున
కమలజవ్యవహారవర్ణనమను ఏకోనషష్టితమ
సర్గము ॥ 59 ॥

---

## షష్టితమః సర్గః.

---

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

అస్మిన్భగవతిబ్రహ్మణ్యశ్చపలం పదమాశ్రితే
పితామహేమహాబాహో కృతసర్గవ్యవస్థితౌ. 1
జగజ్జీర్ణారఘట్టేఽస్మిన్వహతిస్వవ్యవస్థయా
విప్రేతభూతఘటయా రజ్జ్వాజీవితతృష్ణయా. 2
బ్రహ్మణోత్థేషుచభూతేషు విశత్సుభవపంజరమ్
ఆవర్తేష్వీశ్వరవ్యోమ బాలమధ్యవివర్తిషు. 3
మనఃస్వన్యేషువాతాన్త లోలాహతకణేష్వివ
అనారతంవిసర్యాస్తి విశన్త్యన్యేతథాభితః. 4

వసిష్ఠుడు :— మహాబాహూ! భగవంతుడగు బ్రహ్మ సమాధినుండి లేచి సృష్టివ్యవస్థ నొనర్చెను. జగత్తను జీర్ణఘటీయంత్రము మృతజీవులను ఘటీమాలా రజ్జువువలన, జీవన - తృష్ణతో నీది పడుచు, గూరుచున్నది. ఈభూతములన్నియు బ్రహ్మనుండియే లేచి, సంసారపంజరమున బ్రవేశించుచున్నవి. తదితరములగు మనస్సులు ఈశ్వరుని ప్రథమపుత్రుడనదగు ఆకాశమున గాలిచే నెగురగొట్టబడిన ధూళికణములవలె తిరుగాడుచు, నాలలనందు ప్రవేశించుచున్నవి.

రామబ్రహ్మణిజీవౌఘా స్తరంగాఇవవారిధౌ
అనాద్యన్తపదోత్పన్నాః కలనాపదమాగతాః. 5
భూతాకాశంవిశన్త్యేతే ధూమశ్రీరివచాంబుదమ్
ఏకతాంయాన్తిజీవౌఘా బ్రహ్మణ్యాకాశమారుతైః. 6
దినంతస్మాత్రవాతేన తత్ప్రాణాత్మతయాయథా
ఆక్రమ్యన్తేప్రచండేన దైత్యౌఘేనామరాఇవ. 7

ఈజీవగణములన్నియు అనాది బ్రహ్మపదమునుండి ఉత్పన్నములై అనగా సంకల్పింపబడి, ధూమము మేఘముల బ్రవేశించునట్లు ఆకాశమున గలియుచున్నవి; పరబ్రహ్మమున ఆకాశ వాయు

వులలో జీవులేకత్వమును బొందుచున్నారు. పరాక్రమశాలురగు దైత్యులవలన దేవతలాక్రమింపబడునట్లు, తేజోజలపృథివీస్పృష్ట్యనంతరము జీవులు ప్రకాశితులై ప్రాణవాయువువలన నాక్రమింపబడుచున్నారు.

భూతప్రాణానిలం తేన గంధనా హేన తేనచ
నివిశ స్తిశరీరేషు జీవా గచ్ఛన్తివీర్యతామ్. 8

ఇట్లు లింగదేహమును బొందిన జీవులు ప్రాణవాయువు, భూతతన్మాత్రలు, అన్నజలములతో గలిసి చతుర్విధభూతములు, పంచవిధవాయువులుగ మారి, స్థూలశరీరమున బ్రవేశించి శతో భావము నందుచున్నారు.

తతోజగతిజాయన్తే భవన్తిప్రాణినోఽస్ఫుటాః
అన్యాఘూమాదిమాజాతా రామజీవపరంపరా. 9
తన్మాత్రవతితావద్భిరశూన్యేఽంబరకోటరే
ఉదేతియావద్భగవా నిన్దురుద్దామమండలః. 10
క్షీరాంబునిధాలోలైః పాండువద్రశ్మిభిర్జగత్
తతస్తేష్వతిరమ్యేషు చంద్రరశ్మిషుసంపతత్. 11
కరోతివిహగీలోలా వనేప్రేష్వన్తరేష్వివ
తేభ్యోఽపిస్వరసేనైవ యాన్తిపీవరతామపి. 12
ఫలేషుతేషుబధ్నాతి పదమిన్దుకరాత్థితా
జీవాలీక్షీరపూర్ణేషు మాతుః స్తనభరేష్వివ. 13
తాఃఫలావలయః పక్వా భవిష్యన్తిమరీచిభిః
తేష్వేవవీర్యమాగత్య తిష్ఠన్త్యప్రాప్తబోధితాః. 14

అనంతరము వారు జగత్తున నుత్పన్నులై ప్రాణుల రూపమును దాల్చుచున్నారు; అప్పుడు వారిజ్ఞానము అస్ఫుటముగనే యుండును. రామా! నరేశరులగు సురలు ధూమమార్గమున బ్రవేశించి, పూర్ణచంద్రుడుదయించు నంతదనుక, లింగశరీరయుతమగు క్షీరసముద్రమున కాశ్రయమగు అకాశకోటరమున నుండెదరు. పిదప, చంద్రకిరణములు నందనవనమునబడ, కార్యపరాయణయగు దాసివలెను, పక్షివలెను దేవతలందు ప్రవేశించెదరు అందలి ఫలములు చంద్రకిరణమువలన పుష్టిని బడయును. శిశువు మాతృస్తనముల నాశ్రయించునట్లు జీవులు చంద్రకిరణములనుండి వేరుపడి, ఆరసపూర్ణఫలముల నాశ్రయించెదరు. ఆఫలములు సూర్యకిరణములవలన పక్వములవ, కశ్యపాదిప్రజాపతులు వాటిని భక్షింతురు. అందున్న జీవులు వీర్యరూపమును గ్రహించి మూర్ఛితులైయుందురు.

ప్రసుప్తవాసనాజాల జీవతాగర్భపంజరమ్
అధితిష్ఠతిబీజశ్రీః సుప్తపత్రాయథావటమ్. 15
యథాకాష్ఠేస్థితశ్చాగ్ని ర్యథామృదిఘటాఃస్థితాః
అనేకక్రమయోగేన పరాగత్యమహేశ్వరాత్. 16



అదృష్టాన్యశరీరశ్రీః క్రమతేయోనచోదతి
సహిసత్యేవజాతిః స్యాదుదారవ్యవహారవాన్. 17
తేనైవమోక్షభాగీచేజ్జన్మనా సతుసాత్త్వికః
అథైతాం యోనిమాసాద్య కృత్యాంజన్మపరంపరామ్. 18
రక్షార్థంప్రాప్తజన్మాచేత్తమోరాజససాత్త్వికః
పాశ్చాత్యజన్మనాపుంసో రామవక్ష్యామిచాధునా. 19

జీవులు గర్భముననున్నప్పుడు, వటవృక్షముననున్న బీజము ఆకులున్నగునవి, అణగియున్నట్లు, వారి వాసనలు లీనములైయుండును ; కాష్ఠమున అగ్నియు, మృత్తికమందు ఘటమును లీనమైయుండునట్లు వాసనలుగూడ గర్భస్థజీవునియందు అణగియుండును. పూర్వజన్మమున పరమవైరాగ్యమును బూని జీవితమును గడపినవాడే, భోగార్థము కామ్యకర్మలనొనర్పని వాడే దేవాంశ సంభూతుడై, సాత్త్విక వృత్తినిబూని జీవన్ముక్తునివలె వ్యవహరించును. ఇట్టి దేవయోనిని బొందియు, జన్మమరణ పరంపరలం ద్రెంపక భోగాసక్తుడై యున్నచో, వానిని మిశ్రగుణియని గ్రహించునది. ప్రాజాపత్యశరీరమును బొందియు, సంసారియగువాడు ముక్తిని బడియురీతి నిప్పుడు చెప్పుచున్నాను, వినుము.

ప్రాధాన్యేనయథాయాతాః సంసారమితిసాత్త్వికాః
సకదాచిన్నకశ్చిచ్చ సంభవత్యనఘాకృతే. 20
సంభవన్తీహపురుషా రామ రాజససాత్త్వికాః
ప్రవిచార్యసమాయాతా మస్తవ్యంచేహతద్ధియా. 21
ప్రాధాన్యేనసమాయాతా యేయదాపరమాత్మనః
దుర్లభాఃపురుషా, రామ తే మహాగుణశాలినః. 22
యేచాన్యేవివిధామూఢా మూకాస్తామసజాతయః
తేషాంస్థావరతుల్యానాం కించరామ విచార్యతే. 23

అనఘా! ప్రథమ అనీకమునకు అనగా ప్రజాపతిజాతికి జెందిన పురుషుడు మరల జన్మించుట అనునదియే లేదు. రాజససాత్త్వికులగువారే అనగా దేవతలే మరల జన్మింతురు. కేవలసాత్త్వికులగు ప్రథమ అనీకమునకు జెందిన పురుషులు ఆత్మతత్వమును విచారించియే అరుదెంతురు. ఇట్టివారు దుర్లభులు. రామా, తామసులును, మూఢులును, స్థావరసములును అగు జీవులను గురించి విచారింపదగినదేమున్నది ?

కతిపయానగతా భవభావనాం
నరసురాః ప్రకృతక్రమ జన్మని
అహమివ ప్రవిచారణ యోగ్యతా
మనుగతో ననురాజససాత్త్వికః. 24
స్థితస్యతేమహాపదా విచార్యమైవమాయతా.
విచారయత్వమంజసా తదద్యచేహానద్వయమ్. 25

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే స్థితిప్రకరణే విచారపురుషనిర్ణయప్రసఙ్గోపదేశే జీవావతారో నామ షష్టితమః సర్గః ॥ 60 ॥

ఉత్తమ జన్మను బొందియు, సంసారభావమును బొందని సురనరు లెందరు ? నన్ను బోలిన ఆత్మవిచారపరులు కేవలసాత్త్వికులు గారు ; రాజససాత్త్వికులు. కాన, సమాధిసుఖవిఘ్నకారి యగు రాజపౌరోహిత్యమను ప్రారబ్ధమున్నది. కేవలసాత్త్వికులు అత్యంతము దుర్లభులు. నీవును నావలె శమాదియుక్తుఁడవైనను ఆత్మపదమును చక్కఁగ విచారించుశక్తి బొందలేదు. కాన నీకింకను సంసారభ్రాంతి తొలగలేదు. కనుక, 'తత్ - పదము'ను గుఱించి విచారింపుము ; వెంటనే అద్వయమగు పరమపదమును బొందగలవు.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు జీవావతారమను షష్టితమ సర్గము ॥ 60 ॥

---

## ఏకషష్టితమః సర్గః.

---

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

యేహి రాజససాత్త్వికా జాతా భువి మహాగుణాః
తే నిత్యమేవ ముదితాః ప్రకాశాః ఖ ఇవేన్దవః. 1

వసిష్ఠుడు :— తత్త్వవిచారణాసమర్థమగు రాజస - సాత్త్వికవృత్తితో భూమండలమున జన్మించిన మహాగుణులు సతతమానందయుతులై ఆకసమునందు చంద్రునివలె ప్రకాశించుచుందురు.

న ఖేదమాభిగచ్ఛన్తి వ్యోమభాగో మలం యథా
నాపదా మ్లానిమాయాన్తి నిశి హేమాంబుజం యథా. 2

ఆకాశమున మాలిన్యము పడనట్లు, వారిమనస్సున దుఃఖములము పడదు. సువర్ణపంకజము రాత్రియందు వాడనట్లు, వారాపదలందుగూడ మ్లానమనస్కులవరు.

నేహన్తే ప్రకృతాదన్యత్తే నానర్థాత్సవరో యథా
రమన్తే స్వసదాచారైః స్వార్థేభ్యః పాదపా యథా. 3

వారు, వృక్షములవలె ప్రకృతములగు శమాది సంపదలకంటె అన్యములగువానిని గోరరు. వృక్షములు తమ సంపదలగు పుష్పఫలాదుల నితరుల కొసంగునట్లు వారు సతతము సదా-చారపరాయణులై వెలయుదురు.

నిత్యమాపూర్యతాం యాతి సుధాయామిన్దుసుందరీ
రామ రాజససత్త్వస్య మోక్షమాయాత్యసౌ యథా. 4

ఆపద్యపి న ముఞ్చన్తి శశివచ్ఛీతతామివ
ప్రకృత్యైవ విరాజన్తే మైత్ర్యాదిగుణకాన్తయా. 5



పూర్ణచంద్రునివలె సుందరమును నిర్మలమును నగు వారిబుద్ధి, మోక్షోపయోగకరములగు శాంత్యాదిగుణసుధయందు మగ్నమై పుష్టినందును. చంద్రుని చల్లదన మెన్నడును బోనట్లు, ఆప త్కాలమునఁగూడ వారి సౌమ్యభావము తొలగదు వారి ప్రకృతి మైత్ర్యాది గుణములతోఁగూడి మనోహరమై యొప్పుచుండును.

నవస్తబకభావిన్యా లతయేవ వనద్రుమాః
సమాః సమరసాః సౌమ్యాః సతతం సాధు సాధవః 6

క్రొంగ్రొత్త పూలగుత్తులతో నిండిన తీగలచే చుట్టబడిన చెట్లు చెలువునుగూర్చునట్లు, వారు సుందరగుణయుతులై శోభిల్లెదరు; ఇట్టిసాధుపురుషులు సర్వదా సమభావమును, సౌమ్యభావమునుబూని సమరసులైయుందురు.

అబ్ధివద్ధృతమర్యాదా భవన్తి భవతా సమాః
అతస్తేషాం మహాబాహో పదమాపదవాసనమ్. 7

సతతం తత్తు గన్తవ్యం గన్తవ్యం నాపదర్ణవే
తథా తత్త్వేహ జగతి విహర్తవ్యమఖేదినా. 8

మహాబాహూ! ఈమహాత్ములు నీవలెనే మర్యాదాశీలురైయుందురు. అందువలన, వారుబడసిన నిరాపదస్థానమగు పరమపదమును అనుసరించుటయే కర్తవ్యము. కాన దుఃఖమునువీడి, తదనురూపముగ వ్యవహరింపుము.

ఆత్మోన్నదయాశ్చ వర్ధన్తే యథా రాజససాత్త్వికాః
అచిన్త్యగత్యా సచ్ఛాస్త్రం విచార్యం చ పునః పునః. 9

అసత్యతా స్వమనసా వివిక్తా వాశుభావతః
ఆదావన్తే చ యాం నిత్యం క్రియాం త్రైలోక్యవర్తినీమ్. 10

పదార్థానాపదేవాసు భావయేన్నైత తు సుధీః
అసమ్యగ్దర్శనం త్యక్త్వా వ్యర్థమజ్ఞానసంతతిమ్. 11

రజోగుణక్షయమున కేవలము సత్త్వగుణసంపన్నులగు మహాత్ములాత్మానందమునుబొంది, వృద్ధినందినారు. సచ్ఛాస్త్రపరిశీలన నొనర్చి, 'సమస్త మసత్యము' అని భావించి, చిత్తశుద్ధినిబడసి ఐహిక ఆముష్మిక క్రియలను ఆపదలుగ భావించి అజ్ఞానపరివాహమగు అసమ్యగ్ - దర్శనమును వీడవలెను.

స్మర్తవ్యం సమ్యగేవేదం జ్ఞానమర్థమనన్తకమ్
కోఽహం కథమిదం జాతం సంసారాడంబరం విభో. 12

ప్రవిచార్యం ప్రయత్నేన ప్రాజ్ఞేన సహ సాధుభిః
న చ కర్మసుమజ్జన్తవ్యం నానర్థేన సహావసేత్. 13

ద్రష్టవ్యః సర్వవిచ్ఛేదః సంసారానుగతిః సదా
సాధురేవానుగన్తవ్యో మయూరేణాంబుదో యథా. 14

అహంకారస్య దేహస్య సంసారస్యాప్లవస్య చ
స్వవిచారమలంకృత్య సత్యమేవావలోకయేత్. 15

విభూ! 'నేనెవ్వడను, ఈ సంసారాడంబర మెట్లు ఉత్పన్నమైనది' అను అనంతజ్ఞాన భోధకమగు విచారమును నొనరింపవలెను. ప్రాజ్ఞవ్యక్తి అత్యంతయత్నములో సాధువులతో గూడి పైనజెప్పినరీతి విచారింపనగును. కర్మసూత్రముల బంధింపబడవలదు. అనర్థముతో గూడ తగదు. సంసారముననున్న ప్రియావస్తువర్గ విచ్ఛేదము అవశ్యంభావి. నెమలి మేఘమును వెంబడించునట్లు సాధువుల ననుసరించునది. అంతర్గతమగు అహంకారము, బహిర్గతమగు శరీరమును, దానికంటె వేఱగు బంధుమిత్రాదులను గుఱించి విచారించునది. వీరు సంసారసముద్రతరణములుగారు. సంసారతారకమగు ఆత్మవిచారము నాశ్రయించి సత్యదర్శన మొనర్పనగును.

శరీరమస్థిరమపి సంత్యక్త్వా ఘనశోభనమ్
వీతముక్తావలీతన్తుం చిన్మాత్రమవలోకయేత్. 16

తస్మిన్ప్రదేసత్యతతే సర్వగే సర్వభావితే
శివే సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా యథా. 17

క్వైవచిద్భువనాభోగే భూషణే వ్యోమ్ని భాస్కరే
ధరావివరకోశస్థే క్వైవచిత్కీటకోదరే. 18

కుంభవ్యోమ్నాం న భేదోఽస్తి యథేహ పరమార్థతః
చితౌ శరీరసంస్థానాం న భేదోఽస్తి తథానఘ. 19

సర్వేషామేవ భూతానాం తిక్తకట్వాదిభేదినామ్
ఏకత్వాదనుభూతేర్హి కుతశ్చిన్మాత్రభిన్నతా. 20

అస్థిరములగు శరీర, అహంకారాదులను పరిత్యజించి ముత్తెపుసరుల నడుమనున్న దారము వలె వెలయు చిన్మాత్ర సాక్షిస్వరూపమును వీక్షింపనగును. దారమున మణులు గ్రుచ్చబడునట్లు, సర్వవ్యాపియును, సర్వభావితమును, నిత్యమును నగు ఆపరమవస్తువున ఇదంతయు గ్రథితమై యున్నది. ఈ విశాలప్రపంచమున, ఆకాశమున, సూర్యునియందు, భూవివరప్రదేశమున, కీటాణువులందును, ఆచిత్స్వరూపమే వెలయుచున్నది. అనఘా! విభిన్నఘటములనున్న ఆకాశము వేఱుగానట్లు వివిధ శరీరములనున్న చిత్తునగూడ భేదములేదు. పదార్థములనున్న తిక్తకటుకాషాయాది రసముల భేదమున్నను తత్సంబంధమగు అనుభవ మెల్లరికిని సమానమైనట్లు వివిధదేహములనున్న చిత్తు యొక్క ప్రకాశము వేఱైనను వస్తువొక్కటే.

ఏకస్మిన్నేవ సతతం స్థితే సన్మాత్రవస్తుని
జాతోఽయమయమున్నష్ట ఇతి తేషాం తవేహ ధీః. 21

న చ తన్నామ నాస్త్వస్తి యద్భూత్వా సంప్రలీయతే
ఆభాసమాత్రమేవేదం న సన్నాసచ్చ రాఘవ. 22

ఉద్భూతేనాప్రశాన్తేన చేతసా సపదిస్థితమ్
నేహ మోహాస్తత మోక్షౌ నేదం యత్తదవస్తు చ. 23



కింకిలాసతి రామేహ మోహజాలే సముజ్ఝతి
యత్కించిత్సంగసంగత్యా విమోహే కారణం హి తత్. 24

ఒకే సద్వస్తువు సతతము వెలయుచున్న, 'ఇది పుట్టినది, అది గిట్టినది' అను బుద్ధి సుసంగతము కాజాలదు. ఉత్పన్నమై నశించునది వస్తువే కాజాలదు. రామా! నీవు గాంచునదంతయు చిత్ప్రతిబింబమే. ఇది సదసద్విలక్షణము. అశుద్ధచిత్తమునకు విషయీభూతమగుటవలన సత్తనియు, మోహనివృత్తియైన నాశనమగుటవలన అసత్తనియు చెప్పబడుచున్నది. అనిర్వచనీయ అధ్యాసరూపమున ఈ దృశ్యములు మోహకారణము లగుచున్నవి.

అసతి జగతి కింకిలేహ మోహః
సతి చ కిమఙ్గ విమోహకారణం తత్
జననమరణసంస్థితిష్వతస్త్వం
భవ ఖమివాతిసమః సదోపశాన్తః. 25

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
స్థితిప్రకరణే జననమరణసంస్థితిర్నామైకషష్టితమః
సర్గః ॥ 61 ॥

జగత్తే మిథ్యయైన మోహమును గుఱించియు, తత్కారణమును గుఱించియు వేఱుమాటయేల? అందువలన నీవు జన్మస్థితిమరణములను గుఱించి చింతింపక ఆకాశమువలె సర్వత్రసముడవై నిర్మలభావమున వెలయుము.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు స్థితిప్రకరణమున
జననమరణ సంస్థితియను ఏకషష్టితమ
సర్గము ॥ 61 ॥

---

## ద్వి ష ష్టి త మః స ర్గః.

---

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

ధీరో విచారవాన్ప్రాజ్ఞో దాదావేవ మహాధియా
శాస్త్రేణ విదుషా శాస్త్రం సుజనేన విచారయేత్. 1

సుజనేన వితృష్ణేన విదుషా మహతా సహ
ప్రవిచార్య మహాయోగాత్పదమాసాద్య తే పరమ్. 2

శాస్త్రార్థసుజనాసంగ వైరాగ్యాభ్యాససత్కృతః
పురుషస్స్వమివాభాతి సద్విజ్ఞానభాజనమ్. 3

త్వముదారనిజాచారో ధీరో గుణగణాకరః
అధితిష్ఠసినిర్దుఃఖం వీతసర్గమనోమలః. 4

నూనముత్సర్జితాభ్రేణ శరద్వ్యోమ్నా సమోభవాన్
భవభావనయాయుక్తో యుక్త ఉత్తమసంవిదా. 5

వసిష్ఠుడు:—బాహ్యాభ్యంతర కష్టసహిష్ణుడగు ధీరుడును, విచారపరాయణుడునగు వ్యక్తి స్వయబుద్ధిబలమున, సద్గురు నాశ్రయించి శాస్త్రవిచార మొనర్పనగును. విషయతృష్ణావిహీనుడగు ఆత్మవిత్తుతో విచారించిన, మనోనాశమై సమాధి లభించును. శాస్త్రార్థ వివేకాభ్యాసియును, సుసంగియునునగు శుద్ధపురుషుడే నీవలె ఈ ప్రత్యక్-విజ్ఞానమున కధికారి. ఇప్పుడు నీవు ధీరుడవై, పవిత్రాచరణలో గూడి, గుణాకరుడవైతివి. సృష్టియను మనోమలము దూరమైనది, నిర్దుఃఖవిషయమున నెలయుచు, మేఘరహితమగు శరదాకాశమువలె స్వచ్ఛతను బొందితివి. నీకింక సంసార - భయములేదు; ఉత్తమజ్ఞానమునుబొందితివి.

చిన్తాముక్తకలావత్యా ముక్తకల్పనయాస్థితమ్
మనోముక్తివిభాగంచ ముక్తమేవ నసంశయః. 6

తవోత్తమానుభావస్య తఇదానీంనరాభువి
చేష్టామనుసరిష్యన్తి రాగద్వేషవిహీనయా. 7

బహిర్లోకోచితాచారా విహరిష్యన్తియేజనాః
భవార్ణవం తరిష్యన్తి ధీమన్తఃపోతకాన్వితాః. 8

తవతుల్యమతిర్యః స్యాత్సుజనఃసమదర్శనః
యోగ్యోఽసాజ్ఞానదృష్టీనాం మయోక్తానాంసుదృష్టిమాన్. 9

యావద్దేహంధియాతిష్ఠ రాగద్వేషవిహీనయా
బహిర్లోకోచితాచార స్త్వన్తస్త్యక్తాఖిలైషణః. 10

ఇప్పుడు నీ మనస్సు బాహ్యవస్తుచింతను వీడి, పరమాత్మతో నేకీభావమును బొందినది. అందువలన నీవు ముక్తుడవైతివి; ఈవిషయమున సందేహములేదు. నీవిప్పుడు రాగద్వేషముక్తుడవై, అన్యుల కాదర్శప్రాయుడవైతివి. జ్ఞాననౌకను బడసిన బుద్ధిమంతులు, ఉచితరీతిని వ్యవహరించుచు, సంసారసాగరమును దాటెదరు. నిన్నుబోలిన బుద్ధిమంతులు, సుజనులు, సమదర్శనులు, సుదృష్టిసంపన్నులే యీజ్ఞానదృష్టికి యోగ్యులు. ఈశరీరముండునంతదనుక విషయాసక్తిలేక, ద్వేషమును, వాసలను వీడి, లౌకికాచారముల నాచరించుచు వ్యవహరింపుము.

పరాంశాన్తిముపాగచ్ఛ యథాన్యేగుణశాలినః
అవిచార్యాస్తపవేహ గోమాయుశిశుధర్మకాః. 11

యేస్వభావామహాసత్వా నృణాంసాత్వికజన్మనామ్
తాన్శుభజన్పురుషోయాతి పాశ్చాత్యోదారజన్మతామ్. 12

యానేవసేవ తేజన్తు రిహజాతిగుణాన్సదా
అథాన్యజాతిజాతోఽపి జాతింభజతితాంక్షణాత్. 13



ప్రాక్తనానఖిలాన్భావా న్యాన్తికర్మవశంగతాః
పౌరుషేణావజీయన్తే ధరాధరమహాకులాః. 14

ధైర్యేణాభ్యుద్ధరేద్బుద్ధిం పంకాన్మగ్నగవీమివ
తామసీంరాజసీంచైవ జాతిమన్యామపిశ్రితః. 15

గుణశాలురగు ఇతరపురుషులు పరమశాంతిని బొందినట్లు నీవుగూడ పరమశాంతిని బొందుము. [illegible]లె పరవంచకులును, శిశువులవలె మూఢులనునగు వారినిగురించి విచారింపబనిలేదు. సాత్వి[illegible]షులయందు అత్యంతసత్యముగ నెగడుగుణములననుకరించి, మనుజుడు క్రమముగ జ్ఞానో[illegible] శుద్ధశరీరమును బొందుచున్నాడు. ఈజన్మయందున్న జాతి, గుణములే మఱుసటి జన్మమందుగూడ అనుక్రమించును. కర్మబద్ధుడగు జీవుడు పూర్వభావమునే బొందునుకాని, పౌరుషమువలన సాఫల్యము నందవచ్చును. అత్యంత పరాక్రమవంతులగు చక్రవర్తులుగూడ పౌరుషమువలన జయింపబడుచున్నారు. బుద్ధి, తామసరాజసాది గుణములనుగాని, రాక్షస పిశాచాది కుయోనులగాని, నాశ్రయించియున్న, పంకమగ్నమగు ధేనువువలె, దాని నుద్ధరించునది. అనగా, బుద్ధిని పాపపంకమునుండి తొలగించి పుణ్యపథమున నుంచునని.

స్వవివేకవశాద్యాన్తి సన్తఃసాత్వికజాతితామ్
అతశ్చిత్తమణౌస్వచ్ఛే యద్రాఘువనియోజ్యతే. 16

తన్మయోవిభవత్యేవం తస్మాద్భవతిపౌరుషమ్
పౌరుషేణప్రయత్నేన మహార్హగుణశాలినః. 17

ముముక్షవోభవన్తీహ పాశ్చాత్యశుభజాతయః
నతదస్తిపృథివ్యాంవా దివిదేవేషువాక్వచిత్. 18

పౌరుషేణప్రయత్నేన యన్నాప్నోతిగుణాన్వితః
బ్రహ్మచర్యేణధైర్యేణ వీర్యవైరాగ్యరంహసా
యుక్త్యాయుక్తేనహివినా నప్రాప్నోషితదీహితమ్. 19

సాధుపురుషులు తమతమ వివేకముయొక్క ఫలితముగనే సాత్వికజాతి సంపన్నులగుచున్నారు. రాఘవ! స్వచ్ఛమగు చిత్త-మణియందు ఎద్దానిని జోడింతువో అందే అది తన్మయత్వ ప్రయత్నమును వహించును. దానినుండియే పురుషకారముత్పన్నమగుచున్నది. ముముక్షువులు పౌరుష బలముననే అమూల్య-గుణముల నార్జించి, పిదప శుభజన్మను బడయుచున్నారు. స్వర్గమునగాని మర్త్యలోకమునగాని గుణి పౌరుషబలమున పొందజాలనిదిలేదు. బ్రహ్మచర్య, ధైర్య, వీర్య, వైరాగ్యముల వేగములేనిచో, వాంఛితార్థమును బడయజాలము.

హితంమహాసత్వత యాత్మతత్త్వం
విధాయబుద్ధ్యా భవవీతశోకః
తవక్రమేణైనతతో జనోఽయం
ముక్తోభవిష్యత్థ వీతశోకః. 20

నీ కుపదేశించిన ఈ ఆత్మతత్త్వము అత్యంతిక దుఃఖనివృత్తికరము, నిరతిశయశాంతిప్రదము, సకల జనహితకరము. విశుద్ధసత్త్వగుణమును పెంపొందించి, బుద్ధిబలమున నాత్మభావమున స్థిరుడవై శోకశాంతిని బొందుము. ఇతరులుగూడ ఇట్లే ముక్తిని బొందగలరు.

> పాశ్చాత్యజన్మని వివేకమహామహిమ్నా
> యుక్తేత్వయిప్రసృత సర్వగుణాభిరామే
> సత్త్వస్థకర్మణి పదంకురురామభద్ర
> మైషాకరోతు భవసంగవిమోహచిన్తా. 21

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే ద్వాత్రింశత్సాహస్ర్యాం సంహితాయాం స్థితిప్రకరణే గుణసంపత్త్యభివర్ణనంనామ ద్విషష్టితమః సర్గః ॥62॥

స్థితిప్రకరణమ్ సంపూర్ణమ్.

రామచంద్రా ! నీవిప్పుడు మహామహిమాన్వితుడవైతివి, శాంత్యాదిగుణములు అబ్బినవి సాత్త్వికజన్మనుగూడబొందితివి. అందువలన, తదుచితముగ ప్రవర్తింపుము. సంసారాసక్తియను మోహ చింత నీహృదయమున తావుబడయకుండు గాక !

ఇది శ్రీవాసిష్ట తాత్పర్యప్రకాశికయందు స్థితిప్రకరణమున గుణసంపత్త్యభివర్ణనమను అఱువదిరెండవ సర్గము ॥ 62 ॥

స్థితిప్రకరణము సమాప్తము.



ఓమ్.

# వాసిష్ఠ మహారామాయణము.

## ఉపశమ ప్రకరణము.

---

### ప్రథమః సర్గః.

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

> అథస్థితిప్రకరణా దనన్తరమిదంశృణు
> ఉపశమప్రకరణంజ్ఞాతం నిర్వాణకారియత్. 1

శ్రీవసిష్ఠుడు:—ఓరామచంద్రా! స్థితిప్రకరణానంతర మిపుడు ఉపశమప్రకరణమును గూర్చి నీవువినుము. ఇయ్యది నిర్వాణపదము గల్గజేయునదగును.

శ్రీ వాల్మీకిరువాచ :—

> శరతారకితాకాశే స్తిమితాయాంసుసంసది
> కథయత్యేవమాహ్లాది వసిష్ఠేపావనంవచః. 2
> శ్రవణార్థిత్వమానస్థ పార్థివేసంసదన్తరే
> నిర్వాతఇవనిస్పన్ద కమలేకమలాకరే. 3
> విలాసినీషుసంశాన్త మదమోహబలాసుచ
> శమమన్తఃప్రయాస్తీషు చిరప్రవ్రజితాస్వివ. 4
> కరామ్భోరుహహంసేషు లీనేషుశ్రవణాదివ
> ముక్తఘుర్ఘురవాదేషు వాయనేషుతరావివ. 5
> నాసాగ్రపరివిశ్రాన్త తర్జన్యఙ్గులికోటిషు
> విచారయత్సువిజ్ఞాన కలాంతజ్ఞేషురాజసు. 6
> రామేవికాసమాయాతే ప్రభాతఇవపఙ్కజే
> పరిత్యక్తతమఃపీఠే సూర్యోదయఇవాంబరే. 7
> ఆకర్ణయతివాసిష్ఠీర్గిరో దశరథేరసాత్
> కలాపినీవజీమూత నిర్హ్రాదాన్ముక్తవర్షణాత్. 8

శ్రీవాల్మీకి:—శరత్కాలమందలి తారాగణయుక్తమగు ఆకాశమువలె నాదశరథుని సభయంతయు నిశ్చలముగానుండెను. వసిష్ఠభగవానులు ఆనందజనకములైన పవిత్రవచనముల బల్కుచుండెను. శ్రవణార్థము సభయందున్న రాజులందఱును, వాయురహిత కమలవనమందలి కమలముల వలె నిశ్చలము గానుండి మౌనమును ధరించియుండిరి. చిరసన్న్యాసినుల యంతఃకరణమువలె లలనల

మోహబలముపశమించెను. వసిష్ఠమునీంద్రుని వాక్యములాలించుటచే హంసరూపిణులగు స్త్రీల హస్త కమలములు సంకుచితమగుచుండెను. పక్షుల శబ్దములఁబోలిన కంకణ ధ్వనులు శమించుచుండెను. నాసికాగ్రభాగమున తర్జనీయంగుళినుంచి రాజులందఱును దీర్ఘవిచారణయందు మగ్నులైయుండిరి. ప్రాతఃకాల కమలమువోలె శ్రీరామచంద్రుఁడు వికాసము నొందుచుండెను. సూర్యోదయముచే నాకసమున యంధకారముడుగునట్లు అజ్ఞానాంధకారము పలాయనమగుచుండెను. మేఘశబ్దములను మయూరముల వినునట్లు వసిష్ఠ భగవానుని వాక్యములను ధశరథుఁడు ప్రేమతో నాలించుచుండెను.

ఆహృత్యసర్వభోగేభ్యో మనోమర్కటచంచలమ్
శ్రవణంప్రతియత్నేన సారేణామ స్త్రిణిస్థితే. 9

వసిష్ఠోక్త్యాపరిజ్ఞాత స్వాత్మనీన్దుకలామలే
లక్ష్మణేవిలసల్లక్ష్యే శిక్షాబలవిచక్షణే. 10

శత్రుఘ్నే శత్రుదలనే చేతసాపూర్ణతాంగతే
అలమానందమాయాతే రాకాచంద్రోపమేస్థితే. 11

సుమిత్రేమిత్రతాంయాతే మానసేదుఃఖశీలితే
వికాసిహృదయేజాతే తత్కాలఇవపంకజే. 12

తత్రస్థేషుతథాన్యేషు తథామునిషురాజసు
సుధౌతచిత్తరత్నేషు ప్రోల్లసత్స్వివచేతసా. 13

మనస్సను చపలవానరమును భోగములన్నింటినుండి తొలగించి యత్నముతో సారణమంత్రి వాక్యశ్రవణమందే యద్దానిని నియోగించియుండెను. వసిష్ఠమునీంద్రుని యుపదేశముచేతను, ఆత్మరూపనిర్మల చంద్రకళా ప్రకాశముచేతను, ఆధ్యాత్మిక శిక్షాబలముచేతను పరిశుద్ధమైన లక్ష్మణుని హృదయమున బ్రహ్మస్వరూపమను లక్ష్యము స్ఫురించుచుండె. రిపుసూదనుఁడగు శత్రుఘ్నుని చిత్తము పూర్ణత్వము జెంద, నిరతిశయానంద ప్రాప్తిచే పున్నమనాటి చంద్రునివోలె వెలుగొందుచుండెను. దుఃఖాత్మకమగు మనస్సు మిత్రునివోలె సుమిత్రునకు వశమగుచుండెను. అపుడంపటి హృదయములును కమలమువోలె వికాసముఁజెందెను. మఱియు నిర్మలచిత్తమను రత్నయుక్తులై మునులును జనకమహారాజున్ను వికసితాంతఃకరణులైరి.

ఉదభూత్ప్రరయన్నాశాః కల్పాభ్రరవమాంసలః
అథమధ్యాహ్నశంఖానా మబ్ధిఘోషసమఃస్వనః. 14

అత్తఱి ప్రళయకాల మేఘశబ్దమువలెను, సముద్రగర్జనవలెను, గంభీరముగ నొప్పుచున్న మాధ్యాహ్నకాలిక శంఖారవము దిక్కులన్నింటిని పూర్ణమొనర్చుచు వ్యక్తమయ్యెను.

మహతాతేనశబ్దేన తిరోధానంమునేర్గిరః
యయుర్జలదనాదేన కోకిలధ్వనయోయథా. 15

మేఘనాదంబుచే కోకిలధ్వనివలె అమ్మహచ్ఛబ్దంబుచే వసిష్ఠమునీంద్రుని వాక్యములును పరాజితములయ్యెను.



మునిగన్తరయాంచక్రే స్వాంవాచమథసంసది
జితసారోగుణఃకేన మహతా సముదీర్యతే. 16

అపుడు వసిష్ఠభగవానుడు తన వాక్యముల విరమించెను. ఏలన, నిర్జింపబడిన శబ్దముగల వానిని మహాత్ముఁడగు రెవఁడుచ్చరింపగల్గును?

ముహూర్తమాత్రంవిశ్రమ్య శ్రుత్వామధ్యాహ్ననిఃస్వనమ్
ఘనేకోలాహలేశాన్తే రామంమునిరువాచహ. 17

ఆ మాధ్యాహ్నకాలిక శబ్దమును వినినతరువాత వసిష్ఠుఁడొక్క ముహూర్తకాలము విశ్రమించినవాడై ఘనమగు యాకోలాహలము శమించినపిదప రామచంద్రునితో నిట్లనియె.

రామాద్యతనమేతావదాహ్నికం కథితంమయా
ప్రాతరన్యత్తువక్ష్యామో వక్తవ్యమరిమర్దన. 18

ఇదంనియతితఃప్రాప్తం కర్తవ్యంతద్ద్విజన్మనామ్
మధ్యాహ్నముపపన్నం యత్కర్తవ్యంనావసీదతి. 19

త్వమప్యుత్తిష్ఠసుభగ సమస్తాచారసత్క్రియామ్
ఆచరాచారచతుర స్నానదానార్చనాదికామ్. 20

శత్రుసంహారకుఁడవగునో రామా! నేడింతవఱకు జెప్పితిని. మిగిలినదానిని ప్రాతఃకాలము వచించెద. శాస్త్రనియమానుసారము ద్విజులాచరింపఁదగిన కార్యవిధానము పతింపకుండుటకై మనను దానినాచరింపవలసియున్నది. ప్రియుఁడవగునో రామా! నీవును లెమ్ము. స్నానదాన పూజాది సమస్తయాచారములను, సత్క్రియలను నిర్వర్తింపుము.

ఇత్యుక్త్వామునిరుత్తస్థౌ సమందశరథఃప్రభుః
ససదాఃసేన్దురాదిత్య ఉదయాద్రితటాదివ. 21

ఇట్లువచించి వసిష్ఠమునీంద్రుడు యటనుండి లేచెను. అతనితో బాటు సభాసదులతో గూడియున్న దశరథుడున్ను ఉదయాద్రినుండి చంద్రసహితుఁడగు సూర్యునివలె లేచెను.

తయోరుత్తిష్ఠతోఃసర్వా సభోత్తస్థావుమాకమ్పత
మన్దవాతపరామృష్టా నలినీవాలిలోచనా. 22

వారిరువురు లేచినతోడనే సభాసదులందఱునుగూడ లేవనుద్యుక్తులైరి. మందవాయువుచే భ్రమరరూప నేత్రయుక్తమగు కమలసమ్మువోలె అపుడా సభయంతయును చలింపదొడగెను.

ఉత్తస్థౌసావతంసోత్థ భృంగమండలమండితా
కరిసేనేవసంధ్యాద్రా వాలోలకరపుష్కరా. 23

ముకుటములనుండి బయల్వెడలు భ్రమరసమూహముచే శోభించు నాసభాసదులంత సూర్యోదయకాలమున అస్తాచలముపైని గజబృందమువోలె లేచినిలంబడిరి.

పరస్పరాఙ్గసంఘట్ట చూర్ణితాఙ్గదమండలీ
రత్నపూర్ణారుణాంభోద సంధ్యాసమయసూచినీ, 24

పతదుత్తంసవిభ్రాన్తభృంగోపహితఘుంఘుమా
ముకుటోగ్రామవిద్యోత శక్రచాపీకృతాంబరా. 25

కాన్తాలతాహస్తదల చారుచామరమంజరీ
వనలేఖేవవిక్షుబ్ధ వరవారణమండలా. 26

కచత్కటకభారక్తీకృతాన్యోన్యతతాంబరా
వాతవ్యాసూతపుష్పేవ మన్దారవనమాలికా. 27

కర్పూరకణనీహార రచితామలవారిదా
శరద్దిక్తటమాలేవ ప్రసృతాశేషభూమికా. 28

లోలమాలిమణిశ్రాన్త పాటలాంబరకోటరా
సంధ్యేవాఫుల్లనీలాబ్జా కార్యసంహారకారిణీ. 29

రత్నాంశుసలిలాపూర ముఖపద్మనిరన్తరా
పద్మినీవాలివలితా నూపురారవసారసా. 30

సంతతాసాసభోత్తస్థా భూభృచ్ఛతసమాకులా
భూతసంతతిసంభ్రాన్తా సృష్టిర్నవమివోదితా. 31

అప్పుడు పరస్పరాంగసంఘట్టనచే వారియంగదసమూహము చూర్ణమయ్యెను. రత్నమయమై యొప్పుచుండుటచే నాసభ రక్తవర్ణమేఘములతోఁగూడి సంధ్యాసమయమును సూచించుచున్నట్లుండెను. పడుచున్న శిరోభూషణములందలి భ్రమరములశబ్దముతో గూడినదియు, ముకుటములందలి పలువిధమణులయొక్క ప్రకాశముచే ఆకాశమున ఇంద్రధనుస్సు నిర్మించునదియునై యుండెను. మఱియు నాసభ వనితలను లతలయొక్క కరపల్లవములందలి చమరములను మంజరీసమూహముగలదియు, మదగజంబుల విక్షుబ్ధమొనర్చినదియునగు వనమువోలె గన్పట్టుచుండెను. పరస్పరసంఘట్టనచే దేదీప్యమానముగ ప్రకాశించు కటకకిరణములను రక్తవస్త్రమును ధరించిన వాయువుచే చలించుచు పుష్పమయమైయున్న వనమువలె నది భాసించుచుండెను. మఱియు కర్పూరకణములను నీహారముచే నిర్మల మేఘముల రచించుచు పుష్పములచే భూమినంతయు పరివ్యాప్తమొనర్చు శరదృతు దిక్సమూహమువలె శోభించుచునుండెను. చలించు ముకుటమణులయొక్క యగ్రభాగములనుండి బయల్వెడలు కిరణసమూహంబుచే యాకసమును పీతవర్ణమొనర్చుచు, వికసితకమలయుక్తమై సంధ్యాకాలమందు దినకృత్యముల నుపసంహరించునదై యుండెను. రత్నకిరణములను జలరాశియందు ముఖమండలములను కమలములుగలదియు నూపురధ్వనులుగల్గి శబ్దమొనర్చు సారసపక్షిసహితమై యొప్పుచున్నదియు, కమలములచే నాచ్ఛాదితమగు సరస్సువోలె యనేకనృపాలురచే వ్యాప్తమై యున్నదియు, పలువిధ ప్రాణికోట్లతోగూడి యుద్భూతమగు నూతన సృష్టివలె భాసించునదియునై యుండెను.

ప్రణమ్యాథనృపంభూపా నిర్యయుర్నృపమన్దిరాత్
శక్రచాపీకృతారత్నై రంబుధేరివవీచయః. 32



సుమన్త్రోమస్త్రిణశ్చైవ వసిష్ఠమథభూమిపమ్
ప్రణమ్యజగ్ముఃస్నానాయా రసవిజ్ఞానకోవిదాః. 33

ఆపిమ్మట నృపతులందఱును దశరథునకు ప్రణమిల్లి సముద్రమందలి రత్నములనుండి యింద్రధనుసాకృతిని కిరణములు బయల్వెడలువట్లు యా రాజభవనమునుండి బయల్వెడలిరి. బ్రహ్మజ్ఞాన కుశలురగు సుమంత్రుడును, తక్కిన మంత్రులును, వసిష్ఠమునీంద్రులకును, దశరథునకును వందనములర్పించి యచ్చోటువీడిరి.

వామదేవాదయశ్చాన్యే విశ్వామిత్రాదయస్తథా
వసిష్ఠంపురతఃకృత్వా తస్థురారావరన్నోన్ముఖాః. 34

రాజాదశరథస్తత్ర పూజయిత్వామునివ్రజమ్
తద్విసృష్టోజగామాథ స్వకార్యార్థమరిందమః. 35

వనంవనాస్పదాజగ్ము ర్వ్యోమవ్యోమనివాసినః
నగరంనాగరాశ్చైవ ప్రాతరాగమనాయతే. 36

పిదప వామదేవ విశ్వామిత్రాది ఋషిపుంగవులు వసిష్ఠమునీంద్రుని యెదుట నిలంబడి వాని రాకకై నిరీక్షించుచుండిరి. దశరథుడున్ను మునులందఱిని పూజించి వారలనుండి సెలవుగైకొని స్వకార్యార్థమేగెను. వనవాసులు వనమునకును, ఆకాశనివాసులాకాశమునకును, నగరనివాసులు నగరమునకును మఱల ప్రాతఃకాలము వచ్చేయుటకై జనిరి.

మహీంపతివసిష్ఠాభ్యాం ప్రణయాత్ప్రార్థితఃప్రభుః
వసిష్ఠసద్మనినిశాం విశ్వామిత్రోఽత్యవాహయత్. 37

దశరథునియొక్కయు వసిష్ఠునియొక్కయు ప్రార్థనసంగీకరించి విశ్వామిత్రుడు ప్రేమతో నారాత్రి వసిష్ఠమునీంద్రుని సదనముననే గడపెను.

వసిష్ఠఃసహావిప్రేంద్రైః పార్థివైర్మునిభిస్తథా
ఉపాస్యమానోరామాద్యైః సర్వైర్దశరథాత్మజైః. 38

జగామస్వాశ్రమంశ్రీమాన్సర్వలోకనమస్కృతః
అనుయాతఃసురౌఘేన బ్రహ్మలోకమివాబ్జజః. 39

అపుడు ఉత్తమ బ్రాహ్మణులచేతను, రాజులచేతను, మునులచేతను, దశరథపుత్రులగు రామాదులచేతను గొలువఁబడి వసిష్ఠమునీంద్రుఁడు దేవతలచే యభినందింపబడి సర్వలోకపూజ్యుడగు బ్రహ్మదేవుఁడు బ్రహ్మలోకమున కేగువిధమున తన యాశ్రమమునకుఁజనెను.

తస్మాత్ప్రదేశాద్రామాదీ న్పునర్దశరథాత్మజాన్
సర్వాన్విసర్జయామాస పాదోపాన్తేనతానసౌ. 40

తనచరణములకు మ్రొక్కినరామాది దశరథసుతుల కందఱకును వసిష్ఠమునీంద్రుడపుడు సెలవొసంగి వారినచ్చటనుండి పంపివైచెను,

నభశ్చరాన్ధరణిచరానధశ్చరా
న్విసృజ్య సంస్తుతగుణగోచరాంశ్చతాన్
యథాక్రమం స్వగృహముదార సత్వవాం
శ్చకారతాం ద్విజజనవాసరక్రియామ్. 41

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే ఆహ్నికవర్ణనంనామ
ప్రథమః సర్గః ॥ 1 ॥

తన గుణగణంబులకీర్తించుచున్న ఆకాశపృథివీపాతాళ నివాసులందఱకును యథారీతి సెలవొసంగి ధైర్యౌదారగుణవిశిష్టుఁడగు వసిష్ఠమునీంద్రుఁడంత స్వసదనముఁ బ్రవేశించి ద్విజోచిత క్రియలగు పంచమహాయజ్ఞాదుల నొనర్చెను.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు ఉపశమప్రకరణమున
ఆహ్నికవర్ణనమను యొకటవ
సర్గము ॥ 1 ॥

---

## ద్వితీయః సర్గః.

---

శ్రీ వాల్మీకిరువాచ :—

తేసమేత్యగృహంగత్వా రాజపుత్రాః శశిత్విషః
చక్రుఃసర్వమశేషేణ స్వసద్మసుదినక్రమమ్. 1

శ్రీవాల్మీకి:—చంద్రునివలె ప్రకాశవంతులగు యారాజులెల్లరు తమ తమ గృహములకుఁ జని యట దైనికకృత్యములనెల్ల బూర్ణరీతి యొనర్చిరి.

వసిష్ఠోరాఘవశ్చైవ రాజానోమునయోద్విజాః
ఇతిచక్రుఃస్వకార్యాణి తథాస్వగృహవీథిషు. 2

వసిష్ఠుఁడును, రామచంద్రుఁడును, రాజులును, మునులును, బ్రాహ్మణులును తమతమ నివాసములందు వక్ష్యమాణక్రమంబున స్వోచితకార్యంబుల నిర్వర్తించిరి.

సస్నుఃకమలకల్హార కుముదోత్పలహారిషు
జలాశయేషుచక్రాహ్వ హంససారసరాజిషు. 3
గోభూతిలహిరణ్యాని శయనాన్యాసనానిచ
దదుర్దానాని విప్రేభ్యో భోజనాన్యంశుకానిచ 4
హేమరత్నవిచిత్రేషు స్వేషుచామరసద్మసు
ఆనర్చురచ్యుతేశాన హుతాశార్కాదికాన్సురాన్. 5



పుత్రపౌత్రసుహృద్భృత్య బన్ధుమిత్రగణైఃసహ
తతఆస్వాదయామాసు ర్భోజనాన్యుచితానివై. 6

శ్వేత, రక్త, నీలకమలములును, చక్రవాక, హంస, సారసపక్షులునుగల్గి మనోహరమై యున్న తటాకములందు స్నానమొనర్చిరి. గోవులను, భూమిని, తిలహిరణ్యాదులను శయనాసన భోజన వస్త్రాదులను బ్రాహ్మణులకు దానమొసంగిరి. సువర్ణరత్నములతోఁగూడి విచిత్రదేవాగారములవలె గన్పట్టుచున్న తమసదనములందు విష్ణు, మహేశ్వర, అగ్ని, సూర్యాది దేవతలఁబూజించిరి. పిదప పుత్ర, పౌత్ర, మిత్ర, దాస, బంధు, సుహృద్గణంబులతోఁగూడి యుచితాన్నములఁ భుజించిరి.

ఏతస్మిన్నసమయేచాస్మి న్నగరేదివసోఽభవత్
తనురష్టాంగశేషత్వా ద్దృష్టోనచమనోహరః. 7

అపుడా నగరమందు దినమందలి అష్టమాంశముహూర్తము శేషించియున్నందున నద్దృశ్యంతయు మిగుల మనోహరముగ నుండెను.

సాయన్తనదినాన్తం తే తత్కాలోచితచేష్టయా
అనయన్నంశుభిఃసార్ధం యావదస్తంయయౌరవిః. 8

వారందఱును సాయంకాలమున పురాణ ధర్మశాస్త్రావలోకనాది తత్కాలోచిత క్రియల నిరవేర్ప నంత సూర్యభగవానుఁడస్తాద్రిఁ గ్రుంకెను.

సంధ్యాంవవన్దిరేసుష్టు జేపుశ్చైవాఘమర్షణమ్
పేతుఃస్తోత్రాణిపుణ్యాని జగుర్గాథామనోహరాః. 9

అపుడందఱును సంధ్యావందనమాచరించిరి. అఘమర్షణమును లెస్సగ జపించిరి. స్తోత్రములఁ బఠించిరి. మనోహరములగు గీతములను బాడిరి.

తతశ్చాభ్యుదితాశ్యామా కామినీశోకహారిణీ
క్షీరోదాదివమాహేన్ద్రీ చన్ద్రాదివశ్యాయదాయినీ. 10

పిమ్మట కామినుల దుఃఖమును హరించు రాత్రి, క్షీరసముద్రోత్పన్నమును, ఆనందజనకమునగు చంద్రునినుండి చంద్రికవలె, వ్యక్తమయ్యెను.

శనైరాస్తీర్ణపుష్పేషు కీర్ణకర్పూరముష్టిషు
దీర్ఘేన్దుబింబరమ్యేషు తస్థుస్తల్పేషురాఘవాః. 11

అపుడు పుష్పాచ్ఛాదితములును కర్పూరకణమయములును చంద్రబింబమువలె మనోహరములునగు శయ్యలపై రఘువంశీయులు మెల్లగ విశ్రమించిరి.

అథరామదృతేఽన్యేషాం తత్రతద్వ్యవహారిణీ
వ్యతీయాయశనైఃశ్యామా ముహూర్తఇవశోభనా. 12

అత్తటి శ్రీ రామచంద్రునకు దప్ప తక్కిన వారందఱకును తత్కాలోచిత నిద్రాది వ్యవహారములచే నారాత్రి క్రమముగ ముహూర్తకాలములో గడచెను.

తస్థౌరామస్తుతామేవ వాసిష్ఠీంవచనావలీమ్
చిన్తయన్మధురోదారాం కరిణీంకలభోయథా. 13

శిశువు గజ గజమును సంస్మరించుచుండునటుల అపుడు శ్రీరామచంద్రుఁడు వసిష్ఠ మునీంద్రులచే నుపదేశింపబడిన మధురవాక్యములను, యుదారవచనములను యిట్లు చింతన జేయ దొడగెను.

కిమిదంనామసంసారభ్రమణం కిమిమేజనాః
భూతానిచవిచిత్రాణి కిమాయాన్తిప్రయాన్తికిం. 14

మనసఃకీదృశంరూపం కథంచైతత్ప్రశామ్యతి
మాయేయంసా కిముత్థా స్యాత్కథంచైవ నివర్తతే. 15

నివృత్తయానయా కః స్యాద్గుణోదోషోఽథవాభవేత్
కథమాత్మనిచైవాయం తతేసంకోచఆగతః. 16

కిముక్తంస్యాద్భగవతా మునినా మనసఃక్షయే
కించేన్ద్రియజయేప్రోక్తం కిముక్తమథవాత్మని. 17

ఈ సంసారభ్రమణమేమి ? ఈమనుజులెవరు ? ఈ విచిత్రప్రాణిసమూహమెటునుండి వచ్చినది? యెటకు బోవుచున్నది? మనస్సుయొక్క స్వరూపమేమి? ఈమనస్సెట్లు శమించును? ఈమాయ దేనినుండి యుద్భవించినది ? ఇయ్యదెట్లు నివారింపబడును ? నివారింపబడనిచో గుణమేమి, దోషమేమి? ఆకాశముకంటెను విశాలమగు ఆత్మ యివ్విధమున సంకోచమునెట్లు పొందినది? మనోనాశమునుగూర్చియు ఇంద్రియజయమును గూర్చియు, ఆత్మనుగూర్చియు వసిష్ఠమునీంద్రులేమి వచించిరి?

జీవశ్చిత్తంమనోమాయేత్యేవమాదిభిరాతతైః
రూపైరాత్మైవసంసారం తనోతీమమసన్మయమ్. 18

జీవ చిత్త మనోమాయాదిరూపముల నీ యసన్మయ సంసారము ఆత్మయే విస్తరింప జేయుచున్నది.

ఏభిరేవంమనోమాత్ర తన్తుబద్ధైఃక్షయంగతైః
దుఃఖోపశాన్తిరేతాని సుచికిత్స్యానినఃకథమ్. 19

మనస్సను సూత్రమున బంధింపబడియున్న జీవచిత్త మనోమాయాదులు సంక్షయింప, దుఃఖోపశమనము సిద్ధించును. కాన వీనిని సులభముగ వినాశమొనర్చుటకు తగిన యుపాయ మెద్దిగలదు ?

భోగాభ్రమాలావలయాం ధీబలాకామిమాంకథమ్
పృథక్కరోమి పయసో దారాంహంసఇవాంభసః. 20

హంస క్షీరమునుండి జలమును వేఱుపఱచునట్లు విషయభోగములను మేఘపంక్తితో గూడిన బుద్ధియను బకమును ఆత్మనుండి యెట్లు వేఱుపఱతును ?

భోగాస్త్యక్తుంనశక్యన్తే తత్త్యాగేనవినావయమ్
ప్రభవామో నవిపదా మహోసంకటమాగతమ్. 21



భోగములు త్యజింప శక్యములుగావు. ఏలన, వానిని త్యజించుటచే జీవితమే యసంభవమగును. కాని వాటిని త్యజింపనిచో విపత్తులు నశింపవు. ఓహో యెట్టి సంకటమేర్పడినది !

మనోమాత్రమిదంప్రాప్యం తచ్చైవేదంప్రయోజనమ్
సంపన్నంనోగిరిగురు మార్ఖాద్యత్క్షుఃశిశోరివ. 22

ప్రాప్యమగు ఆత్మతత్వముగూడ మనోమాత్రమునకే విషయముగదోచుచున్నది. మఱియు నీమనస్సే బాహ్యవిషయజాలమును సిద్ధింపజేయుటకును హేతువైయున్నది. ఆహా! ఇయ్యది అజ్ఞానకారణమున బాలునకు బేతాళమువలె గురుతరమై మనకు సంప్రాప్తించినది.

పరమాంశాన్తిమాగత్య గతసంసారసంభ్రమా
బాలేవ లబ్ధదయితా కంచిత్త్వాప్స్యతినోమతిః. 23

కాన సంసారభ్రమరహితమై పరమశాంతిని బొందినచో, ప్రియుడు లభింప తరుణస్త్రీ యన్యుని స్మరింపనట్లు బుద్ధి యన్యపదార్థమును జింతింపకుండును.

కదోపశాన్తసంరంభం విగతాశేషకౌతుకమ్
అపాపమాత్మవిశ్రాన్తం మమస్యాత్పావనంమనః. 24

ఓ భగవానుడా! నామనంబు క్రోధరహితమై, కామవర్జితమై, పవిత్రవంతమై పాపరహితమై, ఆత్మపదమున యెపుడు విశ్రాంతి నొందును ?

కలాకలాపసంపూర్ణాచ్ఛశాంకాదపి శీతలే
పదేసురూఢంవిశ్రమ్య భ్రమిష్యామికదాజగత్. 25

సర్వకళాపరిపూర్ణమగు చంద్రునికంటెను శీతలమగు సప్తమ భూమికారూపమగు జీవన్ముక్తి సుఖమందు దృఢపూర్వకముగ విశ్రాంతినొంది యీజగంబున నేనెపుడు విహరింతును ?

కలనాపేలవంరూప ముత్సృజ్యాలీనమాత్మని
కదైష్యతిమనఃశాన్తి మంభసీవ తరంగకః. 26

పలువిధకల్పనాయుక్తమగు నామనస్సు తన తుచ్ఛరూపమును త్యజించి ఆత్మయందు లీనమై జలమందు తరంగమువలె యెపుడు శాంతినొందునో ?

తృష్ణాతరంగాకులిత మాశామకరమాలినమ్
కదాసంసారజలధిం తీర్త్వాస్యామహమజ్వరః. 27

తృష్ణయను తరంగములచే వ్యాప్తమును, ఆశయను మొసళ్లుగలదియునగు సంసారసముద్రమును దాటి దుఃఖరహితుడ నెపుడగుదును ?

కదోపశమశుద్ధాసు పదవీషు విచక్షణాః
ముముక్షూణాంనివత్స్యామో నిఃశోకం సమదర్శనాః. 28

శమదమాది గుణంబులచే పరిశుద్ధులగు ముముక్షువులు బొందదగిన యుత్తమపదములందు సమర్థుఁడనై, సమదర్శినై, విగతశోకుఁడనై యెపుడువసించెదను ?

సంతాపితసమస్తాఙ్గః సర్వధాతుభయంకరః
సంసృతిజ్వరఆదీర్ఘః కదానాశముపైష్యతి. 29

స్త్రీపుత్ర పశ్వాది, (లేక హస్తపాదాది,) సర్వాంగములను సంతాపిత మొనర్చునదియు, రక్తమాంసాది ధాతువుల క్షయింపజేయునదగుటచే నతి భయంకరమును, సుదీర్ఘమునునగు యీ సంసారజ్వరమెపుడు శమించును ?

నిర్వాతదీపలేఖేవ కదాచిత్తంగతవ్యథమ్
శమమేష్యతిహేబుద్ధే సుప్రకాశఘనాన్తరమ్. 30

ఓ బుద్ధీ! గాలిలేనిస్థలమందలి దీపమువలె ప్రశాంతమై, బాధారహితమై, ప్రకాశమయమై యీచిత్తమెపుడు శాంతినొందును ?

కదేన్ద్రియాణిదుఃఖేభ్యః సంతరిష్యన్తిహేలయా
దురీహాదగ్ధదేహాని గరుత్మన్తఇవార్ణవాన్. 31

గరుత్మంతుడు సముద్రమును దాటునట్లు, విషయాభిలాషచే శరీరమును వినష్టమొనర్చు దుష్టములగు యీ యింద్రియములు సంసారము ననాదరించి దుఃఖసాగరము నెపుడు దాటగలవు ?

అయంసోహం రుదన్నాథ ఇతివ్యర్థాహితోభ్రమః
శరదీవాసితోమేఘః కదానాశముపైష్యతి. 32

శరీర, ధన, బంధు వియోగంబుచే దుఃఖించు మూఢునివంటి నాయందు నెలకొనిన యీ వ్యర్థభ్రమ శరత్కాల ధవళమేఘమువలె యెపుడు నాశమొందును ?

మన్దారవనలేఖాసు యామతిఃసాతృణాయతే
యాచే తత్పదమాత్మీయం సంప్రాప్స్యామఃకదావయమ్. 33

మందారవనమాలలందలి సుఖముగూడ నాకిపుడు తృణమువలె గన్పట్టుచున్నది. కేవల మాత్మతత్వ మెపుడు ప్రాప్తినొందుదుననియే నేనిపుడు ప్రార్థించుచున్నాను.

వీతరాగజనప్రోక్తా నిర్మలాజ్ఞానదృష్టయః
కచ్చిత్పదంత్వయిమనః కరిష్యన్తిమేవద. 34

ఓ మనసా ! వీతరాగుడగు వసిష్ఠమునీంద్రుడుపదేశించిన నిర్మలజ్ఞానదృష్టిని నీవెప్పుడైన గలిగియుందువా ?

హాతాతమాతఃపుత్రేతి గిరామాంసామహం పునః
భాజనంచిత్తమాభూవం భోజనందుఃఖభోగినామ్. 35

తండ్రీ ! తల్లీ ! పుత్రా ! ఇత్యాది వాక్కులకు విషయమగు నోచిత్తమా ! నాశరీరము అజగరములకు భక్ష్యమైననుసరే, నేనిక యెన్నటికిని నిన్ను వాంఛింపను.

హేబుద్ధేభగినిభ్రాతు రర్థితాంపూరయాశుమే
అపమోర్దుఃఖమోక్షాయ విచారయ మునేర్గిరః. 36



సోదరివగు నోబుద్ధీ ! జీవరూపుడగు నీసోదరుని ప్రార్థనను శీఘ్రముగ యీడేర్చుము. అట్టిచో మనయిర్వరకును మోక్షము లభింపగలదు. కాన వసిష్ఠమునీంద్రుని వచనములను చింతన చేయుము.

త్వాంపాదపతితఃప్రీత్యా యాచేసతిసుతేమతే
తేనభవ్యేభవోచ్ఛేద భూతయేసుస్థిరాభవ. 37

సాధ్వియు పుత్రిరూపిణివియునగు నోమతీ! నేను నీపాదములపైబడి వేడుకొనుచున్నాను. నాప్రార్థన ననుసరించి సంసారము నుచ్ఛిన్నమొనర్చి భవ్యరూపమగు పూర్ణపదప్రాప్తికొఱకై సంసిద్ధమైయుండుము.

వసిష్ఠమునినాప్రోక్తా విరక్తాఃప్రథమంగిరః
తతోముముక్షోరాచార ఉత్పత్తీనాంక్రమస్తతః. 38
తతఃస్థితిప్రకరణంసమం దృష్టాన్తసుందరమ్
విజ్ఞానగర్భసులభం యథావత్స్మరహేమతే. 39

వసిష్ఠమునీంద్రుడు ప్రథమమున వైరాగ్యము బోధించెను. పిమ్మట ముముక్షువుల యాచారములను, అపిదప యుత్పత్తిక్రమమును వచించెను. తదుపరి దృష్టాంతములచే మనోహరమును, విజ్ఞానపరిపూర్ణమగుటచే యధికారిజనులకు సులభగోచరమునునగు స్థితిప్రకరణమును జెప్పెను. ఓమతీ! వాటినన్నింటిని నీవు యథారీతి సంస్మరింపుము.

కృతమతిశతశో విచారితంయ
ద్యదితదుపైతి నమానసస్యబుద్ధిః
భవతితదఫలం శరద్ఘనాభం
సతతమతో మతిరేవకార్యసారః 40

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే ఉపదేశానువర్ణనంనామ ద్వితీయః
సర్గః ॥ 2 ॥

మనస్సు అనేకపర్యాయములు విషయమును బాగుగయాలోచించినను, యద్దానిని నిశ్చయాత్మకమగు బుద్ధి పరిగ్రహింపకున్నచో శరత్కాలమేఘమువలె యది నిష్ఫలమగును. కాన శ్రవణముచే తత్వపదార్థమును విచారించినను మననముచే నిశ్చయాత్మకమగు బుద్ధి దానిని గ్రహింపకున్నచో అయ్యది వ్యర్థమగును. అందుచే యర్థగ్రహణకార్యమున బుద్ధి యెల్లపుడును సారభూతమైనదగును.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
ఉపదేశానువర్ణనమను రెండవ
సర్గము ॥ 2 ॥

## తృతీయః సర్గః.

శ్రీ వాల్మీకి రువాచ :—

తస్యైవం ప్రాయయాతత్రి తతయోదారచిన్తయా
సావ్యతీయాయ రజనీ పద్మస్యేవార్క కాఙ్క్షిణః. 1

శ్రీవాల్మీకి:—ఇవ్విధమున దీర్ఘచింతనచేయుచున్న శ్రీరామచంద్రునకా రాత్రి సూర్యనిరాకకై యెదురుచూచు కమలమునకువలె గడచెను.

కించిత్తమఃకడారాసు కించిదప్యరుణాసుచ
నభోవిరలతారాసు దిక్షుసంమార్జితాస్వివ 2
ప్రభాతతూర్యఘోషేణ సమమిన్దుసమాననః
ఉత్తస్థౌరాఘవః శ్రీమాన్పద్మః పద్మకరాదివ 3

పిమ్మట యంధకారము క్షీణించుచుండ, అరుణకాంతి యాకసమున నల్పముగ ప్రసరించుచుండ, తారాగణంబులు వెలవెలబోవ, దిక్కులన్నియు కాంతివంతములగుచుండ, ప్రాతఃకాల తూర్యనాదముతోబాటు చంద్రాననుడగు శ్రీరామచంద్రుడు కమలవనంబున కమలమువలె లేచినిలంబడెను.

ప్రాతఃస్నానవిధింకృత్వా సంపాద్యభ్రాతృభిఃపునః
ప్రహితాల్పపరీవారో వసిష్ఠసదనంయయౌ 4

ప్రాతఃకాల స్నానాది విధులను నెరవేర్చి కొందఱు పరిజనులనుముందుబంపి పిదప సోదరులతోగూడి శ్రీరామచంద్రుడు వసిష్ఠుని సదనమునకు బోయెను.

సమాధిసంస్థమేకాన్తే మునిమాత్మపరాయణమ్
దూరఏవాననామాసౌ రామోవినతకంధరః 5

ఏకాంతమున సమాధిస్థుడై, ఆత్మపరాయణుడైయున్న వసిష్ఠమునీంద్రునకు శ్రీరామచంద్రుడు వినమ్రుడై దూరమునుండియే ప్రణమిల్లెను.

తంప్రణమ్యాజ్ఞ్యాతస్థు స్తస్మింస్తేవిన మాస్వితా
యావత్తమసమాలూనం వ్యక్తందిఙ్ముఖమండలమ్. 6

పిదప వినయముతో వారందఱును వసిష్ఠమునీంద్రునకు నమస్కరించి ఉక్కలం దంధకారను పూర్ణముగ నశించునంతవఱకు ఆయాశ్రమప్రాంగణముననే నిలబడియుండిరి.

రాజానోరాజపుత్రాశ్చ ఋషయోబ్రాహ్మణాస్తతః
ఆయయుఃసదనంమానం బ్రహ్మలోకమివామరాః. 7

ఆపిమ్మట తక్కినరాజులు, రాజకుమారులు, ఋషులు, బ్రాహ్మణులును బ్రహ్మలోకమునకు దేవతలువచ్చునట్లు వసిష్ఠసదనమునకు విచ్చేసిరి.

తద్వసిష్ఠస్యసదనం బభూవజనసంకులమ్
హస్త్యశ్వరథసంబాధం పార్థివాచారశోభనమ్. 8



అపుడావసిష్ఠమునీంద్రునిసదనము పెక్కుమనుజులతోను అశ్వగజరథాదులతోడను వ్యాప్తమై రాజోచితయాచారములతో గూడినదై రాజభవనమువలె శోభించుచుండెను.

క్షణాద్వసిష్ఠోభగవా న్విరరామసమాధితః
ఆచారేణోపచారేణ జగ్రాహాప్రణతంజనమ్. 9

పిమ్మట క్షణకాలములో వసిష్ఠభగవానుడు తనసమాధిని విరమించి వినయాదియాచారములతోను మధురభాషణాది యుపచారములచేతను, వినమ్రులైయున్న వారందఱిని సత్కరించెను.

తథానుయాతోమునిభి ర్విశ్వామిత్రాన్వితోమునిః
ఆరురోహ రథంశ్రీమా న్హంసాబ్జమివాబ్జజః. 10

తదుపరి మునులచే పరివేష్టితుడై విశ్వామిత్రునితోగూడి, కమలముపై బ్రహ్మదేవుడాసీనుడగునట్లు శ్రీవసిష్ఠమునీంద్రుడు రథముపై గూర్చుండెను.

యయాగృహందశరథం సైన్యేనమహతావృతః
బ్రహ్మేవశక్రనగరం సమస్తసురమాలితః. 11

తదనంతరము గొప్పసేనచే పరివృతుడై, దేవతలందఱిచే బరివేష్టితుడైన బ్రహ్మదేవుడు యింద్రభవనమును బ్రవేశించువిధమున వసిష్ఠమునీంద్రుడు దశరథునిగృహమును బ్రవేశించెను.

వివేశావనతాంతత్ర రమ్యాందాశరథీంసభామ్
హంసయూథానువలితో రాజహంసఇవాబ్జినీమ్. 12

హంసలచేజుట్టబడిన రాజహంస సరోవరమునః బ్రవేశించుచందమున యచ్చోటు సభ్యయుక్తమై మనోహరముగనున్న యాసభయందు వసిష్ఠమునీంద్రుడు ప్రవేశించెను.

త్రీణి తత్రపదాన్యాశు పదాదశరథోనృపః
నిర్జగామమహావీరః సింహాసనసముత్థితః. 13

అపుడు మహాపరాక్రమవంతుడగు దశరథభూపాలుడు సింహాసనమునుండి శీఘ్రముగ లేచి వసిష్ఠులఁ బిలుచికొనివచ్చుటకు మూడడుగులు ముందుకు జనెను

వివిశుస్తత్ర తేసర్వే నృపాదశరథాదయః
వసిష్ఠాద్యాశ్చమునయో ఋషయోబ్రాహ్మణాస్తథా. 14
మన్త్రిణశ్చసుమన్త్రాద్యాః సౌమ్యాద్యాశ్చవిపశ్చితః
రాజపుత్రాశ్చరామాద్యా మంత్రిపుత్రాఃశుభాదయః. 15
అమాత్యాద్యాఃప్రకృతయః సుహోత్రాద్యాశ్చనాగరాః
మాలవాద్యాస్తథాభృత్యాః పౌరాద్యాశ్చైవమాలినః. 16

అంతట దశరథాది భూపాలురందఱును వసిష్ఠాది మునులును విశ్వామిత్రాది ఋషులును బ్రాహ్మణులును సుమంత్రాది మంత్రులును, సౌమ్యాదిబుద్ధికుశలురును రామాది రాజకుమారులును శుభాది మంత్రితనయులును అమాత్యులును సుహోత్రాదినగరనివాసులును మాలవాదిభృత్యులును అన్యనగరవాసులును ఆసభయందు ప్రవేశించిరి.

అథ తేషూపవిష్టేషు స్వేషుస్వేష్వాసనేషుచ
సర్వేష్వేవోపవిష్టేషు వసిష్ఠోన్ముఖదృష్టిషు. 　17
సభాకలకలేశాన్తే మౌనసంస్థేషుబన్దిషు
వృత్తాసుస్థితివార్తాసు సౌమ్యేతస్మిన్సభాన్తరే. 　18

అత్తఱి రాజులు, మంత్రులు మున్నగువారు వారివారి యాసనములందు ప్రవిష్టులైరి. విశ్వామిత్ర వసిష్ఠుల సైగచే తక్కినవారున్నయటుగూర్చుండిరి. సభయందు కోలాహలము శమించెను. వందిమాగధులు మౌనస్థులైయుండిరి. ప్రశాంతముగనున్న యాసభయందు జనులు పరస్పరము క్షేమవార్తలను చెప్పుకొనదొడఁగిరి.

స్ఫురత్పవనమాలాసు విశత్స్వమ్భోజకోటరాత్
పరాగేషువిలోలేషు ముక్తాదామసుచంచలమ్. 　19
బృహత్కుసుమదోలాభ్యః ప్రసృతాభ్యఃసమంతతః
వాతిమాంసలమామోద మాదాయ మధురానిలే. 　20
వాతాయనేషుమృదుషు కుసుమాకీర్ణభూమిషు
పర్యఙ్కేషూపవిష్టాసు పశ్య న్తీషుపురంధ్రిషు
జాలాగతార్కకరలోల విలోచనాసు 　21
రత్నప్రభాసికర పింగలకోమలాసు
సంత్యక్తచాపలలవం చపలాసుతాసు
మౌనస్థితాసు సితచామరధారిణీషు. 　22
ముక్తాఫలప్రతి ఫలప్రతిమార్కరశ్మి
రాగోదరాస్వజిర భూమిషు పుష్పకౌఘమ్
నాసాదయత్యభినవాతపబింబబుద్ధ్యా
భ్రాన్త్యేభ్రమత్యలికులే నభసీవమేఘే. 　23
పుణ్యైర్వసిష్ఠవదన ప్రసృతంశ్రుతంయ
త్తత్సంతతిప్రసృత విస్మయమార్యలోకే
సత్సంగమేమృదు పదాక్షరముగ్ధవాక్య
మన్యోన్యమీప్సిత మనల్పగుణాభిరామమ్. 　24
దిగ్భ్యఃపురాచ్చ గగనాచ్చవనాచ్చసిద్ధ
విద్యాధరార్య మునివిప్రగణే వసిష్ఠమ్
మౌనప్రమాణమభితః ప్రవిశత్యశబ్దం
సోపాంశుగౌరవవతా సహజాతవాక్యే. 　25
ఉన్నిద్రకోకనదకోమల కోశకృష్ట
మగ్నాలిజాలమకరన్ద సువర్ణరాగైః





ఆపింగలే మరుతివాతి విలోలఘంటా
టాంకారగీతవినిపీతనిశా న్తగీ తే. 　26
అగురుతగరధూమే చన్దనామోదమిశ్రే
సరసకుసుమదామోద్దామగంధాఙ్కితాభ్రే
సరతిసతివితానాంభోరుహామోదలేశై
శ్చలకుసుమరజోఙ్కే శబ్దవిజ్ఞాతభృంగమ్. 　27

ఇతి శ్రీ వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే ఉపశమప్రకరణే సభాసంస్థానవర్ణనంనామ తృతీయః సర్గః ॥ 3 ॥

అపుడు కమలాంతర్భాగమునుండి బయలుదేఱిన వాయువాసభయందు ప్రవేశింపసాగెను. ఇక్కారణమున కమల పరాగములచే ముక్తాహారములు చలింపఁదొడగెను. పుష్పములతో గూడిన యుయ్యెలలనుండి ఉత్తమసుగంధమును గ్రహించినవై పిల్లవాయువులట వీచుచుండెను. పుష్పాచ్ఛాదితమగు భూమిపై నెలకొల్పబడిన యాసనములపై గూర్చుండి ఉత్తమ వాతాయనములద్వారా స్త్రీలు చూచుచుండిరి. గవాక్షముగుండా ప్రసరించు సూర్యకిరణములచే చంచలమైన నేత్రములుగలవారును, రత్నకాంతులచే పింగళవర్ణయుతులును, శ్వేతచమరధారిణులునునగు స్త్రీలు మౌనస్థులైయుండిరి. రత్నఖచితమగు ప్రాంగణములపై ముక్తాఫల ప్రతిబింబములవంటి సూర్యకిరణములు ప్రసరింప వాటిం గాంచి నూతన సూర్యబింబమని భ్రాంతిజెందిన భ్రమరసమూహమునకు పుష్పప్రాప్తి గానందున అయ్యవి మేఘపంక్తులవలె యాకసమున పరిభ్రమింపదొడగెను. ఉత్తమపురుషులుగల నాసజ్జనసమావేశమున, పూర్వపుణ్యవశాత్తు వసిష్ఠమునీంద్రుని ముఖమండలమునుండి వెలువడిన వాక్యములు హృదయమున ప్రవేశింప, మిగుల యాశ్చర్యముతో గూడుకొనినట్టి జనులు పరస్పరము గుణప్రశంస జేయుఁదొడగిరి. దిశలనుండియు, నగరములనుండియు స్వర్గమునుండియు సిద్ధులు, విద్యాధరులు, మునిశ్రేష్ఠులు, బ్రాహ్మణోత్తములు యేతెంచి మౌనస్థులై వసిష్ఠమునీంద్రునకు ప్రణమిల్లి యటుగూర్చుండిరి. తదనంతరము యుత్తములతో గూడి వసిష్ఠమునీంద్రుని విషయమై వారు మెల్లగ సంభాషింప దొడగిరి. వికసిత రక్తకమలములనుండి యాకర్షింపబడినదియు, భ్రమరయుక్త పుష్పరస పరాగములచే పింగళవర్ణయుతమై యొప్పుచున్నదియు, గృహప్రాంతములందలి ఘంటా రావములచే మనోహరమునగు వాయువు అత్తఱి వీవసాగెను. చందనసుగంధసహితమును, పుష్పపరాగయుక్తమును, మేఘమండలమునుకూడ సుగంధితమొనర్చునదియు, నగువాయువు ధూపధూమ సమ్మిళితమై భ్రమరముల భంగి శబ్దమొనర్చుచు, కమలమాలలనుండి సుగంధమును గ్రహించి మెల్ల మెల్లగ వీవదొడఁగెను.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున సభాసంస్థానవర్ణనమను మూడవ సర్గము ॥ 3 ॥

---

## చతుర్థః సర్గః.

శ్రీ వాల్మీకి రువాచ :—

మేఘగంభీరయావాచా విశ్రబ్ధపదసుందరమ్
ఇదందశరథోవాక్య మువాచమునినాయకమ్. 1

శ్రీవాల్మీకి:—అపుడు మేఘసదృశమగు గంభీరవాణిచే ఉత్తమపదయుక్తమగు నీక్రింది వాక్యములను దశరథుడు మునిశ్రేష్ఠుడగు వసిష్ఠునితో బల్కెను.

భగవన్వ్యస్తసేన త్వం వాక్యసందర్భజన్మనా
కచ్చిన్ముక్తోసిఖేదేన తపఃకార్శ్యాతిశాయినా. 2

ఓ మహాత్మా! పూర్వదినకథాప్రసంగసందర్భమున వాక్యోచ్చారణచే తమకుగల్గిన శ్రమ నివారించినదా?

హ్యస్తనోక్త్యోయఆనందీ వివిక్తోవచసాంగణః
అమృతావర్షణేనేవ తేసై[illegible]శ్వాసితావయమ్. 3

దేవా! ఆనందదాయకములగు తమ పూర్వవచనములచే అమృతవృష్టిచే వలె మేమందఱము పరితృప్తులమైతిమి.

చంద్రాంశవఇవోత్సార్య తమాంస్యమృతనిర్మలాః
అన్తఃశీతలయన్త్యేతా మహతామమలాగిరః. 4

అమృతమువలె నిర్మలమగు మహాత్ముల విమలవచనములును అజ్ఞానాంధకారమును తొలగించి చంద్రకిరణములవలె యంతఃకరణమును శీతలమొనర్చును.

అపూర్వాహ్లాదదాయిన్య ఉచ్చైస్తరపదాశ్రయాః
అతిమోహాపహారిణ్యః సూక్తయోహి మహీయసామ్. 5

మహాత్ముల వచనములు అపూర్వమగు ఆనందమును గొల్పునవియు, సర్వోత్తమమగు బ్రహ్మపదమునుగూర్చిన యాశయమునుగలవియు, గొప్పదగు అజ్ఞానమోహమును నివారించునవియు నగును.

ఆత్మరత్నావలోకైక దీపికాసరసాత్మికా
యమాప్యుక్తిలతోదేతి సవన్ద్యఃసుజనద్రుమః. 6

ఆత్మ యనురత్నము నవలోకించుటకు దీపమువంటిదియు, యుక్తియను జ్యోతిర్మయలతనుత్పన్న మొనర్చునదియునగు సజ్జన కల్పవృక్షము నమస్కరింపదగినది.

దురీహితందుర్విహితం సర్వంసజ్జనసూక్తయః
ప్రమార్జయన్తిశీతాంశో స్తమః కాండమివాంశవః. 7

చంద్రకిరణము లంధకారమును తొలగించునట్లు సజ్జనుల ఉత్తమ వచనములు సమస్త శారీరిక మానసిక దూషములను దూరీకరించును.

తృష్ణాలోభాదయోఽస్మాకం సంసారనిగడామునే
తవోక్త్యాతనుతాంయాతాః శరదీవాసితాంబుదాః. 8



ఓమునీశ్వరా! తమ వచనంబులచే సంసారబంధనరూపమగు తృష్ణాలోభాదులు మాయందు శరత్కాల మేఘములవోలె సన్నగిల్లినవి.

సంప్రవృత్తావయంద్రష్టు మాత్మానమపకల్మషమ్
రసాంజనానీతదృశో జాత్యన్ధాఇవకాంచనమ్. 9

సిద్ధాంజనముచే ప్రాప్తించినదృష్టిగల జన్మాంధుడు సువర్ణమును జూడగల్గునట్లు పాపరహితమగు శుద్ధాత్మను మేమిపుడు వీక్షింప సమర్థులమైతిమి.

సంసారవాసనానామ్నీ మిహికాహృదయాంబరే
ప్రవృత్తాతనుతాంగన్తుం త్వదుక్తిశరదేవనః. 10

తమ యుక్తిరూప శరదృతువుచే మా సంసారవాసనాతుషారము హృదయాకాశమున నల్పమగుచున్నది.

మునేమందారమంజర్య స్తరంగాహామృతాంభసః
నతథాహ్లాదయన్త్యన్త ర్యథోదారధియాంగిరః. 11

ఓమునీంద్రా! కల్పవృక్షలతగాని, అమృతమయ సముద్రతరంగముగాని యుదారచిత్తులగు మహాత్ముల వచనములవలె యానందమును గొల్పజాలవు.

యద్యద్రాఘవసంయాతి మహాజనసపర్యయా
దినంతదిహసాలోకం శేషాస్త్వన్ధాదినాలయః. 12

(రామచంద్రుని సంబోధించి) ఓరామచంద్రా! బ్రహ్మవేత్తల బూజించు నట్టిదినమే ప్రకాశయుక్తమైనదిగాని తక్కినవి అంధకారమయములేయగును.

రామరాజీవపత్రాక్ష ప్రకృతార్థమిహావ్యయమ్
మునిమాబోధయపునః ప్రసాదేసమవస్థితమ్. 13

కమలనేత్రుఁడవగు నోరామా! నాశరహితుఁడగు వసిష్ఠమునీంద్రుఁలిపుడు ప్రసన్నముగ నున్నారు. ప్రస్తుతవిషయమునుగూర్చి మఱల వానిని బ్రశ్నింపుము.

ఇత్యుక్తోభూభృతా తత్ర రామాభిముఖమాస్థితః
ఉవాచేదముదారాత్మా వసిష్ఠోభగవాన్మునిః. 14

దశరథమహారాజిట్లు వచింప రామచంద్రుని యెదుట గూర్చొనియున్న యుదారచిత్తుఁడగు వసిష్ఠభగవానుడిట్లు బల్కెను.

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

రాఘవస్వకులైకేన్దో యన్మయోక్తంమహామతే
కచ్చిత్స్మరసివాక్యార్థం పూర్వాపరవిచారితమ్. 15

రఘుకులచంద్రుడవును, మహామతివియునగు నోరామా! నేను వచించిన వాక్యార్థముల పూర్వాపరవిచారణను గావించితివా?

ఉత్పత్తీనాంవిచిత్రాణాం సత్వాదిగుణభేదతః
కచ్చిత్స్మరసిసర్వాసాం విభాగమరిమర్దన. 16

శత్రునాశకుడవగు రామచంద్రా! సత్వాది గుణభేదములచే గావింపబడిన జీవజా[తము]లన్నింటియొక్క విచిత్రయుత్పత్తివిభాగము నీకు జ్ఞప్తియందున్నదా?

కచ్చిత్సర్వమసర్వంచ సదసచ్చసదోదితమ్
రూపంస్మరసివేత్స్యేవ వివిక్తంపరమాత్మనః. 17

మాయాశక్తిచే జగద్రూపమును, పరమార్థమున నిష్ప్రపంచమునునై స్థూల సూక్ష్మ సదసద్రూపముల వ్యక్తమగుచు దృశ్యజగత్తుకంటె భిన్నమైనట్టి యే పరబ్రహ్మస్వరూపమును నేను వచించితినో అయ్యది నీకు స్మృతిపథముననున్నదా?

య ఖేదముదితంవిశ్వం విశ్వేశాదేవచేశ్వరాత్
కచ్చిత్స్మరసితత్సాధో సాధువాదైకభాజన. 18

సజ్జనుల యుపదేశప్రశంసలకు పాత్రుడవును సాధుమూర్తివియునగునో రామా! జగదీశుడును, సర్వశక్తిమంతుడునునగు పరమాత్మనుండి యీ జగత్తెట్లుద్భవించినది, నీకు జ్ఞాపకమున్నదా?

రూపంకచ్చిదవిద్యాయా బలాద్భంగురమాతతమ్
అనన్తమన్తవచ్చైవ సమ్యక్స్మరసిసన్మతే. 19

కాలవశమున నాశవంతమును, ప్రవాహరూపమున యనంతమును, దేశకాలాదుల రూపమున యంతమునునగు మాయారూపమును నీవు స్మృతియందుంచుకొంటివా?

చిత్తమేవ నరోనాన్యదితి యత్ప్రతిపాదితమ్
లక్షణాదివిచారేణ కచ్చిత్స్మరసిసాధుతత్. 20

చిత్తమే మనుజుడుగాని యన్యమేమియు గాదని నేను వచించినదానిని లక్షణాయుక్తముగ నీవు చక్కగ విచారించి జ్ఞాపకముంచుకొంటివా?

వాక్యార్థశ్చాఖిలః కచ్చిత్త్వయారామవిచారితః
హ్యస్తనస్యవిచారస్య రాత్రౌహృదినివేశితః. 21

ఓ రామా! గతదినమున నేను వచించినదంతయు నీవుబాగుగ విచారించి యద్దానిని రాత్రికాలమున మననమొనర్చి హృదయమున స్థిరపరచుకొంటివా?

భూయోభూయఃపరామృష్టం హృదయేసునియోజితమ్
ప్రయోజనంఫలత్యుచ్చైర్న హేలాహతసంస్థితేః. 22

లెస్సగ పలుమారు విచారింపబడినదియు, మననముచే హృదయమున స్థిరపఱుపబడినదియునగునది మాత్రమే మోక్షరూపఫలమునొసంగును. అనాదరంబున యెవడట్టి యుపదేశమును నయందు స్థిరపఱచుకొనకయుండునో వానికా ఫలము లభింపదు.

భాజనంత్వంవివిక్తానాం వచసాం శుద్ధిశాలినామ్
వివిక్తహృదయఃకంఠే ముక్తానామివరాఘవ. 23

ఓ రాఘవా! నిర్మల విశాలకంఠముగలవాడు ముక్తాహారమును ధరించుటకు పాత్రుడగునట్లు పవిత్ర శుద్ధవచనంబులకు నీవు పాత్రుడవైయున్నావు.



(శ్రీ) వాల్మీకిరువాచ :—

కమలాసనపుత్రేణ మునినా సమహౌజసా
ఏవంవితీర్ణావసరో రామో వాక్యమువాచహ. 24

శ్రీ వాల్మీకి :—ఇట్లు బ్రహ్మతనయుడును, మహాతేజస్వియునగు వసిష్ఠమునీంద్రునిచే [ఒస]గింపబడిన యవకాశమును పురస్కరించుకొని శ్రీరామచంద్రుడిట్లు బల్కెను.

(శ్రీ) రామఉవాచ :—

భగవన్సర్వధర్మజ్ఞ త్వయైవైతద్విజృంభితమ్
యదహంపరమోదారో బుద్ధవాన్వచనంతవ. 25

శ్రీరాముడు :—సర్వధర్మజ్ఞుడవగునో మునీంద్రా! మిగుల యుదారబుద్ధిచే నేను తమ [వ]చనముల గ్రహింపగలుగుటయు మీయొక్క శక్తి విశేషమేయగును.

యదాదిశసితత్సర్వం తథైవనతదన్యథా
అపాస్తనిద్రేణమయా వాక్యార్థోహృదిచిన్తితః. 26

తమయాదేశము ననుసరించియే నేనాచరించితినిగాని విరుద్ధముగగాదు. నిద్రను తొల[గ]ించి భవదుపదిష్ట వాక్యార్థమును నేను హృదయమున చింతనజేసితిని.

భనాన్ధకారక్షతయే భవతోక్తివివస్వతా
హృత్ప్రసాదితమాహ్లాది వాగ్రశ్మిపటలంప్రభో. 27

సంసారతమోపటలమును విచ్ఛేదమొనర్చునో మహాత్మా! తమవచనరూప భాస్కరుడు గతదినమున ఆనందజనకములైన వాగ్రూప కిరణములను విస్తరింపజేసెను.

తదతీతమదీనాత్మ న్సర్వమన్తఃకృతంమయా
రమ్యంపుణ్యంపవిత్రంచ రత్నవృందమివాన్వితమ్. 28

ఉదారచిత్తుడవగునో మునీంద్రా! మనోహరమును, పుణ్యప్రదమును, పవిత్రమును, [ప్రి]యయుక్తమునునగు యీ వచించినదానినంతయు రత్నసమూహమునువలె నేను నాయందు బదిలమొనర్చుకొనియుంటిని.

హితానుబన్ధిహృద్యంచ పుణ్యమానందసాధనమ్
శిరసాధ్రియతే హైర్నో సిద్ధైస్త్వదనుశాసనమ్. 29

సర్వానర్థ నివారకంబును, మనోహరమును, పరమపురుషార్థ సాధకమును, బ్రహ్మానంద సాధనమును, పరమపవిత్రమునునగు తమ యుపదేశమును సనకాది సిద్ధపుంగవులుకూడ తమశిరముల ధరింపకుందురా?

ప్రతిక్షిపన్తః సంసారమిహాకావరణంవయమ్
ప్రసన్నాస్త్వత్ప్రసాదేన వర్షాన్తఇవవాసరాః. 30

సంసారతుషారంబును పారద్రోలి తమకృపచే మేము వర్షాంతమందలి దినమువలె ప్రసన్నముగనుంటిమి.

ఆపాతమధురారంభం మధ్యేసౌభాగ్యవర్ధనమ్
అనుత్తమఫలోదర్కం పుణ్యంత్వదనుశాసనమ్. 31

తమయుపదేశము ప్రారంభమున (శ్రవణకాలమున) మధురమును (వినని పైనసియు), మధ్యకాలమున (మనన నిదిధ్యాసములందు) సౌభాగ్య (శమాదిసుఖ) వర్ధకమును, అంతమున మోక్ష రూపఫలదాయకమును నైయున్నది.

వికాసితమమ్లాన మాహ్లాదితశుభాశుభమ్
త్వద్వచఃకుసుమం నిత్యం శ్రీమత్ఫలదమస్తునః. 32

మీ వచనరూప కల్పవృక్షముయొక్క కుసుమము వికాసవంతమును, స్వచ్ఛమును, పుణ్య పాపజీవులనందఱిని యానందిత మొనర్చునదియు, శోభాయుక్తమునునై వెలయుచున్నది.

సకలశాస్త్రవిచార విశారద
ప్రసృతపుణ్యజలైక మహాహ్రద
భజభృశం వితతవ్రతసంప్రతి
ప్రసృతతాం హతకిల్బిషసంతతిమ్. 33

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే రాఘవప్రశ్నో నామ చతుర్థః
సర్గః ॥ 4 ॥

దేశ కాల శాస్త్రవిచారములందు నిపుణుఁడవును, పుణ్యరూప జలమునకు విశాల సరస్సు వంటి వాడవును, పాపవిధ్వంసకుఁడవును, వ్రతనిష్ఠుఁడవునునగు నో మునీంద్రా! మమ్ములను పరిశుద్ధుల గావించుట కొఱకై యా ప్రస్తుతోపదేశమునే మఱలగావింప ననుగ్రహింపుము.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
రాఘవప్రశ్నయను నాల్గవ సర్గము ॥ 4 ॥

---

## పంచమః సర్గః.

---

శ్రీ వసిష్ఠఉవాచ :—

ఇదముత్తమసిద్ధాన్త సుందరంసుందరాకృతే
ఉపశాన్తిప్రకరణం శృణుసావహితోహితమ్. 1

శ్రీవసిష్ఠుఁడు:—సురూపుఁడవగునో రామచంద్రా! హితప్రదమును, ఉత్తమ సిద్ధాంత యుక్తమును నగు నీ యుపశమప్రకరణమును సావధానచిత్తుఁడవై వినుము.

దీర్ఘసంసారమాయేయం రామరాజసతామసైః
ధార్యతేజన్తుభిర్నిత్యం సుస్తంభైరివమండపః. 2



ఓ రామా! ఉత్తమ స్తంభములచే మండపము ధరింపబడులాగున రాజస తామస జీవులచే యీ దీర్ఘసంసారమాయ నిత్యము ధరింపబడుచున్నది.

సత్వస్థజాతిభిర్ధీరైస్త్వాదృశైర్గుణబృంహితైః
హేలయోత్సృజ్యతేపక్వా మాయేయంత్వగివోరగైః. 3

సత్వగుణమందు స్థితిగల్గిన నీవంటి ధీరులీసంసారమాయ ననాదరించి సర్పము కుబుసమును త్యజించునట్లు త్యజించివేయుచున్నారు.

యేసత్త్వజాతయః ప్రాజ్ఞాస్తథారాజససాత్త్వికాః
విచారయన్తితేసాధో జగత్పూర్వపరంపరామ్. 4

సాధుశీలుఁడవగునో రామా! సత్వజాతియందలి బుద్ధిమంతులును, రాజససాత్త్విక జాతియందలి వారును యీ జగత్తుయొక్క మూలమును (ఆదికారణమును) విచారించి బ్రహ్మము నెఱుంగు చున్నారు.

శాస్త్రసజ్జనసత్కార్య సంగేనోపహతైనసామ్
సారావలోకినీబుద్ధిర్జాయతే దీపికోపమా. 5

శాస్త్ర సజ్జన సత్కార్య (యజ్ఞదానతప)ముల సంయోగముచే నశించిన పాపముగల వారియొక్క దీపసదృశమగు ప్రకాశవంతమైన బుద్ధి సారవస్తువు నెఱుంగగల్గును.

స్వయమేవవిచారేణ విచార్యాత్మానమాత్మనా
యావన్నాధిగతంజ్ఞేయం నతావదధిగమ్యతే. 6

స్వయముగ నాత్మచే నాత్మనుగూర్చి విచారించి జ్ఞేయవస్తువు నెఱుంగనంత వఱకయ్యది యొకరికిని ప్రాప్తింప నేరదు.

ప్రజ్ఞావతాంనయవతాం ధీరాణాంకులశాలినామ్
జాత్యారాజససత్వానాం ముఖ్యస్త్వంరఘునందన. 7

ఓ రాఘవా! ప్రాజ్ఞులును ప్రమాణకుశలురును, ధీరులును, కులీనులును రాజససాత్త్విక జాతియందుత్పన్నమైనవారునునగు పురుషులలో నీవే యుత్తముడవు.

స్వయమాలోకయప్రాజ్ఞ సంసారారంభదృష్టిషు
కింసత్యంకిమసత్యంవా భవసత్యపరాయణః. 8

ప్రాజ్ఞుఁడవగునో రామా! సంసారకార్యారంభవిషయములను నీవు స్వయముగ నవలోకించి సత్యాసత్యముల నెఱింగి సత్యమందే పరాయణుఁడవుగమ్ము.

ఆదావన్తేచయన్నాస్తి కీదృశీతస్యసత్యతా
ఆదావన్తేచయన్నిత్యం సత్సత్యంనామనేతరత్. 9

ఏ వస్తువాద్యంతములందు లేదో అయ్యది సత్యమెట్లగును? ఏది ఆద్యంతములందు నిత్యమై యుండునో అదియే సత్యముగాని అన్యముగాదు.

ఆద్యన్తాసన్మయేయస్య వస్తున్యాసజ్జతేమనః
తస్యముగ్ధపశోర్జన్తోర్వివేకః కేనజన్యతే. 10

ఆద్యంతములందు లేని పదార్థమందు సత్యత్వబుద్ధిచే యెవడు మగ్నుడగునో అట్టిమూర్ఖునకు వివేకమెట్లు జనించును?

జాయతేమనఏవేహ మనఏవవివర్ధతే
సమ్యగ్దర్శనదృష్ట్యాతు మనఏవహిముచ్యతే. 11

ఈప్రపంచమున మనస్సేయుత్పన్నమగుచున్నది; మనస్సే వృద్ధినొందుచున్నది; సమ్యజ్ఞానదృష్టిచే మనస్సేముక్తి నొందుచున్నది.

శ్రీ రామ ఉవాచ :—

జ్ఞాతమేతన్మయాబ్రహ్మన్యథాస్మిన్భువనత్రయే
మనఏవహిసంసారి జరామరణభాజనమ్. 12

శ్రీరాముడు:—ఓ మహాత్మా! ఈ ముల్లోకములందును మనస్సే సంసారియగు జీవుడెట్లగునో, మఱియు నెవ్విధంబున నదియే జరామరణములకు పాత్రమగునో తమకృపచే నేనెఱుంగగల్గితిని.

యస్తస్యోత్తరణోపాయస్తన్మే బ్రూహిసునిశ్చితమ్
హార్దంతమస్త్వయార్కేణ రాఘవాణాంవినాశ్యతే. 13

ఇక సంసారమును తరించుటకు నిశ్చయమగు యుపాయమెద్దిగలదో యద్దానినివచింపుము. ఏలయన రఘువంశీయుల హృదయమందలి యంధకారమును, సూర్యునివలె తామే వినాశమొనర్పగలరు.

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

పూర్వంరాఘవ శాస్త్రేణ వైరాగ్యేణపరేణచ
తథాసజ్జనసంగేన నీయతాం పుణ్యతాంమనః. 14

శ్రీవసిష్ఠుడు:—ఓరాఘవా! ప్రథమమున మనుజుడు శాస్త్రాభ్యాసముచేతను తీవ్రవైరాగ్యము చేతను సజ్జనసాంగత్యముచేతను మనస్సును శుద్ధపఱచి జ్ఞానయోగ్యముగా నొనర్పవలెను.

సౌజన్యోపహితంచేతో యదా వైరాగ్యమాగతమ్
తదానుగమ్యాగురవో విజ్ఞానగురవోఽపియే. 15

సౌజన్యయుక్తమనంబుగల్గి వైరాగ్యమెపుడుప్రాప్తినొందునో, అపుడు శాస్త్రజ్ఞులును బ్రహ్మనిష్ఠులునగు సద్గురువులను విధిపూర్వకముగ సమీపింపవలెను.

తతస్తస్యోపదిష్టేన కృత్వాధ్యానార్చనాదికమ్
క్రమేణపదమాప్నోతి తద్యత్పరమపావనమ్. 16

పిదప తద్గురూపదిష్టమార్గమునవలంబించి ధ్యానపూజాదుల నొనర్చి జీవుడు క్రమముగ పరమపవిత్రమగు ఆత్మపదమునొందును.

విచారేణావదాతేన పశ్యత్యాత్మానమాత్మనా
ఇన్దునాశీతలేనాన్తర్విశ్వం ఖమివతేజసా. 17



శీతలుడగు చంద్రుని ప్రకాశముచే నాకసమును బరికించులాగున పరిశుద్ధవిచారమువలన జీవుడాత్మచే నాత్మను సందర్శింపగల్గును.

తావద్భవమహాంభోధా జనస్తృణవదుహ్యతే
విచారతటవిశ్రాన్తిమేతి యావన్నచేతసా. 18

బుద్ధియను నావచే (ఆత్మ) విచారమను తటమున స్థిరత్వమునొందువఱకు జీవుడీ సంసారసాగరమున తృణమువలె కొట్టుకొనిపోవుచునేయుండును.

విచారేణపరిజ్ఞాతవస్తునోఽస్య జనస్యధీః
సర్వానర్థకరోత్సాన్ధీనస్సిమ్న్యాంభ ఇవవాలుకాః. 19

నిమ్నస్థలమునకు బ్రవహించు స్వచ్ఛజలము స్రోతయందున్న యిసుకను తొలగించివేయునట్లు విచారముచే నాత్మతత్వమెఱింగినవానిబుద్ధి సమస్తమానసిక దుఃఖములను యంతమొనర్చును.

ఇదంరుక్మమిదం భస్మ పరిజ్ఞాతమితిస్ఫుటమ్
నయథాహేమకారస్య హేమజ్ఞానాత్మనస్తథా. 20

'ఇది సువర్ణము, ఇది 'భస్మము' యనునట్టి ప్రత్యక్షజ్ఞానము స్వర్ణకారునకు గలుగునట్లు తత్త్వజ్ఞానకును నిత్యానిత్యవస్తువులఁగూర్చిన వివేకముగల్గును.

అక్షయోఽయంమనాగాత్మా స్వాత్మన్యవగతే చిరమ్
భవతీతినరస్యేహ మోహస్యావసరఃకుతః. 21

అజ్ఞానముచే పరిచ్ఛిన్నమగు జీవుడు చిరకాలతత్త్వవిచారముచే వివేకము బడసి స్వస్వరూపము నెఱింగినచో అక్షయుఁ (దేశకాలవస్తువులచే నపరిచ్ఛిన్ను) డగును. ఇందజ్ఞత్వమునకు చోటెద్ది?

అపరిజ్ఞాతసారేహి మనోన్తర్యదిముహ్యతే
జ్ఞాతసారేత్వసందిగ్ధ మసతీకిలమూఢతా 22

సారవస్తువగు ఆత్మ నెఱుంగనివాని చిత్తమే విమోహమొందునుగాని, యద్దాని నెఱింగినవానికిక నిశ్చయముగ మోహమెన్నటికిని సంభవింపదు.

హేజనాఅపరిజ్ఞాత ఆత్మావోదుఃఖసిద్ధయే
పరిజ్ఞాతస్త్వనన్తాయ సుఖాయోపశమాయచ. 23

ఓ మానవులారా! ఆత్మయెఱుంగబడకుండుటచేతనే అయ్యది మీకుదుఃఖహేతువగుచున్నది. కాని యెఱుంగబడిన నదియే అనంతసుఖమును, శాంతిని ప్రసాదించునదగును.

మిశ్రీభూతమివానేన దేహేనోపహతాత్మనా
వ్యక్తీకృత్యస్వమాత్మానం స్వస్థా భవతమాచిరమ్. 24

నశ్వరదేహముతో మిశ్రమైయున్న ఆత్మను పంచకోశవివేకముచే వేఱుబఱచి మీరు స్వస్థచిత్తులుకండు.

దేహేనాస్యనసంబంధో మనాగేవామలాత్మనః
హేమ్నఃపఙ్కలవేనేవ తద్గతస్యాపిమానవాః. 25

ఓ మనుజులారా! పంకమునబడిన సువర్ణమునకు పంకముతో లేశమైనను సంబంధముండనట్లు నిర్మలమగు నీయాత్మకున్ను దేహముతోటి సంబంధమేమియును లేదు.

పృథగాత్మాపృథగ్దేహీ జలపద్మలవోపమా
ఊర్ధ్వబాహువిరామ్యేష నచకశ్చిచ్ఛృణోతిమే. 26

పద్మమున కాధారమగు మహాజలము, పద్మపత్రముపైనిగల జలబిందువు- ఈరెంటివలెనే బ్రహ్మమున్ను జీవుడున్ను యుసాధిచే భిన్నములని నేను బాహువులనెత్తి ఘోషించుచున్నను యెవరును వినుటలేదు.

జడధర్మిమనోయావద్గర్త కచ్ఛపవత్థ్సితమ్
భోగమార్గవదామూఢం విస్మృతాత్మవిచారణమ్. 27
తావత్సంసారతిమిరం సేన్దునాపి సవహ్నినా
అర్కద్వాదశకేనాపి మనాగపినభిద్యతే. 28

జడమగు నీమనంబు దుర్వాసనలను గర్తమున తాబేటివలె పడియున్నది. మఱియునియ్యది ఆత్మవిచారమును త్యజించి భోగద్వారములగు యింద్రియములయొక్క విషయములందు యెంతవఱకు నిమగ్నమైయుండునో, అంతవఱకు నీసంసారతిమిరము చంద్రాగ్నిసహిత ద్వాదశాదిత్యులచేగూడ లేశమైనను విచ్ఛిన్నమొనర్పబడకుండును.

సంప్రబుద్ధేహిమనసి స్వాం వివేచయతిస్థితిమ్
నైశమర్కోదయఇవ తమో హార్దంపలాయతే. 29

మనస్సుప్రబుద్ధమై తన యథార్థస్థితిని యెపుడు వివేచించియెఱుంగునో, అపుడు హృదయమందలి అజ్ఞానము సూర్యోదయముచే రాత్రియందలి యంధకారమువలె నశించును.

నిత్యముత్తమబోధాయ యోగశయ్యాగతంమనః
బోధయేద్భవభేదాయ భవోహ్యత్యన్తదుఃఖదః. 30

మనస్సు దేహతాదాత్మ్యమను శయ్య నాశ్రయించునపుడు సంసారబంధవినాశముకొఱకై ప్రాజ్ఞుడగు గురువును సమీపించి వానివలన యుపదేశమునొందవలెను. ఏలన నీసంసారమత్యంతదుఃఖప్రదమైనదిగదా!

యథారజోభిర్గగనం యథాకమలమంబుభిః
నలిప్యత్యేహసంశ్లిష్టై ర్దేహైరాత్మాతథైవచ. 31

ధూళిచే నాకసమున్ను, జలముచే కమలమున్ను లిప్తముగానట్లు దేహాదులతోడను ఆత్మ లిప్తముగానేరదు.

కర్దమాదియథాహేమ్నా శ్లిష్టమేతిపృథక్థ్సితమ్
నాన్తఃపరిణతింయాతి జడోదేహస్తథాత్మనా. 32

పంకమున్నగునవి సువర్ణముతోగలసినను వేఱుగానేయుండి సువర్ణరూపము జెందనట్లు జడమగుదేహము ఆత్మతోగలిసియున్నను ఆత్మరూపము జెందకుండును.



సుఖదుఃఖానుభావిత్వ మాత్మనీత్యవబుధ్యతే
అసత్యమేవగగనే బిన్దుతామ్లానతేయథా. 33

ఆకాశమందు బిందుత్వముగాని మాలిన్యముగాని లేని చందమున, ఆత్మయందు ప్రతీతమగు సుఖదుఃఖాదుల యనుభవమున్ను యసత్యమేయగును.

సుఖదుఃఖేనదేహస్య సర్వాతీతస్యనాత్మనః
ఏతేహ్యజ్ఞానకస్యైవ తస్మిన్నష్టే నకస్యచిత్. 34

సుఖదుఃఖములు దేహమునకుగావు. సర్వాతీతమగు ఆత్మకును గావు. కేవలమజ్ఞానమునకే యగును. అయ్యజ్ఞానమునశించిన యింకెవనికవి కల్గును?

నకస్యచిత్సుఖం కించిద్దుఃఖంచ నచకస్యచిత్
సర్వమాత్మమయంశాన్త మన న్తంపశ్యరాఘవ. 35

యథార్థముగ సుఖముగాని దుఃఖముగాని యెవనికిని లేదు. ఓరామా! ఇదంతయు ఆత్మయొక్క వివర్తరూపము మాత్రమే యని యెఱుంగుము; అనగా అంతయు నిత్యము ప్రశాంతమునగు ఆత్మరూపముగనే గాంచుము.

ఇమాయాఃపరిదృశ్యన్తే వితతాఃసృష్టిదృష్టయః
పయసీవతరంగాస్తే పిచ్ఛంవ్యోమ్నీవచాత్మని. 36

ఆత్మయందు గన్పించు యీవిశాల సృష్టిసమూహమంతయు జలమందలి తరంగములుగను, ఆకాశమందలి (అర్ధనిమీలిత నేత్రముచే గన్పట్టు) మయూరపంఖములుగను నెఱుంగుము.

యథామణిర్దదాత్యాత్మ చ్ఛాయాఃస్వయమకారణమ్
తేజోమయీస్తథైవాయమాత్మాసృష్టీః ప్రయచ్ఛతి. 37

తేజోవంతమగు తన ప్రకాశమును మణి అకారణముననే ప్రసరింపజేయునట్లు ఆత్మయు స్వసత్తామాత్రముచే సృష్టిసమూహములను విస్తరింపజేయుచున్నది.

ఆత్మాజగచ్చసుమతే నైకం నద్వైతమప్యసత్
ఆభాసమాత్రమేవేదమిత్థం సంప్రతిజృంభతే. 38

సుమతుడవగు నోరామా! ఆత్మయు, జగత్తున్ను యేకరూపములుగావు; బహురూపములునుగావు; జగత్తు మిథ్యయేగాన సర్వమిట్లు భ్రాంతిరూపముగనే యజ్ఞానకాలమున భాసించును.

సమస్తంఖల్విదంబ్రహ్మ సర్వమాత్మైవమాతతమ్
అహమన్యదిదంచాన్యదితి భ్రాన్తింత్యజానఘ. 39

పాపరహితుడవగు నోరామా! ఈ జగత్తంతయున్ను బ్రహ్మమేగాన నేనువేఱు, జగత్తువేఱను భ్రాంతిని త్యజించివేయుము.

తతేబ్రహ్మఘనేనిత్యే సంభవన్తినకల్పనాః
విచ్ఛిత్తయఃపయోరాశౌ యథారామనసన్త్యమీ. 40

దేశకాలవస్తుపరిచ్ఛేదశూన్యమగు బ్రహ్మమందీ జగత్కల్పన సముద్రమందు తరంగముల విచ్ఛేదమువలె సంభవముగానేరదు.

ఏకస్మిన్నేవసర్వస్మిన్పరమాత్మని వస్తుని
ద్వితీయాకల్పనానాస్తి వహ్నౌహిమకణోయథా. 41

అగ్నియందు హిమకణమువలె యేకమును సర్వరూపమునునగు పరమాత్మవస్తువందు రెండవకల్పనయే సంభవముగాదు.

భావయన్నాత్మనాత్మానం చిద్రూపేణైవచిన్మయమ్
ఋజూజ్జ్వలమయేహ్యాత్మా స్వయమాత్మనిజృంభతే. 42

చిద్రూపమగు ఆత్మచే చిద్రూపమగు ఆత్మనేభావించుచు మాయామాలిన్యరహితమై ఉజ్జ్వలమైనట్టి ఆత్మస్వరూపమున ఆత్మయే స్వయముగ విజృంభించుచున్నది.

నశోకోస్తినమోహోస్తి న జన్మాస్తినజన్మవాన్
యదస్తీహాతదేవాస్తి విజ్వరోభవరాఘవ. 43

ఓరామా! యథార్థముగ దుఃఖముగాని, మోహముగాని, జన్మగాని, జన్మనుబొందునట్టిది గాని లేవు. ఏది (ఆత్మ) కలదో అదియే కలదని యెఱింగి దుఃఖరహితుఁడ వగుము.

నిర్ద్వంద్వోనిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమఆత్మవాన్
అద్వితీయోవిశోకాత్మా విజ్వరోభవరాఘవ. 44

ఓ రామా! శీతోష్ణాది ద్వంద్వరహితుడవై, నిత్యము సత్వమందే స్థితిగల్గి, యోగక్షేమములు (లేనివస్తువును బొందుటయు యున్నదానిని విడువకరక్షించుటయు) లేనివాడవై ఆత్మవంతుఁడవై, అద్వితీయుఁడవై శోకరహితుడవై, సంతాప వర్జితుఁడవై యుండుము.

సమఃస్వస్థఃస్థిరమతిః శాన్తశోకమనాముని
మానీవరమణిస్వచ్ఛో విజ్వరోభవరాఘవ. 45

ఓ రాఘవా! సముడవు, స్వస్థచిత్తుడవు, స్థిరబుద్ధిగలవాడవు, దుఃఖరహితుడవు, శాంతచిత్తుడవు, మానియు, ఉత్తమమణివలె స్వచ్ఛుఁడవునై విగతశోకుడవుగమ్ము.

వివిక్తః శాన్తసంకల్పో ధీరధీర్విజితాశయః
యథాప్రాప్తానువర్తీచ విజ్వరోభవరాఘవ. 36

ఓ రామచంద్రా! అవిద్య, తత్కార్యములు లేనివాడవై సంకల్పరహితుఁడవై, ధీరబుద్ధియు స్వాధీనచిత్తమును గల్గి, ప్రాప్తించిన వ్యవహారములఁజేయుచు యేదుఃఖమును లేకయుండుము.

వీతరాగోనిరాయాసో విమలోవీతకల్మషః
నాదాతా నపరిత్యాగీ విజ్వరోభవరాఘవ. 37

రాఘవా! వీతరాగుఁడవు, చిన్తారహితుడవు, నిర్మలచిత్తుడవు, పాపవర్జితుడవునై, యేపదార్థమును గ్రహింపకయు త్యజింపకయునుండి దుఃఖరహితుఁడవుగమ్ము.

విశ్వాతీతపదంప్రాప్తః ప్రాప్తప్రాప్తవ్యపూరితః
పూర్ణార్ణవవదక్షుబ్ధో విజ్వరోభవరాఘవ. 48

ఓరామా! ప్రపంచాతీతమగు బ్రహ్మపదమునొంది, ప్రాప్తవ్యమగు ఆత్మవస్తువు ప్రాప్తించుటచే పరిపూర్ణుడవై పూర్ణసముద్రము భంగి విక్షోభరహితుడవై యెట్టిశోకమును బొందకయుండుము.



వికల్పజాలనిర్ముక్తో మాయాంజనవివర్జితః
ఆత్మనాత్మనితృప్తాత్మా విజ్వరోభవరాఘవ. 49

ఓరామచంద్రా! వికల్పజాలమునుండి విముక్తుడవై, మాయయను యంజనములేనివాడవై, ఆత్మయందాత్మచే బరితృప్తినొందుచు సంతాపవర్జితుఁడవై యుండుము.

అనన్తాపారపర్యన్త వపురాత్మవిదాంవర
ధరాధరశిరోధీరో విజ్వరోభవరాఘవ. 50

ఆత్మవేత్తలలో శ్రేష్ఠుఁడవగు నోరామా! అనంతమును అపారమునునగు యాకృతి (సర్వవ్యాపకమగు చైతన్యరూపము) గల్గి, మేరుపర్వతమువలె ధీరుడవై (సహనశీలుఁడవై), దుఃఖరహితుఁడవుగమ్ము.

యథాప్రాప్తానుభవనాత్సర్వత్రానభివాంఛనాత్
త్యాగాదానపరిత్యాగాద్విజ్వరోభవరాఘవ. 51

ఓరామా! ప్రాప్తించినదానిననుభవించుచు, యే వాంఛయులేక గ్రహణత్యాగ వివర్జితుఁడవై విగతశోకుడవుగమ్ము.

ఆత్మన్యేవాత్మనౌదార్యం భజపూర్ణఇవార్ణవః
ఆత్మన్యేవాత్మనాహ్లాదం భజపూర్ణేందుబింబవత్. 52

ఓ రాఘవా! సముద్రమువలె ఆత్మయందాత్మచే పరిపూర్ణుడవై (పూర్ణకాముడవై) పూర్ణచంద్రునివలె సంతాపరహితుడవై శాంతిసుఖము నాశ్రయించుము.

విశ్వప్రపంచరచనేయ మసత్యరూపా
నాసత్యరూపమనుధావతిరామతజ్జ్ఞః
తజ్జ్ఞోసిశాన్తకలనోఽసి నిరామయోఽసి
నిత్యోదితోఽసి భవసుందరశాన్తశోకః. 53

ఈ ప్రపంచము మిథ్యారూపమైనదని యెఱుఁగువాడు అసత్స్వరూపమగు నద్దానికై యుఱుల పరువిడడు. ఓరామా! నీవు తత్వజ్ఞుడవు, కల్పనారహితుడవు, ఆధివ్యాధి వివర్జితుఁడవునై నిరంతర మాత్మజ్ఞానముగల్గి సుఖవంతుడవుగమ్ము.

ఏకాతపత్రమవనౌ గురుణోపదిష్టం
సమ్యక్కుపాలయ చిరంసమయేహదృష్ట్వా
రాజ్యంసమస్తగుణరంజితరాజలోక
స్త్యాగో నయుక్తఇహ కర్మసునాపిరాగః. 54

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే ప్రశమోపదేశోనామ
పంచమః సర్గః ॥ 5 ॥

మఱియు స్వగుణోత్కర్షచే సమస్తభూపాలురను, ప్రజలను ప్రసన్నులుగజేయుచు, సమదృష్టిగల్గి చిరకాలము రాజ్యమును చక్కగ బాలింపుము. ఏలయన, ప్రారబ్ధకర్మచే నవశ్య మనుభవింపఁదగిన కర్మలందును వాటిఫలములందును త్యాగముగాని, రాగముగాని యుక్తముగానేరదు.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు ఉపశమప్రకరణమున
ప్రశమోపదేశమను అయిదవ
సర్గము ॥ 5 ॥

---

## షష్ఠః సర్గః.

---

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

ఇమంవిశ్వపరిస్పన్దం కరోమీత్యస్తవాసనమ్
ప్రవర్తతే యఃకార్యేషు సముక్తఇతిమేమతిః. 1

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామా! ఆత్మయొక్క సన్నిధానమాత్రముచే నీసమస్తజగద్వ్యవహారమంతయును నేనేయొనర్చుచున్నానను నిశ్చయముగల్గి కార్యములందు ప్రవృత్తుఁడగువాఁడు ముక్తుఁడని నామతము.

పౌరుషీంతనుమాశ్రిత్య కేచిదేతత్క్రియారతాః
స్వర్గాన్నరకమాయాన్తి స్వర్గంచ నరకాత్పునః 2

మనుష్యదేహము నొందియు నిష్కామ కర్మానుష్ఠానమందు తత్పరులుగానివారు నిందిత కర్మలచే నరకమునకుఁజనుచు, మఱల కామ్యకర్మలచే నచటనుండి స్వర్గమునకేగుచు నుందురు.

కేచిత్పాకర్మణిరతా విరతాఅపికర్మణః
నరకాన్నరకంయాన్తి దుఃఖాద్దుఃఖం భయాద్భయమ్. 3

మఱికొందఱు నిషిద్ధకర్మపరాయణులు, విహితకర్మలఁ ద్యజించువారునై యుందురు. అట్టివారొక నరకమునుండి మఱియొక నరకమునకు, నొక దుఃఖమునుండి మఱియొక దుఃఖమునకు, నొక భయమునుండి మఱియొక భయమునకు నేగుచునుందురు.

కేచిత్స్వవాసనాతన్తు బద్ధాఃకర్మఫలోదితాః
తిర్యక్త్వాత్స్థావరతనుం యాన్తితిర్యక్త్వమంతతః. 4

కొందఱు స్వవాసనానూత్రమున బద్ధులై దుష్కర్మఫలశేషముచే నరకమునుండి తిర్యగ్యోనియందు జన్మించి యచటనుండి స్థావరరూపమునొంది మఱల తిర్యగ్రూపము నొందుచున్నారు.

కేచిదాత్మవిదోధన్యా విచారితమనోదృశః
విచ్ఛిన్నతృష్ణానిగడా యాన్తినిష్కేవలంపదమ్. 5

శుద్ధసాత్వికులు, ధన్యులునగు కొందఱాత్మజ్ఞానులు మనస్సునకు సాక్షిభూతమైయున్న ఆత్మనుగాంచి [illegible] తృష్ణను విచ్ఛిన్న మొనర్చి యుత్తమకైవల్యపదమును ప్రాప్తినొందుచున్నారు.



పురాకతిపయాన్యేవ భుక్త్వాజన్మానిరాఘవ
అస్మింజన్మని యేముక్తస్తస్మాద్రాజససాత్వికః. 7

ఉత్తరోత్తర యధికశ్రేష్ఠమగు మానవజన్మల కొన్నింటి ననుభవించి యీజన్మమందే ముక్తులగువారు రాజససాత్వికులనంబడుదురు.

జాతోఽసౌవృద్ధిమభ్యేతి పార్వణశ్చంద్రమాఇవ
కుటజంప్రావృషీవైనం సౌభాగ్యమనుగచ్ఛతి. 8

అట్టివారు జన్మించినతోడనే పూర్ణచంద్రునివలె వృద్ధిగాంచుదురు. మఱియు వర్షాకాల కుటజపుష్పశోభవలె సాధనచతుష్టయ సంపత్తియను సౌభాగ్యము వారిని వెన్నంటును.

యస్యేదంజన్మపాశ్చాత్యం తమాశ్వేవమహామతే
విశన్తివిద్యావిమలా ముక్తావేణుమివోత్తమమ్. 8

మహామతివగు నోరామా! మోక్షభాజుఁడగు యేమానవున కియ్యది యంతిమ జన్మంబగునో యట్టివానియందు బ్రహ్మవిద్యకుపాయభూతములగు సమస్తవిద్యలున్ను మంచివెదురునందు ముత్యము లవలె వచ్చిచేరును.

ఆర్యతాహృద్యతామైత్రీ సౌమ్యతాకరుణాజ్ఞతా
సమాశ్రయన్తితంనిత్య మంతఃపురమివాంగనాః. 9

స్త్రీలంతఃపురము నాశ్రయించునట్లు శ్రేష్ఠత్వము, మనోహరత్వము, మైత్రి, సౌజన్యత, కరుణ, జ్ఞానము మున్నగుగుణములు, నిరంతరము వాని నాశ్రయించును.

యఃకుర్వన్సర్వకార్యాణి పుష్టేనష్టేఽథతత్ఫలే
సమఃసన్సర్వకార్యేషు నతుష్యతి నశోచతి. 10

తమాంసీవ దివాయాన్తి తత్రద్వంద్వాని సంక్షయమ్
శరదీవఘనాస్తత్ర గుణాగచ్ఛన్తిశుద్ధతామ్. 11

సమస్తకార్యములను చేయుచున్నను వాటి ఫలాఫలములందు సమరూపుఁడై వర్తించుచు హర్షశోకములఁ జెందకయుండువానికి సుఖదుఃఖాది ద్వంద్వములన్నియు పగటియందంధకారము వలె నశించును. మఱియు శరత్కాలమేఘమువలె సమస్తగుణములును వానియందు పరిశుద్ధములగును.

పేశలాచారమధురం సర్వేవాంఛన్తితంజనాః
వేణుంమధురనిధ్వానం వనేవనమృగాఇవ. 12

వాయుపూరితమై మధురగాన మొనర్చుచున్న వెదురును వనమందలి మృగసమూహము గోరునట్లు సదాచారనిష్ఠుఁడగు గుణసంపన్నుని జనులందఱును గోరుదురు.

నరంపాశ్చాత్యజన్మాన మేవంప్రాయాగుణశ్రియః
జాతమేవానుధావన్తి బలాకాఇవవారిదమ్. 13

ఎవనికియ్యది యంతిమజన్మంబగునో యట్టివానిని పైనదెల్పిన గుణసంపదయంతయు బక పంక్తులు మేఘమును వెన్నంటునట్లు యనుగమించును.

తతోఽసౌగుణసంపూర్ణో గురుమేవానుగచ్ఛతి
సతమేవంవివేకేనై నియోజయతిపావనే. 14

ఇట్లుత్తమగుణములచే బరిపూర్ణుడగు నాతడు బ్రహ్మజ్ఞుఁడగు గురువును సమీపింప నంత గురువు వానిని ఆత్మానాత్మవివేకమందు నియోగించును.

విచారవైరాగ్యవతా చేతసా గుణశాలినా
దేవంపశ్యత్యథాత్మాన మేకరూపమనామయమ్. 15

పిదప విచారవైరాగ్యసమన్వితమును యుత్తమగుణములచే శోభితమునగు చిత్తముచే ఆనందైకరసమగు ఆత్మస్వరూపము నాతడు వీక్షించును.

తనోత్యయంవిచారేణ చారుణాశాన్తచేతసా
ప్రబోధనాయప్రథమం మనోమననమాన్తరమ్. 16

ఉత్తమ శాంతచిత్తముతోగూడిన విచారముచే నాతడు ప్రథమమున జ్ఞానప్రాప్తికొఱకై తన యంతఃకరణమును మననమందు నియోగించును.

గేహేపాశ్చాత్యజన్మాన స్తేహి సుప్తంమనోమృగమ్
ప్రబోధయన్తిప్రథమం గుణహీనంమహాగుణాః. 17

అంతిమజన్మచే నొప్పునట్టి గుణసంపన్నులైన మహాత్ములు నిదురించుచున్న తమమనస్సను మృగమును మొమ్మొదట ప్రబోధ మొనర్చి క్రమముగ యద్దానిని నిర్గుణబ్రహ్మరూపమున నైక్య మొనర్తురు.

ప్రథితగుణాన్నుగురూన్ని షేవ్యయత్నా
దమలధియాప్రవిచార్య చిత్తరత్నమ్
గతిమమలాముపయాన్తి మానవాస్తే
పరమవలోక్య చిరంప్రకాశమన్తః. 18

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే ప్రథమోపదేశోనామ
షష్ఠః సర్గః ॥ 6 ॥

ఉత్తమ గుణములచే శోభితులగు సద్గురువులను యత్నముతోడ సేవించి తదుపదిష్టము లగు యుక్తులద్వారా నిర్మలబుద్ధిచే చిత్తమందలి ఆత్మయను రత్నమును బాగుగబరీక్షించి అంతఃకరణమును ప్రకాశింపజేయు బ్రహ్మమును చిరకాలమనుభవించి యమ్మహాత్ములు పరమపురుషార్థరూపమగు యుత్తమగతిని స్వస్థానముననే ప్రాప్తినొందుచున్నారు.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు ఉపశమప్రకరణమున
ప్రథమోపదేశమను షష్ఠ సర్గము ॥ 6 ॥

---



## సప్తమః సర్గః

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

ఏషతావత్క్రమఃప్రోక్తః సామాన్యఃసర్వదేహినామ్
ఇమమన్యంవిశేషంత్వం శృణురాజీవలోచన. 1

శ్రీ వసిష్ఠుడు :—ఓ రామా ! ఇంతదనుక సర్వజీవులకును సామాన్యమైనట్టి క్రమమును గూర్చి వివరించినాను. ఇక నన్యమగు విశేషక్రమమును వినుము.

అస్మిన్సంసారసంరంభే జాతానాం దేహధారిణామ్
అపవర్గకృతేరామ ద్వావిమావుత్తమౌక్రమౌ. 2

ఈ ప్రపంచమున జన్మించు ప్రాణికోట్లలందఱకును యీ వక్ష్యమాణక్రమములుడును రెం మోక్షమును గలుగజేయునవియు, ఉత్తమములునైనవి.

ఏకస్తావద్గురుప్రోక్తా దనుష్ఠానాచ్ఛనైశ్శనైః
జన్మనాజన్మభిర్వాపి సిద్ధిదఃసముదాహృతః. 3

వానిలో మొదటిది గురూపదిష్టమార్గమును క్రమముగ ననుష్ఠించుట. ఇయ్యది ఒకజన్మమునగాని అనేక జన్మలకుగాని సిద్ధిని గలుగజేయునదగును.

ద్వితీయస్త్వాత్మనైవాశు కించిద్వ్యుత్పన్నచేతసా
భవతిజ్ఞానసంప్రాప్తి రాకాశఫలపాతవత్. 4

రెండవదానిచే కించిత్పరిపక్వచిత్తముగలవానికి స్వయముగ ఆత్మవిచారముచే ఆకాశ ఫలప్రాప్తివలె శీఘ్రముగ జ్ఞానము చేకూరును.

నభఃఫలనిపాతాభజ్ఞాన సంప్రతిపత్తయే
తత్రేమంశృణువృత్తాన్తం ప్రాక్తనంకథయామి తే. 5

ఆకాశఫలప్రాప్తివలె శీఘ్రముగ జ్ఞానము లభించుననుటను నిరూపించుటకై పూర్వ వృత్తాంతము నొకదాని నెఱింగించుచున్నాను వినుము.

శృణుశుభగ కథాం మహానుభావా
వ్యపగతపూర్వ శుభాశుభార్గలౌఘాః
ఖపతితఫలవత్పరం వివేకం
చరమభవావిమలం సమశ్నువన్తి. 6

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే ఆకాశప్రాప్తివజ్జ్ఞానసంప్రాప్తి క్రమసూచనంనామ
సప్తమః సర్గః ॥ 7 ॥

సుశీలుఁడవగు నోరామా! నీవీకథను యాకర్ణింపుము. దీనిచే పూర్వకాలిక శుభాశుభ కర్మమను ప్రతిబంధమునుండి తొలఁగి తుదిజన్మగల మహానుభావులు ఆకాశఫల ప్రాప్తివలె యుత్తమ వివేకమును బొందుటను నీవెఱుంగగలవు.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు ఉపశమ ప్రకరణమున
ఆకాశఫలప్రాప్తి వలె జ్ఞానసంప్రాప్తి క్రమసూచనమను
సప్తమ సర్గము ॥ 7 ॥

---

## అష్టమః సర్గః.

---

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

అస్త్యస్తమితసర్వాప దుద్యత్సంపదుదారధీః
విదేహానాంమహీపాలో జనకోనామవీర్యవాన్. 1

శ్రీ వసిష్ఠుడు :—ఓ రామా! ఎట్టి యాపదలును లేనివాడును, సకల సంపదలతో తులతూగువాడును, ఉదారబుద్ధియు, పరాక్రమశీలుడును, విదేహాధీశుఁడునునగు జనకుఁడనురాజుగలడు.

కల్పవృక్షోఽర్థిసార్థానాం మిత్రాబ్జానాందివాకరః
మాధవోబంధుపుష్పాణాం స్త్రీణాంమకరకేతనః. 2
ద్విజకైరవశీతాంశు ర్ద్విషత్తిమిరభాస్కరః
సౌజన్యరత్నజలధిర్భువం విష్ణురివాస్థితః. 3

ఆతడు యాచకబృందమునకు కల్పవృక్షమును, మిత్రులను కమలములకు సూర్యుఁడును, బంధువులను పుష్పరాశికి వసంతఋతువును, స్త్రీలకు మన్మథుడును, ద్విజులను కలువలకు చంద్రుడును, శత్రువులను యంధకారమునకు సూర్యుడును, సౌజన్యమను రత్నములకు సముద్రమునునై విష్ణువువోలె లోకముల పాలించునిమిత్తము యవతరించిన మహారాజువలె నుండెను.

ప్రఫుల్లబాలలతికే మంజరీపుంజపింజరే
సకదాచిన్మధౌమత్తే కోకిలాలాపలాసిని. 4
యయావకుసుమితాభోగం సువిలాస లతాంగనమ్
లీలయోపవనంకాన్తం నందనంవాసవోయథా. 5

ఒకానొకసమయమున వికసిత కోమలలతాసమూహముచే శోభితమై కోకిలల యాలాపముచే నృత్యమొనర్చుచున్నట్లు దోచుచున్న వసంతఋతువునందు పుష్పప్రపూర్ణమును, లతారూప యంగనాసహితమును, రమణీయమునగు వనమునకు, నందనవనమున కింద్రునివలె యారాజు క్రీడార్థమేగెను.

తస్మిన్వరవనేహృద్యే కేసరోద్దామమారుతే
దూరస్థానుచరఃసాను కుంజేషువిచచారహ. 6

రమణీయంబై శీత మంద సుగంధ వాయుసంయుక్తమై శోభించు యవ్వనంబున నారాజు తన యనుచరులను దవ్వుననుంచి పర్వతకుంజములందు విహరింపసాగెను.



అథశుశ్రావకస్మింశ్చిత్తమాల వనగుల్మకే
సిద్ధానామప్రదృశ్యానాం స్వప్రసంగాదుదాహృతాః. 7
వివిక్తవాసినాంనిత్యం శైలకన్దరచారిణామ్
ఇమాఃకమలపత్రాక్ష గీతాగీతాత్మభావనాః. 8

కమలనేత్రుఁడవగు నో రామా! పిమ్మట యచట తమాలవనలతాకుంజములం దదృశ్యరూపమున నుండిన, యేకాంతవాసులును, నిత్యము పర్వతగుహలందు సంచరించువారునగు సిద్ధులు తమ ప్రసంగమున వచించిన శ్రుతిస్మృతిప్రతిపాదితములైన ఆత్మసాక్షాత్కారసమర్థములైన వత్స్య మానగీతముల నాతఁడువినెను.

సిద్ధా ఊచుః :—

ద్రష్టృదృశ్యసమాయోగాత్ప్రత్యయానందనిశ్చయః
యస్తంస్వమాత్మతత్త్వోత్థం నిఃస్పన్దంసముపాస్మహే. 9

సిద్ధులు బల్కిరి :—నేత్రాదీంద్రియములద్వారా ప్రకచ్ఛందనాది విషయసంయోగముచే నుద్భవించు విషయాకారబుద్ధివృత్తియందే యానందరూపము నిశ్చయింపబడుచున్నదో, అట్టి నిరతిశయ భూమానందస్వరూపమైన ఆత్మను నిర్వికల్పసమాధిచేతను బాహ్యాభ్యంతరేంద్రియ నిగ్రహము చేతను మేము నిరంతర ముపాసించుచున్నారము.

అన్యే ఊచుః :—

ద్రష్టృదర్శనదృశ్యాని త్యక్త్వావాసనయాసహ
దర్శనప్రథమాభాస మాత్మానంసముపాస్మహే. 10

మఱికొందఱు సిద్ధులిట్లువచించిరి :—ద్రష్టృదర్శనదృశ్యరూపమగు త్రిపుటిని వాసనలతోఁగూడ పరిత్యజించి నేత్రాదీంద్రియముల (లేక మానసిక) వృత్తులకుపూర్వమే వానియుత్పత్తికి సాక్షిరూపమై భాసిల్లు యాత్మరూపమును అనగా బీజసహితత్రిపుటీపరిత్యాగముచే తురీయమగు ఆత్మను నిరంతరముపాసించుచున్నాము.

అన్యే ఊచుః :—

ద్వయోర్మధ్యగతం నిత్యమస్తి నాస్తీతిపక్షయోః
ప్రకాశనంప్రకాశ్యానామాత్మానం సముపాస్మహే. 11

ఇంక కొందఱిట్లనిరి :—నేత్రేంద్రియాదుల జ్ఞానమునకు పూర్వమే భాసించునట్టి సాక్షిరూప సత్తామాత్రమై 'ఇదికలదు', 'ఇదిలేద'ని వాదించువారియొక్క అస్తిత్వ, నాస్తిత్వములు రెండును సాక్షిలేకయె సిద్ధింపజాలవు. కాన అస్తిత్వనాస్తిత్వ పక్షములు రెంటియందును మధ్యగతమై సాక్షిరూపమున వెలుగొందుచు ప్రకాశ్యవస్తువులఁగూడ ప్రకాశింపజేయునట్టి ఆత్మను లెస్సగ యుపాసించుచున్నాము. [లేక, అస్తిత్వ (జగత్కార్యరూపత్వ) నాస్తిత్వ (జగత్తిరోభావ)ములు రెండును యేకకాలమున యసంభవమగుటచే, రెంటియందును యనుగతమై సన్మాత్రరూపమున సమస్తప్రకాశ్యపదార్థములను ప్రకాశింపజేయునట్టి ఆత్మవస్తువును నిత్యము మేముపాసించుచున్నారము.]

అన్యే ఊచుః :—

యస్మిన్సర్వంయస్యసర్వం యతఃసర్వంయస్మాఇదమ్
యేనసర్వంయద్ధిసర్వం తత్సత్యంసముపాస్మహే. 12

మఱికొందఱిట్లు బల్కిరి :—ఏపరమాత్మయందంతయుఁగలదో అనగా యెవఁడు సర్వాధారుఁడో, సమస్తము యెవనిదైయున్నదో, అనగా యెవఁడు సమస్తమునకు ప్రభువై విలసిల్లుచున్నాఁడో, యెవనివలన సర్వము నుత్పన్నమగుచున్నదో, అనగా యెవఁడు సమస్తమునకు కారణభూతుఁడో, సమస్తము యెవఁడగునో అనగా మాయచే జగద్వ్యవహారంబులన్నింటిని నిర్వహించుచు సర్వరూపుఁడై వెలుగొందుచున్నాఁడో అట్టి సత్యస్వరూపుఁడగు పరమాత్మను మేముపాసించుచున్నాము.

అన్యే ఊచుః :—

అశిరస్కం హకారాన్త మశేషాకారసంస్థితమ్
అజస్రముచ్చరన్తంస్వం తమాత్మానముపాస్మహే. 13

అన్యులిట్లనిరి :—అకారమాదియందును, హకారమంతమునసుగల అహంపదమునకు వాచ్యమును, సర్వవస్తుప్రకాశకమును, వేదశాస్త్రాదులందనుగతమైయున్న అకారాది హకారాంతమువరకుగల సర్వాక్షర సముదాయరూపమగు శబ్దజాలమందంతర్గతుఁడైయుండుటచే సర్వాకారుఁడును (శిరచ్ఛేదంపశక్యముగానివాఁడును, సర్వవ్యాపకుఁడును) నగు నిర్గుణబ్రహ్మమందు స్థితిగల్గి 'సోహం' మంత్రమును శ్వాసోచ్ఛ్వాసములచే నిరంతరము జపించుచునున్న యాత్మతత్వమును లెస్సగ నుపాసించెదము.

అన్యే ఊచుః :—

సంత్యజ్యహృద్గుహేశానం దేవమన్యంప్రయాన్తియే
తేరత్నమభివాంఛన్తి త్యక్తహస్తస్థకౌస్తుభాః. 14

మఱికొందఱిట్లు వచించిరి:—హృదయగుహయందలి ప్రభువగు ("అంగుష్ఠమాత్రః పురుషోఽన్తరాత్మా సదాజనానాంహృదయేసన్నివిష్టః" - అంగుష్ఠమాత్రుఁడై సర్వులహృదయములందును ప్రవేశించిన అంతరాత్మయగు) దేవుని ద్యజించి అన్యదేవుల నాశ్రయించువారు హస్తమునసున్న కౌస్తుభమణినివదలి యితరరత్నములఁగోరువారి చందమునసుందురు.

అన్యే ఊచుః :—

సర్వాశాఃకిలసంత్యజ్య ఫలమేతదవాప్యతే
యేనాశావిషవల్లీనాం మూలమాలావిలూయతే. 15

అన్యులు బల్కిరి :— సమస్తయాశలను బరిత్యజించిననే హృదయమందలి చిద్రూపబ్రహ్మము ప్రాప్తించును. అద్దానిప్రాప్తిచే ఆశలను విషలతలయొక్క (లెక్క వాసనాజాలయుక్తమై మిగుల జటిలములగు హృదయగ్రంథుల) మూలముచ్ఛిన్నమగును.

అన్యే ఊచుః :—

బుద్ధ్వాప్యత్యన్తవైరస్యం యఃపదార్థేషుదుర్మతిః
బధ్నాతిభావనాంభూయో నరోనాసౌసగర్దభః. 16



కొందఱు సిద్ధులిట్లు వచించిరి :—భోగ్యపదార్థములందలి యత్యంత నీరసత్వమెఱింగియు మఱల వాటినే గోరునట్టి దుర్బుద్ధి మానవుఁడు కానేరడు. గార్దభమేయగును.

అన్యే ఊచుః :—

ఉత్థితానుత్థితానేతానింద్రియాహీన్పునఃపునః
హన్యాద్వివేకదండేన వజ్రేణేవహరిర్గిరీన్. 17

అన్యులు వచించిరి :—వజ్రముచే నింద్రుఁడు పర్వతములను ఛేదించునట్లు యెప్పుడెప్పుడు యింద్రియములను సర్పములు విజృంభించుచుండునో, అప్పుడప్పుడు వివేకమను దండముచే వానిని తెగగొట్టవలెను.

అన్యే ఊచుః :—

ఉపశమసుఖమాహరేత్పవిత్రం
సుశమవతః శమమేతి సాధుచేతః
ప్రశమితమనసః స్వకేస్వరూపే
భవతిసుఖేస్థితిరుత్తమాచిరాయ. 18

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే సిద్ధగీతానామాష్టమః
సర్గః ॥ 8 ॥

మఱికొందఱిట్లనిరి :— బాహ్యాభ్యంతరేంద్రియవ్యాపారముల నిరోధించి తద్వారా విషయజనిత దుఃఖమును రహితమొనర్చి ఆత్మసుఖసంపాదనయొనర్పవలెను. అట్టి యుపశమము (ఇంద్రియవ్యాపారనిరోధము)చే యింధనములులేని అగ్నివలె చిత్తము పూర్ణముగ శమించును. చిత్తము శమించినవానికి పరమార్థభూతమై సుఖరూపమైన ఆత్మయందు చిరకాల ముత్తమస్థితి లభించును.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు ఉపశమప్రకరణమున
సిద్ధగీతయను అష్టమ సర్గము ॥ 8 ॥

---

## నవమః సర్గః.

---

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

ఇతిసిద్ధగణోద్గీతా గీతాఃశ్రుత్వామహీపతిః
విషాదమాజగామాశు భీరూరణరవాదివ.

శ్రీ వసిష్ఠుఁడు :—ఓ రామా ! ఇట్లు సిద్ధులుపాడిన గీతములను వినిన జనకమహారాజు రణశబ్దమునువినిన భీరువువలె శీఘ్రముగ విషాదముఁజెందెను.

జగామపరివారం స్వమాకర్షన్స్వగృహంప్రతి
స్వతీరవృక్షానుగతః సరిదోఘఇవార్ణవమ్. 2

తీరస్థవృక్షముల ననుగమించుచు నదీప్రవాహము సముద్రమునకు జనునట్లు రాజపుత్రుడు తనపరివారముతోఁగూడ స్వగృహమునకేగెను.

పరివారమశేషేణ విసృజ్య స్వం స్వమాలయమ్
ఏక ఏవారురోహాగ్ర్యం గృహమర్క ఇవాచలమ్. 3

అంత పరివారమునంతయు వారివారిస్థానములకుఁ బంపివైచి తానేకాకియై ఉదయాద్రిపై సూర్యునివలె తనప్రాసాదము నెక్కెను.

తత్ర ప్రోడ్డయనాలోల ఖగపఙ్క్తిచంచలాః
ఆలోకయంల్లోకగతీర్విలలాపేదమాకులః. 4

అటకేగినవాఁడై యెగురుచున్న పక్షులపెక్కులవలె నతిచంచలములగు విచిత్రప్రాపంచికగతుల నవలోకించి వ్యాకులచిత్తుఁడై యివ్విధంబున విలపింపసాగెను.

హా కష్టమతికష్టాసు లోకలోలదశాస్వయమ్
పాషాణేష్వివ పాషాణా ఆలుఠామి బలాదహమ్. 5

ఆహా! యెట్టి ఖేదకరమైన విషయము! జన్మజరామృత్యుభయాదులచే మిగుల కష్టప్రదమగు చంచల జీవదశలందు రాతిపై రాతివలె బలాత్కారముగ నేను ద్రొల్లుచున్నాను.

అపర్యన్తస్య కాలస్య కోఽప్యంశో జీవ్యతే మయా
తస్మిన్నాభవం సిబధ్నామి ధిఙ్మామధమచేతనమ్. 6

ఈయనంతకాలమున నాజీవిత మతిస్వల్పమైనది. ఇట్టి యల్పకాలిక జీవనమందాశగల్గియున్న యధముఁడగు నాకు ధిక్కారమగుగాత!

కియన్మాత్రమిదం నామ రాజ్యమాజీవితం మమ
కిమేతేన వినా దుఃఖం తిష్ఠామి హతధీర్యథా. 7

ఈ నాజీవితపర్యంత రాజ్యము మిగుల యల్పమైనది. దీనితోడనే సంతుష్టిజెంది నశించినబుద్ధిగలవానివలె భావిదుఃఖవినాశనముకొఱకై చింతింపక యేలయుంటిని?

ఆదావన్తేఽప్యనన్తోఽహం మధ్యే పేలవజీవితః
బాలశ్చన్ద్రే తేన్దునేవాహం కిం ముధా ధృతిమాస్థితః. 8

అనాది అనంతస్వరూపులమగు మనకీ యల్పజీవితము శరీరసంబంధముచే మధ్య గల్గినది. కాన, చిత్రమందలి చంద్రుని నిజచంద్రునిగభావించి గ్రహింపనుద్దేశించు బాలునిచందమున అనాత్మరూపమగు దేహాదులను ఆత్మరూపముగ దలంచుచు నేనేల వ్యర్థముగ ధైర్యమొందుచుంటిని?

ప్రపంచరహితేనాహమింద్రజాలేన జాలినా
హా కష్టమతిముహ్యామి కేనాస్మి పరిమోహితః. 9

హా! కష్టము! ఏ ఐంద్రజాలికుని యింద్రజాలముచే నేను పరిమోహితుఁడనైతి?

యద్వస్తు యచ్చ వారమ్యం యదుదారమకృత్రిమమ్
కించిత్తదిహ నాస్త్యేవ కిం నిష్ఠేహ మతిర్మమ. 10



సత్యమై సుఖరూపమై అపరిచ్ఛిన్నమైనట్టి వస్తువీప్రపంచమున యెద్దియును లేదు. కాన దానిచే నాకు చిత్తవిశ్రాంతి యెట్లు లభించును?

దూరస్థమప్యదూరస్థం యన్మే మనసి వర్తతే
ఇతి నిశ్చిత్య బాహ్యార్థ భావనాం సంత్యజామ్యహమ్. 11

అజ్ఞులదృష్టియందతిదూరముననున్నట్టి సత్యవస్తువు నామనంబుననే యున్నదిగాన నది సమీపముననేయున్నదగును. ఇవ్విధమున నిశ్చయించి నేను బాహ్యపదార్థభావనను త్యజించుచున్నాను.

లోకాజవంజవీభావః సలిలావర్తభంగురః
దృష్టోఽద్యాపి హి దుఃఖాయ కేయమాస్థా సుఖం ప్రతి. 12

భోగార్థమై ధనార్జనాదులందలి జీవులయొక్క ప్రవృత్తిరూపవేగము జలమందలి యావర్తమువలె క్షణభంగురముగ గన్పట్టుచున్నది. వర్తమానకాలమందును యీ ధనాదులు కేవలము దుఃఖమునే గలుగజేయుచున్నవి. కాన నిట్టి విషయసుఖములను నేనపేక్షింపనేల?

ప్రత్యబ్దం ప్రతిమాసం చ ప్రత్యహం చ ప్రతిక్షణమ్
సుఖాని దుఃఖపిణ్డాని దుఃఖాని తు పునః పునః. 13

ప్రతివత్సరమును, ప్రతిమాసమును, ప్రతిదినమును, ప్రతిక్షణమునుగల్గు యీ సుఖములన్నియు కేవలము దుఃఖరూపములేయగును.

పరామృష్టం విశిష్టం హి దృష్టం నష్టం న భావితమ్
అత్రస్థం న తదస్తీహ సతాం యత్రాస్తు సంస్థితిః. 14

ఈ ప్రపంచమునగల ప్రతివస్తువున్ను శీఘ్రముగ వినాశమొందుచున్నది. కాన నారాజ్యాదులున్ను తుచ్ఛములేయగును. ఏలన ప్రసిద్ధములగు యింద్రబ్రహ్మాదుల పదములున్ను తత్వదృష్టిచే నశ్వరములుగనే గన్పట్టుచున్నవి. కాన వివేకులచిత్తము నిరంతరము విశ్రాంతిబొందునట్టి పదార్థమెద్దియు నీప్రపంచమున లేదు.

అద్య యే మహతాం మూర్ధ్ని తే దినైర్నిపతన్త్యధః
హతచిత్తమహత్తాయాం కైషా విశ్వస్తతా బత. 15

నేడు మహామహుల శిరంబుల నలంకరించినవే కొలదికాలములో యధఃపతనమును బొందుచున్నవి. కాన నశ్వరమగు యీచిత్తముయొక్క మహత్వమందు, అనగా రాజ్యాదివిభవమందు యేలవిశ్వాసము గల్గును?

అరజ్జురేవ బద్ధోఽహమపంకోఽస్మి కలంకితః
పతితోఽస్మ్యుపరిస్థోఽపి హా మమాత్మన్హతాస్థితిః. 16

ఆహా! త్రాడులేకయే నేను బంధింపబడితిని. పంకములేకయే కళంకితుఁడనైతిని. సర్వోపరిస్థానమందున్నను క్రిందబడితిని, హా! నాయాత్మస్థితి నశించినది!

కస్మాదకస్మాన్మోహోఽయమాగతో ధీమతోఽపి మే
ఘనసితః పిహితాలోకో భాస్కరాగ్రమివాంబుదః, 17

ధీమంతుడనైనప్పటికి సమ్ముఖమునయున్నదై సూర్యప్రకాశము నాచ్ఛాదించు కాలమేఘ
మువలె నన్నీ మోహమేల యావరించినది ?

కఇమేమేమహాభోగాః కఇమేమమబాంధవాః
బాలోభూతమయేనేవ సంకేతేనాహమాకులః. 18

ఈ నా మహాభోగములేమి ? ఈ నా బాంధవులెవరు ? ఆహా ! బాలునివలె వ్యర్థము
మగు స్వకల్పనచే నేను వ్యాకులుఁడనగుచున్నాను.

స్వయమేవనిబధ్నామి జరామరణరాగిణీమ్
కిమిమామహమేతేషు ధృతిముద్వేగకారిణీమ్. 19

జరామరణముల గలుగజేయునదియు భయదాయకమునగు భోగాదులందలి విశ్వాసము
నే నేల స్వయముగ కల్పించుకొనుచున్నాను ?

యాతుతిష్ఠతువాసమ్యఙ్నైతాంప్రతికోగ్రహః
బుద్బుదశ్రీరివైషాహి మిథ్యైవేత్థముపస్థితా. 20

ధనబాంధవాది యీ నాసంపదలు పోవుగాక లేక వృద్ధినొందుగాక ! వీనితో నాకేమి?
ఏలన, జలమందలి బుద్బుదములవలె యీసంపదలన్నియు మిథ్యారూపమున నే సంప్రాప్తమైనవి.

తేమహావిభవాభోగాస్తే సన్తఃస్నిగ్ధబాంధవాః
సర్వం స్మృతిపథంప్రాప్తం వర్తమానేఽపికాధృతిః. 21

చక్రవర్తుల యామహాభోగములు ఉత్తమగుణసంపన్నమగు వారి యా బంధుగణము
యిపుడు కేవలము నామమాత్రావశిష్టమైనది, అట్టిచో వర్తమానకాలమందును విశ్వాసమేల ?

క్వధనానిమహీపానాం బ్రహ్మణఃక్వజగన్తివా
ప్రాక్తనానిప్రయాతాని కేయంవిశ్వస్తతామమ. 22

గొప్పగొప్పరాజుల ధనమంతయు నేమైనది? పూర్వపు బ్రహ్మదేవునిచే రచింపబడిన
యయ్యనేక బ్రహ్మాండము లిపుడెటకేగినవి ? ఇఁక నీ ధనాదులందు నాకేలయపేక్ష ?

గలితానీంద్రలక్షాణి బుద్బుదానీవవారిణి
మాంజీవితనిబద్ధాస్థం విహసిష్యన్తిసాధవః. 23

జలము బుద్బుదములను తనయందు లయమొనర్చుకొనునట్లు లక్షలకొలది యింద్రులను
కాలుడు మ్రింగివైచెను. అట్లుండ యీ నా స్వల్పజీవితమునందు నపేక్షగలిగియున్నచో
విజ్ఞులు హసింపకుందురా ?

బ్రహ్మణాంకోటయోయాతా గతాఃసర్గపరంపరాః
ప్రయాతాఃపాంసువద్భూపాః కాధృతిర్మమజీవితే. 24

అనంతకోటి బ్రహ్మదేవులు గతించిరి; అనేక సృష్టిపరంపరలు గడచినవి; ధూళికణముల
వలె యెందఱో రాజులువినష్టమైరి; ఇఁక యీ నాజీవితమందాశయేల ?



సంసారరాత్రిదుఃస్వప్నే చేత్యేదేహమయేభ్రమే
ఆస్థాంచేదనుబధ్నామి తత్రేమాంతుధిగస్థితిమ్. 25

సంసారమను రాత్రియందలి దుష్టస్వప్నమును, దేహాదిభ్రమరూపమునగు ఈ ప్రపంచ
మున నేనపేక్షగల్గియున్నచో, అట్టి నా యవివేకమునకు ధిక్కారమగును గాత !

అయంసోఽహమితివ్యర్థ కల్పనాఽసత్స్వరూపిణీ
అహంకారపిశాచేన కిమజ్ఞవదహంస్థితః. 26

పుత్రధనాదులు, దేహాత్మబుద్ధి మున్నగు కల్పనలు వ్యర్థములు, అసత్స్వరూపములునగును.
నేనీ యహంకారమను పిశాచముతోఁగూడి యజ్ఞునివలె యేలనుంటిని ?

హతంహతమిదంకస్మాదాయురాతతయానయా
పశ్యన్నపినపశ్యామి సూక్ష్మయా కాలలేఖయా. 27

క్షణ నిమిష ముహూర్తాది రూపమగు సూక్ష్మకాలముచే ఆయువు క్షణక్షణమును
విచ్ఛిన్నమగుట గాంచియు నేనేల విచారించుటలేదు?

పాదపీఠేకృతేశానాః శార్ఙ్గిక్రీడనకన్దుకాః
కాలకాపాలికాగ్రస్తాః కిమాస్థేమయివల్గసి. 28

దేనిచే బ్రహ్మాదులున్ను బ్రహ్మాండాసనమున ప్రతిమలవలె గావింపబడిరో, విష్ణ్వాదు
లెద్దానిచే క్రీడాకందుకమువలె యాకసమున యుద్ధాదివ్యవహారములందు ప్రవర్తింపజేయబడిరో,
ఎయ్యది మహారుద్రులఁగూడ భక్షించివైచెనో అట్టి కల్పరూపమైనకాలమందు యో జీవితాశా!
నీవేల నాయెదుట విజృంభించుచుంటివి ?

అజస్రముపయాన్త్యేతే యాన్తిచాద్యాపివాసరాః
అవినష్టైకసద్వస్తుర్దృష్టోనాద్యాపివాసరః 29

దినములు నిరంతరము వచ్చుచున్నవి, పోవుచున్నవి. కాని దోషరహితమగు ఆనంద
రూపమైన సద్వస్తువు లభించిన దినమొక్కటేని నేటివఱకు జూడలేదు.

సారసాఃసరసీవైతే సర్వస్మింజనచేతసి
భోగాప్రవస్ఫురంత్యన్తర్నతుస్వపదదృష్టయః. 30

తటాకమున సారసపక్షులవలె ప్రాణులచిత్తమందు భోగాశలే స్ఫురించుచున్నవి గాని
ఆత్మసాక్షాత్కారముగాదు.

కష్టాత్కష్టతరంప్రాప్తో దుఃఖాద్దుఃఖతరంగతః
అద్యాపినవిరక్తోఽస్మి హాధిఙ్మామధమాశయమ్. 31

అల్పకష్టమునుండి యధికకష్టమును, అల్పదుఃఖమునుండి యధికదుఃఖమును బ్రాప్తినొంది
నను ఇంతవఱకీ సంసారమునెడ విరక్తుఁడనుగాకయుంటిని. హా ! అధమచిత్తుఁడనగు యీ నాకు
ధిక్కారమగుగాత !

యేషు యేషు దృఢాబద్ధా భావనా భవ్యవస్తుషు
తాని తాని వినష్టాని దృష్టాని కిమిహోత్తమమ్. 32

ఏయే రమణీయపదార్థములందు నేను దృఢమగు ప్రీతిగల్గియుంటినో యవన్నియు నశించినవి. ఇంక నీప్రపంచమున చిరస్థాయియగు వస్తువెద్దిగలదో వచింపుము ?

యన్మధ్యే యచ్చ పర్యన్తే యదాపాతే మనోరమమ్
సర్వమేవాపవిత్రం తద్వినాశామేధ్యదూషితమ్. 33

మధ్యకాలమున రమణీయమగు పయస్సును, అంతమున రమణీయమగు యాగాదులను అవిచారముచే రమణీయమగు విషయాదులను, వినాశమను మాలిన్యముచే దూషితములు గాన యపవిత్రములే యగును.

యేషు యేషు పదార్థేషు ధృతిం బధ్నాతి మానవః
తేషు తేష్వేవ తస్యాయం దృష్టో నాశోదయో భృశమ్. 34

ఏయే పదార్థములందు మనుజుడు తనవిశ్వాసమును బంధించుకొనుచున్నాడో ఆయా పదార్థములందు తరచు దుఃఖమే వానికి గల్గుచుండుట గాంచుచున్నారము.

శ్వః శ్వః పాపీయసీమేష శ్వః శ్వః క్రూరతరామపి
శ్వః శ్వః ఖేదకరీమేతి దశామిహ జడో జనః. 35

జడస్వభావులగు జీవులీప్రపంచమున లోభాదులతోఁగూడి ప్రతిదినమును అధిక పాపయుతమును, అధికక్రూరత్వసహితమును, అధిక దుఃఖజనకమునగు స్థితిని బొందుచున్నారు.

అజ్ఞానైకహతో బాల్యే యౌవనే మదనాహతః
శేషే కలత్రచిన్తార్తః కిం కరోతి కదా జడః. 36

జడస్వభావులగు యాజీవులు బాల్యకాలమున యజ్ఞానముచేతను, యౌవనమున మన్మథుని చేతను, వార్ధక్యమున కుటుంబచింతచేతను పీడితులగుచున్నారు. ఇక యెప్పుడు తమ్ముల నుద్ధరించుకొనుటకు యత్నించెదరు ?

ఆగమాపాయివిరసం దశావైషమ్యదూషితమ్
అసారసారం సంసారం కిం తత్పశ్యతి దుర్మతిః. 37

ఆద్యంతములం దసద్రూపమును, భోగకాలమందు విరసమును, దారిద్ర్య రోగ వార్ధక్యాదులచే దూషితమును, అసారమైనను సారయుతముగ నెంచబడునదియునగు యీ సంసారమును దుర్బుద్ధి యేల వీక్షించుచున్నాడు ?

రాజసూయాశ్వమేధాద్యై రిష్ట్వా యజ్ఞశతైరపి
మహాకల్పాన్తమప్యంశం స్వర్గం ప్రాప్నోతి నాధికమ్. 38

రాజసూయాశ్వమేధాది అనేక యజ్ఞములఁ జేయుటచేగూడ బ్రహ్మాదులకు మహాకాలమందలి క్షణమాత్రరూపమేయగు స్వర్గమే ప్రాప్తించుచున్నది గాని అంతకంటె యధికముగ నొకటియు కాదుగదా !



కోఽసౌ స్వర్గోఽస్తి భూమౌ వా పాతాలే వా ప్రదేశకః
న యత్రాభిభవన్త్యేతా దుర్భ్రమర్య ఇవాపదః. 39

ఇక ఆపదయను దుష్టభ్రమరము పీడింపని స్వర్గప్రదేశము భూమిపైగాని పాతాళమునగాని యుండగలదు ? (అనగా స్వర్గమందును యసురాదులబాధచే దుఃఖముగలుగుననుట.)

నిజచేతోబిలవ్యాలాః శరీరస్థలపల్లవాః
ఆధయో వ్యాధయశ్చైతే నివార్యన్తే కథం కిల. 40

స్వచిత్తమనుబిలమందలి సర్పములును, శరీరమను భూమిపైని పత్రములునగు శారీరమానసిక వ్యాధు లెట్లు నివారింపబడును ?

సతోఽసత్తా స్థితా మూర్ధ్ని మూర్ధ్ని రమ్యేష్వరమ్యతా
సుఖేషు మూర్ధ్ని దుఃఖాని కిమేకం సంశ్రయామ్యహమ్. 41

ఈవర్తమాన జగంబుయొక్క శిరముపై నాశమవశ్యము నెలకొనియున్నది. మఱియు రమణీయవస్తువులయం దరమ్యత్వమును, సుఖములయందు దుఃఖములును వ్యవస్థితములై యున్నవి. అట్టిచో నిర్దుఃఖమగు దేనిని నేనాశ్రయించెదను.

జాయన్తే చ మ్రియన్తే చ ప్రాకృతాః క్షుద్రజన్తవః
ధరాన్తైరేవ నీరన్ధ్రా దుర్లభాః సాధుసాధవః. 42

ప్రాకృతస్వభావులగు క్షుద్రజీవులనేకులు జన్మించుచున్నారు, మరణించుచున్నారు. అట్టివారిచే నీజగత్తు పరిపూర్ణమైయున్నది గాని యుత్తములగు మహాత్ములిట మిగులనరుదుగనున్నారు.

నీలోత్పలాలినయనాః పరమప్రేమభూషణాః
హాస్యాయైవ విలాసిన్యః క్షణభంగితయా స్థితాః. 43

నల్లకలువలవంటి తుమ్మెదలఁబోలిన నేత్రములుగలవారు, ప్రేమాధిక్యమను యాభూషణముల ధరించినవారునగు విలాసినులు క్షణభంగురత్వకారణముచే కేవలము హాస్యాపాత్రులేయగుదురు.

యేషాం నిమేషణోన్మేషౌ జగతాం ప్రలయోదయౌ
తాదృశాః పురుషాః సన్తి మాదృశాం గణనైవ కా. 44

ఎవరు కనుతెరయుటచే జగంబులుద్భవించుచు, కనుమూయుటచే విలయమునొందుచునుండునో యట్టి మహామహులుగూడ నశింప, నిక యస్మదాదులఁగూర్చి వచింపనేల ?

సుస్థిరరమ్యతరాద్రమ్యాః సుస్థిరాదపి సుస్థిరాః
చిన్తాపర్యవసానేయం పదార్థశ్రీః కిమీహసే. 45

మిక్కిలి రమణీయములును స్థిరములునగు పదార్థములుగలవు కాని వాటన్నింటియొక్క పర్యవసానము ఆర్జన రక్షణ వియోగాదులచే చింతాదాయకమేయగును. అట్టిచో నోచిత్తమా ! వానినింకను నీవేల యాశించుచుంటివి ?

సంపదశ్చ విచిత్రా యాస్తాశ్చేచ్చిత్తేన సంయతాః
తత్తా అపి మహారంభా హన్తమన్యే మహాపదః. 46

విచిత్రములైన యనేక సంపదలను చిత్తమత్యధికముగ దలంచినను, నశ్వరత్వకారణముచే వాటిని మహాయాపదరూపముగనే నేనెంచుచున్నాను.

ఆపదోఽపివిచిత్రా యాస్తాశ్చేన్మనసిసంమతాః
తత్తాఅపిమహారంభా మన్యేమనసిసంపదః. 47

దారిద్ర్యబంధువినాశాది యాపదలు సాధుసంగతీర్థసేవాదులకు కారణమై వివేకవైరాగ్యాదులకు సాధనభూతములగుటచే వాటిని సంపదలుగనే నేనుభావించుచున్నాను.

మనోమాత్రవివర్తేఽస్మిం జగత్యబ్ధీన్దుభంగురే
మమేదమిత్యపూర్వోఽయం కుతస్త్యోఽక్షరమాలికా. 48

సముద్రమందు ప్రతిబింబించిన చంద్రునివలె క్షణభంగురమును మనస్సుయొక్క వివర్తమాత్రమునునగు యీ జగత్తునందు 'నేను' 'నాది' యున్నగువాక్యసముదాయ మెటనుండివచ్చినది ? (అనగా నయ్యది నిరర్థకమనిభావము.)

కాకతాలీయయోగేన సంపన్నాయాంజగత్స్థితౌ
ధూర్తేనకల్పితావ్యర్థం హేయోపాదేయభావనా. 49

కాకతాళీయయోగమున ప్రాప్తించిన ఈ జగత్స్థితియందు భోగాశాయుక్తమగు మనస్సు త్యాజ్యగ్రాహ్యభావనను వ్యర్థముగ కల్పనయొనర్చినది.

ఇయత్తాచ్ఛిన్నతప్తాసు సుఖనామ్నీషుదృష్టిషు
కాస్వేతాస్వనురక్తోఽస్మి పతంగోఽగ్నిశిఖాస్వివ. 50

దేశకాలవస్తువులచే పరిచ్ఛిన్నమై త్రివిధతాపములచే సంతప్తమైన యగ్నిశిఖవంటి యీ సాంసారికదశలందు పతంగమువలె నే నేలయనురక్తుఁడనైయుంటిని ?

వరమేకాన్తదాహేషు లుఠనం రౌరవాగ్నిషు
నత్వాలూనవివర్తాసు స్థితంసంసారవృత్తిషు. 51

అగ్నియందుపడి భస్మమగుట మేలు. రౌరవ నరకమునబడి ద్రొళ్లుట మేలు. కాని సుఖదుఃఖరూపమగు యీ సంసారదశయందుండుట యుత్తమముగానేరదు.

సంసారపదదుఃఖానాం సీమాన్త ఇవకథ్యతే
తన్మధ్యపతితే దేహే సుఖమాసాద్యతే కథమ్. 52

సంసారమే సర్వదుఃఖములకును యాకరము. దానియందుపడిన జీవునకిక సుఖమెట్లు కలుగును ?

అకృత్రిమమహాదుఃఖే సంసారే యేన్యవస్థితాః
తపతేఽన్యాసిదుఃఖాని జానతేమధురాణ్యలమ్. 53

అధికదుఃఖముగలవారు అల్పదుఃఖములను సుఖరూపములుగ దలంచునట్లు, పరిణామమున దుఃఖప్రదమైనవాటినిగూడ జీవుడు సుఖవంతముగనే తలంచుచున్నాడు.

అహామహ్యధమోత్కృష్ట కాష్ఠలోష్టసమస్థితిః
అజ్ఞైరేవాగతఃసామ్యం పరమోమ్నృష్టవస్తుభిః. 54



ఆహా ! అధములును కాష్ఠశిలాదులవంటి జడస్థితిగలవారునగు యజ్ఞులవలె నేనున్నూ విచారహీనుఁడనైతినిగదా !

సహస్రాంకురశాఖాత్మ ఫలపల్లవశాలినః
అస్యసంసారవృక్షస్య మనోమూలమహాంకురః. 55

పలువిధసంకల్పములే యంకురములగను, బ్రహ్మాండములే శాఖలుగను, విరాట్పురుషుడే శాఖాద్యవయవములుగను, సుఖదుఃఖములే ఫలములుగను, రాగలోభాదులే పల్లవములుగను గల్గి శోభాయమానమైయున్న యీ విశాల సంసారవృక్షమునకు మూలము మనస్సేయగును.

సంకల్పమేవతన్మన్యే సంకల్పోపశమేనతత్
శోషయామియథాశోష మేతిసంసారపాదపః. 56

సంకల్పమే యీ మనస్సని నేనెంచెద. కాన సంకల్పోపశమనముచే నేనీసంసారవృక్షమును శోషింపచేసెదను. ఇక నయ్యది మఱల యెట్లంకురించునో చూచెద !

ఆకారమాత్రరమ్యాసు మనోమర్కటవృత్తిషు
పరిజ్ఞాతాస్విహాద్యైవ నరమేనాశనీష్వహమ్. 57

ఆకారమాత్రముచే రమణీయములును, మనస్సను వానరముతోగూడి చపలత్వముగలవియు, నాశవంతములునగు యీ సాంసారికవృత్తులందు నేనిక రమింపను.

ఆశాపాశశతప్రోతాః పాతోత్పాతోపపాదపాః
సంసారవృత్తయోభుక్తా ఇదానీం విశ్రమామ్యహమ్. 58

పలువిధ యాశాపాశసహితములును, నిమ్నోన్నతగతియుక్తములును, దుఃఖప్రదములునగు యీ సాంసారిక వృత్తులను నేనింతవఱకు లెస్సగ యనుభవించితిని. ఇక నిపుడు విశ్రాంతిఁజెందెద.

హాహతోఽస్మివినష్టోఽస్మి మృతోఽస్మీతిపునఃపునః
శోచితంగతమేవాహ మిదానీంనానురోదిమి. 59

'హా! చంపబడితిని, నశించితిన'ని ఇట్లు పరితాపముఁజెందు సమయమిపుడు గతించినది. ఇక నీసాంసారిక వస్తువులకై నేనుదుఃఖింపను.

ప్రబుద్ధోఽస్మిప్రహృష్టోఽస్మి దృష్టశ్చోరోఽయమాత్మనః
మనోనామనిహన్మ్యేనం మనసాస్మిచిరంహతః. 60

నేనిపుడు ప్రబుద్ధుడనైతిని. ప్రసన్నుడనైతిని. పారమార్థికధనమగు యాత్మ నపహరించునట్టి చోరుని గనుఁగొంటిని. ఆతఁడీమనస్సే. ఆతఁడు చోరుడేకాదు, శత్రువుకూడనగును. ఏలన వీనిచే నేను చిరకాలము పీడింపబడితిని. ఇక నేనే వీనిని పీడించెద.

ఏతావన్తమిమంకాలం మనోముక్తాఫలంమమ
అవిద్ధమాసీదధునా విద్ధంతుగుణమర్హతి. 61

ఇంతవఱకు ఈ నామనస్సను ముత్యము అచ్ఛిద్రితమై (లక్ష్యభూతముగాక) యుండెను. కాని యిపుడయ్యది ఛిద్రితమైనది గాన గుణ (సూత్ర) యోగ్యమై యొప్పుచున్నది.

మనస్తుషారకణికా వివేకార్కాతపేన మే
చిరప్రవృత్తయేనూనం మచిరాల్లయమేష్యతి. 62

ఇక నామనస్సను మంచుబిందువు వివేకసూర్యతాపప్రభావమున అనాదిబ్రహ్మతత్వమున ప్రతిష్ఠింపబడి చిరకాలము ప్రశమమున నొందగలదు.

వివిధైః సాధుభిః సిద్ధైరహం సాధుప్రబోధితః
అత్మానమనుగచ్ఛామి పరమానందసాధనమ్. 63

సాధువులచేతను, మహాత్ములగు సిద్ధపురుషులచేతను పలువిధముల యుపదేశమునొందిన నేనిక నిరతిశయానందమునకు సాధనభూతమగు పరబ్రహ్మమును శరణుజొచ్చుచున్నాను.

ఆత్మానంమణిమేకాన్తే లబ్ధ్వైనాలోకయన్సుఖమ్
తిష్ఠామ్యస్తమితాన్యేహః శరదీవాచలేఽమ్బుదః. 64

ఆత్మయను మణినిపొంది దానినే సందర్శించుచు (ధ్యానించుచు) అన్యక్రియలనువిడనాడి హిమాలయాది పర్వతములపై మేఘమువలె యేకాంతమున సుఖముగనుండెద.

అయమహమిదమాతతం మమేతి
స్ఫురితమపాస్య బలాదసత్యమన్తః
రిపుమతిబలినం మనోనిహత్య
ప్రశమముపైతి నమోఽస్తు తే వివేక. 65

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే జనకవితర్కోనామ
నవమః సర్గః ॥ 9 ॥

'ఈదేహమే నేను' 'ఈరాజ్యాదులు నావి' యను నీమున్నగు యసత్యసంకల్పములను బలాత్కారముగ పారద్రోలి మిగుల బలవత్తరమగు మనస్సనుశత్రువును వధించి వివేకముద్వారా సప్తమభూమికారూపమైన పరమశాంతియందు స్థితినిబడసెద. కాన యట్టి నో వివేకమా! నీకు నమస్కారము.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
జనకవితర్కమను తొమ్మిదవ సర్గము ॥ 9 ॥

---

## దశమః సర్గః.

---

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

ఇతిచిన్తయతస్తస్య పురఃసంప్రవివేశహ
ప్రతీహారః పరోభానోః స్యన్దనాగ్రఇవారుణః. 1



శ్రీ వసిష్ఠుడు :—ఓ రామా! ఇట్లు చింతనజేయుచున్న జనకునివద్దకపుడు సూర్యరథసమీపమునకు అరుణునివలె ద్వారపాలకుడేతెంచెను.

ప్రతీహార ఉవాచ :—

దేవదోఃస్తంభవిశ్రాన్త సమస్తవసుధాభర
సంపాదయోత్తిష్ఠ దినవ్యాపారంనృపతోచితమ్. 2

ఏతాఃకుసుమకర్పూర కుంకుమాంబుఘటాఃస్త్రియః
స్నానభూమావాస్థితాః సజ్జానద్యోమూర్తియుతాఇవ. 3

ఏతాఃకమలకల్హార కాననభ్రాన్తషట్పదాః
కృతాఃకమలినీపాశ రచితాంశుకమండపాః. 4

ఏతాఃకమలినీతీర భువశ్ఛత్రైఃప్రపూరితాః
సచామరరథేభాశ్వైః స్నానావసరసేవినామ్. 5

సమగ్రసుమనఃపూర్ణై రత్నౌషధిపరిప్లుతైః
సజ్జీకృతాఃపటలకైర్దేవార్చనగృహాస్తథా. 6

స్నాతఃపవిత్రహస్తశ్చ పరిజప్యాఘమర్షణః
త్వామేవప్రేక్షతేదేవ దక్షిణార్హోద్విజవ్రజః. 7

లసచ్చామరహస్తాభిః పాల్యతేపరమేశ్వర
సజ్జీకృతాస్తేకాన్తాభిః శీతాభోజనభూమయః. 8

శీఘ్రముత్తిష్ఠభద్రం తే నియుతంకార్యమాచర
నకాలమతివర్తన్తే మహాన్తఃస్వేషుకర్మసు. 9

ద్వారపాలకుడు:—తమ భుజద్వయముపై సమస్తభూభారమును వహించునోరాజా! లెమ్ము? రాజోచిత వ్యవహారములజేయుము. పుష్ప కర్పూర కుంకుమయుక్తజల ఘటంబులంగొని మూర్తిమంతములగు నదులవోలె స్నానభూమియందు స్త్రీలు సుసజ్జితులైయున్నారు. శ్వేతరక్తకమలములును భ్రమరసమూహములునుయున్న వనమున కమలతంతువులచే నలుపైపుల సువర్ణజటిత వస్త్రములతోగూడిన మండపములు నిర్మింపబడినవి. స్నానసమయమున సేవయొనర్పుటకై చామర రథగజాశ్వసహితులైయున్న జనులతోను ఛత్రములతోడను నాప్రదేశము ప్రపూర్ణమైయలరుచున్నయది. పలువిధ పుష్ప పక్వాన్నాదులును ఉత్తమప్రాంత భాగములునుగల్గిన తమ దేవతార్చన గృహములు సుసజ్జితములైయున్నవి. స్నానమొనర్చి పవిత్రహస్తులై అఘమర్షణమంత్రమును జపించుచు దక్షిణార్హులగు ద్విజప్రముఖులు తమరాకకై నిరీక్షించుచున్నారు. దేవా! ఉత్తమ చామరములధరించిన స్త్రీలతోగూడి లేపనచందన మాలాదులచే నతిశీతలమొనర్పబడినవై తమ భోజనగృహములు సజ్జితములై వెలయుచున్నవి. తమకు శుభమగుగాత! దేవా! వేగిరము లెమ్ము. నియతములగు సంధ్యావందనాది కృత్యములనాచరింపుము. మహాత్ములు తమకార్యములందెన్నటికి సమయ మతిక్రమించి వర్తింపరుగదా.

ప్రతీహారపతావిత్థ ముక్తవత్యథపార్థివః
తథైవచిన్తయామాస చిత్రాంసంసారసంస్థితిమ్. 10

ద్వారపాలకుఁడు తనప్రభువున కిట్లు వచించుచుండ జనకుఁడు విచిత్రజగత్స్థితినిగూర్చి యివ్విధమున పర్యాలోచించెను.

కియన్మాత్రమిదంనామ రాజ్యంసుఖమితిస్థితమ్
నప్రయోజనమేతేన మమేహాక్షణభంగినా. 11
సర్వమేవపరిత్యజ్య మిథ్యాశంబరడంబరమ్
ఏకాన్తఏవతిష్ఠామి సంశాన్తఇవవారిధిః. 12
అలమేభిరసత్ప్రాయై ర్గమభోగవిజృంభితైః
త్యక్త్వాసర్వాణికర్మాణి సుఖం తిష్ఠామికేవలమ్. 13
చిత్తచాతుర్యమేతస్మా ద్భోగాభ్యాసకుసంభ్రమాత్
త్యజజన్మజరాజాడ్య జాలజంబాలశాన్తయే. 14
దశాసుస్వాసుయాస్వేవ సంభ్రమంచిత్తపశ్యసి
తాభ్యఏవాభిరచితం పరమందుఃఖమేష్యసి. 15
ప్రవృత్తంసన్నివృత్తం సద్భూయోభూయశ్చిరంచిరమ్
భోగభూమిషుసర్వాసు చింత్తితృప్తింనగచ్ఛతి. 16
తస్మాత్పాపాలమనయా తుచ్ఛయాభోగచిన్తయా
భవత్యకృత్రిమాతృప్తి ర్యేనాభిపతితంతతః. 17

ఈరాజ్యమేమి? ఈసుఖమేమి? క్షణభంగురమైన యీరాజ్యసుఖముతో నాకిప్పుడేమంతైన ప్రయోజనములేదు. మృగతృష్ణాజలమువలె మిథ్యయగు యీ సంసారమంతయును పరిత్యజించి శాంతసముద్రమువలె నేనేకాంతమున వసించెదను. అసద్రూపములగు యీ భోగములచే నాకేమి ప్రయోజనము? కావున సర్వకర్మలను త్యజించి కేవలము సుఖ (బ్రహ్మ) రూపమున నుండెద. ఓ చిత్తమా! జన్మజరామరణజడత్వరూపమగు పంకము శమించు నిమిత్తము, విషయభోగము లందు సుఖలేశము నాస్వాదించు నీచాతుర్యమును విడనాడుము. మఱియు నోచిత్తమా! భ్రాంతిచే నీవీ ప్రాపంచిక స్థితులందు సుఖము నవలోకించుచున్నావుగాని వానిచే యపారదుఃఖమే నీకు సంప్రాప్తము కాగలదు. చిరకాలము భోగములందు ప్రవృత్తిగల్గియున్నను, లేక భోగశక్తి క్షీణించుటచే లోకశాస్త్రాదుల భయముచే వానినుండి నివృత్తి జెందినను నీవు తృప్తిఁబడయకున్నావు. ఓ దుష్టచిత్తమా! తుచ్ఛమగు యీ భోగాశచే నీకు కొంచమైనను ప్రయోజనములేదు. అందుచే నకృత్రిమమగు తృప్తి యెద్దానిచే లభించునో దాని (బ్రహ్మవిచారము) నై పునకే మరలుము.

ఇతిసంచిన్త్యజనక స్తూష్ణీమేవబభూవహ
శాన్తచాపలచేతస్త్వా ల్లిపికర్మార్పితోపమః. 18
ప్రతీహారోఽపినోవాచ గౌరవేణభయేనచ
పునర్వాక్యంమహీపానాం చిత్తవృత్తిషుశిక్షితః. 19



తూష్ణీమథక్షణంస్థిత్వా జనకో జనజీవితమ్
పునఃసంచిన్తయామాస మనసా శమశాలినా. 20

ఓ రామా! ఇట్లు విచారించినపిదప చపలమగు తనచిత్తము శమించుటచే చిత్రమువోలె జనకుడు మౌనస్థుడయ్యెను. రాజుల చిత్తవృత్తుల నెఱుంగ సమర్థుఁడగు నాద్వారపాలకుఁడంత భయ గౌరవములచే నేమియు బల్కకుండెను. పిమ్మట జనకుఁడొక్కక్షణకాలము తూష్ణీభూతుఁడై మఱల శాంతచిత్తముతో ప్రాణికోట్ల జీవిత నిదానమునుగూర్చి యిట్లు చింతన సేయదొడగెను.

కిముపాదేయమస్తీహ యత్నాత్సంసాధయామ్యహమ్
కస్మిన్వస్తునిబధ్నామి ధృతింనాశవివర్జితే. 21
కింమేక్రియాపరతయా కింమేనిష్క్రియయాపవా
నతదస్తివినాశేన వర్జితం యత్కిలోదితమ్. 22
క్రియావానక్రియోవాస్తు కాయోఽయమసదుత్థితః
సమస్థితస్యశుద్ధస్య చితఃకానామమేక్షతిః. 23
నాభివాంఛామ్యసంప్రాప్తం సంప్రాప్తంనత్యజామ్యహమ్
స్వస్థఆత్మనితిష్ఠామి యన్మమాస్తితదస్తుమే. 24

గ్రహింపదగినవస్తువెది? దేని నేను ప్రయత్నముచే సాధింపవలెను? నాశరహితమగు యే పదార్థమందు నేను నా విశ్వాసము బంధించుకొందును? క్రియాశీలత్వముచేగాని నిష్క్రియాత్వముచేగాని నాకేమిప్రయోజనము? ఏలన, యుత్పన్నమైన ప్రతివస్తువు వినాశమొందుచునేయున్నది. అసద్రూపమున నావిర్భవించిన ఈ శరీరము క్రియాయుక్తమైనను, క్రియారహితమైనను, ఉభయావస్థలందును సమరూపమున స్థితిగల్గియుండు శుద్ధచైతన్యరూపమగు నాకు హాని యేమి? ప్రాప్తింపనిదానిని నేగోరుటలేదు; ప్రాప్తించినదానిని త్యజించుటయులేదు; స్వస్థరూపమున ఆత్మయందు నిలకొనియున్నాను. అభ్యంతర నిరతిశయానందము (లేక ప్రారబ్ధముచే సంప్రాప్తమైనది) యెద్దిగలదో అదియే నాదియగును గాని యన్యముగాదు.

నమమేహకృతేనార్థో నాకృతేనేహకశ్చన
క్రియయాఽక్రియయావాపి యత్ప్రాప్తంతదసన్మయమ్. 25
అనుద్వతఃకుర్వతోవా యుక్తాయుక్తాఃక్రియామమ
నాభివాంఛితమస్తీహ యదుపాదేయతాంగతమ్. 26
తదుత్థాయక్రమప్రాప్తాం కాయోఽయం ప్రకృతాంక్రియామ్
కరోత్వస్పస్థితాజ్ఞస్తు కిమయంసాధుశుష్యతి. 27
స్థితేమనసినిష్కామే సమేవిగతరంజనే
కాయావయవజాకార్యా స్పన్దాస్పన్దౌఘలేసమా. 28
కర్మజానుఫలశ్రీషు మనసాకర్తృభోక్తృతే
తస్మిన్ప్రశాన్తిమాయాతే కృతమప్యకృతంనృణామ్. 29

యోనిశ్చయోఽన్తః పురుషస్యరూఢః
క్రియాస్వసౌ తన్మయతాముపైతి
అనామయంమే పదమాహతాధీ
రధీరతామస్తరలం త్యజామి. 30

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే జనకనిశ్చయోనామ
దశమః సర్గః ॥ 10 ॥

కార్యముల నొనర్చుటచేగాని, యొనర్పకుండుటచేగాని, నాకిక యేమియు ప్రయోజనము లేదు. క్రియాశక్తులచే ప్రాప్తించినదెల్ల మిథ్యయు దుఃఖరూపమునగును. శాస్త్రవిహితములును లౌకికములునగు క్రియలఁజేయుటచేగాని చేయకుండుటచేగాని ప్రాప్తించునట్టి వాంఛితవస్తువెద్దియు నాకులేదు. కాన క్రమానుసారము ప్రాప్తించిన క్రియలను యీ నాశరీరముచేయుగాక. ఏలన, చేష్టారహితమై నియ్యది శుష్కించిన నేమి ప్రయోజనము ? ఆసక్తిరహితమై సమరూపమున నిలకొనియుండునపుడు దేహోత్పన్నమగు క్రియాక్రియారూప ప్రారబ్ధముయొక్క పుణ్యపాపానుదయమును ఫలమున్ను సమానమేయగును. కర్మమందలి కర్తృత్వ భోక్తృత్వములు రెండును మనఃకల్పితములేగాన నయ్యవి శమించిన నికమనుజునిచే చేయబడు కార్యములన్నియు యథార్థముగ చేయబడనివేయగును. కర్తృత్వభోక్తృత్వవిషయమై మనుజుని యంతఃకరణమున యెట్టినిశ్చయము రూఢిపడియుండునో దేహాది సమస్తక్రియలందును యాతడద్దానిరూపమునే జెందుచుండును. ఇపుడు నా బుద్ధి కర్తృత్వ భోక్తృత్వమను వ్యాధిలేనిదై ఆత్మపదమున దృఢనిశ్చయమును పొంది యున్నదిగాన యిష్టానిష్టముల ప్రాప్తివిఘాతములకు కారణభూతమగు యధీరత్వమును నేను పూర్ణముగ త్యజించివైచుచున్నాను.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
జనకనిశ్చయమను దశమ సర్గము ॥ 10 ॥

---

## ఏకాదశః సర్గః.

---

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

ఇతిసంచిన్త్యజనకో యథాప్రాప్తాంక్రియామసౌ
అసక్తఃకర్తుముత్తస్థౌ దినందినపతిర్యథా. 1

శ్రీవసిష్ఠుడు :— జనకుఁడిట్లు చింతనజేసి దినక్రియనొనర్చు సూర్యునివలె ప్రాప్తించిన కార్యముల ననక్తుఁడై యాచరించుచుండెను.

ఇష్టానిష్టాఃపరిత్యజ్య చేతసా వాసనాఃస్వయమ్
యథాప్రాప్తంచకారాసౌ జాగ్రత్యేవసుషుప్తవత్. 2



ఇష్టానిష్టవాసనలను చిత్తమునుండి పారద్రోలి జాగ్రద్దశయందే సుషుప్తియందున్నవానివలెనుండి ప్రాప్తించిన క్రియలఁజేయుచుండెను.

సంపాద్యతదహఃకార్య మార్యావర్జనపూర్వకమ్
అనయచ్ఛర్వరీమేక స్తస్యైవధ్యానలీలయా. 3

పూజ్యులగు దేవబ్రాహ్మణాదులఁ బూజించుట మున్నగు దైనికకార్యములను పూర్తిగాఁ జేసికొని యేకాంతముననే యాతఁడా రాత్రి ధ్యానమందు గడపెను.

మనఃసమరసంకృత్వా సంశాన్తవిషయభ్రమమ్
శర్వర్యాంక్షీయమాణాయా మిత్థంచిత్తమబోధయత్. 4

పిమ్మట తన శాంత మనమును యేకాగ్రమొనర్చి యా రాత్రిగడచిన మీదట చిత్తమునకీవిధమున ప్రబోధముగావించెను.

చిత్తచంచలసంసార ఆత్మనో నసుఖాయతే
శమమేహిశమచ్ఛాన్తం సుఖంసారమవాప్యతే. 5

యథాయథావికల్పౌఘా న్సంకల్పయసిహేలయా
తథాతథైతిస్ఫారత్వం సంసారస్తవచిన్తయా. 6

శతశాఖత్వమాయాతి సేకేనవిటపీయథా
అనన్తాధిత్వమాయాసి శఠభోగేచ్ఛయాతథా. 7

చిన్తాజాలవిలాసోత్థా జన్మసంసారసృష్టయః
తస్మాత్త్యక్త్వావిచిత్రాంత్వం చిన్తాముపశమంవ్రజ. 8

ఓ చిత్తమా ! ఈ చపలసంసారమాత్మకు సుఖమును గలిగింపజాలదు. కానసీవు శాంతమునొందుము. శాంతిచే విక్షేపరహితమగు ఉత్తమ ఆత్మసుఖము లభించును. నీవెవ్విధముగ సంకల్పములగావించెదవో ఆయారూపముననే యీసంసారము విశాలత్వముఁ జెందుచుండును. వృక్షమును జలముచే పోషించిన యనంతశాఖాయుతమగునట్లు యోదుష్టచిత్తమా ! నీవున్ను భోగేచ్ఛచే పలువిధ శారీరికమానసికవ్యథలఁ బొందుచుంటివి. విషయచింతనచేతనే జననమరణరూపమగు యీ సంసారమావిర్భవించుచున్నది, గాన నీవద్దానిని వీడి శాంతినొందుము.

సంసారసృష్టితరలా మిహాంతులయసుందర
అస్యాంచేత్సారమాప్నోషి తదేతామేవసంశ్రయ. 9

ఓ చిత్తమా ! చపలమగు యీ సంసారమును, శాంతి సుఖమును తులయందు తూచుము. (అనగా బుద్ధిచే నేదిశ్రేష్టమో పరీక్షింపుము.) సారవంతమనితోచిన సంసారముసే యాశ్రయింపుము.

ఆస్థాంయస్మాత్పరిత్యజ్య దృశ్యదర్శనలాలసాత్
మైతద్గ్రహాణమాముంచ స్వేచ్ఛయావిహరేచ్ఛయా. 10

ఈ సంసారమసారమైనది గాన దీనియందలి యాశను త్యజించివేయుము. మఱియు దృశ్యమందలియాసక్తిచే నద్దానిని గ్రహింపకయు, (దర్శనయోగ్యము కానేరదను) ద్వేషముచే త్యజింపకయునుండి, ఆత్మకాముఁడవై సాక్షిరూపమున స్థితిగల్గి పిమ్మట నీ యిచ్చవచ్చినట్లొనర్పుము.

ఇదందృశ్యమసత్సద్వా ప్యుదేత్వ స్తము పైతువా
సాధోవిషమతాంగచ్ఛ మైతదీయైర్గుణాగుణైః.  11

సాధువగునోచిత్తమా ! ఈదృశ్యము సత్యమైనను మిథ్యయైనను, దీనియొక్క గుణాగుణముల చే హర్షవిషాదరూపమగు వైషమ్యము నొందకుండుము.

మనాగపినసంబంధ స్తవదృశ్యేనవస్తునా
అవిద్యమానరూపేణ సంబంధఃకోఽయమీదృశః.  12

ఓ మనసా ! ఈ దృశ్యముతో నీకేమియును సంబంధములేదు. లేని వస్తువులోటి సంబంధమెట్లు పొసగును ?

అసత్త్వమేతచ్చసస ద్ద్వయో రేవాసతోఽసతోః
సంబంధఇతిచిత్రేయ మపూర్వైవాతురావలీ.  13

అసదేతత్తుసచ్చేత్త్వం తథాపికిలసుందర
సంగఃసదసతోఃకీదృ గ్వదత్వంమ ర్త్యజీవయోః.  14

చిత్తత్వమథదృశ్యంచ ద్వేఏవయదిసన్మయే
సదాస్థితేతత్ప్రసరః కుతోహర్షవిషాదయోః.  15

తస్మాన్మహాధింముంచత్వం మూకముల్లాసమాహర
సంక్షుబ్ధామ్బుధిమావిష్టాం త్యజాథవ్యామిమాంస్థితిమ్.  16

కన్దుకాలాతవద్వ్యర్థ మాత్మనైవపరిజ్వలన్
మామోహమలమాసాద్య మన్దతాంగచ్ఛసన్మతే.  17

నతదిహాస్తి సమున్నతము త్తమం
వ్రజసియేనపరాం పరిపూర్ణతామ్
తదవలంబ్య బలాదతిధీరతాం
జహిహిచంచలతాం శఠరేమనః.  18

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే చిత్తానుశాసనం నామైకాదశః
సర్గః ॥ 11 ॥

మనసా! నీవసద్రూపమేయగుదువు. దృశ్యమున్న సత్తుగాదు. అట్టిచో వంధ్యాపుత్ర ఆకాశపుష్పములవలె అసద్రూపములగు పదార్థములకు సంబంధముగలదనుట ఆశ్చర్యకరముగనున్నది. ఇక నీదృశ్యమసత్తనియు, నీవాత్మరూపముచే సత్తనియు వచింతుచో, అట్లయినను మృతజీవితులకు సంబంధమెట్లుగల్గును? పోనిమ్ము, నీవును దృశ్యజగత్తున్న సత్తనిన, యేకరూపమున రెంటునుసదాస్థితి గల్గియుండుటచే వియోగాభావముచే హర్షవిషాదములకు చోటెద్ది? కాన, (మానసిక) వ్యాధిరూపమును, కలుషితమును విక్షేపసహితమునగు ఈ సంసారమును త్యజించి సమాధ్యభ్యాసముచే శాంతరూపమగు ఆత్మయందు నిలుకడబొందుట కుత్సాహము గల్గియుండుము. ఓ సుమతీ ! కందుకమువలె గం



డమైనట్టి యాలాత చక్రము (కొఱవి) వలె స్వయముగ జ్వలించుచు మోహసహితమై మందత్వమెన్నటికి బ్రాప్తినొందకుము. పూర్ణత్వము నొందుటకనువగు యేపదార్థమున్ను యీ దృశ్యసమూహమునలేదు. కాన నో దుష్టమానసమా ! అభ్యాసవైరాగ్యబలముచే ధీరత్వమునవలంబించి చంచలత్వమును వీడుము.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమ ప్రకరణమున
చిత్తానుశాసనమను ఏకాదశ సర్గము ॥ 11 ॥

---

## ద్వా ద శ స ర్గః .

---

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

ఏవంవిచారయం స్తత్ర స్వరాజ్యేజనకోనృపః
చకారాఖిలకార్యాణి నముమోహచధీరధీః.  1

నమనఃప్రోల్లాసాస్య క్వచిదానందవృత్తిషు
కేవలంసుషుప్తసంస్థం సదైవవ్యవతిష్ఠత.  2

తతఃప్రభృత్యసౌదృశ్యం నాజహారనవాత్యజత్
కేవలంవిగతాశంకం వర్తమానేవ్యవస్థితః.  3

అనారతవివేకేన తేనసద్యఃసనాతనమ్
పునఃకలంకంనైవాప్త మంబరేణేవరాజసమ్.  4

స్వవివేకానుసంధానాదితి తస్యమహీపతేః
సమ్యగ్జ్ఞానమనన్తాభమలం విమలతాంయయౌ.  5

అనావృష్టవికల్పాంశు శ్చిదాత్మావిగతామయః
ఉదియాయహృదాకాశే తస్యవ్యోమ్నీవభాస్కరః.  6

సదదర్శాఖిలాన్భావాం శ్చిచ్ఛక్తౌసమవస్థితాన్
ఆత్మభూతానన్తాత్మా సర్వభూతాత్మకోవిదః.  7

ప్రహృష్టోనబభూవాసౌ క్వచిన్నచసుదుఃఖితః
ప్రకృతేర్వ్యవహారత్వా త్సదైవసమమానసః.  8

శ్రీ వసిష్ఠుడు :—ఇట్లు విచారణసల్పి జనకమహారాజు ప్రాప్తించిన రాజ్యకార్యములన్నింటిని గావించెను. మఱియు ధీరబుద్ధి నవలంబించుటచే అహంకార మమకారములచే పూర్వమువలె విమోహితుడు గాకయుండెను విషయసుఖములందు వాని మనస్సేమియు నుత్సాహము జూపకుండెను. అతడు కేవలము సుషుప్తియందున్నవానివలెనుండెను. దృశ్యమును ప్రియదృష్టితో గ్రహించుటగాని ద్వేషబుద్ధిచే త్యజించుటగాని లేక విగతశోకుఁడై వర్తమానకాలమున ప్రాప్తించిన దానితోనే తృప్తినొందుచుండెను. రత్నము ధూళియొక్క మాలిన్యముఁ జెందనట్లు సదా వివేక

యుతుఁడైయుండు జనకుడు అనాదిస్వభావప్రాప్తములగు 'నేను' 'నాది' యను అభిమానరూపమా న్యమును మఱల పొందకుండెను. నిరంతర వివేకానుసంధానముచే వాని యనంతరూప సమ్యగ్ జ్ఞానము విమలత్వమునొందెను. ఆకసమందు సూర్యునివలె మేఘపటల (వికల్ప)ములచే తిరస్కృతముగానట్టి కిరణములుగలిగిన నిష్కళంక చిదాత్మ వాని హృదయాకాశమునఁ బ్రకాశింపఁదొడఁగెను. అనంత బ్రహ్మమయుఁడును సర్వభూతాత్మకోవిదుఁడునునగు జనకుడు పదార్థములన్నింటిని చిత్తమందధ్యస్తమైయున్నటులే యపుడు గాంచెను. మఱియు మాయచేతనే సర్వవ్యవహారములు సంభవించుటచేతను అసంగమగు ఆత్మ యెద్దానిని స్పృశింపకుండుటచేతను సమచిత్తుఁడగు జనకుడు మిగుల ప్రసన్నత్వముగాని దుఃఖముగాని యెన్నడు జెందకుండెను.

జీవన్ముక్తోబభూవాసౌ తతఃప్రభృతిమానదః
జనకోజరఠజ్ఞానీ జ్ఞాతలోకపరావరః. 9

రాజ్యంకుర్వన్విదేహానాం జనకోజనజీవితమ్
నైవహర్షవిషాదాభ్యాం సోఽవశఃపరితప్యతే. 10

నాస్తమేతినచోదేతి గుణదోషవిచేష్టితైః
అర్థానర్థైఃసరాజ్యోత్థై ర్నగ్లాయతినహృష్యతి. 11

కుర్వన్నపికరోత్యేష నకించిదపికుత్రచిత్
సతిష్ఠత్యేవసతతం సర్వదైవాస్తరేచితః. 12

సుషుప్తానస్థితస్యైవ జనకస్యమహీపతేః
భావనాసర్వభావేభ్యః సర్వథైవాస్తమాగతాః. 13

భవిష్యంనానుసంధత్తే నాతీతంచిన్తయత్యసౌ
వర్తమాననిమేషంతు హసన్నేవానువర్తతే. 14

పూజ్యుడును, జ్ఞానవృద్ధుడును, ఇహపరలోకజ్ఞుడును నగు జనకుఁడప్పటినుండి విముక్తుడయ్యె. సర్వజనులకును జీవితమువలె ప్రియుమైనట్టి యా జనకభూపాలుడు రాజ్యమేలుచు హర్షశోకములచే వివశుడుగాక, పరితాపము జెందకనుండెను. మానసిక గుణదోషములచే వాని స్వస్వరూపము తిరోధానమొందుటగాని, మఱల యావిర్భవించుటగాని లేకయుండెను. మఱియు బాహ్యమగు రాజ్యపాలనచేగల్గు అర్థానర్థములచే హర్షవిషాదములఁ జెందకయుండెను. క్రియలనాచరించుచున్నను కర్తృత్వాభిమానము లేమిచే యేమియు నొనర్పనివాడగుచు సర్వదా యాత్మచైతన్యమందే స్థితిగల్గియుండెను. సుషుప్తియందున్నవాని చందమున మెలంగుచున్న యాతని రాగాది వాసనలన్నియు నశించెను. వాసనాభావంబున భూతభవిష్యత్తులఁగూర్చిన చింతనలేనివాఁడై వర్తమానమునే మిగుల సంతుష్టుడై యనువర్తించుచుండెను.

స్వవిచారవశేనైవ తేన తామరసేక్షణ
ప్రాప్తంప్రాప్యమశేషేణ రామనేతరచేచ్ఛయా. 15

కమలనేత్రుడవగు నోరామా ! స్వవిచారముచేతనే జనకుడు (మఱచిపోయిన కంఠమందలి మణివలె) ప్రాప్యమగు ఆత్మను పొందగల్గెనుగాని మఱియొకదానిచేగాదు.



తావత్తావత్స్వకేనైవ చేతసాప్రవిచార్యతే
యావద్యావద్విచారాణాం సీమాన్తఃసమవాప్యతే. 16

ఆత్మజ్ఞానఫలము లభించునంతవఱకును స్వచిత్తముచే తత్త్వవిచారము లెస్సగ యొనర్చుచునే యుండవలెను.

నతద్గురోర్నశాస్త్రార్థా న్నపుణ్యాత్ప్రాప్యతేపదమ్
యత్సాధుసంగాభ్యుదితా ద్విచారవిశదాద్ధృదః. 17

సజ్జనసాంగత్యముచే నభ్యుదయమునుబొందినదియు ఆత్మతత్త్వవిచారముచే విశాలత్వముఁబొందినదియగు స్వహృదయముచే లభించు యుత్తమపదము గురు, శాస్త్రార్థ, పుణ్యాదులచేగూడ లభింపనేరదు.

సుందర్యానిజయాబుద్ధ్యా ప్రజ్ఞయేవవయస్యయా
పదమాసాద్యతేరామ ననామక్రియయాన్యయా. 18

అట్టి బ్రహ్మపదము సచ్ఛాస్త్ర, వివేకములచే శోధితమును ఊహాపోహకుశలమును అనురాగవతియగు సఖిఁబోలునదియునగు నిర్మలబుద్ధిచే ప్రాప్తించునుగాని అన్యమగు యేక్రియచేతను గాదు.

యస్యోజ్జ్వలతితీక్ష్ణాగ్రా పూర్వాపరవిచారిణీ
ప్రజ్ఞాదీపశిఖాజాతు జాడ్యాంధ్యంతంనబాధతే. 19

ఎవనియందు పూర్వాపరవిచారసమర్థమగు అతిసూక్ష్మమగు బుద్ధియను దీపశిఖజ్వలించుచుండునో వానినిక యజ్ఞానాంధకారము బాధింపకుండును.

దురుత్తరాయావిపదో దుఃఖకల్లోలసంకులాః
తీర్యతేప్రజ్ఞయాతాభ్యో నావాఽపద్భ్యోమహామతే. 20

ఓ మహామతీ ! దుఃఖకల్లోలసంకులములును తరింప దుశ్శక్యములునగు విపత్తులను నదులు ప్రజ్ఞయను నావచే దాటబడును.

ప్రజ్ఞావిరహితంమూఢ మాపదల్పాపిబాధతే
పేలవాచానిలకలా సారహీనమివోలపమ్. 21

అల్పవాయువైనను కోమలతృణమును బాధించునట్లు ప్రజ్ఞావిహీనుడగు మూఢుని మిగుల యల్పములగు విపత్తులుగూడ బాధించును.

ప్రజ్ఞావానసహాయోఽపి విశాస్త్రోఽప్యరిమర్దన
ఉత్తరత్యేవసంసార సాగరాద్రామపేలవాత్. 22

అరిసూదనుఁడగు నోరామా ! ప్రజ్ఞావంతుడసహాయుఁడైనను, శాస్త్రశ్రవణరహితుడైనను జ్ఞానమాత్రముచే సంసారసాగరమును సులభముగ దాటుగలడు.

ప్రజ్ఞావానసహాయోఽపి కార్యాన్తమధిగచ్ఛతి
దుష్ప్రజ్ఞఃకార్యమాసాద్య ప్రధానమపినశ్యతి. 23

ప్రజ్ఞావంతుడసహాయుఁడైనను కార్యసిద్ధినిబడయును. అజ్ఞుఁడధికబలయుతుడైనను వినాశమునే పొందును.

శాస్త్రసజ్జనసంసర్గైః ప్రజ్ఞాంపూర్వంవివర్ధయేత్
సేకసంరక్షణారంభైః ఫలప్రాప్తౌ లతామివ. 24

ఫలప్రాప్తికొఱకై సేచనరక్షణాదిక్రియలచే లతను వృద్ధినొందింపజేయువిధమున శాస్త్ర సత్సాంగత్యములచే మొట్టమొదట ప్రజ్ఞను వృద్ధిపఱచవలెను.

ప్రజ్ఞాబాలబృహన్మూలః కాలేసత్కార్యపాదపః
ఫలంఫలత్యతిస్వాదు భాసోబింబమివైన్దవమ్. 25

సూర్యప్రకాశము చంద్రమండలమున ప్రవేశించి అమృతమయమైన చంద్రబింబమునుఫలముత్పన్నముగావించునట్లు దృఢమూలము గలదై పూర్వసత్కర్మ (సౌభాగ్య) రూపమగు ప్రజ్ఞావృక్షము యుత్తమస్వాదిష్టఫలమును ఫలించును.

యఏవయత్నఃక్రియతే బాహ్యార్థోపార్జనేజనైః
సఏవయత్నఃకర్తవ్యః పూర్వంప్రజ్ఞావివర్ధనే. 26

ద్రవ్యాది బాహ్యపదార్థములను సముపార్జించుటకై మనుజులెట్టి యత్నమొనర్చుదురో అట్టియత్నమునే ప్రథమమున ప్రజ్ఞను వృద్ధిపఱచుట యందొనర్పవలెను.

సీమాన్తంసర్వదుఃఖానా మాపదాంకోశముత్తమమ్
బీజంసంసారవృక్షాణాం ప్రజ్ఞామాన్ద్యంవినాశయేత్. 27

సర్వదుఃఖములకు నిలయమును, ఆపదలకు స్థానభూతమును, సంసారవృక్షములకు బీజమునునగు ప్రజ్ఞామాంద్యమును యత్నముచే నాశమొనర్పవలెను.

స్వర్గాద్యద్యచ్చపాతాలా ద్రాజ్యాద్యత్సమవాప్యతే
తత్సమాసాద్యతేసర్వం ప్రజ్ఞాకోశాన్మహాత్మనా. 28

స్వర్గ, పాతాళ రాజ్యములచే నెట్టిసుఖములభించునో అదంతయు ప్రజ్ఞచేతనే మహాత్ములు పొందగల్గుచున్నారు.

ప్రజ్ఞయోత్తీర్యతేభీమా త్తస్మాత్సంసారసాగరాత్
నదానైర్నచవాతీర్థై స్తపసానచరాఘవ. 29

ఓ రామా ! ఇక్కారణమున ప్రజ్ఞచేతనే భయంకరమగు సంసారసాగరము దాటబడును గాని దానతీర్థతపాదులచే గాదు.

యత్ప్రాప్తాఃసంపదందైవీ మపిభూమిచరానరాః
ప్రజ్ఞాపుణ్యలతాయాస్త త్ఫలంస్వాదుసముత్థితమ్. 30

పృథ్వియందు జరించుమానవులున్ను యేదైవీసంపత్తును బొందుచున్నారో అదియు ప్రజ్ఞయను పవిత్రలతనుండి యావిర్భవించిన సుస్వాదుఫలమే యగును.



ప్రజ్ఞయానఖరాలూన మత్తవారణయూథపాః
జంబుకైర్విజితాఃసింహాః సింహైర్హరిణకాఇవ. 31

తమగోళ్లచే మదగజంబులగూడ విచ్ఛిన్నమొనర్చు సింహములున్ను, నక్కలచే ప్రజ్ఞవలననే (సింహములచే హరిణములవలె) జయింపబడుచున్నవి.

సామాన్యైరపిభూపత్వం ప్రాప్తంప్రజ్ఞావశాన్నరైః
స్వర్గాపవర్గయోగ్యత్వం ప్రాజ్ఞస్యైవేహదృశ్యతే. 32

ప్రజ్ఞాకారణముననే సామాన్యమానవులున్ను రాజత్వపదవిని బొందుచున్నారు. మరియు స్వర్గమోక్షాదులు ప్రజ్ఞావంతునకే లభించుట గాంచుచున్నారముగదా !

ప్రజ్ఞయావాదినఃసర్వే స్వవికల్పవిలాసినః
జయన్తిసుభటప్రఖ్యా న్నరానప్యతిభీరవః. 33

స్వవికల్పవిలాసులును యతిభీరువులును నగు వాదులున్ను ప్రజ్ఞాబలముచేతనే గొప్పగొప్పవాదములందు శూరులఁగూడ జయింపగల్గుచున్నారు.

చిన్తామణిరియంప్రజ్ఞా హృత్కోశస్థావివేకినః
ఫలంకల్పలతేవైషా చిన్తితంసంప్రయచ్ఛతి. 34

వివేకుల హృదయమందు వసించునదగు యీ ప్రజ్ఞ చింతామణితుల్యమైనది. మఱియు కల్పవృక్షలతవోలె నది యభీష్టఫలములఁ గల్గజేయును.

భవ్యస్తరతిసంసారం ప్రజ్ఞయాపోహ్యతేఽధమః
శిక్షితఃపారమాప్నోతి నావానాప్నోత్యశిక్షితః. 35

నావనడుపుటయందు శిక్షితుడగువాడే నదిని దాటగల్గును గాని యశిక్షితుఁడుగానట్లు, ప్రజ్ఞావంతుడగు యుత్తముడే సంసారసాగరమును దాటును గాని ప్రజ్ఞాహీనుడగు యన్యుడు అందు కొట్టుకొనిపోవును.

ధీఃసమ్యగ్యోజితాపార మసమ్యగ్యోజితాఽఽపదమ్
నరంనయతిసంసారే భ్రమన్తీనౌరివార్ణవే. 36

వివేకవైరాగ్యాదియుక్తమై సన్మార్గమందు నియోగింపబడిన బుద్ధి, నావచందమున సంసారసాగరమును దాటింపజేయును. కాని యసన్మార్గమున నియోగింపబడిన బుద్ధి విపదలబాలొనర్చును.

వివేకినమసంమూఢం ప్రాజ్ఞమాశాగణోత్థితాః
దోషానపరిబాధన్తే సన్నద్ధమివసాయకాః. 37

కవచమును ధరించినవానిని బాణము బాధింపజాలనట్లు ప్రజ్ఞావంతుడగు వివేకిని తృష్ణాగణమగు కామక్రోధలోభమోహాదులచే నుద్భూతములైన రాగద్వేష చింతావిషాదాదిదోషములు బాధింపనేరవు.

ప్రజ్ఞయేహజగత్సర్వం సమ్యగేవాంగదృశ్యతే
సమ్యగ్దర్శనమాయాన్తి నాపదోనచసంపదః. 38

గుణదోషతత్త్వవివేకముద్వారా ప్రజ్ఞామూలముననే యీ ప్రపంచము సమ్యక్ రీతి గన్పట్టును. అట్టి సమ్యక్ దర్శనముగలవానిని సంపదలుగాని విపదలుగాని యేమియునొనర్పజాలవు.

పిధానంపరమార్కస్య జడాత్మావితతోఽసితః
అహంకారాంబుదోమత్తః ప్రజ్ఞావాతేన బాధ్యతే. 39

పరమాత్మయను సూర్యుని యాచ్ఛాదించు అహంకారమను దట్టమైన నీలమేఘము ప్రజ్ఞయను వాయువుచే వినాశమొందును.

పదమతులముపైతుమిచ్ఛతోచ్చైః
ప్రథమమియం మతిరేవలాలనీయా
ఫలమభిలషతా కృషీవలేన
ప్రథమతరం ననుకృష్య తేధరైవ. 40

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే ప్రజ్ఞామాహాత్మ్యంనామ
ద్వాదశః సర్గః ॥ 12 ॥

అసమానమును, సర్వోత్తమునునగు బ్రహ్మపదమును ప్రాప్తినొందదలంచువాడు ప్రథమమున వివేకమును బాలునివలె లాలించి యద్దానిని శుద్ధమొనర్పవలెను. సస్యవృద్ధియను ఫలమభిలషించు కృషీవలుడు మొమ్మొదట కర్షణముద్వారా భూమిని శుద్ధబఱచునుగదా!

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
ప్రజ్ఞామాహాత్మ్యమను ద్వాదశ సర్గము ॥ 12 ॥

---

## త్రయోదశః సర్గః.

---

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

ఏవంజనకవద్రామ విచార్యాత్మానమాత్మనా :
పదంవిదితవేద్యానా మవిఘ్నేనాధిగచ్ఛసి. 1

శ్రీ వసిష్ఠుడు :— ఓ రామా! ఇవ్విధమున జనకునివలె పరిశుద్ధచిత్తముచే నాత్మవిచారముగావించి అసంభావనాది ప్రతిబంధరూప విఘ్నములఁ దొలగించిన జ్ఞానులుపొందునట్టి బ్రహ్మపదమును నీవున్ను పొందగలవు.

యేహిపాశ్చాత్యజన్మానః ప్రాజ్ఞారాజససాత్వికాః
ప్రాప్నువంతిస్వయంప్రాప్యం తే జనాజనకాఇవ. 2

అంతిమజన్మననుభవించు రాజససాత్త్విక జాతివారగు ప్రాజ్ఞులు జనకునివలె ప్రాప్య వస్తువును స్వయముగ పొందుదురు,



తావత్తావద్విజిత్యారీ నింద్రియాఖ్యాన్పునఃపునః
యావదాత్మాత్మనైవాయ మాత్మన్యేవప్రసీదతి. 3

ఎంతవఱకు తనయందాత్మశాంతి నొందకుండునో, అంతవఱకును ఇంద్రియములను శత్రువులను లెస్సగజయించి ఆత్మానుసంధానమొనర్చుచునేయుండవలెను.

ప్రసన్నేసర్వగేదేవే దేవేశేపరమాత్మని
స్వయమాలోకితేసర్వాః క్షీయన్తేదుఃఖదృష్టయః. 4

సర్వవ్యాపియు, సర్వేంద్రియనియామకుడును నగు పరమాత్మ ప్రసన్నుడై సాక్షాత్కరింపబడినమీదట సమస్తదుఃఖములు క్షయించును.

ముష్టయోమోహబీజానాం వృష్టయోవివిధాపదామ్
కుదృష్టయఃక్షయంయాన్తి దృష్టేతస్మిన్పరావరే. 5

మనుష్యానందముమొదలు బ్రహ్మానందము వఱకుగల సమస్త యానందములును యెవనియందు న్యూనత్వముఁజెందునో, అట్టి పరావరస్వరూపుఁడగు నాపరమాత్మ సాక్షాత్కరింపబడిన, ఆత్తఱి మోహమునకు బీజభూతములగు దుర్వాసనలున్ను, సర్వవిధయాపదలున్ను, అహంకార మమకారాది దుర్దృష్టులున్ను శమించును.

సదా జనకవద్రామ సర్వారంభవదాత్మనా
ప్రజ్ఞయాత్మానమాలక్ష్య లక్ష్మీవానుత్తమోభవ. 6

ఓ రామా! వివేకయుక్తమగు బుద్ధిచే సమస్తము బ్రహ్మరూపముగనే సదా గాంచుచు పరమ పురుషార్థమను యైశ్వర్యమొంది సర్వోత్తముడవుగమ్ము.

నిత్యమస్తర్విచారస్య పశ్యతశ్చంచలంజగత్
జనకస్యేవకాలేన స్వయమాత్మాప్రసీదతి. 7

ఎవడు నిరంతరమాత్మవిచారణగావించుచు జగత్తు ననిత్యమనియెఱుంగునో నట్టివాని యాత్మ కాలక్రమమున జనకునివలె స్వయముగ శాంతినొందును.

నదైవంనచకర్మాణి నధనానినబాన్ధవాః
శరణంభవభీతానాం స్వప్రయత్నాదృతేనృణామ్. 8

సంసారముయెడ భయభీతుడైనవానికి ఆత్మజ్ఞానమను స్వప్రయత్నముదప్ప మఱియే దైవముగాని, కర్మగాని, ధనముగాని, బంధువులుగాని రక్షకములుగా నేరవు.

యేదైవసిష్ఠాఃకృత్యాదౌ కువికల్పపరాయణాః
తేషాంమన్దామతిస్తాత నానుగమ్యావినాశినీ. 9

ఓ రామా! పురుషప్రయత్నసాధ్యములగు వివేకవైరాగ్యాదుల విషయమున ప్రారబ్ధముపై నాధారపడువారును (ప్రారబ్ధమున్నచో వివేకవైరాగ్యాదులు స్వయముగ ప్రాప్తించును; ప్రారబ్ధము ప్రతికూలముగనున్నచో యెంతప్రయత్నముచేసైనను కార్యము సిద్ధించదు అను నిట్టి) కువికల్పములఁ జేయువారును మందమతులు.

వివేకంపరమాశ్రిత్య విలోక్యాత్మానమాత్మనా
ధియావిరాగోద్ధురయా సంసారజలధింతరేత్. 10

పరమోత్కృష్టమగు వివేకము నాశ్రయించి ఆత్మచే నాత్మనెఱింగి వైరాగ్యయుతుఁడై యుత్తమబుద్ధిద్వారా సంసారసాగరమును దాటవలెను.

ఏషాసాకథితారామ నభఃఫలనిపాతవత్
సుఖదాజ్ఞానసంప్రాప్తి రజ్ఞానతరుశాతనీ. 11

ఓరామా! సుఖమొసంగునదియు, జ్ఞానప్రాప్తిని చేకూర్చునదియు, అజ్ఞానమనువృక్షమును ఛేదించునదియునగు నీ జనకాఖ్యాయికను "ఆకాశఫలప్రాప్తి"వలె జ్ఞానోదయమగుటను నుదాహరించుటకై నీకువచించితిని.

జనకస్యేవసద్బుద్ధేః స్వయమేవవిలోకినః
వికాసమేత్యయందేహీ దేవఃప్రాతరివాంబుజమ్. 12

స్వయముగ తనయాత్మను సాక్షాత్కరించుకొనినట్టి సద్బుద్ధి హృదయమున ప్రాతఃకాలమున కమలమువోలె పరమాత్మ వికాసమునొందును.

సంసారమననంచిత్రం విచారేణవిలీయతే
గలద్వశీకృతస్పర్శ మాతపేనహిమంయథా. 13

ఎండవేడిమిచే మంచుకరఁగి నశించువిధమున ఆత్మవిచారముచే సంసారవికల్పము నశించును.

అయమేవాహమిత్యస్యా నిశాయాఉదితేక్షయే
స్వయంసర్వగతఃస్ఫారః స్వాలోకఃసంప్రవర్తతే. 14

'ఈదేహమే నేన'ను అజ్ఞానరూపమైన రాత్రిక్షయింప మహత్తరమై సర్వవ్యాప్తియైన నిజాత్మయొక్క ప్రకాశము స్వయముగయావిర్భవించును.

అయమేవాహమిత్యస్మి న్సంకోచే విలయంగతే
అనన్తభువనవ్యాపీ విస్తారఉపజాయతే. 15

'ఈ దేహమే నే'నను సంకుచిత భావము విలయమొంద, సర్వజగద్వ్యాపియగు ఆత్మయొక్క విస్తారముదయమగును.

జనకేనపరిత్యక్తా యథాహంకారవాసనా
తథాత్వమపిసద్బుద్ధే విచార్యాన్తఃపరిత్యజ. 16

సద్బుద్ధియగు నోరామా! జనకుఁడెట్లహంకారవాసనను త్యజించెనో, నీవున్నట్లనే విచారణచే దానిని పరిత్యజింపుము.

అహంకారాంబుదేక్షీణే చిద్వ్యోమ్నివిమలేతతే
నూనంసంప్రౌఢతామేతి స్వాలోకో భాస్కరఃపరః. 17

అహంకారమను మేఘముక్షయింప విశాలచిదాకాశమను నాకాశము నిర్మలముకాఁగా స్వాత్మప్రకాశమను సూర్యుడు స్ఫుటముగ వెలుఁగొందును



ఏతావదేవాతితమో యదహంభావభావనమ్
తస్మింశ్చశమమానీతే ప్రకాశఉపజాయతే. 18

దేహాదులందలి యహంభావమే అజ్ఞానాంధకారప్రాబల్యమగును అదినశింప ఆత్మప్రకాశము స్వయముగ నావిర్భవించును.

నాహమస్తినచాన్యోస్తి నచనాస్తీతిభావితమ్
మనఃప్రశాన్తిమాయాతం నోపాదేయేషుమజ్జతి. 19

అహంపదవాచ్యముగాని, జగత్తుగాని, శూన్యత్వముగాని యథార్థముగలేదని భావించుటచే మనస్సుప్రశమనమొంది గ్రాహ్యవిషయములందు నిమగ్నముగాకయుండును.

ఉపాదేయానుపతనం హేయైకాన్తవివర్జనమ్
యదేతన్మనసోరామ తద్బన్ధంవిద్ధినేతరత్. 20

ఓ రామా! గ్రాహ్యవస్తువులందలి రాగము, త్యాజ్యవస్తువులందలి ద్వేషముమాత్రమే బంధమగునుగాని యన్యముగాదు.

మాఖేదంభజహేయేషు నోపాదేయపరోభవ
హేయాదేయదృశౌత్యక్త్వా శేషస్థఃస్వచ్ఛతాంవ్రజ. 21

త్యాజ్యపదార్థములచే దుఃఖమునొందకుము. మఱియు గ్రాహ్యవస్తువులందు తత్పరుడవునుగాకుము. ఇట్టి హేయోపాదేయదృష్టిని త్యజించి శేషించిన సాక్షిరూపమున నిలుకడగల్గి స్వచ్ఛత్వము నొందుము.

యేషామిదముపాదేయ మిదంహేయమితిస్థితిః
విలీనాతేనవాంఛన్తి తత్యజన్తీహాకించన. 22

ఇది గ్రాహ్యము, ఇది త్యాజ్యమను భావమెవరికినశించునో యట్టివారికే యేవస్తువును యిచ్ఛగింపరు. దేనిని ద్వేషింపరు.

హేయోపాదేయకలనే క్షీణేయావన్నచేతసః
నతావత్సమతాభాతి సాభ్రేవ్యోమ్నీవచంద్రికా. 23

త్యాజ్యగ్రాహ్యదృష్టి చిత్తమున శమింపనంతవఱకు బ్రహ్మైకత్వమను సమత్వము, మేఘయుక్తమగు నాకాశమున చంద్రికవలె ప్రకాశింపకుండును.

అవస్త్వేదమిదంవస్తు యస్యేతి లులితంమనః
తస్మిన్నోదేతిసమతా శాఖోటఇవమంజరీ. 24

'ఇది యుత్తమముకాదు' కాన త్యజింపదగినది, 'ఇది యుత్తమమైనది' కాన గ్రహింపదగినది; ఇట్లెవనిమనంబు వికల్పయుక్తమైయుండునో వానియందు బ్రహ్మైకత్వమను సమత్వము 'శాఖోట' వృక్షమందులతవోలె యుత్పన్నముగాకయుండును.

యుక్తాయుక్తేషణాయత్ర లాభాలాభవిలాసినీ
సమతాస్వచ్ఛతాతత్ర కుతోవైరాగ్యభాసినీ. 25

అనుకూలపదార్థములందిచ్ఛయు, ప్రతికూలపదార్థములందనిచ్ఛయు, వాటి లాభాలాభములచేగల్గు రాగద్వేషములును యెవనియందుల్లసితమగుచుండునో యట్టివానియందు వైరాగ్యప్రదీప్తమగు బ్రహ్మాత్మత్వరూప సమత్వమున్ను, నిర్మలత్వమున్ను యెట్లుండనేరును ?

ఏకస్మిన్బ్రహ్మతత్త్వేఽస్మి న్విద్యమానేనిరామయే
నానాఽనానాతయానిత్యం కిమయుక్తంక్వయుక్తతా. 26

నిరామయమును యేకమునగు బ్రహ్మత్వముమాత్రము వెలుంగుచుండ నిక భేదాభేదకల్పనచే నుద్భూతమగు యుక్తాయుక్తత్వభావములెచట ?

ఈప్సితానీప్సితాశంకే మర్కట్యాచిత్తపాదపే
చంచలేస్ఫురతోయస్మి న్కుతస్తస్యేహసౌమ్యతా. 27

ఎవని చిత్తమను వృక్షమందు ఇష్టానిష్టత్వమను చపలవానరము స్ఫురించునో వానియందిక సౌమ్యత్వ (నిష్కామత్వ) మెచట ?

నిరాశతానిర్భయతా నిత్యతాసమతాజ్ఞతా
నిరీహతానిష్క్రియతా సౌమ్యతానిర్వికల్పతా. 28

ధృతిర్మైత్రీమతిస్తుష్టి ర్మృదుతామృదుభాషితా
హేయోపాదేయనిర్ముక్తే జ్ఞేతిష్ఠన్త్యపవాసనమ్. 29

నిరాశ, నిర్భయత్వము, నిత్యత్వము, సమత్వము, జ్ఞానము, నిరపేక్ష, నిష్క్రియత్వము, నిర్వికల్పత్వము, ధైర్యము, మైత్రి, సుబుద్ధి, తుష్టి, శాంతి, మృదుభాషణము మున్నగు సుగుణములు హేయోపాదేయ దృష్టి వదలినట్టి వాసనారహితుడైన జ్ఞానియందు గన్పట్టును.

ధావమానమధోభాగే చిత్తంప్రత్యాహరేద్బలాత్
ప్రత్యాహారేణపతిత మధోవారీవసేతునా. 30

చిత్త మధోగతికి జనునపుడు దానిని బాహ్యేంద్రియములనుండి తొలగించి నిమ్నమార్గమునఁజను జలమును సేతువుచేనరికట్టి యూర్ధ్వముఖ మొనర్చునట్లు, ప్రత్యాహారముచే విషయములనుండి మరల్పవలెను.

బాహ్యానర్థానిమాంస్త్యక్త్వా తిష్ఠన్గచ్ఛన్స్వపన్వసన్
సర్వథాసర్వదాసర్వా నాన్తరాంశ్చవిచారయ. 31

బాహ్యపదార్థములన్నింటిని త్యజించి కూర్చున్నను, నడచుచున్నను, నిదురించుచుండినను, మేల్కొనినను, సర్వావస్థలయందును సర్వవిధముల నాంతరీయ (మనస్సు, బుద్ధి, ఆత్మ మున్నగు) వస్తువులఁగూర్చియే నిరంతరము చింతనజేయుచుండుము.

గృహీతతృష్ణాశఫరి వాసనాజాలమావిలమ్
సంసారవారిప్రసృతం చిన్తాతన్తుభిరాతతమ్. 32

అనయాతీక్ష్ణయాతాత ఛ్చిన్ధిబుద్ధిశలాకయా
వాత్యయేవాంబుదం కాలే వహన్త్యావితతేపదే. 33



తృష్ణయను మత్స్యములఁ బట్టునదియు, మోహమను శైవాలముచే మలినమైన సంసరమనుజలమున బరుపబడినదియు, చింతాసమూహమను సూత్రములచే గట్టఁబడినదియు బ్రహ్మపదమను విశాలజలప్రదేశమున గొట్టుకొనిపోవుచున్నదియునగు యీ వాసనాజాలమును బుద్ధియను పదునైన కత్తెరచే, కాలక్రమమున మేఘమునుచ్ఛిన్న మొనర్చు మహావాయువువలె ఛేదించివేయుము.

అస్యసంసారవృక్షస్య మూలందోషాంకురాస్పదమ్
భవ్యధీరేణధైర్యేణ ప్రోద్ధారోద్ధురయాధియా. 34

భవ్యుఁడవగు నోరామా ! చిరకాలాభ్యాసముచే దృఢపడిన ఆత్మభావనచే స్థైర్యమునొందిన చిత్తముయొక్క ధీరత్వముతో గూడుకొనినదియు, అనాదికాలమునుండి అవిద్యయందు తగుల్కొనియున్నదియునగు ఆత్మనుద్ధరించుటయందు సమర్థమైనట్టి బుద్ధిచే వాసనయను యంకురమునకు స్థానభూతమగు యీ సంసారమూలమును నీవు విచ్ఛిన్న మొనర్పుము.

మనసైవమనశ్ఛిత్త్వా కుఠారేణేవపాదపమ్
పదంపావనమాసాద్య సద్యఏవస్థిరోభవ. 35

గొడ్డలిచే వృక్షము నఱుకబడునట్లు బ్రహ్మాకారవృత్తిచే ప్రదీప్తమగు చైతన్యముతో గూడుకొనిన మనస్సుచే మనస్సును ఛేదించి పరమపవిత్రమగు బ్రహ్మపదమును యిపుడే ప్రాప్తినొంది సుస్థిరుఁడవుగమ్ము.

మనసైవమనశ్ఛిత్త్వా విస్మృత్యా చరమంమనః
వర్తమానమపిచ్ఛిత్త్వా ఛ్ఛిన్నసంసారతాంవ్రజ. 36

మనస్సుచే, అనఁగా వాసనోచ్ఛేదముచే యుత్తరకాలప్రసక్తమగు వృత్తిరూపమనంబును ఛేదించిపైచి వాసనాభావముచే వర్తమానమనంబునుగూడ తెగద్రుంచి సంసారమును రహితమొనర్చుకొనుము.

మోహోవిస్మృత్యసంసారం నభూయఃపరిరోహతి
చిత్తంవిస్మృత్యసంసారో నభూయఃపరిరోహతి. 37

వాసనాక్షయరూపమగు సంసారవిస్మరణచే అవిద్యామోహము మఱల యెన్నటికినిగలుగదు. సంస్కారనాశముచే చిత్తముపశమింప నిక సంసారము మఱలయెన్నటికిని ప్రాదుర్భవింపనేరదు.

తిష్ఠన్గచ్ఛన్స్వపఞ్జాగ్ర న్నివసన్నుత్పతన్పతన్
అసదేవేదమిత్యన్త ర్నిశ్చిత్యాస్థాంపరిత్యజ. 38

కాన గూర్చున్నను, నడచుచున్నను, నిదురించుచున్నను, మేల్కొనినను, వసించుచున్నను, పైకిబోవుచున్నను, పడుచున్నను సర్వకాల సర్వావస్థలయందును యీ ప్రపంచమసత్యమని యంతఃకరణమున నిశ్చయించి దానియందపేక్షను విడనాడుము.

సమతామలమాశ్రిత్య సంప్రాప్తంకార్యమాహరన్
అచిన్తయంస్తథాప్రాప్తం విహరేహహిరాఘవ. 39

ఓ రామా! బ్రహ్మతత్వమను సమత్వమును లెస్సగనాశ్రయించి ప్రాప్తించిన కార్యములఁ జేయుచు, ప్రాప్తింపని వానిఁగూర్చి చింతింపక లోకమున విహరింపుము.

యథాశరీరోఽపిలింగాని నబిభర్తిబిభర్తిచ
త్వమేవమిహ కార్యాణి కురుమాకురుచానఘ. 40

పాపరహితుడవగు నోరామా! మహేశ్వరుడెట్లు పృథివ్యాద్యష్టమూర్తులను చిహ్నములను చిన్మాత్రదృష్టిచే ధరింపకయు, మాయకధిష్ఠానమగుటచే సన్నిధానమాత్రముచే ధరించుచునుండునో, నీవున్ను రాజ్యకార్యములను నిరపేక్షాభావముతో సన్నిధానమాత్రముచే నొనర్చుచు ఆత్మదృష్టిచే నేమియు నొనర్పకయుండుము.

త్వమేవవేత్తాత్వమజస్త్వమాత్మాత్వంమహేశ్వరః
ఆత్మనోఽవ్యతిరిక్తః సంస్త్వయేత్థమిదమాతతమ్. 41

ఓ రామా! పరమార్థమున నీవే సమస్తము నెఱుంగువాడవును, జన్మాది వికారరహితుడవును, సర్వాత్మస్వరూపుడవును, మహేశ్వరుడవునై యున్నావు, మఱియు స్వస్వరూపమునుండి చ్యుతినిబొందక నీవే యీ జగత్తును విస్తరింపజేయుచున్నావు.

యేనాత్మదృశ్యసద్భావాదభితోభాసనోజ్ఝితా
సనసంగృహ్యతేదోషైర్హర్షామర్షవిషాదజైః. 42

ఎవడంతటను ఆత్మరూపము నేగాంచుచు దృశ్యమందలి సన్మాత్రభావనచే నన్యపదార్థభావనను వీడునో యాతడు హర్షశోకవిషాదజనితములగు దోషములచే నంటబడడు.

రాగద్వేషవినిర్ముక్తః సమలోష్టాశ్మకాంచనః
యుక్తఇత్యుచ్యతేయోగీ త్యక్తసంసారవాసనః. 43

రాగద్వేషవినిర్ముక్తుడును, లోహపాషాణసువర్ణములందు సమబుద్ధిగలవాడును, సంసారవాసనను పరిత్యజించినవాడునునగు యోగి యుక్తుడనబడును.

సయత్కరోతియద్భుంక్తే యద్దదాతినిహన్తియత్
తత్రముక్తధియస్తస్య సమతాసుఖదుఃఖయోః. 44

అట్టియోగి యేమియొనర్చినను యేదిభుజించినను, యేదియొసంగినను, దేనిని వధించినను అసక్తబుద్ధిగలవాడగుటచే తజ్జనిత సుఖదుఃఖములందు సమభావము గల్గియుండును.

ప్రాప్తంకర్తవ్యమేవేతి త్యక్తేష్టానిష్టభావనః
ప్రవర్తతేయఃకార్యేషు నసమజ్జతికుత్రచిత్ 45

ఇష్టానిష్టభావనను పరిత్యజించినవాడును, 'ఇది చేయదగినద'ని యెంచి ప్రాప్తించిన కార్యములం బ్రవృత్తుడగువాడును, దేనియందు నిమగ్నుడు కానేరడు.

చిత్సత్తామాత్రమేవేద మితినిశ్చయవన్మనః
త్యక్తభోగాభిమననం శమమేతిమహామతే. 46

మహామతివగు నోరామా! ఈ జగత్తంతయు చైతన్యసత్తామాత్రమేయని నిశ్చయించి భోగాశను వీడువాని మనస్సు ప్రశాంతినొందును.



మనఃప్రకృత్యైవజడం చిత్తత్త్వమనుధావతి
మాంసగర్ధేనమార్జారో వనేమృగపతింయథా. 47

మనస్సు స్వతః జడమైనందున తన్ను సిద్ధింపజేసికొనుటయందుగాని, మరియొకదానిని సాధించుటయందుగాని యసమర్థమగుటచే స్వవిషయసిద్ధి నిమిత్తము తనకు సాక్షిభూతమును తన ప్రకాశకమునగు చిద్వస్తువైపునకు, వనమందు సింహమువెనువెంటబోవు మాంసాపేక్షియగు మా[illegible] బరుగిడును.

సింహవీర్యవశాల్లబ్ధం మాంసంభుంక్తేఽనుగోహరేః
చిద్వీర్యవశతఃప్రాప్తం దృశ్యమాశ్రయతేమనః. 48

సింహముయొక్క శక్త్యతిశయముచే లభించిన మాంసమును, యద్దాని ననుసరించినచ్చ మార్జాలము భుజించునట్లు, చిత్-శక్తి ప్రభావముచే గల్గు దృశ్యమును మనస్సాశ్రయించుచున్నది.

మనఏవమసత్కల్పం చిత్ప్రసాదేనజీవతి
భావయన్విశ్వమేవైకం చిన్మాత్రమేత్య చిదప్యుత. 49

ఈ ప్రకార మసద్రూపమగు మనంబు అద్వితీయమగు పరమాత్మను మఱచి కేవలము జగదాకారమునే భావించుచు చైతన్యప్రభావముచేతనే జీవించుచున్నది. అదియే యొకప్పుడాత్మను సంస్మరించి తన మనోరూపమును వదలి మఱల చైతన్యరూపమే యగుచున్నది.

జడంయత్కిలనిర్వాణం చితాదీపికయాజసా
తన్మనఃశవసంకాశ ముచిదుత్తిష్ఠతేకథమ్. 50

జడమును, చైతన్యదీపప్రకాశవర్జితమునగు మనస్సు మృతప్రాయమేయగును. జడవస్తువు కార్యసమర్థ మెట్లగును?

చిత్స్వభావపరామృష్టా స్పన్దశక్తిరసన్మయీ
కల్పనాచిత్తమిత్యుక్త్వా కథ్యతేశాస్త్రదృష్టిభిః. 51

చిత్స్వభావమునుండి స్వల్పముగ నభివ్యక్తమైన విషయాభిముఖమగు యసన్మయా కల్పనయే చిత్తమని శాస్త్రజ్ఞులు వచింతురు.

యశ్చిత్తఫణిఫూత్కారః సైవేయంకలనోచ్యతే
చిదేవాహమితిజ్ఞాత్వా సాచిత్తామేవగచ్ఛతి. 52

ద్రష్టృదర్శనదృశ్యరూపమగు చిత్తమను సర్పముయొక్క ఫూత్కారమే 'కలన' (కల్పన) యనబడును. ఆ కలనమే 'నేను చిద్రూపుడన'ని యనియెఱింగి మఱల చిద్రూపత్వమును బడయుచున్నది.

చేత్యేన రహితాహ్యేషా చిత్తద్బ్రహ్మసనాతనమ్
చేత్యేన సహితాహ్యేషా చిత్సేయంకలనోచ్యతే. 53

విషయరహితమగు చైతన్యమే సనాతనబ్రహ్మమగును. విషయసహితమగునపుడా చైతన్యమే కలనయని వచింపబడును.

కించిదామృష్టరూపం యద్బ్రహ్మాతచ్ఛస్థిరంమనః
కల్పనాసత్సదైవైత త్సదివోపస్థితాహృది. 54

ఆబ్రహ్మమే కించిద్విషయయుక్తమగుటచే కల్పనారూపమై హృదయమున సద్వస్తువును బోలినదై సంకల్పవికల్పరూపమున స్థిరత్వముజెంది మనస్సగుచున్నది.

చిత్తమిత్యేవరూఢేయం యదైవకలనోదితా
తదైవచిత్త్వంవిస్మృత్య స్వాజడేవవ్యవస్థితా. 55

నిత్యానుభవరూపమగు ఆత్మనువిస్మరించి స్మృతిరూపము జెందునపుడదియే చిత్తమన బడును. అపుడయ్యది తన చిద్రూపత్వమునుమఱచి జడరూపమును బోలియుండును.

సంపన్నాకలనానామ్నా సంకల్పానువిధాయినీ
అవచ్ఛేదవతీవాగ్రా హేయోపాదేయధర్మిణీ. 56

ఆచైతన్యమే భూతవిషయాకారకల్పనచే భావివిషయాకార సంకల్పమును విధానమొనర్చునట్టి కలనయై హేయోపాదేయములను రెండుధర్మములతోఁగూడి పరిచ్ఛిన్నమగుచున్నది.

సైషాచిదేవజగతా మాగతేవస్వశక్తితః
నసంప్రబోధితాయావద్రూపం తావన్నబుధ్యతే. 57

అదియే స్వమాయాశక్తివశమున బ్రహ్మాండాకారమును బొందినదగుచున్నది. మఱియు గురుశాస్త్రములద్వారా తత్వవిచారముచే ప్రబోధితమవనంతవఱకు తనవాస్తవిక అద్వితీయ పూర్ణానందస్వరూపమును గుర్తెఱుంగకయుండును.

అతఃశాస్త్రవిచారేణ వైరాగ్యేణపరేణచ
నిగ్రహేణేన్ద్రియాణాంచ బోధయేత్కలనాంస్వయమ్. 58

కాన శాస్త్రవిచారము చేతను, ఉత్తమవైరాగ్యముచేతను, ఇంద్రియనిగ్రహముచేతను జాగ్రత్స్వప్నసుషుప్తులనుండి తన చిద్రూపమును వేఱుబఱచవలెను.

కలనాసర్వజంతూనాం విజ్ఞానేనశమేనచ
ప్రబుద్ధాబ్రహ్మతామేతి భ్రమతీతరథాజగత్. 59

శాస్త్రజన్యజ్ఞానముచేతను, శమముచేతను ప్రబోధముఁజెందిన 'జీవకలన' బ్రహ్మరూపత్వముఁజెందును. అట్లుగాకున్న నయ్యది దృశ్యజగత్తునందే పరిభ్రమించుచునుండును.

వ్యామోహమదిరామత్తాం లుఠితాంవిషయావటే
ఆత్మావేదనసంసుప్తాం కలనామేవబోధయేత్. 60

సంసారవ్యామోహమను మదిరచే ప్రమత్తతనొంది విషయగర్తమున తిరుగాడుచు ఆత్మజ్ఞానాభావమను అజ్ఞాననిద్రయందు బడియున్న యీజీవకలనను మేల్కొలుపవలెను.

అప్రబుద్ధాయదాహ్యేషా నకించిదవబుధ్యతే
సంకల్పకలనేవాన్త ర్దృశ్యమాహాప్యసన్మయా. 61



ప్రబుద్ధముగానపుడీ కలన తన యాత్మరూపము నేమియు యెఱుంగకుండును. ఎలన, గోచరమైనప్పటికి యీజగత్థితి సంకల్పకల్పనవలె మిథ్యాభూతమే యగును.

తయాపరమయాదృష్ట్యా కలనైషాన్తరస్థయా
మంజరీగంధశక్త్యేవ పదార్థేషువిరాజతే. 62

చిత్తవృత్తిరూపమగు యీకల్పన అంతఃకరణమందున్న సర్వసాక్షిరూపమగు పరమ చైతన్యదృష్టిచే వ్యాప్తమై గంధశక్తిచే లతవలె విషయప్రకాశనసమర్థమగుచున్నది.

తనుఃసంకల్పితాహ్యైషా కలనేతిజగత్త్రయే
నాహికించిద్విజానాతి నిత్యంజ్ఞానైకధర్మిణీ. 63

జ్ఞానమేధర్మముగాగల నిత్యబోధస్వరూపమగు సర్వసాక్షియైన చైతన్యము అంతఃకరణవృత్తిచే (ఈ కలనారూప యుపాధిచే) నల్పత్వముఁజెందుచున్నది. కాన ముల్లోకములందును ఆయాప్రాణుల యంతఃకరణాదులను సూత్రమే నదియెఱుంగగల్గుచున్నది.

చేతనేనజడారామ కలనోపలరూపిణీ
పద్మినీవాతపేనాసా పరేణైవప్రబోధ్యతే. 64

ఓరామా! వృత్తిరూపమగు కలన శిలవలె జడముగాన, యాతపముచే కమలమువలె నయ్యది సాక్షిచైతన్యముచే ప్రబోధితమగుచున్నది. (అనగా నంతఃకరణవృత్తికి స్వతః ప్రకాశత్వము లేదనిభావము.)

యథాశిలామయీకన్యా చోదితాపి ననృత్యతి
తథేయంకలనాదేహే నకించిదవబుధ్యతే. 65

ప్రేరణమొనర్చినను శిలారూపమగు కన్య నృత్యమొనర్పనట్లు, సాక్షిచైతన్యము లేనిచో నీజీవకలన దేహమందెద్దియు నెఱుంగకుండును.

లిపికర్మనృపైర్యుద్ధం క్వకృతంఘుర్ఘురారవమ్
క్వచిన్నచంద్రకిరణైరోషధ్యః ప్రతిబోధితాః. 66

అసృగాలిప్తగాత్రైశ్చ శవైఃక్వపరివల్గితమ్
క్వగీతంమధురధ్వానం వనపాషాణఖండకైః. 67

క్వపుంసాపిహితైరర్కైః క్షపితంయామినీతమః
క్వసంకల్పమయైశ్చాయా క్రియతేవ్యోమకాననైః. 68

క్వజనైరుపలాకారై ర్మిథ్యాభ్రమభరోత్థితైః
మృగతృష్ణామయైరేభిర్నభోభిః క్రియతేక్రియా. 69

చిత్రమందలి రాజులెపుడైన ఘుర్ఘురశబ్దమొనర్చుచు యుద్ధముచేయుదురా? చంద్రకిరణము లెవుడేని కమలములన్నను యోషధుల వికసింపజేయునా? రక్తమయదేహులగు మృతజీవులెపుడైన గర్జన సల్పుదురా? అరణ్యమందలి శిలాఖండములు మధురగీతములఁబాడునా? మనుజనిర్మిత పాషాణసూర్యులు రాత్రియందలి యంధకారమును నశింపజేయుదురా? సంకల్పిత యాకాశ

వనంబులెప్పుడైన ఛాయనుగల్గజేయునా ? శిలవలె జడములును, మిథ్యాభ్రమలచే నావిర్భూత ములును, మృగతృష్ణాసదృశములునగు నీ మనంబులు చైతన్యసహకారములేక క్రియావంతము లెట్లగును ?

యథాతపేక్షతేస్ఫారే మృగతృష్ణాతరంగిణీ
కలనాతద్వదేవేయం స్ఫురత్యాత్మనిసత్యలమ్. 70

తీక్ష్ణాతపకారణమున మృగతృష్ణా నది స్ఫురించునట్లు ఆత్మసత్తచే నీకలనయు పూర్ణముగ స్ఫురించుచున్నది.

యదేతత్స్పన్దితంనామ తన్మనోఽధిగతంశక్తైః
మరుతాంవిద్ధితాంశక్తి మంతఃప్రాణశరీరిణీమ్. 71

స్వపంచకులగు అజ్ఞానులు స్పందశక్తియొక్క స్ఫురణయే మనస్సని నుడివిరి. అన్నమయ కోశాంతర్గతమగు ప్రాణమయకోశాత్మకశక్తిని వాయురూపముగ నీవెఱుంగుము.

యేషాంసంవిదనాక్రాన్తా సంకల్పలవనిశ్చయైః
అనాక్షిప్తరసాకారా ప్రథితాపారమాత్మికీ. 72

సంకల్పలేశములచేగూడ నాక్రాంతముగాకయు, విషయాకారముగ కల్పింపబడకయు నుండు జీవసంవిత్తు పరమాత్మప్రకాశమేయగును.

అయంసోహమిదం తన్మఇతియాకలనావిలా
ప్రాణాత్మతత్త్వయోస్తస్యాః సంజ్ఞాజీవేతికథ్యతే. 73

స్పందాత్మకమగు ప్రాణము, చిదాత్మకమగు ఆత్మతత్వము ఈరెంటియొక్క (అజ్ఞానోదిత) అభేదాధ్యాసముచే నుత్పన్నమగునదియు, 'ఈదేహమే నేను', 'ఈ పుత్రధనాదులు నావి' ఇత్యాది కల్పనాయుక్తమునగు జడత్వావేష్టిత చిద్రూపకల్పనయే ప్రాణధారణచే జీవుడనఁబడును.

ధీశ్చిత్తంజీవఇత్యేతాః సంకల్పస్యాసతోమతాః
సంజ్ఞాఃసంకల్పితాస్తజ్జ్ఞైర్న రామపరమార్థతః. 74

మనోనోనమతిర్నాపి ధీరేషానశరీరకమ్
అస్తీహపరమార్థేన స్వాత్మైవేహాస్తిసర్వదా. 75

ఓరామా! అసత్తగు సంకల్పమునకే బుద్ధి, చిత్తము, జీవుడు మున్నగు నామములను విజ్ఞులు కల్పించిరి. పరమార్థమున నివేవియును లేవు. ఏలన పరమార్థస్థితియందు మనస్సుగాని, బుద్ధిగాని, మతిగాని, దేహముగాని లేనివై కేవలమాత్మయే యేకరసమై సర్వదా వెలుగుచుండును.

ఆత్మైవేదంజగత్సర్వ మాత్మాకాలక్రమస్తథా
సహాకాశాదచ్ఛతరో నాస్తీవాస్త్యేవచామలః. 76

ఈ జగత్తంతయు నాత్మయే, కాలక్రమమున్న ఆత్మయే. ఈయాత్మ ఆకాశముకంటెను మిక్కిలి సూక్ష్మమై స్వచ్ఛమై వెలయుచుండునుగాన లేనట్లు గన్పించుచున్నను. యథార్థముగ శుద్ధచిద్రూపమై సదా వెలయుచున్నది.



అచ్ఛత్వాదసదాభాసః సంవిద్రూపతయాతుసత్
ఆత్మాసర్వపదాతీతః స్వానుభూత్యానుభూయతే. 77

ఆయాత్మ మిగుల నిర్మలమును, శ్రోత్రాదీంద్రియముల కవిషయమునగుటచే నసత్తుల్యమునునై భాసించుచున్నది. సంవిద్రూప (చిద్రూప)మున సద్వస్తువై వెలుఁగు నాయాత్మ ఇంద్రియము లన్నింటి కవిషయమై కేవల మనుభవైకవేద్యమై దనరుచున్నది.

మనస్తత్రపరిక్షీణం యత్రసంవిత్పరాత్మనః
అంధకారక్షయస్తత్ర యత్రాలోకఃప్రవర్తతే. 78

పరమాత్మజ్ఞానరూపమగు చిత్స్వరూపసాక్షాత్కారము గలచోట అజ్ఞానకార్యమగు మనస్సు క్షయించును. ప్రకాశముండుచోట యంధకారము నశించునుగదా !

యత్రాత్మసంవిదోఽచ్ఛాయాః సంకల్పోత్థతయామతాః
తత్రాత్మనోవిస్మరణం స్మరణంచిత్తజన్మనః. 79

అతిస్వచ్ఛమగు ఆత్మసంవిత్తుయొక్క సంకల్పవశముచే బాహ్యవిషయాకారరూపమున నావిర్భూతములును, ప్రకాశ్యములునగు దృశ్యపదార్థములు గలచోట ఆత్మ విస్మరింపబడును. చిత్తోద్భూతములగు మిథ్యావస్తువులు మాత్రమే సంస్మరింపబడును.

పరస్యపుంసఃసంకల్పమయత్వ చిత్తముచ్యతే
అచిత్తత్వమసంకల్పా న్మోక్షస్తేనాభిజాయతే. 80

పరమపురుషుని (పరమాత్మయొక్క) సంకల్పమే చిత్తమనబడును. అట్టిసంకల్పాభావమే చిత్తాభావమగును. అట్టి చిత్తాభావముచే మోక్షము సిద్ధించును. [సంకల్పమయమనంబు సర్వసంకల్పక్షయరూపమగు మోక్ష (ఆత్మదర్శన) మందు సమర్థముగాదనుట.]

ఏతావచ్చేతసోజన్మ బీజంసంసారభూతయే
సంకల్పోన్ముఖతాంయాతః సంవిదోవాకిలాత్మనః. 81

సంకల్పోన్ముఖమగు ఆత్మయొక్క చిత్స్వరూపమందలి కించిదన్యథాభావమే యీసంసారోత్పత్తికి హేతువగు చిత్తము జనించుటకు బీజమగును.

నిర్వికల్పాచ్చితఃసత్తా సంకల్పాంకకలంకితా
కలనేత్యుచ్యతేతేన పుంస్త్వవద్బుద్ధ్యతేమనః. 82

నిర్వికల్ప చిత్స్వభావమునుండి చ్యుతమై, సంకల్పచిహ్నముచే కళంకితమయిన సత్తయే కలన యనబడును. మఱియు వనితాదుల సంకల్పవశముచే ప్రజోత్పత్తి నిమిత్తము పుంస్త్వమావిర్భవించునట్టుల, మనస్సున్ను జగదుత్పత్తి నిమిత్తము కలనచే నావిర్భవించుచున్నది.

ప్రాణశక్తౌనిరుద్ధాయాం మనోరామవిలీయతే
ద్రవ్యచ్ఛాయానుతద్ద్రవ్యం ప్రాణరూపంహిమానసమ్. 83

ఓ రామా ! దర్పణాదులు నశించునపుడందలి ప్రతిబింబమున్ను వానితోగూడ నశించునట్లు ప్రాణశక్తినిరోధముచే మనస్సున్ను విలయమగును. ఏలన, ప్రతిబింబము దర్పణముయొక్క కల్పితరూపమగునట్లు మనస్సున్ను ప్రాణరూపమేయగును.

దేశాన్తరానుభవనం ప్రాణో వేత్తి హృదిస్థితమ్
స్పన్దవేదనతో యత్తన్మన ఇత్యభిధీయతే. 84

మనుజుడు దూరదేశస్థ పదార్థముయొక్క మానసిక యనుభవమును తనయందు గాంచునపుడట, దేశాంతరసంబంధము స్పంద (గతి) శక్తిలేక గలుగజాలదు; అనుభవాంశము చిత్తసంబంధము లేకయే సిద్ధింపనేరదు; కాన స్పందానుభవములను యుభయశక్తుల సమ్మేళనమగు ప్రాణమే మనస్సనబడుచున్నది.

వైరాగ్యాత్కారణాభ్యాసాద్యుక్తితో వ్యసనక్షయాత్
పరమార్థావబోధాచ్చ రోధ్యన్తే ప్రాణవాయవః. 85

వైరాగ్యముచేతను, ప్రాణాయామాభ్యాసముచేతను, సమాధిచేతను, వ్యసనక్షయముచేతను, పరమార్థ (బ్రహ్మ) జ్ఞానముచేతను, ప్రాణవాయువు నిరోధింపబడును.

దృషదో విద్యతే శక్తిః కదాచిచ్చలనైధసామ్
నపునర్మనసామస్తి శక్తిః స్పన్దావబోధనే. 86

శిలయందైనను నెపుడైన చలనశక్తియు, జ్వలనశక్తియు సంభవింపవచ్చునుగాని చైతన్యసహాయము లేనిచో మనస్సునకు స్పంద జ్ఞానవిషయములందు శక్తియెన్నటికిని యుండనేరదు.

స్పన్దః ప్రాణమరుచ్ఛక్తిశ్చలద్రూపైవ సాజడా
చిచ్ఛక్తిః స్వాత్మనః స్వచ్ఛా సర్వదా సర్వగైవ సా. 87

ప్రాణవాయుశక్తి చలనరూపమైయున్నది. చలించినప్పటికి అయ్యది జడరూపమేయగును. కాని ఆత్మ చిత్ (జ్ఞాన) శక్తిస్వరూపమై సర్వదా యతి స్వచ్ఛమై, సర్వవ్యాపకమైయున్నది.

చిచ్ఛక్తేః స్పన్దశక్తేశ్చ సంబంధః కల్ప్యతే మనః
మిథ్యైవ తత్సముత్పన్నం మిథ్యాజ్ఞానం తదుచ్యతే. 88

చిత్ స్పందశక్తుల సంబంధమే మనస్సగును. అయ్యది మిథ్యారూపమున నుత్పన్నమైనదగును మిథ్యాజ్ఞానమని చెప్పబడుచున్నది.

ఏషాహ్యవిద్యా కథితా మాయైషా సా నిగద్యతే
పరమేతత్తదజ్ఞానం సంసారాదివిషప్రదమ్. 89

మనస్సే అవిద్యయనియు మాయయనియు వచింపబడును. ఇది యేసంసారాది యనర్థములం గల్గజేయు యజ్ఞానమగును.

చిచ్ఛక్తేః స్పన్దశక్తేశ్చ సంగే సంకల్పకల్పనమ్
నకృతం చేత్పరిక్షీణాస్తదిమా భవభీతయః. 90

చిత్ స్పందశక్తుల గూర్చిన సంకల్పకల్పనకు హేతువే మనస్సైయున్నది. ఇయ్యది సంకల్పమొనర్పకున్నచో నిక సంసారభయమంతయు నశించినదేయగును.

వాయుతః స్పన్దశక్తిర్యా సాచితా చేత్యతే యదా
సచేత్యా చిత్తదైవాన్తః సంకల్పాద్యాతి చిత్తతామ్. 91



వాయువుయొక్క స్పందశక్తి, చైతన్యముచే ప్రబోధితమైనపుడు విషయసహితమగు నా చైతన్యమే అంతఃకరణముయొక్క సంకల్పముచే చిత్తత్వము నొందుచున్నది.

చిత్తత్త్వైషా చితో మిథ్యా కల్పితా బాలయక్షవత్
అఖండమండలాకార స్పన్దరూపా చిదేవ యత్. 92

ఈచిత్తత్వము బాలుని బేతాళమువలె మిథ్యారూపమున గల్పింపబడినది. పరమార్థమున నాచిత్తత్వము అఖండమండలాకారమైన స్పందరహితమగు చిద్వస్తువేయగును.

సైషా చిత్తా తదన్యేన కేన సంబాధ్యతే కిల
అఖండశక్తేరిన్ద్రస్య కేన స్యాత్సహ సంగరః. 93

ఈ చిత్స్వభావము అన్యమగు యెద్దానిచే ఖండింపబడును? అఖండశక్తిసంపన్నుడగు దేవేంద్రుని (లేక ఈశ్వరుని) కెవరితోటి సంగ్రామము పొసగును.

అతః సంబంధినోఽభావాత్సంబన్ధోఽత్ర న విద్యతే
సంబన్ధేన వినా కస్య సిద్ధం తత్కీదృశం మనః. 94

కాన సంబంధ్యాభావముచే చిదచిత్తులకు సంబంధమే ఘటింపకుండును. అట్టి సంబంధాభావముచే నిక మనస్సెట్లు సిద్ధించును?

చిత్స్పన్దయోరేకతాయాం కింనామ మన ఉచ్యతే
కా సేనా హయమాతంగ సంఘసంఘట్టనం వినా. 95

చిత్స్పందము, లేకమనినచో చిత్తు స్పందసాధకము కానందున నపుడు మనస్సను పదార్థమేయుండదు, ఏలన స్పందాభావముచే కేవలము చిద్రూపమే శేషించియుండుటచే గజాశ్వరథాదులు లేనిగాని సైన్యమువలె మనస్సునకు రూపమేయుండదు.

తస్మాన్నాస్త్యేవ దుష్టాత్మ చిత్తం రామ జగత్త్రయే
సైషా సమ్యక్పరిజ్ఞానాచ్చేతసో జాయతే క్షతిః. 96

ఓరామా! ఇవ్విధమున భేదాభేదములను యుభయపక్షములందును యీ ముల్లోకములందు చిత్తమను పదార్థమే లేకయున్నది. ఇట్టిచిత్తము సమ్యక్ తత్వ(బ్రహ్మ)జ్ఞానముచే వినాశమొందును.

ముధా మైవమనర్థాయ మనః సంకల్పయానఘ
మనో మిథ్యాసముదితం నాస్త్యత్ర పరమార్థతః. 97

కాన పాపరహితుడవగు నోరామా! అనర్థకరమగు నీమనస్సంకల్పమును వ్యర్థముగజేయకుము. ఏలయనిన యీమనస్సు మిథ్యారూపమున నుత్పన్నమైనదే యగును. పరమార్థమున యిందేమియును లేదు.

మాత్వమన్తః క్వచిత్కించిత్సంకల్పయ మహామతే
మనః సంకల్పకం రామ యస్మాన్నాస్తీహ కుత్రచిత్. 98

ఓ మహామతీ! నీవు నీయాంతర్యమున యొకింతేని సంకల్పమెన్నడును జేయకుము. ఏలన సంకల్పాత్మకమగు మనస్సనునది యెచటను లేదుగదా!

అసమ్యగ్జ్ఞానసంభూతా కల్పనామృగతృష్ణికా
హృన్మరౌ తవసంశాన్తా సమ్యగాలోకనామ్నసే. 99

మననశీలుఁడవగు నోరామా ! మిథ్యాజ్ఞానమువలన నుత్పన్నమైనదియు, కల్పనారూపమును మృగతృష్ణవంటిదియు నగు నీమనస్సు హృదయస్థసాక్షిచైతన్యమను మరుభూమియందు సమ్యక్ జ్ఞానోదయముచే శమించును.

జడత్వాన్నిఃస్వరూపత్వా త్సర్వదైవమృతంమనః
మృతేనమార్యతేలోక శ్చిత్రేయంమౌర్ఖ్యచక్రికా. 100

జడత్వముచేతను, (ఆత్మ) స్వరూపాభావముచేతను నియ్యది సర్వదా మృతప్రాయమే యగుచున్నది. ఇట్టిమృతించిన మనస్సుచే ప్రపంచము వధింపబడుననుట కడుచిత్రముగానున్నది. ఇయ్యదెట్టి మూర్ఖత్వము !

యస్యనాత్మా నదేహోఽస్తి నాధారోనాపిచాకృతిః
తేనేదంభక్ష్యతేసర్వం చిత్రేయంమౌర్ఖ్యవాగురా. 101

రూపముగాని, ఆధారముగాని యేమియులేని యీ మనస్సుచే ప్రపంచమంతయు గ్రసింపబడుననుట యెట్టి మూర్ఖత్వము !

సర్వసామగ్ర్యహీనేన హన్యతేమనసాపియః
నీలోత్పలదలాఘాతై ర్మన్యేదలితమస్తకమ్. 102

శస్త్రాస్త్ర, హస్తపాదాదులను యుద్ధసామగ్రిలేని యీ మనస్సుచేగూడ హతుడగువాని శిరస్సు నీలకమల ఘాతముచేగూడ ఖండితమగునని నానిశ్చయము.

జడేనమూకేనాన్ధేన నిహతోమనసాపియః
మన్యేసదహ్యతేమూఢః పూర్ణచంద్రమరీచిభిః. 103

జడమును, అంధప్రాయమునగు నీమనస్సుచే హతుడగువాడు చంద్రకిరణముచేగూడ హతుడగునని తలంచెద.

విద్యమానోఽపియఃశూరో లోకస్తేనాభిభూయతే
అవిద్యమానమేవేదం హన్యతేముగ్ధతోదితా. 104

యుద్ధసామగ్రిగల్గియు మూఢులు అవిద్యమానమేయగు మనస్సుచే పరాజితులగుటయు, మఱియు వివేకులు వైరాగ్యసమాధ్యాదుల యభ్యాసముచే అవిద్యమానమగు మనస్సును జయించుటయు నంతయు అజ్ఞానోదితమేయగును. పరమార్థమున నివేమియును లేదు.

మిథ్యాసంకల్పకలితం మిథ్యావస్థితిమాగతమ్
అన్విష్టమపినోదృష్టం కాతస్యకిలశక్తతా. 105

మిథ్యాసంకల్పరచితమును, మిథ్యారూపముననే స్థితిఁబొందినదియు, అన్వేషించినను గనుపట్టనిదియు మిథ్యావస్తువునగు మనస్సు మఱొకదానిని జయింప నెట్లుసమర్థమగును ?



అహోనుఖలుచిత్రేయం మాయామయవిధాయినీ
చేతసాప్యతిలోలేన లోకోఽయమభిభూయతే. 106

ఆహా ! మహామాయావియగు మనసునిగూడ సృజించిన ఈమాయయెంత విచిత్రమైనదో గాంచుము ! నాశవంతమగు నిట్టిచిత్తముచే గూడ లోకము పరాజితమగుచున్నదే.

మౌర్ఖ్యంయదాపదాస్విష్టః కాహి నాపదజానతః
పశ్యమౌర్ఖ్యాదియంసృష్టి రజ్ఞానేనైవజన్యతే. 107

అజ్ఞానమెపుడుకలిగెనో అపుడే జీవుడు సర్వాపదలకును నిలయుఁడయ్యెను. అజ్ఞాని పొందని యాపద యెద్దిగలదు ? అజ్ఞానకారణముననే యీ సృష్టియంతయునుత్పన్నమగుచున్నది గదా !

హాకష్టమపిదుర్బుద్ధేః సృష్టిమౌర్ఖ్యవశంగతా
అసత్తైవయదేతేన జీవేనాప్యుపపాద్యతే. 108

ఆహా ! ఎట్టి విషాదకరమైనవిషయము ! అజ్ఞానవశమున మనోదేహాదులచే బాధితుడైనను జీవుఁడసన్మార్గముననే యవలంబించుచు దుఃఖార్థ మీసృష్టిని పరిగ్రహించుచునేయున్నాడు.

మన్యేమౌర్ఖ్యమయీసృష్టి రియమత్యన్తపేలవా
వాస్తరంగప్రవాహేణ కణశఃపరిశీర్యతే. 109

అజ్ఞానమయమును, అవిచారోత్పన్నమునగు యీ సృష్టివిచారముచే బాధితమగుటచే నతి పేలవమని యెంచెద. మనుజుని స్వకల్పిత తరంగసమూహముచే సమ్మర్దితమైన జలము కణకణము నశించుచున్నదనుట భ్రాంతియెట్లగునో, అట్లనే యీ సృష్టియు భ్రాంతిరూపమైనది.

నీలాంజనా లవాలేన యన్త్రేణైవవిచూర్ణ్యతే
ఇందోరాభోగపూర్ణస్య కరస్పర్శేనముహ్యతి. 110.

అట్టిజలము ఆవర్తమధ్యభాగమున ఛిద్రయుక్త నీలవర్ణయంత్రముచే చూర్ణమగునను టయు, చలించునపుడందలి చంద్రకిరణ స్పర్శచే యున్మత్తతవలన పారవశ్యమునొందు ననుటయు భ్రాంతి యెట్లగునో, అట్లనే యీ సృష్టియు భ్రమరూపమగును.

రిపుభిర్నయనోన్ముక్తై ర్దృష్టః సూత్రైర్నిబధ్యతే
సంకల్పకృతమాశూర సేనయాపరిభూయతే. 111

శత్రువుల కంటబడిన మనుజుడు నేత్రోన్ముక్త సూత్రములచే బంధింపబడుననుటయు, సంకల్పనిర్మితమగు వీరసైన్యముచే పరాజితమగుటయు భ్రాంతియగుచందమున ఈ సృష్టియు భ్రమరూపమైనది.

తస్మాత్కిలేయంమనసా నస్థితేనైవకుత్రచిత్
కల్పితేన ముధాన్యేన కృపణేననిహన్యతే. 112

కాన మిథ్యారూపమున కల్పితమై యెచటను యునికిలేని యీ తుచ్ఛమనంబుచే లోకమంతయు హతమగుచున్నది.

మూర్ఖలోకమయీ యాస్సృష్టి ర్మనఏవాసదుత్థితమ్
యఃశక్తోనవశీకర్తుం నాసౌ రామోపదిశ్యతే. 113

ఓ రామా ! కల్పితలోకమయమగు నీసృష్టిని, అసద్రూపమున నుదితమగు నీమనంబును, వశీకరింప జాలనివాడు అధ్యాత్మజ్ఞానోపదేశమునకర్హుడు గానేరడు.

అభిజాతాఽస్వరూపైషా షడ్జ్ఞాక్షోదేమునక్షమా
నోపదేశగిరాంయోగ్యా పరిపూర్ణేవసంస్థితా. 114

బిభేత్యేషాపివీణాయా స్తన్త్రీగుణతనుధ్వనేః
బన్ధోరపి ససిద్రస్య బిభేతివదనద్యుతేః. 115

అసతోఽపి జనాదుచ్చైర్ఛర్గితాద్భీతా పలాయతే
స్వేనైవమనసాప్యజ్ఞా కిలైషావివశీకృతా. 116

అట్టివానిదుష్టబుద్ధి బాహ్యపదార్థములందే స్థిరపడినదై, అంతమాత్రముననే పూర్ణత్వమున నొందినట్లెంచుచు ఆంతరికస్వరూపమును గ్రహింపనేరక, సూక్ష్మపదార్థములను విచారింపజాలక, అధ్యాత్మజ్ఞానోపదేశమునకయోగ్యమైయుండును. మఱియు వానిబుద్ధి వీణాతంతియొక్క సూక్ష్మ ధ్వనిచేగూడ భీతిఁజెందును. నిద్రించుచున్న బంధువుల ముఖకాంతిచేతగూడ భయపడును. శత్రువు లేకున్నను శత్రువే తెంచెనని బల్కిన ప్రతారకుని ముఖమునుండి వెలువడిన యుచ్చస్వరమును విని భయవిహ్వలయై పరుగిడును. వెయ్యేల జ్ఞానశూన్యమగు నయ్యది స్వమనంబుచేతనే వశీకృతమగు చున్నది.

సుఖలవవివశాద్విషేవతప్తా
ద్ధృదయగతేన నిజేనచేతసైవ
విధురితధిషణా నవేత్తిసత్యం
తదపికథంపరిమోహితో ముధైవ. 117

ఇత్యార్షే వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే మనోవినివారణంనామ
త్రయోదశః సర్గః ॥ 13 ॥

విషసహితమోదకాస్వాదనువలె. నిట్టిబుద్ధి సుఖలేశముచే వివశమై (మరణోన్ముఖమై) ప్రహారమొనర్చు శత్రువుచేవలె స్వహృదయస్థ చిత్తముచే సంతాపితమై వివేకరహితమై అందుచే సత్యమునేమియు రెఱుంగకయుండును. అట్లయినను దీనిచే మనుజుడు వ్యర్థముగ విమోహితుఁడే యగుచున్నాడు.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
మనోవినివారణమను త్రయోదశ సర్గము ॥ 13 ॥

---



## చ తు ర్ద శః స ర్గః.

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

సంసారసాగరాసార కల్లోలైరుహ్యమానయా
మతేర్మానదమూకత్వం యయాజనతయార్జితమ్. 1

ఆత్మలాభమయోదార కలాభిరిహసామయా
విచారోక్తిభిరేతాభిః శాస్త్రేఽస్మిన్నోపదిశ్యతే. 2

శ్రీ వసిష్ఠుడు:- మాననీయుఁడవగు నో రామా ! సంసారసాగరమందు విషయసుఖాభిలాషయను తరంగములచే గొట్టుకొనిపోవుచు పరమార్థవిషయమున మూకత్వము వహించినవారలు ఆత్మలాభసంయుక్తమై, ఉత్తమ కళాప్రపూర్ణమై, తత్వవిచారోక్తిసహితమైనదగు నీయధ్యాత్మ శాస్త్రోపదేశమున కర్హులుకారని నేను తలంచెద.

నపశ్యత్యేవయోఽత్యర్థం తస్యకఃఖలుదుర్మతిః
విచిత్రమంజరీచిత్రం సందర్శయతికాననమ్. 3

కఃకుష్ఠఘుర్ఘురఘ్రాణం నానామోదవిచారణే
మూర్ఖమాత్మోపదేశేన ప్రమాణీకురుతేఽమతిః. 4

విపర్యస్తేన్ద్రియంమత్తం మదిరాఘూర్ణితేక్షణమ్
ధర్మనిర్ణయసాక్షిత్వే కఃప్రమాణీకరోత్యధీః. 5

కఃశివంవాశ్మశానస్థం సమవాయకథాశతమ్
పరిపృచ్ఛతిసందేహే కశ్చమూర్ఖంప్రశాస్తిచ. 6

నేత్రములున్నను చూడఁజాలనివాని కేదుర్బుద్ధి పలువిధచిత్రవిచిత్ర లతలచే ప్రపూర్ణమగు వనమును జూపనేర్చును ? సుగంధతత్వనిర్ణయమున ఘ్రాణశక్తిరహితు నాశ్రయించు దుర్బుద్ధి యెవ డుండును ? ఏదుర్మతి విపరీతములైన యింద్రియములఁగల్గి మదిరాపానముచే ఘూర్ణితనేత్రయుక్తుడై యున్నవానిని ధర్మనిర్ణయసాక్షిత్వమున ప్రామాణికముగ నెంచజూచును? శవమును గాని, స్మశానస్థ జనసమూహమునుగాని సందేహముచే నెవడు ప్రశ్నించును ? మఱియు మూర్ఖునకెవడు ఉపదేశింప గల్గును ?

గేహనాశయబిలస్థోఽపి మూకోన్ధోఽపినసిర్జితః
మనోవ్యాలఃసదుర్బుద్ధిః కథంనామోపదిశ్యతే. 7

హృదయబిలమందలి మనస్సను మూక, యంధసర్పమును జయించని దుర్బుద్ధి కెవరుపదేశింపగలరు ?

జితమేవమనోవిద్ధి వస్తుతోయన్నవిద్యతే
సికతాత్సాచిరాస్త్వైవ యాశిలానైవవిద్యతే. 8

ఓ రామా ! ఏమనస్సు యథార్థముగలేదో అయ్యది జయింపబడినదనియే యెంచుము. ఏలన లేనిదగు శిల చెంతనుండి పారద్రోయబడినదే యగునుగదా !

మనోనవిజితంరామ యేనాసదపిదుర్ధియా
తేనాగ్రస్తవిషేణైవ మ్రియతే విషమూర్ఛయా. 9

ఓ రామా! యథార్థముగ లేనిదేయగు మనస్సును జయింపజాలనివాడు విషగ్రస్తుడుగాకున్నను విషమూర్ఛచే మరణించినవాడగును.

జ్ఞః పశ్యతిసదైవాత్మా స్పందనే ప్రాణశక్తయః
ఇన్ద్రియాణిస్వధర్మేషు మనోరామకిముచ్యతే. 10

ఓరామా! జ్ఞాని యెల్లపుడును తనయాత్మనే సందర్శించును. మఱియు స్పందనమందాతడు ప్రాణశక్తులను వీక్షించును. ఇంద్రియములను వాటివాటి ధర్మములందునియుక్తమైనట్లు గాంచును. ఇక వానికి మనస్సునదెచట?

ప్రాణానాంస్పందనీశక్తి ర్జ్ఞానశక్తిః పరాత్మనః
ఇన్ద్రియాణాంనిజాశక్తిరేకః కోఽత్ర నిబధ్యతే. 11

ప్రాణములకు స్పందశక్తి, ఆత్మకు జ్ఞానశక్తి, ఇంద్రియములకు రూపరసాదుల సాక్షాత్కరించుకొను శక్తియుఁగలదు. అట్టిచో నిక బంధింపబడునదెద్ది?

సర్వాస్తదంశవస్తస్య సర్వశక్తేః కిలాత్మనః
పృథక్తావాచ్యతాచేయం కుతోనామ తవోత్థితా. 12

జీవులందఱి వ్యవహారశక్తియు సర్వశక్తిమంతుడును, సర్వనిర్మాతయునగు పరమాత్మ యొక్క కిరణరూపమేయగును. అట్లైన నిక మనస్సనున్నగునది వేఱుగ యెటనుండి యావిర్భవించినది?

కింనామజీవఇత్యుక్తం యేనేహాస్వీకృతంజగత్
చిత్తంచైవాసదేవత్వం విద్ధికాతస్యసక్తతా. 13

జగత్సంతతియు యంధప్రాయమొనర్చిన యీ జీవునకు ఆత్మకంటె వేఱుగ సత్తయేమి గలదు? ఆత్మకన్యముగ జీవుడను వేఱొక చైతన్యమైనచో 'నాన్యోఽస్తిద్రష్టా' 'నాన్యోఽస్తివిజ్ఞాతా' (అనగా బ్రహ్మమునకన్యముగ మఱియొక చేతనవస్తువులేదను) శ్రుతివాక్యములకు విరోధముకలుగును. ఇక జీవుడచేతనమైనచో వానియందు శక్తియే యుండజాలదుగదా; కాన ఆత్మకంటె వేఱుగ చిత్త జీవుల నసద్రూపములుగనే యెఱుంగుము.

మనోనిర్దగ్ధదృష్టీనాం దృష్ట్వాదుఃఖపరంపరామ్
మతిర్మేకరుణాక్రాన్తా రామముగ్ధేవతప్యతే. 14

ఓ రామా! స్వకల్పితమనంబుచే తమ పరమార్థదృష్టిని వినాశమొనర్చుకొనినవారి దుఃఖపరంపరల గాంచి నాచిత్తము మిగుల కరుణాక్రాంతమై పరితపించుచున్నయది.

కః కిలాత్రకుతః ఖేదో యన్మూర్ఖః పరితప్యతే
దుఃఖాయైవహిజాయన్తే కరభాః ప్రాకృతాస్తథా. 15

మూర్ఖుడు దుఃఖమొందుటఁగాంచి ఖేదపడనవసరములేదు. ఏలన గార్ధభమున్ను, మూర్ఖుడున్ను దుఃఖార్థమే జనింతురుగదా!



వినాశాయైవజాయన్తే జడాదేహేష్వబుద్ధయః
అనారతోదయాః పాపా బుద్బుదాజలధేరివ. 16

నిరంతరము పాపకర్మల యొనర్చువారును దేహమందాత్మాభిమానముగలవారును నగు దుర్బుద్ధులు సముద్రమందలి బుద్బుదములవలె వినాశముకొఱకే జన్మింతురు.

కియన్తః పశ్యపశవః ప్రత్యహంప్రతిమండలమ్
సూనావద్భిర్నిహన్యన్తే కైవాత్రపరిదేవనా. 17

అర్బుదాన్యనిలోహన్తి కుమాజాతేషుచాన్వహమ్
దంశానాంమశకానాంచ కైవాత్రపరిదేవనా. 18

దిశంప్రతిగిరీన్ద్రేషు పులిన్దాద్యా వనేవనే
నిఘ్నంతిమృగలక్షాణి కైవాత్రపరిదేవనా. 19

జలేజలచరవ్యూహానస్మాత్స్థూలో నికృన్తతి
గ్రాసార్థంనిర్దయోమత్స్యః కైవాత్రపరిదేవనా. 20

లిక్షామణుకణక్షామాం క్షుధాఖాదతిమక్షికా
తాంకోశకారః క్షుధితో దంశస్తమపిచంచలమ్. 21

తందంశందర్దురోభుంక్తే వ్యాలస్తమపిదర్దురమ్
సర్పముగ్రంఖగోహన్తి బభ్రుస్త్వేనంనికృన్తతి. 22

బభ్రుంహినస్తిమార్జారో మార్జారంశ్వానికృన్తతి
ఋక్షః కౌలేయకంహన్తి ఋక్షంవ్యాఘ్రోనికృన్తతి. 23

సింహోఽభిభవతివ్యాఘ్రం శరభః సింహమత్తిచ
శరభోనాశమాయాతి మత్తమేఘవిలంఘనే. 24

మేఘావాతైర్విఘూయన్తే వాయవోగిరిభిర్జితాః
గిరయోవజ్రనిష్పిష్టాః శక్రస్యవశగః పవిః. 25

విష్ణునాక్రియతేశక్రో విష్ణుర్గచ్ఛతిజన్తుతామ్
సుఖదుఃఖదశామేతాం జరామరణపాలితామ్. 26

జన్తవోఽపిమహాకాయా అపివిద్యాయుధాన్వితాః
లిక్షాభిరంగలగ్నాభిరుపజీవ్యన్త ఏవహి. 27

ఎన్నియో పశువులు ప్రతిచోటను వధ్యస్థానమునకు గొంపోబడి కటికవారిచే వధింపబడుచున్నవి. వాటికై దుఃఖపడనేల? భూమియందు జనించు ప్రాణులలో నెన్నియో కోట్లు యీగలు దోమలు ప్రతిదినము వాయువుచే నశింపజేయబడుచున్నవి. గొప్పగొప్ప పర్వతములపైగల యరణ్యములందు వసించు బోయవారు లక్షలకొలది జంతువులను వధించుచున్నారు. వాటన్నిటికొఱకై దుఃఖింపనవసరమేమి? మఱియు జలమందు పెద్దమత్స్యములు చిన్నచిన్న జలజంతువులను భక్షించుచున్నవి. మక్షిక పేనుల దినుచున్నది. ఆకలిగొన్న సాలీడా మక్షికను యాసగింపుచున్నది. సాలీడును వనమక్షిక భుజించుచున్నది. వనమక్షికను కప్పయు కప్పను పప్పమున్న భక్షించుచున్నవి.

క్రూరసర్పములంగూడ గరుడపక్షిగాని ముంగిసగాని తినుచున్నది. ముంగిసను మార్జాలము, మార్జాలమును శునకము, శునకమును భల్లూకము, భల్లూకమును వ్యాఘ్రము వధించుచున్నవి. వ్యాఘ్రము సింహముచే జయింపబడుచున్నది. సింహమును శార్దూలము భుజించున్నది. ఆశార్దూలమున్ను దట్టమగు మేఘమును దాటనెంచి క్రిందబడి మరణించున్నది. మేఘము వాయువుచే తొలగింపబడుచున్నది. వాయువు పెద్దపెద్దపర్వతములచే నిర్జింపబడుచున్నది. పర్వతములు వజ్రముచే చూర్ణములగుచున్నవి. వజ్రము యింద్రుని వశమునందున్నది. ఇంద్రుడు విష్ణువుచే సృజింపబడుచున్నాడు. విష్ణువున్ను సుఖదుఃఖ దశాయుక్తమగు మత్స్యకూర్మవరాహాది జంతురూపముల నొందుచున్నాడు. దీర్ఘదేహులును, శస్త్రాస్త్రయుక్తులును, విద్యావంతులును నగువారుగూడ దేహమందు సంలగ్నమగు కృమిజాలముచే భక్షింపబడుచున్నారు.

అజస్రమేవహూలూన విశీర్ణంభూతజంగలమ్
పరస్పరమలంమోహాదద్యతే రక్ష్యతేఽపిచ. 28

ఇవ్విధమున ప్రాణికోట్లు అధిభౌతిక జీవులచే విచ్ఛిన్నులై ఆధ్యాత్మిక ఆధిదైవిక దుఃఖములచే పరిపీడితులై అజ్ఞానకారణమున పరస్పరము భక్షించుకొనుచు రక్షించుకొనుచున్నారు.

అనారతంవినశ్యన్తి వివిధాభూతజాతయః
అనారతంచజాయన్తే లిక్షాయూకాపిపీలికాః. 29
జలకోశేషుజాయన్తే మత్స్యేభమకరాదయః
భూమావన్తఃప్రజాయన్తే కీటౌఘావృశ్చికాదయః. 30
అన్తరిక్షేఽపిజాయన్తే ఆకాశవిహగాదయః
వనవీథిషుజాయన్తే సింహవ్యాఘ్రమృగాదయః. 31
ప్రాణ్యంగేష్వపిజాయన్తే విచిత్రాఃకకుభంప్రతి
స్థావరేష్వపిజాయన్తే ఘుణాజఘనకాదయః. 32
శిలాన్తరేషుజాయన్తే కీటభేకఘుణాదయః
విష్ఠాయామపిజాయన్తే నానాకీటగణాస్తథా. 33

పిపీలికాది పలువిధ జీవజాతులు నిరంతర ముత్పత్తివినాశములం బొందుచున్నవి. జలాశయములందు యేనుగువంటి యాకృతిగల పెద్దపెద్దమత్స్యములు మకరాదులు యుత్పన్నములగుచున్నవి. భూమియందు వృశ్చికాదికీటక సమూహములు జనించుచున్నవి. ఆకాశమున పక్షులున్ను, వనములందు సింహవ్యాఘ్రమృగాదులును జన్మించుచున్నవి. ప్రాణులదేహములందు విచిత్రకృమిజాలముత్పన్నమగుచున్నది. స్థావరములందును ఘుణ (మ్రానుతొలుచు పురుగు) ప్రభృత్యాదికీటములు పుట్టుచున్నవి. శిలాంతర్గతమునకూడ మండూక, ఘుణాది ప్రాణిసమూహములు జనించుచున్నవి. మలమందును పలువిధకీటము, లుత్పన్నమగుచున్నవి.

ఏవమేతేష్వసంఖ్యేషు జన్మస్వపచయేషుచ
...శ్రాంకరుణావన్తో నన్దన్తుప్రరుదన్తువా. 34



ఇట్టి యసంఖ్యాకములగు జన్మవినాశములంగూర్చి కృపాళువు నిరంతరము హర్షించినను శోకించినను సరియేగాని రాగద్వేషభావముచే వాటియందు పేక్షగేయ యుక్తమగును.

అనారతమృతావస్మిన్ననారతసముద్భవే
సంసారసంభ్రమేయుక్తా నతుష్టిర్నచదుఃఖితా. 35

నిరంతర ముత్పత్తివినాశములతోఁగూడిన యీ సంసారభ్రమయందు సుఖదుఃఖములు రెండును యుక్తముగా నేరవు.

పంకయస్త్వేవమేవేమా వృక్షపర్ణగణైఃసమాః
ఉత్పత్త్యోత్పత్త్యలీయన్తే భూతానాంభూరిసంభవాః. 36

ఇవ్విధమున పత్రసమూహములవలె పలువిధ జీవకోట్లుత్పన్నమగుచు మిలమిల వినాశ మొందుచున్నవి.

యఃపరివృత్తఃకుబుద్ధీనాం దయావాన్దుఃఖమార్జనే
స్వగతచ్ఛత్రనిర్మృష్ట సూర్యాంశుఖద్యతేనభః. 37

కుబుద్ధుల దుఃఖములను దూరీకరింపజూచు దయావంతుడు తనఛత్రముచే ఆకాశమునంతయు నాతపరహితమొనర్ప జూచినట్లుండును.

నతిర్యక్సమధర్మాణ ఉపదేశ్యానరాభువి
కథార్థకథనేనార్థః కఃస్థాణునికటేవనే. 38

ఓరామా! కీటపతంగ పశుధర్మావలంబులగు నీచమనజులీప్రపంచమున నుపదేశార్హులెన్నటికినిగా నేరరు. అట్టివారికుపదేశించిన నేమిప్రయోజనము?

కింకిలస్ఫారమనసాం పశూనాంచవిశేషణమ్
కృష్యన్తేపశవోరజ్జ్వా మనసామూఢచేతసః. 39

దృశ్యవిషయములందే సంలగ్నమైన చిత్తముగల మనుజులకును, పశువులకును భేదమేమి? ఏలయన త్రాటిచే పశువులీడ్వబడును. మూఢచిత్తులు తమ మనస్సుచే నీడ్వబడుదురు.

స్వచిత్తపంకమగ్నానాం స్వనాశారబ్ధకర్మణామ్
మూర్ఖాణామాపదందృష్ట్వా ప్రరుదన్త్యుపలాఅపి. 40

స్వచిత్తపంకనిమగ్నులును, స్వనాశార్థమే కార్యారంభ మొనర్చువారునగు మనుజుల గాంచి శిలలుగూడ రోదన మొనర్చుచున్నవి.

అనిర్జితాత్మచిత్తానాం సమన్తాద్దుఖతాదశాః
తన్మార్జనంకృతప్రజ్ఞో నాఽతఃసంప్రతిపద్యతే. 41

తమచిత్తములం జయించనివారి కంతటను దుఃఖములే సంప్రాప్తమగును. కాన, భూమిపైగలధూళినంతయు తొలగింప యత్నింపనివిధమున ప్రాజ్ఞుడు తన్నివారణమందు ప్రవృత్తుడు గానేరడు.

విసర్జితాత్మచిత్తానాం దుఃఖాని రఘునందన
సువిచార్యాణితేనాత్రి జ్ఞాతజ్ఞేయఃప్రివర్తతామ్. 42

ఓరాఘవా! శమశమ చిత్తములఁజయించిన వారియొక్క దుఃఖములు సులభముగ నివారింపఁదగును. కాన నట్టివారి దుఃఖనివారణమందు జ్ఞాని ప్రవృత్తుఁడగును.

మనోనాస్తిమహాబాహో మాముధోపపరికల్పయ
అనేనకల్పితేనత్వం వేతాళేనేవహన్యసే. 43

మహాబాహుఁడవగు నోరామా! మిథ్యయగు యీమనంబును వ్యర్థముగకల్పనజేయకుము. అట్లుకల్పించుటచే బేతాళముచే బాలునివలె నీవున్ను హతుఁడవు కాగలవు.

యావద్విస్మృతవానాత్మతత్త్వం మూఢోభవద్భవాన్
తావత్తవమనోవ్యాలో బభూవాభ్యుదితస్తతః. 44

ఆత్మతత్త్వమును మఱచి మూఢునివలె యుండునంతవఱకు మనస్సను సర్పము నీ నలువైపుల విజృంభించుచునే యుండును.

ఇదానీంభవతాజ్ఞాతం యథాభూతమరిందమ
సంకల్పాద్వర్ధతేచిత్తం తదేవాశుపరిత్యజ. 45

అరిసూదనుఁడవగు నోరామా! ఇపుడునీవు పరమార్థభూతమగు ఆత్మను లెస్సగ నెఱింగితివి. సంకల్పము చేతనే చిత్తము వృద్ధియగుచున్నది గాన నీవద్దానిని సత్వరము త్యజింపుము.

దృశ్యమాశ్రియసీదంచేత్తత్సచిత్తోసి బంధవాన్.
దృశ్యంసంత్యజసీదంచేత్తదచిత్తోసి మోక్షవాన్. 46

దృశ్యమునే యాశ్రయించుచో నీవు బద్ధుడవు, చిత్తసహితుడవు నగుదువు. దృశ్యమసత్యమనియెఱింగి యద్దానినిత్యజించుచో ముక్తుడవు, చిత్తరహితుడవు నగుదువు.

అయంగుణసమాహారో బంధాయైవసమాశ్రితః
సంత్యక్తోభవమోక్షాయ యథేచ్ఛసితథాకురు. 47

త్రిగుణాత్మకమును, మాయామయమునగు నీదృశ్యము నాశ్రయించినచో బంధమున్ను, పూర్ణముగత్యజించివైచినచో మోక్షమున్ను సిద్ధించును. ఇట్లెఱింగి యిక నీయిష్టము వచ్చిన యాచరింపుము.

నాహంనేదమితిధ్యాయంస్తిష్ఠ త్వమచలాచలః
అనన్తాకాశసంకాశ హృదయోహృదయేశ్వరః. 48

ఓరామా! బాహ్యాభ్యంతర దృశ్యములు రెండును నేనుగానని భావించుచు పర్వతమువలె స్థిరముగనుండుము. హృదయేశ్వరుని (ఆత్మయొక్క) హృదయమాకాశమువలె యతివిశాలమైన దిగదా!

ఆత్మనోజగతశ్చాస్య త్వమంగకలనామలమ్
[illegible]మద్వైత్వమయీంత్యక్త్వా శేషస్థఃసుస్థిరోభవ. 49



జగదాత్మలకుగూర్చిన భ్రాంతి రూపమగు ద్వైతకల్పనను పూర్ణముగ వదలి శేషించిన సాక్షిచైతన్యమందు నీవు స్థితుఁడవుగమ్ము.

ఆత్మనోజగతశ్చాన్తర్ద్రష్టృదృశ్యదశాన్తరే
దర్శనాఖ్యేస్వమాత్మానం సర్వదాభావయన్భవ. 50

జగదాత్మల యొక్కయు ద్రష్టృదృశ్యముల యొక్కయు మధ్యను దర్శనమనునట్టి (అనగా [illegible] దృశ్యమను త్రిపుటియందనుస్యూతమైన సాక్షిరూపమగు) ఆత్మను సర్వదా భావన [illegible]

స్వాద్యస్వాదకసంత్యక్తం స్వాద్యస్వాదకమధ్యగమ్
స్వాదనంకేవలంధ్యాయన్ పరమాత్మమయోభవ. 51

అట్లనే స్వాద్య (ఆస్వాదింపదగినది) స్వాదకములు రెంటిని విడచి, స్వాదనరూపమున మధ్యనున్నటి (త్రిపుటియొక్క) సాక్షిచైతన్యమునే ధ్యానించుచు నిరంతర మాత్మమయుఁడవై యుండుము.

రామానుభవనీయస్య తథానుభవితుఃస్వయమ్
అవలంబ్యనిరాలంబం మధ్యంమధ్యేస్థిరోభవ. 52

ఓరామా! ఇవ్విధముననే అనుభవనీయము అనుభవియను నీ రెంటిమధ్యను నిరాలంబమై త్రిపుటికంటెను వేఱైయున్నట్టి శుద్ధరూపమును హృదయమున నాశ్రయించి సుస్థిరుఁడవైయుండుము

భవభావనయాహీనం భావాభావదశోజ్ఝితమ్
భావయన్నేవమాత్మానమాత్మసంస్థః స్వయంభవ. 35

జాగ్రత్స్వప్న సుషుప్తిరహితమై, వాటన్నింటికిని సాక్షిభూతమై నెలయునట్టి ఆత్మను భావించుచు స్వయముగ ఆత్మయందు స్థితుఁడవుగమ్ము.

ఆత్మసత్తాంత్యజన్నేతాం చేత్యంభావయసిస్వయమ్
యదారామతదాయాసి చిత్తతామతిదుఃఖదామ్. 54

ఓరామా! ఇట్టిశుద్ధ చిన్మాత్రస్వభావముగల ఆత్మసత్తను త్యజించి, విషయములనేభావించుచో దుఃఖప్రదమగు చిత్తత్వదశను బొందెదవు.

చిత్తతాంశృంఖలామేతాం స్వరూపజ్ఞానయుక్తితః
బిలాచ్చిత్తాన్మహాబాహో స్వాత్మసింహంవిమోచయ. 55

మహాబాహుడవగు నోరామా! చిత్తమను సంకెలను ఆత్మస్వరూపజ్ఞానమను యుక్తిచే త్రెంపి, చిత్తపంజరమునుండి ఆత్మసింహమును విడిపింపుము.

పరమాత్మదశాంత్యక్త్వా చేత్యంపరిపతన్నలమ్
యదాగచ్ఛసిసంకల్పం చేత్యంసంపశ్యసే తదా. 56

శుద్ధమగు స్వాత్మస్థితినివదలి విషయోన్ముఖుఁడవై సంకల్పదశను యెపుడు పొందెదవో అప్పుడే విషయములఁ గాంచెదవు (విషయాకారుఁడవగుదువు.)

ఆత్మనోవ్యతిరిక్తంసచ్చిత్తమిత్యంగసంవిదా
మనఃసంపద్యతేదుఃఖ క్షీయతేత్యక్తయాతయా. 57

పూర్వానుభవముచే గల్గిన దృశ్యసంస్కారములచే చిత్తము కించిత్స్వాలత్వమొందునపుడు ఆత్మకంటె వేఱుగ చిత్తమనునది సిద్ధించుచున్నది. కాని నిరంతరమననాదులచే నదియే దృఢనిశ్చయయుతమై ఆత్మచే పరిత్యక్తమగునపుడు వినాశ మొందును.

ఆత్మైవేదంజగత్సర్వ మిత్యన్తఃసంవిదోదయే
క్వచేతాక్వచవాచిత్తం కించేత్యంచేతనంచకిమ్. 58

ఈ జగత్తంతయు నాత్మయేయను జ్ఞాన మంతఃకరణమున నుదయించిన నిక విషయోపహిత చేతనమేమి? (ఉధిపాభూతముగు) చిత్తమేమి? (చైత్యమగు) విషయములేమి? (చేతనమగు) వృత్తియేమి? (అనగా కేవలపరమార్థ స్థితియందివేవియునుండవని భావము).

అహమాత్మేతిజీవోఽస్మీత్యేతావచ్చిత్తకంవిదుః
అనేనేత్థమనాద్యన్తం దుఃఖంరాఘవతన్యతే. 59

ఓరాఘవా! 'దేహేంద్రియాదిసహితమగు జీవుడనే నేన'ను ననుభవస్థితియే చిత్తమనబడును. ఈ చిత్తమే ఆద్యంతరహితమగు దుఃఖమును విస్తరింపజేయుచున్నది.

అహమాత్మానజీవాఖ్యాః సత్తాఘ స్తీతరాఃక్వచిత్
ఇత్యేవచిత్తోపశమః పరమంసుఖముచ్యతే. 60

'నేను శుద్ధబ్రహ్మమును, బ్రహ్మమున కన్యముగ జీవసత్త పరమార్థమున యెచటను లేదు' అనునిట్టియనుభవము నొందుటయే చిత్తోపశమము, పరమసుఖము ననఁబడును.

ఆత్మైవేదంజగదితి జాతేరాఘవనిశ్చయే
అసత్తాచేతసోజాతా భవత్యేవ నసంశయః. 61

రాఘవా! (చిత్తమున్ను జగదంతర్గతమేగాన) ఈజగత్తంతయు ఆత్మయేయను నిశ్చయముచే చిత్తముయొక్క లేమిసిద్ధించును. ఇందేమియు సంశయములేదు.

ఏవంసత్యావబోధేన స్వాత్మైవేదమితిస్థితిః
మనఃసుగలితంవిద్ధి సూర్యభాసాతమోయథా. 62

ఇట్లు సత్యజ్ఞానోదయముచే స్వాత్మయే జగత్తను ననుభవస్థితిగల్గునపుడు సూర్యప్రకాశముచే నంధకారమువలె మనస్సు నశించినదనియే యెఱుంగుము.

మనఃసర్పఃశరీరస్థో యావత్తావన్మహద్భయమ్
తస్మిన్నుత్సారితేయోగా ద్భయస్యావసరఃకుతః. 63

మనస్సను సర్పము శరీరముననుండువఱకు భయోత్కర్షముండియేయుండును కాని సమాధిచేతను లేక బ్రహ్మాత్మైక్యవిజ్ఞానముచేతను దానిని వెడలగొట్టిన నిక భయమెచట?



భ్రాన్తిమాత్రోత్థితశ్చిత్తే వేతాలోఽతిబలోఽనఘ
సమ్యగ్జ్ఞానేనమన్త్రేణ ప్రసభం వినిపాత్యతామ్. 64

పాపరహితుఁడవగు నోరామా! చిత్తమందుద్భవించిన మహాబలశాలియగు భ్రాంతిరూపబేతాళమును సమ్యక్ జ్ఞానమను మంత్రముచే బలాత్కారముగ వినాశ మొనర్పుము.

దేహగేహాద్గతేచిత్త యక్షేబలవతాంవరే
నిరాధిర్విగతోద్వేగ స్తిష్ఠనాస్తిభయంతవ. 65

మిగులబలిష్ఠమగు చిత్తపిశాచము దేహమనుగృహమునుండి వెడలిపోవ నీవిక యుద్వేగమానసిక వ్యథారహితుఁడవై యుండుము ఏలన చిత్తాభావముచే నీకికభయమనునదే లేదుగదా.

నీరాగఏవ నిరుపార్జన ఏవచాస్మి
త్యేతావతైవ గలితాతవ చిత్తసత్తా
నిర్దుఃఖముత్తమపదం పరమంగతోఽసి
తిష్ఠోపశాన్త పరమైషణఏవమన్తః. 66

ఇత్యార్షేశ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే స్వచిత్తనిరూపణంనామ
చతుర్దశః సర్గః ॥ 14 ॥

'ఆత్మలాభముచే కోర్కెలన్నియు పూర్ణమగుటచే రాగరహితుడనై బాహ్యవిషయసుఖమేమియు నపేక్షింపకయున్నాన'ను నిశ్చయముచే నీచిత్తసత్త నశించినదనియే యెఱుంగుము. ఇట్టి విధమున దుఃఖరహితమగు యుత్తమపదమునుపొంది యంతఃకరణమున యేకోర్కెయును లేక యుండుము.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
స్వచిత్తనిరూపణమను చతుర్దశ సర్గము ॥ 14 ॥

---

## పంచదశః సర్గః.

---

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

ఏతామనుసరన్నామ చిత్తసత్తామపావనీమ్
సంసారబీజకణికాం. జీవబంధనవాగురామ్. 1

ఆత్మాత్యక్తాత్మరూపాభో మలినామాపతద్దశామ్
చిత్తంసమనుసంధత్తే ధత్తేచ కలనామలమ్. 2

శ్రీవసిష్ఠుడు - ఓరామా! అపవిత్రమగు సంసారమునకు బీజమును, జీవుని బధించునట్టి జాలమునునగు చిత్తమునను సరించి జనుమ ఆత్మ తనబ్రహ్మస్వభావమును త్యజించి మలిన (ఇంద్రియ

వృత్తుల కధీనమగు) జ్ఞానమునాశ్రయించి చిత్తముచే కల్పింపబడిన దేహాదిసంఘాతమే నేనను నిశ్చయమునుబొందుచు చిత్తోత్పన్నమగు రాగద్వేషాదులతోగూడిన వాసనాములమును గ్రహించుచున్నది.

వర్ధమానమహామోహదాయినీ భయకారిణీ
తృష్ణావిషలతారూపా మూర్ఛామేవప్రయచ్ఛతి. 3

ప్రవర్ధమానమగు మహామోహమునకు కారణభూతమును, భయదాయకమునునగు తృష్ణయను విషలత ఆత్మను మూర్ఛిల్లజేయుచున్నది.

యదాయదోదేతితదా మహామోహప్రదాయినీ
తృష్ణాకృష్ణానిశేవేయ మనన్తాత్మవికారిణీ. 4

మహామోహప్రదమగు తృష్ణయను కృష్ణపక్షరాత్రి యెప్పుడెప్పుడుదయించునో, అప్పుడెల్లనయ్యది అనంతాత్మయందు వికారముగల్గ జేయుచుండును.

కల్పానల శిఖాదాహం సోఢుంశక్తాహరాదయః
తృష్ణానలశిఖాదాహం సోఢుంశక్తానకేచన. 5

ప్రళయాగ్నిశిఖయొక్క వేడిమినికూడ మహేశ్వరాదులు సహింపగలరుగాని తృష్ణానలముయొక్క దాహకత్వము నెవరును సహింపజాలరు.

తీక్ష్ణాకృష్ణాసుదీర్ఘాచ వహత్యంగంసదాసిజమ్
శీతలైవాసుఖోదర్కా ఘోరాతృష్ణాకృపాణికా. 6

తీక్ష్ణమై, కృష్ణవర్ణమై, అతిదీర్ఘమగు దుఃఖఫలము నొసంగునదై, శీతలమై, భయంకరమైనట్టి తృష్ణయను ఖడ్గము తనయంగమునే తాను నఱుకుకొనుచున్నది.

యాన్యేతానిదురన్తాని దుర్జరాణ్యున్నతానిచ
తృష్ణావల్ల్యాఃఫలానీహ తానిదుఃఖానిరాఘవ. 7

ఓ రామచంద్రా! దుర్నివార్యములగు న్యూనాధికదుఃఖములన్నియు తృష్ణాలతయొక్క ఫలములేయగును.

అదృశ్యైవాత్తిమాంసాస్థి రుధిరాదిశరీరకాత్
మనోబిలవిలీనైషా తృష్ణావనశునీనృణామ్. 8

తృష్ణయను వ్యాఘ్రము మనస్సను బిలమందుదాగుకొని మాంసాస్థిరుధిరముల భక్షించుచున్నది.

క్షణముల్లాసమాయాతి క్షణమాయాతిశూన్యతామ్
జడావిదలయత్యాశు తృష్ణాప్రావృట్తరంగిణీ. 9

ఈతృష్ణ క్షణములో వృద్ధియగును మఱులక్షణములో నశించుచున్నది. క్షణములో వర్షాకాలనదివలె పాషాణ కంటకయుక్త ప్రదేశమునకు గొంపోయి ప్రాణుల ఖండించుచున్నది.

దృష్టదైన్యోపహతస్వాన్తో హతౌజా యాతినీచతామ్
ముహ్యతేరౌ[illegible]తతి తృష్ణయాభిహతోజనః. 10



తృష్ణచే పీడితుడగు మనుజుడు దీనాంతఃకరణయుక్తుడై శక్తిహీనుడై యల్పత్వము నొందును; మఱియు విమోహితుడై క్రందనమొనర్చును; పతితుడునునగును.

నస్థితాకోటరేయస్య తృష్ణాకృష్ణభుజఙ్గమీ
తస్యప్రాణానిలాఃస్వస్థాః పుంసోహృదయరంధ్రగాః. 11

ఎవని హృదయకోటరమున తృష్ణయను సర్పము నివసింపకుండునో వాని ప్రాణవాయువు స్వస్థతనొందును.

నూనమస్తంగతోయత్ర తృష్ణాకృష్ణనిశాక్రమః
పుణ్యాని తత్రవర్ధన్తే శుక్లపక్షఇవేన్దవః. 12

తృష్ణయను రాత్రి శమించిన చోట శుక్లపక్షచంద్రునివలె పుణ్యము నిక్కముగవర్ధిల్లును.

యోనతృష్ణాఘుణావల్ల్యా క్షతఃపురుషపాదపః
పుణ్యప్రసూనైఃససదా దశాంయాతివికాసినీమ్. 13

తృష్ణయను కీటసంయుక్తలతచే క్షయమునొందనిచో పురుషుడను వృక్షము ధర్మములను పుష్పములచే సదా వికసించుచుండును.

అనన్తాకులకల్లోలా వివర్తావర్తసంకులా
ప్రవహత్యాశయారణ్యే తృష్ణాంధానాంనదీనృణామ్. 14

వివేకరహితులగు మనుజులహృదయవనమున, అత్యంతవ్యాకులత్వమను తరంగములతో గూడి భ్రమరూపయావర్తములచే పూర్ణమైనట్టి తృష్ణానది నిక్కముగ ప్రవహించును.

తృష్ణాయేమేజనాఃసర్వే సూత్రయంత్రపతత్రివత్
భ్రామ్యన్తేప్రవిశీర్యన్తే సంప్రోయన్తేచభూరిశః. 15

తృష్ణచేతనే జీవులందఱును దారపుయంత్రమందలి పక్షివలె యీడ్వబడుచు క్షయ, చింతా, శోకములను పక్షచ్ఛేదములచే విచ్ఛిన్నమై తుదకు హత మొనర్పబడుచున్నారు.

మూలాన్యపిసుసూక్ష్మాణి కఠినాశయకర్కశా
తృష్ణాపరశుధారేవ వల్గంతీ వినికృన్తతి. 16

దయాశూన్యమై కర్కశమైనట్టి యీతృష్ణ పరశుధార (గొడ్డలియంచు) వలె అతిసూక్ష్మములగు దయావివేకాదిధర్మమూలములను తెగగొట్టుచున్నది.

నిపతత్యవటేమూఢ స్తృష్ణామనుసరజ్జనః
నీలామనుపతఞ్ఛ్వభ్రే తృణసాఖాంయథైణకః. 17

నూతిపైమొలచిన తృణవిశేషముల భక్షింపనెంచు హరిణముకుగూలునట్లు తృష్ణను వెన్నంటు మూఢుడు నరకమను యంధకూపమునబడును.

నోన్మత్తాపి జరాచక్షు స్తథాజరయతిక్షణాత్
యథాజరయతిక్షామా తృష్ణాహృదయరూపికా. 18

మిగుల బలవత్తరమగు వార్ధక్యముగూడ అతిసూక్ష్మమగు తృష్ణారూపహృదయపిశాచము వలె నేత్రమునంధీకృత మొనర్పజాలదు.

తృష్ణయాశయకౌశిక్యా హృద్యమంగలభూతయా
మాఘయాభగవానేష విష్ణుర్వామనతాంగతః. 19

అమంగళకరమగు తృష్ణయను యులూకము హృదయముననున్నందుచేతనే అనంతరూపుడగు విష్ణుభగవానుడుకూడ వామనత్వము నొందెను.

కయాచిదేవదైవిక్యా హృదిగ్రథితయానయా
తృష్ణయాభ్రామ్యతేవ్యోమ్ని రజ్జ్వేవార్కోఽన్వహంకిల. 20

హృదయమండలి దైన్యపయుక్తమగు యేదోయొక తృష్ణచేతనే బంధితుడై సూర్యుడు ప్రతిదినమున్నూ త్రాటిచేవలె నాకసమున త్రిప్పబడుచున్నాడు.

సర్వదుఃఖమయాకారాం జగతీజీవనచ్ఛిదమ్
తృష్ణాంపరిహరేత్కూరా మురగీమివదూరగః. 21

సర్వదుఃఖమయాకారమును, లోకమందలి ప్రాణికోట్ల జీవితమునుచ్ఛిన్నమొనర్చునదియునగుయీతృష్ణను క్రూరసర్పమునువలె దూరముగ తొలగించివేయవలెను.

తృష్ణయావాయవోయాన్తి శైలాస్తిష్ఠన్తితృష్ణయా
తృష్ణయైవధరాధాత్రీ త్రైలోక్యంతృష్ణయాధృతమ్. 22

తృష్ణచేతనే వాయువు వీచుచున్నది. తృష్ణచేతనే పర్వతములు నిలబడియున్నవి. తృష్ణాకారణముననే భూమి జీవరాసులను ధరించుచున్నది. పెర్యేల, ముల్లోకములును తృష్ణచేతనే ధరింపబడియున్నవి.

సర్వైవలోకయాత్రేయం ప్రోతాతృష్ణావరత్రయా
రజ్జుబంధాద్విముచ్యన్తే తృష్ణాబంధాన్నకేచన. 23

తృష్ణయను చర్మరజ్జువుచే ముల్లోకములను పాత్రము బంధింపబడియున్నది. రజ్జుబంధనమునుండి యెవరేని విముక్తులుగావచ్చురుగాని తృష్ణాబంధనమునుండి యెవరును విముక్తినొందజాలరు.

తస్మాద్రాఘవతృష్ణాంత్వం త్యజసంకల్పవర్జనాత్
మనస్త్వకల్పనంనాస్తి నిర్ణీతమితియుక్తితః. 24

కాన నోరామా! ఇక్కారణమున సంకల్పములనువీడుటద్వారా నీవు తృష్ణను పరిత్యజింపుము. సంకల్పముకంటె వేఱుగ మనస్సునదేలేదని యుక్తులచే నిదివరలో నిర్ణయింపబడినదిగదా!

అయంత్వమహమిత్యేవ ప్రథమంతావదాశయే
మాందురాశాంమహాబాహో సంకల్పయ తమోమయీమ్. 25

మహాబాహుడవగు నో రామా! అజ్ఞానమయమును, సర్వదురాశానిమిత్తమునగు 'ఈ దేహమే నేన'ను యభిమానము నెన్నడును గల్గియుండకుము.

ఏతాందుఃఖప్రసవినీ మనాత్మన్యాత్మభావనామ్
నభావయసిచేద్రామ తదాతజ్జ్ఞేషుగణ్యసే. 26



ఓరామచంద్రా! దుఃఖప్రదమైనట్టి అనాత్మభూతములగు దేహాదులందలి యాత్మాభిమానమును త్యజించినచో అత్తఱి నీవు జ్ఞానులలో లెక్కింపబడుదువు.

ఏతామహంభావమయీమపుణ్యాం
ఛిత్త్వానహంభావశలాకయైవ
స్వభావనాంభవ్యభవాన్తభూమా
భవాభిభూతాఖిలభూతభీతిః 27

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే తృష్ణావర్ణనంనామ పంచదశః
సర్గః ॥ 15 ॥

భవ్యుడవగు నోరామా! అనహంభావమను కత్తెరచే అహంభావమయమగు యీ తృష్ణను ఛేదించివైచి జగద్విభూతులన్నింటిని దిరస్కరించి ప్రపంచాతీతమగు పరబ్రహ్మమందు స్థితుడవు గమ్ము.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమ ప్రకరణమున
తృష్ణావర్ణనమను పంచదశ సర్గము ॥ 15 ॥

---

## షోడశః సర్గః.

---

శ్రీ రాముడువాచ :—

స్వభావగంభీరమేతద్భగవన్వచనంతవ
యదహంకారతృష్ణాంత్వం మాగృహాణేతివక్షిమామ్. 1

యద్యహంకారసంత్యాగం కరోమి తదిదంప్రభో
త్యజామిదేహనామానం సంనివేశమశేషతః. 2

జానుస్తంభేన మహతా ధార్యతే సుతరుర్యథా
అహంకారేణదేహోఽయం తథైవకిలధార్యతే. 3

అహంకారక్షయేదేహః కిలావశ్యంవినశ్యతి
మూలేక్రకచసంలూనే సుమహానివపాదపః. 4

తత్కథంసంత్యజామ్యేనం జీవామిచకథంమునే
ఏనమర్థంవినిశ్చిత్య వదమే వదతాంవర. 5

శ్రీ రాముడు:—ఓ మునీంద్రా! తృష్ణాహంకారముల బరిగ్రహింపవలదని తాము నుడివిన వాక్యములు స్వభావముగనే గంభీరములైనవి. కానినో దేవా! అహంకారమును త్యజించుచో దేహస్థితినంతయుగూడ పరిత్యజింపవలసియుండును. ఏలన, అహంకార ప్రాణములకైక్యముగలదు గాన ప్రాణముల బరిరక్షించి అహంకార వినాశనముగావించుట యసంభవమగును. జానువువలె మద్వృథ

మైన మూలస్తంభముచే యుత్తమవృక్షము ధరింపబడునట్లు అహంకారముచే యీ దేహము నిశ్చలముగ ధరింపబడుచున్నది. అహంకారము నశించిన, అంపముచే కోయబడిన మూలముగల విశాలవృక్షమువలె యీ దేహమున్ను నశించుచున్నది. కాన వక్తలలో శ్రేష్ఠుడవగు నో మునీంద్రా! నేనీయహంకారమునెట్లు పరిత్యజింతును? ఎవ్విధమున జీవితమును ధరింతును? దీనిని బాగుగ నిశ్చయించి వచింపవేడెద.

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

సర్వత్రవాసనాత్యాగో రామరాజీవలోచన
ద్వివిధఃకథ్యతే తజ్జ్ఞైర్జ్ఞేయో ధ్యేయశ్చమానద. 6

అహమేషాంపదార్థానామేతేచ మమజీవితమ్
నాహమేభిర్వినాకశ్చిన్న మయైతేవినాకిల. 7

ఇత్యన్తర్నిశ్చయంకృత్వా విచార్యమనసాసహ
నాహంపదార్థస్య నమే పదార్థఇతిభావితే 8

అంతఃశీతలయాబుద్ధ్యా కుర్వత్యాలీలయాక్రియామ్
యోనూనంవాసనాత్యాగో ధ్యేయోరామ సకీర్తితః. 9

సర్వంసమతయాబుద్ధ్వా యంకృత్వావాసనాక్షయమ్
జహాతినిర్మమోదేహం జ్ఞేయోఽసౌ వాసనాక్షయః. 10

శ్రీ వసిష్ఠుడు:—కమలనేత్రుఁడవును, మానప్రదుఁడవగు నోరామా! వాసనాత్యాగమెల్లెడలజ్ఞేయమని, ధ్యేయమని యిరుప్రకారములుగ వచింపబడినది. దేహేంద్రియాదులయొక్కయు, అన్నపానాద్యుపభుక్తబాహ్యపదార్థములయొక్కయు సంఘాతము నేనేను; ఈదేహ, అన్నాదులు నా జీవితమునిమిత్తమేయగును; ఇవిలేనిచో నేనుగాని, నేనులేనిచో యివిగానియుండజాలవు; ఇట్లంతఃకరణమున ప్రథమాహంకార నిశ్చయమొనర్చి, పిదప మనస్సుతోకూడ దేహేంద్రియాది సంఘాతమును వేఱుబఱచుటద్వారా తత్వవిచారముచే నయ్యవి అసత్తని నిశ్చయించి, ద్వితీయ చిద్రూప అహంపదార్థమగు నాకీవస్తుజాలముతో సంబంధములేదను యాత్మజ్ఞానము పరిపక్వముకాగా లీలామాత్రముగ క్రియలొనర్చుచు, అంతఃకరణమున ప్రశాంతబుద్ధితోగూడి నిశ్చయరూపమున వాసనలఁ బరిత్యజించుట 'ధ్యేయ' వాసనాత్యాగ మనఁబడును. జగత్తంతయు బ్రహ్మరూపమున సాక్షాత్కరించుకొని యే వాసనాక్షయముచే భూమికాభ్యాసముద్వారా నిర్మలుడును, అహంకార రహితుఁడునై నిర్వికల్ప సమాధియందు జీవుడు స్థితిఁబొందునో, లేక ప్రారబ్ధక్షయముచే సర్వథా దేహత్యాగమొనర్చునో అయ్యది, జ్ఞేయ, వాసనాత్యాగమనఁబడును.

అహంకారమయీంత్యక్త్వా వాసనాంలీలయైవయః
తిష్ఠతిధ్యేయసంత్యాగీ జీవన్ముక్తఃసఉచ్యతే. 11

అహంకారమయమగు వాసనను బరిత్యజించి లీలామాత్రముగ లోకోచితవ్యవహారముల నాచరించు సచ్చరితుడు ధ్యేయత్యాగియనియు జీవన్ముక్తుడనియు పేర్కొనబడును.



నిర్మూలకలనాంత్యక్త్వా వాసనాంయఃశమంగతః
జ్ఞేయత్యాగమయంవిద్ధి ముక్తంతంరఘునందన. 12

ఓ రాఘవా! వాసనాత్యాగముచే దృశ్యకల్పనయంతయు సంపూర్ణముగ నశింప, పరిశాంతస్థితినొందునాతడు జ్ఞేయత్యాగియని యెఱుంగుము.

ధ్యేయంత్యక్త్వావాసనాత్యాగం కృత్వాతిష్ఠన్తిలీలయా
జీవన్ముక్తామహాత్మానః సుజనాజనకాదయః. 13

ధ్యేయవాసనాత్యాగమవలంబించి లోకోచితకార్యముల నొనర్చిన జీవన్ముక్తులగు మహాత్ములలో జనకుడు మున్నగువారుగలరు.

జ్ఞేయంతువాసనాత్యాగం కృత్వోపశమమాగతాః
విదేహాముక్తాస్తిష్ఠన్తి బ్రహ్మణ్యేవపరావరే. 14

జ్ఞేయవాసనాత్యాగమొనర్చి శాంతినొందునట్టి విదేహముక్తులగు మహాత్ములు సర్వోత్తమమగు బ్రహ్మమునందే స్థితిగల్గియుందురు.

ద్వావేవరాఘవత్యాగౌ సమౌముక్తపదేస్థితౌ
ద్వావేతౌబ్రహ్మతాం యాతౌ ద్వావేవవిగతజ్వరౌ. 15

ఓ రామా! ఈరెండుత్యాగములున్ను సమానములేయనియు, ముక్తిదాయకములనియు, సంతాపరహితములనియు బ్రహ్మత్వప్రాప్తినొందింపజేయునవనియు యెఱుంగుము.

యుక్తాయుక్తమతీస్వాసే కేవలంవిమలేఽనఘ
ఏకఃస్థితఃస్ఫురద్దేహః శాన్తదేహఃస్థితోఽపరః. 16

ఏకఃసదేహోనిర్ముక్తస్తిష్ఠత్యపగతజ్వరః
త్యక్తదేహోవిముక్తోఽన్యో వర్తతేఽజ్ఞేయవాసనః. 17

పాపరహితుడవగు నోరామా! సమాధియందారూఢుడును, సమాధివ్యుత్థానకాలమున వ్యవహరించువాడును నగు వీరిరువురు (జీవన్ముక్త విదేహముక్తులు)ను, సుఖవిశ్రాంతిని బడయువారై అవిద్యామలరహితులై కేవలము బ్రహ్మపదమున స్థితులైయ్యే యుందురు. కానియందొకడు (జీవన్ముక్తుడు) దేహసహితుడుగను మఱియొకడు (విదేహముక్తుడు) దేహరహితుడుగను నుండును. ఒకడు దేహముతోగూడియున్నను దుఃఖరహితుడైయుండును; మఱియొకడు దేహమును త్యజించి జ్ఞేయవాసనాత్యాగియై యొప్పును.

ఆపతత్సుయథాకాలం సుఖదుఃఖేష్వనారతమ్
నహృష్యతిగ్లాయతియః సముక్తఇతిహోచ్యతే. 18

కాలపరిపాకమున సుఖదుఃఖములు నిరంతరము గలుగుచుండినను హర్షశోకములొందనివాడే జీవన్ముక్తుడనఁబడును.

ఈప్సితానీప్సితేనస్తో యస్యేష్టానిష్టవస్తుషు
సుషుప్తవచ్చరతియః సముక్తఇతికథ్యతే. 19

ఇష్టానిష్టవస్తువులందు రాగద్వేషములు లేనివాడును సుషుప్తియందున్నవానివలె ప్రాప్తించు వ్యవహారముల నాచరించువాడును జీవన్ముక్తుఁడని వచింపబడును.

హేయోపాదేయకలనే మమేత్యహామిహేతిచ
యస్యాన్తః సంపరిక్షీణే సజీవన్ముక్తఉచ్యతే. 20

దేహమందుగాని దేహసంబంధములగు ధనాదులందుగాని అహంకారమమత్వ కల్పనలెవని యందునశించునో యాతడే జీవన్ముక్తుఁడని పేర్కొనబడును.

హర్షామర్షభయక్రోధ కామకార్పణ్యదృష్టిభిః
నపరామృశ్యతేయోఽన్తః సజీవన్ముక్తఉచ్యతే. 21

హర్షామర్ష, కామక్రోధ, భయదీనత్వాదులచే యంతఃకరణమున స్పృశింపబడనివాడు జీవన్ముక్తుఁడనబడును.

సుషుప్తవత్ప్రశమితభావవృత్తినా
స్థితంసదాజాగ్రతి యేనచేతసా
కలాన్వితోవిధురివ యఃసదాముదా
నిషేవ్యతేముక్త ఇతీహాస స్మృతః 22

సుషుప్తియందువలె జాగ్రత్తునందును మెలంగువాడును, సర్వకళాపరిపూర్ణుడగు చంద్రుడు చంద్రికచే సేవింపబడునట్లు స్వాభావిక హర్షముచేవరిసేవితుఁడు నగువాఁడును జీవన్ముక్తుడని వ్యవహరింపబడును.

శ్రీ వాల్మీకిరువాచ :—

ఇత్యుక్తవత్యథమునౌ దివసోజగామ
సాయంతనాయ విధయేఽస్తమినోజగామ
స్నాతుంసభాకృత నమస్కరణాజగామ
శ్యామాక్షయేరవికరైశ్చ సహాజగామ. 23

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే తృష్ణాచికిత్సానామ షోడశః సర్గః ‖ 16 ‖
ఏకాదశోదివసః.

శ్రీ వాల్మీకి :—వసిష్ఠమునీంద్రుఁడిట్లుబల్కి నంత సాయంసమయముకాగా సూర్యుఁడస్తాద్రిఁగ్రుంకెను. అత్తఱి స్నానసంధ్యాదికృత్యముల నెరవేర్చుటకై సభ్యులందఱును పరస్పర ప్రణామపూర్వకముగ నచ్చోటువీడిరి. ఆరాత్రి గడిచినమీదట మఱునాడు సూర్యోదయమగు సరికి మఱల వారందఱును సభాస్థానమునకు వచ్చి చేరిరి

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమ ప్రకరణమున
తృష్ణాచికిత్సయను షోడశ సర్గము ‖ 16 ‖
పదునొకండవరోజు.



## సప్తదశః సర్గః.

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

విదేహముక్తాయేరామ తేగిరామిహగోచరే
నైవతిష్ఠన్తితస్మాత్త్వం జీవన్ముక్తిమిమాంశృణు. 1

శ్రీవసిష్ఠుడు:—ఓ రామా! విదేహముక్తులు ఇంద్రియగోచరమగు దృశ్యప్రపంచమున నే వర్తింపరు. కావున నీవు జీవన్ముక్తినిగూర్చియే యివ్విధమున యాకర్ణింపుము.

ప్రాకృతాన్యేవకర్మాణి యయాఽవర్జితవాంఛయా
క్రియన్తేతృష్ణయేమాని తాంజీవన్ముక్తతాంవిదుః. 2

విషయాశావర్జితమైన యేయిచ్ఛచే ప్రాప్తకర్మ లాచరింపబడునో దానినే జీవన్ముక్తత్వ మందురు.

యాస్థితిస్తృష్ణయా జన్తోర్బాహ్యార్థేబద్ధభావయా
తంబన్ధమాహురాచార్యాః సంసారనిగడందృఢమ్. 3

దృశ్యవిషయసత్యత్వబుద్ధిసహితమును, భోగాశాయుక్తమునగు జీవుల బాహ్యపదార్థములంగలి స్థితియే దృఢమగు సంసారబంధనమని విజ్ఞులు బల్కుదురు.

నూనముజ్ఝితసంకల్పా హృది బాహ్యేవిహారిణీ
వాసనాయోదితాసేహ జీవన్ముక్తశరీరిణీ. 4

హృదయమున సంకల్పరహితమై బాహ్యపదార్థములందు చరించునట్టియిచ్ఛయే ఈ ప్రపంచమున జీవన్ముక్తులవలంబించియుందురు.

బాహ్యార్థవ్యసనోచ్ఛ్రానా తృష్ణాబద్ధేతిరాఘవ
సర్వార్థవ్యసనోన్ముక్తా తృష్ణాముక్తేతికథ్యతే. 5

ఓ రామా! బాహ్యపదార్థాశక్తిచే వృద్ధినొందిన తృష్ణగల వానిని బద్ధుడనియు, విషయము లన్నిటియందును వాసనారహితమగు చిత్తముగలవానిని ముక్తుడనియు వచింతురు.

పూర్వంయస్యాస్తుతృష్ణాయా వర్తమానేఽపిశాశ్వతీ
నిర్దుఃఖతానిష్కలతా సాముక్తేతిబుధైఃస్మృతా. 6

విషయప్రాప్తికి పూర్వమును విషయనాశమందును రాగవిరహాదులచేగల్గు దుఃఖమేమియు లేనిదియు వర్తమానకాలమందు స్థిరమైనదియునగు యిచ్ఛయే ముక్తియని ప్రాజ్ఞులు వచింతురు.

ఇదమస్తుమమేత్యన్తర్యైషా రాఘవభావనా
తాంతృష్ణాంశృంఖలాం విద్ధి కలనాంచమహామతే. 7

మహామతివగు నోరామా! 'ఈ వస్తువు నాకు ప్రాప్తింపవలెనను యిచ్ఛయే బంధనమనియు, 'కలన' (కల్పన) యనియు నెఱుంగుము.

తామేతాంసర్వభావేషు సత్స్వసత్సుచసర్వదా
సంత్యజ్యపరమోదారః పరమేతిమహామనాః. 8

సదసద్రూపములగు పదార్థముల వేటియందును యిట్టి తృష్ణయేమియును లేని పరమోదారచిత్తుడగు మహాత్ముడు జీవన్ముక్తిపదమునొందును.

బంధాశామథమోక్షాశాం సుఖదుఃఖదశామపి
త్యక్త్వాసదసదాశాంచ తిష్ఠాక్షుబ్ధమహాబ్ధివత్. 9

ఓ రామా! బంధమోక్షముల యాశను, సుఖదుఃఖములను, సదసద్దశలను త్యజించి మహాసముద్రమువలె విక్షోభరహితుఁడవై యుండుము.

అజరామరమాత్మానం బుద్ధ్వాబుద్ధిమతాంవర
జరామరణశంకాభిర్మా మనఃకలుషంకృథాః. 10

ఉత్తమ ధీమంతుడవగు నోరామా! జన్మమృత్యురహితమగు ఆత్మనెఱింగినవాడవై, మఱల జరామరణ చింతలచే మనస్సు నెన్నటికిని కళంకితమొనర్పకుము.

పదార్థతత్త్వంనేదం తే నాయంత్వమసిరాఘవ
కించిత్తదన్యదేవేద మన్యఏవాసిరాఘవ. 11

ఓ రామా! ఈ దృశ్యపదార్థములు నీవుగాని, నీవీదృశ్యపదార్థములుగాని యెన్నటికిని గావు. దృశ్యపదార్థరూపము పరమార్థముకంటె యన్యమై మిగుల తుచ్ఛమైయున్నది. కాని నీవు వానికన్యమగు శుద్ధరూపుఁడవై యున్నావు.

అసదభ్యుదితేవిశ్వే సతీవాసతిసంస్థితే
త్వయితత్త్వామతిగతే తృష్ణాయాఃసంభవఃకుతః. 12

అసత్తగు అజ్ఞానముచే నావిర్భవించి సదసద్రూపమున నీ ప్రపంచము స్థితిగల్గియుండ, నీవు దానికి పరమై వెలయుచుండ నిక తృష్ణయే యెట్లు నీకు సంభవమగును?

అన్యచ్చరామమనసి పురుషస్యవిచారిణః
జాయతేనిశ్చయఃసాధో స్ఫారాకారశ్చతుర్విధః. 13

సాధుస్వభావుఁడవగు నో రామా! ఇంకను విచారశీలుని మనమున యీ వచింపబోవు నాల్గువిధములగు నిశ్చయములున్ను గల్గును.

ఆపాదమస్తకమహం మాతాపితృవినిర్మితః
ఇత్యేకోనిశ్చయోరామ బంధాయాసద్విలోకనాత్. 14

ఓ రామా! 'మాతాపితృవినిర్మితమును, ఆపాదమస్తకమునగు యీ దేహమే నేన'ను జనించు అజ్ఞానదృష్టిచేగల్గు నిశ్చయము బంధమునేగల్గించును.

అతీతఃసర్వభావేభ్యో వాలాగ్రాదప్యహంతనుః
ఇతిద్వితీయోమోక్షాయ నిశ్చయోజాయతేసతామ్. 15

'దేహేంద్రియాదులన్నిటికంటె వేఱై, కేశాగ్రభాగముకంటెను సూక్ష్మమైనట్టి శుద్ధచైతన్యమే నేన'ను రెండవదగు సత్పురుషుల నిశ్చయము మోక్షమును గలుగజేయును.



జగజ్జాలపదార్థాత్మా సర్వమేవాహమక్షయః
తృతీయోనిశ్చయశ్చేత్థం మోక్షాయైవ రఘూద్వహ. 16

రఘుకులశ్రేష్ఠుడవగు నో రామా! జగత్తునందలి పదార్థములన్నింటియొక్క ఆత్మస్వరూపము అక్షయుండగు 'నేనే'యను తృతీయనిశ్చయమున్ను మోక్షదాయికమైనదే.

అహంజగద్వాసకలం శూన్యంవ్యోమసమంసదా
ఏవమేషచతుర్థోఽన్యో నిశ్చయోమోక్షసిద్ధయే. 17

ఆకాశమువలె శూన్యమగు ఆధ్యాత్మిక ఆధిభౌతిక ఆధిదైవికాత్మకమైన యీ జగత్తంతయు 'నేనే'యను చతుర్థనిశ్చయమున్ను యివ్విధమున నేమోక్షసిద్ధిని గల్గజేయునదగును.

నిశ్చయేషుచతుర్ష్వేషు బన్ధాయప్రథమం స్మృతః
త్రయోమోక్షాయకథితాః శుద్ధభావనయోత్థితాః. 18

ఈనాల్గు నిశ్చయములలో మొదటిది బంధమునే గల్గించును. తక్కినమూఁడున్ను శుద్ధభావనచే గల్గినవగుటచే మోక్షప్రదమగును.

ఏతేషాంప్రథమఃప్రోక్త స్తృష్ణాయాబంధయోగ్యతా
శుద్ధతృష్ణాస్త్రయఃస్వచ్ఛా జీవన్ముక్తవిలాసినః. 19

వీనిలో మొదటిది మలినవాసనాయుక్తమగుటచే బంధహేతువును, తక్కిన మూడున్ను శుద్ధవాసనాయుక్తమగుటచే స్వచ్ఛములై జీవన్ముక్తుల కనుసరింపయోగ్యమై యొప్పుచున్నవి.

సర్వమాత్మాహమేవేతి నిశ్చయోయోమహామతే
తమాదాయవిషాదాయ నభూయోయాతిమేమతిః. 20

ఓమహామతీ! 'ఈజగత్తంతయు ఆత్మస్వరూపుడనగు నేనే,' యను నిశ్చయమునవలంబించియుండుటచే నాచిత్తము ఖేదమునొందకయున్నది.

తిర్యగూర్ధ్వమధస్తాచ్చ వ్యాపకో మహిమాత్మనః
సర్వమాత్మేతితేనాన్త ర్నిశ్చయేననబధ్యతే. 21

అంతటను ఆత్మయొక్క మహిమయే వ్యాపించియున్నది గాన సర్వము ఆత్మయేయని యాంతరమున నిశ్చయించుటచే జీవుడు బంధనమున దగుల్కొనడు.

శూన్యంతత్ప్రకృతిర్మాయా బ్రహ్మవిజ్ఞానమిత్యపి
శివఃపురుషఈశానో నిత్యఆత్మేతికథ్యతే. 22

సర్వాధిష్ఠానమగు ఆత్మయే ఆయామతవాదులచే శూన్యమనియు, ప్రకృతియనియు, మాయయనియు, బ్రహ్మమనియు, విజ్ఞానమనియు, శివుడనియు, పురుషుడనియు, యీశానుడనియు, యిట్లు పలువిధముల వచింపబడుచున్నది.

సదాసర్వంసదేవేదం నేహద్విత్వాన్యతేక్వచిత్
విద్యేతేవిద్యయావ్యాప్తం జగన్నేతరయాధియా. 23

ఈజగత్తంతయు సదా సన్మాత్ర స్వరూపమే అయియున్నది. ఇందు ద్వైతముగాని భిన్నత్వముగాని యెచటను లేదు. పరమార్థసత్యజ్ఞానదృష్టిచేతనే యీప్రపంచమంతయు వ్యాప్తమైయున్నదిగాని భ్రాంతబుద్ధిచేగాదు.

ఆపాతాలమనన్తాత్మా పూరితోఽంభోధిరంబుభిః
ఆబ్రహ్మస్తంబపర్యన్తం జగదాపూర్ణమాత్మనా. 24

అనంతాకృతిగల సముద్రము పాతాళమువఱకు జలముచే పూర్ణమైయున్నట్లు బ్రహ్మాదిస్తంబపర్యంతమగు యీజగత్తంతయు ఆత్మచే పరిపూర్ణమైయున్నది.

అతఃసత్యమృతంనిత్యం నానృతంవిద్యతేక్వచిత్
వార్యేవసకలాంభోధిర్న తరంగాదయఃక్వచిత్. 25

ఇక్కారణమున ప్రమాణబోధితమగు బ్రహ్మమొకటియే సత్యమైనది. దానికి భిన్నమగు అసద్రూపమైన జగత్తు యేకాలమందును లేదు. సముద్రమంతయు జలమేగాని తరంగాదులెన్నటికిని కాదుగదా!

పృథక్కటక కేయూర నూపురాది నకాంచనాత్
భిన్నాస్తరుతృణాకార కోటయశ్చైవనాత్మనః. 26

సువర్ణమున కన్యముగ కటక నూపురాదులెవ్వియును లేవు. అట్లనే పృథివికన్యముగ వృక్ష తృణాద్యాకారములును లేవు.

ద్వైతాద్వైతసముద్భేదై ర్జగన్నిర్మాణలీలయా
పరమాత్మమయీశక్తి రద్వైతైవవిజృంభతే. 27

అద్వైతపరమాత్మమయశక్తి (బ్రహ్మసత్త) యే జగద్రచనయను లీలచే ద్వైతాద్వైత రూపములగు పలువిధభేదములతోగూడి విజృంభించుచున్నది

ఆత్మీయే పరకీయేచ సర్వస్మిన్నేవసర్వదా
నష్టేవోపచితేకార్యే సుఖదుఃఖైగృహాణమా. 28

ఓరామా! స్వీయ పరకీయ, పుత్రమిత్రాది భావసహితమగు యీ జగత్తంతయు వృద్ధినొందినను లేక నశించినను జ్ఞానస్వరూపుడవగు నీవు సుఖదుఃఖముల బొందకయుండుము.

భావాద్వైతముపాశ్రిత్య సత్తాద్వైతమయాత్మకః
కర్మాద్వైతమనాదృత్య ద్వైతాద్వైతమయోభవ. 29

అద్వైతసత్తామయుడవై వ్యవహారకాలమందును భావముచే అద్వైతము నాశ్రయించి, కర్మాచరణమందు ద్వైతముననాదరించి యివ్విధమున ద్వైతాద్వైతముల రెంటియందును తత్పరుడవు గమ్ము.

భవభూమిషుభీమాసు భావభావనవాత్యయా
మాపతోత్పాతపూర్ణాసు వరీష్వన్తఃకరీయథా. 30

అశుభ నిమిత్తములచే పూర్ణమై భయంకరములైన సంసారభూగర్తములందు గజము చందమున నీవు గూలకుండుము.



ద్వైతంనసంభవతి చిత్తమయంమహాత్మ
న్నాత్మన్యథైక్యమపి నద్వితయోదితాత్మ
అద్వైతమైక్యరహితం సతతోదితంస
త్సర్వంనకించిదపి చాహురతఃస్వరూపమ్. 31

మహాత్ముడవగు నో రామా! ద్వైతము పరమార్థమందు సంభవముగానేరదు. ఏలననది చిత్తముచే కల్పింపబడినదేగాని యథార్థముగ లేనిదగును. ఈ ప్రపంచమున ద్వైతైక్యములు రెండును లేవు. కాన మహాత్ములు సంఖ్యారహితమును, అద్వైతమును, సదా సన్మాత్రోదితస్వభావయుక్తమునునగు జగత్తును బ్రహ్మస్వరూపముగనే వచించిరి.

నైవాహమస్తినచనామ జగన్తిసన్తి
సర్వంచవిద్యతఇదం ననుసిర్వికారమ్
విజ్ఞానమాత్రమవభాసత ఏవశాన్తం
నాసన్నసజ్జగదిదంచ సదేతివిద్ధి. 32

ఓరామా! యథార్థముగ దేహాదిసంఘాతరూపులగు అస్మదాదులుగాని, యీ జగత్తుగాని యేమియును లేదు. నిర్వికారమగు బ్రహ్మముమాత్రమేగలదు. కేవలము విజ్ఞానమాత్రమే భాసించుచున్నది. ఈ జగత్తు సత్తుగాదు, అసత్తున్నుగాదు, అంతయు సన్మాత్రబ్రహ్మముగనే నీ వెఱుంగుము.

పరమమృతమనాద్యం భాసనంసర్వభాసా
మజరమజమచిన్త్యం నిష్కలంసిర్వికారమ్
విగతకరణజాలం జీవనంజీవశక్తేః
సకలకలనహీనం కారణం కారణానామ్. 33

సతతముదితమీశం వ్యాతతేచిత్ప్రకాశే
స్థితమనుభవబీజం స్వాత్మభావోపదేశ్యమ్
స్వదనమనుచితోఽన్తర్బ్రహ్మసర్వంసదైవ
త్వమహమపిజగచ్చేత్యస్తుతే నిశ్చయోన్తః. 34

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే తృష్ణావిచ్ఛేదోపదేశోనామ
సప్తదశః సర్గః ॥ 17 ॥

ఓ రామా! సర్వోత్తమమును, ప్రమాణసిద్ధమును, అనాదియు, ప్రకాశములన్నింటి యొక్క ప్రకాశకమును, అజరమును, అచిన్త్యమును, నిర్వికారమును, ఇంద్రియసమూహవర్జితమును, ప్రాణశక్తికాధారమును, సర్వకల్పనారహితమును, సర్వకారణకారణమును, నిత్యోదయస్వరూపమును, వ్యాపకమును, చిత్ప్రకాశమందున్న నేత్రాదీంద్రియముల యనుభవములకు మూలభూత

మును, స్వస్వరూపానుభవము చేతనే యుపదేశింప యోగ్యమయినదియునగు, అంతరిక ఆసం దైకరస బ్రహ్మమే యీ జగత్తుయొక్కయు మనయొక్కయు యదార్థస్వరూపమని నీవంతఃకరణమున నిశ్చయమొనర్చుకొనుము.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
తృష్ణావిచ్ఛేదోపదేశమను సప్తదశ సర్గము ॥ 17 ॥

---

## అ ష్టా ద శః స ర్గః .

---

శ్రీ వసిష్ఠఉవాచ :—

యుక్తాశయానాంమహతా మహతానాంకుదృష్టిభిః
స్వభావోఽయంమహాబాహో లీలయాచరతామిహ. 1

శ్రీ వసిష్ఠుడు:—ఓరామా ! సమాహితచిత్తులును, కామలోభాది దుర్గుణంబులచే నదూషితులును, లీలామాత్రమున నీప్రపంచమున విహరించువారునగు మహాత్ములస్వభావమును గూర్చి వినుము.

విహరన్నపి సంసారే జీవన్ముక్తమనాముసిః
ఆదిమధ్యాన్తవిరసా విహాస్యేజ్జాగతీర్గతీః 2

ఈ ప్రపంచమున జరించునట్టి జీవన్ముక్తుడగు ముని ఆదిమధ్యాంతములందును రసహీనములగు సాంసారికగతులగూర్చి హసించును.

సర్వప్రకృతకార్యస్థో మధ్యస్థఃసర్వదృష్టిషు
ధ్యేయంతం వాసనాత్యాగమవలంబ్య వ్యవస్థితః. 3

ప్రాప్తింమ కార్యములన్నిటిని జేయుచు శత్రుమిత్రాదులందు సమదృష్టిగల్గి ధ్యేయమగు వాసనాత్యాగమవలంబించి జీవన్ముక్తులగు మహాత్ములీ ప్రపంచమున విహరింతురు.

సర్వత్రవిగతోద్వేగః సర్వార్థపరిపోషకః
వివేకోద్యోతదృష్టాత్మా ప్రబోధోపవనస్థితిః. 3
సర్వాతీతపదాలమ్బీ పూర్ణేందుశిశిరాశయః
నోద్వేగీ నచతుష్టాత్మా సంసారేనావసీదతి. 5

ఉద్వేగరహితుడును, సర్వజనహితకరుడును, వివేకముచే ప్రకాశించు నంతఃకరణము గలవాడును, జ్ఞానమను యుపవనమునసుండువాడును, సర్వాతీతమగు బ్రహ్మపదము నాశ్రయించినవాడును, పూర్ణచంద్రునిపగిది శీతలాంతఃకరణయుతుడును, మిగుల యుద్వేగమును సంతుష్టిగాని జెందనివాడునగు జీవుడీ ప్రపంచమున దుఃఖమునొందడు.

సర్వశత్రుషుమధ్యస్థో దయాదాక్షిణ్యసంయుతః
ప్రాపకర్మకరోగ్రాణాం సంసారేనావసీదతి. 6



శత్రుమధ్యమునసుండువాడును, దయాదాక్షిణ్యాది సద్గుణసంయుతుడును, గురుసేవాది సమయోచిత కార్యముల నెరవేర్చువాడునగు పుణ్యాత్ముడీ ప్రపంచమున దుఃఖము నొందనేరడు.

నాభినన్దతినద్వేష్టి న శోచతినాకాఙ్క్షతి
మౌనస్థః ప్రకృతారంభీ సంసారేనావసీదతి. 7

అభిమతవస్తుప్రాప్తిచే నతిప్రసన్నత్వముగాని, అనిష్టప్రాప్తిచే నతి దుఃఖముగాని పొందనివాడును, దేనికొఱకు శోకింపనివాడును, దేనిని వాంఛింపనివాడును, మితభాషియు, ప్రాప్తించు కార్యముల జేయువాడునునగు జీవుడీ ప్రపంచమున దుఃఖము నొందకుండును.

పృష్టఃసన్ప్రకృతంవక్తి నపృష్టఃస్థాణువత్తిష్ఠతః
ఈహితానీహితైర్ముక్తః సంసారేనావసీదతి. 8

అడిగినచో నుపయోగకరమగు వాక్యము నే బల్కువాడును, అడుగనిచో స్థాణువువలె మెదలకనుండువాడును, రాగద్వేషవినిర్ముక్తుడునునగు యుక్తుడీ ప్రపంచమున దుఃఖితుడుగానేరడు.

సర్వస్యాభిమతంవక్తా చోదితఃపేశలోక్తిమాన్
ఆశయజ్ఞశ్చభూతానాం సంసారేనావసీదతి. 9

సర్వులయెడ ప్రియమునే వచించువాడును, మృదుభాషియు, ప్రాణికోట్ల హృదయము నెఱుంగువాడునగు జీవుడీ ప్రపంచమున దుఃఖము నొందకుండును.

యుక్తాయుక్తదృశాగ స్తమాశోపహతచేష్టితమ్
జానాతిలోకదృష్టాన్తం కరకోటరబిల్వవత్ . 10

యుక్తాయుక్తములను విమదృష్టులతోను, ఆశాయుక్తమగు క్రియలతోను గూడిన లోకవృత్తాంతమును అఱచేతియందలి బిల్వఫలమువలె (పక్షపాతము లేక) వీక్షించును.

పరంపదముసారూఢో భంగురాంజాగతీంస్థితిమ్
అన్తఃశీతలయాంబుద్ధ్యా హసన్నివ నిరీక్షతే. 11

ముక్తపదమందారూఢులగు మహాత్ములాంతర్యమున శీతలబుద్ధితో గూడుకొనినవారై నాశవంతమగు జగద్గతినిజూచి నవ్వుచుందురు.

జితచిత్తామహాత్మానో యేహిదృష్టపరావరాః
స్వభావఈదృశస్తేషాం కథిత స్తవరాఘవ. 12

ఓ రామా! జయించిన చిత్తముగలవారును, ఇహపరంబుల నెఱింగినవారునగు మహాత్ముల స్వభావమిట్టిదని నీ కెఱింగించితిని.

వయంతువక్తుంమూర్ఖాణామజితాత్మీయచేతసామ్
భోగకర్దమమగ్నానాం నవిద్మోఽభిమతంమతమ్. 13

కాని, తమ చిత్తముల జయింపక విషయభోగపంకమున సదానిమగ్నులైయుండు మూర్ఖుల విషయమును గూర్చి నేను వచింపజాలను.

తేషామభిమతానార్యో భావాభావవిభూషితాః
జ్వాలానరకవహ్నీనాం యాస్తాఃకనకరోచిషః. 14

సువర్ణదీప్తివంటి నరకాగ్ని జ్వాలలంబోలు నారీసమూహమే యట్టి మూర్ఖుల కభిమతమగును.

అనర్థగహనాశ్చార్థా వ్యర్థానర్థకదర్థనాః
దిశన్తోదుఃఖసంరంభ మభితఃప్రహితాపదః. 15

మూర్ఖులచే నభిలషితమగు ధనాదులు కలహక్లేశాద్యనర్థములకు మూలమై యంతట దుఃఖమును, ఆపదలను గల్గజేయును.

ఫలసంధీనికర్మాణి నానాచారమయానిచ
సుఖదుఃఖావపూర్ణాని తానివక్తుంనశక్నుమః. 16

అజ్ఞుల వివిధాచారసంయుక్తములగు యాగాది కర్మలున్ను ఫలసహితములై, సుఖదుఃఖదశాపూర్ణములగును గాన వాటినిగూర్చియు మేమేమియు వచింపజాలము.

పూర్ణాందృష్టిమవష్టభ్య ధ్యేయత్యాగవిలాసినీమ్
జీవన్ముక్తతయాస్వస్థో లోకేవిహరరాఘువ. 17

ఓ రామా! ధ్యేయవాసనాత్యాగియుక్తమగు పూర్ణదృష్టినవలంబించి, జీవన్ముక్తి నాశ్రయించి స్వస్థచిత్తుఁడవై లోకమున విహరింపుము.

అన్తఃసంత్యక్తసర్వాశో వీతరాగోవివాసనః
బహిఃసర్వసమాచారో లోకేవిహరరాఘువ. 18

ఓ రాఘువా! అంతరంగమున సమస్తయాశలనువీడి, వీతరాగుడవును, వాసనారహితుఁడవునై బాహ్యమున వర్ణాశ్రమాచారముల నెఱవేర్చుచు లోకమునఁజరింపుము

ఉదారఃపేశలాచారః సర్వాచారానువృత్తిమాన్
అన్తఃసర్వపరిత్యాగీ లోకేవిహరరాఘువ. 19

రాఘువా! ఉత్తమాచారసమన్వితుఁడవై బాహ్యమున సర్వాచారంబుల నెఱవేర్చుచు, అంతరమున సర్వమును పరిత్యజించుచు లోకమున విహరింపుము.

ప్రవిచార్యదశాఃసర్వా యదతుచ్ఛంపరంపదమ్
తదేవభావేనాలంబ్య లోకేవిహరరాఘువ. 20

ఓ రామా! సాంసారిక, పారమార్థిక దశలన్నింటిని జక్కఁగ విచారించి మహత్తరమగు బ్రహ్మపదమునే భావముచే నాశ్రయించి లోకమునఁ జరింపుము.

అంతర్నైరాశ్యమాదాయ బహిరాశోన్ముఖేహితః
బహిస్తప్తోఽన్తరాశీతో లోకేవిహరరాఘువ. 21

ఓరాఘువా! అంతరంగమున ఆశావర్జితుఁడవై, బాహ్యమున ఆశాయుక్తునివలె క్రియలఁ గావించుచు, ధనాదులు నశించునపుడు మిగుల పరితాపంబొందినట్లు బాహ్యమున కగుపడినను, యంతఃకరణమున ప్రశాంతస్థితి[illegible]యుండుచు లోకమున విహరింపుము.



బహిఃకృత్రిమసంరంభో హృదిసంరంభవర్జితః
కర్తాబహిరకర్తాన్తర్లోకే విహరరాఘువ. 22

ఓరాఘువా! బాహ్యమున క్రోధసంయుతుడవును, అంతర్యమున క్రోధవర్జితుడవునై, సర్వకార్యములఁ జేయుచున్నను, అంతఃకరణమున యకర్తవై యుండి లోకమున మెలంగుము.

జ్ఞాతవానసిసర్వేషాం భావానాంసమ్యగన్తరమ్
యథేచ్ఛసితథాదృష్ట్యా లోకేవిహరరాఘువ. 23

[illegible]! పదార్థములన్నింటియొక్క సారాసారంబుల నీవుబాగుగ నెఱింగియున్నావుగా[illegible]నీయిచ్చవచ్చిన దృష్టి నవలంబించి లోకమునఁ జరింపుము.

కృత్రిమోల్లాసహర్షస్థ కృత్రిమోద్వేగగర్హణః
కృత్రిమారంభసంరంభో లోకేవిహరరాఘువ. 24

ఓరాఘువా! కృత్రిమోత్సాహము, కృత్రిమహర్షము, కృత్రిమోద్వేగము, కృత్రిమనింద, కృత్రిమకార్యారంభము, కృత్రిమక్రోధము గల్గి లోకమున విహరింపుము.

త్యక్త్వాహంకృతిరాశ్వస్త మతిరాకాశశోభనః
అగృహీతకలంకాజ్కో లోకేవిహరరాఘువ. 25

ఓరామా! అహంకారమును ఖారద్రోలి, స్వస్థచిత్తుడవై, ఆకాశమువలె శోభించుచు, కళంకరహితుఁడవై లోకమునఁ జరింపుము.

ఆశాపాశశతోన్ముక్తః సమఃసర్వాసువృత్తిషు
బహిఃప్రకృతికార్యస్థో లోకేవిహరరాఘువ. 26

పలువిధ యాశాపాశములనుండి విముక్తుఁడవై, సర్వవృత్తులందును సమరూపుఁడవై, బాహ్యమున వర్ణాశ్రమస్వభావయోగ్యములగు (లేక ప్రజాహితకరములగు) కార్యములఁజేయుచు లోకమున విహరింపుము.

నబన్ధోఽస్తినమోక్షోఽస్తి దేహినఃపరమార్థతః
మిథ్యేయమింద్రజాలశ్రీః సంసారపరివర్తినీ. 27

ఓ రామా! యథార్థముగ బంధముగాని మోక్షముగాని లేదు. ఇదంతయు మిథ్యయగు యింద్రజాలవైభవమేయగును. ఇయ్యదియే సంసారచక్రమును ద్రిప్పుచున్నది.

భ్రాన్తిమాత్రమిదంమోహాజ్జగద్రాఘువ దృశ్యతే
జనితప్రత్యయంస్ఫారం జలం తీవ్రాతపేయథా. 28

ఓరామా! ఈప్రపంచమంతయు భ్రాంతిమాత్రమై అజ్ఞానముచే గన్పట్టుచున్నదగును. తీవ్రాతపమున నుదితమగు మృగతృష్ణాజలమందువోలె యిందు సత్యత్వబుద్ధి కల్పింపబడినది.

అబద్ధస్యైకరూపస్య సర్వగస్యాత్మనఃకథమ్
బన్ధఃస్యాత్తదభావేతు మోక్షఃకస్యవిధీయతే. 29

అసంగమును, యేకరూపమును సర్వవ్యాపకమునగు ఆత్మకు బంధమెట్లుగల్గును? బంధమే లేనిచో యిక మోక్ష ప్రసంగమెచట?

అతత్త్వజ్ఞానజాతేయం సంసారభ్రాన్తిరాతతా
తత్త్వజ్ఞానాత్క్షయంయాతి రజ్జ్వామివభుజంగధీః. 30

తత్త్వజ్ఞానాభావముచేతనే యీవిశాల సంసారభ్రాంతి యుత్పన్నమైనది. కాని తత్త్వజ్ఞానముచే రజ్జువునందలి సర్పమువలెనిది వినాశమొందుచున్నది.

జ్ఞాతవానసితత్త్వంస్వమేకయా సూక్ష్మయాధియా
జాతో౽సినిరహంకారో వ్యోమవత్తిష్ఠనిర్మలః. 31

ఓరామా! నీవిపుడు సూక్ష్మబుద్ధిచే ఆత్మతత్త్వము నెఱింగితివి; మఱియు అహంకారరహితుఁడవైతివి. కాన నీవిక యాకాశమువలె నిర్మలుఁడవై చెన్నొందుము.

జ్ఞో౽సిత్విత్థంతదఖిలాః సుహృద్బాంధవవాసనాః
సంత్యజాసత్స్వభావస్య కానామకిలభావనా. 32

నీవు సాక్షిరూపుఁడవుగాన బంధుమిత్రాదులఁగూర్చిన వాసనలఁ బరిత్యజించుము. ఏలన, అసత్స్వభావులగు బంధుమిత్రాదులఁగూర్చిన చింత వ్యర్థమే యగును గదా!

అపిచేత్థంతదన్యస్త్వం సత్త్వవానసుమిూయసే
ఇదంప్రథమతఃప్రాప్తం పరమాదపికారణాత్. 33

ఓరామా! నీవు (అసత్స్వభావమున కన్యమగునట్టి) సద్రూపమే గలవాఁడవు. అట్టి సత్స్వభావ కారణమున నీవు అసత్తు (అవిద్య) కంటెను, తత్కార్యములకంటెను, విలక్షణుఁడవగుదువు. ఇక్కారణమున అఖిలవిద్యాకారణమునుండి మొట్టమొదట ప్రాప్తించినదగు యీ బంధవాసనను నీవు త్యజించివేయుము.

భోగబంధుజగద్భావైః కర్మభిశ్చశుభాశుభైః
ఆత్మనోనాస్తిసంబధః కిమేతాననుశోచసి. 34

భోగములతోను, భోగసాధకులగు బాంధవాదులతోను, జగత్పదార్థములతోను, శుభాశుభకర్మములతోను, ఆత్మకేమియును సంబంధములేదు. కాన నీవు బంధుమిత్రాదులకొఱకేల పరితపించెదవు?

ఆత్మతత్త్వైకసారో౽హ మితిజాతధియోభయైః
న తేరామాస్తిసంబన్ధః కింబిభేషిజగద్భ్రమాత్. 35

ఓరామా! ఆత్మతత్త్వమొకటియే సారమైనది. అట్టిసారవస్తువే నేనను దృఢబుద్ధిగల నీకిఁక భయమేల? ఈ జగద్భ్రమలచే నీవేల యింకను భీతిఁజెందుచుంటివి?

అజాతస్యసతోబన్ధోర్బన్ధుదుఃఖసుఖభ్రమైః
కస్తేరాఘవసంబన్ధో యదేతాననుశోచసి. 36

(చైతన్యైక్య దృష్టియందు) యెన్నఁడును యుత్పన్నమే గానట్టి యీ బంధువుల గూర్చిన సుఖదుఃఖములతో నీకేమి సంబంధము? వారికై నీవేల పరితపించుచుంటివి?

త్వంచేద్బభూవిథపురా తథేదానీంభవిష్యసి
అద్యచేహాస్థితో [illegible] జాతవా [illegible]యమ్. 37



(ఇక ఆత్మ సంగముగలదనియు నిత్యమనియు నమ్మినచో) నీవు పూర్వముండియుంటివి; భావికాలమునను యుండగలవు; ఇపుడును యుండియున్నావు. ఇట్టి నిత్యస్వభావముగల ఆత్మను నిక్కముగ నీవెఱింగియున్నావు గదా!

తదానన్తరగానన్యాన్ప్రాణాదీన్నికటస్థితాన్
బన్ధూనతీతాన్సుబహూన్కస్మాత్త్వం నానుశోచసి. 38

వర్తమానకాలమున సమీపస్థులగు బంధువులనే ప్రాణతుల్యులుగ నెంచి వారికొఱకై దుఃఖించుచో, గడచిన యనేకజన్మలందలి బంధువుల కొఱకేల నీవు దుఃఖించుటలేదు? కాన నట్టి వారికొఱకు పరితాపము నొందుట యుక్తముగానేరదు.

పూర్వమన్యస్తథేదానీం బభూవిథభవిష్యసి
యదిరామతథాపిత్వం సద్రూపంకింవిముహ్యసి. 39

(ఆత్మ క్షణికమని నమ్మిన) నీవును నీబంధువులును పూర్వము వేఱుగనుండిరి. ఇపుడును వేఱుగనున్నారు. ముమ్మందును అట్లనే యుండగలరు. (దీనిచే బంధుత్వాభావమే సిద్ధించుచున్నది) అట్టి వారలను సత్యమనినమ్మి నీవేల శోకించుచుంటివి?

పురాభూతాఽద్యభూతావచ భూయశ్చేన్నభవిష్యసి
తథాపిక్షీణసంసారః కిమర్థమనుశోచసి. 40

(ఇక ఆత్మ నాశవంతమనినచో) పూర్వముండినవారు యిపుడుండుటలేదు. ముమ్మందును యుండబోరు. కాన క్షీణసంసారయుతుఁడవగు నీవు బాంధవాదులకై దుఃఖింపనేల?

తస్మాన్నదుఃఖతాయుక్తా ప్రాకృతేజాగతేక్రమే
తథైవముదితాయుక్తా యుక్తంకార్యానువర్తనమ్. 41

ఇట్లు ఆత్మసంగము గలదని యెంచినను శోకింపదగనిదైయుండ, అసంగకూటస్థాత్మవిషయమై యిక వేఱుగజెప్పవలయునా? కాన మాయామయమగు నీ జగద్విషయమున శోకమునొందుట యుక్తముగాదు. సహజసంతోషవృత్తి నవలంబించి ప్రాప్తించిన కార్యములఁ జేయుటయే యుక్తమగును.

మాగచ్ఛదుఃఖతాంరామ సుఖతామపిమావ్రజ
సమతామేహిసర్వత్ర పరమాత్మాహిసర్వగః. 42

ఓరామా! నీవు ప్రాపంచిక పదార్థములచే సుఖదుఃఖముల నొందక సర్వత్ర సమరూపుఁడవైయుండుము. ఏలన పరమాత్మ సర్వవ్యాప్తియు సమరూపుఁడునుగదా!

అనన్తఃసత్స్వరూపస్త్వం ఖమివాతితతాన్తరమ్
ప్రకాశోనిత్యశుద్ధస్త్వం జ్వాలానామివకోటరమ్. 43

ఓరామా! నీ వనంతుఁడవు; సత్స్వరూపుఁడవు; ఆకాశమునలె వ్యాపకుఁడవు; మఱియు సర్వత్ర ప్రకాశమయమైయున్న అగ్నిజ్వాలయందు అంధకారమునకు తావులేనట్లు, శుద్ధరూపుఁడవగు నీయందును దుఃఖాదులకు తావులేదు.

జగతానాంపదార్థానా మదృష్టాత్మతనుస్తనుః
హృత్స్థోఽసిహారముక్తానామేక స్తన్తురివాతతః. 44

జగత్పదార్థములందు నీయొక్క వ్యాపకస్వరూపము దృగ్గోచరముగాకయున్నది. నీవు హృదయస్థుడవై ముక్తాహారమున సూత్రమువలె సూక్ష్మరూపమున సంతట వ్యాపించియున్నావు.

సంసారస్థితిరేవేయం యద్భూత్వాభూయ తేపునః
అజ్ఞైనైవ నతజ్జేన జ్ఞోఽసిరామసుఖీభవ. 45

ఓ రామా! అజ్ఞానియే మఱల మఱల జన్మములబొందును గాని జ్ఞానికాదు. ప్రపంచస్థితి యిట్టిదేయగును. నీవు జ్ఞానివేకావున సుఖముగనుండుము.

స్వరూపమిదమస్యాస్తు సంసృతేఃసతతాధిమత్
అజ్ఞానాత్స్ఫురతామేతి జ్ఞాతవానసిసన్మతే. 46

సద్బుద్ధివగు నోరామా! నిరంతరము దుఃఖపూర్ణమగు యీసంసారము అజ్ఞానముచేతనే విస్తారమగుచున్నది. కాని నీవైతే జ్ఞానివే యగుదువుగదా!

రూపంకిమన్యద్భవతు భ్రమమాత్రాదృతేభ్రమే
స్వప్నమాత్రాదృతేస్వప్నే భవత్యన్యోహి కఃక్రమః. 47

భ్రమగాక భ్రమకు మఱియొక రూపమెద్దిగలదు? స్వప్నమందు స్వప్నముగాక యన్యక్రమమెయ్యదిగలదు?

సర్వశక్తేరియంశక్తి ర్భ్రమమాత్రమయంతథా
రామదృశ్యతఏవేద మాభానమతిభాస్వరమ్. 48

ఓరామా! మిగులప్రకాశవంతమై సత్స్వరూపముగల్గి భాసించుచున్న భ్రమమాత్రమగు యీజగత్తు సర్వశక్తివంతుడగు పరమాత్మునిశక్తియేయగును.

సుబన్ధుఃకస్యచిత్కఃస్యాదిహానో కశ్చిదప్యరిః
సదాసర్వేచసర్వస్య సర్వంసర్వేశ్వరేచ్ఛయా. 49

ఈప్రపంచమున యొకడు మఱియొకనికి బంధువుగాని, మఱియొకనికి శత్రువుగాని కానేరడు. ఏలన, శత్రు మిత్ర యుదాసీనులందఱును కాలక్రమమున యీశ్వరేచ్ఛచేతనే సంభవించువారగుదురు.

ఆలూనశీర్ణమఖిల మిదమన్యోన్యసంశ్రితమ్
అనారతంయాతి జగత్తరంగౌఘఇవాంభసః. 50

పరస్పరకారణములచే నీజగత్తంతయు, జలమందలి తరంగములవలె నిరంతరము ఛిన్నాభిన్నమగుచునేయున్నది.

అధఊర్ధ్వత్వమాయాతి యాత్యూర్ధ్వత్వమధస్తథా
సంసారస్యచలస్యాస్య చక్రనేమిరివాభితః. 51

చలనశీలమగు నీసంసారచక్రము నిరంతరము క్రిందనుండిపైకిని పైనుండిక్రిందకును నేమిఛందనమున తిరుగాడుచున్నది.



స్వర్గస్థా నరకంయాన్తి నారకాశ్చత్రివిష్టపమ్
యోనేర్యోన్యన్తరంయాన్తి ద్వీపాద్ద్వీపాన్తరం జనాః. 52

స్వర్గమందలి జీవులు నరకమునకును నరకమందలి జీవులు స్వర్గమునకును యేగుచున్నారు. ఒకజన్మనుండి మఱియొకజన్మను, యొకద్వీపమునుండి మఱియొక ద్వీపమును జీవులు పొందుచున్నారు.

ధీరాఃకార్పణ్యమాయాన్తి కృపణాయాన్తిధీరతామ్
పరిస్ఫురన్తిభూతాని పాతోత్పాతశతభ్రమైః. 53

ధీరులు కృపణత్వమును, కృపణులు ధీరత్వమును నొందుచున్నారు; పతనోత్పతనాది వివిధభ్రమలచే జీవులు సంచలనము నొందుచున్నారు

ఏకరూపస్థిరంచక్రం స్వచ్ఛంసంతాపవర్జితమ్
నేహసంప్రాప్యతేకించిదగ్నౌ హిమకణోయథా. 54

అగ్నియందు మంచుబిందు వుండనివిధమున ఈసంసారచక్ర మెన్నటికిని యేకరూపమును స్వచ్ఛత్వమును దుఃఖరహితత్వమును పొందనేరదు.

యేయేనామమహాభాగా బహవోబాన్ధవాస్తథా
వినష్టాఏవదృశ్యన్తే తేతేకతిపయైర్దినైః. 55

ఎందఱో మహనీయులు బంధుజనము కొలదికాలముననే వినాశమొందుట మనము గాంచుచున్నారము.

పరతాత్మీయతాన్యత్వ త్వత్వమత్త్వాదిభావనా
నేహసత్యామహాబాహో ద్విచంద్రాదిదృశోయథా. 56

మహాబాహుడవగు నోరామా! ఈప్రపంచమున పరత్వము, ఆత్మీయత్వము, అన్యత్వము, త్వద్భావమద్భావములు (నీది, నాదియనుట) మున్నగునవన్నియు ద్విచంద్రదర్శనమువలె మిథ్యయే యగును.

అయఃబన్ధుఃపరశ్చాయమయం చాహమయంభవాన్
ఇతిమిథ్యాదృశోరామ విగలన్తుతవాధునా. 57

ఓరామా! ఈతడు బంధువు ఈతడుశత్రువనునట్టియు, నేను, నీవనునట్టియు మిథ్యాదృష్టి నీకిపుడు నశించునుగాక!

క్రీడార్థంవ్యవహారస్థ ఏతాభిర్వా తదృష్టిభిః
ఆమూలమన్తశ్ఛిన్నాభిర్బహిర్విహరహేలయా. 58

అజ్ఞాన వాసనాసహితముగ యంతఃకరణమున నుచ్ఛిన్నమై, నముచే బాధితమైన నీబంధుమిత్రాది దృష్టులనవలంబించి లీలామాత్రముగ వ్యవహరించుచు లోకమునజరింపుము.

సంసారసరణావస్యాం తథావిహరసువ్రత
నయథైవశ్రమక్రాన్తో వాసనా భారవానివ. 59

సువ్రతుఁడవగు నో రామా! భారవాహునివలె, వాసనాభారముచే దుఃఖమునొందక యీ ప్రపంచమున విహరింపుము.

యథాయథైషాకార్యాణి వాసనాక్షయకారిణీ
విచారణాత్వోదేతి సంశామ్యన్తితథాతథా. 60

వాసనాక్షయకారిణియగు విచారణ యుదయమైనకొలది సాంసారికవ్యవహారములు శమించుచుండును.

అయంబన్ధురయంనేతి గణనా లఘుచేతసామ్
ఉదారచరితానాంతు విగతావరణైవధీః. 61

ఈతడుబంధువు, ఈతడుశత్రువను భేదదృష్టి అల్పబుద్ధులకే యుండును. ఉదారచరితుల కట్టి పరిచ్ఛిన్నదృష్టి, ఆవరణయుక్తమగు బుద్ధి యుండనేరదు.

నతదస్తినయత్రాహం నతదస్తినయన్మమ
ఇతినిర్ణీయధీరాణాం విగతావరణైవధీః. 62

'నేనులేని పదార్థమేలేదు, నాదికానివస్తువేలేద'ని నిశ్చయించుటచే ధీరులబుద్ధియందలి ఆవరణ నశించును

నాస్తమేతినచోదేతి యశ్చిదాకాశవన్మహాన్
సర్వంసంపశ్యతిస్వస్థః స్వస్థోభూమితలంయథా. 63

అట్టిప్రాజ్ఞుఁ డుత్పత్తివినాశములు లేనివాఁడై చిదాకాశమువలె మహత్తరరూపముగల్గి, విక్షేపమునశించుటచే స్వస్థచిత్తుఁడై, ఆకసముననున్నవాడు భూతలమును వీక్షించునట్లు సర్వముఁ బరికించును.

సర్వాఏవహితేభూతజాతయో రామబన్ధవః
అత్యన్తాసంయుతాఏతా స్తవరామ నకాశ్చన. 64

ఓ రామా! ఈప్రపంచమునగల జీవజాతులన్నియు నీబంధువులే; ఏలన, అనేకజన్మలఁ బొందుటఁ బట్టి సంబంధబాంధవములులేని జీవజాతియెద్దియును నీకు లేకయున్నది.

వివిధజన్మశతాహితసంభ్రమే
జగతిబన్ధురబన్ధురితీక్షణమ్
భ్రమదశైవ వివల్గతివస్తుత
స్త్రిభువనం చిరబన్ధురబన్ధ్వపి. 65

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే జీవన్ముక్తవర్ణనం నామాష్టాదశః
సర్గః ॥ 18 ॥

ఓ రామా! పలువిధ విచిత్ర జన్మభ్రమలతోఁగూడిన యీజగత్తునందు 'ఈతడు బంధువు' 'ఈతడుశత్రువ'ను మిథ్యాదృష్టిరూపమున భ్రాంతి విజృంభించుచున్నది. యథార్థముగ ముల్లోక



మందలి జీవులందఱును జీవభావదృష్టిచే నీబంధువులేయగుదురు. మఱియు బ్రహ్మభావదృష్టిచే స్వయముగ నీవే వారిస్వరూపమగుటఁబట్టి నీకు వారబంధువులున్ను నగుదురు.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
జీవన్ముక్తవర్ణనము అష్టాదశ సర్గము ॥ 18 ॥

---

## ఏకోనవింశః సర్గః.

---

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

అత్రైవోదాహరన్తీమ మితిహాసంపురాతనమ్
భ్రాత్రోస్త్రిపథగాతీరే సంవాదంమునిపుత్రయోః. 1

శ్రీవసిష్ఠుడు:— ఓ రామా! ఇవ్విషయమున మందాకినీనదీతటమున వసించు యిరువురు సోదరులగు మునిపుత్రుల సంవాదమగు ప్రాచీనయితిహాస మొండుగలదు.

అయంబన్ధురయంనేతి కథాప్రస్తావతఃస్మృతమ్
ఇతిహాసమిమంపుణ్య మాశ్చర్యంశ్రృణురాఘవ. 2

ఓ రామా! 'ఈతడు బంధువు, ఈతడుబంధువు కాడ'ను నీకథాప్రసంగమున ఆశ్చర్యకరమగు యీ పవిత్రేతిహాసమును నీవాకర్ణింపుము.

అస్త్యస్యజంబూద్వీపస్య కస్మింశ్చిద్గిరికుంజరే
వనవ్యూహమహోత్తంసో మహేన్ద్రోనామపర్వతః. 3
కల్పద్రుమవనచ్ఛాయా విశ్రాన్తమునికిన్నరః
శృంగైరాతతమాకాశం జితవాన్యఃసమున్నతైః. 4
బ్రహ్మలోకాన్తరప్రాప్త శృంగకన్దరచారిభిః
సామవేదప్రతిధ్వాన ఘుంఘుమైర్గాయతీవయః. 5
యఃపయోమేదురైర్మేఘైర్గ్లసితైః శృంగకోటిషు
లతాకుసుమసంప్రోతైః కున్తలైరివరాజతే. 6
యస్తదోడ్డయనోత్కానాం శరభాణాంవిజృంభితైః
విస్ఫూర్జతిగుహావక్త్రైః కల్పాభ్రాణిహసన్నివ. 7
యేననిర్ఝరనిర్హ్రాదైః కందరాన్తరచారిభిః
సముద్రజలకల్లోల విలాసోవిచితోఽభితః. 8
తస్యైకదేశవితతే రత్నసానౌమనోరమే
మునిభిఃస్నానపానార్థం వ్యోమగంగావతారితా. 9
తస్యాస్త్రిపథగాయాస్తు తీరేవికసితద్రుమే
రత్నాద్రితటవిద్యోతే కచత్కనకపింజరే. 10

ఆసీదభ్యుదితజ్ఞాన స్తపోరాశిరుదారధీః
మునిర్దీర్ఘతపానామ తపోమూర్తమివాపరమ్. 11

ఈ జంబూద్వీపముయొక్క యొకానొక పర్వతకుంజమున అనేకవనములతోఁగూడిన మహేంద్రమను గొప్పపర్వతమొండుగలదు. అందలి కల్పవృక్షవనచ్ఛాయయందు మునులు, కిన్నరులు విశ్రమించుచుండిరి. తనయున్నతశిఖరముచే నయ్యది విశాలాకాశమునుగూడ నిర్జించినదాయెను. బ్రహ్మలోకపర్యంతము వ్యాపించిన నా పర్వతశిఖరములయొక్క గుహలందు వసించువారు తమ ఘుంఘుమనాదముచే సామగానమొనర్చుచున్నట్లుండిరి. అసంఖ్యాకములగు దాని శిఖరములపై జలముచే శ్యామవర్ణయుక్తమైన విద్యుల్లతాసహిత మేఘములతోను లతాకుసుమములతోనుగూడి శోభాయుక్తముగ నలరారుచుండెను. తటములపై గంతులిడుచున్న 'అష్టాపద' మృగముల శబ్దములతో గూడిన యాపర్వతము తన గుహారూప ముఖములచే హాస్యమొనర్చుచు ప్రళయకాల మేఘములవలె గర్జన సల్పుచున్నట్లుండెను. పర్వతకందరామధ్యమున జనించు సెలయేళ్ల శబ్దములచే నయ్యది సముద్రతరంగశబ్దమునుగూడ జయించెను. ఆపర్వతముయొక్క మిగుల మనోహర అతివిశాల రత్నమయశిఖరమందలి నొకభాగమున స్నానపానార్థ మాకాశగంగ ప్రవహింపజేయబడెను. ఆ గంగాజలముచే వికసితములగు కల్పవృక్షములుగల్గి మేరుపర్వతతటమువలె ప్రకాశించుచు సువర్ణముగ నలశోభించు నాపర్వతటముపై బ్రహ్మజ్ఞానసంపన్నుడును, ఉదారచరితుడును తపోమూర్తియునగు దీర్ఘతపుడను మునీశ్వరుఁడు వసించుచుడె.

మునేర్బభూవతు స్తస్య పుత్రౌ ద్వావిన్దుసున్దరౌ
పుణ్యపావననామానౌ ద్వావికచావివవాక్పతేః. 12

బృహస్పతికి కచులను యిర్వురుపుత్రులవలె యమ్మునీంద్రునకు చంద్రసమానులగు పుణ్యపావనులను సౌందర్యవంతులగు యిరువురుపుత్రులు గల్గిరి.

సతాభ్యాంసహపుత్రాభ్యాం భార్యయాచసహైకయా
ఉవాససరిత స్తీరే తస్మిన్సఫలపాదపే. 13

ఆ యిరువురు పుత్రులతోను భార్యతోనుగూడి యాబ్రాహ్మణుఁడు ఫలవృక్షసహితమగు నా గంగాతీరమున వసించుచుండె.

అథకాలేతయో స్తస్య పుత్రయోర్జ్ఞానవానభూత్
పుణ్యోనామచయో జ్యేష్ఠో గుణజ్యేష్ఠస్యరాఘవ. 14

పిదప నోరాఘవా! కాలక్రమమున నాయిర్వురుపుత్రులలో వయో గుణంబులందును జ్యేష్ఠుఁడైన పుణ్యుఁడను నాతడు బ్రహ్మజ్ఞానియయ్యె.

పావనోర్ధప్రబుద్ధోభూత్పూర్వసంధ్యాస్వబ్జం యథా
మౌర్ఖ్యాదధిగతో నాప్తః పదేదోలాయితఃస్థితః. 15

పూర్వసంధ్యాసమయమందలి కమలమువలె పావనుడర్ధజ్ఞానియయ్యెను. తనయజ్ఞత్వముచే నాతడు పూర్ణబ్రహ్మపదము ప్రాప్తినొందజాలక మధ్యమార్గముననే వ్రేలాడుచుండెను.



తతోవహత్యకలితే కాలేకలితకారణే
సంవత్సరశతేజీర్ణ దీర్ఘ దేహలతాయుషి. 16

అస్మాద్భంగురభూతాద్ధ్యాద్వృత్తాన్తశతభీషణాత్
రతిముత్సృజ్యసంసారాజ్జరాజర్జరజీవితః. 17

కలనాపక్షిణీనీడం దేహందీర్ఘతపాముని:
జహశాగిరిగుహాగేహే భారంవై వధికోయథా. 18

పిదప, ప్రాణుల ఆయుఃక్షయమొనర్చునదియు, అదృశ్యమును దీర్ఘదేహమనులతను విశీర్ణముగావించునదియునగు శతవర్ష కాలము గడువ నశ్వరజీవులచే బరిపూర్ణమును, జన్మజరామరణాది వివిధవృత్తాంతములచే భయంకరమునునగు యీ సంసారముయొడ ప్రీతిఁద్యజించి వార్ధక్యముచే జర్జితమైన జీవితముగల నా ముని (దీర్ఘతపుడు) కల్పనారూపవిహంగమునకు నిలయమగు తన దేహమును భారమును త్యజించు వైవధికునివలె త్యజించివైచెను.

ప్రశాన్తకలనారంభం చేత్యరిక్తచిదాస్పదమ్
పదంజగామనీరాగం పుష్పగంధఇవాంబరమ్. 19

అంత పుష్పగంధమాకాశమును జొచ్చువిధమున కల్పనారహితమును, విషయ వర్జితమును, చేతనస్వరూపమును, రాగద్వేషవిరహితమునగు బ్రహ్మపదము నాతడు ప్రవేశించెను.

అథభార్యామునేర్దేహం ప్రాణాపానవివర్జితమ్
దృష్ట్వావిలులితంభూమౌ వినాలమివపంకజమ్. 20

చిరమభ్యస్తయాయోగయుక్త్యా పతివితీర్ణయా
తత్యాజ తనుమమ్లానాం షడ్పదీపద్మినీమివ. 21

అటుపిమ్మట ప్రాణాపానరహితమై నాళములేని కమలమువోలె భూమిపై బడియున్న తన భర్తదేహముఁగాంచి యాతనిపత్ని చిరకాలాభ్యస్త పత్యుపదిష్ట యోగయుక్తితోఁగూడి మలిన పద్మసరంబును భ్రమరమువీడునట్లు తన శరీరమును పరిత్యజించెను.

భర్తారమేవానుయయౌ జనస్యాదృష్టతాంగతా
ప్రభాగగనకోశస్థ మస్తంయాతమివోడుపమ్. 22

ఆట్లామె బ్రహ్మభావమునొందిన తనభర్త ననుగమించి, చంద్రుడస్తమింప నాతనికాంతి యాకాశమున గోచరింపనివిధమున, మానవదృష్టి కగోచరమయ్యెను.

మాతాపిత్రోస్తుగతయో రౌర్ధ్వదేహికకర్మణి
పుణ్యేవ్యవస్థితోఽవ్యగ్రః పావనోదుఃఖమాయయౌ. 23

అత్తతి పుణ్యుడు మృతులగు తన మాతాపితృలకు దహనక్రియాదుల నొనర్పసాగెను. కాని పావనుడు మాత్రము దుఃఖాక్రాంతుడై యుండెను.

శోకోపహతచిత్తోఽసౌ భ్రమన్కాననవీథిషు
జ్యాయాంసమనవేక్ష్యైవ పావనోవిలలాపహ. 24

దుఃఖముచే నశించినచిత్తముగల పావనుఁడంత నయ్యరణ్యమార్గములందు జరించుచు జ్యేష్ఠుఁడగు పుణ్యునివలె ధైర్యమువవలంబింపక విలపింపనొడగెను.

అథోర్ధ్వదేహికంకృత్వా మాతాపిత్రో రుదారధీః
ఆయయావిపినేపుణ్యః పావనంశోకలాలసమ్. 25

ఆపిమ్మట దహనక్రియాదుల సమాప్తిగావించి యుదారచరితుఁడగు పుణ్యుఁ డయ్యరణ్యమున శోకమగ్నుఁడైయున్న పావనునిచెంత కరిగెను.

పుణ్య ఉవాచ :—

కింపుత్రఘనతాంశోకం నయస్యాంధ్యైక కారణమ్
బాష్పధారాధరంఘోరం ప్రావృట్కాలఇవాంబుజమ్. 26

పుణ్యుడు:— సోదరా! జలబిందువులధరించు వర్షాకాలకమలము బోలిన నేత్రములుగల్గి అజ్ఞానకారణమున యేల యిట్లు మిగుల పరితాపము నొందుచుంటివి ?

పితాతవమహాప్రాజ్ఞ గతఃసార్ధంత్వదంబయా
స్వామేవపరమాత్మాత్మపదవీం మోక్షనామికామ్. 27

తత్థాననంసర్వజన్తూనాం తద్రూపంవిదితాత్మనామ్
స్వభావమభిసంపన్నే కింపితర్యనుశోచసి. 28

మహాప్రాజ్ఞుఁడవగునో సోదరా ! నీ జనకుఁడు జననీసహితుడై బ్రహ్మపదము నొందెను. ఆ బ్రహ్మమే సర్వజీవులకును నిలయము. అదియే బ్రహ్మవేత్తల స్వరూపము. స్వస్వరూపము నొందిన జనకునికై యేల వ్యర్థముగ పరితపించుచుంటివి?

ఈదృశీతుత్వయాబద్ధా భావనేహవిమోహజా
సంసారేయదశోచ్యోఽపి త్వయాతాతోనుశోచ్యతే. 29

'ఈతడు నాతండ్రి, ఈమె నాతల్లి' యను నీభావన అజ్ఞత్వకారణముననే నుదయించినదగును. కాన నీప్రపంచమున శోకింపదగనిదానినిగూర్చి నీవేల శోకించుచుంటివి ?

నస్తైవభవతోమాతా నాసావేవపితాతవ
నభవానేషతనయ స్తయోర్నిఃసంఖ్యపుత్రయోః. 30

నీతల్లిదండ్రులు వీరేగాదు; మఱియు నసంఖ్యాకములగు పుత్రులుగల యీ మాతాపితృలకు నీవొక్కఁడవే పుత్రుడవున్నగావు.

మాతాపితృసహస్రాణి సమతీతాని తేసుత
బహూన్యంబుప్రవాహస్య నిమ్నానీవ వనేవనే. 31

సోదరా ! వనస్థ జలప్రవాహమందలి నిమ్నప్రదేశములవలె నీకింతదనుక యెందఱో తల్లిదండ్రులు గతించిరి.

అసంఖ్యపుత్రయోర్నైవ భవానేవసుత స్తయోః
సరిత్తరంగవత్పుత్ర గతాఃపుత్రగణానృణామ్. 32



మఱియు నీమాతాపితృలకు నీవొకడవే పుత్రుడవుగావు. ఏలన నదీతరంగములవలె మనుజులకెందఱో పుత్రులిప్పటికి గతించియున్నారు.

అస్మత్పిత్రోరతీతాని పుత్రలక్షాణ్యనేకశః
పత్రకోరకవృన్తాని లతావిటపయోరివ. 33

వృక్షలతలందు పత్రపుష్పాదులవలె మన తల్లిదండ్రుల కింతవఱకెందఱో లక్షలకొలఁది పుత్రులు జనించియుండిరి.

మిత్రబాంధవవృన్దాని జన్తోర్జన్మనిజన్మని
ఋతావృతావతీతాని ఫలానీవమహాతరోః. 34

గొప్పవృక్షమునకు ఋతు ఋతువునందును ఫలములు గల్గునట్లు ప్రతిజన్మమునను జీవునకెందఱో బంధుమిత్రాదులు గలుగుచున్నారు.

శోచనీయాయదిస్నేహాన్మాతాపితృసుతాఃసుత
తదతీతానశోచ్యన్తే కిమజస్రంసహస్రశః. 35

సోదరా ! ప్రేమవశమున మాతాపితృపిత్రాదులు శోకింపదగుదురనిన, యింతదనుక యెన్నియోమారులు గతించిన వేలకొలఁది మాతాపితృలకై యేల శోకమునొందుటలేదు?

ప్రపంచచోఽయంమహాభాగ దృశ్యతేజాగతేభ్రమే
పరమార్థేనతేప్రాజ్ఞ నాస్తిమిత్రంనబాన్ధవాః. 36

మహాభాగుఁడవగునో సోదరా! జగత్కల్పనకు హేతువగు అజ్ఞానముచేతనే యీ జగత్తంతయును దృశ్యమానమగుచున్నది. యథార్థముగ నీకు మిత్రులుగాని బంధువులుగాని లేరు.

ననాశఇవహిభ్రాతః పరమార్థేనవిద్యతే
మహత్యపిచిరాతప్తే మరావివపయోలవాః. 37

సోదరా! చిరకాలము మిగుల సంతప్తమైన మరుభూమియందు లేశమైన జలముండనట్లు పరమార్థదృష్టియందాత్మయందు (బ్రహ్మస్వభావమున) నాశమెద్దియు లేదు.

ఏతాయాఃప్రేక్షసేలక్ష్మీ శ్ఛత్రచామరచంచలాః
స్వప్నఏవమహాబుద్ధే దినానిత్రీణిపంచవా. 38

ఓ మహామతీ! ఛత్రచామరాది సహితమగు యే చంచల రాజ్యాదివిభవములను నీవు గాంచుచుంటివో, అవన్నియును మూఁడునాలుగు దినములు (అల్పకాలము) మాత్రమే యుండునవగును.

దృష్ట్యాతుపారమార్థిక్యా పుత్రసత్యంవిచారయ
నైవత్వంనవయంచైవ భ్రాన్తిమ స్తఃపరిత్యజ. 39

సోదరా ! పరమార్థదృష్టిచే నీవు సత్యమును విచారింపుము. యథార్థముగ నీవుగాని నేనుగాని లేనివారమే యగుదుము. 'నీవు నేను' ను యీభ్రమల నీ యంతఃకరణమునుండి పారద్రోలుము.

అయంగతోమృతశ్చాయమితి దుర్దృష్టయఃపురః
స్వసంకల్పోపతాపోత్థా దృశ్యన్తేనతుసత్యతః. 40

'ఇది నశించినది, ఇది మరణించినద'ను నీకుదృష్టులు స్వసంకల్పభ్రమచేతనే నుదితమై నీసమ్ముఖమున విజృంభించుచున్నవిగాని యథార్థముగనవి సత్యములుగానేరవు.

అజ్ఞానవిస్తీర్ణమరావిలోలం
శుభాశుభస్యన్దమయైస్తరంగైః
సవాసనానామమరీచివారి
పరిస్ఫురత్యేతదనన్తరూపమ్. 41

ఇత్యార్షే వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే పావనబోధనం నామైకోన
వింశః సర్గః ॥ 19 ॥

అజ్ఞానతాపముచే నాచ్ఛాదితమైన ఆత్మయను మరుభూమియందు శుభాశుభ కర్మలను తరంగములచే చంచలమైన స్వవాసనారూపమృగతృష్ణాజలమే యీ అనంత సంసారరూపమున స్ఫురించుచున్నది.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
పావనబోధనమను ఏకోనవింశ సర్గము. ॥ 19 ॥

---

వింశః సర్గః.

---

పుణ్య ఉవాచ:—

కఃపితాకించవామిత్రం కామాతా కేచబాన్ధవాః
స్వబుద్ధ్యైవానఘూయన్తే వాత్యయా జనపాంసవః. 1

పుణ్యుడు:— సోదరా! తండ్రియెవరు? తల్లియెవరు? మిత్రుడెవడు? బాంధవులెవరు? గొప్పహాయువుచే ధూళిలేచువిధమున వీరందఱును మనుజుని స్వబుద్ధి (భ్రాంతి) చేతనే కల్పింపబడినవారగుదురు.

బంధుమిత్రసుతస్నేహ ద్వేషమోహదశామయః
స్వసంజ్ఞామాత్రకేణైవ ప్రపంచోఽయంవితన్యతే. 2

బంధుమిత్రసుతాదిసహితమును రాగద్వేషమోహాదియుక్తమునగు యీ ప్రపంచమును ఆత్మ స్వసంజ్ఞామాత్రమున విస్తరింపజేయుచున్నది.

బంధుత్వేభావితో బంధుఃపరత్వేభావితఃపరః
విషామృతదశేవేహ స్థితిర్భావనిబన్ధనీ. 3

మనుజుడు బంధుత్వభావనచే బంధువు, శత్రుత్వభావనచే శత్రువునగుచున్నాడు. భావనామాత్రముచే విషమమృతముగాను, అమృతము విషముగాను నగునట్లు యీ సంసారస్థితియు కేవలము భావనాధీనమేయైయున్నది.



ఏకత్వేవిద్యమానస్య సర్వగస్యకిలాత్మనః
అయంబన్ధుఃపరశ్చాయమిత్యసౌకలనాకుతః. 4

సర్వదేహములందును యేకరూపమున వెలుగుచున్న సర్వవ్యాపియగు ఆత్మకు 'ఈతడు బంధువు, ఈతడు శత్రువ'ను కల్పనయే యెచట?

రక్తమాంసాస్థిసంఘాతాద్దేహాదేవాస్థిపంజరాత్
కోఽహంస్యామితిచిత్తేన స్వయంపుత్రవిచారయ. 5

రక్తమాంసాస్థిసంఘాతరూపమగు యీదేహమను అస్థిపంజరముకంటె నన్యమై చేతనస్వభావుడనైన నాయొక్క యథార్థ స్వరూపమేమి యని చిత్తమున విచారణచేయుము.

దృష్ట్యాతుపారమార్థిక్యా నకశ్చిత్త్వంనవాస్మ్యహమ్
మిథ్యాజ్ఞానమిదంపుణ్యః పావనశ్చేతివల్గతి. 6

పరమార్థదృష్టితో జూచిన పావనుడనబడు నీవును పుణ్యుడనబడు నేనును లేనివారమే యగుదుము. దేహాత్మాభిమానమను మిథ్యాజ్ఞానముచేతనే మన యీ రూపములు విజృంభించుచున్నవి.

కస్తేపితాకశ్చసుహృత్కామాతా కశ్చవాపరః
ఖస్యానన్తవిలాసస్య కిమస్వంకింస్వముచ్యతామ్. 7

దేహదృష్టిచే సర్వము నాశవంతమగుటచేబట్టి యిక నీ తండ్రియెవరు, తల్లియెవరు? మిత్రుడెవడు, శత్రువెవడు? మఱియు దేహాద్యుపాధులకు భిన్నమైన శుద్ధచైతన్యదృష్టియందు అనంతరూపుడగు చిదాత్మకు స్వపరకీయభేదములే యెచట?

అపిచేత్త్వంతదన్యేషు యాతేషుబహుజన్మసు
యేబన్ధవోయేవిభవాః కింతానపి నశోచసి. 8

'లింగశరీరమగు సూక్ష్మదేహమే నేను, కాన బాంధవాది వ్యవహారములు నాకుగలవ'నిన, గడచిన యనేకజన్మలందలి బంధుధనాదులకై యేల దుఃఖించుటలేదు?

బభూవుస్తేసుపుష్పాసు స్థలీషుమృగయోనిషు
బహవోబంధవో మార్గాస్తాన్కథం నానుశోచసి. 9
బభూవుస్తేసపద్మాసు తటిష్వంభోజినీషు తే
హంసస్యబంధవో హంసాస్తాన్కథం నానుశోచసి. 10
బభూవుస్తేఽలమన్యత్ర చిత్రాసువనరాజిషు
బహవోబంధవో వృక్షాస్తాన్కథంనానుశోచసి. 11
బభూవుస్తేమహోగ్రేషు శిఖరేషుమహీభృతామ్
బహవోభాన్ధవాః సింహాస్తాన్కథం నానుశోచసి. 12
బభూవుస్తేసరిత్స్వన్తీషు సరస్స్వమ్భోజనీషుచ
బహవోబన్ధవోమత్స్యాస్తాన్కథం నానుశోచసి. 13

సోదరా ! పుష్పసహిత వనభూములందు వసించు మృగజాతులందు నీ కనేక బంధువులు గలరు. వారలకై యేల పరితపించుటలేదు? కమలయుక్తములగు నదీతీరములందును, కమలవనములందును హంసలరూపమున నీకెందఱో బంధువులుగలరు. వారలకొఱకును యేల దుఃఖించుటలేదు? ఇంకను అన్యవిచిత్రవనప్రదేశములందు వృక్షరూపమున నీకెందఱో బంధువులుగలరు. మఱియు గొప్పగొప్ప పర్వతములయొక్క భయంకరమైన ఉన్నత శిఖరములపైగల యెన్నియో సింహములును, కమలయుక్తనదీభాగములందలి యెన్నియో మత్స్యములును నీకు బాంధవులైయుండెను. వారికొఱకును నీవేల పరితాపమునొందుట లేదు?

బభూవవిన్ధ్యదశార్ణేషు కపిలోవనవానరః
రాజపుత్రస్తుషారేషు పుండ్రేషువనవాయసః. 14

హైహయేషుచమాతంగస్త్రిగర్తేషుచగర్దభః
శాల్వేషుసరమాపుత్రః పతత్రీసరలద్రుమే. 15

విన్ధ్యాద్రావపిపిప్పలో భూత్వా ఘుణో భూత్వా మహావటే
మన్దరే కుక్కుటోభూత్వా విప్రోజాతోఽసికన్దరే. 16

సోదరా! నీవు పూర్వము దశార్ణదేశమందు కపిలవనమున మర్కటముగను, తుషారదేశమందు రాజపుత్రుడుగను, పుండ్రదేశమందు వనమందలి కాకిగను, హైహయదేశమున యేనుగుగను, త్రిగర్తదేశమున గార్దభముగను, శాల్వదేశమున శునకముగను, సరళవృక్షమునందు పక్షిగను, వింధ్యాద్రిపై అశ్వత్థవృక్షముగను, యున్నతమగుయొక వటవృక్షమున కీటముగను, మందరపర్వతముపై కోడిగను, జన్మించి, యిపుడీపర్వతకందరమున బ్రాహ్మణుడవై జనించితివి.

కోసలేషుద్విజోభూత్వా భూత్వావంగేషుతిత్తిరిః
అశ్వోభూత్వాతుషారేషు జాతస్త్వం బ్రిహ్మణోఽధ్వరే. 17

యఃకీటస్తాలకన్దాన్తర్మశకోయ ఉదుంబరే
యఃప్రాగ్బకోవిన్ధ్యవనే సత్వంపుత్రిమమానుజః. 18

హిమవత్కందరే భూర్జత్వగ్గ్రన్థికోటరే
పిపీలికోయఃషణ్మాసాన్సోఽయం త్వమనుజోమమ. 19

స్థితఃసీమాన్తకుగ్రామగోమయే యశ్చవృశ్చికః
సార్ధసంవత్సరంసాధో సోఽయం త్వమనుజోమమ. 20

పులిన్దీస్తనపీఠేషు నిలీనం యేనకాననే
షట్పదేనేవపద్మేషు సోఽయంత్వమనుజోమమ. 21

మఱియు కోసలదేశమున బ్రాహ్మణుడవుగను, వంగదేశమున తిత్తిరిపక్షిగను, తుషారదేశమున అశ్వముగను, తాళవృక్షమున కీటముగను, ఉదుంబర (మేడి) వృక్షమున దోమగను, వింధ్యాద్రిపై బకముగను నీవు జనించియుంటివి. హిమాలయపర్వతకందరముపై భూర్జపత్రకోటరమున యాఱుమాసముల పర్యంతము చీమవైయుంటివి. ఈ దేశ సీమాంతమందలి నొకకుగ్రామమున గోమయమున నొకటిన్నరసంవత్సరములు వృశ్చికమైయుంటివి. పులిందయువతులయందు భ్రమరముగ ...



చండాలకన్యయొక్క స్తనభాగమందు వసించియుంటివి (ఆమె పుత్రుడవైయుంటివి) అనీవే యిపుడీ బ్రాహ్మణగృహమున నాయనుజుడవై జన్మించితివి.

ఏతాస్వన్యాసుబహ్వీషు జనయోనిషుపుత్రక
జాతోఽసిజంబూద్వీపేఽస్మిన్పురా శతసహస్రశః. 22

సోదరా! ఇంకననేక జీవజాతులందును యీ జంబూద్వీపమునందే నీవనేకమారులు జన్మించియుంటివి.

ఇత్థంతవాత్మనశ్చైవ ప్రాక్తనంవాసనాక్రమమ్
పశ్యామిసూక్ష్మయాబుద్ధ్యా సమ్యగ్దర్శనశుద్ధయా. 23

ఇవ్విధమున మనయిర్వుర పూర్వకాలికవాసనాక్రమములను సమ్యక్దర్శనముచే విశుద్ధమైన సూక్ష్మబుద్ధిచే నేను గాంచుచున్నాను.

మమాపిబహ్వ్యోబహుధా యోనయోమోహమన్థరాః
సమతీతాఃస్మరామ్యద్య తాజ్ఞానోదితయాదృశా. 24

జడమగు అజ్ఞాన స్థితియందు పూర్వము నేగడపిన యనేక జన్మలనుగూడ జ్ఞానోదితమగు దివ్యదృష్టిచే నేనిపుడు సంస్మరించుచున్నాను

త్రిగర్తేషుశుకోభూత్వా భేకోభూత్వాసరిత్తటే
వనేషులావకోభూత్వా జాతోఽహమిహకాననే. 25

భుక్త్వాపులిన్దతాంవిన్ధ్యే కృత్వావంగేషువృక్షతామ్
ఉష్ట్రీత్వమపివిన్ధ్యాద్రౌ జాతోఽహమిహకాననే. 26

యశ్చాతకో హిమగిరౌ యోరాజాపౌండ్రమండలే
వ్యాఘ్రోయఃసహ్యకుంజేషు సఏవాహం తవాగ్రజః. 27

యోగృధ్రోదశవర్షాణి యోగ్రాహో మాసపంచకమ్
యఃసమానాంశతంసింహః సఏవాహ తవాగ్రజః. 28

ఆన్ధ్రీగ్రామచకోరేణ తుషారనృపరాజినా
శ్రీశైలాచార్యపుత్రేణ వంధనత్కథ్యతేమయా. 29

సర్వేవివిధసంసారా వివిధాచారచేష్టితాః
విలాసాజన్మనోభ్రాన్తేః స్మర్యన్తేప్రాక్తనామయా. 30

త్రిగర్తదేశమున శుకనదీతీరమున కప్పగను, వనప్రదేశములందు పక్షిగనునైతిని. వింధ్యాద్రిపై భండాలుడుగను, వంగదేశమున వృక్షముగను, వింధ్యాచలముపై ఒంటెగను జన్మించితిని. మఱియు హిమాలయముపై చాతకపక్షిగను, పౌండ్రదేశమున రాజుగను, సహ్యపర్వత కుంజములందు వ్యాఘ్రముగను జన్మించియుంటిని. పదిసంవత్సరములు గృధ్రముగను, అయిదు మాసములు మొసలిగను, నూఱు వత్సరములు సింహముగనునుంటిని. మఱియు ఆంధ్రదేశమున చకోరమై వసించియుంటిని. హిమప్రదేశమందు మండలాధిపునివలె గోళిందు శ్రీశైలాచార్యుని పుత్రుడనై జనించియుంటినని నేనిపుడు గర్వముగ పలుకుచున్నాను. ఇట్లు వివిధసంసారయుక్తమును,

వివిధక్రియాచారసహితమునగు పూర్వకాలికజన్మ భ్రాంతివిలాసము నేనిపుడు సంస్మరించు చున్నాను.

ఏవంస్థితేజగజ్జాతా బాన్ధవాశ్శతశోగతాః
పితరోమాతరశ్చైవ భ్రాతరస్సుహృత స్తథా. 31

కాంస్తాన్సమనుశోచావో నశోచావశ్చకానపి
బన్ధూసిహాతిశోచావ ఈదృశ్యేవజగద్గతిః. 32

కాన నీ జగంబున యెందఱో బంధువులు, తల్లిదండ్రులు, సోదరులు, మిత్రులు మనకుండి యుండిరి. వారియం దెవరికై దుఃఖించెదము? యెవరికై దుఃఖింపకయుందుము? ఈ జగత్తుయొక్క స్థితియే అటువంటిదని యెఱుంగుము.

అనన్తాఃపితరోయాన్తి యాన్త్యనన్తాశ్చమాతరః
ఇహసంసారిణాంపుంసాం వనపాదపపర్ణవత్. 33

వనమందలి వృక్షపర్ణములవలె సంసారికమనుజులు కెందఱో అసంఖ్యాకములగు మాతాపితరులు సంభవించుచుందురు.

కింప్రమాణమతఃపుత్ర దుఃఖస్యాత్రసుఖస్యచ
తస్మాత్సర్వంపరిత్యజ్య తిష్ఠావఃస్వచ్ఛతాంగతౌ. 34

కాననో సోదరా! సుఖదుఃఖములకు మేరయెచట? అందుచే శోకమంతయు (శేష దృశ్యమంతయు) పరిత్యజించి నిర్మలత్వమునొంది యుండెదము.

ప్రపంచభావనాంత్యక్త్వా మనస్యహామితిస్థితామ్
తాంగతింగచ్ఛభద్రంతే యాంయాన్తిగతికోవిదాః. 35

సోదరా! మనంబున యహంభావరూపమున నున్న ప్రపంచభావనను విడనాడి, ఆత్మజ్ఞులేగు మార్గము నాశ్రయింపుము; నీకు శ్రేయమగుగాత!

ఇహాజవంజవీభావం పతనోత్పతనాత్మకమ్
నచశోచన్తిసుధియశ్చిరం వల్గన్తికేవలమ్. 36

ఈ ప్రపంచమున పతనము, ఉన్నతియను చక్రభ్రమణము నిరంతరము కొనసాగుచునే యున్నది.

భావాభావవినిర్ముక్తం జరామరణవర్జితమ్
సంస్మరాత్మానమవ్యగ్రో మా విమూఢమనాభవ. 37

సోదరా! భావాభావనిర్ముక్తమును, జరావర్జితమునగు ఆత్మను సావధానమనస్కుండవై విచారింపుము. మూఢచిత్తుండ వెన్నటికిగాకుము.

న తేదుఃఖంన తేజన్మ న తేమాతా న తేపితా
ఆత్మైవాసినసద్బుద్ధే త్వమన్యఃకశ్చిదేవహి. 38

ఓ సద్బుద్ధీ! యథార్థముగ నీకు తల్లిగాని తండ్రిగాని లేరు. దుఃఖముగాని జన్మగాని లేవు. మఱియు నీవు [illegible] ము (దేహా[illegible]యు) గా నేరవు.



అస్యాంసంసారయాత్రాయాం నానాభినయదాయినః
అజ్ఞాఏవనరాఃసాధు రసభావసమన్వితాః. 39

అజ్ఞానులీ సంసారయాత్రయందు పలువిధక్రియ లొనర్చుచు, పురుషార్థమందే సారబుద్ధిగల్గి వర్తింతురు.

మధ్యస్థదృష్టయఃస్వస్థా యథాప్రాప్తార్థదర్శినః
తజ్ఞాస్తుప్రేక్షకాఏవ సాక్షిధర్మేవ్యవస్థితాః. 40

కాని తత్త్వజ్ఞానులు, దాసీనులై, స్వస్థచిత్తముగల్గి, ప్రాప్తించు కార్యము నెఱవేర్చుచు, కేవలము సాక్షిమాత్రులైయుందురు.

కర్తారోఽపినకర్తారో యథాదీపానిశాగమే
ఆలోకకర్మణామేవం తజ్ఞాలోకస్థితావిహ. 41

రాత్రియాగమసమయమున స్వసన్నిధానమాత్రముచే ప్రకాశ-క్రియయొనర్చు దీపమువలె కర్తయు, అభిమానరహితుఁడగుటచే నకర్తయునై తత్త్వజ్ఞుఁడీ ప్రపంచమున విహరించును.

ప్రతిబింబేనదృశ్యన్తే స్వాత్మబింబగతైరపి
యథాదర్పణరత్నాద్యా స్తథా కార్యేమహాధియః. 42

దర్పణాదులు ప్రతిబింబముగల్గియున్నను, తత్ప్రతిబింబిత వస్తుధర్మముల నంటనట్లు తమ యందభ్యస్తములగు కార్యములం జేయుచున్నను తత్త్వజ్ఞులాత్మరూపమున వాటియందు ప్రవిష్టులు గాకయే యుందురు.

నరైష్వణామయకలంకవివర్జితేన
స్వస్థాత్మభావకలితేన హృదబ్జమధ్యే
పుత్రాత్మనాత్మని మహామునినాముసైన
సంత్యజ్యసంభ్రమమలం పరితోషమేహి. 43

ఇత్యార్షే వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే పావనబోధోనామ
వింశః సర్గః ॥ 20॥

సోదరా! ఇచ్ఛారూప కళంకవర్జితుఁడవై మననశీలుఁడవై, స్వయముగ సాక్షాత్కరింపబడిన హృదంబుకమల స్థితయాత్మభావముచే సంసారభ్రమయంతయు పూర్ణముగ త్యజించినైచి శోభించుదాని (యాత్మ)చే సంతుష్టిఁజెందుము.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
పావనబోధమను వింశ సర్గము ॥ 20 ॥

---

